


దేశి సారస్వతము : ౧

# స్త్రీల రామాయణపు పాటలు

"కృష్ణశ్రీ" → శ్రీపాద గోపాల కృష్ణమూర్తి

సంపాదితము శ్రీకాకుళం జిల్లా
[illegible]
1901 డిసెంబరు 18న పుట్టినారు
1977 ఏప్రిల్ 2న కన్నుమూశారు
Ref [illegible]
పత్రిక [illegible] for you 1-3-2002

ఆంధ్ర సారస్వత పరిషత్తు
హైదరాబాదు

౧౦ రూ.

# విషయసూచి


| | | | |
|---|---|---|---|
| సంక్షేప రామాయణము | ... ౧ | కోవెల శృంగారము | ... ౧౨౨ |
| శాంత గోవిందనామములు | ... ౧౯ | సీతాదేవి ఆనళ్లు | ... ౧౨౪ |
| కౌసల్య వేవిళ్లు | ... ౫౨ | సీత చెఱ | ... ౧౩౧ |
| లాలిపాట | ... ౫౩ | సీత ముద్రికలు | ... ౧౩౪ |
| శ్రీరామ జననము | ... ౫౫ | లంకాయాగము | ... ౧౪౨ |
| రాములవారి తొట్టె | ... ౫౯ | సీత అగ్నిప్రవేశము | ... ౧౬౭ |
| శ్రీరామ దండములు | ... ౬౧ | సేతు మాహాత్మ్యము | ... ౧౭౬ |
| సీతాకళ్యాణము | ... ౬౪ | గుహభరతుల అగ్రవేశము | ... ౧౮౭ |
| రాఘవ కళ్యాణము | ... ౭౦ | శ్రీరామ పట్టాభిషేకము | ... ౨౦౦ |
| శ్రీరాములవారి అలక | ... ౭౮ | సీత సురటి | ... ౨౧౧ |
| సీత అప్పగింతలు | ... ౮౧ | లక్ష్మణదేవర నవ్వు | ... ౨౨౫ |
| సీత అప్పగింతల పాట | ... ౮౫ | ఊర్మిళాదేవి నిద్ర | ... ౨౪౨ |
| సీతను అత్తవారింటికి పంపుట | ... ౮౯ | సీతశుభగోష్ఠి | ... ౨౪౯ |
| సీత సమర్త | ... ౯౨ | శ్రీరామ మానసపూజ | ... ౨౫౩ |
| సీత వసంతము | ... ౯౯ | సీతాదేవి వేవిళ్లు | ... ౨౫౪ |
| సీతమ్మవారి అలక | ... ౧౦౨ | సీతమ్మ వేవిళ్లు | ... ౨౫౭ |
| సీత గడియ | ... ౧౦౫ | సీత మేలుకొలుపు | ... ౨౫౮ |
| సీతాదేవి వామన గుంటలు | ... ౧౦౭ | కుశలవ కుచ్చల కథ | ... ౨౫౯ |
| సీతదాగుడుమూతలు | ... ౧౦౯ | కుశలవుల తొట్టె | ... ౨౯౩ |
| పూదరగుప్పిలు | ... ౧౧౦ | కుశలవుల యుద్ధము | ... ౨౯౪ |
| ఋషుల ఆశ్రమము | ... ౧౧౨ | లంకా సారథి | ... ౩౬౧ |

# విజ్ఞప్తి

ఆంధ్రసంస్కృతి ప్రచారము పరమలక్ష్యముగా ఆంధ్రసారస్వత పరిషత్తు రూపొందించుకొన్న కార్యప్రణాళికలలో ఉత్తమగ్రంథ ప్రచురణముగూడ ముఖ్యమైనది. ఇంతవరకు పరిషత్తు బాలసారస్వతము ప్రజాసారస్వతము పండితసారస్వతములను ప్రకటించినది. దేశిసారస్వతమునుగూడ సాధ్యమైనంతవరకు సేకరించి కొన్నిసంపుటములుగా ప్రకటించుటకు నిశ్చయించినది. తత్ఫలితముగా ఈ "స్త్రీల రామాయణపు పాటలు" అను ప్రథమసంపుటము వెలువడినది. ఇట్లే త్వరలో "పల్లెపదాలు" "వీరగాథలు" అనుసంపుటములనుగూడ ప్రకటించెదమని తెలుపుటకు సంతోషించుచున్నాము.

మా ఉద్యమమును ప్రోత్సహించి, విశేష శ్రమకోర్చి ఈ సంపుటమును సిద్ధముచేసి విలువగలపీఠికను వ్రాసియిచ్చిన శ్రీ కృష్ణశ్రీ గారికిని తమ గ్రంథాలయములోని "లంకాసారథి" అను పాటను ప్రకటించుటకు దయతో అనుమతించిన మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారాధిపతులకును మాకృతజ్ఞతలను తెలుపుకొనుచున్నాము.

ఇట్లు
**పులిజాల హనుమంతరావు.**
ప్రధాన కార్యదర్శి
ఆంధ్రసారస్వత పరిషత్తు

హైదరాబాదు
12-3-55

# ఉపోద్ఘాతము

ఆంధ్రోక్తి మయప్రపంచము రామరాజ భూషణుడు చూచి వర్ణించిన దానికంటె సువిశాలము. దానిలో స్త్రీలపాటలే ఒక ప్రత్యేక ప్రపంచము. ఈపాటల పుట్టుక శూరుల, సురల, ఏరుల, జన్మములవలెనే పరిశోధనకు ఎఱుగరానిది. నన్నయ పూర్వపు శాసనములలో గోచరించే తరువోజది గృహిణుల పనిపాటలలో నర్తించే రోకటిపాటకు చాళుక్యపండితులు తీర్చినరూపమని ఊహించవచ్చును. నన్నెచోడుని కాలానికి ఊయలపాటలూ, లంకమాలికలూ మాత్రమేకాని సుదీర్ఘములైన కథాగేయములున్నట్టు సాక్ష్యము లేకపోయినా, పాల్కురికి సోమనాథుని కాలానికి (క్రీ. శ. 1300 ప్రాంతము) ఊరూరపాటలుగా గట్టి పాడెడు 'సిరియాళు చరిత' ఉండినది. ఆతడు రచించిన బసవపురాణమూ, పండితారాధ్యుల చరిత్రాలలో, రాగతాళముల సాహచర్యములో అంతవరకూ పాటగా వర్ధిల్లిన తరువోజ, నాలుగు కిటతకిట ఆవృతాల పాదాలతో నడకనేర్చి శైవగాథలను వినిపించనేర్చినది. క్రీడాభిరామ కర్త చెప్పిన 'వీరానీకముంబాడు ద్విపదప్రబంధములు' ఒకవైపున్నూ, ద్విపదవలె గణనీయముకాక నాలుగు కిటతకిట ఆవృతాల కాలపరిమితి గలిగిన పాదాలతో ఈ రోకటిపాటల వరుస కథలు మరియొకవైపున్నూ పథ్నాలుగో శతాబ్దములోనే వెలసియుండినవి.

అనుశ్రుత రామాయణగాథలను వర్ణించిన రంగనాథ రామాయణమును ఆనాటి నుంచి స్త్రీలు వల్లించి దానిని తమపాటగా చేసేసుకున్నారు. స్త్రీలకూ ద్విజేతరవర్ణముల వారికీ ప్రత్యేకము పూజచేసుకునే అధికారము కల్పించిన వీరశైవముతో, (నన్నయ నాటికేవుండిన) నోముల కథలు స్త్రీలపాటలైనవి. వీటిననుసరించి రామాయణ, భారత భాగవతాది కథలుకూడ స్త్రీలపాటలుగా అవతరించియుండును. (లేకుండిన అన్నమయ్యభార్య తిమ్మక్క తన రచనను సాగించుటకని సుభద్రా కల్యాణమువరకూ పోనేల?) అట్లయ్యును, వస్తురూపమున మనకు నేటి కుపలభ్యమైన మొదటి స్త్రీల పాట తిమ్మక్క సుభద్రాకల్యాణమే. (క్రీ. శ. 1470 ప్రాంతము) స్త్రీలు వల్లించుకుని నేటికీ పాడుకుంటున్న యక్షగానములుకూడ సుమారీకాలానికే విరివిగా ప్రచారము లోనికి వచ్చినవి. కనుక స్త్రీల సారస్వతము 15వ శతాబ్దమందు ఉద్ధృతముగా ఒయలు వేరిన దనవచ్చును.

ఈపాటల కాలమును నిర్ణయించుటకు అభ్యంతర సాక్ష్యమంతగా కనపడదు. త్యాగరాజు ప్రతాపవరాళి కీర్తనలో "సీతారమణిలో ఓమనగుంటలాడి గెలుచుట

చేత నొకరికొకరు... నిజమగుప్రేమలో బిల్చుకొన్న ముచ్చట వాతాత్మజ భరతులు విన్నటుల 'వినవా నగొని యున్నానురా' అన్నాడు. ఇది సీతాదేవి వామన గుంటలాట ప్రశంసయే. అయితే తంజావూరి సరస్వతీ మహలులోగాని దక్షిణా త్యాంధ్రుల వ్యవహారములోగాని కథలపాటలు లేకపోవుటవల్ల ఈ 'వామనగుంటల పాట' తెలుగులు దక్షిణాదికి తరలిపోయిన పదహారవ శతాబ్దాంతము నాటికే రచింపబడి వారిలో దక్షిణాదికి వెళ్లినదేమో ననిపిస్తున్నది. ఇదేనిజమైతే రామాయణపాటలు కొన్ని పదహారవ శతాబ్దమునాటివి కావచ్చును.

ఈపాటల రచయితలెవరో తెలియరావడములేదు. మొదటగాని, చివ్వరగాని మకుటమున్న నేగదా రచయితల పేరుపెంపులు తెలియుట? మకుటములు ఎట్లో జారిపోయిన వనడమునకంటె అసలులోనే లోపించినవనుట యుక్తముగా కనబడు తున్నది. రచయితల పేరులున్న మూడునాలుగు పాటలైనా కాపీరైటు చట్టపు నీడలోలేవు. మరి రచయితలపేరులు కావలెనని ప్రచురణకర్తలు వదలివేయుటకు కారణమేమై యుండగలదు? రచించినవారు స్త్రీలై తమ పేరుపెంపులను ప్రకటించు కొనుట ఆభిజాత్యమునకు భంగకరమని మానినారనుట ఊహామాత్రమే కాదేమో. అన్నమయ్యగారి భార్య తిమ్మక్క తనపేరు చెప్పుకున్నదంటే ఆమహామహుని నీడలోనిదాననని వినయగర్వమునే ప్రకటించుకొన్న దనవలెను. ఈ పాటలలోని అయిదక్షరాల ఆవృతాలూ, భావము పూర్తిచేయుటకని అడపాదడపా ప్రవేశించిన పైకాలముగతులూ, గతిని నిలుపుటకు స్వేచ్ఛగా చొరబడిన దీర్ఘాక్షరాలూ, మాటల సాగదీతలూ; రసానుకూలతనే తప్ప వ్యాకరణానుకూలతను లెక్కపెట్టని వ్యావహారిక ప్రయోగాలూ; పాటలోనంతటా వెన్నెలవలె గోచరించే గృహసీమా, స్త్రీల వస్త్రాద్యలంకారములూ, ఆటలూ, సరససంభాషణలూ, సంవాదాలూ; వీటిని స్త్రీలు పాడుకుంటే సర్వశుభాలూ చేకూరునని చెప్పే ఫలశ్రుతులూ; విశేషించి ఔచిత్యాన్నికూడా దాటుకుపోయే స్త్రీ పక్షపాతము గమనించినప్పుడు ఇవి చాలా మట్టుకు స్త్రీలే రచించినారేమో అనిపిస్తుంది. ఈ పాటలకథలు జనశ్రుతినే తప్ప పుస్తకప్రసిద్ధిని లెక్కపెట్టవు; గుండెరుగల అభిమానాన్నేగాని మనస్సులోపుట్టే ఊహల్ని పైకి ఎక్కనివ్వవు; సీతమ్మ పాతివ్రత్యాన్నేగాని శ్రీరాముని ధీరోదాత్త తను కీర్తించవు; ఇక వీటిని స్త్రీలే రచించి యుందురనుటకు అనుమానమెందుకు? లంకాయాగమూ లంకాసారథీ అన్నవి స్త్రీలుమాత్రమేకాక నేడు జానపదులుకూడా పాడుకొని ఆనందిస్తున్నారు. ఈరెండూ పురుషుడే రచించి యుండునను కుంటున్నాను. కుశలవకుచ్చలకథ, కుశలవుల యుద్ధమూ దీర్ఘములే అయినా చిన్నచిన్న పాదాలవే. వీటిలోని జానకీ పక్షపాతమునుబట్టి ఇవి స్త్రీలే రచించినారని ఊహి స్తున్నాను. మిగిలినవాటిని రచించినవారు పురుషులు కారేమో ననడానికి అనుమానములేదు, స్త్రీలుకారని చెప్పలేము... సేతుమాహాత్మ్యమూ, గుహభరతుల

అగ్నిప్రవేశమూ, శ్రీరామ పట్టాభిషేకమూ, సీతసురటీ, లక్ష్మణదేవర నవ్వూ; అన్నవి ముందుపాటలోని వాక్యాన్నిపట్టి వెనకటిది ప్రారంభించినట్టివి. ఒకే చేతిమీద నడచినవేనా కావచ్చును. వీటిలో రెండవవాటిలో మొదటి రెండింటికీ ఫలశ్రుతిలేదు. లక్ష్మణదేవర నవ్వుకి కలదు. ఒకదండలోనివే కనక నేనేమో ఈ చేరిక వీటి భాషకుకూడా పోలికకలదు.

ఈ సంపుటములోనివి రామాయణపు పాటలు. ఇవి వాల్మీకమును కాక అనుశ్రుత రామాయణాన్నే అనుసరిస్తున్నవి. వీటిలో సీతమ్మపేరు సీతాంగన. ఆమె బాల్యప్రాయమునాడె ఆటలలో శివవిల్లును అటూఇటూ జరుపుతుంది. (సీ.క.) శ్రీరాముడా విల్లునుచూచి 'చివుకువిల్లూ దీనినీ ఏమానిపొగడెదరూ' అని అతిశయపుమాటలు పలికి 'చూచిరాలక్ష్మణా సుదతి జానకిదేవిని' అంటాడు. (రా.క.) వివాహానంతరము సీతారాములు పదకొండేళ్లు అయోధ్యలో గడుపుతారు (కు.కు.) సీతారాములు పర్ణశాలలో పాచికలాడుచుండగా మాయలేడి కనబడుతుంది. (సీ.ము) రావణుడు సీతను ఆమెకూర్చున్న గడ్డతో పెల్లగించి రథముమీద పెట్టుకుని తీసుకపోతాడు (సం.రా) రామాదులు ఎక్కివచ్చిన పుష్పకము వెనువెంట బ్రహ్మ హత్య రూపముపట్టి బయలుదేరుతుంది. (సే.మ) చెప్పిననాటికి సరిగా శ్రీరాముడు తిరిగిరాలేదని గుహుడూ భరతుడూ అగ్నిప్రవేశానికి సిద్ధమైతే హనుమంతుడు రామాదుల క్షేమముచెప్పి వారిని రక్షిస్తాడు. కొలువులో నిద్రాదేవి తన్నావే శింపగా లక్ష్మన్న కిలకిల నవ్వుతాడు. లక్ష్మణుడు తన్నునిద్రలేపగా ఊర్మిళ పరపురుషుడనుకుని నిందిస్తుంది. ఈవిచిత్రాలన్నీ – ఆనోటీనుంచి ఈనోటికి వచ్చే కథలలోనివి – స్త్రీలపాటలలోనేగాని భాస్కర రామాయణాదులలో కనపడవు. స్త్రీలపాటలలోని ప్రత్యేకత సీతమ్మ చంచలచైతన్యము. ఈపాటలలోని సీత వర్షామేఘముమీద విద్యున్మాల, శరదాకాశపు శుభ్రచంద్రిక, కైలాసశృంగోద్భవ స్వచ్ఛహిమానీనదము. ఈమె నైసర్గిక శోభముందు పండితుల సీత సువర్ణ వికారమగు సీతా ప్రతిమమాత్రమే.

భాషాసముద్రులైన పండితుల రచనలలో నిరక్షరులైన, కవయిత్రుల రచనలను పోల్చుట కొందరి కక్కజము కలిగింపవచ్చును. పండితుల సాహిత్యములో అంతర్వాహినియగు రసధుని స్త్రీలపాటలలో పూర్ణసరస్సరస్వతిగ్గు తూగుచున్నచో ఇక నట్టివారేమగుదురో కాని ఏమిచేయగలము? నిజమారీతిగనే ఉన్నది. దశరథ మహారాజు శాంతాదేవిని యేమేమికావలెనో కోరుమంటే 'నలుగురు తమ్ములకు సరిపోలునట్టుగా పసిడిబొమ్మలు నాలుగుచేయించి యిమ్మన్నదట ... సీతమ్మ రామునిపైన అలిగి ముసుగుతన్ని పడుకుంటే చిలుక 'రఘురాము వంట్లోను లఘువు తప్పింది' అని ఆమె చెవిదగ్గర ఊదినదట, వెంటనే సీతమ్మలేచి తొందరగా

శ్రీరాముని పడకటింటికి వెళ్లి ఆయన ముసుగుతీసి చూచినప్పుడు పక్కుమని నవ్వి నాడట ప్రభువు...భోజనానంతరము తాంబూలాలు వేసుకుంటూ శాంతమ్మ 'చేడె వినవే జానకీచెలియ ఊర్మిళబుద్ధులన్ని, పైడిపానుపుల సోలియుండె నొక పదునాలు గేండ్లు పడతి, కుందనపు ప్రతిమకళలు యెందుండి దాగున్నవో' అన్నది. సరే, బాగున్నది. అందరు నవ్వినారు. ఆడుపడచు మఱదలి నంతటిలో విడిచిపెట్టునా? 'దృష్టితగులాకుండునూ నీలాలనివ్వాళ్ళు లివ్వరమ్మ' అన్నది. మాటకారి సీతమ్మ జవాబుచెప్పింది. 'ఇంద్రాది చంద్రులాను మించేటిచంద్రులూ మీతమ్ములూ, దృష్టితగులకుండ వారికే నివ్వాళ్ళు లి'మ్మన్నది. శాంతమ్మ మళ్ళీ విసిరింది. 'అక్కచెల్లెండ్రు మీరు మిక్కిలి సౌందర్యశాలురమ్మ, మాతమ్ముల నలుగురినీ వలపించు జాణలకు దృష్టితగులూ'అని ఇంకెవరికేనా దీనితో ఆటకట్టి పోతుంది. సీతమ్మ ఆట ఎవరుకట్టగలరూ? వినండివరహాల మొట్టికాయ! 'మాయన్న ఋష్య శృంగుని వనములోనుండి బాయకున్నా, యేమియెరుగని తపసినీ ఓవదిన కేళించి విడచినావూ' అన్నది సీతమ్మ. నాచనసోముని ఊర్వసీ నరకాసురుల సంభాషణ దీనిముందేమి కాగలదు? సీతమ్మ "తలఅంటు ఆడకే ఆడినట్లుండు, దిద్ద కేలిలకమ్ము దిద్దినట్లుండు"నట. నేరకేటేటి యనల్దెచ్చి నీరజాప్త్ర సానబట్టిన రాపాడిచల్లి మెదిపి పదనుసుధనిడి చేసినా ఈఅందము వస్తుందా?... రాముడు అన్ననాటికి రాలేదని భరతుడు అగ్నిప్రవేశము చెయ్యబోతుంటే కౌసల్య "అర్కకులు కన్నీరు అంచేత దుడిచే, అగ్రజునిజూపేను అగ్నిజొరకయ్యా, మీఅన్నతో కూడ మీవదిననేడూ, నాఅన్నచూపేను మరిఅగ్నిజొరకూ, నీవెళ్లిరిగితని తన్నడిగితయినా, కనున్నాను అదరేను స్తన్యమున పాలుచేపేను" అన్నది. శ్రీరాఘవేశ్వరుల నయనజలమూలు కైకాత్మజునిమేను కలయంగతడిపెనట. 'అల్లంతట వశిష్టరాగానుజూచి, తమ్ముడు తానును సాష్టాంగమెరిగి తమతండ్రి యేడ'ని అడిగినాడట కరుణాకరులు. అదుగడుక్కీ రసధ్వనిచిప్పిలే అమృతఫలము గుహాభరతుల అగ్నిప్రవేశము. స్త్రీల రామాయణపాటలు ప్రాతఃగుప్తి. సరసమేవాటి జీవమూ, బలహీనతహూడాను.

రసకవిత్వములో బలహీనతా! అవును. రసావేశముకొంఱకు ఔచిత్యాన్ని పాటించకపోతే కవిత్వానికి బలహీనతే దాపురిస్తుంది. స్త్రీలపాటల రచయితలు భావావేశము కోసమూ రసావేశము కొసమూ ఔచిత్యాన్ని త్యాగము చేస్తారు. తన్ను నిద్రలేపిన లక్ష్మణునితో ఊర్మిల అంటుంది, 'ఒకడాలికోరిగాదా ఇంద్రునికి ఒడలెల్ల హీనమాయె'అని బాగున్నది, తరువాత వినండి: 'పరసతిని కోరిగాదా రావణుడు మూలముతో హతమాయెను' ఇది నిద్రపోతున్న ఊర్మిళకెట్లు తెలిసినది? కుశలవులు శ్రీరామునితో అశ్వమేధ హయముకోసము యుద్ధానికి సిద్ధమైఉంటారు. "క్షత్రియవంశమున బుట్టగలేదా । అన్నవస్త్రాదులు చాలవనీకు । అర్కవంశము గాదానీది । అభిమానంబులు లేవానీకు । తమ్మునిచే జంపించడమేమి । సతిని నేరము

చాలచేసితే । పతితాచంపగ వలెనేగాని । మరుదులుజంపుట ధర్మంగలదా । మానాభిమానం లేవానీకు" । రచయితకు బాలుర శౌర్యముమీద అభిమానము ఎక్కువై పోయింది. వారిచే ఈమాట అనిపించవచ్చునూ, ఇది అనిపించకూడదూ అన్న ఆలోచనలోపించి, తానేబాలుర శరీరాలలో ప్రవేశించినట్లు కనబడుతోంది. ఇలాగే భరతుడు అగ్నిప్రవేశము చెయ్యనెంచినప్పుడు కౌసల్య తమ పుత్రోత్సవము సంగతి వివరిస్తూ 'పాపజాతికైక పదరుచూబెట్టె' (పాయసం) అంటుంది. అతనిముందే! పెండ్లి గోవిందనామాలలో శ్రీరామునిపెండ్లికి సుషేణుడు వస్తాడు. సుగ్రీవుడు లాజికట్నము పుచ్చుకుంటాడు. పెండ్లి ఊరేగింపులో లంకాపురులు కాలుస్తారు.

స్త్రీలపాటల రచయితలకు కాలభేదమన్నది లేదు. పద్మములో లభించిన సీతమ్మనుగురించి మండోదరి "ఆదివిష్ణునిసతి । అవుతారమెత్తింది । రామసతిపుట్టింది ।" అంటుంది. ఎప్పుడో మండోదరి ఎరుగవలసినసంగతి ఇప్పుడే పలికేస్తుంది. అద్దాల తొట్టెలోని రామచంద్రుణ్ణిచూచి అంగనామణులు "సత్యస్వరూపుడమ్మా । ఈబిడ్డ అచ్యుతానందుడమ్మా" అంటారు! సీతమ్మతో చెలికత్తెలు 'శ్రీవిష్ణుదేవులూ అవతారమై జన్మించినారు భువిని, ఆదిలక్ష్మిబోలేటి (!) సీతనీవర్ధాంగి వాదువమ్మా' అంటారు. రాములవారికి జోలపాడుతూ, 'బాలుడై వెలసెను బాలకృష్ణమ్మ' అంటారు ముత్తైదులు. !

కాలభేదము మాత్రమేకాదు, ఈ రచయితలకు వ్యక్తుల తారతమ్యభేదమూ లేదు. శ్రీరాముడూ సీతాఎప్పుడూ ఏదోపందెమువేసి ఆడతారు. శ్రీరాముడే ఎప్పుడూ ఓడిపోతాడు. లేదా వామనగుంటల పాటలోలాగ గెలుపువచ్చి రావడముతో ఆటవిత్తిపెట్టి వెళ్ళిపోతాడు. ఇంకొకమారు గరడిసాధనముచేసి అలసొచ్చి చెమ్మటలు తుడవమంటాడు. సీతమ్మ (ఏకారణమువల్లనైతేనేమి) తనమాటలను పాటించలేదని ఎఱ్ఱనికనుల కోపముహెచ్చి చేతి పువ్వులబంతితో కొడతాడు. ఆమెకు కోపంవచ్చి ఒంటిస్తంభము మీది మేడలో తలుపులు బిడాయించుకొని పడుక్కుంటుంది. ఆమెపెంచిన చిలుక సముదాయించబోతే 'తలబగలకొట్టేను తన్ని చంపేను' అనిబెదిరిస్తుంది సీతమ్మ. చిలుక రాముడి దగ్గరకి వెళ్లి ఆయనగారూ మొగమెత్తకపోతే, 'భూదేవి యల్లుడవు బుద్ధియిదియగునా ?' అని అడుగుతుంది! శ్రీరాముడూ, సీతమ్మ, దశరథుడూ, శాంత, శత్రుఘ్నుడూ, శ్రుతకీర్తి అందరూ మీవంటి, నావంటి, వ్యక్తులే ఈ రచయితల దృష్టిలో. జపమండపములో జగదేక రాముడు జపముచేస్తాడు...సీతమ్మ అందరు కోడండ్రవలెనే "ఇట్టి రాళ్లలోను యీ శిలలలోను । యిట్లునడవగబంపె మీయమ్మకైక । తానునడచిన దేశియుగాని కష్టములు । పిల్లలతల్లికి ప్రేమయిట్లుంట । నేలోకమునలేదు యీలోకమందె" । అని ఝాడిస్తుంది. మీయింటా, మాయింటా, అందరియింటా జరిగే సుందరఘటనలే

శ్రీరాముడికీ సీతకీ జరుగుతాయి. తెలుగునాటి గృహసీమలలోనే సీతారాములు లీలావిహారము చేస్తారు. ఇది లాఘవరచన కాదా అంటే, పండితకవులు పౌరాణిక వ్యక్తులను అలంకార స్వప్నసీమలలోనికి విసిరి సాధించినది ఏమంత గౌరవ రచనా? అన్న ప్రశ్న పుట్టుతుంది.

స్త్రీలపాటలన్నీ 'సద్యఃపర నిర్వృతయే, శివేతరక్షతయే' అన్న రెండాదర్శములతో రచించబడ్డాయి. ఏకథాకూడా అవసరమైన కంటె పొడవుగా సాగదు. వర్ణనలు చేస్తూ పెంచుకుపోవడము వీటిలో సాధారణముగా కనపడదు. కథచెప్పడమువల్లనే వినేవారి అపేక్షని పట్టివుంచుతారుగాని, ఈరచయితలు తమనేర్పుచూపుతూ మనదృష్టినిలుపుటకు యత్నించరు. పండితులరచనలో కథాసౌందర్యము అవసరమే లేదు! ఇక ఫలశృతిఅన్నది యెట్లుండగలదు? కవిగారు పెద్దనగారివలె యే కాదంబరినుంచో కాటుకొట్టిన భావాల్ని వేషమువేసి ప్రదర్శిస్తూంటే చూచినందుకూ శ్రీనాథునివలె గంధదంతావళ గ్రైవేయఘంటికా ఠంకారసన్నిభంగా సీసపద్యాలు రచిస్తూంటే తాళమువేసినందుకూ, రామరాజ భూషణుడిలాగు అడుగడుక్కీ రెండర్థాల చమత్కారము వెలగబెట్టుతూంటే అచ్చెరువుపొందినందుకూ ఫలశృతి ఉండగలదా? గోవిందారామలుపాడి 'యిక్ష్వాకునికథలు స్మరియించి' నందుకూ; లాలిపాటలలో కల్యాణాలలో, అలకపాటలలో, అప్పగింతలలో సమర్తపాటలలో, వసంతాలలో, అలకలలో, ఆటలలో, సీతారాముల వినోదాలను పరిశీలించుకున్నందుకూ; రామాయణ కథలను విన్నందుకూ ఫలితము సామాన్యమే యెట్లుకాగలదు? సేతుమాహాత్మ్యకర్త చెప్పినట్లు 'పాపంబులూబోను, పదవియునుగలుగు'ను, పాడినవారికి బ్రహ్మలోకమూ విన్నవారికి విష్ణులోకమూ రాఘవుడేయిచ్చును... ఈపాటలన్నిటినీ ఆయా ఉత్సవాలసమయాలలో పాడుకోవడముకూడాకద్దు. పెండ్లిపాటలన్నీ సీతారాముల, శివపార్వతుల, పెండ్లిలోని వినోదకలాపాల్నే వర్ణిస్తాయి. మనకండ్ల యెదుట జరిగిన పెండ్లి ఆ పుణ్యదంపతుల పెండ్లివలె లోకానందకరముగా ఉండవలెనన్న అశీస్సునకు గానరూపములే ఆపాటలు, వాటికంటెపెద్దవైన ఈపాటలను కూడా గృహకలాపాలలో పాడుకోడము ఉన్నది. ఏవినోదోత్సవానికేనా చివ్వర వినబడే పాటలు సామాన్యముగా ఇవేఅవుతాయి. కనుక అలాటి ప్రయోజనానికి కూడా ఈపాటలుద్దేశించబడి యుండవచ్చునని అనుమానముతట్టినా, ఈపాటలచివ్వర కనబడే ఫలశృతి కాదుకాదంటుంది. ఫలశృతినిబట్టి ఈపాటలు స్త్రీలు విరామ సమయాల్లో పుణ్యమూ పురుషార్థమూ కలిసివచ్చునని పాడుకునేవేఅని తెలుస్తుంది. ఇతరత్రాకూడా వీటిని ఉపయోగించుకుంటే అదే అసలు ఉద్దేశమెందుకౌతుందీ?

ఈపాటలభాష వ్యావహారికభాష. దేశిసారస్వతములో తరుచు వినబడే కన్నడ (కరాటకంఅన్న మాటకి తెలుగు), అన్నెకారి, పణతి, చదురు, ఉప్పరిగె,

వల్లభులు, తబుకు, అసురుసురు, శలగవంటి పదాలు ఈపాటలలోకూడా కనబడతాయి. (ఆనవెట్టియనుటకు) ఆనెట్టి, చెప్పంపి, తలుపేసి, పైనము అన్న దాట్లూ; వెండియ కాగులు,చిన్నియ పొన్నియ, వెండయ్యా చారలా భమిడయ్యాలేడి, ఎక్కియ్యా చేడెయ్యా వంటి సాగదీతలూ; రాము, వశిష్టు, శతృఘ్నువంటి లోకకోతలూ; దండ నమస్కారాలు, లోకపాలము సింహాసనగద్దెవంటి ఆమ్రేడితాలూ; శునకలోక, రత్న మేడలు, కనకపీటలు వంటి వైరిసమాసాలూ ఈపాటలభాషకి వింతపూత పూస్తాయి... వీటిఛందస్సు మాత్రాఛ్ఛందస్సు, గణఛందస్సు కాదు. స్థూలంగాచూస్తే ద్విపదల్లాగ కనపడతాయిగాని అసలు నాలుగు తకిటతక ఆవృతాలపాదాలవి ఈపాట లెన్నో. స్త్రీలపాటలు తకిట, తకిట, అని మూడక్షరాల ఆవృతాలలో త్రిశ్రగతి లోనూ, కిటతక అని నాలుగేసి అక్షరాల ఆవృతాలలో చతురశ్రగతిలోనూ, కిటతకిట అని అయిదక్షరాల ఆవృతాలలో ఖండగతిలోనూ, తకిటతకిట అని ఆరక్ష రాల ఆవృతాలలో రూపకతాళములోనూ, తకిటకిటతక అని ఏడక్షరాల ఆవృ తాలలో మిశ్రగతిలోనూ, కిటతకకిటతక అని ఎనిమిది అక్షరాల ఆవృతాలలో ఆది తాళములోనూ నడుస్తాయి. ఆవృతాలనిండా అక్షరాలు నిండిపోతే పాటకు ఊపిరి సలపదని, చివరి ఆవృతాలలో అక్షరాలు తగ్గడమూ, ఒక్కొక్కప్పుడు పూర్తిగా లోపించిపోవడమూకూడా జరుగుతుంది. నాలుగు కిటతకిట ఆవృతాలపాదాలలో నడిచేపాటలు ఈ సంపుటములోహెచ్చు. వీటిలో, నాలుగో ఆవృతములో సాహిత్యాక్షరాలు మూడేవుంటాయి- కనక ద్విపదపాదాలులాగ కనబడతాయి. "పండ్లు ఫలహారములు పళ్లెరమునుంచీ" అంటే ద్విపద ఎలాగౌతుందీ?

ఈపాటలలోని రామాయణగాథలు వాల్మీకానికి భిన్నములు. ప్రజల నోళ్లలో మెదిలే విచిత్రగాథలన్నిటికీ ఈపాటలేమూలమో, లేక ఆగాథలే వీటికి మూలమో చెప్పడము కష్టము. ఓఢ్రములో విచిత్ర రామాయణమని ఒకగ్రంథమున్న దట; అదితెలుగులోనికి మూడురూపాలలో వచ్చినది. ఈరామాయణగాథలన్నీ ఆరకపు వివిధ రామాయణాలనుంచి వచ్చియుండవచ్చును. రంగనాథరామాయణ ములో కొన్నిచిత్రగాథలున్నవి. ఆకాలానికి ఓఢ్రమునుంచిగాని, ఇంకేభాషలోనుంచి గాని తెలుగుసేతలున్నట్లు కానరాదు. కనుకఆగాథలు తెలుగునాట పుట్టినవేకావాలి. రంగనాథరామాయణమే ఈగాథలను జనశ్రుతినుంచి గాని నేటి యీపాటలవలె దీర్ఘ ములు కాకపోయినా చిన్నవిగా యుండిన 'సకలపురాతన చారుగీతముల' నుండిగాని, గ్రహించి యుండవచ్చును. ఈపాటలలో నివి మట్టుకు అంతప్రాచీనములని చెప్పడా నికి సాక్ష్యముచాలదు. వీటిలో చెప్పబడిన ధాన్యాలరకాలూ, నగలభేదాలూ, ఆటల పేరులూ మనకు తెలిసినవేగాని అతిప్రాచీనములు లేవనుకుంటాను. శ్రీరామపట్టాభి షేకములోని 'నిండగంగాజలము నిలిపి యాగూనలమర్చిన కుందనపు భమిడి కుండ

కములోనుంచి అమర్చిన ఘడియారము' తెలుగునాట జైమిని భారతమునాటికి ఉప యోగములోఉంది. ఇంతకంటె ప్రాచీన మైన వస్తుప్రశంస ఈపాటలలో దొకరలేదు.

ఈపాటలు నేటికాలములో గంజామూ విశాఖపట్టణమూ, గోదావరీ మండలాలలోఎక్కువ వినబడుతున్నవి. అయినప్పటికీ సుభద్రాకల్యాణము తిరుపతినుంచీ సీతాదేవి వామనగుంటలాట-బహుశా త్యాగరాజుపూర్వులు నివసించిన-కంభముసీమనుంచీ వచ్చియుండుటను బట్టినీ, దక్షయజ్ఞమువంటి పాటలలోని పదాలుఎన్నో రాయలసీమ మాండలికాలు కావడమునుంచీ, పశ్చిమాంధ్రసీమలో ముద్దుటుంగరమూ, సీతమ్మచెఱ అన్నపాటలు—ఈకోనలోనివి-వినబడుతూండడాన్నిబట్టీ, స్త్రీలసారస్వతము తెలుగునాట అంతటా వ్యాపించియుండినదే అని చెప్పవలెను. దత్తాత్రేయ చరిత్రి తెలంగాణలో మెదకుమండలములో దొరికినది. పాలమందిరి ఛత్రపురములో, సతీరంగమ్మచరిత్ర కోయంబుత్తూరు మండలములో, అంబరీషుని చరిత్ర నెల్లూరులో, ప్రహ్లాద పాదిలెలో, వినబడుతున్నవి. కనుక ఈ సారస్వతము తెలుగునాట నంతటా వ్యాపించియుండినదే అనవలెను. ఈ పాటలన్నిటినీ కూడగట్టుకొని సారస్వతమని పేరుపెట్టేయవచ్చునా అని కొందరికి సందేహము కలుగవచ్చును. అక్షరగతమైన గ్రంథములే సారస్వతమన్న అపోహ రామరాజభూషణునివంటి మధ్యయుగపండితునికి కలుగవచ్చునుగాని, నాటి చీకటి కోణములపైన పరిశోధన వెలుగులు ప్రసరించే నేటిచైతన్యపురోజులలో విద్యార్థులకుకూడ కలుగనవకాశములేదు. కంచుకాగడావేసి వెతికి చూస్తే ఒక్కగానొక్క సీసపద్యపు పాదములో కవిత్వము దొరికే భైరవకవి శ్రీరంగ మాహాత్మ్యము సారస్వతమేనా? మాదయగారి మల్లన, కందుకూరి రుద్రయల హాయిమాయిగారడీకథలు, విభక్తులు బిగించి రచించిన పద్యాలకట్టలు (ఉదాహరణ) సారస్వతమేనా? ప్రతిభావ రసపరిపుష్టములు స్త్రీలపాటలేనా సారస్వతముకావు? గణాచార్యుల పద్యాలకుప్పలు సారస్వతము, లయాభిమానుల అందపుటడుగులు సారస్వతముకావు! కుత్స్యాన్యస్యుఃకుపరీక్షకైః ర్నమణయోరర్థతః పాతితాః. స్త్రీలపాటలలో కథాసౌందర్యమూ, కథనసౌందర్యమూ వైవిధ్యమూ కలవు. 'పండితులు' గమనించకుంటేమానె, ఈపాటల రచయితలు తమకుపూర్వము రచించబడ్డపాటలను పరిశీలించుకుంటూ తమరచనలు సాగించి ఈ శాఖను సరస్వతిని చేసినారు. వీటిలోవీటికి పూర్వరచయితల కల్పనల కనుకరణములూ, సుందరసన్నివేశాల దిగుమతులూ, భావసామ్యత, కనపడుతూ వీటిప్రత్యేకసత్తాను నిరూపిస్తున్నవి. రాఘవకల్యాణమూ, సీతవసంతమూ, సీతలలకా, ఋషులఆశ్రమమూ, సీతాదేవి ఆనవాళ్లూ, లంకాయాగమూ, సీతఅగ్నిప్రవేశమూ, గుహభరతుల అగ్నిప్రవేశమూ, శ్రీరామ పట్టాభిషేకమూ, ఊర్మిళాదేవి నిద్రాచక్కని కావ్యములు. చంపూ రచనలలో కథనమువల్ల మనలనాకర్షించేవి ఆశ్వాసాల పొడవును దాటినవి ఏకవచ

నాన్నీ ద్వివచనాన్నీ అతిక్రమించి బహువచనములో పద్దాయనగలమా? మరి ఈపాట లను సారస్వతమనడానికాటంక మేమిటి?

స్త్రీల పాటలను సంపుటీకరించి తొలుదొల్త 1899లో ప్రచురించినవారు నందిరాజు చలపతిరావుగారు. తరువాత 1905 ప్రాంతంలో మంగు రంగనాథరావుగారు విడివిడిగా 'నూరుహిందూస్త్రీలపాటల'ను అచ్చువేయించి ప్రచురించినారు. వీరిద్దరూ కేవలము కథలపాటలనే వేయలేదు. మొదటివారు మంగళహారతులవంటి పాటలనూ రెండోవారు 'తులాభారం' వంటి యక్షగానాలనూకూడా వేసినారు. వీరిద్దరూకూడా రామాయణానికీ, భారతానికీ, భాగవతానికీ, శైవాగమాలకీ, వేదాంతానికీ చెందిన పాటలను అన్నిటినీ ఒకచోటచేర్చి ప్రచురించలేదు. పరిషత్తువారు ఈ సంపుట ములో 42 రామాయణపుపాటలనుచేర్చి ప్రచురించినారు. వీటిలో శ్రీరామ జననము, పాదరగుప్పీలు, కోవెలరాయబారము, సీతచెఱ, సీతముద్రికలువంటి వెన్నో ఇదివరకు అచ్చుకానేలేదు. ఎరిగినంతవరకూ రామాయణపు పాటలన్నిటినీ ఇందులో చేర్చినట్లున్నది. శాంతగోవిందనామములు శాంతాకల్యాణగాథనే చెప్పానవి కనుక చప్పనైన శాంతాకల్యాణము వదలివేసినారు. రాయలసీమలో సీతమ్మచెఱ, ముద్దు టుంగరము అని వేరేపాటలున్నవట. అవివీరికి లభించలేదు. అవీ, ఇంకా వీరికి ఈనాటికందనివి తక్కిన రామాయణపుపాటలూ ఎవరేనా పంపితే రెండోకూర్పులో చేర్చి ప్రచురించడము బృహత్తరాంధ్రసారస్వతాభిమానులము అందరమూ కోరదగినది.

'కృష్ణశ్రీ'




# సంక్షేపరామాయణము

కడునొప్పుకైలాసపర్వతంమీద । పరమశివులను తాను పార్వతమ్మడిగె ।
చందనగంధియుచేతులుమోడ్చి । శ్రీగౌరిదేవమ్మ చేసెవిన్నపము ।
యేడుకాండాలెల్లవిప్పిచెప్పకను । ఆరగించాననిఆదేవిబల్కె ।
ఆదేవిపల్కులకుమహాదేవుడపుడు । శ్రీరాముకథలెల్ల చెప్పంగదొడగె ।
అయోధ్యపట్నమునసూర్యవంశజుడు । దశరథుండనురాజుయేలుతూనుండె ।
కౌసల్య సూమిత్ర కైకలనగాను । ముగ్గురుభార్యలు కలరు భూపతికి ।
సతులముగ్గురితోను దశరథేశ్వరులు । అతిరాచవైభోగ మనుభవించుతును ।
పట్నంపుదేవియగు కౌసల్యతోడ । యేడునిడువులభమిడి మేడల్లలోను ।
నవరత్ననిర్మిత పట్టెమంచమున । కామభోగమ్మున కొంతకిట్లనియె ।
పుత్రులులేనివారికి పుట్టగతిలేదు । మనరాజ్య సంపదకు దగుసుతులులేక ।
అడవిగాచినవెన్నె లయ్యెమనకలిమి । పుత్రులులేనియీ తనువేలమనకు ।
పుత్రకామేష్టిపుడు చేయుదామనియు । పుడమిపతిజేసెనూ పుత్రకామేష్టి ।
యాగంబునకు మెచ్చి అగ్నిహోతుృండు । బంగారుకలశతో పాయసందెచ్చి ।
పణతులకివ్వమని పార్ధివునకిచ్చె । కలశముభూపతి చేతబుచ్చుకుని ।
ముగ్గురిభార్యలకు ముదముతోనిచ్చె । ఆపాయసాన్నంబు భక్తితోగుడువ ।
అంతటగర్భమ్ము లాయెవారలకు । శంఖుచక్రములు భుజమందుదాల్చి ।
హోమగుండమునుంచివెడలివిష్ణుండు । ముగ్గురిపణతులకు నల్గురాసుతుల ।
భూపతీయిత్తునని ముకుందుడుబల్కె । దశరథునికి సంతోషమెంతనిజెపుదు ।
నరనాధునికిసుతులు నల్గురూపుట్టి । సృష్టిలోరాక్షసుల చలపట్టిచీరె ।
నూటనాటనుబెంచె యారాజసుతూల । దశరథుడానంద మగ్నుడైయుండ ।
కౌశికుడుజన్నంబు కడువేడ్కజేయ । అసురులచెవిఘ్నంబు లగుటనూజేసి ।
దశరధేశ్వరులను దర్శంచిమౌని । తగినసన్మానంబు బొందిగూర్చుండి ।
మారీచసుబాహులను మాయరాక్షసులూ । యజ్ఞవిఘాతంబుజేయుచున్నారు ।
యుర్విలోనిసుతులున్నతాబలులు । వారలను బంపియూ దనుజులను జంపి ।
యాగంబుగావుమీ కోసలేంద్రుండ । అనవిని తాహడలి రాజశేఖరుడు ।
వాకచెంప గొట్టినా పాలుగారేటి । వాకచెంపు గొట్టినా నీళ్లగారేటి ।

మాటలునేరని మారామచంద్రు । యెట్లు అడవికిబంపి నేనిలచియుందు ।
బాణమెరుగడు విల్లు సంధించలేడు । అసురమాయలు యెట్లు గనుగొనాగలడు ।
ఆనిశాచరులనునాశిశువుయిప్పుడు । సంహరించెడుమాట సందియంబనిన ।
అతియుగ్రముతొ రాజరుషియిట్లులనియె । మీసుతుల బలములా మీరెరుగరయ్యా ।
శ్రీవిష్ణు హంశగల వాసుదేవుండు । నాలుగుమూర్తులయి నాధజన్మించె ।
వారల దర్పంబు శౌర్యోన్నతియును । ముందుజాతువుగాని రాజశేఖరుడ ।
సందియమికమాని రామలక్ష్మణూల । సరగునబంపుమీ దనుజులనుజంప ।
ఆమాటలూవిని ఆశ్చర్యమూతొ । రుషివెంటబంపెనూ యిద్దరీసుతుల ।
తల్లినగరికివచ్చి వందనంజేసి । బాణతూణీరములు చేతధరియించి ।
వెడలిరిమునివెంట యారాజసుతులూ । రాతినాతినిజేసి రమణిరక్షించి ।
మారీచసుబాహులద్రుంచి యాగంబుగాచి । రుషిచేతబహుమాన దీవెనలుబొందీ ।
పురములు వనములు భూరిదుర్గములు । కౌశికుతోగూడి విహరించుచుండ ।
జనకచక్రవర్తి భూమిదున్నగనూ । ధరణిలోవుద్భవిలె త్రయిలోక్యమాత ।
నాతికి పరిణయ కాలంబురాగ । యెవ్వరు శివవిల్లు యెక్కువెట్టుదురో ।
వారికి మత్పుత్రి నర్పింతుననిన । యెల్లరాజులలోకి మేటియగురాము ।
త్రిపురములు సాధించిన తేజమగువిల్లు । అపుడు తనపరాక్రమం అమరులుపొగడ ।
శీఘ్రాన ఖండించి శీతచేపట్టి । అంతటజనకసుత కల్యాణమాడె ।
సీతనుచేకొని శీఘ్రానవారు । అయ్యోధ్యకూబోవు మార్గంబులోను ।
పరశురాముండంత పోరునకురాగ । రణభూమియందునా రామునోడించి ।
అయ్యోధ్యపట్నమున దివ్యహర్మ్యమూన । గృహప్రవేశంబు వేడుకతోజేసి ।
ఆనందశుభలీలలమరియుండగనూ । మంత్రిసామంతాది హితపురోహితుల ।
సభతీర్చికొలువున కూర్చుండిరాజు । యెల్లుండినవమికి యెనుముదులురెండు ।
పదియారుయేళ్ల ప్రాయంబువచ్చె । మనరామచంద్రులకు రాజ్యమంతాను ।
పట్టాభిషేకంబు చేయంగవలెను । వార్ధక్యమొచ్చింది నేనేలలేను ।
యిలరాజ్య భారమ్ము యివ్వంగ దలచి । నీకు పట్నంబుగట్టి ముచ్చటలుదీర ।
చూచెదనాతండ్రి కరువు దీరంగ । రఘుకులపతిరామ రాజ్యంబుయేలు ।
యేలరనాతండ్రి అఖిలరాజ్యంబు । భూపతి రాముడు సీతతోగూడి ।
వుపవాసముండుట యుచితంబుఅనిరి । శిరసునమాణిక్యం చెలువముమెరయ ।
సిరిమౌళితావచ్చి అత్తలకుమ్రొక్కె । కౌసల్యశాంతలా కాళ్ళకునుమ్రొక్కె ।
కైక నగరికివచ్చె కాకుత్థ్సతిలకు । దండంబు బెట్టియు తానేగెకాంత ।

మందర అనియేటి వకమాయదాసి । కయికకు ప్రియురాలు పెద్దవానీస ।
వచ్చి యిట్లనిజెప్పె కయికమ్మతోను । చూచితివ కౌసల్య దేవిభాగ్యములు ।
నీసుతుని గయికొనక నీవెరుగకుండ । కాకుత్థ్సుకు పట్నంబు కట్టుచున్నారు ।
పెద్దభార్యాకొడుకు జ్యేష్ఠపుత్రుండు । అగ్రజసుతుడగు అనుజురాఘవులు ।
ధారుణీశ్వరుని తనయులాలోను । చక్రవర్తిత్వంబు చేయనున్నాడు ।
రాముక్రిందాబంటు అగును నీసుతుడు । భరతునకు పట్నంబు కట్టుమనికోరు ।
దాసిమాటలువినియు తరలాయతాక్షి । మతిమాలిన మాటలే మందరానీవి ।
రాజ్యానికధికారి జ్యేష్ఠపుత్రుండు । శాస్త్రపద్ధతిగాను రాజ్యంబు అంత ।
దశరథసుతునకు కట్టంగవచ్చు । అనుజునినన్నునూ అతదెపోషించు ।
అరువకపొమ్మని అతివతాబల్క । మదిలోనదిగులొంది భయముపొందకను ।
కాలుకదపాకుండ కడుధైర్యముతో । మరలయిట్లనిబల్కె మత్స్యాయతాక్షి ।
కౌసల్యగద్దెక్క నీవెక్కరాదు । కొద్దివారిలోన గూడియుండూవు ।
నీసపతికుంచాన కొలిచియివ్వంగ । కుడువంగపాటయ్యె విధినీకువ్రాసె ।
సుతుడు సేవకవృత్తి జీవించుచుండు । నాడుదశరథరాజు రెండువరమూలు ।
యిచ్చియుండెనుఅడుగు మిదియెసమయంబు । మత్స్యాక్షీఅడుగుమని మగువతాబల్క ।
తలయూచి తలపోసి యాతరుణియంత । హారములుపతకములు బన్నస్వరమూలు ।
నవరత్నసొమ్ములు కానుకలుయిచ్చి । మదినిసంతసమంది యాపద్మగంధి ।
రామునియిచటికి రమ్మనీచెప్పు । అనగవిని మంధరా అతిశీఘ్రముగను ।
యినవంశ్యతోదెల్ప యిందీవరాక్షి । కయికనగరికివచ్చె జానకీపతి ।
తల్లికి సాగిలా బడిదండముంచి । నిలుచున్న సుతుజూచి యానీరజాక్షి ।
తనయ నాపల్కులు తథ్యముగవినుమి । తండ్రిసత్యమునీవు జరుపవలెనుమ్మి ।
వరములు రెండిచ్చె వసుధీశుడపుడు । భరతునకుపట్నంబు కట్టనొకవరము ।
మిమ్ము నడవికిబంప నొకవరముయిచ్చె । పద్నాలుగూయేళ్లు ఆప్రతినజరిపి ।
రాజ్యంబుయేలుమీ రాజకూమార । ఆమాటలూవిని రామచంద్రుండు ।
కన్నులనూనీరు గ్రిరుననుదిరుగ । ముఖముకళదప్పియు కళవలాపడుచు ।
కమలనాథుండపుడు తండ్రిసభకేగి । కన్నీరెబెట్టినా కాకుత్థ్సుజూచి ।
తండ్రిజేరగదీసి నాతనయనీవు । దుఃఖింపపనియేమి నాముద్దుపుత్ర ।
యేమి భయమూగగ్గె యోనీరజాక్ష । తల్లులుతమ్ములు తగినబంధువులు ।
యెవ్వరుయేమనిరొ యిప్పుడేదెల్పు । తప్పకఖండింతు ధారుణీశ్వరుడ ।
ఆమాటలావినిసుమంత్రుడనుమంత్రి । కయికగోరినవరము రాజుకెరిగించె ।

ఆమాటలూవిని హడలిదశరథుడు । యెడలేనిశోకాబ్ధి మునిగిదుఃఖించి ।
కయికయున్నట్టియా నగరికేతెంచి । కాంతనుజూచియూ కాంతుడూబల్కె ।
రామునడవికిబంప నోరెట్లువచ్చె । అగ్రజుడుండగా అతివపట్నంబు ।
నీసుతుకుకట్టుటా నీతియేజెపుమా । రాజభార్యవుగదా రవ్వలేమిటికీ ।
స్త్రీబుద్ధిప్రళయాంతక మనుమాటయిపుడె । నిజమయ్యెనో భామ నిలువెల్లవిషము ।
నీకునిర్మించెనే యాకమలభవుడు । యేనుగుల నడుగుమీ గుర్రాలనడుగు ।
రాజ్యంబులడుగుమీ రత్నాలనడుగు । యింతినీవడిగినవి యీకుంటినయిన ।
రామచంద్రునిఆన లక్ష్మణునిఆన । నీసవతికౌసల్య సుమిత్రఆన ।
విభునిపల్కులువిని వెలదితాలేచి । భగ భగమండేటి యగ్నిచందమున ।
కన్ను లెర్రగజేసి కాంతునితొబల్కె । అలనాడువరములూ ఆరణ్యమంపు ।
యిచ్చితివిగా రెండు యిందీవరేశ । ఆడితప్పగదగునె అధికులకుయెందు ।
పలికిబొంకుదురయ్య పార్థివోత్తములు । మారుబల్కకనీవు మహారాజయిపుడు ।
రామునడవికిబంపు పద్దాలుగేండ్లు । భరతునకుపట్నంబు కట్టిపార్థివుడా ।
లేకున్నసుతుజంపి నేజత్తుననెను । నాసుతుకురాజ్యంబు యియ్యకుంటేను ।
పరపురుషుభాగ్యంబు నేజూడలేను । కడుశోకమగ్నుడయి కోసలేశ్వరుడు ।
నాకొడుకునడవులకు పంపగోరితివా । జగతిలోనీకీర్తి జనులెల్ల జెప్ప ।
యేలయీ అపఖ్యాతి పొందెదవుకొమ్మా । అనుచువిలపించుచు మూర్ఛతో నున్న ।
పట్నంపుదేవికి పణతులూదెల్ప । కయికనగరికివచ్చె కౌసల్యయంత ।
పతిజూచిశోకించి పతిముఖముదుడిచి । అతివదుఃఖముతోడ పతికిట్టులనియె ।
అలనాడువరములూ యేలయిచ్చితివి । పూర్వజన్మమందు జేసి నాకృతము ।
కుడువకతీరునా యెట్టివారలకు । అనుచుతనయునిదీసి తాగారవించి ।
యెవ్వరికన్నులలో మండెనోమంట । యెవ్వరి నేత్రాల చిచ్చుబెట్టితిమొ ।
యెడబాపుజేసెనే పాపదైవంబు । మాకేలబుడితివిర ఓరామచంద్రా ।
కయికకుపుడితేను రాజ్యమేలుదువు । అనగపయనంబాయె జనకుల్లుడు ।
అన్న పోకడచూచి లక్ష్మణుడుగదిలె । నాతండ్రినీవుండు మయోధ్యలోను ।
నీకన్నముందుగా మేముబోయెదము । యేలోకముననయిన భూకాంతలెల్ల ।
పతివిడచిసుతువెంట వత్తురాతల్లి । తల్లినివోదార్చి శ్రీరాఘవులు ।
సరగుసయేతెంచె జానకీకడకు । తనపతికయిజూచి జానకీదేవి ।
భానుడూ ఉదయించి పదిగడియలాయె । పట్నంబుమీకింక కట్టరదియేమి ।
అయోధ్యపట్నంబు భరతునిదాయె । ఆరణ్యవాసంబు మనకయ్యెసీత ।

చేడెలుచరియించ వత్తురోరారా । జానకినీవుమా తల్లికడనుండు ।
పతిపల్కులూవిని సతియడలుచూను । ఆ హాహ శ్రీరామ అయోధ్యవాస ।
జనకుడు యేమని చేసెపరిణయము । అగ్నిహోత్రముతోడ సూత్రంబుగట్టి ।
అంగనరొవిడువనని శపధంబుజేసి । బెల్లముజిలకర్ర శిరసుననునుంచి ।
చేసినబాసలూ అడవిగలిసినవా । మానుబారినతీగె మ్రానుతోగాని ।
మానుబోయినవెనుక మరిబ్రతుకగలదా । తీగెనుబుట్టింది గురివెందగుత్తి ।
తీగెబోయినవెనుక మరిబ్రతుకగలద । దీపంబుతోగృహము దీపిల్లుగాని ।
లేకున్న ఆగృహము చీకటయిపోవు । మాకుమీతోనుండ లోకంబుగాని ।
లోకేశయికనొండు లోకంబుగలదా । అనుచుదుఃఖించేటి సతిముఖముచూచి ।
జాలిబొందియుతనా రమణినిబిలచి । రమ్మిముమ్మాటికి యోహంసగమన ।
నమ్మవలెనాయనుజు సౌమిత్రితోడు । నాముద్దుతమ్ముడా ప్రియలక్ష్మణుడ ।
అడవులతిరిగియు అలసటజెంద । కష్టపడనేమిటికి అయోధ్యనుండి ।
భరతునికి మంత్రిగా పాలనలుచేయి । అనగను లక్ష్మణుడు అన్నతోబల్కె ।
మిమువిడచి యుండుట నీతిగాదయ్య । పట్నంబుయేలినా పరవాసమున్న ।
పట్టినపాదంబు పట్టువిడువాను । అనుచుపాదమునున్న అనుజునీదీసి ।
పోదామురమ్మని పొందికతొజెప్పి । అంతిపురికీబోయి అమ్మతోజెప్పి ।
శలవునుబొందియు మమ్మచేరూమి । అత్యంత భక్తితో శ్రీ లక్ష్మణుండు ।
సరగునయేతెంచి తల్లికిని మ్రొక్కె । బాలప్రాయపువాడ చిన్నిలక్ష్మణుడ ।
పన్నెండుయేళ్లది యీజనకసూత । పలుకంగనేరదు పనులునేర్వాదు ।
రాముజూతామంటె బలురాజునుండు । యెండవానలుతాను యెరుగడెన్నడునూ ।
అడవులలోనెట్లు చరియించనేర్చు । అడవులకేగుమని యెట్లుదీవింతు ।
యెన్నడుచూలాయె యెన్నడూగంటి । యెన్నడు పెంచితిర నిన్నురఘురామ ।
యెన్నడుపెండ్లాయె భూమేలుటెపుడు । యెన్నాళ్లు అడవిలో యుందువుర తండ్రి ।
మాకళ్లలోయిపుడు చిరియిసుకజల్లి । మమువిడిచిఅడవులకు పోయెదవపుత్రా ।
యీమిద్దెమేడలు దివ్యభవనములు । సింహాసనంబులూ మణిగోపురములు ।
అయోధ్యరాజ్యంబు గజతురగమూలు । జోగులజంగాల కధికారమగునా ।
యీయేడులోకములు యినవంశతిలుకా । యెవ్వరిరాజ్యమని యేలుదికనేను ।
నాతండ్రిఅడవులకు పోయెదవబిడ్డ । నీవువచ్చినదాక నేనిల్వసుమ్మి ।
తండ్రిని వోదార్చి శ్రీరాఘవుండు । జనకజనుచేబూని లక్ష్మణునితోడ ।
తననగరు యెడబాసి కలువరముబొంది । నాలుగుదిక్కులూ కలియంగజూచి ।

సుమంతుని ముఖంచూచి సూర్యనందనుడు । అరణ్యమునకేగ మార్గంబుయెట్లు ।
విల్లునుఅంబులూ ధరణిపయినుంచి । హస్తములుముకుచుకుని మ్రొక్కె లక్ష్మణుడు ।
సృష్టంతనీవుసుమీ శ్రీభూమిదేవి । అచ్యుతునిఅడుగులకు వొత్తకుడి రాళ్ల ।
అనుచు ధరణికిమ్రొక్కి అందరునుతరలి । రఘుపతిముందరను సౌమిత్రివెనుక ।
అవనిసుతయూనడచె నారణ్యములకూ । పొడుపుచుక్కావలెను పొందుగానీవు ।
అడవులలోతిరుగ అమిరితివి సీత । మీనాక్షి నీపుణ్య మెట్టిదోగాని ।
మాభాగ్యములు అరణ్యములు పాలాయె । యింతకంటెసుఖము లేదుపొమ్మనుచు ।
సంతోషచిత్తుడయి కదిలిరాఘవులు । యింతితో కూర్చుండె యిరువిందక్రింద ।
యిరువింద నీవింత చల్లనయియుండి । కౌసల్యకంటెనూ ప్రేమజూపితివి ।
కయికయిచ్చిన నార చీరెలేదీసి । కట్టుపుట్టంబులు చెట్టుపయినుంచి ।
శీఘ్రింబుగా నార చీరెలేగట్టి । చిత్రకూటానికి చెయ్యెత్తిమ్రొక్కి ।
భూషణంబులుదీసి భూమిపాలకులు । తామరపూసలు తులసిపూసలును ।
గుచ్చినపేరులు హారముగదాల్చి । కస్తూరికుంకుమయు తగదుడిచివేసి ।
ముత్యంపునామమే ముఖమునకుదీర్చి । జడలువేసెదనయ్య సౌమిత్రిరమ్మా ।
అనగచిరునవ్వుతో లక్ష్మణుండేగ । జడలల్లసాగిరీ సర్వేశ్వరులు ।
కురులుకురుచయ్యెను చేతికినిరావు । జడలుచేతకావు సౌమిత్రినాకు ।
అనుచుతమ్మునిశిరసు తొడలపైనుంచి । సౌమిత్రికిజడలల్లెజనకునల్లాడు ।
రాఘవునికల్లెను అనుజులక్ష్మణుడు । శీతమ్మకువేసె ఆచక్రధరుడూ ।
తల్లిజేసిన విధము తలపోసుకొనుచు । తపవేషమొకనాడు దాల్చియుండిరి ।
యెండ వానలచేత హారంబు లేక । కటకటలాడుచు కన్నీరునించి ।
వున్నట్టిఅన్నను జూచియనుజుండు । వ్యాఘ్రచర్మందెచ్చి వసుధనుబరువ ।
ఆరణ్యమందునా రుషితీరునున్న । రాసుతుడుగూర్చుండె రమణితోగూడ ।
పతినిజూచిసతీ తహతహపొంది । హడలంగదొడగెను భూసుతాయంత ।
హడలెడుపతిజూచి ఆదివిష్ణుండు । అబలజానకినీకు మనసందుయేల ।
భయపడుకారణం సుదితిరోచెప్పు । సుదతిజానకినీవు సుమంతుగూడి ।
పోయెదవె మాకొమ్మ బంగారుబొమ్మా । వత్తువామావెంట వనవాసములకు ।
అవనిపతివిడిచినే నరుగపొమ్మనెను । విల్లునుఅంబులు ధరణిపయినుంచి ।
మంత్రిపుత్రుండయిన సుమంత్రుడపుడు । హస్తములుముకుచుకుని శెలవులిమ్మనగ ।
రావణాసురవయిరి పిసతల్లితోను । అడవులకు మేము యరిగితిమాని ।
మాతల్లి కౌసల్యతోజెప్పుమనెను । కైకసుమిత్రలగు తల్లులకుజెప్పు ।

మాయక్క శాంతకూ చెప్పుమీపోయి । అయోధ్యపట్నాన కాపురంబున్న ।
వృద్ధులకు పెద్దలకు శ్రీఘ్రానజెప్పు । ముందరిత్రోవను కూడిలక్ష్మణుడు ।
సంఘటిలిరాజిలు గంగనిధిగనిరీ । క్రొత్తగావచ్చింది శ్రీకరపుగంగా ।
వడిగొనిదిరిగేటి జలనిధినిజూచి । వడికొంతదించుమని వాలిరడుగులకూ ।
గుహునిభక్తికిమెచ్చి వడికొంతదించె । గుహుని నావామీద ఆధర్మసుతులు ।
జనకజతోగూడి యెక్కికూర్చుండి । యెక్కించిరిదిప్రియా యిదిపట్టవాడ ।
గంగమధ్యామందు నడిభాగమందు । సుడిగొనితిరుగగంగ సుదతితాజంకె ।
పద్మాక్షీభీతిల్లి పణతిజడసినను । శ్రీరామచంద్రులూ తొడనుజేర్చుకొని
కీలుబిగించితే శీతరుడియూను । కదలకుండగవాడ పదిలముగనడుపు ।
లక్షణంగలవారి రాజుతమ్ముడవు । లక్ష్మణాయీనావ పదిలముగనడుపు ।
వాడదిగి మూడడుగులొకమేరనడచి । రఘునాధఆరణ్య మెంతదూరమ్మ ।
నడువలేకనుకాళ్ళు పొక్కులునుబొక్కె । పూచగాచేతులను రక్తాలువిగెను ।
చంద్రబింబముబోలు ముఖమెల్లవాడె । సతిముఖముకై జూచి పతియంతనవ్వి ।
రామఅడవులలోకి రాకుండుమంటె । బుద్ధిలేకను నీవు వెంటవచ్చితివి ।
నడువుమీశుభమగును నలినాక్షీయనగ । అడుగులుతడబడి ఆకోమలాంగి ।
తొడగాళ్ళువేసెనూ పతిజూడగాను । కఠినంపురాళ్ళలో మేదినీతనయ ।
యెట్లునడువగలేదు యెత్తుకుందామ । నడచుచునున్నట్టి నరనాధుతోడ ।
పరమపతివ్రతా తనపతికి యిట్లనెను । సతినిపతులుమోసి వ్రతమునడుపుదుర ।
రఘునాధయిదిజూడ లక్షణంగాదు । శ్రీకరంబుగమీ శ్రీహస్తములు ।
మాకిచ్చిరక్షించు లోకేశతనయ । పరమాత్మమీకరం పట్టినడిచీతె ।
అయోధ్యపట్నాన పున్నట్టెమాకు । వెలపలిహస్తాన వెలదిచేపట్టి ।
లోపలిహస్తాన ధనసుచేపట్టి । చేరెదము యీతోోవ వెళ్ళేదముగిరికి ।
మహరుషుల ఆశ్రమాలటు గానవచ్చె । కిన్నరకింపురుష యక్షగంధర్వులూ ।
రెప్పవేయకరాము వొప్పుజూతూరు । తాపసికన్నెలే రూపుగలస్త్రీలు ।
నిన్నుజూస్తున్నారు నీరజనేత్రి । మమ్ముజూచియుతరుల మాటునకుజనిరి ।
వారలువున్నట్టి వనములకుజనుమా । పతియాజ్ఞబుచ్చుకొని పద్మాయజాక్షి ।
హంసగమనావెళ్ళె అతివలాకడకు । చుట్టుదిరుగానిల్చి సుదతులందరును ।
యెట్టిలావణ్యమొ యెట్టిరూపంబొ । యిట్టిస్త్రీలూగలర సృష్టిలోపలను ।
అతివకట్టీకళలు బ్రహ్మదేవుండు । చతుర్భుజములనిండ చేసెగాబోలు ।
మేలుకన్నులవాడు మేఘశ్యాముండు । చేతనంబులవాడు చంచలానేత్రి ।

యిరువురుయేమగుదు రువిదరోదెల్పు । శ్యామలదేహుండు నాదుపతిసుమ్మి ।
విల్లుచేబూనిన వాడునామరిది । జనకుడునాతండ్రి దశరధుడు మామ ।
వింటిమీపూర్వంబు కంటిమీనేడు । కంటిమిమాతళ్ళ కరువెల్లదీర ।
ఓశమ్మనీవిప్పు డడవులలోకి । వొంటరిగవస్తివే యిందీవరాక్షి ।
యిర్రులుదుప్పులూ యెలుగులూపులులు । గండుమృగంబులూ కారెనూబోతులు ।
కూర్రిరజంతువులన్ని తిరుగాడుచుండు । భయములేకనుతిరుగ మనసొప్పుటెట్లో ।
అనుచుముదితలుతమలొ ఆనందపడుచు । ఖర్జూరఫలములు కదళిఫలములును ।
అంజూరఫలములూ అవిద్రాక్షపళ్ళు । కొమ్మలనిమ్మపళ్ళు కోమలికియిచ్చె ।
గంగరేగుబండ్లు కమలాక్షికిచ్చె । తనకిచ్చినాపళ్ళు ధారుణీతనయ ।
జనకసుతతాదెచ్చి విభునికందిచ్చె । ఆదేవతాస్త్రీలు యరిగిరడవులకు ।
రఘుపతినవ్వుచూ దేవితోబల్కె । పద్మాక్షియీవనములో ఫలములన్ని ।
ఆరంగిచానీకు తృప్తగూనటవే । జనకుని తనయనై జానకిగ పెరిగి ।
అయ్యోధ్యరామునకు పట్నంపుసతినై । పట్టాభిషేకంబు చేయదలచీతె ।
కైకకుమీతండ్రి యిచ్చునావరము । ఆకులలమూదిని అడవిబ్రతుకంగ ।
పిన్నత్తకైకచే చేకూడెగదా । ఫలములకుకొదువేమి పరమాత్మమనకూ ।
చక్కనికొలనందు సాన్నంబులాడి । మంత్రజపనిష్ట నీమములుగావించి ।
అచ్చోటిబ్రాహ్మణులు యాబ్రహ్మరుషులు । ఆశీర్వాదంచేసి అక్షింతలివ్వ ।
శిరసునధరియించె దశరధాసుతుడు । తండ్రిపోయినవార్త త్రయిలోక్యపతికి ।
రుషులవల్లనువినియు అవుతారమూర్తి । హడలియేడువదొడగె ఆరాటమొందె ।
శ్రీరాముజూచియు శీతదుఃఖించె । సౌమిత్రిఅంతటా అన్ననోదార్చి ।
సరయుపూనదిలోన స్నానంబుజేసి । తిలదర్భఅక్షతలు తీవ్రముగదెచ్చి ।
పిత్రుకార్యంజేసిరి క్రమముతోడుతను । పదిదినములూగడిపె భానుకులుడంత ।
జనకసుతతామరా కొలనుకేతెంచి । చల్లగాపసుపాడి కొమ్మలన్నిలిపి ।
పద్ధాలుగుయేండ్లు అడివిపాలించి । మరలిఅయ్యోధ్యకు మేముచేరితిమా ।
ముత్యాలతోపూజిస్తు రత్నాలపూజ । మాణిక్యాలతోపూజ మగువనేజేస్తు ।
పట్టుచీరలుయిస్తు పద్మాయతాక్షి । చిలుకపల్కులతోటి శీతపల్కగను ।
చిరునవ్వునవ్వుచూ శ్రీరాఘవుండు । కొమ్మకుమ్రొక్కితివ కొలనుమ్రొక్కితివ ।
కొలనులోనున్నయా హంసతతికిమ్రొక్కితివ । కొమ్మకునేమ్రొక్క కొలనుకీమ్రొక్క ।
కొలనులోనున్నయా హంసతతికినేమ్రొక్క । శ్రీవిష్ణులక్ష్మికీ బ్రహ్మభారతికి ।
గౌరిశంకరులకు దండంబుబెడితి । మ్రొక్కితిముగ్గురికి హస్తములుమోడ్చి ।

గంగకు మ్రొక్కితే గతులిచ్చుగాని । రాజ్యంబులిచ్చునా యోహంసగమనా ।
విష్ణుండనేనవుదు నీవులక్ష్మివి । శంకరుడనేనవుదు నీవుపార్వతివి ।
బ్రహ్మయునేనగుదు భారతివినీవు । గంగగావకసతిని గావింతుననెనూ ।
అత్తకుసవతొచ్చి అడవులకుబంపె । జలములేసవతయితె తలమునిపోను ।
యెండవానలుబడక దిట్టమయివుండు । సకలతరువులుగలా పూదోటలోను ।
శాలగట్టుమని అవనిపతిబల్క । తాళవృక్షంబులూ హింతాలతరులు ।
దూలవాసములుగా తానునిర్మించి । మోదుగనారతో పెండెలునుగట్టి ।
అడవిలోఆకులు కప్పుగాబరిచి । యిమ్మయినశాలలూ లక్ష్మణుడువేసె ।
శాలలోపలజేరి శ్రీరాఘవుండు । దేవితోపవళించె తృణసెజ్జపయిని ।
రాక్షసకులమంత రాముచే తణగ । వేడ్కతోమారీచుడు కనకమృగమాయె ।
వెండివి చారలూ పైడికొమ్ములు । పర్ణశాలవాకిటా ఆలేడియాడె ।
పసిడిమృగమునుజూచి పణతిజానాకి । పరమాత్మయామృగం పట్టితెమ్మనెను ।
తమ్ముడుసౌమిత్రి యన్నతోబల్కె । అన్నమాయలలేడి తగదుసుమ్మనెను ।
అనేకదేశములు నదిపర్వతములు । ఘోరఅరణ్యములు నడచివచ్చితిమి ।
బంగారుమృగమును కంటిమేమనమూ । ముక్కునుచెవులునూ మునుకోతబడ్డ ।
రక్కసిమాయలవి రఘునాధచూడూ । ఆడదిబుట్టితే వీటికీచేటూ ।
సతినేలదెచ్చితివి దండకాటవికీ । అడిగినవస్తువులు యివకుంటిమయినా ।
అయోధ్యఅడవిగా ఆవనితజూచు । కోరినవస్తువులు తరుణికివకుంటె ।
ధనకాక్షితనవార్ని తలుచుతూనుండు । మనసయినయట్టివీ మగువకివకుంటె ।
కాంతలోలోపల గోజిల్లుచుండు । విల్లునుఅంబులూ చేపట్టిరాము ।
తమ్ముణ్నిసతివద్ద కాపలాయుంచి । పణతిరోయిదిమనకు గండంబుఅనుచు ।
సతిముఖముకై జూచి పతియేగసాగె । పుడకలుగొరుకుచు పూరిమేయుచును ।
గంతులువేయుచు చెంగలించుచును । చెట్లుపుట్టలు చెలగిదాటుచును ।
అందందినిలచుచు అట్టెయెరుగుచును । కనబడికనబడక కౌననాసీమ ।
తిరుగుచునున్నట్టి జంతువూపైని । దశరధసుతుడేసె అగ్నిబాణంబు ।
హాసీతలక్ష్మణా యినవంశతనయా । కావుమినన్ననుచు కనకమృగమడలి ।
దనుజరూపుతోను ధరణిపైద్రెళ్ళె । అంతరిక్షమందు ఆయార్తరవమూ ।
అవనిజ వినితన మరిదికిట్లనియె । లక్ష్మణవినవయ్య మీఅన్నమాట ।
అనుజునిచేతను ధరణీశులకు । యేమియుత్పాతంబు సంఘటిల్లెనో ।
అవశకునమ్ములు అటుగానవచ్చే । వేగంబుగాబోయి మీయన్నజూడు ।

అచ్చుటరామునీ గనువారులేరు । హడలుచుండెడివనిత కనుజుడూబల్కె ।
సప్తసముద్రాలు యేకమయినాను । పదునాల్గుభువనములు భస్మమయినాను ।
యేడుసాగరములు యింకిపోయినను । జగదీశ్వరులకెపుడు భయములేదమ్మ ।
ఆమాటలువిని అతివకోపించి । కళ్ళుయెర్రనజేసి కాంతదూషించి ।
సవితితల్లీసుతులు శత్రువులుగార । అనుజుభరతూవంటి తమ్ముడవుగావ ।
వకడురాజ్యంబేలు వకడాలిగోరు । వకరిసతినీగోర వంశముండూనా ।
ఆమాటలూవినగ ఆలక్ష్మణునకు । కడుపులోచెయిబెట్టి కలిపినట్లుండె ।
కర్ణానశూలాలు గుచ్చినట్లుండె । అగ్నిమంటలుబుట్టె తాపంబుగగ్గె ।
అనరానిమాటలు ఆడితివినన్ను । వినరానిపల్కులూ వివరించితీవి ।
పణతిరోనీపాల కర్మమెట్లుందో । యేడుగిరులూగీసిఆనెట్టిచెప్పి ।
పుట్టలలోవున్న భుజగేంద్రులారా । పురుషోత్తమునిభార్య మీభూమినుండె ।
కొండలలోవున్న వోమృగములారా । గోవిందునీభార్య మీగిరీనుండె ।
ఆకాశవాణియా ఓభూమిదేవి । దశరధునికోడలు మీభూమినుండె ।
మునులార రుషులార భూజంబులార । జనకునికూతురూ మీభూమినుండె ।
అన్నిఆనలుబెట్టి లక్ష్మణుండేగ । మాయవేషముతోను రావణుడువచ్చి ।
పున్నానపొంగిన సముద్రునీవలెను । యేరూపముతోను వెళ్లుదునోయనుచు ।
యెట్టిరూపంబుతో యింతిదేగలనో । నానిజరూపంబుతో వెళ్లితినయినా ।
నిలువునాప్రాణాలు విడుచునాదేవి । బాలప్రాయంబుతో వెళ్లితినయినా ।
సిగ్గుపడిఆచేడె పల్కదేమోను । వృద్ధబ్రాహ్మణవేష మేతానువేసి ।
విభూదిరుద్రాక్ష లమరంగబెట్టి । దర్భాసనంబును చేతధూరియును ।
చేబూనివణుకుచూ చెలియదగ్గిరకు । వంటనుప్రాణాలు లేనట్టివలెను ।
ఆడుగడుగుకూ ఆదినారాయణనుచూ । కపటంపుసన్యాసి కడువేగవచ్చె ।
వచ్చుసన్యాసికీ యెదురువనుదెంచి । అర్ఘ్యపాద్యంబిచ్చి దండంబుబెట్టి ।
కలిగినఫలములూ రుషికిచ్చెకాంత । ఫలములారాగించి సురద్వేషిఅంత ।
యెంతఫలమేనీకు యిందీవరాక్షీ । పులులువెలుగులుగలవు పొలతియీయడవి ।
వొంటరిగనుంటివీ పతియెందుబోయె । యెందుబోయెనేపతి సుందరీమణిరో ।
అనగరాక్షసితోడ ఆయంబుజాక్షి । వినవయ్యవకమాయ కనకంపులేడి ।
వచ్చిమాపర్ణశాల వాకిటానాడె । పసిడిమృగమునుజూచి దుర్బుద్ధిదోచి ।
పరమాత్మునామృగం తెచ్చిమ్మనంటి । పతినిదలపోయుచూ అతివదుఃఖింప ।
కన్నులనీరపుడు కాల్వలయిపార । యేలవగచేవుసీత నీధవునికన్న ।

యిందీవరాక్షిరో ఆత్ముడనుగాన । రాజ్యసంపదలకు చెడినరామూని ।
కందమూలమదిని కాలంబుగడిపే । రుషితీరునున్నట్టి యారామచంద్రు ।
చేపట్టిచేడెరో సుఖియింతువటవె । రావెలంకకునీవు యోరాజహంస ।
నవరత్నసొమ్ములు నాతిజేయిస్తు । మిద్దెలుమేడలూ దివ్యభవనములు ।
యేనుగులుగుర్రాలు మేలందలములు । బానిసలుదాసీలు బహుపరిజనులు ।
యేలంగపట్నంపు దేవినీజేతు । లంకపట్నముయేలు ఓదంతిగమనా ।
మండోదరిమొదలుగా అందరీసతులు । హెచ్చుగాజూతురే యిందీవరాక్షి ।
అనిపల్కి పదితలలు రాక్షసుడుజూపె । పదితలలుజూపగా పడిమూర్ఛబొందె ।
మూకమామిడివిరిగి పడ్డచందమున । గోరుచుట్టూపయిని రోకలీపోటు ।
చెవులోపోటుకుతోడు సన్నాయిజోడు । జంకుచుకనుమూసి వణకుచునున్నట్టి ।
భూమిపైనున్నట్టి భూపుత్రిజూచి । గడ్డపెల్లాగించి రథముపైబెట్టి ।
పగదీరె ననితలచి గగనమునకెగిరి । యేగుచుండగమూర్ఛ దెలిసిజానాకి ।
శ్రీరామునతినయ్య సీతనాపేరు । అమరంగదశరథుని కనుగుకోడల్ని ।
కూర్మితోజనకునీ ముద్దుకూతురినీ । లక్ష్మణునివదినెనూ లక్ష్మిదేవంద్రు ।
ఆర్తరవములతోటి వెడలెనా రథము । వైనతేయునిభ్రాతజటాయువంత ।
ఆర్తరవమూవిని రణముకూదగిలి । ఓరిరావణనీవు రామునీసతిని ।
దొంగతనమూగాను యేలదెస్తీవి । డించిపోతేనిన్ను రక్షింతుగాని ।
అనుచుపంతముబట్టి పక్షములచేత । రథముగొడుగులుతన్నె పెక్కెములుతన్నె ।
శిరములుభుజములు నెత్తురులుగార । కలవరమునూబొంది సురద్వేషిజంకి ।
రెండురెక్కలనడుమ ఆయువనియెరిగి । చంద్రాయుధముతో పక్షినేయగనూ ।
వేరుతోవృక్షంబు కూలినారీతి । ప్రాణావశిష్టుడయి పుడమిపైబడియె ।
యేగెనురాక్షసుడు అంతరిక్షమున । రుష్యమూకాద్రియు సుదతితాగాంచి ।
వొడలిసొమ్ములుదీసి వస్త్రమునగట్టి । సుగ్రీవువనములో సుందరీవయిచె ।
దశముఖుడాలంక శీఘ్రమునజొచ్చి । అంధకారడవిలో అశోకనీడ ।
అసురాంగనలమధ్య ఆసీతనుంచె । సీతముఖమప్పుడే చిన్నబోయుండె ।
జానకిముఖమపుడె జయముచెడియుండె । యిందీవరాక్షిని జూచిరాక్షసుడు ।
నారచీరలుగట్ట నాతినీకేల । పట్టుచీరలుయిత్తు పద్మాయతాక్షి ।
పుడమిపైశయనించ నేలభూపుత్రి । హంసతూలికలుండె నటులేచిరమ్మి ।
మన్మధరాజ్యంబు మనముయేలుదము । యెదురనిలచీనట్టి దశకంఠుజూచి ।
నీతోటిబల్కరా నీచాధమూడ । అమరంగవకతృణం అతివచేపట్టి ।

యీపూరిపుడకతో పల్కెదానసుచూ । గజముకు సింహముకు యెంతఅంతరువో ।
అంతహెచ్చూతగ్గు రామునకునీకు । గోవుకుకుక్కకుయెంతఅంతరువో ।
అంతహెచ్చూతగ్గు రామునకునీకు । హస్తికిమశకముకు నెంతయంతరువో ।
అంతహెచ్చూతగ్గు రామునకునీకు । నక్కకుపులికినీ యెంతఅంతరువో ।
అంతహెచ్చూతగ్గు రామునకునీకు । రాక్షసుడానీవు రఘురామునాటా ।
యెలుకవలెమాణిక్య మెత్తుకునివచ్చి । యిరవుదప్పిబింకముతొ దిరిగేవు ।
పేదబ్రాహ్మణుండు బహునీతిశాలి । నీతండ్రిపౌలస్త్యు డఖిలవేదాంతి ।
వుద్యానవనములో యుల్లిచందమున । పరువుజెరుపనునిన్ను పుట్టించెబ్రహ్మ ।
నీలంకయేలుకుని యెదిగిబ్రితుకూమి । అనుచుకఠినపుమాట లవనిజాబల్క ।
కాలాగ్నిరుద్రుడయి బ్రిహ్మపుత్రుండు । యింద్రాదులిచ్చినా చంద్రాయుధమ్ము ।
చంద్రవదనసుగొట్ట చెయ్యెత్తిజూపె । మండోదరిమొదలగు మగువలందరునూ ।
పణతులజంపుట బహుదోషమాని । వద్దువద్దనుచునూ పారదోలీరి ।
ఆయుస్సుమూడుటను లంకజెడుటకునూ । ధరణిపతియుసురంత దనుజానకుదగుల ।
పుత్రమిత్రులతోటి బుగ్గియగుటకునూ । భూపుత్రిదెస్త్రివా బుద్ధిహీనుండ ।
మనుజులతోపోరు మనకేలచెపుమీ । సతిపల్కులూవినిదనుజేశ్వరుండు ।
లజ్జించితానేగె చదురుస్థలమునకూ । రక్కసుడువెళ్ళగా త్రిజటాలేచి ।
బహుమంచికలగంటి మదవతిరావినుమీ । రాముడేనుగనెక్కి రాగకలగంటి ।
నీమరదిభరతుడూ భూమేలగంటీ । నీలసుషేణుడు జాంబవంతూడు ।
అంజనుడుసుగ్రీవు డాయంగదుండూ । లక్ష్మణసహితముగ కపిసేనగూడి ।
సేతువుగట్టియు లంకంతగాల్చి । రావణువధియించి రాజ్యమంతయును ।
తమ్మునికిదాగట్టి నిన్నుచేకొనియు । వేడుకతోఅయ్యోధ్య కేగకలగంటి ।
కనకమృగమునువేసి మళ్ళెరాముండు । కాంచెనుతమ్మునీ కాకుస్థకులుడూ ।
పతిలేనిసతివిడిచి నీవురాదగునా । వనములోయాఅబల యెంతహడలూనో ।
తలిరుబోణులగతీ దలచవయితీవి । అనగ వినిలక్ష్మణుడు అన్నతోబల్కె ।
అనరానిమాటలు అవనిజాబల్కె । పడరానిమాటలు భామతాబల్కె ।
అచ్చటవనదేవతలసాక్షిబెట్టి । నిలువలేకనువస్తి యోనీరజాక్ష ।
తమ్ముణ్ణిఅనలేక భరియింపలేక । తనకుతానేసంబలించుకునిరాజు ।
తమ్ముడుత్రైలోక్య పతితోడగూడి । పర్ణశాలాచేరె పద్మలోచనుడు ।
పర్ణశాలాలోన సీతలేదాయె । జలములులేనట్టి ఆబావివలెను ।
సస్యంబులేనట్టి క్షేత్రంబువలెను । ఫలములులేనట్టి వృక్షంబువలెను ।

దేవుడులేనట్టి ఆలయమువలెను । భూపతిలేనట్టి రాజ్యంబువలెను ।
నాథుండులేనట్టి నాతిచందమున । చంద్రుండులేనట్టి యానిశీరీతి ।
సూర్యుండులేనట్టి యాదివముభంగి । పాఠ్యమినిజదివినా వేదంబువలెను ।
దివ్వెలేనట్టియా గృహముచందమునా । సీతలేనిశాల చిన్నబోయుండె ।
నేగదేబిల్చితిని రాగదేసీత । యెందులదాగితివో యేలబోయితివో ।
బంగారుచెంబుతో వుదకంబుదెచ్చి । పాదములుకడుగుటకు పణతిరావేమె ।
చలువమడతలుదెచ్చి తళ్ళొప్పనొత్తి । వీవనవిసరనూ యింతిరావేమె ।
నేగదేబిల్చితిని రాగదేసీత । యెందులదాగితివో యేలబోయితివో ।
లక్ష్మన్ననాడిన మాటలకునీవు । లజ్జించిదాగితివ యోహంసగమనా ।
సౌమిత్రినాడినా మాటలకునేను । వోరిస్తిమన్నిస్తి వోయిందువదనా ।
నేగదేబిల్చితిని రాగదేసీత । యెందులదాగితివో యెటులబోయితివో ।
యింతినీవడిగినా బంగారుమృగము । తెచ్చితినిజానకీ చెచ్చెరనుజూడు ।
పుడమిపైనున్నట్టి రథముహారాలు । భూమిజనుచేకొన్న పుడమిగోతులునూ ।
చూచిశ్రీరాఘవులు కడుమూర్ఛబోయె । అన్నశోకముజూచి హడలెసౌమిత్రి ।
ధైర్యంబుదెచ్చుకుని అన్నకిట్లనియె । పతులకొరకుసతులు హడలుదురుగాని ।
యేలోకమందయిన పతులుహడలుదుర । దేవలోకమునకు యేగినాగాని ।
దేవేంద్రువధియించి యాసీతదెత్తు । పాతాళలోకమున కేగినాగాని ।
నాగేంద్రువధియించి యాసీతదెత్తు । వనములనుదాగినను బిలములనున్న ।
ఛేదించినేదెత్తు సుందరీమణిని । చుప్పనాతినియేల చూచెజానాకి ।
తరుణిముక్కూచెవులు కోయమనకేల । మారీచుడేమిటికి మాయలేడయ్యె ।
పల్లవాధరియేల కోరెనామృగము । పట్టితెచ్చుటకేల పుట్టెదుర్బుద్ధి ।
చెలియన్ననేమిటికి జేష్టలూబల్కె । మాతవరమడుగుటకు జనకుడిచ్చుటకు ।
సీతనుదెచ్చియా వనముజొచ్చుటకు । మాయరాక్షసుతోను మగువయేగుటకు ।
కాకుస్థవంశమున కర్మవశములకూ । కైకయేమీజేసె కారుణ్యానాథా ।
వనమందుపొదలందు గుహలయందూన । వనజాక్షివెదకుచూ వాలిమర్దనుడు ।
భానుకులతేజుండు పణతివెదకుచును । పక్షులవృక్షాలమునుల నడుగుచును ।
లంకమార్గమబట్టి పోవుచుండగను । వైనతేయునిభ్రాత యాపక్షిరాజు ।
ఆరామరామనుచు ధరణిపడియున్న । ఖగకులపతిజూచి కాకుస్థుడడిగె ।
యెవ్వడవపురవోరి విహగపుంగవుడ । పక్షంబులూగూలి వక్కలైయుండ ।
కారణంబేమిటీ ఖగపతీదెల్పు । ఆదివిష్ణునిజూచి ఆపక్షిరాజు ।

అవనిజనురావణుడు గొంపోవువార్త । తానుయుద్ధముచేసి సుడిగొన్నవార్త ।
రావణునిపురికేగు మార్గపువార్త । వార్తలన్నియుదెల్పి వదలెప్రాణములు ।
పక్షిరాజుపుణ్య మెట్టిదోగాని । కన్నపుత్రునివలెను కమలనాభుండు ।
ఉత్తరక్రియజేసి గౌతమిలోగల్పి । శబరియిచ్చినపండ్లు తానారగించి ।
శబరికిమోక్షంబు శీఘ్రనయిచ్చి । రుష్యమూకముజేరి రామలక్ష్మణులు ।
వృక్షంబుక్రిందనే గూర్చుండగాను । సూర్యసూనుండగు సుగ్రీవుడుజూచి ।
బంపెనుహనుమంతుని రామసన్నిధికి । వచ్చెనువానరుడు వసుధేశునడిగె ।
తెలిపెనులక్ష్మణుడు అంజనీసుతుకు । వాలినితాజంప వసుధయునుగట్ట ।
కపిసేనతోరాజు లంకకునేగ । ప్రతినలుజరిపియూ సంధిదగచేసి ।
వాలనగ యెవ్వరూ వాడికీనీకు । యేలపగబుట్టెనో యెరిగింపుమనగా ।
ఆయింద్రనందనుడు నాకుభ్రాతయగు। యెడలేనిబలముతో యేకచక్రిముగ ।
పృధివినిగలయట్టి శూరులందరిని । రణమునగూల్చును కపిశేఖరుండు ।
చూచినంతటచేరు యెదుటిబలమంత । బలియుండుదుందుభి యనురాక్షసుండు ।
యుద్ధముజేయూచూ వాలిచేమడిసె । దుందుభిశవమునూ కాలితోదన్న ।
గిర్రునపైకెగిరి గిరిమీదబడిన । చూచెనురుషివరుడు యాదనుజశవము ।
యెవ్వడుయీగిరి యెక్కిననుగాని । మారుమాటాడక మడియునట్లుగను ।
శపధంబుజేసెను ఆయతివరుండు । నాపత్నిచేకొనీ నన్నుగొట్టంగ ।
మంత్రులుమేముంటీ మీగిరీయందు । అనిదెల్పిభూదేవి తొడుగులూయిచ్చె ।
కౌసల్యపట్టికీ కానుకలుయిచ్చె । కానుతలుచేకొనీ కళ్ళనద్దుకుని ।
శ్రీదేవినగలెల్ల రూపించిచూచి । దిగ్గునధరణిపయి వ్రాలెరాఘవులు ।
ప్రాణవల్లభసొమ్ము పతితానుజూచి । ప్రాంణబులూసోలి పరవశుండాయె ।
ఆహాహశ్రీరామ అయోధ్యవాస । పరాక్రమంగలరామ బలరామచంద్ర ।
యింతికొరకయి నీవుచింతింపదగునా । మంత్రులందరితోను కపిరాజుగూడి ।
శీతలంబగునట్టి యుదకములుదెచ్చి । శీతగంధముతోడ శీతపుష్పమునా ।
శైత్యోపచారంబు అయోధ్యపతికి । శాయంగకన్నెత్తి అనుజుతోననియె ।
వరకంకణంబులు సూడిగంబులు : ముక్కుముంగెరయును కర్ణాటిములమణులు ।
పాదములుఅందెలూ బన్నస్వరములు । అవనిజదాల్చినవి యవియగునోకాదో ।
కట్టుబట్టలచెంగు కాంతదికాదో । అనియడుగధరణిపతి కనుజుడిట్లనియె ।
కోమలిసొమ్ములూ కొన్నియెరుగుదునూ । అందెలుయాచెలివి సందేహమేల ।
వనజాక్షిబాహులా కంకణాలగునూ । నీలాలకమ్మలు నెలతవీసుమ్మీ ।

పద్మదళనేత్రివే పసిడిగాజూలు । నగలుయేమనివైచె నిచటసుగ్రీవ ।
అంతరిక్షమందె బోవుచూనుండి । దేవరా వకకన్య యివివైచిపోయె ।
దేవతలుశ్రీరామదేవునీసతివి । వత్తురువారలూ దాచియిమ్మనగ ।
పుచ్చుకుదాచితిని పుడమీశవినుమీ । మెచ్చెసుగ్రీవునకు యిచ్చెఅభయమ్ము ।
సప్తతాళముచాటున వాలినీవేసె । సూర్యసుతునికిగట్టె కిష్కింధపట్నంబు ।
వాలిమరణమువిని వనితతావచ్చి । నిష్ఠురోక్తులుబల్కె శ్రీరామచంద్రు ।
సుగ్రీవునికిమంత్రిగా అంగదునిజేసె । తారనుయోదార్చి తమ్మునిబిలిచి ।
చేతిముద్రికయిచ్చె శ్రీలక్ష్మణునకు । సేనలలోవున్న హనుమంతుబిలిచీ ।
హనుమన్నచేతికీ యిచ్చిముద్రికను । వనచరుడవినవయ్య వానకాలమ్ము ।
దరిజేరవచ్చెను వనితనూవెదుక । సాగరంబూదాటి రాలేమియిపుడూ ।
సాగరంబూదాటి లంకమార్గంబు । తెలుసుకునిఆకాశ వీధినీబోయి ।
శ్రీరాములాసతికి శ్రీపుణ్యవతికి । అన్నముద్రికనీవు ఆనవాలిచ్చి ।
ఆపతివ్రితసీత నడిగితి ననుమి । అసురులకు లయకాల మొచ్చెనూయనుమి ।
మదిలోనరాఘవుని మరువకూమనుమి । హారామహారామ యనుచుయేప్రొద్దు ।
పలువరించుచునుండు మాపణతిసుమ్మీ । రమణివెదుకంగజల రాసియూదాటి ।
లంకపట్నముజొచ్చి కపికులోత్తముడు । మేడలూమహళ్లు దివ్యభవనములూ ।
అక్కడిక్కడఅనక యెల్లస్థలములనూ । వెదకికానగలేక వనమునకునేగి ।
ఆశోకమూక్రింద నున్నపణతినిజూచి । వృక్షంబుపయినెక్కె శ్రీరామదూత ।
రాముదూతనుజూచి మాట్లాడవెరచి । రావణుమాయనీ రమణితాజంకి ।
మాయకపివచ్చెనని మాట్లాడవెరచె । భామినినీపతికి నేబంటునమ్మా ।
నామాటనిక్కమ్ము నమ్ముసీతమ్మ । అయ్యోధ్యరాములది యానవాలిచ్చె ।
అటుపయినిలక్ష్మణుని దండంబుజెప్పి । ముద్రినిముదిరికా చేతికందిచ్చె ।
దుఃఖజలధినిమునిగి యాజనకకన్య । పలునొవ్వమరదినీ బల్కినమాట ।
యెడలేని దోషాలు వెంటనే దగిలె । అబలయగుసౌమిత్రి నాడినామాట ।
అరమరలేకనూ యనుభవిస్తిని । శిరోమాణిక్యంబు కపికిచ్చియతివ ।
శీఘ్రానరాజుని రమ్మనీజెప్పు । అశోకముక్రింద వున్నదనిజెప్పు ।
రావణునిజంపి రమణిగొంపొమ్ము । జీవంబులేకుండ ఘటమున్నదనుమి ।
అంతటసెలవొంది మర్కటారాజు । వుద్యానవనమెల్ల తాద్రుంచివయిచి ।
అసురపుత్రుండగు నక్షయునిజంపి । లంకగోపురమెక్కి రణగోలజేసి ।
కూర్చుండ యిదినీకు నీతికాదనుచు । కనకస్తంభమునకు కట్టుత్రాళ్లతెచ్చి ।

కట్టిరిరాక్షసులు హనుమంతునపుడు । తననుకట్టినకట్లు తాఁద్రెంచివైచి ।
యెగిరివెళ్ళెనులంక పట్నంబులోకి । రావణుకొలువునకు రయమునజనెను ।
యెవ్వడవురా కోతి నీకింతక్రొవ్వు । యేమిటికొచ్చితివి నాదుపట్నముకు ।
యిట్లనెనురావణుతొ సృష్టీశుదూత । కిష్కింధపాలించు సుగ్రీవరాజు ।
సూర్యవంశజునితో సంధిదగజేసి । వాలినితాజంపి పణతిగన్గొనను ।
ననుబంపెలంకకూ యాకపీరాజు । వనచరునిబంటును హనుమంతుడండ్రు ।
శ్రీరాములెవ్వరో యెరిగింపుమనగా । శూర్పణఖకుతా ముక్కుచెవులునుగోసె ।
ఖరదూషణాదులను క్షణమునసుద్రుంచె । మారీచునరగడియ మర్దనముజేసె ।
అట్టిరామునిబంటు అతిపరాక్రముడ । సీతనుదెచ్చుటా నీతిగాదూర ।
దొరవనిపించుకుని దొంగతనమేల । రాజువనిపించుకుని యీరవ్వయేల ।
భూలోకమాతనూ యిచ్చిశరణొందు । యీకున్న సతిసుతుల గోడజచ్చెదవు ।
కపిపల్కుమాటలకు దనుజపతియంత । అతికాయమహాకాయ యాఖడ్గరోమ ।
వృచ్చికరోమసర్పరోమ యాదనుజభటుల । చెచ్చెరబిలిచియూ వనచరేశ్వరుని ।
వాలమ్ముముట్టించి అగ్నిదగిలించి । వనచరేశ్వరునిపుడు వడిగ జంపండి ।
లంకేశుదూతలూ పొంకముతొబోయి । నారచీరెలుమంచి పట్టుచీరాలు ।
హంసావళీపట్టు తెల్లచీరలును । జానకీపుట్టంబు వకటి దిగవిడిచి ।
పట్నానగలయన్ని వస్త్రాలుదెచ్చి । తిలతైలమొకనూరుకోట్ల భాండములు ।
వస్త్రంబులన్నియును నూనెలోముంచి । కోటిదనుజులుకట్టె కోతివాలముకు ।
అగ్నిహోత్రముదెచ్చి అసురులంటించ । పెరిగెనుహనుమన్న యొకకొండపొడుగు
పావకునిబొగడుచూ కేళించుచూను । వాయుదేవుండపుడు చల్లంగవిసర ।
మేడలుమిద్దెలూ దివ్యసౌధములూ । ఆలయములంగళ్ళు అన్నిఅంటించె ।
గజాశ్వశాలలూ రథశాలలూను । కొలువుకూటంబులు రచ్చసావళ్ళు ।
అంటించిపట్నంబు గగ్గోలుపుచ్చె । కుడువకపెట్టకా కూర్చినాసొమ్ము ।
భూమికర్పితమనీ పల్కేటివారు । ఆపులనువేదముగ విప్పేటివారు ।
బాలురువృద్ధులూ పరుగెత్తువారు । లయకాలమొచ్చింది యాదనుజకులము ।
యేలసీతనుదెచ్చి యీలంకనుంచె । దనుజేశునకుయేల పుట్టెదుర్బుద్ధి ।
అనిసతిపతులునూ హడలిదుఃఖించె । రామచంద్రులనంత దలచివాయుజుడు ।
వాలంబువేడికిని దానోర్వలేక । సాగరంబునముంచె యాకపీశోక ।
కిన్నరకింపురుష యక్షదేవతలు । చూచుచుండగజొచ్చె సుగ్రీవువనము ।
చూరబుచ్చెను వనము యాహనుమన్న । ఆరగించెనుమంచి ఫలరసంబూలు ।

దూతలు యెరిగించెదశరధేశునకు । సంతోషమునవచ్చె స్వామిరాఘవులు ।
వాయుసుతుడంతట వందనముజేసి । వనితమాణిక్యంబు మనుజపతికిచ్చె ।
నక్షయకుమారాది యసురులజంపి । లంకాపురమునంత భస్మంబుజేసి ।
పట్నముకుపడమరా ఆశోకనీడ । చిన్నబోయినట్టి సీతనుగంటి ।
దనుజకాంతలమధ్య ధరణిజనుగంటి । సూర్యసుతుడునుఅంత యింద్రుమనమడును
నీలుండునలుడునూ గంధమాధనుడు । జాంబవంతుండూను సుషేణుడూను ।
వారధిగట్టిరీ సేనలునడువ । లక్షగుర్రంబులూ లక్షయేనుగులు ।
అక్షయమయినట్టి కోతిమూకలతో । రామలక్ష్మణులపుడు రయముతోనేగి ।
రావణాధీశుల దగ్ధంబుజేసి । చెరలనున్నట్టియా సురలవిడిపించె ।
జానకినిదెమ్మనెను సర్వేశ్వరుండు । ఆసీతదెమ్మనెను మరదిలక్ష్మన్న ।
అంతటరాముడు తమ్మునిబిలిచీ । అగ్నిగుండము జోరమనిపల్కె ।
ఘోరవనములకు హనుమంతుడేగి । మద్దులుమారేళ్ళు చింతమ్రాకులు ।
గుగ్గిలపుతరువులు గురివిందచెట్లు । గంధపుతరువులు మర్రిమ్రాకులు ।
తెచ్చివాయుసుతు డగ్గినిజేసె । భగభగమండగ యాభూపుత్రి ।
గంగస్నానం బొప్పుగజేసి । రామునిపతిగా మనసునదలచీ ।
గుండముజొచ్చెను జానకిదేవి । పాలసాగరమున సతియున్నట్లు ।
చల్లనగలిగెను సరసిజాక్షికీ । స్వర్గముునుంచి దశరధుడొచ్చీ ।
అవనిజయేదని అడిగెనురాము । పోయినధనము వెదుకగనేలా ।
కాలినసీతా మనకుదొరుకునా । అనిచింతించి తండ్రితోబల్కె ।
అగ్ని హోత్రుండందిచ్చెజానకిని । పణత్తినితొడపయి నుంచెవిష్ణుడునూ ।
వైదేహినిదెమ్మనె మరదిలక్ష్మన్నా । సాగరముదాటి సరగునవచ్చీ ।
అందరుగూడీ రధము యెక్కిరీ । యిదిసుమీజటాయువుమడిసినాచోటు ।
కుటిలకుంతలియేగ గుర్తెరుగనంటి । నీవుపోయినత్రోవలోపక్షిరాజు ।
వృత్తాంతమంతయును వివరముగ దెల్పి । ప్రాణంబులూ విడిచెనాపక్షిరాజు ।
పుత్త్రక్రియ జేసిగౌతమిని కల్పి । పర్ణశాలాచోటుపణతినీవుజోడు ।
పాచికలువేసిమనమాడినాచోటు । నాతినీవుబోయినాయాపదీనెలలు ।
పదియుగములాయెనే పద్మాయతాక్షీ । యేడుగడియాలాయెకారడవిదిరుగ ।
అనుజుతమ్ముడయిన శ్రీలక్ష్మన్న । తమ్ముడుగాడుసుమి తండ్రిగాదలచు ।
వచ్చెరాఘవులనువనచరులచేత । అచ్చుగాయియీవార్తభరతుకంపారె ।
వెళ్ళెనుహనుమన్న నందిగ్రామముకు । వచ్చెను మీయన్న వానరులతోడ ।

అయోధ్యపట్నముకుమిమ్ము దెమ్మనెను । పాదుకలుచేబూని భరతుడంతటను ।
యేగెను శీఘ్రమున అన్నసన్నిధికి । రామలక్ష్మణులంత అయోధ్యకేగి ।
భటులను వానరులవాకిటానుంచి । అంతిపురికేగియూతల్లులనుజూచి ।
తండ్రి మరణమువిని తల్లడించుచును । చిన్నముఖముతోబోయి చింతతోనున్న ।
తనయులచేరదీసితాగారవించి । పాలనునేతసూనేత్రములుదుడిచి ।
జనకజచెరయుంటరావణునియింట । దనుజుమర్దించుట తరలాక్షిదెల్ప ।
వినియుదగశోకించి వనితనోదార్చి । అందరుచేరియూ క్షేమాననుండ ।
పట్నంబురామునకు కట్టంగదలచి । రంభపూర్వశి మేనకలు నాట్యమాడ ।
కిన్నెరకింపురుషయక్షులూబాడ । భేరీమృదంగములు భోరుకొల్పగను ।
వశిష్ఠజాబాలిఅదితిమునులాది । వచ్చియాశీర్వాదములు హెచ్చుగాశాయ ।
విజయభూపాలుడు సింహాసనంబెక్కి । ముగ్గురితమ్ములతో ముదమొప్పగాను ।
కోసలదేశంబుతానేలుచుండె ॥

---

# శాంత గోవింద నామములు

పాలసముద్రంమీద గోవిందరామ । భద్రాద్రీశయనూ గోవిందా । శేషపానుపుమీద గోవింద రామ । లక్ష్మీతోపవళించె గోవిందా । ఆదిలక్ష్మీదేవి గోవిందరామ । శిరసు చక్కగబెట్టె గోవిందా । హస్తములు బట్టెను గోవిందరామ । పాదములు బట్టెను గోవిందా । రావణుని చెఱలన్ని గోవిందరామ । చెఱలొచ్చివున్నవని గోవిందా । అష్టదిక్పాలకులు గోవిందరామ । ఆదిదేవతలెల్ల గోవిందా । విష్ణుతో చెప్పిరి గోవిందరామ । చెరలనుభవించియు గోవిందా । వారి, చెరలు విడిపింతురని గోవిందరామ । మేటి పట్టపుచేడె గోవిందా । నీకు యీబుద్ధితోచెనా గోవిందరామ । మనభర్తలూవారు గోవిందా । మరిక్లేశపడుతారు గోవిందరామ । మననామ మేగాని గోవిందా । మారునామ మెత్తరు గోవిందరామ । గర్భనరకంమీకు గోవిందా । యేదైవంబ్రావానెనో గోవిందరామ । భూమిమీదపుడుదురు గోవిందా । భూమిమీద పెరుగుదురు గోవిందరామ । జనకునింటాబుట్టి గోవిందా । జాతకంబ్రాయింతు గోవిందరామ । మరిపన్నెండేండ్లకు గోవిందా । మిమ్ములగలయుదు గోవిందరామ । హరిచేతనెలవంది గోవిందా । ఆదిలక్ష్మిదేవి గోవిందరామ । అంతఃపురమువెడలి గోవిందా । తామర కొలనులో గోవిందరామ । తానుమజ్జనమాడి గోవిందా । కన్నతల్లిమైన గోవిందరామ । కమలములోప్రవేశించె గోవిందా । చూడరెండూకండ్లు గోవిందరామ । సుదతులకుచాలవు గోవిందా । అంతటరావణుడు గోవిందరామ । నవకోటిలింగములు గోవిందా । కొమరొప్ప పూజించిగోవిందరామ । అప్పుడు రావణుడు గోవిందా । సేవకులబిలిపించి గోవిందరామ । పుష్పములు తెమ్మనెను గోవిందా । రాక్షసులుయేగిరీ గోవిందరామ । కొలనులోపల జొచ్చి గోవిందా , పువ్వులగోసిరీ గోవిందరామ । యెక్కడీనరులయ్య గోవిందా । నాసరసు ముట్టారు గోవిందరామ । మీలంకలోజొచ్చి గోవిందా । మిమ్ముసాధింతును గోవిందరామ । రక్కసులు భీతులయి గోవిందా । రావణునితోచెప్ప గోవిందరామ । రావణుండు వినియు గోవిందా । నౌకర్లనదిలించె గోవిందరామ । పసిడిసెజ్జబట్టి గోవిందా । సరసుకు తావచ్చె గోవిందరామ । సుమములుకోసె గోవిందా । యెక్కడీ నరుడవుర గోవిందరామ । నాసరసు ముట్టితివి గోవిందా । నిన్నునీబలగముతో గోవిందరామ । తెగటార్తుననిపల్కె గోవిందా । రావణుడుభీతిల్లి గోవిందరామ । భూమివంకజూచె గోవిందా । ఆకాశముచూచె గోవింద రామ । యిదియేమి యక్షిణో గోవిందా । నాకుప్రత్యక్షమయి గోవిందరామ । నాతోను బలికింది గోవిందా । బరువాయె చేతులకు గోవిందరామ । బాహువులు లేవవూ గోవిందా ।

శోధించిచూడుమని గోవిందరామ । సతికినందిచ్చెను గోవిందా । శోధించి చూచితె గోవిందరామ । ఒకబాల కనుపించె గోవిందా । కనిపెంచనిబాల గోవిందరామ । కన్నులకు అగుపడెను గోవిందా । చేడెను పెంచిరి గోవిందరామ । జాతకంవ్రాయించె గోవిందా । మండోదరుపొంగి గోవిందరామ । రావణునితోజెప్పి గోవిందా । దశకంధరుడువచ్చి గోవిందరామ । కన్యకనుజూచెను గోవిందా । ఆబాలనూనాకు గోవిందరామ । రెండవ భార్యగా గోవిందా । పెండ్లిచేయుమనెను గోవిందరామ । మండోదరిదేవి గోవిందా । అదరిపడితానుండె గోవిందా । సురరాజసభకేగి గోవిందరామ । విప్రులను బిలిపింప గోవిందా । వచ్చిరివిప్రులు గోవిందరామ । తివాసులుబరచిరి గోవిందా । బ్రాహ్మణులు కూర్చుండ్రి గోవిందరామ । పంచాంగములుచూచిరి గోవిందా । లగ్నములుగట్టిరీ గోవింద రామ । వ్రేళ్లముడిచీవారు గోవిందా । ఒకప్రశ్నచూచిరి గోవిందరామ । అష్టమిశనివారం గోవిందా । అయిదుఘడియలు ప్రొద్దెక్కె గోవిందరామ । చిత్తనక్షత్రమున గోవిందా । సీతపుట్టినదినము గోవిందరామ । విచ్ఛిత్తుఅయిపోను గోవిందా । చిన్నమెత్తునిలువదు గోవిందరామ । రాక్షసారాజొచ్చి గోవిందా । కనకరాసులుపంచె గోవిందరామ । తరుణి నేనిపుడు గోవిందా । కల్యాణమందుదును గోవిందరామ । అతివయుచ్చటనుంటె గోవిందా । మీలంకపాడగును గోవిందరామ । అతివనుముట్టిన గోవిందా । ఆఘడియశిరసుపగులు గోవిందరామ । జనకునియింటను గోవిందా । చెలియపెరుగావలెను గోవిందరామ । అతివ పుట్టినవెనుక గోవిందా । మరిముగ్గురుపుడుదురు గోవిందరామ । ఆదివిష్ణునిసతి గోవిందా । అవుతారమెత్తింది గోవిందరామ । అపుడుమండోదరి గోవిందా । విభీషణునిబిలిచి గోవింద రామ । మరదితోజెప్పెను గోవిందా । ఆదివిష్ణునిసతీ గోవిందరామ । అవుతారమెత్తింది గోవిందా । లంకవూడుపగును గోవిందరామ । రామసతి పుట్టింది గోవిందా । మనలంక పోగొట్ట గోవిందరామ । మహాలక్ష్మిపుట్టింది గోవిందా । మంపసంతెప్పించి గోవిందరామ, పట్టుచీరలుదెచ్చి గోవిందా । పక్కనుబరచిరీ గోవిందరామ । పండ్లుపంచదార గోవిందా, పసిబాలకిచ్చిరీ గోవిందరామ । ధూపములుదీపములు గోవిందా । నయివేద్యములుయిచ్చె గోవిందరామ । తల్లికిసమర్పించి గోవిందా । బాలనుమెత్తుకొని గోవిందరామ । పవళించ బెట్టిరీ గోవిందా । మండోదరిదేవి గోవిందరామ । చేతులెత్తిమ్రొక్కె గోవిందా । వెఱ్ఱిరావ ణుడుసుమీ గోవిందరామ । సుతునివలెజూడుమనె గోవిందా । చల్లగారక్షించు గోవింద రామ । లంకరక్షించుమీ గోవిందా । అంతటావిప్రులు గోవిందరామ । వికవికను నవ్విరి గోవిందా । లంకరక్షించు గోవిందరామ । పన్నెండుయేండ్లకును గోవిందా । మగుడివచ్చును లక్ష్మి గోవిందరామ । తాళములువేసిరి గోవిందా । సముద్రమువిడిచిరీ గోవిందరామ । సముద్రుడు మూడేండ్లు గోవిందా । చక్కంగపెంచెను గోవిందరామ । తనకుబరువైనట్లు

గోవిందా । పాలసముద్రునికిచ్చె గోవిందరామ । మూడునెలలూఅతను గోవిందా। భామినిపెంచెను గోవిందరామ। పాలసముద్రుండంత గోవిందా। ఆదిశేషునికిచ్చె గోవింద రామ ।ఆదిశేషుడునంత గోవిందా। అందముగపెంచెను గోవిందరామ । తనకు బరువైనట్లు గోవిందా। భూమిదేవికినిచ్చె గోవిందరామ। భూదేవి పన్నెండేడ్లు గోవిందా। యిసుకతిన్నెను వుంచె గోవిందరామ। గురుపుత్రుడనునొకడు గోవిందా। గుణములు గలవాడు గోవిందరామ। తల్లితండ్రినిదాను గోవిందా। కావిళ్ళనుంచుకొనిగోవిందరామ। వనములనుత్రిప్పుచుగోవిందా। ఫలములుబెట్టుచు గోవిందరామ। అరణ్యమధ్యకుచేరి గోవిందా। అంతటావృద్ధులకుగోవింద రామ। దాహంబులాయె గోవిందా। అనపకాయ బుఱ్ఱలో గోవిందరామ। వుదకంబుముంచగా గోవిందా। బుడబుడమనగాను గోవిందరామ । యేమిటోజంతువని గోవిందా। దశరథుడు బాణంబేసెగోవిందరామ। యెవ్వడోనరుడిపుడుగోవిందా। ప్రాణములుతీసెనుగోవిందరామ। నాతల్లిదండ్రులకు గోవిందా । నేనొక్కతనయుడని గోవిందరామ । కండ్లయిన లేనట్టి గోవిందా। కబోదులూవారు గోవిందరామ। తండ్రిదాహముగొని గోవిందా । తీర్పగా లేనైతి గోవిందరామ। మాతల్లి దాహము గోవిందా। మీరుతీర్చండయ్య గోవిందరామ। శాపంబులిత్తురు గోవిందా। అనుభవించుమని గోవిందరామ। సుమంతుండు శోకించె గోవిందా। మహారాజుశోకించె గోవిందరామ। యింతపాపపువేట గోవిందా। యెన్నడూ నే నెరుగ గోవిందరామ। బాణంబుతీయుమన గోవిందా। దశరథుడు తీసినను గోవిందరామ। సుమంతుడుత్రెళ్లె గోవిందా । బుఱ్ఱతోటినీళ్ళు గోవిందరామ। రాజుచేతాబెట్టి గోవిందా। మాట్లాడకుండాను గోవిందరామ । దాహములుయిచ్చాడు గోవిందా । చేతనూతడివిరి గోవిందరామ। పుత్రుడూకాడనిరి గోవిందా। హారములు పతకములు గోవిందరామ। అధిక ముగనున్నవి గోవిందా। నీవెవ్వరోజెప్పు గోవిందరామ। సుతుడుయేమాయెనవ గోవిందా। వేటమృగమువేస్తి గోవిందరామ। సుతుడీల్గెననిచెప్పె గోవిందా। నీవెవ్వరిని యడిగె గోవిందరామ। దశరథరాజనెను గోవిందా । ముదుసళులు శోకింప గోవిందరామ। యినకులుడువేడెను గోవిందా। రాజ్యమంతాయిత్తు గోవింద రామ। రమణులయిస్తును గోవిందా। మిమ్ములయిద్దరిని గోవిందరామ। కావిళ్లనుంచుకొని గోవిందా । వనములు త్రిప్పుచు గోవిందరామ। ఫలములుకోసిస్తు గోవిందా। అయోధ్యపట్నానికి గోవిందరామ। వెంటబెట్టుకపోదు గోవిందా। యెందరు అయినాను గోవిందరామ। మాకుసుతులగుదురా గోవిందా। ఆదినారాయణుడు గోవిందరామ । నీగర్భమునబుట్ట గోవిందా । హాపుత్రి పుత్రాయని గోవిందరామ । ప్రాణంబువిడుతువని గోవిందా । భూసురులు శాపంబిచ్చిగోవిందరామ। ప్రాణాదులువదిలిరీగోవిందా। దశరథుడంతటగోవిందరామ। నమ స్కారములుజేసి గోవిందా। అయోధ్యకూవెళ్లె గోవిందరామ। ఢంకానౌబోతులు గోవిందా।

భేరీమృదంగములు గోవిందరామ । రథగజతురగములు గోవిందా । యక్షగంధర్వులూ
గోవిందరామ । యెదురుగారాగాను గోవిందా । అవతలికిబంపించి గోవిందరామ । చిన్నబు
చ్చుకరా గోవిందా । అంతిపురికేతెంచి గోవిందరామ । దేవికౌసల్యతో గోవిందా । కడువేగ
మేజెప్పె గోవిందరామ । మాకువెల్తులులేవు గోవిందా । బాలుడులేనివెల్తి గోవిందరామ ।
చంకబాలనుచూచి గోవిందా । చిన్నబోయెనురాజు గోవిందరామ । చిన్నబోయిరాజు గోవిందా ।
చాపపైపవళించె గోవిందరామ । కౌసల్యమహాదేవి గోవిందా । పతికిపాదములొత్తె
గోవిందరామ । సుమిత్రమహాదేవి గోవిందా । సురటీలువేసెను గోవిందరామ । అంతట
మహరాజు గోవిందా । కౌసల్యతోబల్కె గోవిందరామ । యెన్నిరాజ్యములయిన గోవిందా ।
యేలితినేనయిన గోవిందరామ । యెన్నిదేశములయిన గోవిందా । చూచితిని నేనయిన
గోవిందరామ । పుత్రులూలేనట్టి గోవిందా । పుట్టుదరిద్రునయితి గోవిందరామ । పుత్రులుద్భ
వించ గోవిందా । పుట్టగతిచూపించు గోవిందరామ । అప్పుడుకౌసల్య గోవిందా । మహారాజు
కిట్లనె గోవిందరామ । పుత్తరపుభూమిని గోవిందా । ఋషివర్యుడున్నాడు గోవిందరామ ।
అచటకీచనుదెన్తె గోవిందా । పుత్రులుకల్గుదురు గోవిందరామ । పుణ్యులము అవుతాము
గోవిందా । అంతట మహారాజు గోవిందరామ । పుత్తరభూమికేగె గోవిందా । ఋషివరున్ని
చూచి గోవిందరామ । ప్రదక్షిణనమస్కారంజేసె గోవిందా । రాజునుఋషిచూచిగోవిందరామ ।
యెన్నడూరానివారు గోవిందా । రానుకారణమేమిగోవిందరామ । మాకోర్కెలీడేరె గోవిందా ।
మాతపసుపండెను గోవిందరామ । అంతటమహారాజు గోవిందా । ఋషితోనుబల్కెను
గోవిందరామ । యెన్నిరాజ్యములయిన గోవిందా । యేలితినినేనయిన గోవిందరామ ।
యెన్నిదేశములయిన గోవిందా । చూచితినేనయిన గోవిందరామ । పుత్రులులేనట్టి గోవిందా ।
పుట్టుదరిద్రుడైతి గోవిందరామ । పుత్రులుకలుగుటకు గోవిందా । పుట్టగతిచూడమనె
గోవిందరామ । దక్షిణభాగమందు గోవిందా । రాజఋషివున్నాడు గోవిందరామ । అచ్చటికి
యేగితే గోవిందా । పుత్రులుగలుగుదురు గోవిందరామ । పుణ్యాత్ములవుతారు గోవిందా ।
అరువైఅరువదివేల గోవిందరామ । సంవత్సరములకచ్చటా గోవిందా । లేకలేకావార్కి
గోవిందరామ । ఒకకన్య జన్మించు గోవిందా । ఆబాలనూ పెంచితె గోవిందరామ । మీకు
సుతులూకలుగు గోవిందా । యిత్తురో యివ్వరో గోవిందరామ । సంశయముగాబల్కె
గోవిందా । మీవంటివారికి గోవిందరామ । తప్పకాయిత్తురనె గోవిందా । ఆడవారి
తోను గోవిందరామ । అతి వేగమెళ్ళండి గోవిందా । అంతటదశరథుడు గోవిందరామ
అయ్యోధ్యచేరెనుగోవిందా । కౌసల్యసుమిత్ర గోవిందరామ । పతికియెదురుగవచ్చి గోవిందా ।
పాదంబులుకడిగి గోవిందరామ । సింహాసనంవేసి గోవిందా । క్షేమవార్తలుఅడుగ
గోవిందరామ । సతులారమీకిపుడు గోవిందా । సమ్మతమాయెనా గోవిందరామ ।

మాకుసమ్మతమనిరి గోవిందా । అంతటమహరాజు గోవిందరామ । కైకనగరుకుజేరి గోవిందా । కైకతోతాజెప్పె గోవిందరామ । అతివరోవింటివా గోవిందా । యాదినమందునా గోవిందరామ । వసిష్ఠవాల్మీకులు గోవిందా । గౌతమ జమదగ్ని గోవిందరామ । అత్రికశ్యాపులు గోవిందా । మహఋషులుచెప్పారు గోవిందరామ । దక్షిణాదిశయందు గోవిందా । రాజఋషివున్నాడు గోవిందరామ । అచ్చటికి చనుదెస్తె గోవిందా । మనకుపుత్రులు కలుగుదురు గోవిందరామ । పుణ్యులముఅవుదుమనె గోవిందా । పతిమాటవినికైక గోవిందరామ । అదరిపడితానుండె గోవిందా । అక్కకౌసల్యనగ గోవిందరామ । అతిపరాక్రమశాలి గోవిందా । కోరికొడుకులగంటె గోవిందరామ । గొడ్రాలనయివుందు గోవిందా । అదలించి రాజును గోవిందరామ । అవతలికి తాబంపె గోవిందా । చిన్నబుచ్చుకరాజు గోవిందరామ । నగరిలోకేతెంచి గోవిందా । రాజుతోకౌసల్య గోవిందరామ । ఆరశ్శబెట్టకుడి గోవిందా । అతివను మీరిపుడు గోవిందరామ । బుజ్జగించిచేరి గోవిందా । ముద్దుగాఅడగండి గోవిందరామ । వసిష్ఠగౌతముని గోవిందా । కైకనగరుకువచ్చె గోవిందరామ । అడిగినధనమిత్తు గోవిందా । అతివరోనీకిపుడు గోవిందరామ । కోరినాధనమిత్తు గోవిందా । కోమలి నీకిపుడు గోవిందరామ । ఒక్కరికయినాను గోవిందా । పుత్రులుపుడితేను గోవిందరామ । రాజ్యమునకధిపతులు గోవిందా । రాజులు అవుతారు గోవిందరామ । నన్ను ముట్టగరాకు గోవిందా । నాథుడా నీవిపుడు గోవిందరామ । నన్ను అంటగరాకు గోవిందా । ప్రాణనాథాయనె గోవిందరామ । వసిష్ఠగౌతములు గోవిందా । వెకవెకనవ్విరి గోవిందరామ । చిన్నబుచ్చగ రాజు గోవిందా । తననగరుకేతెంచె గోవిందరామ । నాకువశమూకాదు గోవిందా । నల్లరాయిఅది గోవిందరామ । పాషాణమనిపల్కె గోవిందా । రాజుచేసిన పుణ్యం గోవిందరామ । వ్రాతఫలమిట్టుండె గోవిందా । మగువచేసిన పుణ్యం గోవిందరామ । మఱియు మంచిదిఅనెను గోవిందా । అప్పుడు కౌసల్య గోవిందరామ । కైకనగరుకువచ్చె గోవిందా । చెల్లెలారమ్మనె గోవిందరామ । ముద్దుగుమ్మారావె గోవిందా । మూడవభార్యరమ్మనె గోవిందరామ । అక్కమాటలువిని గోవిందా । కైకతామండిపడి గోవిందరామ । అక్కరో కౌసల్య గోవిందా । అతిపరాక్రమశాలి గోవిందరామ । కోరికొడుకులగంటె గోవిందా । గొడ్రాలనయివుందు గోవిందరామ । పట్టమునీవేలు గోవిందా । బానిసనుఅయివుందు గోవిందరామ । ఆదరించికౌసల్య గోవిందా । అవుతలికి పంపించె గోవిందరామ । రాజు చేసిన పుణ్యం గోవిందా । వ్రాతఫలమిట్లుండె గోవిందరామ । తన నగరు కేతెంచె గోవిందా । పతితోడతాజెప్పి గోవిందరామ । మాట మాటలు గలది గోవిందా । సుమిత్రను బంపుమనె గోవిందరామ । అప్పుడు సుమిత్రి గోవిందా । కైకదగ్గరకొచ్చి గోవిందరామ । రమణినిరమ్మని గోవిందా । రహస్యముగజెప్పె గోవిందరామ । సుమిత్ర

చెప్పగా గోవిందా । సుదతిసమ్మతించె గోవిందరామ । మంథరతోకూడ గోవిందా । తరలి వత్తుననెను గోవిందరామ । రాజుమావాడమ్మ గోవిందా । లక్ష్మీదేవిసుమ్మి గోవిందరామ । రాజుతోకూడాను గోవిందా । రథము మీరెక్కండి గోవిందరామ । కాలినడతను మేము గోవిందా । కదలివస్తామమ్మ గోవిందరామ । కాంతలారమీరు గోవిందా । కాలినడతనువ స్తె గోవిందరామ । గడియలోవత్తునని గోవిందా । కైకప్రయాణమాయె గోవిందరామ । సుదతివొప్పెనని గోవిందా । సుమిత్రజెప్పెను గోవిందరామ । కౌసల్యతోజెప్పె గోవిందా । కైకమహాదేవికి గోవిందరామ । యేమిబుద్ధిపుట్టునని గోవిందా । అప్పుడు కౌసల్య గోవింద రామ । పనివార్లబిల్పించి గోవిందా । రథముతెప్పించుమనె గోవిందరామ । ముత్యాల చేరులు గోవిందా । పగడాలకుచ్చులు గోవిందరామ । నీలాలతోరణం గోవిందా । వజ్రములు దాపించె గోవిందరామ । రథమునుతెచ్చిరి గోవిందా । కౌసల్య కెరిగించె గోవిందరామ । కైకనుబిలిపించె గోవిందా । రాజునప్పగించె గోవిందరామ । అప్పుడు కౌసల్య గోవిందా , పనివార్ల బిలిపించి గోవిందరామ । చాటించుమనిజెప్పె గోవిందా । పట్టపాలకుండ గోవింద రామ । పదికోట్ల రమ్మనిరి గోవిందా । ముట్టజాలకుండ గోవిందరామ । మూడుకోట్ల రమ్మనిరి గోవిందా । తలకడిగిరమ్మనిరి గోవిందరామ । పసుపునూనెలుపోసి గోవిందా । ముట్టజాలకుండ గోవిందరామ । మూడువేలొచ్చిరి గోవిందా । పట్టజాలకుండ గోవిందరామ , పదివేలు వచ్చిరి గోవిందా । పట్టపేనుగుదెచ్చి గోవిందరామ । హౌదానువేసిరి గోవిందా । ఖమిడికవచంపరచె గోవిందరామ । గుఱ్ఱములు తెప్పించిరి గోవిందా । ఖమిడిపల్లంవేసె గోవిందరామ । రాజును కైకమ్మ గోవిందా । దంపతులు రథమెక్కె గోవిందరామ । జయభేరివేసిరి గోవిందా । జగమెల్ల మ్రోగెను గోవిందరామ । ధనరాసులుతెచ్చి గోవిందా । కౌసల్యతాబట్టె గోవిందరామ । పసుపు కుంకుమపళ్ళు గోవిందా । సుమిత్రతాబట్టె గోవింద రామ । అనసూయరుంధతి గోవిందా । అహల్యఛాయయును గోవిందరామ । ముత్తయిదు వులు వచ్చె గోవిందా । రామచిలుకలురెండు గోవిందరామ । ప్రేమతోయెదురయ్యె గోవిందా , వేశ్యస్త్రీలువచ్చె గోవిందరామ । సురభాండములువచ్చె గోవిందా । గరుత్మంతుడువచ్చె గోవిందరామ । శకునంబు తీర్చెను గోవిందా । మంచివి శకునాలు గోవిందరామ । మళ్ల వద్దు పైనం గోవిందా । అందలములూయెక్కి గోవిందరామ । అంచంచ నిజలీల గోవిందా । పన్నెండు గడియలకు గోవిందరామ । పట్నంబు బయలుదేరె గోవిందా । అప్పుడుకౌసల్య గోవిందరామ । సుమిత్రతోబల్కె గోవిందా । రాజపత్నులంకాము గోవిందరామ । కైకదాసీలమనె గోవిందా । అప్పుడు సుమిత్రి గోవిందరామ । అక్కకు యిట్లనెను గోవిందా । మంథరాతోకూడ గోవిందరామ । ముగ్గురుబానిసలు గోవిందా । అప్పుడుకైకమ్మ గోవిందరామ । రాజుతో బల్కెను గోవిందా । సవతులయిద్దరు గోవింద

రామ । అందలము లెక్కిరి గోవిందా । జోడుపల్లాకీలు గోవిందరామ । జాడలుతీయించె గోవిందా । అప్పుడు దశరథుడు గోవిందరామ । భార్యతో యిట్లనెను గోవిందా । యింత రావణుతోను గోవిందరామ । యింతులు నడచితే గోవిందా । నీకు సమ్మతమైన గోవిందరామ । సమ్మతిగానుంటె గోవిందా । అయోధ్యయేలించు గోవిందరామ । అప్పుడు మహరాజు గోవిందా । సతితోడ బల్కెను గోవిందరామ । వసిష్ఠవాల్మీకి గోవిందా । గౌతమా కశ్యపులు గోవిందరామ । యెవ్వరుచెప్పరు గోవిందా । రథములుమళ్లించిరి గోవిందరామ । తేరుచక్రంవిరిగె గోవిందా । అంతటమహరాజు గోవిందరామ । కౌసల్యను జేరిమరి గోవిందా । మనకుహోరులాయె గోవిందరామ । మళ్లినవిపయినాలు గోవిందా । కైకపోరుచేత గోవిందరామ । కార్యమ్ముకాదనిరి గోవిందా । యింతిపోరూతోను గోవింద రామ । యింతినీతేలేము గోవిందా । అయోధ్యరుమనము గోవిందరామ । తిరిగి వెళ్ళితేను గోవిందా । అష్టదరిద్రంవచ్చు గోవిందరామ । అప్పుడు సుమిత్ర గోవిందా । పెనిమిటితో యిట్లనె గోవిందరామ । చెల్లెలుకైకమ్మ గోవిందా । అతిపరాక్రమశాలి గోవిందరామ । మంథరవినకుండ గోవిందా । మనవిచేసి అడగండి గోవిందరామ । అప్పుడు మహరాజు గోవిందా । కైకదగ్గరకేగి గోవిందరామ । మంథరేదనిరాజు గోవిందా । ముద్దియను అడిగెను గోవిందరామ । కోరినాధనమయిన గోవిందా । కోమలీయిత్తుననె గోవిందరామ । పతిమాట వినిసతి గోవిందా । భమిడికలముదెచ్చె గోవిందరామ । బంగారు పట్టామీద గోవిందా । శ్రీకారముపెట్టి గోవిందరామ । రాము వనవాసము గోవిందా । భరతుపట్టంకట్ట గోవిందరామ । పదునాలు గేండ్లనివ్రాసె గోవిందా । కాగితంబుచ్చుకొని గోవిందరామ । ఆకైకమహాదేవి గోవిందా । చిటికెనవ్రేలితో గోవిందరామ । తేరుయెత్తినదయ్యా గోవిందా । రథముతానడిపించిన గోవిందరామ । శాంతపట్నంచేరి గోవిందా । చదురయ్యె కూర్చుండె గోవిందరామ । మునులుఋషులువచ్చిరి గోవిందా । భూపతులువచ్చిరీ గోవిందరామ । రాజు వందనంజేసె గోవిందా । దశావతారులు గోవిందరామ । మీగర్భమునబుట్టు గోవిందా । రాజ్యమున కధిపతులు గోవిందరామ । రాజులయిపుట్టెదరు గోవిందా । నారిదీవనలంది గోవిందరామ । శాంతపట్నంవారు గోవిందా । రాజురాణువజూచి గోవిందరామ । శాంతను యెత్తుకొని గోవిందా । కోకిలాదేవొచ్చె గోవిందరామ । యేరాజ్యమేభూమి గోవిందా । యేమివంశముమీది గోవిందరామ । అర్కవంశంబనె గోవిందా । అయోధ్యరాజనె గోవింద రామ । ముగ్గురుభార్యలతో గోవిందా । రాజ్యముయేలితి గోవిందరామ । నాకుసంతతిలేక గోవిందా । శాంతకొరకువస్తిమి గోవిందరామ । శాంతమ్మనిస్తేను గోవిందా । కొడుకులు పుట్టుదురు గోవిందరామ । మేముపుణ్యులమవుతాము గోవిందా । ఆమాటలువిని గోవింద రామ । గుండెగుబులుమని గోవిందా । మూర్ఛతోమునిగెను గోవిందరామ । మరి మూర్ఛతా

దెలిసి గోవిందా । నన్ను కన్నా తల్లి గోవిందరామ । నిన్నెట్లుయిత్తురు గోవిందా । నిన్ను యిచ్చినేను గోవిందరామ । నిమిషమోర్వగలేను గోవిందా । అదురుచు బెదురుచు గోవింద రామ । తడబడబడుచు గోవిందా । తన నగరుకేతెంచె గోవిందరామ । అప్పుడు మహాముని గోవిందా । తన జపముచాలించె గోవిందరామ । కోకిలాదేవెళ్ళి గోవిందా । ఋషితోనుజెప్పెను గోవిందరామ । అర్కవంశంబని గోవిందా । అయోధ్యరాజని గోవిందరామ । ముగ్గురు సతులతో గోవిందా । పుత్రులులేకను గోవిందరామ । శాంతను యిస్తేను గోవిందా । సంతతి కలుగునట గోవిందరామ । సతి మాటవిని ఋషి గోవిందా । అహంకారులైయుండి గోవింద రామ । ఆడవాళ్ళుమీరు గోవిందా । వొదిగివుండగవలెను గోవిందరామ । ఆశ్రిమంబులోను గోవిందా । దాగివుండుమనె గోవిందరామ । అవతలకుపోనేల గోవిందా । ఆరుట్లు పడనేల గోవిందరామ । శాంతనూదాచండి గోవిందా । దృష్టితీయించండి గోవిందరామ । గవుసెనలు వేయండి గోవిందా । గమిడితియ్యవద్దు గోవిందరామ । ముగ్గురిభార్యలతో గోవిందా । మునియాశ్రమంజేరు గోవిందరామ , మండు వేసవిలోను గోవిందా । యెండబడి వస్తిమి గోవిందరామ । ప్రాణంబుబోయెను గోవిందా । తరువాణిదాహంబు గోవిందరామ । త్వరలోను యియ్యండి గోవిందా । తలుపులుతీసిఋషి గోవిందరామ । కమండలంలోది గోవిందా । గంగబట్టుకవచ్చి గోవిందరామ । దాహంబు యిచ్చెను గోవిందా । పిమ్మట దశరథుడు గోవిందరామ । ఋషిపాదములబడె గోవిందా । యెంతపదవిఅయిన గోవింద రామ । దైవంబు యిచ్చాడు గోవిందా । సంతతిలేదిపుడు గోవిందరామ । పుత్రుసంతతి యిచ్చి గోవిందా । వంశంబునిల్పుమి గోవిందరామ । మీశాంతనిస్తేను గోవిందా । మాకు పుత్రులుగల్గు గోవిందరామ । గుండెగుబులుమని గోవిందా । రాజుతో ఋషిపల్కె గోవింద రామ । అరువదివేలేండ్లకు గోవిందా । ఒకబాల జన్మించె గోవిందరామ । ఆబాలనిచ్చియు గోవిందా । యెట్టుతాళగలను గోవిందరామ । ఆడవారిమనసు గోవిందా । అలవిగాదని పల్కె గోవిందరామ । కౌసల్య సుమిత్ర గోవిందా । ఋషిపాదాలపైబడిరి గోవిందరామ । మమ్ముగన్నతల్లి గోవిందా । మామనవి వినవమ్మ గోవిందరామ । మములక్ష్మివెళ్ళండి గోవిందా । కదలనివ్వరువారు గోవిందరామ । కోకిలాదేవిని గోవిందా । రాజుభార్యలువెదకె గోవిందరామ । రాజురావణువ అంత గోవిందా । పదపదమనుచును గోవిందరామ । కైక దోడుకవచ్చి గోవిందా । ఆశ్రిమమున వుంచె గోవిందరామ । చెట్లచాటునవున్న గోవిందా । తల్లిబిడ్డలజూచి గోవిందరామ । తరుణులిద్దరుమ్రొక్కి గోవిందా । శాంతను యిమ్మని గోవిందరామ । ఋషికాంత నడిగిరి గోవిందా । అరవై వేలేండ్లకు గోవిందరామ । మాకు ఒకబాల పుట్టింది గోవిందా । ఆబాలనుయిచ్చి గోవిందరామ । యెట్లుమేముందుము గోవిందా । కనిగొడ్రాల మవుదుమా గోవిందరామ । కాంతనూమీకిచ్చి గోవిందా । అప్పుడు

సుమిత్ర గోవిందరామ । కోకిలాదేవితో గోవిందా । నలుగురమువోతల్లి గోవిందరామ ।
వక్కగర్భమున పుడితిమి గోవిందా । మీవద్దవుంటేమి గోవిందరామ । మావద్దవుంటేమి
గోవిందా । నలుగురంకూడుకొని గోవిందరామ । అయోధ్యనుండుమూ గోవిందా । అంత
టాఋషిపత్ని గోవిందరామ । పతిదగ్గరకువచ్చి గోవిందా । ఆడవారితోను గోవిందరామ ।
అందరూవచ్చారు గోవిందా । అతివను యివ్వకుంటె గోవిందరామ । భూజనులువొప్పరనె
గోవిందా । ఆమాటలువినిముని గోవిందరామ । అతిరోషముతోబల్కె గోవిందా । అతివ
నిత్తునని గోవిందరామ । అందరితోజెప్పితివా గోవిందా । పతిమాటలువినిసతి గోవిందరామ ।
మరలిఆశ్రమంజేరె గోవిందా । కౌసల్యనుజూచి గోవిందరామ । మగవారి యిష్టమనె
గోవిందా । యిద్దరు మఱివెళ్ళి గోవిందరామ । ఋషిపాదములపడిరి గోవిందా । మౌనికి
దయవచ్చి గోవిందరామ । శాంతనుతాబిలిచి గోవిందా । రాజుచేతిలోవుంచి గోవిందరామ ।
చెయ్యప్పగించె గోవిందా । తల్లినీపూవెళ్లి గోవిందరామ । తమ్ములానెత్తుకొని గోవిందా ।
అయోధ్యపట్టణములో గోవిందరామ । ఆడుపడుచువుగమ్మ గోవిందా । రాజుభార్యల బిలిచి
గోవిందరామ । చెయ్యప్పగించెను గోవిందా । కాయకూరలతోను గోవిందరామ । పిండి
వంటలతోను గోవిందా । పాయసాన్నమును గోవిందరామ । పణతులువడ్డించిరి గోవిందా ।
రాజుపరివారములు గోవిందరామ । మహాపురుషులు గోవిందా । అంతాను ఆరగించీలేచి
గోవిందరామ । హస్తములుకడిగిరి గోవిందా । కర్పూరవిడంజేసిరి గోవిందరామ । కోకిలా
మహాముని గోవిందా । వగవసాగిరివారు గోవిందరామ । పరివారమునంత గోవిందా ।
శాంతవప్పగించె గోవిందరామ । శాంతరేఖలుజూడ గోవిందా । వసిష్ఠుడువచ్చె గోవింద
రామ । అమ్మరమ్మనిపిలువ గోవిందా । అతివనవ్వినవ్వు గోవిందరామ । చంద్రకిరణం
బాయె గోవిందా । అతివనూ బిలిపించి గోవిందరామ । వసిష్ఠుకుజూపించె గోవిందా ।
శంఖచక్రముగలదు గోవిందరామ । కౌసల్యకూతురికి గోవిందా । వెలదివెన్నూలోను
గోవిందరామ । వెనుకచక్రముగలదు గోవిందా । కండ్లసిరియుగలదు గోవిందరామ ।
కౌసల్యతనయకు గోవిందా । అతివవచ్చినవెనుక గోవిందరామ । మరినలుగురు పుడుతారు
గోవిందా । అసురసంధ్యావేళ గోవిందరామ । శుక్రవారముప్రొద్దు గోవిందా । అతివపుట్టిన
దినం గోవిందరామ । అత్తవారింటికిని గోవిందా । అరగడియవుండదనె గోవిందరామ ।
అయిదవవత్సరముకంటె గోవిందా । అతివమీనగరినుండదనె గోవిందరామ । అయిదవ
వత్సరంవచ్చి గోవిందా । తొమ్మిదిరోజులాయె గోవిందరామ । బాలకుమేమిపుడు గోవిందా ।
తొడవులుంచాలేదు గోవిందరామ । పన్నెండులక్షలవి గోవిందా । తొడుగులుచేయించాము
గోవిందా । బాలతొడుగులులిచ్చె గోవిందరామ । పచ్చలపతకమిచ్చె గోవిందా । శాంత
కళ్యాణముకు గోవిందరామ । యింద్రనీలపుమణిని గోవిందా । చంద్రశాలువయిచ్చె

గోవిందరామ । కెంపులఅక్షంతలను గోవిందా । ఛమిడిపేళ్లాగంప గోవిందరామ । బంగార ఛాషికం గోవిందా । నవరత్నపళ్లెంబు గోవిందరామ । మధుపర్కములుయిచ్చె గోవిందా । మంగళసూత్రము గోవిందరామ । యేడువారపుసొమ్ము గోవిందా । వుత్తరజంద్యంబు గోవిందరామ । అల్లునికి అరణాలు గోవిందా । ఆరులక్షలుయిచ్చె గోవిందరామ । పట్టపు యేనుగును గోవిందా । మీరుమాబాలకు యివ్వమనె గోవిందరామ । యంతసొమ్మిస్తిని గోవిందా । యింతినిమీకిస్తి గోవిందరామ । కన్యదానంబాయె గోవిందా । మాకుప్రాప్తంబు లేదాయె గోవిందరామ । మాగోత్రనామముతో గోవిందా । కన్యదానంబుచేయుడి గోవింద రామ । అప్పుడుకౌసల్య గోవిందా । దశరథుతొపల్కెను గోవిందరామ । యింతసొమ్మిచ్చారు గోవిందా । యింతినీయిచ్చారు గోవిందరామ । దానికిమనమేమి గోవిందా । యివ్వవలెనని పల్కె గోవిందరామ । అప్పుడుమహారాజు గోవిందా । కౌసల్యకిట్లనెను గోవిందరామ । కోకిలాదేవొక్క గోవిందా । కాలిమెట్టెలవిలువ గోవిందరాము । మనరాజ్యమున్నదా గోవిందా । పళ్ళెంబుధనంత్రవ్వి గోవిందరామ । పట్టుచీరలువుంచి గోవిందా । కౌసల్యచేనందు గోవిందరామ । దేవికివ్వగరాగ గోవిందా । నరమాంసమమ్మము గోవిందరామ । నాతిరో నీకిపుడు గోవిందా । కోరిభిక్షంబెట్టు గోవిందరామ । కొంగుపట్టెనుశాంత గోవిందా । పుత్రభిక్షంబెట్టుమని గోవిందరామ । పుత్రికనుఅడిగితిరి గోవిందా । పుత్రికను యిస్తిమి గోవిందరామ । పచ్చిబాలింతవు గోవిందా । వడిబియ్యముకడుదు గోవిందరామ । మహా మునినగరిలో గోవిందా । కనకపీటలువేసి గోవిందరామ । పట్నపుదేవులను గోవిందా । యిద్దరినిపిలిపించి గోవిందరామ । పట్టుకట్టు కట్టించి గోవిందా । శాంతనుబిలిపించి గోవింద రామ । కౌసల్యకప్పగించి గోవిందా । వడిబియ్యమువెరచి గోవిందరామ । వచ్చిబాలింతలు గోవిందా । పచ్చనక్షింతలు గోవిందరామ । పందిళ్లచల్లండి గోవిందా । నవ్వుచు కౌసల్య గోవిందరామ । పందిళ్ల చల్లింది గోవిందా । అప్పుడుదశరథుడు గోవిందరామ । కౌసల్యతో బల్కె గోవిందా । యింతచక్కనిచేడె గోవిందరామ । యీజగములోలేదనెను గోవిందా । యెవ్వరికియిత్తునని గోవిందరామ । ఆలోచించెనురాజు గోవిందా । శుభముహూర్తమువారు గోవిందరామ । ఋషియుచూడంగానె గోవిందా । పట్టపేనుగుదెచ్చి గోవిందరామ । హౌదానువేయించి గోవిందా । ఛమిడిపంచపరచి గోవిందరామ । శాంతతోడుకవచ్చి గోవిందా । అంబారిలోవుంచె గోవిందరామ । జయభేరివేసిరి గోవిందా । జగమెల్లమ్రోగెను గోవిందరాము । కోకిలాదేవపుడు గోవిందా । గూతురికిదిగులొందె గోవిందరామ । ఆట ప్రాయమునాడు గోవిందా । ఆటచూడగలేదు గోవిందరామ । పాటప్రాయమునాడుగోవిందా । పాడచూడగలేదు గోవిందరామ । వేకుజామునలేచి గోవిందా । తద్దిపుండాలేదు గోవింద రామ । విత్తజములేకుండ గోవిందా । వకరికివిత్తనంబెడితిని గోవిందరామ । మొక్కలేకుండా

గోవిందా । మొక్కవకరికి యిస్తి గోవిందరామ । వీధిలోవిస్తిరి గోవిందా । ప్రాప్తమాయె నమాకు గోవిందరామ, అప్పుడుమహాముని గోవిందా । తనసతినివోదార్చి గోవిందరామ । పందిళ్ళలో వున్న గోవిందా । కైకమ్మజూపె గోవిందరామ । అద్భుతంబులఋషి గోవిందా । అకైకనుజూచి గోవిందరామ । అమ్మమిమ్ములమరచి గోవిందా । అందరూ యేగిరా గోవిందరామ । కౌమ్మరమ్మనిపిలిచి గోవిందా । శాంతమ్మను చేతికిస్తు గోవిందరామ । క్రుంగి యుప్పొంగేవు గోవిందా । పడబొబ్బలు పెడుతు గోవిందరామ , రాణువానంపెను గోవిందా । కైకయిచ్చటనుండె గోవిందరామ । మరచి వెళ్ళావద్దె గోవిందా । పరజనమునూ అంపి గోవిందరామ । సుమిత్రనుబంపె గోవిందా । కౌసల్యనూబంపె గోవిందరామ । యిద్దరూవెళ్ళపుడు గోవిందా । కైకదోడుకవచ్చె గోవిందరామ । రాజుకప్పాగించె గోవిందా । దంపతులు యిద్దరు గోవిందరామ । మగుడి రథముయెక్కి గోవిందా । సవతులు యిద్దరు గోవిందరామ । అందలములెక్కిరి గోవిందా । పన్నెండుగడియలకు గోవిందరామ । పట్నంబువెడలిరీ గోవిందా । అడుగడుగు మదీలీల గోవిందరామ । మేజువాణీలతో గోవిందా ।

శాంతను తీసుకొని దశరథుడు పురి వెడలుట.

విశేషదూరంబు గోవిందరామ । దాటివచ్చిరివారు గోవిందా । అయోధ్యపట్నముసకు గోవిందరామ । అందరువచ్చిరి గోవిందా । జగమెల్లమ్రోయగా గోవిందరామ । జయభేరి వేయించె గోవిందా । లక్ష్మివచ్చెనాని గోవిందరామ । లక్షభేరిమ్రోగె గోవిందా । కైక రాజుకూడి గోవిందరామ । రథములుడిగ్గిరి గోవిందా । కైకనగరికిజేరె గోవిందరామ , సవతులుయిద్దరు గోవిందా । అందలంబులుదిగిరి గోవిందరామ । దేవిడిముందట గోవిందా , యేనుగనుఆపిరి గోవిందరామ । ముత్యాలహారతులు గోవిందా । ముగుదలుయిచ్చిరి గోవింద రామ । వజ్రాలహారతులు గోవిందా । వారాంగనలుయిచ్చిరి గోవిందరామ । శాంతను యెత్తుకొని గోవిందా । మహరాజుతావచ్చె గోవిందరామ । అయోధ్యఅందరికి గోవిందా । గడపచీరెలుయిచ్చె గోవిందరామ । దశదానములుజేసె గోవిందా । మహారాజునగరిలో గోవిందరామ । కనకపీటలుపరచె గోవిందా । యిద్దరుభార్యలు గోవిందరామ । శాంతను తీసుకవచ్చి గోవిందా । మహరాజుకిచ్చిరీ గోవిందరామ । బంగారుపళ్ళెములు గోవిందా । పాలొప్పబోసిరీ గోవిందరామ । ఆదిలక్ష్మిశాంతని గోవిందా । నామకరణంవ్రాసె గోవింద రామ । అరుంధతి అనసూయ గోవిందా । హారతియిచ్చిరీ గోవిందరామ । పట్టుచీరలును గోవిందా । పదినూరులూయుంచి గోవిందరామ । చీరలుపట్టుకొని గోవిందా । వనితలిళ్ళకు యేగి గోవిందరామ । దినదినంబులునుశాంత గోవిందా । దీప్తిపెరుగుచునుండె

గోవిందరామ । కన్యపెరుగావారికి గోవిందా । కంటకంబయితోచె గోవిందరామ । యెవ్వ రికి యిత్తునని గోవిందా । మహారాజుతో బల్కె గోవిందరామ । యింద్రుడికి యిత్తునా గోవిందా । అప్పుడు కౌసల్య గోవిందరామ । పెనిమిటికి యిట్లనెను గోవిందా । ఋషి తోను చెప్పమనె గోవిందరామ । దశరథ మహారాజు గోవిందా । మౌనితోజెప్పెను గోవిందరామ । గొప్పవారికియిస్తె గోవిందా । కొడుకులు పుడుతారు గోవిందరామ । మీకు పుణ్యులు అవుతారు గోవిందా । వటవృక్షమూక్రింద గోవిందరామ । తపసులో వున్నాడు గోవిందా । దుప్పివలెనుంటాడు గోవిందరామ । నొష్టనోకొమ్ముండు గోవిందా । అతని బిలుచుకవచ్చి గోవిందరామ । శాంతనూయివ్వండి గోవిందా । కన్యకు భయమగును గోవిందరామ । శాంతనివ్వానని గోవిందా । అప్పుడూకౌసల్య గోవిందరామ । మహారాజు తోబల్కె గోవిందా । విభుడనీవు వినుమని గోవిందరామ । ఋషియు చెప్పినట్లు గోవిందా । మహామునికి యివ్వండి గోవిందరామ । సతిమాట వినిపతి గోవిందా । అప్సరసలబిలిపించె గోవిందరామ । అప్సరసాస్త్రీలు గోవిందా । అయిదుగురువచ్చిరీ గోవిందరామ । అడిగిన ధనమిత్తు గోవిందా । విదియ శుక్రవారం గోవిందరామ । ఆరుగడియలప్రొద్దుకు గోవిందా । నాటిరోజుకు మీరు గోవిందరామ । అల్లున్ని తేవలెను గోవిందా । వటవృక్షమూకింద గోవిందరామ । పొదరిళ్ళవున్నాడు గోవిందా । దుప్పివలె వుంటాడు గోవిందరామ । నొష్టన కొమ్ముండు గోవిందా । మంచిగంథపుచెక్క గోవిందరామ । మహరాజుతానిచ్చె గోవిందా । పసపు కుంకుమపండ్లు గోవిందరామ । దశరథుడుతానిచ్చె గోవిందా । అప్సరస్త్రీలేగి గోవింద రామ । వనమంతవెదకిరీ గోవిందా । ఆడుచుపాడుచు గోవిందరామ । అరణ్యమంతావెదకె గోవిందా । కొలనుదగ్గరజేరి గోవిందరామ । కోమలులు ఆడిరీ గోవిందా । ఆసందడీవిని గోవిందరామ । కన్నులు దెరచియు గోవిందా । కన్యలనుజూచి గోవిందరామ । రెండు కొమ్ములు వుండె గోవిందా । వీరెట్టి తపసులో గోవిందరామ । ఏపూజచేసిరో గోవిందా । ఆశ్చర్యముబొందె గోవిందరామ । రాజుఅల్లునిజూచి గోవిందా । రమణులు నవ్విరీ గోవిందరామ । మందపశువువలెను గోవిందా । మాట్లాడనేరడు గోవిందరామ । పారుటా కులుదెచ్చి గోవిందా । గట్టుమనియిచ్చిరీ గోవిందరామ । తియ్యనిభక్ష్యములు గోవిందా । తినిపించిరీవారు గోవిందరామ । రాజుయిచ్చిన నగలు గోవిందా । రాజఋషికిచ్చిరీ గోవిందరామ , కందమూలములపుడు గోవిందా । ఋషిఆరగించెను గోవిందరామ । మల్లెపూవుల పాన్పు గోవిందా । మగువలుపరచిరీ గోవిందరామ । మంచిగంధముతీసి గోవిందా । ఋషిచేతులకు పూసి గోవిందరామ । అత్తరు పన్నీరు గోవిందా । మేనున అలదిరి గోవిందరామ । సంసారమర్మములు గోవిందా । సఖియలు జెప్పిరీ గోవిందరామ । రెండుకొమ్ములు మీకు గోవిందా । యేరాజుయిప్పించె గోవిందరామ । ఈశ్వరుడుయిచ్చెనా

గోవిందా । బ్రహ్మయినయిచ్చాడ గోవిందరామ । గొప్పఋషులముఅనే గోవిందా । దండ కారణ్య మనె గోవిందరామ । పయనాలుఅయివారు గోవిందా । పారిపోవుచునుండ గోవిందరామ । ఋషియు వెంటాతగిలి గోవిందా । కూడవత్తూననెను గోవిందరామ । అయోధ్య వెళ్లతాము గోవిందా । నీవురావద్దనిరీ గోవిందరామ । నొంటిగావనములో గోవిందా । వకగడియనిలువననె గోవిందరామ । అప్సరసలావెంట గోవిందా । మహఋషి కదలెను గోవిందరామ । ముగ్గురుకన్యలు గోవిందా । మునితోనువుండిరీ గోవిందరామ । ఇద్దరుకన్యలు గోవిందా । రాజుదగ్గరకేగి గోవిందరామ । అతికష్టపడ్డాము గోవిందా । అల్లున్నితెచ్చాము గోవిందరామ । అప్పుడు దశరథుడు గోవిందా । అతి సంబ్రిమునపొంగి గోవిందరామ । చక్కనిఋషియని గోవిందా । ఆచెలులుజెప్పిరి గోవిందరామ । చక్కని వాడని గోవిందా । చెలులు సంతోషించి గోవిందరామ । అతివశాంతమ్మకు గోవిందా । తగ్గవరుడేకాడ గోవిందరామ । కౌసల్యసుమిత్ర గోవిందా । కన్నీరుబెట్టిరీ గోవిందరామ । కూతురుచేసినపుణ్యం గోవిందా ।వ్రాతఫలమిట్లుండె గోవిందరామ । అల్లుడుజేసినపుణ్యం గోవిందా । మఱియుమంచిదిఅనెను గోవిందరామ । దశరథుడువెళ్ళి గోవిందా । ఋష్య శృంగునిజూచి గోవిందరామ । సముద్రమువలెపొంగి గోవిందా । ఇంతచక్కని వరుడు గోవిందరామ । ఈభూమిలోలేడు గోవిందా । వందనముచేసిరి గోవిందరామ । దీవెనలు తాయిచ్చె గోవిందా । వివాహకాలంబు గోవిందరామ । మీకుకావలెనయ్య గోవిందరామ । రాజకన్యయితేను గోవిందా । రమణినీవద్దను గోవిందరామ । నాతనయ శాంతను గోవిందా । నీకు యిచ్చెదననెను గోవిందరామ । పుత్రకామేష్టిసేయ గోవిందా । పుత్రులు పుడుదురనె గోవిందరామ । రాజు అల్లుడుమీరు గోవిందా । రాచకట్టుకట్టండి గోవిందరామ । బంగారు దుస్తులు గోవిందా । నిలువుటంగీలు గోవిందరామ । రాజఋషికిచ్చిరి గోవిందా । ముస్తాబు చేసిరి గోవిందరామ । నిలువు సొమ్ములువుంచి గోవిందా । అలంకరించిరి గోవిందరామ । దశరథునికి చూపించె గోవిందా । సానకపుకావిళ్ళ గోవిందరామ । పదివేలు తెచ్చిరి గోవిందా । ఋషియు రాజువచ్చె గోవిందరామ । సతులు యిద్దరువచ్చె గోవిందా । జయభేరి వేయించె గోవిందరామ । గంధంబు బూసిరి గోవిందా । గంధవడి జల్లిరి గోవిందరామ । కట్నాలు యిప్పించె గోవిందా । రాజు అల్లునితోను గోవిందరామ । బంధువర్గం బెవరు గోవిందా । తల్లెవరుతండ్రెవరు గోవిందరామ । వూరేది పేరేది గోవిందా । వివరించుమని పల్కె గోవిందరామ । తల్లితండ్రిని యెరుగ గోవిందా । వూరెరుగ పేరెరుగ గోవింద రామ । అంతట దశరథుడు గోవిందా । వశిష్ఠుని బిలిచి గోవిందరామ । యెవరి సుతులని యడుగ గోవిందా । మాండవ్య మహామునికి గోవిందరామ । సుతులువీరని బల్కె గోవిందా । వారికిమనమిపుడు గోవిందరామ । లేఖలు వ్రాయవలె గోవిందా ।

బ్రాహ్మలని వ్రాతుమా గోవిందరామ । రాజులని వ్రాతుమా గోవిందా । రాజులని వ్రాసితే
గోవిందరామ । మనవిడిదికీ వస్తారా గోవిందా । రారోయనిసంశయం గోవిందరామ । మహా
మునితో గూడి గోవిందా । మంచివేళలుజూచి గోవిందరామ । లేఖలువ్రాసిరి గోవిందా ।
శ్రీవేదమూర్తులు గోవిందరామ । యజన యాజనపరులు గోవిందా । షట్కర్మనిరతులు
గోవిందరామ । మాండవ్యమహాముని గోవిందా । బావగారికిఅనుచు గోవిందరామ ।
అయోధ్యయేలేటి గోవిందా । దశరథమహారాజు గోవిందరామ । అనేకదండములు
గోవిందా । మీతనయుడైనట్టి గోవిందరామ । రుష్యశృంగానికి గోవిందా । తనయుశాంత
నుయిచ్చి గోవిందరామ । విదియ శుక్రవారం గోవిందా । ఆరుఘడియలప్రొద్దెక్కి గోవింద
రామ । అశ్వనినక్షత్రమున గోవిందా । మిథునలగ్నామందు గోవిందరామ । పరిణయం
చేతునని గోవిందా । నాటిరోజుకు మీరు గోవిందరామ । సపరివారముతోను గోవిందా ।
తర్లిరమ్మనుచును గోవిందరామ । పచ్చని అక్షింతలు గోవిందా । మాపందిళ్ళ తేవద్దు
గోవిందరామ । మాడయెత్తు సొమ్ము గోవిందా । మగువకు తేవద్దు గోవిందరామ ।
అనుచు లేఖలువ్రాసి గోవిందా । లేఖలు మడిచియు గోవిందరామ । మహామునులంతటా
గోవిందా । రుషిపల్లెకువెళ్ళి గోవిందరామ । లేఖలుపంపివ్వగా గోవిందా । విప్పిచూచుక
చదివి గోవిందరామ । మహామునులతోజెప్పె గోవిందా । తనయుడు రుష్యశృంగునికి
గోవిందరామ । రాజుకూతురు నిత్తుననిగోవిందా । విదియ శుక్రవారం గోవిందరామ ।
ఆరుఘడియలప్రొద్దు గోవిందా । పరిణయం చేతుమని గోవిందరామ । నాటిరోజుకు మనల
గోవిందా । అందరిని రమ్మనె గోవిందరామ । రాచపిల్లయితేను గోవిందా । రమణి అక్క
రలేదు గోవిందరామ । వద్దని మనమిపుడు గోవిందా । అప్పుడురుషివరుడు గోవిందరామ ।
మహామునితో జెప్పెను గోవిందా । రాజర్షి కుమార్తె గోవిందరామ । మహారాజు మీకు
యిచ్చిరి గోవిందా । మునితో జెప్పెను గోవిందరామ । పుత్రకామేష్టి వ్రేలిస్తే గోవిందా ।
పుత్రులు పుడుతారు గోవిందరామ । వారు పుణ్యులు అగుదురు గోవిందా । అప్పుడు మహా
ముని గోవిందరామ । మహాదేవితో జెప్పె గోవిందా । మనతనయుడు గోవిందరామ ।
రుష్యశృంగునికి గోవిందా । మహారాజు కూతురు గోవిందరామ । విదియ శుక్రవారం
గోవిందా । ఆరుగడియలప్రొద్దెక్కి గోవిందరామ । పరిణయం చేతురట గోవిందా । నాటి
రోజుకు మనల గోవిందరామ । అందరిని రమ్మనిరి గోవిందా । యేనాటి రుష్యశృంగుడు
గోవిందరామ । యేనాటితనయుడు గోవిందా । అయిదు నెలలబాలుడు గోవిందరామ ।
అడవి తపసుకువెళ్ళి గోవిందా । నాటివానిని మీరు గోవిందరామ । నేటికి తెచ్చితిర
గోవిందా । అప్పుడు మహాముని గోవిందరామ । మహాదేవి కిట్లనెను గోవిందా । అంత
వారిబిడ్డకు గోవిందరామ । మనమేమి పెడతాము గోవిందా । మొన్నప్రొద్దుటివేళ గోవింద

రామ । మూసివాయనంలోని గోవిందా । మెట్టెలుసూత్రంబు గోవిందరామ । దగ్గరను వున్నవి గోవిందా । నాతికి పెడుతాను గోవిందరామ । గుండుముత్యపు నత్తు గోవిందా । కూతురువద్ద నుండె గోవిందరామ । అదిపట్టుకువచ్చి గోవిందా । శాంతకు యిస్తాను గోవిందరామ । నాచెవులమద్దికాయలు గోవిందా । కోడలికి యిస్తాను గోవిందరామ । మొన్నప్రొద్దుటివేళ గోవిందా , మూసి వాయనంలోన గోవిందరామ । మేనికమ్మియుచీర గోవిందా । ఆచీర యిస్తానండి గోవిందరామ । అప్పుడుమహాముని గోవిందా । తనసతికిట్ల నెను గోవిందరామ । అంత వారిబిడ్డకు గోవిందా । యింతలేలిక సొమ్ము గోవిందరామ । రాజరుషి అనగాను గోవిందా । లక్షలకు అధికారి గోవిందరామ । దశరథుని నగరందు గోవిందా । దశావతారులు గోవిందరామ । రుషిపల్లెలవారు గోవిందా । పెండ్లికి వెడుదురు గోవిందరామ । నల్లపూసల జేర్లు గోవిందా । నెలతలుగుచ్చిరి గోవిందరామ । పసుపు కుంకుమపండ్లు గోవిందా । పణతులు పట్టిరి గోవిందరామ । పండుటాకులుమడుపు గోవిందా , కాంతలు బట్టిరి గోవిందరామ । వేదగోష్ఠులతోను గోవిందా । విప్రులు తరలిరి గోవిందరామ । పెండ్లివారు వచ్చిరని గోవిందా । రాజుతోజెప్పిరి గోవిందరామ । సరిరాజులూకారు గోవిందా । మర్యాదలుజేయ గోవిందరామ । నేనువెళ్ళగరాదు గోవిందా । రాజఋషినేగునని గోవిందరామ । దశరథుడుజెప్పె గోవిందా । అప్పుడు మహాముని గోవిందరామ । అతి క్రోధమునబల్కె గోవిందా । నాగురునకుజేస్తె గోవిందరామ । నేనువెళ్లుదునయ్యా గోవిందా , పానకపు కావళ్లు గోవిందరామ । పదివేలుపట్టుకొని గోవిందా । కౌసల్య సుమిత్ర గోవిందరామ । రాజఋషియువచ్చె గోవిందా । జయభేరివేసిరి గోవిందరామ । జగమెల్లమ్రోయగా గోవిందా । కంచుభేరివేసె గోవిందరామ । కదలికజేసిరి గోవిందా । మహారాజుమహాముని గోవిందరామ । వియ్యంకుడునుజేరె గోవిందా । మహామునికి వందనంజేసి గోవిందరామ । అప్పుడు రాజఋషి గోవిందా । వియ్యంకునితొబల్కె గోవిందరామ । ధారపాత్రపట్టుకొని గోవింద । మాకుపాత్రుడూ దొరికెను గోవిందరామ । అన్నిటికంటె అధికంబు గోవిందా , శాంతనూ యిచ్చితిరి గోవిందరామ । గంధంబు బూసిరి గోవిందా । గంధవడిజల్లిరి గోవిందరామ । కట్నంబులిచ్చిరి గోవిందా । వియ్యాలవారికి గోవిందరామ । విడిదిల్లు చూపించె గోవిందా । తనయునికౌగలించి గోవిందరామ । రమణివగువసాగె గోవిందా । కుప్పలుగ కన్నీరు గోవిందరామ । తెప్పలుగపారెను గోవిందా । మహామునులు ఋషులు గోవిందరామ । రమణినోదార్చిరి గోవిందా । అబ్బరికంజేసె గోవిందరామ । అల్లుని తోడుకొచ్చి గోవిందా । కౌసల్య అల్లుడు గోవిందరామ । కాశిపైనామనె గోవిందా । దేవిడి దిగకుండ గోవిందరామ । మహారాజు నిలుచుండె గోవిందా । కాశికివెళ్లొద్దు గోవిందరామ । మాకన్య నిస్తాము గోవిందా । అప్పుడు రాజఋషి గోవిందరామ । మహారాజుతోజెప్పె

గోవిందా । తగువు ధర్మముకాదు గోవిందరామ । గడ్డంబు పట్టుకొని గోవిందా ।
బెల్లపుగడ్డపెట్టి గోవిందరామ । బ్రతిమాలసాగెను గోవిందా । కాశివెళ్లావద్దు గోవిందరామ ।
మాకన్యనుయిస్తాము గోవిందా । కౌసల్య అల్లుడు గోవిందరామ । విడిదియిండ్లకువెళ్లె
గోవిందా । జాముర్రాత్రీవేళ గోవిందరామ । రాజుసంకల్పించె గోవిందా । కౌసల్యసుమిత్ర
గోవిందరామ । జలకమాడవచ్చిరి గోవిందా । శాంతకల్యాణముకు గోవిందరామ ।
యిందర్నీలపుఛాయ గోవిందా । చంద్రకాంతపుశాల గోవిందరామ । కెంపులా అక్షతలు
గోవిందా । తట్టలోవుంచెను గోవిందరామ । భమిడిపేళ్ళగంప గోవిందా । పందిటను
వుంచెను గోవిందరామ । నవరత్న పళ్లెంబు గోవిందా । కాళ్లుకడుగనుబెట్టె గోవింద
రామ । బంగారుబాషికం గోవిందా । నూటవక్కా తులం గోవిందరామ । నానుతోసూత్రంబు
గోవిందా । వుత్తరజంధ్యంబు గోవిందరామ । వుంగరంబుంచిరి గోవిందా । అల్లునికిఅరణంబు
గోవిందరామ । ఆరులక్షలుయిచ్చె గోవిందా । పదివేల మొహిరీల గోవిందరామ । మధు
పర్కమూనిచ్చె గోవిందా । వసిష్ఠుడూవచ్చి గోవిందరామ । పెండ్లరుగువేసిరి గోవిందా ।
చిరుగుపెట్టించిరి గోవిందరామ । కుమ్మరి కన్యకా గోవిందా । భమిడి మూకుడుదెచ్చి
గోవిందరామ । కుదురుచక్కగజేసి గోవిందా । కులదేవతనువుంచె గోవిందరామ । వసిష్ఠు
నితోవచ్చి గోవిందా । సూత్రిధారణచేసె గోవిందరామ । కంచెలుపతకములు గోవిందా ।
కామధేనువుయిచ్చె గోవిందరామ । ఆదిబుషులువచ్చి గోవిందా । శాంతనుపెండ్లి గోవింద
రామ । కూతురునిజేసిరి గోవిందా । పసుపుకుంకుమయు గోవిందరామ । కాటుకలుదిద్దిరీ
గోవిందా । అంతట మహరాజు గోవిందరామ । కౌసల్యతోబల్కె గోవిందా । కన్యకుదృష్టి
తగులు గోవిందరామ । పెద్దబొట్టుంచండి గోవిందా । పెద్దబొట్టు పెట్టిరి గోవిందరామ ।
చెక్కిట చుక్కవుంచె గోవిందా । కాటుకలు వుంచిరి గోవిందరామ । గంపలో నుంచిరి
గోవిందా । అప్పుడు రాజరుషి గోవిందరామ । అంతంత జరిపించె గోవిందా । మహారాజు
రాణువ గోవిందరామ । పన్నెండు లక్షలు గోవిందా । రాజబుషి సైన్యంబు గోవిందరామ ।
యిరువదిలక్షలు గోవిందా । పట్నపేనుగుదెచ్చి గోవిందరామ । అంబారివేయించె
గోవిందా । రుష్యశృంగుని దెచ్చి గోవిందరామ । గజముపై నెక్కించె
గోవిందా । అంగనలు వచ్చియు గోవిందరామ । హారతులు యిచ్చిరి గోవిందా । మహ
రాజునగరిలో గోవిందరామ । కనకపీటలువేసె గోవిందా । వధూవరులను గోవిందరామ ।
ఆసీనులనుజేసె గోవిందా । దీవించి కౌసల్య గోవిందరామ । దంపతులశిరసంటె గోవిందా
అడవికియేగినా గోవిందరామ । అయోధ్యలోవున్న గోవిందా । బుషిపల్లెలోవున్న గోవింద
రామ । శాంతభారముమీది గోవిందా । అంతటఅల్లుడు గోవిందరామ । అత్తగారితొబల్కె
గోవిందా । ఆడవారితోను గోవిందరామ । మాటాడ నేనెరుగ గోవిందా । అప్పుడు కౌసల్య

గోవిందరామ । దశరథునితోజెప్పె గోవిందా । సఖియతో స్నానముకు గోవిందరామ । సమ్మతించడు అతడు గోవిందా । అంతటా మహరాజు గోవిందరామ । రాజరుషితోజెప్పె గోవిందా । అంతటరాజరుషి గోవిందరామ । వియ్యంకునితొజెప్పె గోవిందా । రుష్య శృంగునితండ్రి గోవిందరామ । గొడ్డువీగినాడు గోవిందా । వారిసమ్మతివినుమి గోవిందరామ । మాతండ్రియనిపల్కె గోవిందా । బంగరు పీటపై గోవిందరామ । రాజరుషినివుంచె గోవిందా । దీవించికౌసల్య గోవిందరామ । దంపతులశిరసంటె గోవిందా । జలకమాడించిరి గోవిందరామ । చలవతళ్లొత్తిరి గోవిందా । పీతాంబరంయిచ్చి గోవిందరామ । నల్లపట్టుచీర గోవిందా । శాంతకుకట్టించె గోవిందరామ । పన్నెండువేలదిగోవిందా । భామ తొడుగులుపుంచె గోవిందరామ । వెలితిలేకుండంగ గోవిందా । వెలదికిఅలంకరించిరి గోవింద రామ । చంకబెట్టుకు తల్లి గోవిందా । కన్నీరు నించెను గోవిందరామ । కన్నతల్లిని జూడ గోవిందా । ప్రాప్తంబులేదాయె గోవిందరామ । చంకబెట్టుకు రాజు గోంవిదా । కన్యమహా ముని కిచ్చె గోవిందరామ । కన్యచంకను వుంచి గోవిందా । రుషిరాజుతో బల్కె గోవింద రామ । మా.గోత్రనామముతొ గోవిందా । కన్యధారచెయ్యండి గోవిందరామ । గౌరి తపస్సు కువారు గోవిందా । శాంతనుదోడుకవచ్చి గోవిందరామ । కన్నతల్లినీవు గోవిందా । గంప లోకూర్చొనుము గోవిందారామ । కొబ్బరి బెల్లంబు గోవిందా । కొమ్మచేతులొపుంచె గోవిందరామ । నొష్టకొమ్ముమ్మవాడు గోవిందా । నీకువరుడాయెననె గోవిందరామ । కన్య ప్రదానమిది గోవిందా । కంకణంకట్టిరి గోవిందరామ । మాసుతనువారికిచ్చి గోవిందా । భూమిపంచీపెడుదు గోవిందరామ । పలుపైతెపట్టలేదు గోవిందా । నాబాలఅయినాను గోవిందరామ । పళ్లెముల కనకముతొ గోవిందా । పణతినిధారపోసె గోవిందరామ । గోదా నంజేసె గోవిందా । భూదానంజేసె గోవిందరామ । సువర్ణదానంబు గోవిందా । సాలగ్రామ దానంబు గోవిందరామ । మహారాజుచేసెను గోవిందా । పీటలపై కూర్చొని గోవిందరామ । శాంతనుదోడుకవచ్చి గోవిందా । శాలువడ్డంవేసిరి గోవిందరామ । రాజుతొడలపైని గోవిందా । శాంతనువుంచిరీ గోవిందరామ । శిరోమాణిక్యంబు గోవిందా । కౌసల్యకూతురు కిచ్చె గోవిందరామ । శాంతశిరసునవారు గోవిందా । కాడినీరుపోసిరి గోవిందరామ । జీల కఱ్ఱ బెల్లంబు గోవిందా । మునిచేతికీ యిచ్చె గోవిందరామ । కన్యశిరసున బెట్టించె గోవిందా । కన్యచేతావారు గోవిందరామ । జీలకఱ్ఱ బెల్లంబు గోవింద । మునిశిరసుపైనుంచిరి గోవిందరామ । భరద్వాజులవారు గోవిందా । కన్యదానం జెప్పె గోవిందరామ । అప్పుడురాజరుషి గోవిందా । అల్లునితోజెప్పె గోవింద రామ । శిరోమాణిక్యంబు గోవిందా । సీతసొమ్మని బల్కె గోవిందరామ । శిరోమాణి క్యంబు గోవిందా । కోడలికియిస్తుంది గోవిందరామ । మెడనున్న హారములు

గోవిందా । శాంతకుయిస్తుంది గోవిందరామ । కట్టినపుట్టంబు గోవిందా । ఆడపడుచుకు యిమ్మ్ గోవిందరామ । పదివేల సొమ్ముతో గోవిందా । పట్టినిధారవోసె గోవిందరామ । నవరత్నముతోచేసిన గోవిందా । పళ్లెంబుయిచ్చిరి గోవిందరామ । మధుపర్కములుయిచ్చె గోవిందా । నవ్వుచుమహాముని గోవిందరామ । అల్లునికికట్టించి గోవిందా । వుంగరము జంధ్యంబు గోవిందరామ । మహరాజుయిచ్చిరి గోవిందా । అల్లునికిఅరణంబు గోవింద రామ । ఆరులక్షలుయిచ్చె గోవిందా । అప్పుడుమహాముని గోవిందరామ । రాజరుషికిట్లనెను గోవిందా । మహామునివినండి గోవిందరామ । మనతంతునడపండి గోవిందా । వారితంతే మిటో గోవిందరామ । వరునినడపండయ్యా గోవిందా । మామిడాకుతెచ్చి గోవిందరామ । మగువమెడనుకట్టిరి గోవిందా । శుభసూత్రములు గోవిందరామ । రుషీశ్వరుండుకట్టించె గోవిందా । పళ్లెముతోతలంబ్రాలు గోవిందరామ । రుషిచేతబట్టించి గోవిందా । మూడుదోసిళ్ళ యిన గోవిందరామ । ముగుదశిరసునవుంచె గోవిందా । కన్యచేతావారు గోవిందరామ । కాంతునిశిరసుననుంచిరి గోవిందా । సతివంకరుషిజూచి గోవిందరామ । యింతచక్కని చేడె గోవిందా । యీజగములో లేదు గోవిందరామ । అడవికి వెళ్ళినా గోవిందా । అయోధ్యలో వున్న గోవిందరామ । రుషిపల్లెలోవున్న గోవిందా । కోమలినివదలనని గోవిందరామ । లాజబోయుటకు గోవిందా । రాజునుబిల్చిరి గోవిందరామ । అంతటమహరాజు గోవిందా । లాజలుతాబోసె గోవిందరామ । కట్నంబుకోరెను గోవిందా । అప్పుడు రుష్యశృంగుడు గోవిందరామ । మామతోను బల్కె గోవిందా । సుతులు పుట్టినవెనుక గోవిందరామ । లాజ కట్నములిత్తు గోవిందా । కట్నములుదెప్పించి గోవిందరామ । రాజరుషికిప్పించె గోవిందా । సప్తపాదంబొక్క గోవిందరామ । దంపతులిచ్చిరి గోవిందా । సన్నికల్లమర్చి గోవింద రామ । పాదములుత్రొక్కించె గోవిందా । అప్పుడు రుష్యశృంగుడు గోవిందరామ । రాజ రుషికిట్లనెను గోవిందా । ఆడదానిపాదంబెట్ట గోవిందరామ । యేశాస్త్రములోనుండె గోవిందా । యేరుషులుజెప్పిరి గోవిందరామ । అప్పుడు రాజరుషి గోవిందా । అల్లునికిట్ల నెను గోవిందరామ । మీరుతప్పిస్తేను గోవిందా । మరివకరుపడుతార గోవిందరామ । శాంతపాదంబుమీద గోవిందా । పోకచెక్కవుంచి గోవిందరామ । సప్తపాదంతొక్కె గోవిందా । అరుంధతిని చూపించె గోవిందరామ । పొత్తునాగూర్చుండి గోవిందా । అరగిం చిరివారు గోవిందరామ । పరగెరెండవనాడు గోవిందా । పసుపులునలిచిరి గోవిందరామ । రమణులందరు గలసి గోవిందా । రాచక్రీడసల్పిరి గోవిందరామ । మూడవదినమున గోవిందా । పాకెన్నజేసిరి గోవిందరామ । యెచ్చటనున్నవారిని గోవిందా । యెన్నికతో బిల్పించె గోవిందరామ । రుషిపల్లెవారి గోవిందా । రాజరుషిపిల్పించె గోవిందరామ । శాస్త్రజ్ఞు లొచ్చిరి గోవిందా । పాకెన్నపళ్లెములు గోవిందరామ । పండితులుచదివిరి

గోవిందా । పన్నెండువరహాలు గోవిందరామ । సంభావనలుయిచ్చే గోవిందా । అరుంధతి అనసూయ గోవిందరామ । హారతులు దెచ్చిరి గోవిందా । ఐదునూర్లవరహాలు గోవింద రామ । పట్టుచీరలుయిచ్చే గోవిందా । అప్సరసస్త్రీలు గోవిందరామ । ఐదుగురువచ్చిరి గోవిందా । అతికష్టపడ్డాము గోవిందరామ । బహుమానమిమ్మనెను గోవిందా । నిలువు యెత్తునధనము గోవిందరామ । దశరథుడుబోయించె గోవిందా । సఖియలారాధనము గోవిందరామ । చాలునామీకనెను గోవిందా । చాలుననుచువారు గోవిందరామ । ధనము గొనిపోయిరి గోవిందా । అంతటసుమిత్ర గోవిందరామ । కౌసల్యకిట్లనెను గోవిందా । శాంతకారతియివ్వ గోవిందరామ । నాకుమనసుఆయె గోవిందా । అక్కనాచెల్లెలని గోవింద రామ । నీకుమనసూపుట్ట గోవిందా । అప్పుడురాజరుషి గోవిందరామ । సుమిత్రకిట్లనెను గోవిందా । బుద్ధికిపెద్దవు గోవిందరామ । మాటలకు మరదలవు గోవిందా । హారతినీవే చెమ్మ గోవిందరామ । అంతటాసూమిత్ర గోవిందా । హారతితానిచ్చె గోవిందరామ । అప్పుడు రాజరుషి గోవిందరామ । అపరిమితధనమిచ్చె గోవిందా । మునులురుషులూ అంత గోవిందరామ । రాజుభార్యలుకలసి గోవిందా । ఆరగించిరివారు గోవిందరామ । హస్తములుకడిగియు గోవిందా । కర్పూరవీడెములు గోవిందరామ । దశరథుడు యిప్పించె గోవిందా । అప్పుడు రాజరుషి గోవిందరామ । కౌసల్యకిట్లనెను గోవిందా । వియ్యపురాలు ఆచారం గోవిందరామ । వీసమెత్తు జరుగలేదు గోవిందా । లక్షవరహాలది గోవిందరామ । పరుపువేయగవలెను గోవిందా । నాలుగువేలూ కలవి గోవిందరామ । చీర లివ్వగవలెను గోవిందా । వెండిబొట్టుపెట్టె గోవిందరామ । వెలదులకుయివ్వాలె గోవిందా । దువ్వెనబరిణెలు గోవిందరామ । కాటుకాయయుగూర్చి గోవిందా । కాంతకునుయివ్వాలె గోవిందరామ । యేడువారపుసొమ్ము గోవిందా । యింతికినిపుంచాలె గోవిందరామ । వారాడబడుచులకు గోవిందా । వరుసనడుపగవలెను గోవిందరామ । కౌసల్య సుమిత్ర గోవిందా । రాజునుమహాఋషి గోవిందరామ । అందరునువచ్చిరి గోవిందా । జయభేరి వేసిరి గోవిందరామ । తలుపులువేయించి గోవిందా । కౌసల్యసుమిత్ర గోవిందరామ । వియ్యపురాల్నిచ్చిరి గోవిందా । అప్పుడు మహాముని గోవిందరామ । తలుపులువేయించె గోవిందా । పరుగునాఅచేడె గోవిందరామ । పాన్పుపై బవళించె గోవిందా । కౌసల్య సుమిత్ర గోవిందరామ । పాన్పుపైకూర్చొని గోవిందా । పణతికిపాదములొత్తిరి గోవింద రామ । సరిరాజులంగాము గోవిందా । పాదసేవలుజేయ గోవిందరామ । మీయంతవారం గాము గోవిందా । మిగులతొడుగులువేయ గోవిందరామ । కల్యాణంనాడయిన గోవిందా । కాంతచూపిస్తిరా గోవిందరామ । నిన్నమొన్నమేము గోవిందా । నగరుకురాలేదు గోవింద రామ । పాకెన్ననాడొచ్చి గోవిందా । పందెళ్ళనుంటిమి గోవిందరామ । నిండుజల్తరుచీర

గోవిందా । కోడలికియిస్తేను గోవిందరామ । మాపెట్టెనిండునా గోవిందా । యేడువారపు
సొమ్ము గోవిందరామ । వెలదికియిస్తేను గోవిందా । మావళ్ళునిండునా గోవిందరామ ।
గొడ్లుయిాగిమేను గోవిందా । కూతుర్నితేలేదు గోవిందరామ । పుత్రభిక్షంగోరి గోవిందా ।
నాసుతుడు రుష్యశృంగునికి గోవిందరామ । బ్రహ్మచర్యంవదలించిరి గోవిందా । కౌసల్య
సుమిత్ర గోవిందరామ । కడుచిన్నబోయిరి గోవిందా । కన్నవారంగాము గోవిందరామ ।
కార్యములుయెరుగము గోవిందా । కానుకలుసర్దండి గోవిందరామ । కొద్దిగుమ్మడికాయ
గోవిందా । మీచేతిలోపెట్టితిమి గోవిందరామ । లోపాలోపములున్న గోవిందా । సర్దుకో
వలెనమ్మ గోవిందరామ । ఆడపడుచులుమీరు గోవిందా । అనుకేలజేస్తిరి గోవిందరామ ।
అప్పుడుసుమిత్ర గోవిందా । మహాదేవికిట్లనెను గోవిందరామ । అల్లుడుపుట్టినమొదలు
గోవిందా । పలుకరాచేయలేదు గోవిందరామ । పలుకరచేయించి గోవిందా । కౌసల్యసుమిత్ర
గోవిందరామ । మహాదేవి బిల్పించి గోవిందా । తలదువ్వికొప్పు గోవిందరామ ।
బెట్టె లక్షవరహాలది గోవిందా । లక్ష్మికి పరుపువేసే గోవిందరామ । నాలుగుచీరలు
గోవిందా । వారికియిచ్చిరి గోవిందరామ । యేడువారపుసొమ్ములు గోవిందా । వెలదిక
లంకరించె గోవిందరామ । వెండిబొట్టుపెట్టె గోవిందా । బంగారుబరిణెలు గోవిందరామ ।
వెలదికియిచ్చిరి గోవిందా । వారాడపడుచులకు గోవిందరామ । లాంఛనములుయిచ్చిరి
గోవిందా । రుష్యశృంగునిబిల్చి గోవిందరామ । దేవిసరసనుపుంచి గోవిందా । మద్దికాయ
లుదెచ్చి గోవిందరామ । మహారుషిసతికిబెట్టి గోవిందా । అప్పుడుసుమిత్ర గోవిందరామ ।
అద్దంబుచూపించి గోవిందా । మద్దికాయలవడినె గోవిందరామ । బహుముద్దుగావున్నది
గోవిందా । అప్పుడుమహాదేవి గోవిందరామ । సుమిత్రతోబల్కె గోవిందా । కానేబోసి
కట్ట గోవిందరామ । కడవేసిఆడము గోవిందా । చెంపకొప్పులుబెట్ట గోవిందరామ ।
బోగంవారముకాము గోవిందా । పండ్లకప్పులువేయ గోవిందరామ । తురకసానులుగాము
గోవిందా । మీరన్నాబోగముది గోవిందరామ । కోకిలాదేవనెను గోంవిదా । మితభాషి
బోగముది గోవిందరామ । కౌసల్యాదేవి గోవిందా । రచ్చలోకైకమ్మ గోవిందరామ ।
రాక్షసీబోగముది గోవిందా । సూటిపోటిమాట గోవిందరామ । సుమిత్రబోగంది గోవిందా ।
అప్పుడుమహారాజు గోవిందరామ । మహాదేవికిట్లనెను గోవిందా । అక్కనీమరదళ్ల గోవింద
రామ । నేనువినియేటట్లు గోవిందా । చాలగా అనుమనెను గోవిందరామ । చాలుదురు
కన్యలు గోవిందా । వారురాచస్త్రీలు గోవిందరామ । మేళాలలోకల్ల గోవిందా । గడిమేళం
బిది గోవిందరామ । అల్లుండుఅలిగెను గోవిందా । అలకపాన్పువేసె గోవిందరామ ।
రాజునుబిలిచిరి గోవిందా । అడిగినధనమిత్తు గోవిందరామ । అల్లుడారమ్మనె గోవిందా ।
కోరినధనమిచ్చె గోవిందరామ । పట్టపేనుగుదెచ్చి గోవిందా । హౌదానువేయించి గోవింద

రాము । దంపతులనిద్దరిని గోవిందా । అంబారినెక్కించి గోవిందరామ । రాజనగరూనందు గోవిందా । అందరుచేరిరి గోవిందరామ । కనకపీటలువేసి గోవిందా । కౌసల్యసుమిత్ర గోవిందరామ । పీటలాకూర్చొనిరి గోవిందా । రుష్యశృంగుడు శాంత గోవిందరామ । పైడి పేళ్ళగంప గోవిందా । పందిళ్లదించిరి గోవిందరామ । పదిపుట్ల ధాన్యంబు గోవిందా । గంపలనువుంచిరి గోవిందరామ । అరుంధతిఅనుసూయ గోవిందా । భమిడిరోకలిదెచ్చి గోవిందరామ । నెలమూడుశుభములు గోవిందా । యెప్పుడుజరుగవలె గోవిందరామ । వసంతముదెచ్చి గోవిందా । శాంతపై పులవారు గోవిందరామ । కన్యపైబోసిరి గోవిందా । యింతవేడుకమెపుడు గోవిందరామ । యింతిచూడగలేదు గోవిందా । సురలెల్లపొగడగ గోవిందరామ । జలకమాడించిరి గోవిందా । చలువలొత్తిరి గోవిందరామ । రాజునూ రుషులంత గోవిందా । ఆరగించిరీఅంత గోవిందరామ । ఆరగించిలేచి గోవిందా । హస్త ములుకడిగిరి గోవిందరామ । కర్పూరవీడెములు గోవిందా । రాజుతాయిప్పించె గోవింద రామ , నాగవల్లిప్రోలీలు గోవిందా । మహామునివేయించె గోవిందరామ । రాజనగరిలోన గోవిందా । కనకపీటలువేసె గోవిందరామ । శాంతనుఋషినిపిలిచి గోవిందా । పీటలపైనుం డిరి గోవిందరామ । లక్కగుండూదెచ్చి గోవిందా । రమణిమెడలోనగట్టిరి గోవిందరామ । నాగబలిచేసిరి గోవిందా । మేలికమ్మిచీర గోవిందరామ । మగువకుకట్టించె గోవిందా । మూడుతరమూలచీర గోవిందరామ । అచ్చినొచ్చినచీర గోవిందా । అప్పుడపుడుకట్టండి గోవిందరామ । ఆచీరవిప్పండి గోవిందా । సవ్వుతూసుమిత్ర గోవిందరామ । ఆచీరవిప్పెను గోవిందా । చీనిచీనాంబ్రము గోవిందరామ । కాంతకూకట్టించె గోవిందా । మిథునవడియపు పాన్పు గోవిందరామ । మహారాజువేయించె గోవిందా । దంపతులనిద్దర గోవిందరామ । పాన్పుపైనివుంచి గోవిందా । సతిపతులపిలిపించి గోవిందరామ । ఫలప్రదానమిప్పించె గోవిందా । బొమ్మనప్పాచెప్పి గోవిందరామ । వసంతములుబోసి గోవిందా । వసంతము లాడిరీ గోవిందరామ , కట్నములుతెప్పించి గోవిందా । కాంతలకుయిచ్చిరీ గోవిందరామ । బంగారుపళ్లెములో గోవిందా । పాలునెయ్యిపోసిరి గోవిందరామ । శాంతచెయ్యాదెచ్చి గోవిందా । పాలలోపలిముంచి గోవిందరామ । పతిచేతులోవుంచి గోవిందా । చెయ్యప్ప గించిరి గోవిందరామ । అడవికియేగినా గోవిందా । అయోధ్యలోవున్న గోవిందరామ । ఋషిపల్లెలోవున్న గోవిందా । కాంతభారముమీది గోవిందరామ । శాంతచెయ్యాదెచ్చి గోవిందా । పాలలోనాముంచి గోవిందరామ । అత్తగారికివారు గోవిందా । శాంతనప్పా జెప్పె గోవిందరామ । బంగారుపళ్లెములో గోవిందా । నవరసాన్నములుంచి గోవిందరామ । అతివకుబెట్టిరి గోవిందా । ఆరగించీలేచి గోవిందరామ । హస్తములుతాకడిగి గోవిందా । కర్పూరవిడెములు గోవిందరామ । సుమిత్రయిచ్చె గోవిందా । వడిచీరగట్టిరి గోవిందరామ ।

వడిబియ్యముంచిరి గోవిందా । కందవడిబెట్టిరి గోవిందరామ । బొమ్మవడిబెట్టిరి గోవిందా । తెల్లనివడిబ్రాలు గోవిందరామ । శాంతవడినింపిరి గోవిందా । వెండిగిన్నెయుదెచ్చి గోవిందరామ । వెలదివడినుంచిరి గోవిందా । కౌసల్యసుమిత్ర గోవిందరామ । కన్నీరు బెట్టిరి గోవిందా । చేడెనిచ్చిమేము గోవిందరామ । చేరినిలుచుంటిమి గోవిందా । అక్క చెల్లెలులేరు గోవిందరామ । అన్నదమ్ములులేరు గోవిందా । కొట్టుతాళంబిదుగో గోవిందరామ । కొత్వాలునంపెదము గోవిందా । ఐదువేలబానిసలు గోవిందరామ । అరణం బులుయిస్తు గోవిందా । అప్పుడుమహాదేవి గోవిందరామ । కౌసల్యకిట్లనెను గోవిందా । వెలదులారమీయింట గోవిందరామ । పసిడిబొమ్మలులేవ గోవిందా । దంతపుబొమ్మలు నేను గోవిందరామ । చాలగాచూస్తిని గోవిందా । మాటవినిసుమిత్ర గోవిందరామ । మణులబొమ్మలుయిచ్చె గోవిందా । అప్పుడుమహారాజు గోవిందరామ । మాండవ్యుతో బల్కె గోవిందా । మాసెలవులులేక గోవిందరామ । మాయింతినీమీరు గోవిందా । యెచ్చ టికిపంపొద్దు గోవిందరామ । మీసెలవులూలేక గోవిందా । యింతినీపంపేము గోవిందరామ । అత్తమూసివాయనం గోవిందా । కోడలందగవలెను గోవిందరామ । అప్పుడు రాజరుషి గోవిందా । మహరాజుతోబల్కె గోవిందరామ । అతివనూయిస్తిమి గోవిందా । అల్లునియిష్టమనె గోవిందరామ । రాజరుషియూముని గోవిందా । మంచిరోజుజూచి గోవిందరామ । పట్టపేనుగుదెచ్చి గోవిందా । అంబారివేయించె గోవిందరామ । దంపతుల నుంచిరి గోవిందా । జయభేరివేసిరీ గోవిందరామ । అప్సరసలాడగా గోవిందా । అడుగడు గుమజిలీల గోవిందరామ । పన్నెండుగడియలకు గోవిందా । పట్నంబైలుదేరిరి గోవిందరామ । రుషిపల్లెలోపలా గోవిందా । అందరుచేరిరి గోవిందరామ । లక్ష్మివచ్చి నదనుచు గోవిందా । లక్షభేరివేసె గోవిందరామ । జమ్మిచెట్టుక్రింద గోవిందా । శాంత సారెలువుంచె గోవిందరామ । పూర్ణకలశములుదించె గోవిందా । గృహప్రవేశంబాయె గోవిందరామ । వడికట్టువిప్పిరి గోవిందా । సంతోషముననుండె గోవిందరామ । రుషిదశర థుతోబల్కె గోవిందా । యజ్ఞంబుచేయుటకు గోవిందరామ । వ్యవధిలేదుగనుక గోవిందా । రుష్యశృంగునిదెచ్చి గోవిందరామ । కామేష్టిజేయించు గోవిందా । రాజుమహరుషికలిసి గోవిందరామ । మంచివేళలుచూచి గోవిందా । లేఖవ్రాసిరివారు గోవిందరామ । రుషిపల్లె లోపలా గోవిందా । మాండవ్యమహాముని గోవిందరామ । బావగారికనుచు గోవిందా । యాగంబుచేయించ గోవిందరామ । అల్లునంపూడని గోవిందా । వక్కలేఖనువ్రాసి గోవిందరామ । వసిష్ఠుచేతికిచ్చె గోవిందా । వసిష్ఠుడుదెచ్చి గోవిందరామ । మాండవ్యుని క్కిచ్చెను గోవిందా । సుతునిచేరగబిలిచి గోవిందరామ । అయోధ్యకేగుమనె గోవిందా । ప్రయాణమయిరుషియు గోవిందరామ । అయోధ్యరాగాను గోవిందా । అల్లునికియెదురుగా

గోవిందరామ । దశరథుడుయేగెను గోవిందా । తగినమర్యాదలతో గోవిందరామ । అల్లుని దెచ్చిరి గోవిందా । బంధుబలగంబంత గోవిందరామ । యేలరాలేదనెను గోవిందా । క్రతువు నాటికివారు గోవిందరామ । క్రమముగాచేరుదురు గోవిందా । యజ్ఞంబుచేయించ గోవిందరామ । యేమేమిగావలెనో గోవిందా । ఆనతియ్యండనగ గోవిందరామ । వుత్తరపు దిక్కునా గోవిందా । నొకశాలవేయండి గోవిందరామ । యూపస్తంభముదెచ్చి గోవిందా । మెప్పుతోపాతండి గోవిందరామ । పచ్చపూరీమాకు గోవిందా । పదికోట్లుకావలెను గోవిందరామ । కత్తులూకటార్లు గోవిందా । కావలసివున్నవి గోవిందరామ । నల్లపశువులు మాకు గోవిందా । నాణ్యముగకావలెను గోవిందరామ । ప్రోడవంటవండుటకు గోవిందా । ఛమిడిపాత్రిలుతెండి గోవిందరామ । మంత్రములతోపిండి గోవిందా । దంపించగావలెను గోవిందరామ । మంత్రమంత్రమునకు గోవిందా । మాడవస్తుందయ్య గోవిందరామ । నిలుచుండికూర్చుండి గోవిందా । పరుండిమంత్రము గోవిందరామ । మేముచెప్పగవలెను గోవిందా । పట్లుపుట్టంబియ్యి గోవిందరామ । బ్రశయాగ్నులుంచితే గోవిందా । పన్నెండు వరహాలు గోవిందరామ । సోమిదేవమ్మలకు గోవిందా । మొహరీలుయివ్వవలె గోవిందరామ । అమృతస్నానంజేస్తె గోవిందా । అవిమాకువస్త్రవి గోవిందరామ । రాజునూరుషికలిసి గోవిందా । మంచివేళలుజూచె గోవిందరామ । వుత్తరదిశశాల గోవిందా । వొప్పుగాకట్టించె గోవిందరామ । పట్టపేనుగుదెచ్చి గోవిందా । అంబారివేయించె గోవింద రామ । కౌసల్యసుమిత్ర గోవిందా । యేనుగునుయెక్కిరి గోవిందరామ । దశరథమహా రాజు గోవిందా । అగ్నిహోత్రంబట్టి గోవిందరామ । అల్లునితోవెళ్ళి గోవిందా । హార ములు దెంచుకుని గోవిందరామ । హోరునా యేడుస్తు గోవిందా । కైకమ్మతావచ్చి గోవిందరామ । అల్లు డత్తనుజూచి గోవిందా । రాజరుషి కిట్లనెను గోవిందరామ । కళ్యాణ రోజులలో గోవిందా । కాంతచూడగలేదు గోవిందరామ । యీయింతియెవరన గోవిందా । రాజుమూడవభార్య గోవిందరామ । కైకఅనిచెప్పిరి గోవిందా । మహారాజుకైకమ్మ గోవిందరామ । మగుడిరథ మెక్కిరి గోవిందా । మంచిపేళలుజూచి గోవిందరామ । శాలప్రవేశించె గోవిందా । అగ్నిహోత్రములుంచె గోవిందరామ । దర్భతీసుకవచ్చి గోవిందా । మంత్రాలతోనపుడు గోవిందరామ । రాజునడుముకుకట్టె గోవిందా । సతులు నడుముకుకట్ట గోవిందరామ । అప్పుడుకైకమ్మ గోవిందా । అదిరిపడకుండగా గోవిందరామ । అదలించివారు గోవిందా । దర్భనడుముగట్టె గోవిందరామ । సోమిదేవమ్మనుచు గోవిందా । చప్పట్లుజరచిరి గోవిందరామ । ఆవేళయజ్ఞంబు గోవిందా । రుష్యశృంగుడుచేయించె గోవిందరామ । ప్రాణయోగంబట్టి గోవిందా । మామమేమెదతాము గోవిందరామ । మంత్రాలతోధనం గోవిందా । మెంచిపుచ్చుకొండి గోవిందరామ । రుష్యశృంగుడువచ్చి

గోవిందా, । ప్రాణయోగముబట్టె గోవిందరామ । అప్పుడుమహారాజు గోవిందా । అల్లున్ని
జూచెను గోవిందరామ । తడిమిచూచెనుగాని గోవిందా । కట్టవలెవున్నాడు గోవిందరామ ।
అప్పుడుమహాముని గోవిందా । మహారాజుతోపల్కె గోవిందరామ । వాంటిప్రాణములేక
గోవిందా । యింద్రలోకంబేగె గోవిందరామ । చంద్రమండలమేగె గోవిందా । సూర్య
మండలమేగె గోవిందరామ । నక్షత్రమండలమేగె గోవిందా । పుత్రులుగల్గుటకు
గోవిందరామ । పుట్టగతిచూపించు గోవిందా । పచ్చపూరీమీద గోవిందరామ । పావకుడు
పవళించె గోవిందా । ఆనందమునుపొంది గోవిందరామ । రుష్యశృంగుడుపచ్చ గోవిందా ।
పందిళ్లలోపల గోవిందరామ । పట్టినీవుంచిరీ గోవిందా । ఆవేశయజ్ఞంబు గోవిందరామ ।
రుష్యశృంగుడుచేయించె గోవిందా । యూపస్తంభంతెచ్చి గోవిందరామ । మెప్పుతోపాతిరి
గోవిందా । వెదురుస్తంభంపాతి గోవిందరామ । పశుపుల్లురాసిరి గోవిందా । నల్లపశువులు
దాన్ని గోవిందరామ । కట్టిబంధించిరి గోవిందా । మంత్రములతోపిండి గోవిందరామ ।
మునులచేదంపించె గోవిందా । కూర్చుండిపారుండి గోవిందరామ । మంత్రిములుజెప్పెను
గోవిందా । వాటిపొరలుదీసి గోవిందరామ । హోమంబువ్రేల్చిరి గోవిందా । యేనుగు
ధారగనెయ్యి గోవిందరామ । హోమమునపోసిరి గోవిందా । ప్రోడశం వండుకొని
గోవిందరామ । పాత్రతాబట్టుకు గోవిందా । రుషిప్రాణయోగంబట్టె గోవిందరామ ।
దశరథుకీమీరు గోవిందా । జన్మింతురాలేద గోవిందరామ । దశావతారులుమీరు గోవిందా ।
జన్మింతురాలేద గోవిందరామ । ప్రత్యక్షమైఅపుడు గోవిందా । పావకుడుతాబల్కె
గోవిందరామ । దశరథరాజింట గోవిందా । నలుగురు జన్మింతురు గోవిందరామ । రుష్య
శృంగుడుమల్లి గోవిందా । దశరథుని జేసిరీ గోవిందరామ । మంత్రాలతోరుషి గోవిందా ।
పాయసాన్నంబుబట్టి గోవిందరామ । మామదశరథునికివ్వ గోవిందా । కౌసల్యకిచ్చెను
గోవిందరామ । కౌసల్యతానంది గోవిందా । కైకకుయిప్పించె గోవిందరామ । తనభాగమున
కొంత గోవిందా । సుమిత్రకిప్పించె గోవిందరామ । కండ్లకద్దుకచెలులు గోవిందా ।
గడియలోఆరగించె గోవిందరామ । అప్పుడు సుమిత్ర గోవిందా । కైకదగ్గరకొచ్చె
గోవిందరామ । సవతిపాలిక్కడికి గోవిందా । తప్పకావస్తివా గోవిందరామ । అదరిపడి
మండుతూ గోవిందా । పాయసంబెట్టంగ గోవిందరామ । మగువఆరాగించె గోవిందా ।
అప్పుడురుష్యశృంగుడు గోవిందరామ ; మహారాజుతోజెప్పి గోవిందా । సోమగుండంత్రొక్క
టకు గోవిందరామ । ఆలస్యమునులేదు గోవిందా । మాయాడబడుచులకు గోవిందరామ ।
తోడుకరమ్మనెను గోవిందా । అప్పుడు మహారాజు గోవిందరామ । రుషితోనుజెప్పెను
గోవిందా । సోమగుండంద్రొక్క గోవిందరామ । శాంతదోడుకరాండి గోవిందా । తిరుగు
సారెయిచ్చి గోవిందరామ । దంతిగమననుదెచ్చి గోవిందా । రుషిపల్లెకూబంప గోవింద

రామ । శాంతకుశారెవుంచె గోవిందా । కౌశికుని బంపించె గోవిందరామ । కౌశికుండేగెను గోవిందా । రుషిపల్లెకూయేగి గోవిందరామ । శాంతనుజూచియు గోవిందా । పెద్దాడ బడుచువను గోవిందరామ । సోమగుండంద్రొక్క గోవిందా । మీతండ్రిరమ్మనెను గోవింద రామ । అందరినిరమ్మనిరి గోవిందా । ఆడుబిడ్డలతోను గోవిందరామ । అందరువచ్చిరి గోవిందా । పట్టుపేనుగుదెచ్చి గోవిందరామ । అంబారివేయించె గోవిందా । శాంతను యెక్కించిరి గోవిందరామ । అందలములుయెక్కె గోవిందా । జయభేరివేసిరి గోవింద రామ । అందరుతర్లిరీ గోవిందా । అయోధ్యకుచేరు గోవిందరామ । దేవులెదురుగవెళ్లి గోవిందా । దేవినిదెచ్చిరి గోవిందరామ । కాళ్లకడిగి వారికి గోవిందా । ఆసనమువేసె గోవిందరామ । ముత్యాలహారతులు గోవిందా । ముగుదకుయిచ్చిరీ గోవిందరామ । శాంతనుయెత్తుకొని గోవిందా । రాజుతొడలనువుంచె గోవిందరామ । కల్యాణమూకన్న గోవిందా । కడుసొంపుగానుండె గోవిందరామ । నవరసాన్నములుంచ గోవిందా । ఆరగిం చిరివారు గోవిందరామ । పతకములుహారములు గోవిందా । పణతికివుంచిరి గోవిందరామ । బాలతొడుగులువారు గోవిందా । శాంతకుతొడిగిరి గోవిందరామ । సోమగుండంద్రొక్క గోవిందా । శాంతతోనేగిరి గోవిందరామ । అరుంధతిఅనసూయ గోవిందా । అహల్య సురభిదేవి గోవిందరామ । బంగారురోలేసి గోవిందా । భమిడిరోకలిదెచ్చి గోవిందరామ । భామచేతికియిచ్చె గోవిందా । సువ్విసువ్వనిదంచ గోవిందరామ । సుందతిరూపుజూచి గోవిందా । మంత్రంజదువలేక గోవిందరామ । రుష్యశృంగుడునవ్వె గోవిందా । మంత్రం బుజదివెను గోవిందరామ । గుండంబుద్రొక్కిరి గోవిందా । ఆడుపడుచులకు గోవింద రామ । దానంబువస్తుంది గోవిందా । కౌసల్యచేతులవి గోవిందరామ । కంకణము లివ్వండి గోవిందా । కౌసల్యచేతుల గోవిందరామ । కంకణములిచ్చిరీ గోవిందా । సోమతీగెత్రెంపి గోవిందరామ । ఆపసరుదెచ్చిరీ గోవిందా । హోమంబువ్రేల్చిరీ గోవిందరామ । అంతటతెల్లవార గోవిందా । శాంతనుతాబిలిచి గోవిందరామ । నాతల్లి శాంతమ్మ గోవిందా । నీకోరికలుదెల్పుమన గోవిందరామ । నవ్వుచూఆశాంత గోవిందా । తండ్రితోతాబల్కె గోవిందరామ । తమ్ములుబుట్టినవెనుక గోవిందా । సగమురాజ్యము యిమ్మ గోవిందరామ । ఇంతఆశలుయేల గోవిందా । దశరథులునవ్విరి గోవిందరామ । అన్నదానంబులు గోవిందా । అపరితముగజేసె గోవిందరామ । ఆశాలలంటించి గోవిందా । అందరువెళ్లిరీ గోవిందరామ । అల్లునికికట్నాలు గోవిందా । అత్తలుయిచ్చిరి గోవిందరామ । అన్నిఅందుకబుషి గోవిందా । అయోధ్యకువచ్చె గోవిందరామ । అంతఃపురములోన గోవిందా । భార్యలతోచేరెను గోవిందరామ । ముగ్గురుసతులతో గోవిందా । మహారాజు భోగించె గోవిందరామ । అతివలకుఅంతట గోవిందా । గర్భంబులాయెను గోవిందరామ ।

రాజునుమహారుషులు గోవిందా । పరివారమంతాను గోవిందరామ । నవరసాన్నములాను గోవిందా । ఆరగించిరివారు గోవిందరామ । కర్పూరవిడెంజేసె గోవిందా । మహారుష లందరికి గోవిందరామ । సంభావనలుయిచ్చె గోవిందా । ఋషికిమహారాజు గోవిందరామ । గొప్పకట్నములిచ్చె గోవిందా । యెవరిండ్లకూవారు గోవిందరామ । యేగిరీఅప్పుడు గోవిందా । కాంతలకుగర్భంబు గోవిందరామ । క్రమముగాపెరిగెను గోవిందా । యెనలేని మాటలు గోవిందరామ । నెలతలుకోరిరీ గోవిందా । పచ్చిప్పపప్పులు గోవిందరామ । పణతులుకోరిరీ గోవిందా । పండ్లుఫలహారములు గోవిందరామ । పణతులుకోరిరీ గోవిందా । శుభదినంబులయందు గోవిందరామ । చైత్రశుద్ధనవమి గోవిందా । నాడుసుదతులు గోవిందరామ । నల్గురుపుత్రులగనిరి గోవిందా । పురుడుపుణ్యముగడిపె గోవిందరామ । పదునొకండవనాడు గోవిందా । భారసాలకువారు గోవిందరామ । మహారుషులబిలిపించె గోవిందా । రుషిపల్లెలోవారిని గోవిందరామ । రాజరుషిపిలిపించె గోవిందా । రుషులంత వచ్చిరీ గోవిందరామ । కనకపీటలువేసె గోవిందా । ముగ్గురుభార్యలు గోవిందరామ । ముదముతోకూర్చొనిరి గోవిందా । సుతులనల్వురదెచ్చి గోవిందరామ । సతులతొడపైనుంచె గోవిందా । శాంతసుతాదెచ్చి గోవిందరామ । రాజువద్దనుంచె గోవిందా । బంగారుపళ్లెముతో గోవిందరామ । పాలొప్పుగాబోసి గోవిందా । రామలక్ష్మణులనుచు గోవిందరామ । నామకరణంవ్రాసె గోవిందా । భరతశత్రుఘ్నులని గోవిందరామ । పేరొప్పుగాబెట్టె గోవిందా । అరుంధతిఅనసూయ గోవిందరామ । హారతులయివ్వంగ గోవిందా । అతివలకుబహుమానం గోవిందరామ । మహారాజుయిచ్చెను గోవిందా । రుషులురాజునుగూడి గోవిందరామ । ఆరగించిలేచి గోవిందా । వీడెములుతాజేసి గోవిందరామ । చక్కనిసుతులకు గోవిందా । చేలోత్సవంజరిపి గోవిందరామ । పప్పుబెల్లంబులు గోవిందా । పంచిపెట్టిరివారు గోవిందరామ । సకుటుంబముగమీరు గోవిందా । రుషిపల్లెరమ్మని గోవిందరామ । మాండవ్యమహాముని గోవిందా । దశరథునిబిల్వగా గోవిందరామ । రాజురుషితోబల్కె గోవిందా । సతిసుతులనందర గోవిందరామ । బంధుబలమునంత గోవిందా । అయోధ్యప్రజలను గోవిందరామ । అందరినిబంపెదను గోవిందా । నేనుశాంతాదేవి గోవిందరామ । మానగరమునుండేము గోవిందా । రాజుమాటలకపుడు గోవిందరామ । ఋషియుతాచింతించ గోవిందా । దశరథుడంతట గోవిందరామ । తరుణులనుతాబిలిచి గోవిందా । యేడువారపుసొమ్ము గోవిందరామ । యెలమినాగకునుబెట్టి గోవిందా । అతివనిప్పుడుమీరు గోవిందరామ । అలంకారముజేసి గోవిందా । వేగదెమ్మనగాను గోవిందరామ । యువతులంతటనేగి గోవిందా । శాంతసుతాపిలిచి గోవిందరామ । హారములుపతకములు గోవిందా । నవరత్నసొమ్ములు గోవిందరామ । నాతికప్పుడువుంచె

గోవిందా । పట్నపేనుగుదెచ్చి గోవిందరామ । అంబారివేయించి గోవిందా । అంచయానను దెచ్చి గోవిందరామ । అంబారియెక్కించి గోవిందా । నలుగురుసుతులను గోవిందరామ , నాతిచెంగటనుంచి గోవిందా । జయభేరివేయించె గోవిందరామ । పన్నెండుగడియలకు గోవిందా । బైలుదేరినారు గోవిందరామ । అడుగడుగునుమజిలీల గోవిందా । అటుయేగుచుండిరీ గోవిందరామ । అప్పుడుకైకమ్మ గోవిందా । మంథరకిట్లనెను గోవిందరామ । యెవరెవరువెళ్ళారు గోవిందా । యెంచిచూడుమనగ గోవిందరామ । మంథరాతాజూచి గోవిందా । కొందరూవెళ్ళారు గోవిందరామ । చెప్పలేనిసొమ్ము గోవిందా । శాంతకును యిచ్చిరి గోవిందరామ । ఆమాటవినికైక గోవిందా । అతివతోనూగూడి గోవిందరామ । పరియాణమైకదలె గోవిందా । రుషిపల్లెచేరంగ గోవిందరామ । మాండవ్యమహాముని గోవిందా । సతితోడపల్కెను గోవిందరామ । రాజులొస్తారు గోవిందా । పీటలూవేయించు గోవిందరామ । తమ్ములునలుగురు గోవిందా । చంకబెట్టుకచెలి గోవిందరామ । కాంత యింటికిరాగ గోవిందా । హారతులుయిచ్చిరి గోవిందరామ । శుభముహూర్తంబున గోవిందా । సంతోషముననుండె గోవిందరామ । కొంతకాలంబునకు గోవిందా । బాలుల నల్గురికి గోవిందరామ । అన్నప్రాశనచేయ గోవిందా । రాజరుషియూకలిసి గోవిందరామ , మంచివేళలుజూచి గోవిందా । రుషులనుబిలిపించె గోవిందరామ । రుష్యశృంగుతోగూడి రుషులెల్లవచ్చిరీ గోవిందా । కనకపీటలువేసె గోవిందరామ । బాలులనలుగురిని గోవిందా , జలకమాడించిరీ గోవిందరామ । చలువతళ్ళొత్తిరి గోవిందా । కస్తూరితిలకంబు గోవిందరామ । కన్నులకాటుక గోవిందా । రాసుతులకునువుంచె గోవిందరామ । బాలతొడుగులువారు గోవిందా । బాలులకువుంచిరీ గోవిందరామ । సుతులనల్గురిరాజు గోవిందా । సరసముగవడినుంచి గోవిందరామ । బంగారుతబుకుతో గోవిందా । క్షీరాన్నమునుదెచ్చి గోవిందరామ , పసిడిగిన్నెతోవుంచె గోవిందా । ఆయుధంబులుపండ్లు గోవిందరామ , ఆభరణంబులు గోవిందా । ఛత్రచామరములు గోవిందరామ । చక్కయెదుటనువుంచ గోవిందా । పట్టాభిషేకపుంగ్రం గోవిందరామ । భరతుడుతీసెను గోవిందా । వజ్రాయుధంబును గోవిందరామ । శత్రఘ్నుడుపట్టె గోవిందా । చామరంబొక్కటి గోవిందరామ । లక్ష్మణుడుతాదీసె గోవిందా । రత్నకవచంబొకటి గోవిందరామ । రామచంద్రుడుదీసె గోవిందా । రాజుసంతోషించి గోవిందరామ । తనవ్రేలిముద్రికతొ గోవిందా । అన్నప్రాశన జేసి గోవిందరామ । ఆరగించిరివారు గోవిందా । హారతులుయిచ్చిరీ గోవిందరామ । అందరునుకలిసి గోవిందా । ఆరగించీలేచె గోవిందరామ । కర్పూరవీడెములు గోవిందా , క్రమముగాచేసిరి గోవిందరామ । శాంతఆటలుచూడ గోవిందా । మహామునికిమనసాయె గోవిందరామ । శాంతికార్యంచేయ గోవిందా । రాజరుషియాతలచ గోవిందరామ ।

దశరథమహారాజు గోవిందా । తనయకుశుభమిపుడు గోవిందరామ । తరుణిబాలతగదు గోవిందా । అతివేమియెరుగదు గోవిందరామ । అబలయనితాబల్కె గోవిందా । మామమాటయువిని గోవిందరామ । రుష్యశృంగుడుపల్కె గోవిందా । గొప్పవారిబిడ్డకు గోవిందరామ । గల్యాణమితగదు గోవిందా । జమ్మిచెట్లకుయిచ్చి గోవిందరామ । పరిణయంచేసితే గోవిందా । పణతిబాగుండును గోవిందరామ । మామమీరనిపల్కె గోవిందా । రుష్యశృంగుడువెళ్ళె గోవిందరామ । కౌసల్యమహాదేవి గోవిందా । కాంతదగ్గిర చేరి గోవిందరామ । అల్లుడూకోపించి గోవిందా । అడవికియేగితే గోవిందరామ । వెదకి తేవగలేను గోవిందా । స్త్రీలమర్మంవల్ల గోవిందరామ । సిద్ధరుషితెచ్చితిమి గోవిందా । అల్లునికార్యంచేయ గోవిందరామ । అయోధ్యలోనుండు గోవిందా । రాజురుషియుకలిసి గోవిందరామ । మంచివేళలుజూచి గోవిందా । మాండవ్యమహామునికి గోవిందరామ । మగువకుకార్యమని గోవిందా । బంధుపరివారముతొ గోవిందరామ । సతిసుతులతోడ్కొని గోవిందా । సరగుననురండని గోవిందరామ । శుభలేఖలువ్రాసి గోవిందా । భూసురులచేతి కియ్య గోవిందరామ । రుషిపల్లెవారేగి గోవిందా । మహాఋషికిచ్చిరి గోవిందరామ । మహారుషిఅదిజూచి గోవిందా । మగువతోనూజెప్పి గోవిందరామ । అందరూపయనమై గోవిందా । అయోధ్యచేరిరీ గోవిందరామ । రాజుసతులూకలిసి గోవిందా । రుషికియెదురుగ వచ్చి గోవిందరామ । వందనంబులుజేసి గోవిందా । నరపీఠములువేసి గోవిందరామ । కూతురికిఅల్లునికి గోవిందా । కౌసల్యతలలంటె గోవిందరామ । అడవికియేగినా గోవిందా । అయోధ్యలోవున్న గోవిందరామ । కాంతభారముమీది గోవిందా । తరతరంబులమీకు గోవిందరామ । దౌహిత్రులుకలుగవలె గోవిందా । జలకమాడించిరీ గోవిందరామ । చలువతళ్ళొత్తిరి గోవిందా । పీతాంబరముతెచ్చి గోవిందరామ । అల్లునికియిచ్చిరి గోవిందా । కరకంచులచీర గోవిందరామ । కాంతకునుయిచ్చిరి గోవిందా । హారములుపతకములు గోవిందరామ । అల్లునికివేసిరి గోవిందా । బాలతొడుగులుఅన్ని గోవిందరామ । పణతికిని వుంచిరి గోవిందా । అగ్నిహోత్రమువేల్చె గోవిందరామ । మంత్రములుజదివిరి గోవిందా । దంపతులనువుంచి గోవిందరామ । హోమంబువేల్చిరీ గోవిందా । ఆశీర్వదించిరి గోవింద రామ । అరుంధతిఅనసూయ గోవిందా । హారతులుయిచ్చె గోవిందరామ । మాడలు సొమ్ములు గోవిందా । మహారాజువారికిచ్చె గోవిందరామ । తనసుతులచేతను గోవిందా । రాజుకట్నమిప్పించె గోవిందరామ । అప్పుడుకౌసల్య గోవిందా । వంటశాలలుజూచె గోవిందరామ । వియ్యాలవారొచ్చి గోవిందా । యింటదిగివున్నారు గోవిందరామ । యత్నంబులేదన గోవిందా । కోకిలాదేవొచ్చి గోవిందరామ । స్నానంబుతాజేసి గోవిందా । పట్టుచీరయుగట్టి గోవిందరామ । కమండలముతోను గోవిందా । గంగతాచేకొని గోవింద

రామ । రమణిప్రోక్షించంగ గోవిందా । పాకమంతాఆయె గోవిందరామ । పన్నెండుకూరలు గోవిందా । పంచభక్ష్యాన్నములు గోవిందరామ । పాకంబులయిపోయె గోవిందా । కనక పీటలువేసె గోవిందరామ । కాంతలొడ్డించిరీ గోవిందా । బంధుబలగములతో గోవిందరామ । కూతురునిఅల్లునితోడ గోవిందా । సతిసుతులతోడను గోవిందరామ । రాజఋషియుకలిసి గోవిందా । ఆరగించీలేచి గోవిందరామ । హస్తములుతాకడిగి గోవిందా । వీడెములుతాజేసి గోవిందరామ । వియ్యాలవారికి గోవిందా । కట్టువర్గంబులు గోవిందరామ । భూకాంతుడు తాయిచ్చె గోవిందా । కోకిలాదేవికి గోవిందరామ । కౌసల్యసుమిత్ర గోవిందా । కట్టువర్గ ములిచ్చె గోవిందరామ । సాయంకాలమువేళ గోవిందా । సతిపతులారగించి గోవిందరామ । హస్తములుకడిగిరి గోవిందా । విడెములుచేసిరి గోవిందరామ । మహామునినగరులో గోవిందా । కనకపీటలువేసి గోవిందరామ । దంపతులనిద్దర గోవిందా । పీటలపైనుంచె గోవిందరామ । మధుపర్కములుదెచ్చి గోవిందా । అల్లునికియిచ్చిరీ గోవిందరామ । మాణి క్యాలచీర గోవిందా । మగువకుయిచ్చిరీ గోవిందరామ । రుష్యశృంగునిచేత గోవిందా । ఫల ప్రదానమిప్పించె గోవిందరామ । ముప్పదిమూడువేల గోవిందా । కోట్లదేవతలు గోవింద రామ । మూడుకోట్లరుషులు గోవిందా । దీవించిరీవార్ని గోవిందరామ । పానుపునవుంచిరీ గోవిందా । రుష్యశృంగుడు గోవిందరామ । రమణినితాబిలిచి గోవిందా । సరిరాజుసముగాము గోవిందరామ । సరసిజాక్షీబిల్వ గోవిందా । పుంగరంబెగరేయ గోవిందరామ । ఆమర్మము లెరుగము గోవిందా । ముద్దుగుమ్మావచ్చి గోవిందరామ । విడెముచుట్టిమ్మనగ గోవిందా । విడెముచుట్టియిచ్చి గోవిందరామ । అత్తరుపన్నీరు గోవిందా । పండ్లుఫలహారములు గోవిందరామ । సతిపతులుఆరగించి గోవిందా । సుఖనిద్రచేసిరి గోవిందరామ । మరికొంత సేపటికి గోవిందా । మహారుషియుతాలేచి గోవిందరామ । సతిని నిద్రాలేపి గోవిందా । నిజరూపుచూపింతు గోవిందరామ । నిర్భయంబుగచూడు గోవిందా । పుడమియాకాశమును గోవిందరామ । భూసురుడువక్కపై గోవిందా । విశ్వంబువెరువంగ గోవిందరామ । విశ్వ రూపముచూప గోవిందా । గడగడవణకుచు గోవిందరామ । కాంతతానిలుచుండ గోవిందా । అతివరోజడిసితివని గోవిందరామ । అంగనుచేరబిలిచి గోవిందా । సుఖనిద్రనుజెంది గోవిందరామ । వేకువజామునలేచి గోవిందా । రుషియుతపసుకువెళ్ళె గోవిందరామ । పతికిభయపడిశాంత గోవిందా । మరిలేవదాయెను గోవిందరామ । పదిగడియలాప్రొద్దు గోవిందా । పరగంగయెక్కెను గోవిందరామ । శాంతనుజూడంగ గోవిందా । తల్లులూ వచ్చిరీ గోవిందరామ । తండ్రులువచ్చిరీ గోవిందా । కోకిలాదేవొచ్చె గోవిందరామ । పిలిచినపలుకరు గోవిందా । కన్నెత్తిచూడదు గోవిందరామ । కాంతజడిసినదని గోవిందా । వసిష్ఠునిబిలిచి గోవిందరామ । విభూతిపెట్టుమని గోవిందా । విభుడువస్తేగాని గోవింద

రామ । కార్యమొనగూడదని గోవిందా । తపసుచేసుకరుషి గోవిందరామ । తరుణిదగ్గర కొచ్చి గోవిందా । కమండలోదకంబు గోవిందరామ । కాంతముఖమునజల్లి గోవిందా, సంచిలోవిభూతి గోవిందరామ । సరసిజాక్షికిపుంచ గోవిందా, కలకలనవ్వుచు గోవింద రామ । కమలాక్షిలేవగ గోవిందా । కలికిచిలుకలకొల్కి గోవిందరామ । కండ్లపడలేదని గోవిందా । కౌసల్యసుమిత్ర గోవిందరామ । కాంతలంతావెడలె గోవిందా । తల్లులుయెత్తు కొని గోవిందరామ । తలలంటినీరుబోసి గోవిందా । ద్రిష్టియునుతాదీసి గోవిందరామ । అలంకారములుచేసి గోవిందా । వధూవరులకు గోవిందరామ । విందూలుతాచేసి గోవిందా, ఆరగించిలేచి గోవిందరామ । హస్తములుకడిగిరీ గోవిందా । విడెములుచేసిరి గోవింద రామ । మూడునిద్రలువారు గోవిందా । ముదముతోచేసిరి గోవిందరామ । రాచకన్యాగనుక గోవిందా । రాచనడుపడినొప్పె గోవిందరామ । వారియాచారంబు గోవిందా । విడనాడి యిప్పుడు గోవిందరామ । మననడవడినేర్పి గోవిందా । మగువనుపుంచవలె గోవిందరామ । అనుచుచెప్పిరాజు గోవిందా । దర్భాసనంబును గోవిందరామ । చిత్రాసనంబును గోవిందా, వజ్రకమండలం గోవిందరామ । మహామునికితాయిచ్చె గోవిందా, అల్లునికి దశరథుడు గోవిందరామ । జోడుశాలువలిచ్చె గోవిందా । అడవికీ యేగినా గోవిందరామ । అయోధ్య లోవున్న గోవిందా । రుషిపల్లెలోవున్న గోవిందరామ । శాంతభారంమీదని గోవిందా । చేతిలోచెయివేసి గోవిందరామ । రుషిచేతిలోబెట్టి గోవిందా । శాంతనూవిడనని గోవింద రామ । శపథంబురుషిచేసె గోవిందా । రాజుభార్యబిలిచి గోవిందరామ । వడినబియ్యంబుంచి గోవిందా । వడిగట్టుకట్టండి గోవిందరామ । అప్పుడుఅత్తవచ్చి గోవిందా । వడిచీరకట్టెను గోవిందరామ । సిరిగుల్కుచుక్కతెవు గోవిందా । మణులుపతకములిచ్చి గోవిందరామ, క్షీరాన్నముంచెను గోవిందా । అతివఆరగించె గోవిందరామ । కర్పూరవిడెమేసె గోవిందా, శాంతతోఆడేటి గోవిందరామ । చెలికాళ్ళువగచిరీ గోవిందా । రాజురుషియుకలిసి గోవింద రామ । మంచివేళలుజూచి గోవిందా । పట్నపేనుగుదెచ్చి గోవిందరామ । అంబారి వేయించి గోవిందా । రుషినిశాంతనుకూడ గోవిందరామ । అంబారియెక్కించి గోవిందా । జయభేరివేయించి గోవిందరామ । రుషిపల్లెలోవారు గోవిందా । అందరూచేరిరి గోవింద రామ । శాంతసారెలు గోవిందా । సరసముగపరచిరి గోవిందరామ । శాంతనుదిగవిడచి గోవిందా । రాజుసతులనుగూడి గోవిందరామ । బంధుపరివారముతొ గోవిందా । అయోధ్య చేరిరి గోవిందరామ । మరికొంతకాలమును గోవిందా । మగువనుజూచుటకు గోవిందరామ । తల్లులకుమనసాయె గోవిందా । వసిష్ఠుడూయిచ్చి గోవిందరామ । వనితనుజూచుటకు గోవిందా । దశరథుడుతనసతుల గోవిందరామ । సుతులనుతోడిచ్చి గోవిందా । రుషిపల్లె లంపంగ గోవిందరామ । కౌసల్యసుమిత్ర గోవిందా । కాంతనుజూచిరి గోవిందరామ ।

భరద్వాజునియింట గోవిందా । విందారగించిరీ గోవిందరామ । మాండవ్యమహాముని గోవిందా । మగుడివిందుకుబిలువ గోవిందరామ । మనుమడుకలగనిదె గోవిందా । మీయింటభోజనము గోవిందరామ । మేముచెయ్యమనగ గోవిందా । రుషికికోపంవచ్చి గోవిందరామ । సుతసంపననిపల్క గోవిందా । మనుసునిలుపగలేక గోవిందరామ । మగువలుభోంచేసి గోవిందా । సుదతినిదోడ్కొని గోవిందరామ । అల్లునిదోడ్కొని గోవిందా । బరివారములతో గోవిందరామ । అయోధ్యచేరంగ గోవిందా । కోసలేంద్రుం డంత గోవిందరామ , కొలువులోకూర్చుండి గోవిందా । వియ్యాలవారికి గోవిందరామ । వినయములుతాచేసి గోవిందా । చదురుచేసిరాజు గోవిందరామ । చక్కగాకూర్చునె గోవిందా । కూతునెత్తుకకౌసల్య గోవిందరామ । నగరుకుచేరగా గోవిందా । కన్నెత్తి చూడడు గోవిందరామ । పిలిచినపలుకడు గోవిందా । భీష్మించుచున్నాడు గోవిందరామ । యినవంశరాజని గోవిందా । కూతునెత్తుకసతి గోవిందరామ । రాజుదగ్గరరాగా గోవిందా । తనయశాంతాదిగి గోవిందరామ । దండముబెట్టియు గోవిందా । మావల్లతప్పేమి గోవింద రామ । మహారాజు సెప్పుమన గోవిందా । మీతల్లికౌసల్య గోవిందరామ । మిగులగడుసుదిగనుక గోవిందా । మగనిమాటయుదాటి గోవిందరామ । మరిమగువనినడుచుననె గోవిందా । అంతటా కౌసల్య గోవిందరామ । పతిపాదములబడగ గోవిందా । కాంతకండ్లనుజూచి గోవిందరామ । కరుణించె ఆరాజు గోవిందా । శాంతనెత్తుకరాజు గోవిందరామ । నాతల్లిశాంతమ్మ గోవిందా , నగలుకావలెనమ్మ గోవిందరామ । ఏనుగులుగుఱ్ఱాలు గోవిందా । రథవాహనంబులు గోవిందరామ ; మణులురత్నములయిన గోవిందా । మగువరోకావలెన గోవిందరామ । యేమేమికావలెనో గోవిందా । యెలనాగకోరుమన గోవిందరామ । నలుగురుతమ్ములకు గోవిందా । సరిపోలునట్టుగా గోవిందరామ । పసిడిబొమ్మలునాల్గు గోవిందా । చేయించి యివ్వమన గోవిందరామ । విశ్వకర్మనుబిలచి గోవిందా । పసిడిపుత్తడియిచ్చి గోవింద రామ । బొమ్మలనుచేయించి గోవిందా । కొమ్మకునుయిచ్చిరి గోవిందరామ । బొమ్మలతో గుమ్మలు గోవిందా । ఆడుచుపాడుచునుండె గోవిందరామ । సంతోషచిత్తులయి గోవిందా , దశరథులు వుండగా గోవిందరామ । జనకమహారాజునకు గోవిందా । సంతానములేక గోవిందరామ । యజ్ఞంబు చేయుటకు గోవిందా । భూమిదున్నించగా గోవిందరామ । నాగేటిచాలున గోవిందా । మందసంతగలంగ గోవిందరామ । పరిచారకులువెళ్ళి గోవిందా । జనకునకుచెప్పంగ గోవిందరామ । సంతోషమునుపొంది గోవిందా । నిదియుదొరికెనని గోవిందరామ । సభకునుసెలవిచ్చి గోవిందా । పాదచారై తాను గోవిందరామ । పరుగుపరు గునవచ్చి గోవిందా । క్షేత్రంబుత్రవ్వించి గోవిందరామ । బంగారపుపెట్టి గోవిందా । రంగుగాదొరకంగ గోవిందరామ । వెలుపలకుతీయించి గోవిందా । ద్వారంబుతెరవంగ

గోవిందరామ । ధగాధగాలాడుచు గోవిందా । కలకలనవ్వుచు గోవిందరామ । కేకలను వేయుచు గోవిందా । సిరిగుల్కుచున్నట్టి గోవిందరామ । శ్రీలక్ష్మిదొరకంగ గోవిందా । బాలనూతామెత్తి గోవిందరామ । మురిపెముతోముద్దాడి గోవిందా । నగరకుయేతెంచి గోవిందరామ । నాతులకుయివ్వంగ గోవిందా । సంతోషమునుపొంది గోవిందరామ । రమణిబాలింతయి గోవిందా । పురుడునూతాగడిపి గోవిందరామ । భారసాలయుచేసి గోవిందా । సీతయనునామంబు గోవిందరామ । స్థిరముగాచేయించి గోవిందా । దశదాన ములుతాను గోవిందరామ । ధరణిసురులకుచేసి గోవిందా । పరిచారకులబెట్టి గోవిందరామ । పణతినితాబెంచి గోవిందా । శివవిల్లువిరచితె గోవిందరామ । సీతనిత్తునని గోవిందా , స్వయంవరముచాటించ గోవిందరామ । కౌశికునిజన్నంబు గోవిందా । ఖరదూషణాదులు గోవిందరామ । క్రతువుదగ్ధముజేయ గోవిందా । అందుకోపగలేక గోవిందరామ । అయ్యోధ్య మునివెళ్ళి గోవిందా । దశరథునిదీవించి గోవిందరామ । యిద్దరూరక్కసులు గోవిందా । అక్కడానాక్రతువు గోవిందరామ । పడటకలపివారు గోవిందా । పారిపోతున్నారు గోవిందరామ । పట్టుపడరెవ్వరికి గోవిందా । రామలక్ష్మణులు గోవిందరామ । రంగుగానా కిమ్ము గోవిందా । వారితోడుకపోయి గోవిందరామ । అసురులవధియించి గోవిందా । జన్నంబుచేసికొని గోవిందరామ । చిన్నలాతోడ్కొని గోవిందా । చయ్యననువేవత్తు గోవిందరామ । అంతటామహారాజు గోవిందా । ఆలోచనలుచేసి గోవిందరామ । శాపంబు యిచ్చునో గోవిందా । కొట్టునోతిట్టునో గోవిందరామ । కోపగించునో గోవిందా । తనలోన తాదలచి గోవిందరామ । రామలక్ష్మణులబిలిచి గోవిందా । రాజరుషివెంటనూ గోవింద రామ । వెళ్ళుమనిసెలవివ్వ గోవిందా । రుషితోడవారేగి గోవిందరామ । రాక్షసులబరిమార్చి గోవిందా । క్రతువునూనెరవేర్చి గోవిందరామ । మునియుసంతసమంది గోవిందా । బలాతి బలలను గోవిందరామ । రెండుబాణములిచ్చి గోవిందా । జనకుడున్నచోటు గోవింద రామ । యీచక్కనున్నది గోవిందా । చూచిపోదమని గోవిందరామ । మిథిలకుయేగంగ గోవిందా । జనకుడెదురుగవచ్చి గోవిందరామ । ఆతిథ్యములుయిచ్చి గోవిందా । అల్లుని పూజించ గోవిందరామ ।అఖిలరాజులుజూడ గోవిందా । శివచాపమునువిఱువ గోవిందరామ । సీతనిత్తునని గోవిందా । స్వయంవరముచాటించ గోవిందరామ । దశరథునికప్పుడు గోవిందా । లేఖలువ్రాయంగ గోవిందరామ । బంధుపరివారముతో గోవిందా । కాలుబలం బుతో గోవిందరామ । కల్యాణముకురాగ గోవిందా । సీతయుమాండవి గోవిందరామ । పూర్మిళశ్రాతకీర్తి గోవిందా । నల్గురుకన్యలను గోవిందరామ । ఆజనకమహారాజు గోవిందా యినవంశజునియొక్క గోవిందరామ । నలుగురుసుతులకు గోవిందా । నాతులనుతాయిచ్చి గోవిందరామ । పరిణయంచేసియు గోవిందా । పసుపుకుంకుమపండ్లు గోవిందరామ ।

పాలకీలేనుగులు గోవిందా । పానుపులు పతకములు గోవిందరామ । మణులుమగువలకిచ్చి గోవిందా । మగుడిపంపంగాను గోబిందరామ । కడుసంతసంబుతో గోవిందా । కదలివచ్చు చునుండ గోవిందరామ । పరశురాముడువచ్చి గోవిందా । పరమాత్మునితోడ గోవిందరామ । ప్రబలవాదముచేసి గోవిందా । ప్రణతుడై యేగంగ గోవిందరామ । పట్నముకు వారుచేరి గోవిందా । పతులుసతులూకలసి గోవిందరామ । విభవముతోనూరేగిగోవిందా । అయోధ్య లోపల గోవిందరామ । అంతఃపురమందున గోవిందా । ఆనందమునసుండె గోవిందరామ । యిక్ష్వాకునికథలు గోవిందా । యిలలోనస్మరియించి గోవిందరామ । యిందులనందరికి గోవిందా । యెడతెగనిసంపదలు గోవిందరామ । విష్ణుదేవుండిచ్చు గోవిందా । మఱిమఱి సంపదలు గోవిందరామ । మహాదేవుడిచ్చును గోవిందా ॥

# కౌసల్య వేవిళ్లు

శ్రీరామచంద్రులూ చెలగికౌసల్య । చారుగర్భమునందు చేరివుండగను ।

( కిటతకిట, కిటతకిట, కిటతకిట, కిటతకిట )

లేడిమనసాయె వెలదీకి నపుడూ । వేడూకలై తోచె యింతులకు యిపుడూ ।

పొందూగపొగిచిన పుల్లనిచల్లా । నిమ్మరసముతో నూరుమామిడల్లంబూ ।

పుల్లాదానిమ్మపండ్లు ఖజ్జూరములునూ । పల్లవపాణులు కొల్లలుగాదెచ్చి ।

యిచ్చీరికౌసల్య కెచ్చుకతోడా । నిండుచంద్రునిబోలు భాసిల్లుముఖమూ ।

దండిపాలిండ్లు నిండుగవిస్తరించె । నలుపాయె యింతికినీ పాలిండ్లమొనలూ ।

వీలువీలుననడుము విస్తరమాయె । నల్లచీమలబారు నాతినూగారు ।

మెల్లమెల్లగబొడ్డు మెరకాయనమ్మా । యీరీతినెలలన్ని నిండియుండగనూ ।

అలసిరాచకన్యా అటుపవ్వళించే । దినదినము గర్భిణి యటువృద్ధిబొందె ।

రతికాంక్షదప్పెను రాజీవాక్షికిని । చురుచురుకున నడుము చురుకాయనమ్మా ।

యెమిమంత్రసాన్ని పిలిపించారమ్మా । మంత్రసానంతాట సామంతముతోవచ్చి ।

కాంతానుజూచి చక్కగ వెన్నుజరచి । ఋడియాకే కౌసల్య ఋడయాకే మగువ ।

గడియాలోనెనీకు కొడుకూగల్గేనే । నిలువున్నా నగలన్నిసుదతికిదీసి ।

బలువైనా నగలన్ని పణతికిదీసి । బంగారుజల్తారు పగ్గపగ్గములువేసి ।

పొంగుచుదూలాము మూలానగట్టి । పణతినిపగ్గములు చేబట్టిరీ ।

అమ్మఅమ్మనేతాళ అమ్మఅమ్మనేతాళా । అమ్మాయీనిముషాము ఆయెనూరేండ్లు ।

అష్టామీదినమునా ఆదివారమునా । కాకుస్థుడుదయించె భువిసంతసిల్లా ।

వెండికాగులతోను వేణ్ణీళ్ళతోడి । భమిడికాగులతోను చన్నీళ్ళతోడి ।

చన్నీళ్ళవేనీళ్ళ సమముగాదొల్చి । మూడుదోసిళ్ళనీళ్ళ ముందుగబోసె ।

జలకమాడించెనే తల్లికౌసల్య । మెత్తనివస్త్రమున మేనుతళ్ళొత్తి ।

కళ్ళకాటుకబెట్టి తిలకంబుదిద్ది । నవరత్నతొట్టిలో బాలునియుంచి ।

జోలపాడెను అపుడుతల్లి కౌసల్య । పొలతులెవ్వరయిన యీపాటబాడిన ।

రామచంద్రులవంటి పుత్రులుగల్గి । వర్ధిల్లుచుందురు ఎల్లకాలంబు ।

# లాలిపాట

లాలి మాధవుడ లాలీ । గోవింద లాలి అచ్యుతుడలాలీ ।
లాలికేశవుడలాలీ । హరిహరీ బాల రఘురామ లాలీ ॥
శ్రీవెలయు నయోధ్యలో । దశరథుడు చెలగివేడుక నుండెనూ ।
అవనిజనాథుడపుడూ । భువిలోన అవతారమై వెలసెనూ ॥ లాలి ॥
పుత్రకామేష్టిచేసి ఆరాజు । పుత్రులను గోరగానూ ।
పాత్రతోపరమాన్నమూ । దెచ్చియా పరమపురుషుని కిచ్చెను ॥ లాలి ॥
పరమాన్నమపుడుదెచ్చీ । ఆరాజు పణతులకు నొసగగానే ।
స్వర్గామున గర్భమనుచూ । ధరియించి సంతోషమును నొందిరీ ॥ లాలి ॥
ఆరునెలలాయెననుచూ । కౌసల్య కపుడు సీమంతమనగా ।
ఆరూఢిగాశాయగా । వశిష్టాదు లందరిని దీవించెనూ ॥ లాలి ॥
పదినెలలుమోచినపుడు । కౌసల్య ప్రసవకాలముగనుకనూ ।
సుజనముగ ముగ్గురికినీ । సుఖముగా సుతులునల్గురు గల్గిరీ ॥ లాలి ॥
ఆదివశిష్ఠాదిరుషులా । బిలపించిరపుడె ప్రత్యక్షముగనూ ।
యంచగలధనధాన్యము । దశరథుడు బ్రాహ్మణుల కిప్పించెనూ ॥ లాలి ॥
రామలక్ష్మణులనుచునూ । ఆమీద నామకరణము వ్రాయగా ।
భరతశత్రుఘ్నులనుచూ । ఆమీద నామకరణముచేసిరీ ॥ లాలి ॥
రంగైనరత్నాలచే । చెక్కినా బంగారుపతకములనూ ।
రత్నాలు రావిరేకా । కౌసల్య రామునికి ధరియించెనూ ॥ లాలి ॥
అందమైనాతొట్టెలో । శ్రీరామ చంద్రుడుండెను సొగసునా ।
అంగనామణులుజూచి । మదిలోన ఆశ్చర్యమును బొందిరీ ॥ లాలి ॥
సత్యస్వరూపుడమ్మ । యీబిడ్డ అచ్యుతానందుడమ్మా ।
అన్నిటాసుకుమారుడే । యీబిడ్డ ఆదినారాయణుండే ॥ లాలి ॥
వీరాధివీరుడమ్మా । యీబిడ్డ వేదాంతశూరుడమ్మా ।
భక్తవత్సలుడెయమ్మా । యీబిడ్డ బంగారు రూపుడమ్మా ॥ లాలి ॥
కరుణాకటాక్షుడమ్మా । యీబిడ్డ కరిరాజ వరదుడమ్మా ।
పురుషోత్తముండీతనీ । పాదములు పూజించిసేవింతుమా ॥ లాలి ॥

నీలమేఘశ్యాముడే । యీబిడ్డ నిత్యస్వరూపుడెయమ్మా ।
బాలుడై వుదయించనే । కౌసల్య భాగ్యమెట్టిదో చూడరె ॥ లాలి ॥
వటపత్రశయనుడితడే । వోయమ్మ వైకుంఠ పురవాసుడే ।
కుటిలకుంతలచూడరే । దశరథుడి కోర్కెవీడెరెగనరే ॥ లాలి ॥
ద్రిష్టిడగల్యాకుండనూ । అందరూ దీపాలుపళ్లెరములా ।
అష్టకన్నెలుగూడిరీ । రామునకు హారతులు యిచ్చుచుండా ॥ లాలి ॥
పసుపుగంధముపువ్వులు । మేలైన పన్నీరుగంధములనూ ।
పసిడితబుకులనుంచితే । సుమిత్ర పణతులకు తానిచ్చెనూ ॥ లాలి ॥
పదిదినుసులవాయినాలూ । ఘనమైన పండుటెంకాయలపుడే ।
పసిడితబుకులనుంచియే । సుమిత్ర పణతులకు తానిచ్చెనూ ॥ లాలి ॥
నూరుపుట్లా శనగలూ । నీళ్లల్లో నానబోశీ తెచ్చిరి ।
వారిజాక్షులకునెల్లో । కయికమ్మ వాయనాలిప్పించెనూ ॥ లాలి ॥
అప్పుడే దోవలోను । శనగలూ వొప్పుగా నమిలిచూచి ।
ఉప్పులేదనుచు వకతే । మరియొకతెచక్కగా నున్నవేనూ ॥ లాలె ॥
ఊచుమనిసుదతులంతా । పాడుమని పరమ భాగవతులెల్లా ।
ఆడుచును రంభలాడా । బంగరుయ్యాలలూ.ుచు రంగశాయీ ॥ లాలి ॥

# శ్రీరామ జననము

లాలి మాధవుడ లాలి । గోవింద లాలి అచ్యుతుడ లాలి ।
లాలి కేశవుడ లాలి । హరి హరి రాములకు రామ లాలి ।
శ్రీవెలయు నయోధ్యలో । దశరధులు చెలగి వేడుకనుండగా ।
అవనిజనాథుడపుడు । భువిలోన నవతరింపుచుననుండె ।
పుత్రకామేష్టిజేసి । దశరధుడు పుత్రులను గోరగాను ।
పాత్రతో పరమాన్నము । తెచ్చియా పరమ పురుషుల కిచ్చెను ।
పరమాన్నమపుడు తెచ్చి । యారాజు పణతులకు నివ్వగాను ।
సరగునను ఆగర్భము । ఉదయించి సంతోషమును బొందిరి ।
ఆరు నెలలాయెననుచు । కౌసల్య కపుడు సీమంతమనగ ।
ఆరూఢిసేయగాను । వసిష్టులందరు దీవించిరి ।
పది నెలలు మోసి తరుణి । కౌసల్య ప్రసవకాలంబనగను ।
సుదినమున ముగ్గురికిని । సుఖముగా సుతులు నల్గురుగల్గిరి ।
అప్పుడా రాజుతోను । ఆవార్త చెప్పినా వారలకును ।
మెప్పైన వస్త్రంబులు । బహుమాన మిప్పించి యుప్పొంగిరి ।
అంతట వశిష్టాది ఋషులు । రాజుతోనపుడు పుత్రోత్సవమన ।
వంతుగల ధనధాన్యము । బ్రాహ్మణుల కిప్పించెను ।
పది దినములాయెననుచు । కౌసల్య పడతులను బిలువనంపె ।
పసుపు నూనె సున్నెతో । నరుంధతి పంచి పెట్టించె లేమా ।
బాలులకు నీళ్ళబోసి । యావెనుక బాలింతలు జలకము ।
సాంబ్రాణి ధూపంబులు । తడియొత్తి చాలగాను వేసిరి ।
పులగంబు నేతితోను । బెల్లంబు పడతులు ఆరగించి ।
తాంబూలముల నందుకు । తరుణులు తరలిరి గృహములకును ।
పదు నొకండాయెననుచు । ఆరాజు పట్నమెల్లా సాటెను ।
పణిహారుల బిలచెను । తగినట్టి పనుల నానతి యిచ్చెను ।
తోరంబులు గట్టిరి । కర్పూర సున్నములు ధరియించిరి ।
ముత్యాల ముగ్గులిడిరి । రత్నాల రంగ వల్లులు వేసిరి ।

కౌసల్య సుమిత్రకు । కైకకు జలకంబులార్చిరంత ।
పట్టు చీరలు గట్టిరి । బాగైన పసిడి రెవికలు దొడిగిరి ।
కనుల కాటుక దీర్చిరి । కౌసల్య కస్తూరి చుక్కబొట్టు ।
శృంగారములు జేసుక । వచ్చిరి చిన్నబాలుల నెత్తుక ।
రత్నసింహాసనమున గూర్చుండి । రాజుసంతోషింపగా ।
ఆశీర్వాదము జేసిరి । విప్రులు అక్షింతలు యిచ్చిరి ।
నారదుడు వీణమీట । రంభలు నాట్యమాడుచు నుండగ ।
బంగారు మొలత్రాళ్ళను । మొలలకును శృంగారముగ గట్టిరి ।
స్వస్తి వాక్యములుజెప్పి । విప్రులు జదివిరి వేదంబులు ।
బంగారు తబుకులలో । రంగైన ఆణి ముత్యములుబోసి ।
వశిష్ట విశ్వామిత్రులు । గౌతమ వాల్మీకి భరద్వాజ ।
పచ్చల కలము దెచ్చి । వ్రాయించిరి పట్టుకొని రాజుచేత ।
రామలక్ష్మణులు యనుచు । ఆరాజు నామకరణము సేయగ ।
ఆమీద భరతుడనుచు । శత్రుఘ్నుడని నామములు వ్రాసిరి ।
స్వస్తివచనములు జెప్ప । విప్రులు జదివిరి వేదంబులు ।
కట్నములు చదివించిరి । రాజుకు కౌసల్యకు వేడ్కల ।
అందమైన సొమ్ములు । బాలులకు అందుకొని చదివించిరి ।
దీవించి ఋషులు బ్రహ్మ । బాలులు దీర్ఘాయుగా నేలుమీ ।
మంగళార్తిరవంబులు । గీతములు మగువలందరు బాడగ ।
అంగ నామణులు చూచి । వడినింప ఆణిముత్యముల సరులు ।
పగడంపు హారతులను । బాలులకు పడతులు యివ్వగాను ।
కట్నాలు చదివించిరి । దశరథునకు కాంతలకు మెప్పుగాను ।
చాల ప్రొద్దాయెననుచు । ఆరాజు సంతోషమున బల్కెను
వడ్డించుడన వేగము । వరుసగా విస్తళ్ళు వేయించిరి ।
భోజనపు శాలలోన । ఆణిముత్యాల పీటమీద ।
రాజశేఖరుడప్పుడు । దేవేంద్ర భోగముతొ గూర్చుండెను ।
బంగారు పళ్ళెరముతో । పంచపదార్ధములు వడ్డించెను ।
ఆవునేయి అతిరసాలు । కౌసల్య బంతులకు వడ్డించెను ।
పొందుగా భోంచేయుడీ । శ్రీరామ చంద్రుల ప్రసాదము ।
షడ్రసాలారగించి । విప్రులు సంతోషమున బల్కిరి ।

విప్రులు అలసిరనుచు । వింజామరలు వేయదొడగెనపుడు ।
మజ్జిగ పెరుగు మీరు । మీగడల కాంక్ష దీరగ గోలిుడీ ।
కరములు కడుగు కొనుచు । కర్పూర విడెముల నందుకొనుడీ ।
పాదపూజలు చేసిరి । విప్రులకు పట్టు కట్నము లిచ్చిరి ।
విశ్వబ్రహ్మను బిలిచిరి । వినయముగ తొట్టెలు గావించిరి ।
ఆ రాజు ఆనతివ్వ । ఆ బ్రహ్మ సంతోషమున బల్కెను ।
రామచంద్రుని తొట్టెలు । జేయను రంజిల్లుచునుండెను ।
బంగారు కోళ్ళుతెచ్చి । యొకవైపు పలుకు చిలుకల వ్రాసెను ।
నారాయణుని తొట్టెకు । నొకవైపు నెమళ్ళ చెక్కించెను ।
గోవిందుని తొట్టెకు । కీలున కోవెలలు పలికించెను ।
రామచంద్రుల తొట్టెను । చెయ్యను రంజిల్లుచూనుండెను ।
పైడినీరుబోసెను । బాగైన పట్టు నవారు అల్లీ ।
ఎంతధన్యుడనైతినో । యనుకొని సంతోషమున బల్కెను ।
అద్దాలతొట్టెజూచి । ఆరాజు ఆబ్రహ్మను మెచ్చెను ।
తబుకులతో ధనమిచ్చెను । తగునటుల కట్నములనిప్పించెను ।
రంగైన రత్నములను । తొట్టెలకు బంగారు గొలుసులను ।
పగడంపు స్తంభాలను । బాలులకుకట్టిరి యుయ్యాలకు ।
అద్దాల తొట్టెలోను । అరుంధతి అందుకొని యాబాలలా ।
పట్టుపొత్తిళ్ళు పరచి । కౌసల్య పవ్వళింపగ బెట్టెను ।
ముత్యాల చౌకట్లను । మేలైన మృదువైన హారములను ।
రత్నాల రావిరేక । కౌసల్య రామునకు ధరియించెను ।
దృష్టితగలకుండగ । కౌసల్య నొష్టచుక్కనుబెట్టెను ।
అష్టకన్యకలువచ్చి । రాములకు హారతులుయివ్వగాను ।
పట్టీలు పరిమళములు । మేలైన పండుటెంకాయలును ।
పైడితబుకులనుంచుకొ । కౌసల్య వాయినా లిప్పించెను ।
అద్దాల తొట్టెలోను । శ్రీరామచంద్రుడుండెడి సొగసును ।
అంగనామణులుజూచి । మదిలోన ఆశ్చర్యమును బొందిరి ।
సత్యస్వరూపుడమ్మా । యీబిడ్డ అచ్యుతానందుడమ్మ ।
కుటిల కుంతలి చూడరే । దశరథుల కోర్కెలీడేరెనమ్మా ।
తెచ్చివేదంబులన్ని । యీరాజు యిచ్చినాడే బ్రహ్మకు ।

కూర్మమై మోసినాడే । యీబాల మందర పర్వతంబు ।
శ్రీమపడి తెచ్చినాడె । యీబాల సురలకెల్లానమృతము ।
ముందు పరము బాయనే । యీబాల ముచ్చుకై భూమిలోన ।
మర్ధించి కనకాక్షునీ । యీబాల ధరణి కొమ్ముకు దెచ్చెను ।
కార్త వీర్యార్జునునికై । యీబాల పరశురామావతారము ।
మందలోపల బుట్టెను । యీబాల మామ కంసుని జంపెను ।
బౌద్ధావతారంబున । యీబాల కార్యంబు సమకూర్చెను ।
లెక్కలేని బిందెల , సెనగలు తెప్పించి నానబోసి ।
వారి జాక్షులను బిలిచి । కౌసల్య వాయినాలిప్పించెను ,
పొత్తిళ్ళలో నుంచిన । శ్రీరాము తమ్ములను దీవించిరీ ।
అప్పుడాత్రం బొప్పగా । సెనగలు ఒప్పుగా నమిలి చూచి ।
ఉప్పులేదని యొక్కతె । మరియొకతె చప్పగానున్నదనుచు ।
ఉబుసులాడు కొనుచును । తమ తమ సుఖములు దెల్పుకొనుచు ।
తమయిళ్లకేగుచుండ్రీ । యీ లాలి పాడగా విన్నగానీ ।
పాల సంద్రపు బాలుడూ । శుభములను తప్పక తానిచ్చునూ ।

# రాములవారి తొట్టి

శ్రీరాములు సిరులుచేయంగజూచి । ప్రేమతోకౌసల్య పిలచిరాములను ।
భానువంశంబున ప్రభుడవైపుట్టి । సిరులేలజేసేవు చిన్నినాయన్న ॥ జోజో ॥
జోజో దశరథ రాజకుమారా । కౌసల్యావరపుత్ర కరుణాకటాక్ష ।
రఘుకులభూషణుడ రాజపూజితుడా । సీతాంగనాపతి శ్రీరామచంద్ర ॥ జోజో ॥
రత్నమ్మువలె అర్కవంశమునబుట్టి । జామాయె పోరేల చాలించవయ్యా ।
చంద్రబింబమునీకు దెచ్చియిచ్చేరు । పోరుమానవయ్య పుత్రరత్నమ్మ ॥ జోజో ॥
చందమామవలె సౌమిత్రివచ్చి । చంకదిగి ఆడరా యిక శంకలేక ।
ఇంతిచేకాక మేనెంతకందిందో । బంతులాడరముద్దు బాలలాకూడి ॥ జోజో ॥
చందమామనుజూపి దాయిదాయనుచు । అక్కడిక్కడజూపి ఆడించరమ్మ ।
ఎత్తుకున్న నిలువదేమిసేయుదునే । చంకబెట్టుకుంటె జారిపోయేను ।
పాలుగుడువడెయన్న పట్టెడే యిపుడు । ఉయ్యాలగట్టయిన యూచిపాడండి ॥ జోజో ॥
విశ్వబ్రహ్మను పిలిపించికౌసల్య । కుందనంబులతొట్టె ముందుగాచేయుమి ।
కలకల ఆపసిడి ప్రతిమలనువ్రాసి । హంసలను చిలుకలను అమరించెబ్రహ్మ ॥ జోజో ॥
బంగారుగొలుసులను పన్నినతొట్టె । బాలసూర్యులకెల్ల భ్రమగలుగు తొట్టె ।
శ్రీరాములకుగావించె శీఘ్రముగ తొట్టె ॥ జోజో ॥
బంగారుగిన్నెలో పాలునెయ్యిపోసి । సంపెంగతైలాన శిరసొప్పనంటి ।
మెత్తనికస్తూరి మెయినలుగుబెట్టి ॥ జోజో ॥
కలినీళ్లతో ముఖకమలమును కడిగి । చన్నీళ్ల వేన్నీళ్ల సమముగాజేసి ।
రెండుదోసిళ్ల తనుముందుగాబోసె । జలకమ్ములాడించె తల్లికౌసల్య ॥ జోజో ॥
మెత్తన్నివస్త్రాన మేనుతళ్కొత్తి । అత్తుకొని పాపడ్ని యెత్తుకొనివచ్చె ।
మెత్తన్ని యాపట్టు పొత్తిళ్ళపరచి । పాపడ్నిపదిలముగ పడుకుండబెట్టె ॥ జోజో ॥
వీభూతి చుక్కబొట్టు అమరంగబెట్టి । కాటుకబెట్టిరే కమలలోచనునకు ।
కప్పురపు ధూపాన కాపొప్పవేసి । పీతాంబరముగప్పిరే ప్రేమతో వారికి ॥ జోజో ॥
ముత్యాలకుళ్ళాయి ముద్దుగాబెట్టి । రత్నాలరావిరేక రామునకుబెట్టె ।
పెద్దముత్తైదులను ప్రేమతోబిలచి । పాపడ్నిపదిలముగ చేతులకుయిచ్చి ।
అమరొంద చైత్రశుద్ధపునర్వసు నక్షత్రమున । దొడ్డలగ్నము అనుచుతొట్టెలో నుంచి

పాటల గంధులు పాటలు పాడ ॥ జోజో ॥
పేరంటాళ్ళను ప్రేమతోబిలచి । పసుపు కుంకుమ గంధ పరిమళాదులను ।
అత్తరు పన్నీరు అతివలకుయిచ్చి । సెనగల పంచెనే కుసుమసిరిగంధి ॥ జోజో ॥
ఇళ్ళకుబోదామ యింతిరోమనము । కట్నాలు కానుకలు చాలయిప్పించి ।
ఇంతులకు యిస్తురే సంతోషముగను । ఆశీర్వాదముచేసి అక్షింతలేసిరి ॥ జోజో ॥
ఇన్నాళ్ళవాళ్ళము యింతిరోమనము । యిటువంటి సుందరు నెన్నడెరుగాము ।
వీరుడో శూరుడో ధీరుడో యితడు । బాలుడై వెలసెను బాలకృష్ణమ్మ ॥ జోజో ॥
గుంపుతుమ్మెదలే కొడుకుముంగురులు । విల్లంబులే వెన్నునీ నొసలు ।
వీరుడికి విచిత్రమయిన కనుబొమలును । కనులుచారెడు కలిగెరాములకు ॥ జోజో ॥
ఆజానుబాహులే అతని హస్తములు । పాదాన పద్మసిరిరేఖలే గలవు ।
నాసికము జోకదేశానలేదు । పచ్చపగడముగదే బాలయుదరమ్మ ॥ జోజో ॥
పూర్వజన్మభవంపు పుణ్యమేకాని । వైకుంఠవాసులే వచ్చి జనించె ।
ఈతొట్టి యెవ్వరూ పాడినావిన్నా । కౌసల్యకు శ్రీరాములు కలిగినట్లే ।
పుత్ర హీనుల కెల్ల పుట్టుదురు సుతులు ॥ జోజో ॥

# శ్రీరామ దండములు

పాలసముద్రముమీద పవళించురామ । శేషునిపయినిద్ర సేవించురామ ।
వటపత్రశాయివై పవళించురామా । శ్రీలక్ష్మితోనుండు స్థిరముగారామా ॥ దండాము ॥
దండాముకోదండ పతివయినరామా । దండకారణ్యమున చరియించినరామ ।
దండిగానసురాల చెండినరామా । దయతోటిమమ్మేలు దశరథారామా ॥ దం ॥
సురలెల్లమొరలిడితె ఆలించినరామా । సురవైరిద్రుంచిన మురవైరిరామా ।
అభయమిచ్చినవారిని అంపినరామా । ఆనందశుభలీల నుండినారామా ॥ దం ॥
పుత్రకామేష్టియందు పుట్టినరామా । దశరథసుతుడవై జన్మించినరామా ।
వరహావతారము యెత్తితివిరామా । చారుగుణాభిరామా అయోధ్యరామా ॥ దం ॥
అసురులను వధియించియున్న శ్రీరామా । కళ్యాణకౌసల్య సుతుడవౌరామా ।
అన్నదమ్ములు నలుగురమరీనరామా । ఆనందశుభలీల నమరినారామా ॥ దం ॥
తాటకీదర్పము నణచినరామా । కౌశికునియాగము గాచినరామా ।
మాయామృగమును జంపినరామా । వేడుకతోప్రఖ్యాతి వెలసినరామా ॥ దం ॥
జనకుడులేఖలు వ్రాయగారామా । దశరథుల కెరిగింపగారామా ।
కౌశికునితోయేగినరామా । లలినిబలాతుల వధియించినరామా ॥ దం ॥
నీపాదధూళిసోకి శ్రీరామా । అహల్యస్వర్గము కంపినరామా ।
రాతినాతిగ చేసినారామా । శబరీనిబ్రోచిన శౌర్యశ్రీరామా ॥ దం ॥
నేర్పుతో పురికప్పుడేగినరామా । బలిమితో హరివిల్లు విరిచినరామా ।
సీతజూచి వరియించినరామా । శ్రీ మీకమరింది సీతారామా ॥ దం ॥
ధనస్సువంచిన ధనుజాభిరామా । విలువిద్యచేకొన్న విజయశ్రీరామా ।
దేవదుందుభులు మ్రోయంగరామా । దేవతలందరు నపుడుమ్రొక్కుదురామా ॥ దం ॥
మగువమెడకు మంగళసూత్రంరామా । మాణిక్యాలతో కదిగితివిరామా ।
ముత్యాలతలంబ్రాలు పోసితివిరామా । భాష్యాముకట్టిన పతివిశ్రీరామా ॥ దం ॥
జనకసుతను పెండ్లాడినరామా । పరశురాముని భంగపరచినరామా ॥ దం ॥
సాకేతపురి కప్పుడేగినరామా । తల్లిదమ్ములతోడ సుఖముగారామా ।
తండ్రిపట్టంకట్ట దలచితేరామా । తల్లిఅడవులకంపె మిమ్ముశ్రీరామా ॥ దం ॥
తల్లినివూరడించి పంపినరామా । అతివతమ్ముడు నీవు అరిగితివిరామా ।

తపసివేషమ్ములు వేసితివిరామా । చిత్రకూటమునకు చేరితిరిరామా ॥ దం ॥
వనమునచరియించి వచ్చితిరిరామా । పర్ణశాలాగట్టి నిల్చితిరిరామా ।
చుప్పనాతికి ముక్కుచెక్కినరామా । ఖరదూషణుల ద్రుంచినరామా ॥ దం ॥
కనకంపుమాయ మృగమొచ్చెనురామా । పర్ణశాలాముందరాడెనురామా ।
సీతచూచి తెమ్మన్నదిరామా । విల్లునంబుతోటి వెడలితివిరామా ॥ దం ॥
వెనుకవెనుకకు మృగమునడచేనురామా । అడవిలోకప్పుడు వెళ్లెనురామా ।
హాసీతలక్ష్మణా అన్నాదిరామా । మీరనుచుమీదేవి భ్రమసెనురామా ॥ దం ॥
లక్ష్మణునిమీదగ్గరకు అంపెనురామా । రావణామాయలు వచ్చెనురామా ।
జానకినితోడుకొని పోయెనురామా । రావణునితో జటాయువుపోరెశ్రీరామా ॥ దం ॥
అంతటహనుమంతు నేలినారామా । వేషధారులై వచ్చిరిరామా ।
చెట్టుచాటున మృగము వేసితివిరామా । వాసిగాసుగ్రీవు నేలినారామా ॥ దం ॥
అవనీజాగుర్తు కపికి శ్రీరామా । ఆన వాలిచ్చి పంపినరామా ।
చెంగున వారధిదాటెనురామ । ముద్రిక సీతకు యిచ్చేనురామా ॥ దం ॥
వరుసతో వనమంత పెరకెనురామా । అక్షయ పుత్రుని జంపితివిరామా ।
లంకంత భస్మము చేసెనురామా । మీపాలిబంటునని వచ్చెనురామా ॥ దం ॥
సీతను జూచి వచ్చెనురామా । శిరోమాణిక్యము అందుకొనిరామా ।
మీరలీ వారదీ దాటి వచ్చెనురామ । ఆన వాలిచ్చి మ్రొక్కెనురామా ॥ దం ॥
జానకిక్షేమాన వున్నదిరామా । యిదిపంచి సమయము తర్లుమీరామా ।
వనచరులతోగూడి వేంచేయురామా । సైన్యముతోగూడి శ్రీరామా ॥ దం ॥
కులపర్వతాలన్ని తెచ్చితిరిరామా । నీలుండుసేతువును కట్టెనురామా ।
వుడతగట్టున యిసుక పోసిందిరామా । వారధిదాటి లంకజొచ్చినరామా ॥ దం ॥
లంకముట్టడివేసి నిలచిరిరామా । రావణ కుంభ కర్ణాదుల గూల్చినరామా ।
యింద్రజిత్తుని పడవేసినరామా । రావణాసురుతలలు ద్రుంచినరామా ॥ దం ॥
లంక విభీషణునికి కట్టినరామా । జానకి పంతము చెల్లించినరామా ।
సీతనుప్రామాణము చేయుమన్నారామా । సీతయగ్నియందు జొచ్చెనురామా ॥ దం ॥
సీతతో పుష్పక మెక్కినరామా । అయోధ్యపురికి వచ్చినరామా ।
తండ్రి మరణమువిని శోకిస్తివిరామా । కౌసల్య కౌగిటను జేర్చెనురామా ॥ దం ॥
సీతతో పట్టంబు కట్టుకొనిరామా । వేడుకతోపదహారు వేలేండ్లురామా ।
నల్గురి తమ్ములతోకూడి శ్రీరామా । ఏకముగా రాజ్యంబుయేలినరామా ॥ దం ॥
ఆటపాటల వారు ఆడంగరామా । అందరు కట్నాలు యివ్వంగరామా ।

నవరత్న రాసులతోనిండెనురామా । తేరెక్కి వీధులు తిరిగినరామా ॥ దం ॥
కరుణతో కౌసల్య వడ్డించేరామా । అన్నదమ్ముల పంక్తికూర్చుండిరిరామా ।
ప్రీతితోభోజనము చేసి్తిరీరామా । కర్పూరతాంబూలంవేసిరీరామా ॥ దం ॥
ఒప్పుగా మీసేవచేసితిరామా । యిపుడునేపుణ్యశాలినిరామా ।
యమునికినన్నప్పగించకురామా । యముడంటెభయమగునునాకు శ్రీరామా ॥ దం ॥
ఆదిమూలమని తలచితినిరామా । మమ్మాదరించి దయజూడురామా ।
తలపనేరక మోసపోతినిరామా । తలచితినినామీద దయయుంచురామా ॥ దం ॥
సతులుపతులు మిమ్ము తలచుదురురామా । చేపట్టి సుతులను పోషించురామా ।
యిక్ష్వాకుల వంశవర్ధనరామా । భద్రాచలమందు వెలసితివిరామా ॥ దండము ॥

# సీతాకల్యాణము

శృంగారమైనట్టీ సుదతీరత్నంబూ । చంద్రవంశంబూన జన్మించగానూ ।

( కిటతకకిట, కిటతకకిట )

ధారుణీసుతయైన తరుణీఆకాంత । కోరిజనకమునికి కూతురై పుట్టీ ।

మారునిగన్నట్టి మగువరూపంబూ । యేరియీభువిలోన యెందునలేరూ ।

పండువెన్నెలమించు ఆపణతిమోము । గండుమీనులబోలు కలికికన్నులదీ ।

తోరంపుబొమలదీ తోజయగంధీ । కీరపలుకుల బాల కువలయతాక్షి ।

తిలపుష్పమునుబోలు తీరునాసికమూ । తళుకుటద్దముమించు తరుణిచెక్కిళ్ళూ ।

పగడంపుచాయల పణతిపెదవులదీ । తగుముత్యములబోలు తరుణిదంతములూ ।

నునుపుశంఖముబోలు నలినాక్షిగళమూ । తొలకరితీగైనా తోజయగంధీ ।

అరటిబోదెలమించు అతివపెందొడలూ । కరిదంతములబోలు కలికిపిక్కలదీ ।

మదగజగమనంబు మహిమచెలగునదీ । కొదమతాబేల్వంటి కుదురుపాదములూ ।

బాలప్రాయమునాడు నాతిపాడుచునూ । వేలుపులెత్తగలేని విల్లుతానెత్తే ।

చూసీజనకరాజు చోద్యంబునొందీ । ఈసీతానెవ్వరికిత్తునని తలచీ ।

ఘనులువెవ్వరు రానీ కరమునబట్టీ । పూనివంచితెయిత్తు పొలతివారికినీ ।

వసుధలోరాజులు వాంఛతోవచ్చీ । పశుపతిచాపంబు పట్టలేరైరీ ।

రఘువంశతిలకుండు రామచంద్రుండూ । జగముపాలించేటి జానకీవిభుడూ ।

తొలుతయాగముగాచి తోయజగంధీ । శిలనుపావనజేసి శ్రీపాదములనూ ।

మునుకొని హరువిల్లు మువ్మారువంచీ । గుణధ్వనులుజేసెను కోదండధరుడూ ।

సురులుదేవతలెల్ల సంతోషమందీ । ధరణిజసీతమ్మ తగునీరామునికీ ।

జనకుడుతావచ్చి రామచంద్రులనూ । కనుగొనిపలికెను కరుణతోనపుడూ ।

దశరథతనయుడ తరణికులాధీశా । వసుదరాజులకెల్ల వాసిగన్నావూ ।

నీకుమిక్కిలిఘనులు నిఖిలమునలేరూ । మాకూతురునిచ్చెద మన్నించుకొమ్మీ ।

వినిరామచంద్రుండు వేడ్కతోనపుడూ । ఘనముగానయోధ్యకు కబురుపంపించే ।

తనయుడుతనతండ్రి దశరథునెంచీ । జనకుడునను మెచ్చి జానకినిచ్చూ ।

మీకునెరిగించితి నయ్యాకనుగొనుడీ । పంచాంగములుచూచి మంచిలగ్నంబూ ।

చూసి యాదశరథుడు సంతోషమొందీ । భూసురులపిలుచిరి ప్రియముతోనపుడూ ।

పరమేష్టిహరునికీ సురరాజునకునూ । గురువసిష్ఠులను కోరిపిలిపించ ।
ఘనులు వారందరూ కరుణతోనపుడు । ఘనముగా లగ్నంబుగట్టిగాచూచీ ।
పూనీలగ్నముజూచి బ్రహ్మభూసురులూ । మీనలగ్నంబున మంచిదియనిరీ ।
లగ్నపత్రిక జూచి లలితముగవారు । విఘ్నేశ్వరుని పూజవేడ్కతోజేసీ ।
కౌసల్య సుమిత్ర కైకావేడుకతో । వంశామందున పెద్దవనితలను బిలిచీ ।
పేరుపేరున బిలిచి ప్రియముతోనపుడూ । రారమ్మయిూపేళరాము పెండ్లికినీ ।
పట్టంచుచీరెతో పణతిరావమ్మా । మట్టెలపిల్లెళ్ల మగువరావమ్మా ।
సేలంచుచీరెతో చెలియరావమ్మా । నీలంచు చీరతోనెలతిరావమ్మా ।
కరకంచుచీరెతో కలికిరావమ్మా । చెరుకాకు చీరెతో చెలియరావమ్మా ।
మల్లెపువ్వులచీరెతో మగువరావమ్మా । ఉల్లిపొల్లచీరె యువిదరావమ్మా ।
గోరంచుచీరెతో కొమ్మరావమ్మా । వారిజాక్షీరావె వనితారావమ్మా ।
నీలవేణిరొరావె నెలతారావమ్మా । బాలరోనువురావె పసుపుదంచేమూ ।
గరుడవాహనాలు గౌరికుంకాలూ । కురువబాణములు కృష్ణభోగాలూ ।
వంకసన్నలు పెద్ద వడ్డాణములూ । కంకణములు లక్ష్మీనారియ్యమణులూ ।
మాదేవికాటుకలు మల్లెచిన్నాలూ । దూదిభోగాలును దొంతి మల్లెలునూ ।
కొత్తవరి ధాన్యములు గొడబ ధాన్యాలు । ముత్యాసరి ధాన్యాలు ముక్కధాన్యములూ ।
బంగారు తీగెలు । .........................కామ భోగాలూ ।
శాలి ధాన్యములు నారీయమణులూ । వివరించి దంచేరు వేడ్కతో నపుడూ ।
పవడంపురోకళ్ళు బంగారు కట్లూ । మిపుల చంద్రునిమించు మోములు మెరయా ।
మంచి ముత్యముచేర్ల మించుముగ్గులూ । ఖాసిల్లు రత్నాల బావిలీలొరయా ।
గంధ కస్తురి పూత కరిగి చెమరింపా । సందిటి దండల జారు పయ్యెదలూ ।
కుడిఎడమ బాహువుల కూడి పట్టుచునూ । ఎడలేకదంచేరు వేడ్కతోనపుడూ ।
నాటరాగములతో ఆడిపాచునూ । పాటలు పాడేరు పణతులందారూ ।
సువ్వీసువ్వన్నల్లార సువ్వన్నలారా । సువ్వని పాడేరు సీతారాములకూ ।
రవ్వలందియలు రాణింపుచుండా । మువ్వలుగజ్జెలు మ్రోయుచుండంగా ।
తరణికులమునబుట్టి తాటకినిగొట్టీ । దశరథరామయ్య ధరణిజసువ్వీ ।
సీతనుపెండ్లాడి శివవిల్లువిరచీ । రాతినాతిగజేసిన రామయ్యసువ్వీ ।
పంచకన్యలుగూడి పాటలుపాడా । దంచేరుకొట్నాలు తరుణులందరునూ ।
ఆస్త్రాద్రికరిగెను. అర్కుడంతటనూ । ముస్తాబులయ్యేరు ముదితలందరునూ ।
పెళ్ళిపందిరిలోను పెద్దలందారూ । కళ్యాణశుభములూ గావించిరంతా ।

పూర్ణకలశముపిండి పూతతోనిలిపీ । తోరణాలుకట్టిరీ దొడ్డపెద్దాలూ ।
కప్పురపుదకముతెచ్చి కాంతలందారూ । ఒప్పుగాతూర్పు వైపునుంచీరీ ।
సతులూసుతులాతోను సంతోషముననూ । రథముపైతరలెనూ రాజదశరధుడు ।
జయశంకనాదముతో శంభుండుతరలె । హయలుమీరగహంస వాహనుడుతరలె ।
అపుడుముప్పదికోట్ల ఆదిదేవతలూ । బిరుదువీరకాళ్ళ భేరీలుతరలే ।
గజతురంగములూ ఆదిగాతరలే । విజయాభవయంచూను వీరభటులూనూ ।
అంగవంగకళింగాది దేశములా । రంగుగాఛప్పన్న రాజులూతరలే ।
కొదువలేకుండాను కోటిసంభ్రమునా । కదిలిరిమిథిలాపురి కడకువీరంతా ।
అల్లొనేరేడినిమ్మ అరటినీడలనూ । చల్లనినీడలను సభకూర్చిరంతా ।
కథలూపురాణాలు వింతమాటలనూ । మేలైనముచ్చటలు వీణపాటలునూ ।
సొగటాలుబారాలు చదరంగములనూ । శకటబలములతోను చెలగిఆడుచునూ ।
తల్లులూతండ్రికీ తనయూడుతాను । వెళ్ళిమ్రొక్కినిలిచె ఎదుటరాముండు ।
పెళ్లాడివర్ధిల్లు పృధివిపాలించూ । చల్లగానెప్పటికి సంకల్పమనిరీ ।
చిరునవ్వునవ్వుచూ సిగ్గుమోములతో । భరతశతృఘ్నులా పరిభాషలందే ।
పరుపూజంబుకానా బాలీసులూనూ । పరచిరిసేవకులు బాగుగానపుడూ ।
కూర్చుండిరందరూ కుశలంబుగానూ । వాసిగాపెద్దల వందనమెరిగీ ।
రామచంద్రునికి రమణులందారూ । ప్రేమతోడుతపెనగి పసుపు పూనేరూ ।
అంగీపాగాచుట్టి ఆదరంబుగనూ । బంగారుసొమ్ములు బాగుగాదొడిగీ ।
పంచపాత్రలమంచి భమిడికాయలనూ । మంచిపుదకముతెచ్చి మగువలుంచీరీ ।
ధూపదీపంబులూ దూర్వాక్షతలూ । ఏపుమీరగదెచ్చి వెలదులుంచీరీ ।
దంధాణాయనిభేరీ ధణతానాదములూ । గంధసానవేళ గావించిరపుడూ ।
పలహారములుతెచ్చి పట్టభద్రునికీ । ఎలమితోజనకుడూ వేడ్కతోబంపే ।
కజ్జాపనసలు కమల కదళీఫలములనూ । ఖర్జూర కిసిమీసి కందమూలములూ ।
నారింజబాదము నారికేళములూ । సారముగలమంచి కమలాఫలములునూ ।
కజ్జాముమిఠాయి కండచెక్కెరలూ । సజ్జపెరుగూతెచ్చి సాకల్యముగనూ ।
చీనీపంచదార పానకంబులునూ । రాజించితెచ్చిరీ రాముకిచ్చిరీ ।
ఇష్టాభోగంబులూ యింపుతోడుతనూ । పుష్టిగాభుజింయించె భూపాలుడపుడు ।
మగిడిదశరథుడునూ మగువసీతకునూ । తగినఫలహారములు తానుపంపించే ।
పాలముంజెలు జున్నుపానకమ్ములునూ । బాలకన్యకుతెచ్చి పణతులిచ్చిరీ ।
శిశుబాలవృద్ధులూ స్త్రీలుపురుషులునూ । అశిథారావ్రతముగా ఆరగించిరీ ।

విందులాఘుజియించ యింపుతోడుతనూ। సంధ్యగావచ్చేనూ చంద్రుడుదయించే।
రంగుమీరంగా తురంగవాహనాలూ। శృంగారించీరపుడు చోద్యంబుగానూ।
దివిటీలు లాయిలు దిశలువెలిగించె। రహిమించుమాతాబ రాజుముందటనూ।
రామచంద్రునికి రాణింపుచుండా। ప్రేమతోడుత రత్నభూషణములనూ।
నవమన్మథుని మించునగుమోమునందూ। తీరైనకస్తూరి తిలకమేదిద్దీ।
పలకసరులును చెవినిబావిలీలుమెరయా। గిలకసరులూ చంద్రహారములూ।
తేజాముగలపచ్చలెలమి ధరియించి। బాజాబందులు రెండు బాహూలతొడగీ।
మద్భుపైనహారములు మురిడీగొలుసులునూ। పదివేళ్ళకమిరేటి బటువులుదొడిగీ।
పెళ్ళికొడుకునుపిలచి పణతులందారూ। కనులకాటుకదిద్ది కస్తూరిబొట్టు।
విడెముచేయుచు తల్లియెదుటనిలచుండీ। వడిబ్రాలుఅందించి వాహనమెక్కీ।
శ్రీరామచంద్రుండు శ్రితరక్షకుండూ। ప్రేమతోసీతనూ పెండ్లాడతలచే।
భేరీమృదంగాలు పిక్కటిల్లగనూ। వారీజముఖుడు తాపైభోగమందే।
తమ్ముడూసౌమిత్రి తాంబూలమియ్యా। చామరంబులు భరత శతృఘ్నులేయా।
జంఝుణాయనుచునూ ఝూంకరింపుచునూ। ఘుమ్ముఘుమ్మనుకొనుచు కొమ్ముతాళాలూ।
హయమూలపైనెక్కి ఆడింపుచూనూ। జయగంటశబ్దాల ఝూంకరింపుచునూ।
తద్ధిమ్మితకిట తద్ధిమ్మియనగ। మద్దిళ్ళుతాళాలు ఘుమ్మునామ్రోయా।
రంభవూర్వసిమొదలు రమణులాడగనూ। తంబురాగీతములు డంబుగామీటా।
శృతులుసన్నాయిలు సర్వరాగములూ। మితులెరిగిపాడుచూ మేళగించేరూ।
ఢప్పుఢమామీలు ఢములురాకళ్ళీలు। ఒప్పుగాబట్టేరు వంకకొమ్ములనూ।
బాణసంచామంచి తారాజువ్వలనూ। పూనికతో లంకాపురులువెలుగంగా।
రాజవీరణమూలు భోరుకొనంగా। వూరేగిజనకుల వీధిలోనిలచే।
బారాబరూలుదీర్చి బంతూలుకూర్చి। వీరువారునుచాల వేడ్కతోనపుడూ।
తొలుతద్వారము పూలతోరణముక్రిందా। నెలతలందుకొని నివ్వాళిపాడా।
జయమత్స్యావతార జయకూర్మావతార। జయవరహావతార జయనారసింహా।
జయవామనవతార జయపరశురామా। జయరామబలరామ జయజగన్నాథా।
జయకృష్ణమావంటి చెలులజగమూలో। దయజూచిరక్షించు దశావతారా।
సత్యంబుగలపుణ్య సఖియలందారూ। జుత్తుకూడునుతెచ్చి జ్యోతులెలిగించీ।
ముమ్మారుదిగదుడిచి ముదితలందారూ। ఇమ్ముతోరామయ్య యెదుటనిలచుండా।
వచ్చివిశ్వామిత్రుడు స్వర్ణమాలికనూ। లక్ష్మివిభుడనుచూను రాముమెడవేసే।
మునినడిచెముందట వెనకరామయ్య। జనకునియింట్లోకి జయముతోచనిరీ।

పెళ్ళిమంటపంచుట్టు ప్రదక్షణంబు । మళ్ళితిరిగివచ్చి మఠమువేయించే ।
వెనుకముందర వీరిపై పువారంతా । సనకసనందనులు సరసగూర్చుండ్రీ ।
సీతాదేవికినగలు శిరముదాకానూ । దాపైనతొడవులూ దశరథుడుపంపే ।
బంగారుపళ్ళెమునా భరణాలుపెట్టి । వుంగారప్రదముకూ వెళ్ళిరందారూ ।
కంఠాసరుకులు కుత్తికంటుపేరులునూ । జంటాపూసలపేర్లు దండకడియములూ ।
పలకలకడియాలు పచ్చటుంగరమూ । గిలుకుటందియలూ కాళ్ళమురిడీలూ ।
శుభమువేళందరూ చూచిమ్రొక్కేరూ । అబలఅరుంధతి అద్దాలనుండీ ।
వడిలోనపువ్వులు వనితలందిచ్చే । తొడవులుకన్యకు తొడిగించిరపుడూ ।
తెల్లనేతినితెచ్చి తెరచాటునుంచీ । జల్లించిరపుడూ జానకిచేతా ।
రామచంద్రునిదరికి రమణినిదెచ్చీ । వామభాగంబూన వనితనుంచీరీ ।
పసుపు పొత్తులుదెచ్చి బ్రహ్మముడివేసి । ముసుగుబెట్టిరపుడు ముత్తైదువులునూ ।
సభలోనపెద్దలు సంతోషముననూ । శుభరేఖలావేళ చూచిరందరూ ।
కనులచింతామణి కలిగియున్నాదీ । పండ్లాపరుసవేది బాగాయున్నాదీ ।
ధనరేఖాయువు రేఖధాన్యరేఖలునూ । ఘనరేఖలున్నవి కాంతారత్నముకూ ।
ఈతీరురేఖలు యింతికున్నాపీ । సీతాగాదిది జగన్మాతాయిదియనిరీ ।
విధాతయీశ్వరుడు విష్ణ్వీశ్వరుండూ । వేనాలుపతియించి ఎదుటగూర్చుండ్రీ ।
శంఖుచిహ్నముదెచ్చి చేతిలోనుంచీ । కంకణహస్తములు కలయజోడించీ ।
సంకల్పమునుజెప్పి సమిధలుంచీర్రి । ఓంకారశబ్దముతొ హోమామెలిగించి ।
కొలిచివిశ్వామిత్రు కోదండునకునూ । కలశాల్తొపేలాలు కరమునందిచ్చె ।
ఆవునెయ్యిదెచ్చి అగ్నికర్పించీ । పానకంబులనిచ్చి భక్తితోడుతనూ ।
కన్నారుణముదీర్చె ఘనుడుజనకుండూ । కన్యాదానంబిచ్చి కాళ్లూకడగంగా ।
పృథివిలోబల్కేటి పక్షులుబల్కె । ఉదయాద్రిపైనెక్కి వచ్చెభానుండూ ।
వేకువలగ్నంబు యోగ్యమునుచూనూ । సాకల్యముగపెళ్లి జంధ్యమేసీరీ ।
నూటొక్కచిహ్నంబు సూటిగానిలిపీ । నీపైనాపదియూరు బంగారుపుస్తే ।
పుణ్యవనితలచేత పుస్తెముట్టించి । సన్నుతాంగికిగట్టె సదయరాముండు ।
మంగళాష్టకమూలు మహదేవులెల్లా । పొందుగాబాడిరి భూసురులంతా ।
జయమంగళము సదాశుభమంగళములు । జయమొందివర్ధిల్లు జానకితోను ।
అంచువనితలువచ్చి అతివేడుకతో । గవ్వాలాడింపుచూ కాంతలందరూ ।
ముత్తైదువలందరికి తాంబూలమిచ్చీ । ఇంతినీపిలచీరి ఇంటిలోపలికి ।
బువ్వాగుడిపించిరి బోధచేయుచును । నవ్వూచునుండిరి నమీకులంతా ।

నాలూగోదినమున నాగవల్లిగడచే । నాలాలాడుచు వాసంతములాడి ।
ఆరొక్కదినమున హస్తకంకణము । భూరికట్నములతో బ్రహ్మముళ్లువిప్పె ।
చిలుకానుపలికించి సీతారాములకూ । అనుపుడుపెట్టిరి అప్పగించిరీ ।
ప్రేమవేడుకమాది ప్రాణంచెమీదీ । మామాటమన్నించి మగువనేలుకో ।
దశరథతనయూడ దాసోహమనుచూ । విశదముగనయ్యోధ్య వేంచేయుమనిరీ ।
తరలెదశరథుడు తనయులతోను । పల్లవాధరులతో బలములతోనూ ।
సగముదారిలోను సంగరముననూ । పగదీర్చిరామయ్య పగతునిగొట్టె ।
సుతునిపరాక్రమము జూచిదశరథుడూ । సంతోషముప్పొంగె రాముప్రజ్ఞకునూ ।
అయ్యోధ్యాపురిమున్నాట రవై వీధులనూ । చాటించిరప్పూడు వీధివీధులనూ ।
పచ్చతోరణములూ కట్టించివారూ । అష్టాదిక్కులకూనూ అరటీస్తంభములూ ।
అష్టాదివర్ణాల అతివలందారూ । నిష్టతోబట్టిరి నివ్వాళులపుడూ ।
కస్తూరికళ్ళాపు కాంతలేసిరీ । ముత్యాలముగ్గులు ముదితాలేసిరీ ।
పృధివిలో అయ్యోధ్యపురమువర్ణింప । విధికివశముగాదు వర్ణింపరాదూ ।
మగువసీతారామూ మంచిముహూర్తానా । మోదముతోడుతను వేంచేసిరపుడూ ।
నగుమోముతోడుతను నగరికేతెంచా । శోభల్లుకొనసాగి జ్యోతివెలుగంగా ।
శోభనాలుబాడిరీ సుందరాంగనలు ।
గడపదగ్గిరనిలచి కాంతారత్నంబూ । కుడిపాదమువేసి గృహములోకెళ్లే ।
సురలుకురిపించిరీ సుందరముగాను । విరులవర్షంబులు వేడ్కతోగురియా ।
సీతాకౌగిలించి చెక్కిళ్లుదీసీ । కాంతాలందరితోను కలసియుండేనూ ।
సురలుదేవతలెల్ల సెలవులందుకొనీ । పురములకువెళ్లిరి న్యాయముగానూ ।
తనివినొందెనుచాలా దశరథరాజూ । ధనధాన్యపదవులు తనయూలతోనూ ।
కలియుగాంతమువరకు ఘనకీర్తి పొందీ । వర్ధిల్లుచుండిరీ అయోధ్యలోనూ ।
ఈసీతాకల్యాణ మిలనుఎవరైనా । వ్రాసినాచదివినా విన్నవారికినీ ।
సంతానములుకల్గు సంతోషముగను । సంతానవృద్ధులు చల్లనికడుపు ।
సత్యంబుగాగలుగు సకలభాగ్యములు । నిత్యకల్యాణంబు నిజముగాగల్గు ।
శ్రీరామచంద్రుండు సృష్టిలోపలను । మావంటిదీనులను మరచిపోషించు ।

# రాఘవ కల్యాణము

హరునివిల్లూ విరువనూ ఆరామచంద్రులూ వచ్చినారూ....,

(తకిటతక, తకిటతక,)

సీత మహాదేవితో శ్రీరాము చెలువమ్ము చెలియలందరు జెప్పిరీ....,

మన్మధునీ కన్ననూ మరియు నాహరిహరాదుల కన్ననూ

అతడు చంద్రుని కన్ననూ అతి రూపమ్ముగలవాడటే

అతి రూపలావణ్యమూ శౌర్య పారక్రమేమందునూ

శ్రీవిష్ణుదేవులూ అవతారమైవచ్చి జన్మించినారు భువిని

ఆదిలక్ష్మి బోలెటీ సీత నీవర్ధాంగివౌదువమ్మా

వేడుకో నీ యిష్టదైవాల ప్రార్ధించి అతడు నీవిభుడుగాను

ఆపలుకులూ వినుచునూ అతివ ఆనందమున హర్షింపుచూ

ఉప్పరిగె మేడలో ఒప్పుగానాసీత గవాక్షలే జూచెనూ

అష్టదిక్కుల జూచియూ అందుశ్రీరాములను పొడగానక

అందూచు పొందూచు చెలియలతో తాను ముచ్చటలను చెప్పుచు

నిర్వహింపాజాలకా కడు శీఘ్రాన లేచివచ్చీ

చంద్రకాంతపు శిలల నొరుగుచూలేచుచూ చదరంగమూలాడుచూ

లేచి తిరుగులాడుచూ కడూ నెలతమునిముమ్మాటికి

శృంగార మగుచూను తోటల లోపలికి తరుణులతో నేగెనూ

చిలుకాలు పలుకాగనూ కోవెలలు కూయ్యగనూ

హంస లందందాడగా చూచి ఆచెలియ అందుండి వినజాలకా

ఇంతిబైలూ జూచి భ్రమయూచు పొక్కుచూ తామర్లు పోవుచుండెనూ

చిలుకాలకాహారమూ యిడకున్న పలుకనేరకయుండునూ

కోవెలల గొంతులూ కుదియించి పట్టితే నాదమ్ములేమానునూ

ఏమిచేసిన మానునా వోచెలీ చెఱుకు వింటీ వాడనీ

యెరిగెకాదానాడు హరుడు శిక్షబెడితె మారుడుమానడాయె

సన్నజాజుల శయ్యపై పవళించి సంపెంగ మానిక్రిందా

పవళించి తనలోన తలపోసి తలపోసి తల్లాడ మందుచును

ఆణిముత్యపు పేరులూ హస్తమున సున్నంపు పేరులాయె
పానుపూ విరులెల్ల కసిగంది యున్నవీ కాకెక్కెనూదేహమూ
యిసుకతిన్నెలమీదనూ ఆయింతి పలుమారు పవళింపుచూ
బైలుజూచీ భ్రమసి ఆసీత పలుమారు తనలోనె తామర్లుచూ
ఇంతయుగ్రముతోడనూ ఈసూర్యరశ్మెల్ల కాయగానూ
ఇందేల సెజ్జవాట్లమర్చిరే చెలులార ఇంతమత్సరమేటికే
రవిరశ్మి కాదోయమ్మా సీత ఇది నిండుపున్నమ చంద్రుడూ
నిన్నింతవేచేటి మన్మాధునీబట్టి సంకెళ్ల వేయింతమూ
జనకుడు వచ్చి తనాతనయ జానకితో నిట్లానెనూ
చింతింపుచున్నట్టి సీతనుచూచియో చిరునవ్వుతోబలికెనూ
ఇట్లు శాయంగదగునా ఓసీత నిన్నిస్తురామునికీ
లక్షణమ్ములుగలా రక్షించగలయట్టి లక్ష్మన్నమరిదినీకూ
ఆరగించవెసీతా నిన్నారాములూగొనిపోవునూ
ధరణిపతిమీదనూ అలుగంగ నీకేల ధనుసుచూడావత్తురూ
తాంబులమ్ములు శాయవే ధరణిజా దప్పివడయును దీరునూ
ధరణిపతిమీదనూ అలుగంగనీకేమి ధనుసుచూడావత్తురూ
విల్లువిరిచినగానీ ఓసీత నిన్నివ్వరామునికి
జనకుడూ మెచ్చూచునూ....తనమహాదేవితోనిట్లానెనూ
అటుగాక మనసీతకూ మనసులో శుభలక్షణములుగలవూ
అలయూచుసాలయూచు శ్రీరామురాకకు తల్లడమందుచుంది
త్రిపురములు సాధించినా ఈవిల్లుఇందేల స్థాపించిరీ
ఈవిల్లువిరచినా కాని తన్నియ్యనని జనకుడేలయాడెనూ
ఆడజన్మమునబుట్టి యిటువంటి వేదనలకే నోస్తినా
తనభాగమీవేళ పండునోలేదొ నాకోరిక కొనసాగునో
ఈభూమి నేబుట్టితీ రాజఋషి జనకూలపుత్రికనై
శ్రీరామదేవరా వరియించకున్నాను హరియింతు తన ప్రాణమూ
సకలలోకలములకెల్ల నీవు కర్తవో గణనాయకా
లెక్కలేనీ టెంకాయలూ నీ కిస్తు హరివిల్లువిరచీననూ
హడురు పార్వతి దేవికీ మరియు నోగంగా భవానికీ
నవరత్నములతోను పూజల్లుచేయిస్తు హరివిల్లువిరచీననూ

తుమ్మెదరో జెప్పవే నీనందందు తిరుగాడుదూ
హరునివిల్లూవిరచి శ్రీరామచంద్రులను తన్ను పెండ్లాడుమనవే
కలికి చిలుకరొజెప్పవే కారుణ్య విభునితోనూ
హరునివిల్లూవిరచి ఆరామచంద్రులను తన్ను పెళ్లాడ మనవే
రాజహంసరో జెప్పవే మీ రాజీవ నాథునితో
హరుని విల్లూ విరచి ఆ రామచంద్రులతొ తన్ను పెండ్లాడ మనవే
నీలమేఘమ జెప్పవేమీ నీలవర్ణుని తోడనూ
హరుని విల్లూవిరచి ఆ రామచంద్రులతొ తన్ను పెండ్లాడమనవే
మింటచుక్కాలు లారా యానీల వర్ణుణ్ణికానారుగా
మింటనైనానేను అంటియుండనైతి అందుండి యేజూతునూ
అష్టదిగ్గజములారా మీరతని కాధారమైయుండుడీ
ఆకాశ మంతరిక్షమా భూకాంత తోడుగా రామూనికీ
పక్షిజాతుల్లారా మీరు పరమాత్మ జూతూరుగా
మీ వంటి రెక్కల్లు తనకైనలేవాయె యెగిరిపోయిజూతూను
అనిసీత తలపోయగా అంతటా అరుణోదయంబాయెనూ
కుక్కటములూ కూసె కమలములు వికసించె అర్కుడు ఉదయించెనూ
స్వయంవరములు చాటినా సరగూన శుభలేఖలంపించినా
ఇనతేజు లౌబాలు లిద్దారు వచ్చిరీ సూర్యవంశపురాజులూ
కోటియసురులగెల్చియో కౌశికుని యాగంబునటులగాచీ
అహల్యశాపముబాపి హరువిల్లుజూడంగ వచ్చినారూ యిప్పుడూ
ఉదయకాలము కొలనిలోసంధ్యా నియమములు తీర్చుకొని
అర్కుడూఉదయమ్మ అయెనోలేదో అనీ ఆశ్చర్యపడుచుండిరి
ఆకౌశికులతోడనూ శ్రీరామలక్ష్మణులు పొందికగా
తమ యిష్టనీమములు తీర్చుకొని యాకొలువు కూటానికేవచ్చిరీ
ఆరామలక్ష్మణులకూ పొంగుతూ ఆజనకుడెదురునడచీ
శీఘ్రముగ శ్రీపాదపద్మములు గడిగియో సింహాసనాలిచ్చెనూ
కౌసల్య సుతున కపుడూ జనకూడు గంధమక్షింతలిచ్చీ
కట్టువల్వాలిచ్చి కడు గౌరవములతో బహుమానములుచేసెనూ
సంతోషమున జనకుడూ రాములతో భాషింపుచూనుండగా
జగతిరాజూలెల్ల చెక్కటాచెయిబూని చింతించి యిట్లానిరీ

మేటిరాజులకెల్లనూ యెచ్చోట స్థలమేరుపడజూపకా
చిరుతబాలలకిట్లు సింహాసనాలియ్యా సిరియెంతదొడ్డదనిరీ
ఆకారసంపన్నుడే ఓహోహో ఆజానుబాహుడితడూ
ధిక్కరించేవాడు రాజునలందర్ని చుక్కల్లచంద్రుడేమో
అతని యాకారానికీ రాజులు అరికాలునే బోలరూ
అని రాజులెందరో తమతమామదిలోను తలపోసియిట్లానిరీ
ఇతనిరూపముకునూ జనకుడు ఇయ్యవచ్చును కన్యనూ
అని రాజులందారు తమతమ మదిలోను తలపోయుచునుండిరీ
కార్యముచేతనయితే ఖండించి పుత్తుధనుసూ
కార్యముగాకున్న కడువేగపోవలెను గాండీవమేదానెను
పరమాత్మపలుకూలకూ జనకూడు పరమానందముననూ
తన యిష్టదైవాల తలచుకుని యావిల్లు తర్లించుకొనిపచ్చెనూ
వెయ్యిన్ని యేనూరులూ దామెత్తి దెచ్చినారు
శ్రీరాముదేవార ముందార ఉంచితే చిరినవ్వుతోబలికిరీ
చిపుకువిల్లా దీనినీ మీరు యేమాని పొగడేదరూ
పిడికీట అందుకుని ఈవిల్లు విరువంగ యిదియెంతహద్దునాకు
చూచిరావోయి లక్ష్మణా ఆసుదతి జానకిదేవినీ
రూపలావణ్యములు సరిగాను యిప్పుడూ శీఘ్రానచూచిరమ్మీ
భోజన మొప్పాకున్ననూ సౌమిత్రి దినమెల్ల వృధాసుమ్మీ
అలి ఒప్పాకున్న జన్మమెల్లావృధా చూసిరా వోలక్ష్మణా
నడుము సన్నముచూడుమీ అయింతి నలుపుకాకుండ చూడుమీ
కురులనలుపులు చూడుమీ ఆయింతి చిన్నపాదము చూడుమీ
చిన్నపాదముచూడుమీ ఆయింతి గొప్పకన్నులుచూడుమీ
చూచిరమ్మీలక్ష్మణా ఆసుందారి రూపమంతా
కడువేగిరముచూచి కదిలిరమ్మనిపలికె కమలనాభులు అప్పడూ
అనితన్నుపంపగానూ మహాప్రసాదమని మ్రొక్కుతూ
జనకూని మందిరంబులకేగె సౌమిత్రి జనులందరూమెచ్చగా
రామూని తలపుయేరిగి జనకూడు ప్రతిహార్లబెట్టంపెనూ
వాకిలిద్వారపాలకులనూ గడచియోరాణివాసముజొచ్చెను
శృంగారపతికన్యకూ చెలియలూ శృంగారమమరజేసీ

బంగారు సింహాసనమ్మీద రంగుగా సీంతాంగనా నునిచిరీ
సౌమిత్రిరాక లెరిగీ ఆచెలియలా సీతకిట్లానిరీ
నిండుచంద్రునిబోలు రామునీతమ్ముడూ నిను చూడవచ్చినాడూ
ఆసీతవిని పొంగుచూ నవ్వుచూ నవరత్న పీఠమ్మునా
ఒప్పూచునుండగా తప్పక లక్ష్మణుడు లక్షణమ్ములుచూసెనూ
సోమకళలాబోలేటీ ఆసీత పాదపద్మములుచూసీ
తగుననుచు సంతోషచిత్తాన పొంగూచు చదురులో కేతెంచెను
చూసివస్తిని దేవరామీ సుదతి జానకిదేవినీ
హరిహరాదులు పొగడగా నలవికాదయ్యా ఆబ్రహ్మకైనగానీ
చూచివస్తివలక్ష్మణా మనసుదతి జానకిదేవినీ
అనుమానములేక యీవిల్లువిరువనా అదినాకునిజముచెప్పు
అన్నరాఘవ చూస్తినీ మీచేడె జానకిదేవినీ
హరిహరాదులు పొగడగా నలవికాదయ్యా ఆబ్రహ్మకయినగాని
అని తమ్ముడూపలుకగా రాములూ కనుసన్నచేయుచూనూ
అంగుష్టమున వీలనందుకొని యావిల్లుచిట్లించె శ్రీరాములూ
పెళ్లపెళ్లామనగా యీ మూడు లోకాలవారలెల్లా
చూడచిత్రముగాను శివవిల్లుపట్టుకుని శ్రీరాములే విరచిరీ
దుందుభూలేమ్రోయగా శూరులందారుపొగడాగనూ
నానావిధమూల పువ్వూలవానలు రాముపయిగురిపించీరీ
యెన్నెన్నివిధములాను రాముణ్ణి జనకుడుకొనియాడగా
ఘననేత్రియయినట్టి సీతాంగనసుదెచ్చి శ్రీరాములకునిచ్చెను
ఎల్లుండి లగ్నమనుచూ శ్రీరామ చంద్రులా పెండ్లియనుచు
కడమవారి పెండ్లిండ్లుయిక్కడనె కాగలవు కాంతలతోరమ్మానెనూ
శ్రీరామ చంద్రులకునూ మాసీతాంగనను యిస్తును
అతనితమ్ముడు లక్ష్మణాదేవరకును ఊర్మిళను నేనిస్తును
భరతశతృఘ్నులలోనూ భరతునికి మాండవి నేనిస్తును
కడసార పూపుత్రిశృతకీర్తినీదెచ్చి శతృఘ్నునికియిస్తును
వక్కలగ్నమందుదా మీసుతులు నలుగురికి కల్యాణమూ
కాంతలూ నలుగురిని కన్యధారాబోతుగైకోని రక్షించుమీ
అనుచునూ శుభలేఖలూ అప్పుడు అయోధ్యపురికంపినా

చదువుకుని తనయుల పరాక్రమమువినీ తలయూచి హర్షించెనూ
దశరథులు కదిలివెళ్లీ తనాదేవులతొ యిట్లానెనూ
సుతులకల్యాణమని సతులనూ తోడ్కొనీ జనకపట్నము వచ్చెను
దేవతలువచ్చి నారూ దేవదేవుని పెండ్లిని చూడగా
మహామునీశ్వరులంత పొగడుతూవచ్చిరి మహాత్ము పెండ్లికనుచూ
గౌరిపార్వతి వచ్చెనూ కఱకంఠునీ తోడగలసీ
లోక లక్ష్మివచ్చె శ్రీరాము పెండ్లికని లోకమంతవెలుగగా
అరుంధాతి దేవివచ్చె అనసూయ అహల్యాదేవివచ్చె
దేవతాస్త్రీలంత చెలువమ్ముచేయుచూ దేవుణ్ణిచూడవచ్చె
సాటికితడొక్కడన్నీ చిత్తమున చాలంగనుప్పొంగుచూ
విల్లువిరచిన రాముఖివిభుపరాక్రము జూచి జనులెల్లమెచ్చగాను
సంపెంగతైలముననూ తరుణులూ దంపతుల శిరసంటిరీ
గంధ మటకలిదెచ్చి కాంతలందారూను పన్నీటజలకమార్చీ
నెరి కురులు చిక్కుదీసి వకచెలియనేర్పుతో జడలల్లెను
పట్టుచీరలుదెచ్చి యువకచెలియ పణతులకుగట్టించెను
ఆభరణములు సొమ్ములూ అతివలకు అందముగ నలంకరించ్రీ
అతివలను తోడుకొని ఆకాంతలందరూ అతివేగమునవచ్చిరీ
మేటి పుటికెలనుంచియూ నల్గురిని గౌరితపసుకునుంచిరీ
ఆరామచంద్రులా కాళ్లకడిగీతాను కన్యధారాబోసెనూ
కాంతలా నలుగురినీ జనకూడు ధారాబోసీ యిచ్చెను
తెరచీరతీసితే శ్రీరాములాజూచి దేవితానుప్పొంగెను
మంగళాసూత్రమ్ములూ రామచంద్రూలు వేడుకతో
నవ్వూచు శ్రీరామచంద్రూలూ తాను సీతమెడనుగట్టెను
ఆణిముత్యపుతలంబ్రాలూ ఆరామచంద్రూలు వేడుకతో
నవ్వూచు శ్రీరామచంద్రూలూతాను సీతశిరసునబోసెను
చిటికెనవ్రేలు పట్టూకొని సీతతోశ్రీరాములూ
వైవాహికపు వేదికకుచనుదెంచి దేవితోగూర్చుండెను
సప్తపాదములపుడూ తొక్కించి అరుంధతినిచూపించిరీ
మూడోరోజునా పాల్వెన్నాజేసి నాగవల్లిదీర్చిరీ
బంగారు పళ్లెరములో తమరపుడు పాలునెయ్యీ బోసియూ

సీతహస్తముముంచీ జనకూడు శ్రీరాముకప్పగించె
బాలహస్తముముంచీ జనకుడూ పణతులకునొప్పగించి
రాజుకప్పగించే జనకుడూ రమణులనుతానప్పడూ
దశరథులు పొంగుతూనూ జనకునితొ సంతోషముగ బల్కెను
కల్యాణమూనేడు కాంతలను యిపుడు ఘనముగా మాకిస్తిరీ
సంతోషంబాయెనూ మేమిపుడు పురికివేగాబోవలె
కాంతలనునలుగురిని పంపుడీమీరిపుడు అయోధ్యపోవలెను
అనిరాజుఅడుగగానూ జనకూడు కన్నీరుదెచ్చుకొనుచూ
తనసతీతోడనూ తరుణులనుబంపుమని వేడూకతోచెప్పెను
కౌగిటాజేర్చుకోని తమతల్లి కన్నీరుదెచ్చుకొనుచూ
కాంతలూనలుగురికి వడిబియ్యమూబెట్టి కౌసల్యకొప్పగించె
భేరిరవములుమ్రోయగా దశరథులు చేడెలనుదోడుకొనుచూ
కాంతలతొపుత్రులతొ తిరిగికదలీతాను అయోధ్యకూవచ్చెను
పరశురామునిచాపమ్మూగైకొని పట్నానికేతెంచెను
ఇంతినీతొడలపయి వుంచుకొనితాను కురులునున్నగదువ్వెచు
అలకపంక్తులబట్టియో కస్తూరి తిలకమపుడుదిద్దెను
నాతికివిశాలనయనముల సన్నంపుకాటూకలేదీర్చెను
దేవీకిశృంగారమూ తాను నేరూపుతోజేయుచూ
అంతటాశ్రీరాము తనసతితోగూడి సంతోషముననుండెను
అంతటావక్కనాడూ శ్రీరామచంద్రూలువేడూకతో
నవ్వూతు శ్రీరామచంద్రూలు అద్దమ్మునాతి చూడూమానెనూ
చూచిఅద్దములోనా ఆదేవితనరూపు తెలియలేక
ఎంతమాయలుగలావూ శ్రీరామచంద్రుడా పరసతినితేతగునా
నేనుకానాకుండనూ పరసతిని ఇందులోనిలిపినావా
యేక పత్నీవ్రతుడవని మాతండ్రిచ్చె మాయలూ యెరుగడాయె
యెంతమాయలు గలావూ శ్రీరామచంద్రూడ మీకిప్పుడూ
చాలుచాలు రామ మీతోటిస్నేహంబు సరసంబు విరసమాయె
అని సీతపలుకగానూ శ్రీరామచంద్రూలు నవ్వుకొనుచు
ఔసీత ముద్దరాలనిపొగడి తనలోన నవ్వూచు నిట్లనెను
పతిలేనిసతిని జూచీ ఓసీత మదిలోన కోపిస్తివీ

పతిజూపితే అలక బాసునా నీకిపుడు పద్మాక్షిరోజెప్పవే
నిలువుటద్దము దెచ్చియూ శ్రీరామసీత చిటికెనబట్టైనూ
అతివ మనమిద్దారమూ యీ అద్దాము చూడగానూ
పతిలేని సతిజూపించాగలవా జానకి నీవానెను
సీత చిటికెనటట్టియో శ్రీరామచంద్రూలు నిలువగాను
యిద్దారి రూపులూ ఇద్దారి సౌందర్య మొక్కరీతిగనుండెను
వారుఎవ్వరు రాఘవానాకు వివరముగ తెలుపుమనెను
అనిసీత అడుగగా చిరునవ్వు నవ్వుచూ శ్రీరాము లిట్లానిరీ
శ్రీరాముడూసీతా నీవు అదియెపుడు యెరుగవటవే
సీత ముగ్ధయనీ మదిలోనదెలుసుకుని నవ్వూచుతానిలచెనూ
పతిమాటలకు సీతయూసిగ్గుబడి శిరసువంచుకు నలచెనూ
సిగ్గుబడి నిలచున్న సీతనూచూచియూ శ్రీరాములిటె బల్కిరీ
నీకునాకూభేదమా ఓసీత లజ్జింపనీకు తగదు
నన్నుగూడీ నీవు సంతోషమున రాజ్యమేలు మీపట్నమూన
రాఘవుల కల్యాణమూ యెవరయినపాడినా విన్నగాని
అష్టయిశ్వర్యమిచ్చి యిష్టసంపదలిచ్చు స్వారాజ్య పదవిచ్చును
కన్యలెవ్వరుపాడినా వారికీ కల్యాణమౌనానుచు
శ్రీరాములాసీత పరగనైదో తనముతనకు తానేయిచ్చును.

# శ్రీరాములవారి అలక

ఈరాత్రియో రెండుఝాములామీదా । రామచంద్రుడుమనపై యలిగిపోదలచె ।
బలములుదెచ్చి మనపసిడిగడపలను । గోమేధికంబులు గొంతితాపట్టె ।
అప్పడముపడయమూ అతివతాబట్టె । లడ్డువముమోదుండు లక్షణంబుగనూ ।
కొబ్బరికుడకలె గొంతితాబట్టె । బంగారుచెంబుతో పానకముబట్టె ।
రఘుకులపుంగవుడు రామచంద్రుడు , చెంబుచేతాబట్టి అలగిపోదలచె ।
ఆప్తయినవారలూ వరునవారలునూ । తప్పట్లుజరచిరి రామచంద్రునకు ।
బంగారుచెంబు చెప్పకకొంచబోతే । దొంగబంటని అచటిచెలులునవ్వుదురు ।
ఋషిపల్లివీధిలో దొంగజొచ్చాడు । యీదొంగనెవ్వరు పట్టెవారనిరీ ।
జనకచక్రావర్తినగరిలోపలనూ । యీదొడ్డదొంగనుబట్టుకొమ్మనిరీ ।
దొంగకాడేచెలియ దొరకొడుకు సుమ్మి । అయోధ్యాపట్టాభిరామచంద్రుడు ।
అయోధ్యాపట్టణము భోరుకొలువగను । రాముడు వెంచేసెనగరిలోపలికి ।
రంగైనరత్నాల మేడలోపలనూ । రామచంద్రుడు వెళ్ళిగూర్చుండెననిరీ ।
కౌసల్యకైకమ్మ సుమిత్రమహాదేవి । రామచంద్రునిజూచి కడుసంభ్రిపడిరీ ।
అంతటదశరథుడు ఆత్మతనయూని । యీఅర్ధరాత్రీనీవు వొంటిరాదగునా ।
దశరథవినవయ్య ధర్మనందనుడా । వొంటినురాలేదు బంట్లతోవస్తిని ।
జనకుని భూదేవికడుసంభ్రమపడుచూ । రామచంద్రునిఅలన తీర్చబోవలెనూ ।
ఆకులకుగుజ్జనలు పోకకట్నాలు । కోకలదిండులే కొమరరుమాళ్ళు ।
గంధపుగిన్నెలే పువ్వులదండలును । సొమ్ములతబుకులే సొంపుమీరగను ।
నాలుగువేళ్ళవుంగరాల్ నవగ్రాహిబటువు । ఛటులుదెచ్చిరి రామచంద్రునీకపుడు ।
సన్నంపుదుప్పట్లు జోడుశాలువలూ । వుత్తరజంధ్యమ్ము దెచ్చిరి రామచంద్రులకు ।
కవివరులుమంచి బిరుదుచెప్పగను । నడుకట్లుదెచ్చిరి రామచంద్రులకూ ।
బిళ్ళలనెవళము బిగువుమొలత్రాడు । మొహరీలుకాసులు తెచ్చెరామునకు ।
పత్సలపతకములు పతకహారములు । చంద్రహారమ్ములే దెచ్చిరి రామునకు ।
బంగారుమురుగులు గొలుసులును । మరియుచౌకట్లుదెచ్చిరీ రామచంద్రునకు ।
పట్టంచుదోవతలు గట్టిగవారు । జరతారుపాగ బంగారుతురాయి ।
రామునకుదెచ్చి తొడవులన్నియును । తబుకులనుంచిరీ సకలవేడుకలా ।

బాలకుసిగవేసి పసుపొప్పనలదీ । పన్నీరు జలకము బాగుగాదీర్చి ।
పసుపు కుంకుమబెట్టి పారాణిబెట్టి । పసుపుకుంకుమబెట్టిరి వెలదిసీతకును ।
గజ్జెలుకడియాలు కాంతకును అపుడు । మట్టెలుపిల్లెళ్ళు మగువకమర్చిరీ ।
పట్టుచీరయుదెచ్చి కట్టంగనిచ్చె । మోమెత్తిజూచెను ముద్దులాసీతా ।
గజసూత్రవాహనము యేనుగులుదెచ్చి । యేనుగుమీద చౌడోలువేయించి ।
ఢంకానౌబతులు మ్రోయుచుండగా । మంగళమ్ములుబాడిరీ మగువలిద్దరికి ।
ఆరంభవూర్వసి మేనకాదులనూ । భోగాలవారొచ్చి పొందుగానిలచె ।
నారద సనకసనందనకుమాళ్ళు । వేదమంత్రములు బాడిరివేడుకలతోను ।
ఆడుచువచ్చిరీ అప్సరసస్త్రీలూ । పాడుచువచ్చిరీ భట్రాజులెల్ల ।
సకలసన్నాయిలు కంచుదివిటీలు । ధవళఛత్రంబులే తాళములుజోళ్ల ।
తప్పెట్లుపిల్లంగోళ్ళు శంఖవాద్యము । భోరునమ్రోగెను సకలవాయిద్యములు ।
ఆవనములోచిన్న అతివనుంచుకొని । దశరథు నగరికివేంచేసిరంత ।
అంతటదశరథుడు అతివేడ్కతోను । ననలెల్ల నతివైభవముగ ।
జేయించె తివాసులు । జంబుకానాల్ జతగవేయించె ।
కంబళ్ళుచాపలు సర్దిపరిపించె । జనకుడుదశరథుడు తగురాజులెల్ల ।
తగస్థానములయందు తగికూర్చుండిరీ । ముత్యములమరిన ముకురముల యెదుట ।
రత్నాల దీపములురంజిల్లుచుండె । ముత్యాలగద్దెలపై మురహరినియురచి ।
రత్నాలగద్దెపై సీతమ్మనునిచి । ముత్యాలపతకము అందముగగట్టి ।
రామువద్దనుసీత గూర్చుండబెట్టి ।
గుర్రమునెక్కి యీకొమ్మవచ్చినదీ । గ్రోతచింతామణి లేచిరావయ్య ।
అందనమునెక్కి ఈయతివవచ్చినదీ । అందమయినాపెండ్లికొడుకా లేచిరావయ్యా ।
మట్టెలుపిళ్ళేళ్ళ మగువవచ్చిందీ । మదన కందర్పూడ లేచిరావయ్యా ।
సూడిదమ్ములపెట్టి సుదతివచ్చినదీ । చుక్కల్లచంద్రూడ లేచిరావయ్యా ।
వెళ్ళవుంగరాల వెలదివచ్చిందీ । వేడిచింతామణి లేచిరావయ్యా ।
కంకణంబులుబెట్టి కాంతవచ్చిందీ । కలవారిఅల్లూడ లేచిరావయ్యా ।
అన్నిసొమ్ములుబెట్టి అతివవచ్చిందీ । ఆసీతనాథూడ లేచిరావయ్యా ।
ధర్మసరుకులు రెండు ఝారిచెంబులనూ । అరణమిస్తేకాని లేచిరాననెనూ ।
అధికసంపన్నుడే మామజనకుండూ । యిచ్చేనుశ్రీరామ లేచిరమ్మనెనూ ।
మంచిగంధపుచెక్క చుక్కల్లసాన । అరణమిస్తెకాని లేచిరాననెనూ ।
అధిక సంపన్నుడే మామజనకుండూ । యిచ్చేను శ్రీరామ లేచిరమ్మనెను ।

ఖమిడి సున్నపకాయ చిలుకలడకత్తెరా । అరణమిస్తేగాని లేచిరాననెను ।
మదనకందర్పుడే మామజనకుండు । యిచ్చేను శ్రీరామ లేచీరమ్మనెను ।
బంగారుగొలుసుతో పావురముపిట్ట । అరణమిస్తేగాని లేచిరాననెను ।
వేలసంపన్నుడే మామజనకుండు । యిచ్చేను శ్రీరామ లేచిరమ్మనెను ।
వెండికాగులుమంచి ఖమిడిగోలెములు । అరణమిస్తేగాని లేచిరాననెను ।
లక్షసంపన్నుడే మామజనకుండు । యిచ్చేను శ్రీరామ లేచిరమ్మనెను ।
పత్సలపతకములు జోడధనాలు । అరణమిస్తేగాని లేచిరాననెను ।
కోటిసంపన్నుడ్డేమామ జనకుండు । యిచ్చేను శ్రీరామ లేచిరమ్మనెను ।
పట్టెమంచముపరుపు ఖటులుదాసీలు । అరణమిస్తేగాని లేచిరాననెను ।
మదనకందర్పుడె మామజనకుండు । యిచ్చేను శ్రీరామ లేచిరమ్మనెను ।
తూర్పుపడమరలన్ పాడావులామంద । అరణమిస్తేగాని లేచిరాననెను ।
సంపదలుగలగిన మామజనకుండు । యిచ్చేను శ్రీరామ లేచిరమ్మనెను ।
వుత్తర దక్షిణముల ధర్మావులమంద । అరణమిస్తేగాని లేచిరాననెను ।
అతిభాగ్యవంతుడే మామజనకుండు । యిచ్చేను శ్రీరామ లేచిరమ్మనెను ।
పంటభూములు మరియు జోడుశాలువలూ । అరణమిస్తేగాని లేచిరాననెను ।
అరణమ్ములిచ్చేను అతివనిస్తిని । ఆసీతపతీనీవు లేచిరావయ్యా ।
వెండిత్రాళ్లనుమంచి పసిడిత్రాళ్ళను । రామునీమెడవేసి లాగిరప్పుడు ।
ఆణిముత్యాలదే అమరపతకాము । ఆసీతవేసెను రామునిమెడను ।
రంజిల్లుచును సీతదగ్గిరకువస్తె । సిగ్గున శ్రీరాము దిగ్గునాలేచే ।
గుఱ్ఱములేదనీ యేలలిగినావూ । అందలమునెక్కినీవు లేచిరావయ్యా ।
అందలములేదనీ యేలలిగినావూ । హస్తివాహనమెక్కి లేచిరావయ్యా ।
యేనుగులేదనీ యేలలిగినావూ । యెలనాగఖటులతో లేచిరావయ్యా ।
పల్లకీలేదనీ యేలలిగినావూ । పక్షితేజీనెక్కి లేచిరావయ్యా ।
దుప్పటీలేదనీ యేలలిగినావూ । శాలువలు కప్పుకొని లేచిరావయ్యా ।
ఉలవగింజలకుడితి పూరిఉన్నాది । ఉడుకుబోతులకెల్ల వప్పజెప్పించు ।
పత్తిగింజలకుడితి పాచివున్నాది । పాడావులకును బంపించిరావయ్యా ।
చేబియ్యపన్నము చెల్లకున్నాది । పదినెలమరదళ్ల చెల్లించమనుము ।
రమణులెల్లనుయిట్లు రమ్మనుచుబలుకా । రామచంద్రుడుసీత విడిదికిజనిరి ।

# సీత అప్పగింతలు

(కిటతకిట, కిటతకిట,)

పున్నమవెన్నెలా చల్లనిరాత్రి । కన్నెపైనముజేయ కదలివచ్చిరి ।
దశరధులుతమరపుడు కడుసంభ్రమపడుచు । జనకులకుజెప్పరే సీతపైనంబు ।
అటుగాకమీమాట మేముకాదనము । ఒకమాటవినవలె ఏకాంతమునను ।
ముగ్ధవలెపెరిగింది తానుకడుపిన్నా । పంపనేటికి యింకచిన్నదండూరు ।
పచ్చంగకట్టిన పందిళ్ళక్రింద । పద్మాయతాక్షిని బట్టిమేల్కొల్పి ।
వైదేహియింక మా అభిలాషవినుమూ । వివరాములెరుగాదు యింకచిన్నది ।
పట్టెమంచముమీద పవళించియున్న । పద్మాయతాక్షిని బట్టితెమ్మనెను ।
జాజిమొగ్గలరేకు గేదంగిరెవికె । జనకులువారింటి కూతురాలేవే ।
మెడనుగంధముబూసి పువ్వులూముడిచి । పట్టుచీరాదెచ్చి కట్టబెట్టెదరు ।
సర్వాంగసుందరి తల్లిదండ్రికిని । ఆనందబాష్పములు నయనములగురిసె ।
ఎలనాగమీరలు వగవంగనేలా । మీకుహర్షమైన మాటజెప్పేను ।
కోడికుయ్యగపెక్కు భేరివెయ్యగను । అప్పుడుతనబావ దశరధులకు ।
ముత్యాలగద్దెను పోర్లిలులోబెట్టి । చీరకట్టాబెట్టి శ్రీగంధమలది ।
వలరాజుబంపినా వలపుచీరెలను । ముదముతోవైదేహికి ముదమొప్పబెట్టే ।
వరుసతోకట్నాలు యిచ్చిపంపించి । బాలునితండ్రియా దశరధరాజా ।
చుట్టాలకిప్పించె సొగసుచీరెలను । బంధువులకిప్పించె పట్టుచీరెలను ।
పురోహితులకునూ పూలమాలికలు । పురుషోత్తమునకిచ్చె పూలజాజులును ।
వేలసంపన్నుడై వెలయునాయన్నా । వెలయయాజ్ఞికులకు వేయికట్నాలు ।
ఘనమైనతొడవులు కట్నాలుయిచ్చి । వేంచేసెజనకుడు వైదేహినంప ।
తొమ్మిదినెలలూమోసి తొలిగర్భముననూ ।అమ్మరోనినుగన్న భాగ్యమేమమ్మా ।
ఇన్నిఏండ్లుపెంచి యీకన్యనిపుడు । పన్నుగాతప్పులు పట్టంగవద్దు ।
అంతమీరందరూ యాప్తులై రిపుడు , పన్నుగాతప్పులు పట్టంగవద్దు ।
బంగారుగిన్నెలో పాలునెయ్యిపోసి । బాలునీచేతిలో చెయివప్పగించె ।
సూడిగలచేతిలో జానకినిదెచ్చి । కౌసల్యాదేవిని యటుజేరపిలిచి ।
కౌసల్యచేతిలో చెయినొప్పగించి । అవనిజభారమ్ము మీభారమనియె ।

నీకుతమ్మునిపట్టి నిజముసుమ్మువదిన । పాలలోముంచెత్తి నీకిస్తినమ్మ ।
మట్టెలపిల్లేళ్ల జానకినిదెచ్చి । కైకమ్మచేతిలో చెయినొప్పగించె ।
చేతులచేపట్ల జానకినిదెచ్చి । శాంతమ్మచేతిలో చెయినొప్పగించె ।
హస్తకంకణాల సీతనుదెచ్చి । సౌమిత్రిచేతిలో చేయొప్పగించె ।
పచ్చలకడియాల జానకినిదెచ్చి । సుమిత్రచేతిలో చేయొప్పగించె ।
నెయికాచనేరదు నెలతసుమివదిన । నేర్పుతోపనులెల్ల నేరుపావమ్మా ।
కుడుపనేరదు చిన్నపసిబాలసుమ్మీ । వేరుగానవనిజ తానారగించదు ।
చల్లచేయనేరదు సఖియసుమివదిన । మీబాలలలోను నొక్కబాలగాచూడు ।
బుద్ధులెరుగదు మంకుబుద్ధులేకాని । బుద్దివచ్చినదాక దిద్దుకోవమ్మా ।
ఎడచంటిబిడ్డ నన్నెడబాయదమ్మ । చేడెరోతనసేవ చేయించుకొమ్మా ।
అబలఎరుగదుఏమి అదిభాలసుమ్మీ । మీబాలలలోనొక్క బాలగాచూడు ।
చిన్నబాలనునేను చేయియిచ్చినాను । ఈబాలచేతనీవు సేవచేయించు ।
బొమ్మరిళ్ళానాడు బుద్ధెరుగదబలా । మెల్లగానేర్పుతో పనినేర్పవమ్మా ।
ఆకలెరిగన్నంబు పెట్టినదాక । అడుగనేరదునీవు యడిగిపెట్టుము ।
అన్నానబెంచుమీ అమృతానబెంచు । చిన్నపిల్లను నీచేతికందిస్తి ।
పనినేర్పుఎరుగదు పణతిసుమివదిన । పదిలముగపనిచెప్పి చేయించుకొమ్మీ ।
ఆడబోయినచోట అట్టెయుండేను । మెల్లగానేర్పుతో పిలువవేయమ్మా ।
కోడలుమీసొమ్ము కొడుకుమీసొమ్ము । ఆడవారినిగన్న యలసంతెనమ్మా ।
సిరివంటికోడలు హరివంటికొడుకు । మగువరోసౌభాగ్య మహిమయేమమ్మా ।
మాబాలకాదుసుమి మీబాలసుమ్మి । మాబాలమీబాల గాచూడవలెను ।
కలికికన్నుల భాష్పములు రాలాలనూ । అలివేణిప్రేమతో అప్పుడిట్లనెను ।
తల్లితండ్రాదులు అత్తమామలును । యెల్లబాంధవులును ఆయింతికిపుడు ।
ఎలనాగమీబిడ్డకేమి కొదవమ్మా । అలసిపాన్పుమీద యటుపవ్వళించు ।
కొమ్మచేనుగువంటి కొమాళ్ళగనునూ । ఆడపడుచులగన్న ఆలపుసొంపెరుగ ।
మీరేలయామాట ఆనతిచ్చేరు । నాకువక్కాడపడుచు నగరానకలదు ।
దశరధుకూతురు శాంతగిరికన్యా । కౌసల్యగారాబుపట్టి సుమి వదిన ।
మీసీతమాశాంత సమముగానుండు । నమ్ముమాపూబోణి నలినాయతాక్షి ।
చెప్పినపదిమాటలు వినిపించుకొని । కౌగలించుకొని కన్నీరునించె ।
పొన్నపూవడిబెట్టి బొమ్మవడిబెట్టి । సాగ్యవతిదాపెనే భోగపుగడప ।
ముత్యాలవడిబెట్టి కందవడిబెట్టి । పసిడిగిన్నొడిపెట్టి పణతిపంపుదుము ।

ముత్యాలవడిబెట్టి కందవడిబెట్టి । జీలకర్రవడిబెట్టి సీతనంపుదుము ।
అరటిపండ్లొడిబెట్టి అరిసెలొడిబెట్టి । అతివతాదాపెను అతిరచ్చగడప ।
శ్రీవైభోగమున సీతరాముడునూ । అయోధ్యపురికేగు అతివేగముననూ ।
అమరభూపట్నాన మధ్యాహ్నవేళా । పుణ్యాంగనలువచ్చి భోజనముచేయ ।
యారాత్రితనపుత్రి యంతగాతలచి । అలివేణిప్రేమతో అల్లునకనియె ।
నీలమేఘశ్యామ వగవంగనేలా । మీకుహర్షమైన మాటజెప్పెదము ।
వెయ్యార్లుబంపేము వెలదిమాయమ్మా । తొలుచూరుపొయిరావె తోయజగంధి ।
ఇప్పుడునీవెంట అన్ననంపెదము । దినములెంచకనుండు దేవిమాయమ్మా ।
హాదేవినీవు పుట్టిన నాటికిపుడు । ఎడబాయవలసె నేమి సేయుదును ।
భూమీశ్వరికన్న బుద్ధికలిగుండు । అత్తమామలకెల్ల అడుగుదాటకుమీ ।
తలఎత్తిచూడకుమి తరుణిమగవార్నీ । పలుకుమనియొకమాట బయలుపెట్టకుమీ ।
అంతఃపురమందు పతియన్నమాట । ఎంతైనహితులకు ఎరిగింపకమ్మా ।
పతినిన్నుపిలచి కోపముచేసినను । పతికెదురుమాటలు పలుకకేతల్లీ ।
పతియెదైవముసుమ్మి పణతులకునెల్ల । ఆపతిమాటలకు అడుగుదాటకు ।
విభుడుమన్నించెనని విర్రవీగకుమీ । పలుమారుపల్లెత్తి నవ్వబోకమ్మా ।
పలుమారుమామీద ప్రేమలుంచకుమీ । పరమాత్మతోగూడి చెలగుమోయమ్మా ।
పతికిమునుపుగలేచి పనులెల్లదీర్చి । ఎలమితోయిష్టాన్న మారగించుమా ।
ఇంతిరోగృహకృత్య మిరుగుపొరుగులకూ । ఎంతమాత్రమునీవు తెలినీయకమ్మా ।
ప్రియుడుభోంచేసిన భుక్తశేషంబు । అయిదవతనమనుచు అపుడారగించు ।
శయ్యచక్కగజేసి శయనింపజేసి । చేతికి తాంబూలమందియ్యవమ్మా ।
చరణములొత్తంగ వలయునామీద । పతివామభాగమున పణతిశయనించూ ।
అనియిట్లుపలికేటి అతివనుచూచి । అధరాకాంతుడు ఆమెకిట్లనెను ।
రాక్షసాసంహార రామభూపాలా । ప్రేమలరవైరుల పరమకళ్యాణా ।
ఆరాత్రివైదేహినీ పిలుచుకొని । విడిదింటికితాను విభుడువేంచేసె
పూజితమగుచున్న బాజమ్మబంతి । భోజనాలందారు పొందుగాజేసి ।
గుమ్మడిపండంటి కొమరైనపట్టి । కూతురుపైనమ్మ చేసెనాయింతి ।
భారతితొడలపై పట్టినందుంచి । హారమణిజాలితో నొప్పగించెదమూ ।
తలయంటిపెంచేటి దాదులనిత్తూ । అమ్మరోనీకును హరణమిచ్చేము ।
చిన్నచిన్నచీరెలు జరగుచీరలును । నెల్లాలుపావడలు జలతారుచుట్లు ।
అంచులకుమించినట్టి చెంగులలర । మంచివిలాసముల మధురచీరలును ।

కస్తూరిపట్టెలును గంధపుండలును । అలరూన కజ్జాములు కొట్టుపసుపులునూ ।
సెనగపప్పుండర్రిముల్ చలిమిళ్ళుకలిపి । ఆవెముకభక్ష్యముల్ అవనిజకు దెత్తు ।
పొంందైనయాపసిడి బొమ్మలుకొన్ని । పొత్తుకలిగుండుమీ పణతిమాతోను ।
ముదముతోజనకుని ముందరబెట్టి । పల్లకిలోబెట్టి పరువులెత్తించె ।
ముదముతోజనకులకు మ్రొక్కైవైదేహి । అతనిమనసూన తలవంచిపలుకు ।
మరదులుముగ్గురికి మరిచెప్పబోవ । వదినలకు నమస్కారములుజేసె ।
సన్నంపుముత్యాలు జలపోసినటుల । జానకిచెక్కిళ్ళ పడెనుకన్నీళ్ళు ।
కన్నీటనూతుడిచి కౌగిటనుజేర్చి । మిథునంపుసీతా యడలనేటికే ।
రాజాధిరాజ సురరాజశేఖరుడా । రాజాధిరాజనుత రామభద్రుడా ।
ఇచ్చినహారములు ఏమిటికొదువ । అనుకూలప్రతిమలతొ ఆట్లాడవమ్మా ।
బుద్ధులుచెప్పుచూ వప్పగజెప్పి । అమ్మరోపోనీవు అత్తవాడలకు ।
చిలుకలచిక్కట్లు చిన్నదువ్వెనలు । అమ్మరోపోవె నీవత్తవాడలకు ।
రావెచిలుకలకొలికి రాయంచగమనా । రావెమాకలహంసి రాజీవనేత్రి ।
చెక్కిలినొక్కుచు చక్కనితల్లి । అక్కరకుతగినట్లు అత్మాంగిరావే ।
మీయత్తమామ నినుబంపమంటె । మాకుచనువులేదు మారుమాటాడ ।
మీబావమరుదులు నినుబంపమంటె । మాకుచనువేదమ్మ మారుమాట్లాడ ।
ఓతల్లిరో నిన్నుకన్నలాభంబు । హరియల్లుడాయె మాఅదృష్టముచేతా ।
కలవస్తువులుమంచి వూరగాయలునూ । కాముడుభోంచేసె విడిదిలోపలనూ ।
బూరలూతప్పెట్లు బాకాలుమరియు । కొమరొప్పగాయకులు కొలుచుభటులూనూ ।
సీతరాముడూ మీవంటివారు । జనకునకు అల్లుడని వేయించెభేరి ।
పట్టాభిరాములు నీవంటివారు । పట్నంబుయేలుమని వేయించెభేరి ।
అత్తమామలతోటి హర్షంబుగల్గి । అణకువతో సంచరించుమాయమ్మా ।
వదినమరదళ్లలో ఓర్పుగలిగుండూ । వివరిశతోతిరుగు వెలదిమాయమ్మా ।
బావమరుదులతోటి భయభక్తిగలిగి । బహునెమ్మదిగతిరుగు బాలమాతల్లీ ।
తోటికోడళ్ళతో కలతలాడకుమీ । కూరిమిగలిగుండు గుణముగలతల్లీ ।
ఇరుగుపొరుగులవారి యిండ్లకునుపోకు । వివరిశకలిగుండు వెలదిమాయమ్మా ।
అతిపతనపుత్రికి అన్నియునుజెప్పి । అతిజాలిగాసుతను అప్పగించేను ।
అనియిట్లుబుద్ధులు అన్నిచెప్పుచును । తల్లికౌగిటజేర్చి కన్నీరునించె ।
అఖిలాండసీతను వదలనేటికిరాజు । దశరథుకొడుకు రామచంద్రునికి ।
ఒదేవిపట్టంపు దేవిగావమ్మా । శ్రీరాముపద్దను బుద్ధికలిగుండు ।
శ్రీలక్ష్మివైనీవు శ్రీరాముకొమ్మా । సిరిగలిగివర్ధిల్లు సృష్టిపాలించు ।

# సీత అప్పగింతల పాట

దశరథమహరాజు విశదంబుగాను । జనకునకుచెప్పరే సీతపయనంబు ।
అవుగాకమీమాటమేము గాదనము । వినవలెనుఒకమాట ఏకాంతముగను ।
వైదేహిపెరిగింది తొలుచూలువలెను । ఆచారమింతయిన ఎరుగదింకాను ।
మాతృగృహమనిమీరు మనసులోదలచి । మారుమాటాడక మగువపంపండి ।
అన్నమాటలువిని జనకమహరాజు । అమ్మరమ్మనిగుణము లంకించిపిలచె ।
మామిడిపండురావె మాణిక్యమురావె । మత్స్యావతారుల దేవిరావమ్మ ।
గుమ్మడిపండురావె గుణధామరావె । కూర్మావతారుల దేవిరావమ్మ ।
వసుధనూలక్ష్మినీ సమముగాజేయు । వరహావతారుల దేవిరావమ్మ ।
నవకోటిఋషులు ఆనందమునబొగడ । నరసింహావతారుల దేవిరావమ్మ ।
వరగుణనిధిరావె వరహాలరాణి । వామనావతారుల దేవిరావమ్మ ।
పనసపండురావె బంగారుబొమ్మ । పట్టాభిరాములదేవిరావమ్మ ।
కృష్ణవేణిరావె మరుమాతరావె । కృష్ణావతారుల దేవిరావమ్మ ।
బుద్ది వంతారావె ధర్మాంగిరావె । బుద్ధావతారులదేవిరావమ్మ ।
కలికిచిలుకారావె కమలాయతాక్షి । కలికావతారులదేవిరావమ్మ ।
జనకుడుజానకిని తొడలపైనుంచి । ఆనందబాష్పములు కన్నులనింపె ।
అర్ఘముబెట్టియు ఆవులనుగొంటె । దానదత్తము సేయతనవశముగాదు ।
జనకుడుజానకిని కన్యధారపోస్తె । రాముదేహమందు కాదిక నావశము ।
పట్టుచీరలుమంచి యత్తళుకురవికె । తగుసీతకు దెత్తురితళుకురవికెలను ।
వీణంచుకరకంచు వెల్లబొమ్మంచు । అంచులకుమిన్నంచు ప్రబలుచీరెలును ।
ఇంద్రనీలమనియేటి యీవన్నెపట్టు । చంద్రకాంతులతోను సమమయినపట్టు ।
హంసవర్ణమనియేటి ఆవన్నెపట్టు । మేఘవర్ణముతోను సమమయినపట్టు ।
పచ్చగాగట్టిన పందిళ్లక్రింద । పీటపట్టుపెట్టి పీటలుపరచి ।
అపుడువసిష్టుని కూర్చుండబెట్టి । అంతటవసిష్టున కరుంధతికిని ।
అప్పగింతలవేళ అభరణాలిచ్చిరి । లక్ష్మితోగూడిన నారాయణునకు ।
చేతబన్నసరము సీతచేనిచ్చి । పార్వతితోకూడిన పరమేశ్వరునకు ।
పైడిచెరగుల పట్టుబాగుగానిచ్చి । బంగారుపళ్లెములో పాల్నెయ్యిపోసి ।

బాలహస్తమ్ములు పాలలోముంచి । కాళ్లకడియాల జానకినితెచ్చి ।
దశరథులచేతిలో చెయ్యొప్పగించి । కంకణాలచేత జానకినిదెచ్చి ।
కైకమ్మచేతిలో చెయ్యొప్పగించి । యెడచిన్నపడుచమ్మయెడబాయదమ్మ ।
చేడెరోమీసేవ చేయించుకొండి । ఏడబోయినఆడ అట్టెయుంచేను ।
మెల్లగానేర్పుతో పిలుచుకోరమ్మా । మాపట్టికాదుసుమి మీపట్టిసుమ్మ ।
ఇదిశాంతఇదిసీత సమముగాజూడు । సూడిదములచేతి జానకినిదెచ్చి ।
సుమిత్రచేతిలో చెయ్యొప్పగించి । చామపువు కడియాలజానకినితెచ్చి ।
శాంతమ్మచేతిలో చెయ్యొప్పగించి । అపుడుజనకరాజు కన్నీరుబెట్టె ।
అపుడుశాంతాదేవి యిట్లనుచుపలికె । జనకుడామీబిడ్డకేమి కొదువయ్య ।
అలరుపాన్పుమీద అమరుండగలదు । బంగారుపళ్లెములో పాల్నెయ్యిబోసి ।
బాలహస్తమ్ములను పాలలోముంచి । అప్పుడుజనకుడు ఇట్లనిపలికె ।
అగ్నిసాక్షిగాను పెండ్లాడినావు । అవనిజభారము మీభారమనిరి ।
హస్తకంకణాల జానకినితెచ్చి । ఆరాముచేతిలో చెయ్యొప్పగించి ।
అష్టవర్షావతి యీకన్యనెపుడు । యిష్టముగనేలుకో ఇంతినీనీవు ।
చిరమువాత్సల్యత శ్రీరామయనుచు । శ్రీరాముచేతిలో చెయ్యొప్పగించి ।
పద్మముఖములకెంపు పలువరుసమెరయ । నవ్వుచునిట్లనె రఘురాముడపుడు ।
జనకుడామీబిడ్డకేమి కొదవయ్య । అలరుపానుపుమీద అమరుండగలదు ।
సీతామహాదేవి తల్లిఅప్పుడును । వియపరాలుకౌసల్యను చెయిపట్టిపిలచి ।
కుర్చిపీటలువేసి కూర్చుండబెట్టి । చేతిలోచెయివేసి తాకౌగలించె ।
కుసుమవరగంధి తాకూతునొప్పగించి । నీకుతమ్మునిపట్టి నిజముసుమివదినె ।
నీకిస్తిపాలలో ముంచెత్తవమ్మ । పాలనేముంచెత్తు నీటముంచెత్తు ।
నెయికాచనేరని నెలతసుమివదిన । ఆకలికినోర్వని యబలసుమివదినె ।
ఆకలనియెన్నడు అడగనేరదు । వేళయెరిగిపెట్టుమావెలదిమావదిన ।
కొమ్ముశేన్గులవంటి కొమరులేగాని । ఆడపడుచులగన్నయలపెరుగరమ్మ
అదియేల ఆమాటలానతిచ్చేరు । అలాగెమాకొక్క ఆడపడుచుంది ।
దశరథులకూతురు శాంతమహాదేవి । కౌసల్యగారాల పట్టిసుమివదిన ।
తొమ్మిదినెలలుమోసి తొలిగర్భమునను । అమ్మరోనినుగన్నయానందమేమి ।
యెనిమిదేండ్లుబెంచి యీకన్యనిపుడు । యెలనాగనీకిస్తి యేలుకోవమ్మా ।
యెలనాగనీబిడ్డ కేమికొదవమ్మా । అలరుపాన్పుమీద అలరుండగలదు ।
మట్టెలపిల్లేళ్ల మాళవినిదెచ్చి । భరతునిచేతిలో చెయ్యొప్పగించి ।

ఉంగరాలచేతి యూర్మిళనుతెచ్చి । సౌమిత్రిచేతిలోచెయ్యొప్పగించి ।
చేకట్లకడియాల శృతకీర్తి దెచ్చి । శతృఘ్నుచేతిలో చెయ్యొప్పగించి ।
కోడికుయ్యగలేచి దశరథులుభేరి । వేయించిరిచెప్పరే సీతపయనంబు ।
ఎక్కడమిథిలాపురి యెక్కడయోధ్య । యేబ్రహ్మగూర్చెనే యెలనాగనీకు ।
అడవులుమృగములు అవికొండగుహలు । అమ్మమ్మనిన్నెవ రాదరించేరు ।
పులులున్నపుట్టలు అడవిమృగములును । అమ్మమ్మనిన్నెట్లు అంపుదునునేను ।
మాసీతరాదుగా మీతోనుఆడ । అమ్మలారామీర లేలవచ్చెదరె ।
బొమ్మరిండ్లున్నవి బొమ్మలున్నవి । మాసీతరాదుగామీతోనుఆడ ।
బొమ్మరిండ్లుగట్టి బొమ్మలనుబెట్టి । ఆటయెవరాడెదరమ్మ మాయింట ।
బొమ్మలకుసొమ్ములు పోరితెమ్మనుచు । నన్నెవ్వరడుగుదురు నాతల్లిసీత ।
ఇంటగుజ్జెనగూళ్ల అట్టెవండుచును । ఆట్లెవ్వరొండెదరు అమ్మమాయింట ।
ఆడుచుపాడుచు నట్టెరమ్మని । నన్నెవరుపిలచెదరె నాతల్లిసీత ।
వేకువజామునలేచి వెలదులనుపిలచి । తద్దెవ్వరుండెదరు తల్లిమాయింట ।
ఊగుదమురమ్మని యువిదలనుపిలచి । ఇంకనూగెడి వారలెవరుమాయింట ।
బంతినారుపోసి మాదొడ్డినిండ । చెట్లెవరుపెంచెదరు చేడెరోసీత ।
బొమ్మవడికట్టియు గిన్నెవడిగట్టి । పసుపుబియ్యపుగిన్నె పడతివడిగట్టి ।
పాలపండ్లొడిబోసి ఫలములొడిబోసి । అరటిపండ్లత్తాలు అతివవడిబోసి ।
కందమూలంబులు పోకలాకులును । వెండిగిన్నెతోటి వెలదియొడిగట్టి ।
ముదముతోజనకుని ముద్దుకూతునకు । ముత్యాలుఒడిబోసి ఒడిబియ్యంగట్టి ।
రామచంద్రుని చెట్టబాగుగాబట్టు । ఇరుగింటికేళ్లకే ఇందీవరాక్షి ।
పొరుగింటికెళ్లకే పంకజాతాక్షి । అంతఃపురమున అనుకొన్నమాట ।
ఎంతస్నేహితులైన నెరిగించకమ్మ । ఇంట్లోదిగృహకృత్య మిరుగుపొరుగులతో ।
అంటినావారితో నోకటాడకమ్మ । ఆడిన నాడికల పాలగుదువమ్మ ।
పతియుయోకాంతమున ఆడినమాట । పరులకెవ్వరికీని ఎఱిగింపకమ్మ ।
విభుడుభుజియించిన పాత్రశేషమ్ము । అమరిన నైదువయపుడారగించు ।
పట్టుచీరలుమంచి యతలషురవికె । లక్కపెట్టెలనిండ కొత్తకోకలును ।
సుగంధపరిమళం సున్నిపెట్టెలను । కస్తూరికరండము గంధపుండలును ।
పొందయిన ఆమంచి బొమ్మలనుదెచ్చి । పొత్తికలు ఆపసిడి బొమ్మలకుగట్టి ।
చిలుకపంజరములు చిన్నిదాసీలు । కలికిబలములతో కదలెనూసీత ।

ముత్యాలభాషిక మల్లాడగాను । పడతిరో మాసీత తిరిగిచూడవే ।
పచ్చలభాషిక మల్లాడగాను । పడతిరో మాసీతతిరిగిచూడవే ।
నీలాలభాషికం అల్లాడగాను । నెలతరోమాసీత తిరిగిచూడవే ।
అక్షయమయ్యేటి ఆభరణములతో । అంపెసుజవకుండు అయోధ్యపురము ।
రాముడు వేంచేసె తనరాజధాని ॥

# సీతను అత్తవారింటికి పంపుట

రాముడువేడుకతోనూ పేరిమమ్మునహర్షించె ।

భామలుఅందరుగూడుక కోమలినిపిలువండనిరి ।

జేజేసీతారామ జేజేబహుగుణధామా ।

జేజేపట్టాభిరామా జేజేవోపుణ్యనామా ।

రమ్మనిపిలచెను సిగ్గునభయమున యగ్గలపడుతూ ।

అమ్మవుగా అక్కవుగా సమ్మతిపడవే కలికీ ।

యికకొన్నాళ్లకునయినా పతిదగ్గరచేరెదవూ ।

మోహంపుంధ్రేటప్పుడు మేమేజూచెదమనిరీ ।

అనిపరిహాసకమాడుచు భామలు వాకిట నిలుచుండగాను ।

పానుపుపై నుండి ముసుగిడి తలుపులుమూయగనూ ।

తనతొడలపైనుంచుకు ముఖమెత్తినవ్వించె ।

ఘుమ్ముఘుమ్మని కస్తూరిముదమున తోడసూతాకలదె ।

తలకుపువ్వులుదురిమెను పరిమళమ్ములు తగసలదె ।

వెలదికిదోసిటమెరిసేటి కర్పూరతాంబూలంబొసంగె ।

మగువకునోటికి ముడుపులు మల్లాతానందించె ।

చక్కనివనితాలెమ్మని యెక్కువమోహంతోనూ ।

తగునేయింతికినిద్రా తగ్గునయెగ్గునలేచె ।

కొక్కొరోకోయనికోటి కుక్కుటమ్ములు గుయ్యగనూ ।

చక్కగమెరయుచు దంపతులొక్కంతటమేల్కనిరి ।

తల్పులుగిర్రునదాయా తల్పులుగిర్రునదన్నా ।

ధగధగమెరిసేటి దంతపు తొగరులు బిగిమూయుచునూ ।

పసుపంటిన చీరలతో పైచిట్లిన గంధముతో ।

విడివిడికొప్పులతోనూ ముసిముసినగవులతోను ।

వచ్చెటిచిన్నెలుజూచీ ముచ్చటపడిచెలులంతా ।

తీరుగఖళిరమ్మనిరీ చెలియెంగిలి తింటివిగా ।

వింతగ పకపకనవ్వుచు యింతిని చూచిరివారు ।

ఆవార్తలువిని జనకభూపతి కూతురుబిలచీ ।
　　　　రావేననుగన్న కూతురా రావే చంద్రవదనా ।
రావేరామరమణీయనితా గారాబముతోనూ ।
　　　　పిన్నవుగానీ పెద్దవుకావూ ప్రబలబుద్ధికయినా ।
నెలతరోకన్న కూతురవు గనుకనే నొకబుద్ధినెరిగిస్తు ।
　　　　వినుమీనాథుని ముంగిట యెన్నడు పకపకనవ్వకుమీ ।
సుందరనాథుని కన్నాముందర మేల్కొనుమీ ।
　　　　కలలోనెవ్వరినయినా పలుకకునిందించకుమీ ।
పంకజాక్షి సీతా చెలువుడు ప్రాణేశ్వరుడూ ।
　　　　పిలువక శాయబోకుమీపనులూ ।
పిలిచిన వేళనే పలుకుచుండు మీకలకతిరోనీవూ ।
　　　　అత్తకు మామకు జనులకు భక్తిగ సేవలుజేయుమీ ।
హెచ్చుగ వదినె మరదల్లలో మెచ్చుగ తిరుగకూ ।
　　　　ఆశగలిపించినవార్ని ఆశలెరిగి కాపాడు ।
నీసరివారిని హాస్యము శాయకెపుడు మాతల్లి ।
　　　　వడిబియ్యము గిన్నెలతోపుత్తడి బొమ్మలనుంచిరీ ।
చెలిగూడాడెడి నెలతలు గుబగుబవచ్చిరిగా ।
　　　　మగువరొనిన్నెన్నటికి చూడగలమనువారు ।
అనుకంటేయిచ్చకమని పలుకుదురు కాంతాలు ।
　　　　వయ్యారిజనకుడు బంగరిపల్లకిలో ।
కూతుర్ని అల్లుణ్ని యెక్కినవేళనే ।
　　　　శుభమని పలికిరి అఖిలమయినమునులు ।
అల్లుడవూచెలికాడవు తల్లివి తండ్రివినీవే ।
　　　　వెళ్లేటప్పుడు బాలను చల్లగ తోడుక పొమ్మీ ।
మగువకు తండ్రిమదపుటేనుగులు పదివేలు ।
　　　　కడయెక్కినతేజీలు లక్షలగుఱ్ఱములిచ్చె ।
భామలుభూములు రత్నపుసొమ్ములు భామకపుడు ।
　　　　బంగరురధములు పల్లకీలు జనకుడుతానిచ్చె ।
ముచ్చటచ్చటలతో మునులకుఅందరికీని ।
　　　　మొక్కుచు అయోధ్యనగరము చక్కగచేరిరివారు ।

పెద్దలకెల్లామ్రొక్కుచు దీవెనలనుగొనుచు ।
దంపతులిద్దరు అంతఃపురమునకువేగజనిరీ ।



తల్లులకూమ్రొక్కిరాముడు జనకూడుయిచ్చిన ।
కానుకలెల్లకూర్చి తనవారికిఇచ్చెను ।
భువిలోఈపాటపాడినావిన్నా అష్టయిశ్వర్యములు।
ఆదిదేవుడురఘుపతి యిచ్చునుమనకూ ॥

# సీతసమర్త

వీరరసమ్మునశివవిల్లూ ఆరూఢిగఖండించి ।
వేడుకతోవై దేహినిపెండ్లాడె రామచంద్రా ।
అప్పుడుదశరథరాజు తప్పకజనకునిజూచి ।
ఇప్పుడుమీపుత్రికనూ మాయింటికిపంపగవలెను ।
రాముతోరాజ్యముచేయుమని సీతకుముత్యపుతలంబ్రాలు ।
తావికిపడిబియ్యములు ప్రేమతోనిడిరంతటను ।
రాజభూషణమ్ములుబెట్టి నాణెపుతొడుగులుదొడిగి ।
రమణిరో రామునిచిత్తము రానడువవె మాయమ్మా ।
అత్తమామలసేవా భక్తితోసేయవెతల్లి ।
పతియేకాంతముసెప్పిన పలుకకు ఎవ్వరితోను ।
పతినీపాలిటిదైవము మదియెప్పుడుగాదలచు ।
ఓవదినెరో మాపడుచు వానికెకోడలు సుమ్మా ।
భావించేలుకొమ్మీ బాలల్లోనొకబాలనెను ।
పిలచిభోజనమ్ములకూ పెట్టినగానొల్లదుసుమ్మీ ।
వలదనియెరుగదె ఓయమ్మా ఓవదినెరో మాబాలా ।
ఓరుపుగలనాతల్లి ఒప్పులకుప్పవెనీవు ।
సల్లకొండరో పోయిరావె ననుగన్నతల్లనెను ।
ఆడబడుచునిపంపకున్నా ఆడుకుందురె యీజనులూ ।
పాటిగాదుమాతల్లి పసిడిబొమ్మరొవినవె ।
అనుచునుబుద్ధులుచెప్పి అంపదలచెకూతుర్ని ।
వెన్నెలపూబోణిరో ఎన్నడుచూడగగలనె ।
ముమ్మారుమాయిల్లు జూచివెళ్ళుముమాతల్లి ।
కన్నులజలములునింపుతు కనతల్లితాబంపె ।
రాముడుసతితోనప్పుడు రత్నపుపల్లకినెక్కె ।
కురిసెనుపువ్వులవానా మ్రోగెనుసురదుందుభులు ।
ఆడిరిఅచ్చరస్త్రీలు పాడిరిభాగోతులునూ ।

కదలిరికాల్చలముతో వెనుబడరథములునడువ ।

పూదిరినాగస్వరములు చేసిరిఆశీర్వాదములూ ।

ఎదురుగపరశురామునివిల్లు ఒకశరముసంధించి ।

చెదరకుండాఎక్కు_వెట్టి శౌర్యవంతుడెరామచంద్రా ।

అనిపుణ్యలోకానికీ పోకుండనుఒకశరమూ ।

నీతిమార్గమునవేసిన నీతిమంతుడెరామచంద్రా ।

సీతనుగూడయోధ్యలో కీర్తిపొగడగసాగె ।

పెరుగుచువై ఖరినొప్పుచు పరిమళించెనెరామచంద్రా ।

కోమలిభుజియించిలేచి తాంబూలమ్ములుచేయుమా ।

జోడుకూడియాడగ నొకచేడియ గనిరామచంద్రా ।

అచ్యుతులసీతసమర్త ఆడియున్నదె రామచంద్రా ।

అత్తయువినికౌసల్యా తత్తరించికడువచ్చి ।

కడువేడ్క_నుకౌసల్యా ఘనముగవిప్రులబిలచి ।

తగుగద్దెలుబెట్టించి తాంబూలమిచ్చెనెరామచంద్రా ।

శ్రీరాముపట్టపుదేవి శుభముగసమర్తలాడింది ।

వేళజూచిచెప్పుడి యిదివేడుక శాయగవలె ।

అప్పుడుపంచాంగమ్ములు విప్పిజూచిమునులెల్లా ।

మంచిదిహస్తనక్షత్రము పంచమిసోమవారమ్మా ।

మంచిదైన నభిజితు మంచిముహూర్తమె రామచంద్రా ।

పరమపతివ్రతయైయుండును పలువురుపుత్రుల గనును ।

పట్నపురాజై రాజ్యము పాలించును రామచంద్రా ।

కడువేడుక కౌసల్యప్రేమతొచెలులను బిలచి ।

పేరంటాండ్రను బిలువమని వేడుకజేయగవలెనూ ।

పసుపునలిచిన సీతకును బంగరు పట్టుచీరగట్టి ।

చేదెకుచంద్రకావి రెవికె దొడిగిరి రామచంద్రా ।

కాటుక కస్తురి తిలకము కాంతకు సూటిగదీర్చి ।

చాయగలా బంగారపు నెలతకు అద్దముజూపి ।

నాల్గుదిక్కు_ల మాణిక్యపు దీపమ్ములు వెలుగగ ।

పుష్పాల బంతులు జుట్టిరి పొలుపుగ జానకి కపుడు ।

పాడుచు దంచిరి చిమ్మిలి పంకజాక్షి జానకి ।

మంచి నవరత్నపురోళ్ళు యెంచగల పసిడిరోళ్ళు ।

సఖియలు పాడుచు చిమ్మిలి దంచిరి వేడ్కతో ।

సువ్వి రామచంద్రసువ్వి సువ్వికీర్తిసాంద్రసువ్వి ।

సువ్వి సీతమ్మ మాకు శుభములిమ్మా ।

సృష్టిలోను సీతమ్మ సమర్తకొట్నాలు దంచ ।

వేడ్కతో పేరంటాండ్రు వేగవచ్చిరీ ॥సువ్వి॥

పసిడి రోకళ్ళుబట్టి పద్మముఖులు సువ్విదంచ ।

కనులపండుగాయె కౌసల్యకప్పుడూ ॥సువ్వి॥

ఘల్లుఘల్లుమనుచు హస్తకంకణమ్ములు కదల ।

కొబ్బరీ బెల్లమూ కోరిదంచిరీ ॥సువ్వి॥

నువ్వులా పప్పుదంచి నూటికీ పంచిబెట్టి ।

ఘనముగా పేరంటాండ్రు కలసిదంచిరీ ॥సువ్వి॥

చిమ్మిలి పళ్ళెరములో సమ్మతముగాదోడ్కొని ।

ఇమ్ముగనుండలు చేయుచు కొమ్మలు తబుకుల నింప్రీ ।

కౌసల్యప్పుడువచ్చి కాంతలనందరబిలచి ।

బంగరు తబుకులతోనూ పంచిపెట్టించెనుతానూ ।

పిండి వంటలు పులగమ్ములు పాయసమ్ములు నేతులతో ।

నొప్పుగ పెరుగుల నేతుల వాలలాడిరి రామచంద్రా ।

మూడవదినమున సమర్తా వేడుకలన్నీజేసి ।

చేడెకు నాల్గవనాడు జలకమార్చిరి రామచంద్రా ।

శుభగుణములుగల జానకి అతిమానవతి సమర్తలాడింది ।

తగుననెను వైభోగము జగము మెచ్చగ కౌసల్యా ।

సుదతి శుభవారమ్మున శుభయోగపు కరణమునా ।

సుదతికి శుభలగ్నమున శోభనసుముహూర్తమే ।

ఏడు నిలువులాకనకపు మేడలు శృంగారించి ।

పట్టివేళ్ళపానపులు విభవముతోపరపించిరి ।

అచ్చపట్టుదుప్పటీ పానుపుపై పరపించ్రీ ।

అచ్చమల్లెలుజాజులు పానపుపై పరపించ్రీ ।

అత్తరుపన్నీరుమొదలగు పరిమళాదులనుంపించ్రీ ।

పచ్చిపోకలు చాలపండుటాకులనుంచ్రీ ।

జాజికాయ మొదలగు తాంబూలపు ద్రవ్యములుంచ్రీ ।

భూమిలోగలచుట్టాలకు ప్రేమతొా లేఖలువ్రాస్రీ ।

అంగవంగకళింగ బంగళదేశాధిపతులు ।

తమసతులతోగూడుకుని తమరంతాయేతెంచ్రీ ।

మరియుచువత్తురుజనులు నగరంతానిండిరి ।

అయోధ్యపట్నపు వారికి పంచిరిపసుపునూనె ।

చెప్పిరి భోజనమ్ములకు చెలియ శోభనమనిరీ ।

ఇందుముఖులు తమరంతా పాడుచుజలకములాడిరి ।

వరుసగవలువలుగట్టుకు మరియుచువచ్చిరీ ।

భోరులుకొలువగ వాయిద్యమ్ములు శ్రీరాముల శిరసంట్రీ ।

నిర్మలవుదకంబులతో దీర్పునజలకములార్చిరీ ।

బంగరుపట్టుపీతాంబ్రము కట్టనిచ్చిరివేడుకలా ।

తిరుకస్తూరితిలకము దీర్చిరేరామచంద్రా ।

కౌస్తుభమణిపతకము కర్ణకుండలములువెలుగా ।

పచ్చకిరీటముభుజకీర్తుల నుంచెనూరామచంద్రా ।

బొడ్డుమల్లెలుజుట్టెను శ్రీరాములకు లక్ష్మణునికీ ।

పచ్చనిపందిళ్లలోను రత్నపుకంబళ్ళుపరచిరి ।

అచ్చుగవేదవిప్రులతోవచ్చి వసిష్టుగూర్చుండే ।

బంగరుపీటలపై పట్టువలువలుబరపించే ,

రామునియుంచివశిష్టుడు భూమిజతెమ్మని బలికె ।

శశిముఖులందరు సఖియకుంతలకురులార్చిరి ।

బాగుగాచెంగావిచీర సీతాంగనకునుగట్రీ ।

చంద్రకావిపట్టురెవికె దొడగిరివేడుకతో ।

కాటుకకస్తూరితిలకము నెలతకుసూటిగ దీర్చిరీ ।

చాయగలబంగారపు నెలతకుఅద్దముజూపి ।

రవముత్యమ్ములుకమ్మలు రవమించిన కుంటెళ్ళు ।

ధగధగసందెటిదండలు రవకంకణమ్ములుమెరయ ।

అరుదుగభన్నస్సరములు ముత్యపుపేరులుబెట్రీ ।

ముక్కుకుముంగెరబెట్రి ముగుదకుశృంగారించ్రీ ।

అచ్చమల్లెలుదెచ్చి యతివకుకొప్పిడుదురూ ।

ఆభరణమ్ములుదెచ్చి అలంకరించిరివేడుకలా ।
తరుణీమణులందరు మాసీతాంగనుదోడితెచ్చి ।
శ్రీరామునిసరస తరుణీమణినినిల్పుదురు ।
హోమపుద్రవ్యములన్నీ నీమముతోదెప్పించి ।
రామునిచే వసిష్టుడు హోమంబు వ్రేల్పించె ।
వ్రతమున అధిపతియై రాములు అతివతో హోమమువ్రేల్చె ।
నారికేళములు మంచి కదళీఫలములతోను ।
సతిపతులచేతను యపుడూ ఫలదానములిప్పించ్రీ ।
అతివలు అతివ ఆశీర్వదింపుచు హారతులిత్తురు ।
సీతాసమేతాయ శ్రితమనోల్లాస నీతివాక్యాయ ।
అతినిర్మలాయ రాతినాతిగజేసి రక్షించు ।
జగములను దాతవై బ్రోచు దశరధసుతాయ ।
జయమంగళం నిత్య శుభమంగళం ।
దక్షణతాంబూలమ్ములు వచ్చినభూసురులకు ।
హెచ్చుగచీరలు హారములు వచ్చినస్త్రీలకు నిత్తూ్రి ।
ఇంతులకూ చెలికత్తెలకు బాలురకు ।
పచ్చని పట్టుచీగలు జనకుడుతానిచ్చె ।
రాముడు తల్లిదండ్రికి భూమిజతల్లిదండ్రికి ।
అరుంధతి వశిష్టుమొదలగు పెద్దలకందరికపుడు ।
మ్రొక్కుచు వారిచేతను పెక్కుదీవెన లందుకొనుచు ।
చక్రధరుడు లేచాదిక్కులు వెలుగగజూచె ।
లోకాలోకమ్ములకు యేకముగ విందులుజేసి ।
శ్రీకాంతుల శోభనమిది చెన్నుమీరగ రామచంద్రా ।
రామునికేళి గృహమును మేలిమితో శృంగారించి ।
ప్రేమజానకి పాన్పుకావింతురె రామచంద్రా ।
ఇంద్రనీలపు పట్టుపరుపూ అందముతో పరపించి ।
చంద్రకావితలగడలు యిరుగడలుంచిరే ।
పరుపుపై మెత్తగమంచి సరస సల్లాపముసెయ్య ।
మీకు సంభ్రమముగాజేసి శ్రీరామచంద్రా ।

కర్పూరతరువుల గాలప్పుడు విసరగ ।

పువ్వుల తల్పము మంచముమీదికి నొప్పులొలుకంగ ।

పాన్పుపైకూర్చున్నా పరంజ్యోతి బ్రహ్మము ।

మిక్కిలి పోగులుకాంతా వెక్కిళ్ళు మరసెనె ।

రామునికేళిగృహము మేలిమయిన వస్తువులు ।

చాలాపెట్టించెను వేడుకతో కౌసల్యా ।

మేలిమైన దానిమ్మఫలములు చూతఫలములను ।

మిక్కిలి కమలాఫలములు పచ్చిసెనగ కట్టలునూ ।

అచ్చుగతేనెతొనలు చిటిబెల్లపచ్చులె రామచంద్రా ।

రంగునసీతతోను నాడేటి రంగైన నిమ్మపండ్లు ।

వాసనవెలగపండ్లు సీతకు ప్రేమనె రామచంద్రా ।

ముత్యపుసున్నము మంచి పచ్చలసున్నపుకాయ ।

రంజిల్లే యపరంజి మెలిమైన పన్నీరు ।

చాలతెప్పించుచుండెను వేడుకతో కౌసల్య ।

కొడుకుకోడలువచ్చి కౌసల్యకుమ్రొక్కగ ।

తనకు మనుమలగనమని దీవించెకోడల్ని ।

ఓకాంతామణి నీతో నీ కాంతుడుపలికినను ।

పరకాంతలకెరిగించకు ఓకాంతామణినీవు ।

రాజకుమార్తెనుతోడుకు రాజాంగనలందారు ।

తేజముతోమందిరమ్ములకు రాజీవాక్షులుజనిరి ।

సల్లాపపుగృహములో రఘువల్లభునియుంచి ।

మెల్లగగలిపివచ్చిరి వేడుకతోరామచంద్రా ।

నెలతవుండుమని నవ్వుతుతలుపులుచేర్చి ।

నెలతలునవ్వగజానకి వణుకుతున్నదె రామచంద్రా ।

తలుపుదెగ్గరసీత ముసిముసినవ్వులునవ్వి ।

అతిలజ్జింపుచు సీత అక్కడినిలచెనె ।

అంగుళ్యమ్మున రత్నపువుంగర మపుడుదీసి ।

అంగనముందరవేసి యుప్పొంగితెమ్మనె రామచంద్రా ।

పతియాజ్ఞనుమీరకనూ అతిభయమునవుంగరము ।

సతిగొనితెచ్చియిచ్చిన జనువుజేసెనెరామచంద్రా ।

సీతసుదొడలపై నుంచుకు రమ్మని నిమ్మఫలమూలిచ్చి ।
అమ్మరొలాలించి పరబ్రహ్మమైనరామచంద్రా ।
వెలసినపుడోదేహము క్షణమాత్రమ్మునవాడినను ।
అవనిజఎంతన హరిహరియనెనే రామచంద్రా
చాలులెమ్మని చెయిబట్టుకు నీలవర్ణుడు జానకినీ ।
చాలదయతోనప్పుడు సతినిలాలించెనురామచంద్రా ।
చాలులెమ్మనిచెయిబట్టుకు నీలవర్ణుడుజానకినీ ।
సొగటాలాడుదుమూ రమ్మనెరామచందాౖ ।
తిత్తికితీపంచామది చక్కపొగడభారాయనుచు ।
భారభిత్రీదుగయని తొమ్మిదిపదియనుచును ।
తగువాదెనుపందెములు ఆటఆడసురాముడు–సీతగెలిచే ।
కోటిదౖవ్యము తెమ్మనెసీతరామచంద్రా ।
సకలరాజ్యవై భోగము సతినీవాడనుగానా ।
సకలమునీదేయనుచును సతిలాలించెనె రామచంద్రా ।
సీతానీవంటిస్త్రీలతో రాత్రిపగలుకూడున్నా ।
ఆకలిదప్పికబాయును అలసటలేతోచవు ।
వేడుకతోసీతసమర్త పాడిననివిన్నగాని ।
ఇష్టసంపదలు వై భోగములిచ్చిరక్షించును ।

# సీతవసంతము

(కిటతకిట, కిటతకిట, కిటతకిట, కిటతకిట,)

సీతామహాదేవి చెల్లెండ్లతోను । ఘనముగా ఒకబొమ్మరిల్లు గట్టుకొని ।
ఆడుచునుండగా అర్ధాంగివిభుడు । శ్రీరామచంద్రులు కొల్వువాలించి ।
రాణివాసపుకొల్వు రాజుగూర్చుండి । పిలిపించేతుంబురుల నారదులనెల్ల ।
రంభాదులపిలిపించె రఘురాముడపుడు । అప్సరాస్త్రీలు రంభాదులే తెంచి ।
అపసిడిమేడలో గణగణధ్వనులు । అపసిడిమేడలు అతివరాయెక్కె ।
ముత్యాలగడుపతా తొక్కుతూనిలచె । బంగారుతల్పుతా పట్టుకూచూచె ।
అంగనచూచెనే ఆరాఘవులను । తేటకన్నులరాముడు దేవినిజూచె ।
రంభనాట్యముజూచు రమణితెలివొంది । ఆపసిడిమేడలు అతివతాదిగెను ।
అర్ధాంగిపోగాను ఆరాఘవులూ । యెంతభ్రాంతిపడి యింతివచ్చిందో ।
మముజూచిఆయింతి మగుడుచున్నాది । యిక్కడరఘురాము విభుడతండనెను ।
అక్కడిజానకిని తోడితెమ్మనెను । రంభనాట్యముజూడ రమణిరావమ్మ ।
అంగనారమ్మన్న అర్ధాంగిబలికె । అత్తమరుగుదానా అటువున్నదాన ।
యెన్నడురఘురాము నెదుటనేనిలువ । వోయమ్మ నీవొచ్చినపుడె శ్రీరామ ।
చంద్రులు ఆద్వారమునకు చనుదెంచ్రీ । పూర్ణిమళమాళవి శృతకీర్తిరాగ ।
కనుసంజ్ఞలూచేస్తు కాంతలునిలచిరి । అర్ధాంగిరాగాను ఆరాఘవూలు ।
అర్ధాంగిజడబట్టి అట్టెతాతీసె । అథమిడిస్తంభాల అటుముడీవేసె ।
తమముత్యాలహారములు పతకహారములు । జానకికిసిగ్గని తాముడివేసె ।
యింతసేపు భయపడి యుంటివేనీవు । యివ్వన్నిబూటకా లిందీవరాక్షి ।
విల్లువిరవామేము వచ్చినానాడు । విరహతాపమ్ములు మేముయెరుగనివె ।
విల్లువిరువామేము వచ్చినానాడు । నాడుజూచితిమి నీనాటకాలన్ని ।
సిగ్గునాభయమునా నెలతతలవంచె । పద్మాక్షికరములు అటువణకదొణగె ।
నీలవర్ణుడుతాను నెలతజడవిచ్చ । జానకివేసిన ముళ్ళను విప్పుకొనె ।
అర్ధాంగినెత్తుకుని ఆరాఘవూలు । అంతఃపురమ్ములుకు అటువేగవచ్చి ।
బంగారుపాన్పుపై కూర్చుండివేగ । జానకికిసేవలు అటుచేయదొణగె ।
ముత్యాలహారము మురవైరివిసరె । కర్పూరతాంబూలంకాంత కందిచ్చె ।

కనకమేడలోను కరుణాకరులు । ఆరాజ్యలక్ష్మితో అతిభోగమునను ।
జానకితోసరసమ్ము లాడుచూతాము । రామచంద్రులు పూలబంతిచేవిసర ।
పువ్వులబంతులకు పణతిమూర్ఛిల్లె । ఝుడియకహరియెదుటపడి మూర్ఛలాయె ।
పడినసతిజూచిహరి అదరిపడిలేచి । ఝుడియకాయెత్తితన తొడలపైనుంచి ।
వగవకుమని తనవక్షమునజేర్చి । బిగువుగౌగిలిబట్టి భీతిమాన్పుచును ।
చెలికత్తెలనుబిలచె రఘురాముడపుడు । శ్రీలక్ష్మితోడుకుని శీఘ్రానవచ్చి ।
ఎపుడునువ్వాడేటి బొమ్మరిళ్ళల్లొ । చెల్లెళ్ళతోనాడు సీతామహదేవి ।
అక్కడికివచ్చెనె అత్తకౌసల్య । తనకోడలాటలు తాజూచుచుండె ।
అన్నపానాదులు అటుయెరుగకుండా । యిటువలెనె ఆటలుయటుపరిగినావె ।
ఆకోడలినియెత్తుకుని అత్తకౌసల్య । అంతఃపురమ్ములకు అటువేగవచ్చె ।
పయిడిపళ్ళెమ్ములో భక్ష్యభోజ్యములు । ఆరగించాబెట్టె అత్తకౌసల్య
ఆరగించేలేచి హస్తములుతుడిచి । కర్పూరపుతాంబూలంకాంత జేయుచును ।
మరిరాఘవేశ్వరులఁ దలచుచునుసీత । అంతఃపురంబులో అటువెదకదొణగె ।
ముత్యాలపందిళ్ళు ముదితావెదకె । రత్నాలుచవికలు రమణితావెదకె ।
మానికంబులచవికెలు మగువతావెదకె । పగడాలచవికెలు పణతితావెదకె ।
శ్రీరాములగానక సీతామహాదేవి । ఘనమైనదివ్యమేడలు వెదకుచుండె ।
జపమంటపములోను జగదేకరాము । కనులుమూసుకు జపంచేయుచుండగను ।
పాదమునఅందెలు కదలకుండగను । బంగారుచెంబుతో వసంతములుదెచ్చి ।
చల్లియాపద్మాక్షి అటువేగరాగ । కనుదెరచి శ్రీరాము కలయగనిపలికె ।
ఒక్కనిముషామయిన వనితతానిలుమి । పంజరమ్మూచిలక భంగిపారిపోయి ।
అత్తకౌసల్యను అటుకౌగలించె । ఓయమ్మనీగుండెలదురు చున్నావి ।
నీతోటిఆడినా చెలికత్తెలెవరు । నినుబట్టుకొనవస్తె పరిగెత్తివస్తివా ।
జపములుచాలించి జగదేకరాము । కొప్పెర్లవసంతములు జేయుమనిపలికె ।
కుంకుమజవ్వాది పరగకస్తూరి । కొప్పెర్లవసంతములు చేసికొనివచ్చె ।
మున్నూరుచిమ్మగోవుల వసంతములు । పట్టుకునిపరమాత్ముదేతెంచెనప్డు ।
ఓయమ్మమామీద వసంతములుజల్లి । ముచ్చువలెనేవచ్చి దాగియున్నాది ।
అంపుమని శ్రీరాముడటు పలుకగాను । అంపననికౌసల్య యిటుబలుకగాను ।
అక్కడకువచ్చెనే అత్తసూమిత్ర । శ్రీరాములుండేటి చందమ్ముజూచి ।
ఈవేడుకవనము కనులజూతాము । ఆకోడలనుయెత్తుతొని అంతఃపురములకు ।
అరుగబోగా నిలువునిలువుమనుచూను । నీలవర్ణుడు సీతకడ్డముగవచ్చి ।

ఖేరీలునఖీరీలు పెంపుదీపింప । తమకొల్వుచాలించి దశరథేశ్వర్లు ।
అంతఃపురంబులకు అటువేగవచ్చె । తలంవచికోడలను జూచియురాజు ।
యిదియేమిచోద్యమో అనిపలకగాను । కలకలనవ్వెనే కౌసల్యదేవి ।
సతిపతిసరసములను సలుపుచుండంగ । తిలకింపకనేనేల కొలువులోవుంటి ।
ఈవేడుకాకనుల చూడంగనైతి । నాపాపమునగాని నాకెట్లుగలుగు ।
వోయమ్మనీకుసిగ్గు బిడియములులేవే । నీమీదవల్లిన నీలవర్ణుణ్ణి ।
వెలతరోరఘురామ తోడుకునివచ్చి । నీచేతవసంతములు చల్లింతునేను ।
రాజులబిలుపించె ధశరథేశ్వరులూ । కొప్పెర్లవసంతములు జేయమనిపలికె ।
కుంకుమజవ్వాజి పరగకస్తూరి । కొప్పెర్లవసంతములు చేసుకూవచ్చి ।
బంగారుబిందెలలో వసంతములుదెచ్చి । ముత్యాలపందిళ్ళలో దించిరంత ।
బంగారుచెంబు అర్ధాంగిచేతికిచ్చి । ముంచగాహొయ్యగా రఘురాముడుతీసి ।
తాహొయ్యదలచెనే దశరధులుజూడ । దశరథమహారాజు తనయులంజూడ ।
భరతశత్రఘ్నులు తమరూనువస్తూ । ఆపయిడిస్తంభాల తొంగిచూతూరు ।
తమకొల్వుచాలించి దశరథేశ్వరులు । అంతఃపురమ్ములకు అటువేగవచ్చె ।
పయిడిపళ్లెరములో భక్షభోజనమ్ము । ఆరగించాబెట్టి అతివకౌసల్య ।
ఆరగించీలేచి హస్తములుకడిగి । కర్పూరతాంబూలంతెత్రుశత్రుఘ్నులు ।
ఈసీతవసంతములు యీజగతిలోను । యెవ్వరువ్రాసిన యెవ్వరూవిన్నా
ధనధాన్యసంపదలు ధనముగలిగుంద్రు । చక్కన్నిముత్తైదవతనము గలిగుంద్రు ।
చల్లన్నికడుపులు గలిగివుందూరు । అమీదఐశ్వర్యములు అందూచునుంద్రు ।

# సీతమ్మవారి అలక

ఆటకూటమ్ములో అయ్యోధ్యలోను । నట్టింటరాములూ సాధకముచేసె ।
అందుపై నగరడి సాధనముచేసి । అలసొచ్చిచెమ్మటలు అలదమనెగాని ।
ఇకనేమనదాయె నెగ్గింపదాయె । సీతపతిమాటలను చింతింపదాయె ।
పడతితనమాటలను పాటింపదాయె । చూచిచూచియురాము శూరునికి నపుడు ।
ఎఱ్ఱనితనకనుల హెచ్చుకోపమ్ము । పూనితనచేనున్న పువ్వుల్లబంతి ।
విసరెసీతమ్మపై విసవిసలు పడుచు । కొమరాలుసీతమ్మ కొమరెక్కగాను ।
ముద్దరాలుసీతమ్మ మూర్ఛలువోయె । అపుడురఘురాముండు అందరినిబిలచె ।
చిన్నియ్యపొన్నియ్య కన్నియలారా । గంగజలనుదకములు గుండీలుదేరె ।
తేటనుదకంబును తేరెవేగమున । మూర్ఛలుతెలుపవలె ముందుగాననెను ।
చల్లనిపన్నీరు చానల్లుతేగ । రఘురాముడు చల్లెరమణిమణిమీద ।
మూర్ఛలుతెలిసెను ముద్దరాలుసీత । తనకోపము పట్టలేక తాలేచిపోయి ।
ఒంటిస్తంభముమీది ఒకమేడలోను । పసిడితరిమెనకోళ్ళ పట్టెమంచమున ।
పండ్రెండుమూరలది పట్టుపచ్చడము । సొగసైన జల్తారు సోగలుకలది ।
భామసీతమ్మపుడు పాన్పుపైపరచె । ముప్పదిమూరలది ముతకపచ్చడము ।
ముద్రాలుసీతమ్మ ముసుకమరబెట్టె । అంతటహంసలు ఆడకనునుండె ।
పొలుపైనఅక్షులు మూసుకొనియుండె । ఆసీతపెంచిన ఆరామచిలుక ।
సిరిమించుబంగారు చిరిపంజరమ్ము । నుండిబయలకువచ్చియు విదకయిజూచి ।
ఉత్తరాద్వారాన నూగుచునుపోయె । ఆతలుపులేసుండె అటచూడరాక ।
దక్షిణాద్వారాన తాచిలుకపోయె । ఆతలుపువేసుండె అటుచూడరాక ।
పడమటిద్వారాన పటిమతోబోయె । ఆతలుపువేసుండె అటుచూడరాక ।
తూరుపుద్వారాన తూగుచునుపోయె । కొంచెముగ తీసున్నకించగాబోయి ।
పడతిదగరకేగి పాదములవ్రాలె । మ్రొక్కుపుచ్చుకొనదు మొగమెత్తదాయె ।
అదియేమిసీతమ్మ యిదియేమివిధము । కౌసల్యకోడలవు ఘనముగలతల్లి ।
భూదేవిబిడ్డ విదబుద్ధినీకు । అనిపలుకుచిలుకతో అనెనుసీతమ్మ ।
వదరకేవోచిలుక వద్దులెమ్మనకు । తలబగలగొట్టేను తన్నిచంపేను ।
పరుగునబోయనే పరగనాచిలుక । పంచటరుగులమీద పడియుండివేచి ।

శ్రీరాముదగ్గిరకు చిటచిటనేగి । పరుగుపరుగునబోయి పాదములవ్రాల ।
మ్రొక్కుపుచ్చుకొనదు మొగమెత్తదాయె । ఇదియేమిరామయ్య ఇట్లుండతగునా ।
కౌసల్యతనయుడవు ఘనముగలతండ్రి । భూదేవియల్లుడవు బుద్ధియిదియగునా ।
అనగానురాముండు అనెచిలుకతోడ । చిలుకరోఓచిలుక మారామచిలుక ।
నేనుజేసినతప్పు నేజెప్పలేను । మీసీతచేసినది వాసిగాజెపుదు ।
ఆటకూటంబులో అయోధ్యలోను । నటింటమీసీత నాయకముచేసె ।
అందమైనానగర సాధనముచేసి । అలసొచ్చినేచెమట లార్చుమంటేను ।
ఏమేమిఅనదాయె ఎగ్గింపదాయె । నామాటకునుతను నొవ్వలేదాయె ।
పడితినామాటలను పాటించదాయె । నాకుకోపమురాదె న్యాయంబుచెప్పు ।
మనగానెఆచిలుక యానునుబోయి । వేటకైనేగినా బాటనుజూచి ।
లక్ష్మణుడురాగాను చిలకయిట్లనియె । వినవయ్యలక్ష్మణా విశదంబుగాను ।
మీవదినజానకి మించలకనుండె । మీయన్నరాఘవుడు మించలకనుండె ।
వారియలకలుదీర్చ నెవ్వారికితగదు । బుద్ధిశాలివినీవు బుద్ధినూహించి ।
వీలైనతెరగున చాలయోచించి । అలకతీర్పగాదగునన నాతడనియె ।
వారాలుమొగుళ్ళకు వాదమైనాదా । ఇరుగుపొరుగువారు యింతులందరును ।
సీతమ్మఅలకలు తీర్చలేరైరా । నావలనగాదమ్మ నావశముగాదు ।
అనగానెఆచిలుక అట్లుగాదయ్యా । నన్నుబెంచిరిప్రేమ నిన్నడిగినాను ।
దారిచెప్పిననెనె దరిద్రొక్కుదాన । ఆమాటలక్ష్మన్న యటువినియనెను ।
నీవువేగమెపోయి నెరవొప్పగాను । రఘురాముఒంట్లోను లఘువుతప్పింది ।
అనియూరకుండుము ఆపైనసీత । నిన్నుబ్రతిమాలుకొని నిన్నుబంపించు ।
సీతదీసుకునీవు శీఘ్రముగారమ్మ । నేనురామునికడకు బూనుకొనిపోయి ।
రామునలకలుదీర్చి ప్రేమజూపంగ । సిద్ధముచేయుదును శ్రీరామునగ ।
తెక్కలల్లననార్చి రెక్కలుదెలిసి । రివ్వునజనెచిలుక రింగులువార ।
జనితూర్పుద్వారాన గనెనుసీతమ్మ । రఘురాముపంట్లోను లఘువుతప్పింది ।
అనగానేసీతమ్మ అతివేగలేచి । ఓరామచిలుకరో శ్రీరామచిలక ।
పలుకవేవివరమ్మ పల్మారుచిలుక । చిలుకపలుకకయుండె చిత్తరువులాగు ।
ఆపై నిభూసుత అంగలార్చుచును । చిలుకరోఓచిలుక మారామచిలుక ।
యెర్రలిముక్కునకు వేయిస్తువెండి । పచ్చనిరెక్కలకు పయిడిపొదిగిస్తా ।
నీవుపోయెడిత్రోవ సెనగవేయిస్తా । సెనగదినిచెయిగడుగ చెలమత్రవ్విస్తు ।
నీరుత్రాగినిలుచుండ నిమ్మతీయిస్తు । పాలుత్రాగిపరుండ పనసవేయిస్తు ।

అలసికూర్చుండ అరుగువేయిస్తు । నీవుపోయిరాముని కావుమనిపలుకు ।
విల్లువిరిచిననాటి వేడ్కలుజెప్పు । వద్దంటెపోతుంద వల్లభాయనుము ।
కద్దంటిసీతమ్మ కదలదనిచెప్పు । ఆమాటవినిచిల్క అటుపోయివచ్చి ।
రామునకలకలు రాగూడదెపుడు । వచ్చినసులువుగా వదలవునీవు ।
నాతోటివేగమె ప్రీతిగారమ్మ । లక్ష్మణుండచ్చట లావున్నవాడు ।
అనివారుపోయిరి ఆరాముజూడ । పన్నెండుస్తంభాల భద్రగృహమునకు ।
సడలినకురులన్ని చక్కంగదిద్ది । వల్లెవాటూచెరుగు వప్పుగావేసి ।
ఒయ్యావయ్యారినడక వయ్యారిసడక । నడుచునుదరిచేరు తడబడుచునపుడు ।
లక్ష్మణుడచ్చట రాములతోడ । మాటలాడుచునుండి మగువరాగానే ।
తొలగబోయినసీత తొత్రిలుచుననియె । నేమూర్ఛపడిమేను నేమెఱుగకుండ ।
ఆరసియన్న యుపచారముల్‌చేయ । సిగ్గుపడిపలుకాడ చెల్లకనువచ్చె ।
పడుకుంటిననితప్పు బట్టగానేమి । అనవినిలక్ష్మణు డపుడనియెనవ్వి ।
మాయన్నయుపచార మహిమ నెఱుగవుగా । మాయన్నభూలోక మాత్రికుండనెను
సీతతలవంచుచు సిగ్గుననుండ । శ్రీరామచంద్రులు చెలగుచు నవ్వ ।
కిలకిలనవ్వెను చిలుకవుడుజూచి । సతిపతులఅలకలు చాలగానుండ ।
ననుచుకిలకిలనవ్వెను అందంపుచిలుక । ఫక్కుననవ్వెను బాలరామయ్య ।
ఏడుభువనంబులు యేలేటివాని । వెలదినీవులేపితే వెరగేమివచ్చు ।
విశ్వవిశ్వంభరుడు వెలదినిద్రలున । అనిపల్కుసీత తానప్పుడిట్లనియె ।
ఏమమ్మచిలుకమ్మ ఏమనియంటి । రాములిప్పుడుచూడ లావుతప్పింత ।
కల్లపలుకులుపల్కి కారులరచితివి । అనుజుడులక్ష్మణుడా పల్కువినుచు ।
నవ్వులకన్నదీనలినాక్షిచిలుక । దానిగద్దించకు వదినెరోనీవు ।
నీవుపెంచినచిలుక నీపట్టుయుండు । ననగశ్రీరాములు ఘనముగానవ్వె ।
సీతయలుకలుదీరె చెలగిరాఘవులు । దీనివిన్నట్టైన దీర్ఘాయువగును ।

# సీతగడియ

శ్రీరామభూసతికి చేడెయైబుట్టి । కూర్మితోజనకుని కూతురై పెరిగి ।
అందమ్ముమెరయగా అత్తమామలకు । పరిచార్యలనుసేయు పరమగురుభక్తి ।
ఖిలువకరాదాయె ప్రియునిదాపునకు । జాజులతలదాల్చి జవ్వాదియలది ।
వేచియుతానుండె వేడుకనువిభుడు । ఎదురెదురుచూచెను వెలదిరాదనుచూ ।
తడవయ్యెరాదని తొందరపడుచూ । సూర్యవంశజుడపుడు సొరిదికోపించి ।
ఘడియగ్రక్కునబెట్టె కాకుస్థుడపుడు । సీతరోనీపనులు చేయుటకాద ।
అవనిజమై మరచినీవువున్నావ । అనుచుతలపంకించి కడుభ్రమజెంది ।
శయ్యపైపవళించె రామచంద్రులు । వేవేగభూమిజ వేగతావచ్చి ।
అత్తకౌసల్యకు అడుగులువత్తి । మామదశరథులకు మడతలందించె ।
సుమిత్రకైకకు సురటీలువేసి । పరగకౌసల్యకూ పానువూపరచె ।
మజ్జనంబులుచేసి పసుపుల్లుజేసి । బంగారుపూలచీర బాగమరగట్టి ।
దువ్వెపాపెటదీసి తింత్రిణీబెట్టి । తింత్రిణిలో ముత్యాలపతకంబుబెట్టి ।
రవ్వలముత్యాల జల్లిదిగవేసి । వెయిజేయకమ్మలూ వెలయంగబెట్టి ।
రెండువేలుజేయు హారములువేసి, మూడువేలుజేయు ముక్కెరాబెట్టి ।
నాలుగువేలుజేయు నానుమెడవేసి । పదివేలూజేయు పతకంబుబెట్టి ।
గంటలావడ్డాణం కాంతతాబెట్టి । నీలాలుదాపిన కీలుకడియములు ।
నీలవర్ణునిదేవి నేవళంబెట్టి । కడనుంచికన్నులకు కాటుకాబెట్టి ।
నిలువుటద్దములోన తనరూపుజూచి । జూచిముచ్చటజెంది మగువనవ్వుచును ।
పంచభక్ష్యాన్నములు తానారగించి । శ్రీఘ్రంబుగాలేచి చేతులనుగడిగి ।
జిలుగుబుట్టేదారు పచ్చడంగప్పి । బంగారుకలశముతో నుదకంబుబట్టి ।
ఆకుపోకలును మంచి యత్తర్వుపునుగు । జవ్వాదిచలువపన్నీరు గంధంబు ।
పండ్లుఫలహారములు పళ్లెరమునుంచీ । మల్లెలుమొల్లలు విరజాజులూను ।
కొప్పునముడిచియు సంతోషమునను । విభునిదగ్గరకేగి యిందివరాక్షి ।
విరులనుదెస్తినో వీరావతార । పుడమిలోవీరులకు తలనొగ్గకుండా ।
పరశురాముని భంగపరచితిరిమీరు । నన్నుయేలేస్వామి కాకుస్థతనయ ।
తలుపేయకోపమును తాళంగగలనా । నిలుచున్నపాదాలు చేతులునునొచ్చె ।

దంతపుతలుపులు తియ్యవోయినాథా । వొంటొంటిచినుకుకె ఒకచెంగుతడిసె ।
కాముడాతియ్యవోయి కనకంపుగడియ । పటపడచినుకులకు పైకొంగుతడిసె ।
పచ్చలబాలుడా తియ్యవోయిగడియ । నాలుగవఝామాయె నాప్రాణనాథా ।
రత్నహారంబిస్తు తియ్యవోయిగడియ । కరుణించిదీస్తివా కాళ్ళకడనైన ।
మంచిఒకనిద్రైన శరణొందిపోదు । అనగానురాఘుపుండ పుడనియెనిట్లు ।
నిద్రనీకులేకుంటె నాకేమిసీత । గంటవలెదీపమ్ము అదినాకుతోడు ।
నీవునిల్చుంటేను నాకేమిసీత । పువ్వులుబుక్కాయ అదినాకుతోడు ।
నీవునిల్చుంటేను నాకేమిసీత । గంధముకస్తూరి అదినాకుతోడు ।
నీవునిల్చుంటేను నాకేమిసీత । పట్టెమంచంపరుపు అదినాకుతోడు ।
ఈరీతిచెప్పగా సీతకోపించి । అంకించిపోయెనే అత్తవాసముకు ।
అత్తకౌసల్యకు అన్నిదెల్పగను । తల్లికౌసల్యొచ్చె రాముదగ్గరకు ।
దశరథునిపుత్రుడవు జనకులల్లుడవు । భూమిదేవల్లుడవు బుద్ధటరనీకు ।
సీతజేసినపత్వు శ్రీఘ్రానజెప్పు । నాకుయెరిగించరా ననుగన్నతండ్రి ।
అమ్మనీకోడలిని అతిగౌరవమున । నలినాక్షిపెంచితే నన్నుగైకొనునా ।
చిరునవ్వునవ్వుచూ సూర్యవంశజుడు । రాముండుతీసెను రత్నాలగడియ ।
మామాప దశరథులు ఒక్కరున్నారు । అత్తమీరుపొండి మామామకడకు ।
అనిచెప్పకౌసల్య తనమేడకేగె । సిగ్గుతోశ్రీలక్ష్మి విభునిసన్నిధికి ।
చేరగానేదివ్వె కలకలానవ్వె । ఆకులువాసనా పానుపుమీద ।
పోకలవాసనా పానుపుమీద । పువ్వులవాసనా పానుపుమీద ।
కస్తూరివాసన పానుపుమీద । పుష్పలవాసన పానుపుమీద ।
బుక్కాలవాసన పానుపుమీద । ఆడవారికోపంబు యెట్టిదోయనుచు ।
మళ్ళిపరుండెను రవివంశజుండు । అగ్గిచెంతనువెన్నెంత తడవగునోడ ।
ఆడవారికోపమ్ము అట్టిదేయనుచు । శీఘ్రానకలిసెను శ్రీలక్ష్మియంత ।
కేళివిలాసముల క్రీడించెరాము । వైభోగపదవులతొ సుఖముగానుండె ।
పుడమిలోయీపాట పాడినావిన్నా । ఐశ్వర్యవంతులయి అతివలుండెదరు ॥

# సీతాదేవి వామనగుంటలు

వామనగుంటలాడుదామ వనితజానకీ । సామజవరద రావయ్యస్వామిరాఘవా ।
ముత్యాలవామనగుంటల పీటలుంచుకునీ । ముగుదసీతా మనమిద్దరమాడుతామటే ।
వజ్రాలవామనగుంటల పీటలుంచుకునీ । వనితమనమిద్దర మాడుదామటే ।
కెంపులవామనగుంటల పీటలుంచుకునీ । సొంపుతోమనమిద్దరమాడుదామటే ।
రత్నాలవామనగుంటల పీటలుంచుకునీ । రమణిసీతా మనమిద్దరమాడుదామటే ।
పచ్చాలవామనగుంటల పీటలుంచుకునీ । పణతిమనమిద్దర మాడుదామటే ।
నీలాలవామనగుంటల పీటలుంచుకునీ । నీలవేణిమనమిద్దర మాడుదామటే ।
రాముడుకదలెను రత్నాలచవికెకు । రమణీసీతని కూడకా ।
కర్ణాకుండలములు కదలాచునుండగా । కాకుత్థ్సతిలకుడాడెను ।
పచ్చలబావిశీలు కదలుచుండగా । పణితి జానకియాడెను ।
రెంచాముముంచాము ఆపులనుచూచి । రాముడే తాదీసెను ।
పసిడిడిబ్బీలన్ని పందెములగెల్చి । పరమాత్ముడే గెల్చెను ।
చిన్నబోనుయేలనీవు చెలియజానకి । విభుడూపంచాలన్ని తానెతీసెనూ ।
అఖిలబ్రహ్మాండములె ఆటపీటలూ । ప్రజలరక్షించుటలు పసిడిడిబ్బీలు ।
సఖియనీతో ఆటనేడుసంబరమాయెనే । ఆటచాలు నికనుచెలియపీటగట్టుమీ ।
పీటకట్టుమనీబొంకి పారిపోదురా । ఆటకరువై వేలివ్వలెక్కలున్నవి ।
వోలిగట్టక అడుగుదాటికదలనివ్వను । నిలుపునిలువుమనుచు సీతఆజ్ఞచేసెనూ ।
స్వామిపయివోణిఅయినా పట్టిఆపెనూ । పుడమిలోఎవరయినా ఆటవోడితే ।
కానుపీసమిత్తురుగాని వేలనిత్తురా । నేనుగెలిచినా వోడినానీసొమ్ముగాదటే ।
నీవుగెలిచితేను నాసొమ్ముగాదటే । భరతలక్ష్మణులు వింటెగేలినేతురే ।
నావారంతావింటె నవ్వుకొందురే । చాలుచాలుయికను సకియజాణయందురే ।
అయితేసీతానాచేత నేమివున్నదే । ముప్పైవేలముత్యప్పతకం ముగుదపుచ్చుకో ।
పదివేళ్లనున్నా బంగారుబటువులు । పణతీపుచ్చుకో ।
చంద్రకాంతులతోను శోభిల్లుచున్నట్టి । కిరీటమున్నాది పుచ్చుకో ।
మామగారు నాగవల్లినాడిచ్చిన । ముద్రికయున్నాది అదిపుచ్చుకో ।
పడకటింటీలోన పదిలక్షలూజేయు । పానుపున్నది పుచ్చుకో ।

అయితెసీతానాచేతిలోనూ । యింక యేమేమి ఉన్నావే ।
కోసలరాజ్యము కోమలియున్నాది । నీవేలుకోగదే ।
గొల్లదాన్నినేను కానుస్వామీ । పల్లెతిరిగి చల్లలమ్మా ।
అయితే సీతానాచేతిలోనూయింక । యేమేమివున్నవే ।
యేనుగులుగుఱ్ఱాలు హెచ్చుగానున్నవే । నీవేలుకోగదే ।
అరుసురాజువునీవు భూమీశుడవుగనుక । యెక్కగానీకుతగునూ ।
పుట్టిచక్కట్లనూ నాకేలజెప్పేవు । ఆటమానుటకును నీవుస్వామిరాఘవా ।
చైత్రశుద్ధనవమినాడు ఓడినందుకూ । చిల్లరనగలన్నిదీసి సీతఓడియిచ్చేనూ ।
అరవై వేలకు మీకుఓలియున్నదీ । అనుకొనుచు సీతతానులోనికేగెనూ ।
కౌసల్యాది అత్తలంతచూచినవ్వీరీ । భూపుత్రిమీలోను యెవరుగెల్చిరీ ।
రమణినీవోడినావా రాముడోడెనా । మీకొడుకుగడుసు గనకడిచ్చిదీసెనూ ।
కానుకలందింపు మీకుతెచ్చియిచ్చునూ । మాళవిశ్రుతకీర్తి మగువలందరు ।
మాబావఓటుగెలుపు విన్నవించుమీ । అనగచిరునవ్వునవ్వి బావగెల్చిరి ।
ఓలిగట్టకపారి పోయిరనుచుచెప్పగా । భరతశత్రుఘ్నులంత పరిహసించిరి ।
పుడమిలోయీపాటపాడిన పుణ్యకాంతలు । సీతారాములవలె వర్ధిల్లుచుందురూ ॥

# సీత దాగుడుమూతలు

కంబుకంఠివేగరావె కాంతరాగదె । చెలియరావె కుందనంపు బొమ్మరాగదె ।
పణతిరావె పట్టంపుదేవిరాగదె । కొమ్మరావె కుందనంపు బొమ్మరాగదె ।
అనుచుశాంతపిలువగాను వినుచువేగమె । జానకికదలివచ్చె ముత్యాలచవికెకు ।
మాళవేది ఊర్మిళేది మగువజానకి । శతకీర్తితోడితేవె చెలియవేగమే ।
వారుముగ్గురువచ్చి వనితచాటునిల్వగా । దాగుడుమూతలాడుదమని తరుణిబల్కెను ।
తల్లిఎవరుమనకు కనులుమూయనెవ్వరు । ఓడిపోతెధనము తెచ్చిఇవ్వనెవ్వరు ।
ఓడిపోతెవదిన మీవద్దనుందుమూ । శాంతానుమరదండ్లు ఆడుచుండగా ।
రామచంద్రుడువచ్చె రత్నాలచవికెకు । ఇక్కడరామచంద్ర నీకుపనులుఏలరా ।
అక్కడనీమరదండ్రు ఆడుచుండగా । వెక్కసముగచూడవస్తి వేడుకాయెను ।
అనుచురామచంద్రు బల్క అతివలందరు । తమకుసిగ్గుచేత తలలువంచుకొందురు ।
సిగ్గుపడినచేడెముఖము శాంతచూచి । కాంతలనుకనకంపు మేడకంపెను ।
రారరామచంద్ర రత్నాలచవికెకు । రంగుమీరగాను రమణిగూడియాడగ ।
అతివరామునికి కళ్లుమూసితెరువగా । శాంతబట్టిసంభ్రమమున సీతరొప్పుచు ।
ఆటనీవుగెలిచినావు అతివజానకీ । కోటిధనములియ్యమాని కోమలడుగవే ।
ఆటరామచంద్రుడోడె అతివగెలిచెను । కోటిధనము లియ్యమానికోమలడిగెను ।
కోటిధనములడిగి శాటికొంగుబట్టెను । కొమ్మనాకొంగు బట్టసమ్మతవునచే ।
ఆడనేలతమరుమాతొ వోడనేటికి । ఓడినాధనము లడుగకోపమేటికి ।
చెయిబట్టిచేరదీసి శాంతనవ్వుచు । రామనీదుధనము కాదరామసీత ।
పున్నమవెన్నెలెపుడు కాయుచుండగా । చిన్నముద్దు దాగుడుమూతలుమూయుచుండగా ।
సీతదాగుడుమూతలనగ సృష్టిలోపల । భక్తితోడ పద్మాక్షిపాటపాడెను.

# పూదరగుప్పీలు

నీలవేణిరావె ముద్దుల కోకిలవాణిరో । రాములుండెనీలాల స్తంభవమికెలోపల ।
అతనితమ్ముడు శేషశాయి భరతశత్రుఘ్నులూ । అతనిచెలికాడు సభాబలరాముడూ ।
బంగారుగడపదాటివచ్చి అంగనగంటినీ । కెంపులురెండు కావాలనుచు కోకిలవాణిరో ।
కెంపుటింటిగడియ వాకిలివేసియున్నదీ । కేళిగృహమువాకిట ముందరగడియవే ।
ఏమిఆటలునీలవేణి ఎరుగజెప్పవే । పూదరగుప్పీలు ఆడిమనము కడుపోదము ।
జానకమ్మకదలగానె రాములుకదలిరీ । రాములుకదలగానె నీలవేణికదలెను ।
వేణికదలగానె కోకిలవాణికదలెను । వాణికదలగానె పల్లవపాణికదలెను ।
నీలాలసావడి నాలుగుదిక్కులు నెలతచూసెను । జాలకర్రల చల్లగాలి తమకువిసరగా ।
పూమకొందుముందునేను ఉదయవాణిరో । పూదివేణి జానకి అయిదుకెంపులు వేసెను ।
అయిదుకెంపులు పదికెంపులు పణతివేసెను । కడమకెంపులుపణతి జానకిపారవూదెను ।
ఆటవోడిపోతిగదవె అతివజానకీ । అనుచురామచంద్రులు ఆణిముత్యాలు పోసిరి ।
అయిదుకెంపులు పదికెంపులు పణతివేసెను । కడమకెంపులుపణతి జానకీపారవూదెను ।
అతివజానకి ఆణిముత్యాలు వోడదీసెను । అటవోడిపోతిగదవె అతివజానకీ ।
అనుచురామచంద్రులు పగడాల రాసులుపోసిరి ।
అయిదుకెంపులు పదికెంపులు పణతివేసెను ।కడమకెంపులు పణతిజానకి పారవూదెను ।
అతివజానకి ఆణిముత్యాలు వోడదీసెను । ఆటవోడిపోతిగదవె అతివజానకీ ।
అనుచురామచంద్రులు మాణిక్యాలు రాసిపోసిరీ ।
అయిదుకెంపులు పదికెంపులు పణతివేసెను । కడమకెంపులు పణలిజానకి పారవూదెను ।
అతివజానకి ఆణిముత్యాలు వోడదీసెను । ఆటవోడిపోతిగదవె అతివజానకీ ।
అనుచురామచంద్రులు కెంపులరాసులుపోసిరి ।
అయిగుకెంపులు పదికెంపులు పణతివేసెను । కడమకెంపులు పణతిజానకీ పారవూదెను ।
అతివజానకి ఆణిముత్యాలువోడదీసెను । ఆటవోడిపోతిగదవె అతివజానకీ ।
అనుచురామచంద్రులు వజ్రాలరాసులుపోసిరి ।
అయిదుకెంపులు పదికెంపులు పణతివేసెను । కడమకెంపులు పణతిజానకి పారవూదెను ।
అతివజానకి ఆణిముత్యాలు వోడదీసెను । ఆటవోడిపోతిగదవె అతివజానకీ ।
అనుచురామచంద్రులు పచ్చాలరాసులుపోసిరి ।

అయిదుకెంపులు పదికెంపులు పణతివేసెను । కడమకెంపులు పణతిజానకి పారవూదెను ।
అతివజానకి ఆణిముత్యాలు వోడదీసెను । ఆటవోడిపోతిగదవె అతివజానకీ ।
అనుచురామచంద్రులు నీలాలరాసులుపోసిరి ।
అయిదుకెంపులు పదికెంపులు పణతివేసెను । కడమకెంపులు పణతిజానకి పారవూదెను ।
అతివజానకి ఆణిముత్యాలు వోడదీసెను । ఆటవోడిపోతిగదవె అతివజానకీ ।
అనుచురామచంద్రులు ధనమురాసిపోసిరీ । అయిదుకెంపులు పదికెంపులు పణతివేసెను ।
కడమకెంపులు పణతిజానకి పారవూదెను । తరుణిజానకి ధనమురాసులు వోడదీసెనూ ।
ఆటవూడిపొగదవె అతివజానకీ । అనుచురామచంద్రులు సభకు జరిగివచ్చిరీ ।
ఆడవారితోటిరాములు ఆడనేటికీ । వోడిధనములడుగుతేను కోపమేటికీ ।
మగువనాసొమ్ము నీసొమ్ముగాదటే । అనుచురామచందు్రిలు సభకుజరిగివచ్చిరీ ।
తమ్ముడుశేషశాయి రమ్మనిపిలచిరీ । అమ్మనడిగిసంపెంగ తైలముతెమ్మనంపిరీ ।
శేషశాయికదిలెనేమీతల్లినగరికీ । అమ్మమనరాములూ దరగుప్పీలాడిరీ ।
కొమ్మతోసుజానకి రాములువోడిపోయిరి । ఆడవారితోటి రాములుఆడన్యాయమా ।
అనుచుశేషశాయి సంపెంగతైలమిచ్చెను । రంగడికినైవేద్యముల వేళలాయెను ।
రాముడుకాకలికలదు శేషశాయినిపిలవరే । శేషశాయి కదిలెనేమి అన్ననగరికీ ।
నీలవేణిజానకి చేతులతైలముపొసెనూ । నీలాలబావిలీలు నిగనిగలాడనెలతలంటిరీ ।
పూదరగుప్పీలుఆడినసభకుఅనుచుపాడరే । ముక్కుముంగెరతూలితూలముదితయంటెను ।
పూదరగుప్పీలుఆడిలసభకుఅనుచుపాడరే । ధన్నసరములుధగధగమెరయపనాతియంటెను ।
పూదరగుప్పీలు ఆడినసభకుఅనుచుపాడరే । ఘుంటలవడ్డాణము ఘలుఘల్లుమనియేటి కాంతయంటెను ।
పూదరగుప్పీలు ఆడినసభకు అనుచుపాడరే । వేళ్లవుంగరాలు వెలుగూతుమెరిసేటి వెలదియంటెను ।
పూదరగుప్పీలు ఆడినసభకు అనుచుపాడరే । అందెలమువ్వలు అరకాళ్లమెరిసేటి అతివయంటెను ।
పూదరగుప్పీలు ఆడినసభకు అనుచుపాడరే । చిలకాలబావిలీలు కలకలలాడగసీతఅంటెను ।
పూదరగుప్పీలు ఆడినసభకు అనుచుపాడరే । పూదరగుప్పీలు శోభనముపాడినవిన్ననూ ।
అష్టయిశ్వర్యములు అయిదువతనములురాములిచ్చిరీ । సకలసంపదలు శ్రీరఘుపతిఇచ్చిరీ ।

# ఋషుల ఆశ్రమము

అతివకౌసల్యాదు లయోధ్యలోను । భరతుడు నందిగ్రామంబు నందునను ।
రాఘవులజేయు నరణ్యవాసంబు । తలపోయుచుండిరి తగవులెంచుచును ।
అనుజసమేతుడై అతివతోగూడి । శ్రీరాములుండిరి చిత్రకూటమున ।
కందమూలఫలంబు లందుసేవించి । వనచిత్రములనెల్ల వైదేహిగనగ ।
శ్రీరాఘవుడువాని చిత్రములజెప్ప । సీతామహాదేవి చెలగివినుచుండ ।
లక్ష్మణుండెప్పుడురఘుపతినిసీత । గొలుచుచుచింతల గోల్పవుచుండె ।
ఇట్లుండనచ్చటి హితమతులైన । మునులెల్లగుసగుసలను దేలుచుండ్రి ।
ఆచందమరయు నారామవిభుడు । తాపసినొక్కని దగజేరికొనుచు ।
కారణంబడుగగా వారికాతండు । ఖరుడనురావణాసురుని తమ్ముండు ।
పురుషభోజియుగర్వి బుద్ధిహీనుండు । మీరుండబట్టి మమ్మిందులేకుండ ।
తరుమగానున్నాడు తగదయ్యమీరు । జానకీదేవి భూజానిలక్ష్మణుని ।
తోనిటనుండంగ మానుడమేలు । యావార్తదెలుపగా యవమతితోడ ।
మౌనివర్యులుజంకి మాటలాడంగ । గుసగుసలను దేలుకొనుచున్నవారు ।
ఈపలుకులువిని రాఘవేశ్వరుడునవ్వి । రాజకులంబున రహిబుట్టినాము ।
రాక్షసహరణంబు రాఘవులదనియె । ఐననుభరతుని యునికిదగ్గరగ ।
నుండుటహితవు గాకుండుటచేత । చిత్రకూటమునిడచి చేరువనుగలుగు ।
ఋషులఆశ్రమములకు ఋషులజూడంగ । పోయెదమనిచెప్పిపుచ్చి రామునిని ।
ఒకచోటకుండేటి వాసమ్ముమనకు । హితవుగాదనియెంచి యిద్ధచరితుండు ।
పయనమైతరలెను పడతితోగూడ । లక్ష్మణుడిట్లు నిలాపతితోడ ।
మగువలతోనడక తగవుగాదనగ । వైదేహికినరణ్యవాస చిత్రములు ।
చూపుచునడచుచు సొంపుగానుండు । ననిప్రయాణంబైరి యాగిరినివాసి ।
విల్లంబుబూని రఘువీరుండుముందు । వెనుకనువైదేహి వెడలంగవెన్క ।
సౌమిత్రినడువగా భూమీశుడపుడు । వనచిత్రములను దావైదేహితోడ ।
చెప్పుచుమార్గంబు నొప్పుమీరంగ । తలగన్నబాళ్ళన్ని తొలగద్రోయుచును ।
పయిగలరాళ్ళన్ని పారద్రొక్కుచును । పడ్డరాళ్ళనేరిబాగు చేయుచును ।
సన్నపురాళ్ళను చదునుచేయుచును । లక్ష్మణస్వామి ముందరసాగుచుండి ।

సీతనడవగలేదు చిత్రకూటంబు । అడుగులాయిటతగుల నాకోమలాంగి ।
కురగాళ్ళపయినడచి నోరలుచుజూడు । కరకుజాళ్ళలోన కమలాయతాక్షి ।
ఎత్తినకాలు తానెత్తంగలేదు । ఎత్తుకుందామయ్య ఇంతినియనగ ।
చేతనుబుచ్చుకో సీతసౌమిత్రి । యనవనజాక్షియపు డిట్టులనియె ।
పరమాత్ముడవునీవు పరమపావనులు । మీరుననెత్తుట మిక్కిలితప్పు ।
పరమాత్మనీచేయి పట్టినడచెదను । అనిపడుచులేచుచును నతివతాదిగెను ।
కంటకావృతమైన కఠినంపునేల । అశ్వంబులకునైన నందనిదారి ।
సమపథంబునదారి సరసముగనుండ । జనకసుత సంతోషజలధిలో మునిగె ।
పద్మాయతాక్షితన పతికియిట్లనియె । మీతోటిపయనాన మించుమోదంబు ।
ఈగిరిపైబాట యిందివరాక్షి । దుష్పథంబదిజూడ తోచదునడువ ।
గిరిదిగిచక్కని తెరువుబట్టితిమి । ఆచెట్లగుంపులు ఆధామములును ।
ఆలేళ్ళదుప్పులు ఆదర్భకోనలు । ఎంతొచక్కగనుండె వింతలుదోచె ।
ననగానులక్ష్మణుడనె ఋషీశ్వరులు । నుండెనుఆశ్రమమండలంబదియె ।
అచ్చటికేగిన యతివరోమనకు । సౌఖ్యంబుచేకూరు చాలగాననెను ।
రఘుపతిచెయివిడిచి రమణికూర్చుండి । యీపెద్దరాయిపై యింపుమీరంగ ।
కూర్చుండమోయన కూర్చుందమనిరి । కూర్చుండిజానకి కులధరులజూచి ।
ఇట్టిరాళ్ళలోను యీశిలలలోను । యిట్లునడవగబంపెనేమీకైకమ్మ ।
తానునడచిన దెలియుగానికష్టములు । హంసతూలికశయ్య నందుబరుండి ।
పేనాడొపతియన్న కానిమాటలను । బట్టిమనలను నడవి పట్టమనిచెప్పె ।
పిల్లలతల్లికి ప్రేమయిట్లుంట । నేలోకమునలేదు యీలోకమందె ।
చిత్రంబులన్నియు చేకూరెనేడు । మనపాలిటనేయవి జనయించెననగ ।
కైకేమిజేయును కర్మవశములకు । కైకమ్మనిందించ కలుగుపాపంబు ।
పూర్వకర్మనుబట్టి బుద్ధులునడచు । బుద్ధులలీలమై పుణ్యంబునడచు ।
మనపుణ్యమీగతి అనుకొనవలెను । ఒరులనిందించుట నొప్పదనెవిభుడు ।
జానకియాపల్కు చక్కగావినుచు । పతిమాటకెదురాడ పడతికితగునె ।
పతిప్రాణములుగొన్న పాపాత్మకైక । కైకవరమీడేని కైరవాప్తుండు ।
పుత్రశోకముచేత పొగలకనేయుండు । పొగలకున్న మృతిబొందదుగాదె ।
యిటుజూచినను కైకయెంతజేసింది । యనిమూర్ఖములు సీతయాడుటజూచి ।
ధరణిపతితనకంట సతిజూచిపల్కె । మరియికనీమాట మగువమాయెదుట ।
యెప్పుడుపల్కకు యేమనుకొనుదొ । అత్తనుకోడండ్లు ఆడుటలెల్ల ।

గొప్పతప్పులలోన ఘోరమౌతప్పు । అవనిజ కడుముద్దరాలనుచుంద్రు ।
విపరీతకాలంబు వెలసెనాయేమి । సౌమిత్రిశ్రీరామ సఖునితోననియె ।
ఔనవునుశ్రీరామ అవునుశ్రీరామ । కలిగెనాయిటుమూడు లోకములమీద ।
కోడండ్రనేలేటి గుణవంతులైతె । కొరగానిపనులైన కోడండ్రచేత ।
చేయించుకొందురు సీతాపడంతి । కానలకుపంపుటకు కైకకేతగును ।
ఆమాటవిని విభుడంతటబల్కె । సీతనావిడయెపుడు హితమతినడవి ।
బంపగాకోరునే పల్కుసీనోట । పతితోడకానలకు పడతితావచ్చె ।
కైకదూరుటచాల కానిపనులయ్య । నిన్నునడవులకు బట్టపన్నెనాకైక ।
ననుబట్టినీవాస్తి ననువిడలేక । సీతయునాగతి చెలువుగావచ్చి ।
కైకనుదూరుట ఘనపాపమౌట । నామాటతలపెట్ట నాడెంబుగాదు ।
అమరుగుఋషుల యాశ్రమములున్నవిగా । తామరులున్న యాతటాకంబులను ।
స్నానంబుచేసిరా దశరథసుతులు । వనజలోచనుడా వసుధపాలకుడు ।
అసురసంహారుండు ఆదిదేవుండు । జలకమాడుచునుండ చరచరనేగి ।
లక్ష్మణుడుగొనితెచ్చె రయమునవ్యాఘ్ర । చర్మంబువిబూదియు చక్కగావాని ।
శ్రీరాఘవుడుతాల్చి చెలువొప్పగాను । తిలకంబుదిద్దికొని చెలగెఋషివలెను ।
నీరజలోచన నెలవుగానచట । జలములుగ్రోలంగ నిలువుమనిపలుక ।
జనకసుతతోడరాగను కొలనుదరికి । నందరూనేగి రానందంబుమీర ।
నంతటజానకి పంతంబుమీద । కొలనిలోనికిబోయి కొమరొప్పగాను ।
కొలనందుగల్గు చెంగలవలనుదెచ్చి । నీలవర్ణునిశిరసు నెలతపూజించ ।
సీతమొగముజూచి శ్రీరాఘవులు । చిరునవ్వునవ్వునవ్వుచు చెలగియిట్లనిరి ।
అతిశ్రమలపడిపూవులతివరోదెచ్చి । మాశిరసుపూజించ మగువనీకేల ।
మాతల్లికైకను మాటేమియనక । నిన్నుపూజింతునే నీరజనేత్ర ।
అనుచుతలపైనున్నయట్టి పుష్పములు । సీతపైవేసినా తత్ప్రీతితోను ।
తలంబ్రాలు పోసినవలె నుండెసీత । పయిపడిన పుష్పము పడిరాల్చుకొనుచు ।
వనమునకేగి సత్ఫలములుదెచ్చె । ఖర్జూరఫలములు కదళీఫలంబులును ।
అంజూరఫలములు అమృతపలములు । సారపప్పును మంచిసారమోపండ్లు ।
అరగామగ్గిని అరటిపండ్లూను । కందమూలంబులు ఘనముగాదెచ్చి
వందమనిలక్ష్మణుడు వదినెకునిచ్చె । శుభమైనపాకములు సొగయించివేచి ।
అతిప్రీతిరాఘవులు కతివపడ్డించి । లక్ష్మణునకునుబెట్టి లక్షణముమీర ।
తరువాతనతివేగా తానారగించి । పతియజ్ఞశాలలో పవళించియుండ ।

పతిపాదములనొత్తి పద్మములుజూచి । సరగనీపాదములు శంఖపద్మములు ।
యీలక్షణములు మీకెంతైననొప్పు । అయ్యోధ్యవిడిచి మీరడువులకురాగ ।
ఇడుములుపడమీకు నింతెట్లువ్రాసె । పాదరక్షలుతొడగి పైనడవకండ ।
భరతుడుగొనెమీదు పావుకోళ్లనగ । యోచించితివె పరియాచకముచేయ ।
మాపాదములమహిమ మగువరోవినవె । మాపాదముల సురలకాపదలుసుమ్మ ।
ధరణిభారముతీర్చ దైత్యులకుసుఖము । లొడగూర్చపుట్టినవి తడవేలనింక ।
అష్టకోణమంత యలరారగాను । ఏలమనిసృష్టించె యింతిఆబ్రహ్మ ।
అసురులజంపిన నావెనుకమనకు । దివ్యవిమానంబు దివురునుగాదె ।
సౌమిత్రితోనపుడు సరగవాహనము । పైబోయినయ్యోధ్య పట్టణమునందునను ।
నీతోటిపట్నమ్ము నిత్యముగగట్టి । సింహాసనగద్దెపై సీతనిన్నుంచి ।
సుఖమిస్తునీకు శుభములుగలుగు । నమ్మేలనవ్వేవు మహిళామణిరో ।
వరలుశ్రేయములిచ్చు ధరణినీతల్లి । తల్లిపై జల్లుము చల్లనినీళ్ళ ।
ఆమాటలువినుచు సతివతానసెను । నన్నేలనవ్వేవు నాథయీరీతి ।
యెల్లజీవులకును తల్లిమాధరణి । వివిధమగు వృక్షములకెల్లయుతల్లి ।
పుట్టగాపెరగగా భూమిమాతల్లి । నరులయుదరమందు నవమాసములను ।
నుండిపుట్టినదాది మెండుగాధరణి । సందరపోశించు ననఘమారీతి ।
నన్నుగన్నమ్మ నానాదెంపుతల్లి । నన్నుకాపాడును నయమొప్పగాను ।
కొనినసుమీకిచ్చు తోనెనాథారం । మీమీదపడ్డది మీరెనాదిక్కు ।
చెట్టునాపాకింది చెలుపైనతీగె । చెట్టువిడియెక్కడికి చేరంగగలదు ।
అందదప్పినవెన్క అదినిల్వగలదా । మీతోడనుండుటే ఖ్యాతినాకౌను ।
అయోధ్యపట్నంబు నందుకంటేను । దేవేరిగానేను దిరువుకంటేను ।
ఏనుగులుగుఱ్ఱములు నేలుకంటేను । హంసతూలికపరుపు లందుకుంటేను ।
లోకేశనీతోటి లోకంబునాకు । నీవుండగానాకు నెఱియన్నిగలుగు ।
నవ్వుటాలకునంటి నవ్వులననేను । అడవిలోదిరుగుట లందంబునాకు ।
ఆమాటలనువిని అపుడురాఘవులు । యెండలకునెంతయో పండబారితివి ।
అడవులమాతోటి యతితిరుగలేవు । పంపెదములయ్యోధ్య పట్నంబునకును ।
కౌసల్యనినుబాల గౌరవించంగ । కైకేయియెంతయొ గౌరవించంగ ।
భరతుండు సమస్తభారమునుమోయు । జానకిమామాట చనువుతోవినుము ।
వినుమనిరాఘవుడు వివరముగపల్క । సీతకోపము జాలిచెలగుచుచూప ।
వలదునీతోటి సంవాదంబుమాకు । జనకసుతతొలగవే సౌమిత్రివచ్చె ।

అనుజుడాలక్ష్మణా యాశ్రమంబులకు । వస్తుసంభారంబు వలనొప్పగూర్ప ।
వెదురుసోలలుమనకు వేడుకలుగొలుపు । వెదురుబియ్యముచాలు నేపుకొనితినగ ।
అనగలక్ష్మణుడు వానిజనితెచ్చియియ్య । రాఘవులుముదమంది రప్పుడాతండు ।
జననాధసంధ్యలు జనుసుతీర్చంగ । ననిచెప్పనందఱు జనిరిసీమములు ।
తీర్చంగరాఘవుడు తీర్చెసంధ్యలు । వైదేహిరాఘవుల పాదములనొత్త ।
శ్రీపతిపవళించె చెట్లనీడలను । సీతయునక్కడ చెలగుచునుండ ।
లక్ష్మణుడుశస్త్రంబులనుబట్టి యపుడు । సాహసుడయివారి చాయనరాత్రి ।
కాచెరాక్షసుల జక్కాడెదనంచు । శ్రీరాముదీవెన చెలగిగైకొనుచు ।
మేఘంబులురిమిన మేదురశస్త్ర । బాణంబుసంధించి బాధించనెంచు ।
నక్షత్రగణములు నందందుజార । బాణంబుసంధించి బాధించనెంచు ।
శ్రీరాముడును సీతచెలగినిద్రించ । సర్వభూతంబులు సద్దుగానుండ ।
పలెనంచుశాసించె వరలులక్ష్మణుడు । భ్రాతృభక్తికినితడు పరమైనవాడు ।
సూర్యుండుదిశదిశలు జొచ్చుకొనిరాగ । రాఘవులుమేల్కొనిరి రాత్రినిబాసి ।
అప్పుడులక్ష్మణుడు అన్నతోననియె । రాత్రిబాధలులేవు రామునియాజ్ఞ ।
భూతములపై చాల పొలుపొప్పెననగ । శ్రీరామచంద్రుండు చెలువొప్పనవ్వి ।
ఉదయకృత్యంబుల నొప్పుగాదీర్చి । ఋషులఆశ్రమమునకు హితవుమీరంగ ।
నడుతామురమ్మని నయమొప్పవారు । సాగిరియానంబు సంతోషముననను ।
సీతామహాదేవి చెలగియిట్లనియె । ధరణిపులిచర్మంబు తనరంగనాకు ।
సంచులభస్మంబు తరగంగనాకు । యియ్యండితెత్తును హితవుగామీకు ।
భారమైతోచును బరువులెత్తంగ । పుట్టినారామీరు భూములేలంగ ।
పుట్టినారలుగాని బూదిమోయంగ । పుట్టలేదనగనే పూర్ణచంద్రుండు ।
చిరునవ్వునవ్వుచు చెలియకిట్లనియె । శివునివిల్లువిరచిన చేష్టమరచితివా ।
ఋషియాగమునుకాచు హితముమరచితివా । అడవులనుండిన నిడుమమరచితివా ।
పుడమియేలుకంటె బూదిమోయంగ । చులకనయనుమాట నెలతయెరగుదువె ।
మగువనీతరమునకు తగనిపలుకులకు । ఆడకేమమ్మ పరియాచకముగాను ।
మాహస్తములుబట్టి మముజేరకొలచి । మాచేయిబట్టకు మమతతోనడత ।
ఋషులఆశ్రమమునకు హితవుమైచేర । గానెయచట సుఖముగానుండమనెను ।
అంతటవారు యుత్సాహంబుమీర । బయలుదేరిరి ప్రొద్దుచాయలుదేర ।
రవిపరువెత్తంగ రమణుడుగూడ । కడువడినడచెను కాంతతోగూడ ।
అడుగడుగునకుసీత నడుగులుగాంచి । లక్ష్మణుడుచాలగ విచారించె ।

వీరిట్లునడువగా వెడలగావెడల । కడవడినడకలు తడబడనడవ ।
తాలుద్రొక్కినకొంత రానేలలయందు । బురదద్రొక్కిరికొంత భూమిపైనడువ ।
గోతులలోబడి సీతవెక్కయ్యె । శ్రీరాముడప్పుడు సీతచేయిబట్టి ।
చేయూతనొసగుచు సీతపైదీసి । కేలూతతోకొంత చాలునడిపించి ।
ఇదిగోవ స్తిమిసీత యింపైనదారి । అదుగొచూడుము బాటల మరియున్నవిగా ।
అల్లదుగోతోపు అదిగోచిరుమాలి । అల్లవిదర్భలు ఆవంకజూడు ।
గోరువంకలబారె బారులుతీరి । గోగణంబులుచాల దాగున్నవవిగో ।
అనుచునీరీతి తటాకంబుదాక । వచ్చినిల్చిరియట దివ్యంపుస్నానంబు ।
చేయగాదాశరథి చెలువొప్పతాను । విశ్రమించెను కొంతవిశ్రమముతీర ।
అసురసంహరునకు ఆదిదేవునకు । అనుజుడులక్ష్మణుడు అన్నకునన్ని ।
వస్తువులనుదెచ్చి వసుధపైబరచె । పులితోలుకూర్చుండ వలెననియెంచి ।
తెల్లనివిబూతి దెచ్చిలక్ష్మణుడు । ఆరాఘువేశ్వరుల హస్తమునసుంచె ।
నిష్కళంకుడుబూతి నెన్నుదుటనలది । తిలకంబుదీర్చగా దేవికన్గొనుచు ।
నొసటపాదముమీకు వెనటభూషణంబు । ఆత్మచంద్రుడుమీకు నగుభూషణంబు ।
నీలగిరికొండపై నిలిచితిరిగిగనుక । నీలకంఠముమీకు నిజముగానొప్పు ।
శివురూపుమీరూపు చేరికేగనుక । బూతిపెట్టితిరయ్య భూతలనాథ ।
మీరూపుచూడంగ మేలగునంచు । తాపసులువస్తురు తరిజూచియనగ ।
తాపసికన్నెలూ రూపసియైన । నినుజూడయచ్చట నిలుచున్నవారు ।
నినుజూచుచున్నారు నీరజాంగనలు । వారలకడకేగు వనితరోనీవు ।
వారలురమ్మనగ వారలనుజూడ । హంసవాహనయేగె యతివలకడకు ।
అతివరూపముజూచి ఆశ్చర్యపడుచు । వారనుకొనిరిట్లు వారిలోవారు ।
తలతిరిగియున్నది తరుణినేత్రములు । శ్రీరాములుజుమీ చెలువనేత్రములు ।
తామరలతగగద తరుణినెమ్మేను । పద్మంబుబోలునీ పడతినెమ్మోము ।
బంగారుచాయలకు బలువన్నెపెట్టి । కెందమ్మిమొగ్గల క్రీడించుచెలివి ।
ఓయమ్మశ్రీలక్ష్మి ఒప్పుగానీవు । కానలకేగతి కడగిరానేల ।
కామునిసకియవా కలకంఠసతివా । తామరసంభవుని తరుణివౌతావ ।
వేడుకలొప్పేటి విష్ణుదేవుండా । సకలసుఖములొసంగు శంకరుండేమో ।
శివువిల్లువిరచిన శ్రీరాముడేమొ । ఎవ్వరోనీపతి యెరిగించవమ్మా ।
అనగానెనాపతి యొసురాఘవులు । జగదీశులైవారు చెలగొచ్చినారు ।
వీరులుధీరులు విప్రవరదులును । వారొచ్చియున్నారు వనములజూడ ।

అనగానేవారల ననువొందగాను । దర్శింతమనివారు తర్కించుకొనుచు ।
చెట్లచాటుననుండి చెలగిశ్రీరాము । ధగధగవెలిగెడి ధరాతలాధిపుని ।
విష్ణ్వంశసంభవు వేడుకగాంచి । దైవమాతదేయని తలపూనియిట్లు ।
జగదీశు శ్రీరామచంద్రునిదృష్టి । జగములలో చంద్రకిరణాలబోలు ।
మాపుణ్యవశమున మహితునిగంటి । పోవమ్మసీతమ్మ పొమ్మువేగమున ।
సొగయక నినుజూచు చున్నాడుపొమ్ము । నీరజాంగనపోవే నీవిభునికడకు ।
తాపసికన్నెల తావిడచిసీత । భూనాథుకడకును పొంగుచువచ్చె ।
సారసాక్షిని రామచంద్రుడుజూచి । మునికన్యకలతోటి మునికొనినీవు ।
అడవికొచ్చిరీతి అతివకైకమ్మ । వరములడిగినరీతి వరలజెప్పితివా ।
కైకమ్మపైగల కాకలుదీర । బొంకుగాచెప్పితివ పొలతులతోననగ ।
వారలకడకు ననుబంపంగనేల । పొమ్మనినిన్నింత బొంకించనేల ।
వారలడుగుటలేదు వారికేమివ్వి । గావలెనా మునికన్నెలువారు ।
నిత్యసంతోషాన నిర్మగ్నులగుచు । ఆనందముననుంద్రు నప్పుడిప్పుడును ।
అతివలునాకేమి యగుదురుచెప్ప । నమ్మరాధరణినే నంటనాయనగ ।
ధరణినీతల్లియని తలచమామేము । ధరణిపుట్టినతరణి ధరణింటగొప్ప ।
కైకమ్మవంటిది కలదయీభువిని । ఆయమ్మ భాగ్యంబులనురకయున్న ।
వనచారణముమనకు వరలదెప్పటికి । ఋషులాశ్రమంబుల హితవుమీరంగ ।
దర్శింపతగునె యీధరనెప్పుడైన । అనవినిసీతమ్మ వినగనిట్లనియె ।
లోవిమాయమూకుళ్ళలో గలవుగాని । లోకంబుమాయగా కాకుత్సులకును ।
తప్పమరియెవ్వరికి తగునెభూస్థలిని । యెండలయెండించి కృపలేకయిట్లు ।
కొండలలోయలగూడ నడిపించి । చీకాకుపెట్టుట చెల్లదనివారు ।
అనుకొందురా మాటలనగనేనేనట్లు । నెల్లరమాన్పింప జెల్లునానాకు ।
మీకునాకును సౌమిత్రికినిగూడ । కైకమ్మమంచిదని కల్గుతలంపు ।
అనుమాటలను తానువినిలక్ష్మణుండు । మారుపలుకడు అన్నమాట్లాడుదాక ।
శ్రీరాముడలవీరి చేష్టితముజూచి । లోకాధిపతిగాన లోలోననవ్వె ।
కైకవంటిదిలోక లోకాలయందు । లేదులేదనివిభుడు వాదులాడంగ ।
నడచుచుండిరివారు నడవకష్టమున । అడుగులు తడబడనతివయుమరిది ।
మిట్టనేలలయందు మిట్టలెక్కుచును । పల్లంపునేలల పాటుదప్పుచును ।
జాతినేలలయందు రాళ్ళనెట్టుచును । బురదనేలలయందు భూమిగప్పుచును ।
ముండ్లనేలలయందు ముళ్ళదోయుచును । చెట్లుకొమ్మలురాయ చెలగిద్రోయుచును ।

శ్రీరామచంద్రుండు సీతతోననియె । అదుగొకనుపించె అల్లదిగోజూడు ।
తామరపువ్వుల తటాకంబుజూడు । స్నానంబుచేయగా చాల్లారు శ్రమలు ।
దాశరథిశ్రీవిభుడు దాసలోలుండు । అసురసంహారకుడు ఆదిదేవుండు ।
ధరింపగాదెచ్చె వ్యాఘ్రచర్మంబు । పులుముకొనగాదెచ్చె బూదిసంచియును ।
అనుజుండులక్ష్మణుడు అన్నియునుదెచ్చి । అన్నగారిదైన హస్తమునసుంచ ।
నిష్కళంకుడు నిర్మలాంగుండు । కరమునసమరమున కలియంగమేనా ।
శశికళలుదేరెడు చక్కనినుదుట । తిలకంబుదీర్చెను తీరొప్పగాను ।
జానకినావంక జరుగువృక్షముల । జూచియిట్లనిపల్కె సొగసుగుల్కంగ ।
కొమ్మలారమీరు కోసలేంద్రుండు । ఏకష్టములులేక హితవుమీరంగ ।
అరణ్యవాసంబు కరమొప్పునట్లు । జరిపియయోధ్యకు తరలంగజేయ ।
వేడుదునేనుమిము వృక్షమ్ములారా । ఓషధులారయో యుర్విలోమీరు ।
సకలప్రాణులకును చాలగాప్రాణ । దానంబుచేయుచు తగియున్నవారు ।
అయోధ్యపట్నమ్ము నందినవెనుక । ముత్యాలరత్నాల మురువొప్పగాను ।
పూజిస్తుమిమ్ముల పూబండ్లతోడ । తేనెలుపోయుదు తేకువమీకు ।
మిమ్మెవరుకొట్టకుండ మేలుగలుగంగ । నావిభునితోజెప్పి నేవేవియైన ।
జేయుస్తుమీకును సిరిగల్గునటుల । భాగీరథునిమీకు ప్రాకిస్తుననుచు ।
పరిపరివిధములు బ్రామాలిమ్రొక్క । చూచిరిరాఘవులు సుదతిసొంపెల్ల ।
పగడంపువాయల పరిథవిల్లెడు । చిరునవ్వులునవ్వి చెలగుచుననిరి ।
ఎవ్వరికిమ్రొక్కితివె యింతిరోనీవు । ఏమనిమ్రొక్కితివె యింతిరోనీవు ।
నీచేతమ్రొక్కుల నెనసిరెవ్వారు । కొమ్మలకుమ్రొక్కితివ కొలనుమ్రొక్కితివ ।
కొలనందుగల హంసగుమికిమ్రొక్కితివ । యనగానుపద్మాక్షి యపుడిటులనియె ।
కొమ్మలకునేమ్రొక్క కొలనునకుమ్రొక్క । కలహంసకుమ్రొక్కగాలేదులేదు ।
వృక్షవర్గమునకు వెలయంగమొక్కి । అడవులకుకష్టంబు లాపదలెల్ల ।
తొలగింపమ్రొక్కితి తోయజాక్షుండ । గంగను గౌరి శంకరులనుగూర్చి ।
మ్రొక్కితిహస్తములు ముడిచిముగ్గురికి । యిందుతప్పున్నదని నేనేమియెరుగ ।
తప్పున్నమన్నించి దగుబుద్ధిసెప్ప । యామాటలాలించి యనెనులక్ష్మణుడు ।
వైదేహిలోకంపు వనితయనరాదు । ప్రకృతిబెంచిన బిడ్డ పరమపవిత్ర ।
నవ్వుచురాఘవులు నలినాక్షిజూచి । ప్రకృతిబెంచినబిడ్డ ప్రకృతిచిత్రములు ।
పరగగాంచగగోరి బయలుదేరింది । చక్రవాకినివిడచి చక్రవాకంబు ।
చదలదిరుగదు సుమాచంద్రుడేతేర । ఇరువురుగూడుచు నింపుగానుంద్రు ।

మనమిపుడుయెత్తైన మహిమీదనుంట । చలచల్లగానుండె చపలాక్షిజూడు ।
యీగట్టుదిగునపుడు ఎచ్చుదగ్గులుగ । పదములువేయ తలపంగరాదు ।
నీలమేఘముజూడు నెట్లుబ్బియుందొ । ఇకకొంతసేపటికి యింపుగానీరు ।
విడచునుచెట్లకై వేడుకగల్గు । ఒక్కచోటనెండయు నొకచోటచలియు ।
నొకచోటరాళ్ళను నొకచోటయూబి । ఒకచోటసమనేల యొప్పుగానుండు ।
ఎల్లదిక్కులకథలు ఇంపుగాజెపుతు । రాఘవులుపయనమ్ము రమణితమ్ముడును ।
తోడరానడచిరి తొట్రుపడకుండ । దారిలోనొకచోట దట్టమగువనము ।
కారుచీకటితోచి కానరాదయ్యె । చీకటిచేతులనీక నెట్టుచును ।
కొంతవడిసాగిరి కాంతతోవారు । ఆపైనసూర్యుండు అతిప్రభలతోడ ।
తోచగాసీతకు తోచెచెమ్మటలు । ఇక్కడనిలువంగ నెందులకుసీత ।
సరసనుఋషుల యాశ్రమముండగాను ।నేడుయిక్కడమనము నిల్వగారాదు ।
ఒప్పుగానడచిహుటాహుటివారు । కష్టమనుకోకయా కష్టంపుదారి ।
కోసినదర్భల కోనలగుపించె । లేడిపిల్లలగుంపు లేగలగుంపు ।
కాకులకోయిలలు కానంగవచ్చె । ఇదియాశ్రమంబని యిద్ధచరితుండు ।
చెప్పుచుండగదారి చెచ్చెరనడువ । జలఘటంబులు చాలసలిలములునించి ।
మునికన్యకలు మాణవకులునుగూడి । అర్ఘ్యమిచ్చిరివారు అమరంగవారు ।
లక్ష్మణసీతలకు లావణ్యమెప్ప । శ్రీరామమూర్తి వారిసేమంబునడిగి ।
ముకవరులుమీకు మేముజలంబులను । యీవలెనుగద ధర్మమిద్దియంచనగ ।
ఎఱుగుదురఘురామ ఎవ్వరోమీరు । ఎందులకుపుట్టితిరో ఎఱుగుదుముమేము ।
రఘువంశకులతిలక శ్రీరామమీరిపుడు । నరజన్మమెత్తితిరి నారాయణాంశ ।
అసురసంహారంబు నెనకమెసగగను । అనువర్తనముచేయ నవతరించిరి ।
అనుచుననాపాత్ర యడుగునబట్టి । జలపూర్ణకుంభాన జలముప్రోక్షించి ।
పాదపద్మాలుకడిగి పాదజలమును । నెత్తిపైజల్లుకొనిరి నెరమాణవకులు ।
ఈలీలలనుగాంచి యింతిసీతమ్మ । శ్రీరామమహిమంబు చింతించదొడగె ।
ఆరాముచేపట్టి నందుకైతాను । ఆత్మలోహర్షించె యతిముదంబునను ।
మునికన్నెలువచ్చి మునికోనిసీత । పాదములుగడగిర సాదరంబునను ।
సీతవద్దనిచెప్ప చెలగుచువారు । వినవమ్మవినుతల్లి ఘనుడుమీతండ్రి ।
జనకమహారాజు జన్మంబునకును । భూమిదున్నగనీవు పుట్టితివమ్మ ।
లంకలోకొలనిలో లావుపద్మంబు । నందుద్భవించితి వాదినినీవు ।
నిన్నుగానగలేక పన్నుగావారు । మందసంబునబెట్టి సింధువునవిడువ ।

నీవువచ్చితివమ్మ నేతజనకుండు । పాలించురాజ్యంబు పావనభూమి ।
ధరణిలోనుదయించ ధరణిజవైతి । సృష్టిలోవారంత సీతయందురూ ।
జగములోవారంత జానకందురూ । విల్లువిరచినవాడు విభుడునీకనుచు ।
విశ్వామిత్రునాజ్ఞను విశ్వవిభుండు । పణముబెట్టుచునీకు పతిరాఘవునిగా ।
బడసెనునీపూర్వ భవమునుబట్టి । నీతండ్రిసుగుణుండు నీతండ్రియోగి ।
నీభర్తరాముండు నెఱియైనజ్ఞాని । నీజన్మపావనము నీకికజన్మ ।
లేదనిమాఋషులు వాదించుచుండ్రు । మీరువత్తురటంచు మేకానిమేము ।
కాచియుంటిమిగదా కమలాయతాక్షి । మాపూర్వపుణ్యాన మానోముపంట ।
ఫలముగావచ్చితిరి పణతిరాఘవులు । లక్షణభ్రాత్రుండు విలక్షణముమీర ।
అవానలందరు యత్రిమునియాశ్ర । మంబుచేరిరి సేమంబుబొందగను ।
అనసూయవారల కాయాశ్రమంపు । మహిమలజెప్పుచు మాటలాడుచును ।
సకలసపర్యలు జానుగాచేసి । సుహితోదేశంబు సొంపుగాజేసి ।
శ్రీరామలక్ష్మణులు సీతమ్మగూడి । ఋషులాశ్రమంబుల హితవుగానుండిరి ।

# కోవెల రాయబారము

పుట్టెన్నభూదేవి రాజకొమార్తెనే కోవిలాలయో
బృందావనముల మెలగినమాతండ్రి కోవిలాలయో
జనకచక్రవర్తి రాజకొమార్తెనే కోవిలాలయో
మాసినవివస్త్రాలు మైనంపునాజడలు కోవిలాలయో
కారినవికన్నీళ్లు కట్టీనావీజడలు కోవిలాలయో
అత్తరువు పన్నీరు అడవిపాలాయెనే కోవిలాలయో
గంధమ్ముకస్తూరి గంగపాలాయెనే కోవిలాలయో
పువ్వులూ బుక్కాలు భూమిపాలాయ్యెనూ కోవిలాలయో
చిన్నచిన్న పాములూసురటీలు విసరెను కోవిలాలయో
పెద్దపెద్దపాములూ గొడుగూలుపట్టెనూ కోవిలాలయో
ఆపాటిపాములూ అల్లాటివిసరెనూ కోవిలాలయో
గండభేరుండాలు సింహాలు మృగములూ కోవిలాలయో
పెద్దపులులూరెండు కాపాడి తిరిగెనూ కోవిలాలయో
భరతశత్రుఘ్నులూ లక్ష్మన్నమరది కోవిలాలయో
పట్టాభిరాములకు భార్యననీ చెప్పు కోవిలాలయో
ముత్యాలుఇచ్చేను వజ్రాలుఇచ్చేను కోవిలాలయో
కోవిలవెళ్లెను అపర్ణశాలలకు కోవిలాలయో
రామన్నలక్షన్న రచ్చకూర్చున్నారు కోవిలాలయో
ప్రిదక్షిణముచేసి పాదాలకొరిగెను కోవిలాలయో
ఇందాకచూస్తిమి సొంపైనవనముల కోవిలాలయో
పొద్దున్న చూస్తిమి సొన్నవనములలోన కోవిలాలయో
నిన్నెవరు కొట్టారు నిన్నెవరు తిట్టారు కోవిలాలయో
నన్నెవరు కొట్టలేదు నన్నెవరు తిట్టలేదురామలక్ష్మణా
పుట్టేన్నభూదేవి రాజకొమార్తెట రామలక్ష్మణా
బృందావనముల మెలగెనట మాతండ్రి రామలక్ష్మణా
జనకచక్రవర్తి రాజకొమార్తెటా రామలక్ష్మణా

మాసినవివస్త్రాలు మైనంపువీజడలు రామలక్ష్మణా
కారినవికన్నీరు కట్టినవీజడలు రామలక్ష్మణా
అత్తరుపన్నీరు అడవిపాలాయెనట రామలక్ష్మణా
గంధమ్ముకస్తూరి గంగపాలాయెనట రామలక్ష్మణా
పువ్వులూబుక్కాలు భూమిపాలాయెనట రామలక్ష్మణా
చిన్నచిన్నపాములూ సురాటీలువిసరెనో రామలక్ష్మణా
పెద్దపెద్దపాములూ గొడుగూలుబట్టెనో రామలక్ష్మణా
ఆలాటిపాములూ ఆల్లాటివిసరెనో రామలక్ష్మణా
గండభేరుండాలు సింహాలుమృగములు రామలక్ష్మణా
పెద్దపులులూరెండు కాపాడితిరిగెనట రామలక్ష్మణా
ముత్యాలుఇచ్చెనూ వజ్రాలుఇచ్చెనూ రామలక్ష్మణా
విన్నారురాజులిద్దరు సన్యాసులమైతిమి కోవిలాలయో
విరాగులమైతిమి .... .... .... కోవిలాలయో
ఆరోగ్యలైతిమీ హరిదాసులైతిమీ కోవిలాలయో
.... .... .... .... ఒక శరంబున కూలవేసెదనె జానకీ
.... .... .... .... ఒనరుగదెస్తునె జానకీ
జువ్విచెట్టుకింద మనమిద్దరమ్మూను జూదమాడినచోటు జానకీ
రావిచెట్టుకింద మనమిద్దరమ్మూను రహస్యములాడినచోట జానకీ
మామిడిచెట్టుకింద మనమిద్దరమ్మూను మాటలాడినచోట జానకీ
యేలాగునైనాను యేలుదుమోయమ్మ యేలసంశయమెవో జానకి

# సీతాదేవి ఆనవాళ్లు

సురవైరినగరిలో సుదతుండగానూ । అసురులనుగోరు టభిమానమ్ముగాదూ ।
సర్వేశ్వరాదేవ విన్నపమ్మనెను । సుదతులరూపమ్ము చూసినేనెరగా ।
శ్రీకాంతరూపమ్ము మాకుయెరిగించి । అతివమెచ్చేటట్టు ఆనవాలిమ్మీ ।
కన్నులనమితబాష్ప కణములొలుకగనూ । కరువలిసుతుజూచి కాకుత్థ్సుడనియె ।
ఎప్పుడూశ్రీరామయని దలచుచుండు । మనసీతజానయ్యామత్స్యవల్లభుడా ।
మహిమీదమాదేవి గాంచేటితెరవు । వినవయ్యాజెప్పేను శ్రీవాయుసుతుడా ।
నిజమునకువిప్పినవి నీలంపుకురులు । జడలుగట్టి కడుపెద్దవిగనుండు ।
తలఅంటుఅడకే ఆడినట్లుండు । నీలంపుతలకుంప కలిగుండుగాని ।
పచ్చిపసుపలదకే అలదినట్లుండు । బంగారమగు చాయకలదెమాకాంత ।
పెట్టకనుకాటుక పెట్టినట్లుండు । దిద్దకతిలకమ్ము దిద్దినట్లుండు ।
చేయికశృంగారము చేసినట్లుండు । అలదకపరిమళము అలదినట్లుండు ।
వేయకతాంబూలము వేసినట్లుండు । పగడంపుఒకచాయ కలిగుండుకాంతా ।
తోడుగులుతొడగకే తొడిగినట్లుండు । తొలకరిమెరుపువలె తావెలుగుచుండు ।
మసిపాతగట్టిన మాణిక్యమువనెను । నివురుపైగప్పినా నిప్పులాగునను ।
కసుగందియున్నట్టి కుసుమమువలెను । సీతకాలమునాటి సేతులువలెను ।
మేఘములోనున్న సూర్యునివలెను । మెరుగుజెడియున్నట్టి అద్దమ్మువలెను ।
పరమసతిప్రభావమెల్ల జెడియుండు । రాహుబట్టిన చంద్రమండలమురీతి ।
చింతచే కడు చిన్నబోయుండుదేవి । ఈవయ్యాముద్రికా ఇంతిచేతికిని ।
నమ్మకముచెప్పితే నాతికానవాలు । ఇదిఒకఆనవాలని చెప్పుహనుమా ।
మరిఒక ఆనవాలుకలదు సుమిహనుమ । మరవకజెప్పుమీ మాసీతాతోను ।
కళ్యాణమంటమ్ములలోను సీతా । వామనగుంటాలూ ఆడుచుండగను ।
సుదతిజానకిదేవి జూడదలపొచ్చి । వచ్చినరామునీజూచి యేచెలులు ।
జానకితోడనే చేడెలిట్లనిరి । రామునికన్నులే రమ్యంపుకనులు ।
శృంగారకన్నులే దీపంపుకనులు । మాణిక్యాలకన్నులే జానకిదేవి ।
సిగ్గుపడి శిరసొప్పవంచుకొనియుండే । నినుజూడవచ్చిరే రాజచంద్రూలు ।
నినుజూడవచ్చెనే నీలమేఘుండు । నిన్నడగవచ్చినా కమలబాంధవులు ।

నినుజూడవచ్చినా మన్మధుడితడు । అనియిట్లుచెలికత్తె లానతియ్యగను ।
అబలజానకిదేవి తల్లికండకేగి । తమతల్లియుండేటి మందిరముకేగి ।
సిగ్గుపడి శిరసొప్పవంచుకొనియుండే । సీతామహాదేవి శ్రీ భూమిదేవి ।
సిగ్గుపడివచ్చేవు చెప్పవేనాతో । నినుజూడవచ్చేరు రామచంద్రులు ।
నిన్నడగవచ్చేరె కమలబాంధవులు । నినుజూడవచ్చినా మన్మథుండితడే ।
అనియిట్లుతమతల్లి ఆనతియ్యగను । సిగ్గుబడిశిరసొప్ప వంచుకొనియుండే ।
ఇదియొకఆనవాలని చెప్పుహనుమా । మరియొకఆనవాలు కలదుసుమీ హనుమా ।
మరువకజెప్పుమా మాసీతతోను । మునిక్రతువుగాచియో మిధిలపురమందూ ।
విలువిరచిఆదేవి బెండ్లాడితయ్యా । చిలుకలువ్రాసినది చిత్రపుమేడా ।
హంసలుకేళీలు ఆడుచుండగను । నాలుగుదిక్కులా నవ్వుచిలుకలు ।
గోమేధికమ్ముగడు జాలంగవొప్పు । సువర్ణమగుచును సొంపొప్పుచుండు ।
బంగారుతరికోళ్ల పట్టిమంచమ్మూ । పట్టిమంమువాల్చి పాన్పమరబెట్టే ।
ఇరుగడలతలగడలు ఇంతులూనుంచూ । నేత్రానపట్టు పచ్చడమొప్ప బరచి ।
విష్ణుకుప్రీతైన విరజాజిపువులూ । ఆమంచిపానుపున అవిచాలబరచె ।
నిశిబోయిపూసినవి నీలాంబరాలు । ఆమంచిపానుపున అవిచాలబరచె ।
తొడిమెలుదీసినవి పారిజాతములూ । ఆమంచిపానుపున అవిచాలబరచె ।
పసిడిపావలుదొడిగి పరమాత్మురామూ । పట్టవింజామరలు పట్టుకూరాగా ।
వజ్రంపుదెక్కెముల వాల్చిపట్టుగను । నగరిలోపలకొచ్చె నారాయణులు ।
పదివేల గవాక్షులనడుమ । కనకగవాక్షులై కడు వెలుగుచుండు ।
గవాక్షములలోనున్న కనకప్రతిమలను । కడుజేసిముత్యాల వీణలుమీట ।
కుచములుకదలగా కోమలాంగులు । సన్నపునడుము నసియాడగాను ।
గాజులుకంకణమ్ములు మెరయుగాను । ఆడుచునందరు అప్సరస్త్రీలు ।
నీలవేణివీపునా కొప్పుజారగను । పణతిపాపిటచేరు బొట్టుతూలాడ ।
గాజులు బన్నసరములు మెరయగాను । ఆడుచునుందురు అచ్చరస్త్రీలు ।
అందువలుపళ్లెములు చేతబట్టుకొని । పాన్పుపుదగ్గర పాడుచుండురుగ ।
శృంగారపూజితము జూచిఆరాము । ముత్యాలచౌకట్ల చూచితాబలికె ।
ఎన్నడుయీమిధిల పట్నమంతాను । నిత్యమందురుగాని యెన్నడెరుగము ।
మామామజనకుల మహిమగలనగరు । ఇదిమహావైభోగ మెంతచోద్యమ్ము ।
అనియిట్లుపలుకుచు అపుడురాఘవులు । పారిజాతపుపాన్పున పవ్వళించె ।
అష్టఐశ్వర్యముల జానకీదేవి । పాదాంగుష్టములు అందెలటుమోగియ ।

ఛమిడిపట్టెలు మెరయభ్రాంతితోకదలె । గొజ్జంగరేకులా కొప్పుజారగను ।
పడతిపాపిటచేరు బొట్టుతూలాడ । గాజులుకంకణములు మెరయగాను ।
పద్మాయతాక్షులు పతినితోడితెచ్చి । వజ్రంపుగడపలా నడుమననిలిపి ।
బంగారుతలుపులకు తాళములువేసిరి । కిలకిలనవ్వుచు పణతులపుడు ।
తమసుందిరములకు తమరుయేతెంచ్రి । బంగారుతలుపులకు చేరియాసీత ।
సిగ్గుపడిశిరసొప్ప వంచుకొనియుండె । ఏకాంతమగుచోట యిందీవరాక్షి ।
చెల్లదుసిగ్గని ఛన్నస్వరములకు । వేలియుంగరముదీసి లీలావినోదా ।
ఎగరవేసియాడుచునుండితిమయ్య । ముద్రికమేమిదీసి ముందరావేసి ।
పద్మాక్షితెమ్మని పలికితిమయ్య । అనియిట్లుపలుకగా నపుడురాఘవులు ।
సీతసిరిచిత్తమునకేమనిదోచె । ఈముద్రికనురాజు కీయకుంటినైన ।
తనకుపాతివ్రత్య లోపమనితోచె । ఈముదిరికనురాజు కిచ్చితినైన ।
అధికంపుసిగ్గు తనకయ్యెదనన్ని । ముద్దుమాణిక్యాల మీదికొంగెను ।
ముద్దుకుచములనడమ ముత్యాలహారములు । ఛన్నస్వరములపేర్లు తొణికాడగాను ।
గాజులుకంకణమ్ములు మెరయగానూ । ముద్దుమాణిక్యాల మిద్దికొంగెను ।
అడుగడుగుకుసిగ్గు పడుకొనుచుసీత । పద్మనాభులపాన్పు దగ్గరకుజేరె ।
యిటుముఖములజేసుకొని యిందీవరాక్షి । మారుముఖముజేసుకొని మళ్ళీశ్రీగంధి ।
చెయిజాచియివ్వగ చెయ్యిబట్టుకుంటి । శ్రీదేవినెత్తి యాతొడలపైనుంచి ।
మహాసుఖముగా నిద్రిస్తిమయ్య । ఇదియొకఆనవాలని చెప్పహనుమా ।
మరియొకఆనవాలు కలదుసుమీహనుమా । మరువకచెప్పుమా మాసీతతోను ।
ఏడునిలువులకనక మేడలలోపలను । యెవ్వరుయెరుగని యేకాంతమందు ।
శ్రీదేవినెత్తియాతొడలపైనుంచి । చక్కనికురులకు జవ్వాదిఅలది ।
మెత్తనికురులకు మృగనాభియలది । అలకములుతాజుట్టి తిలకంబుదీర్చి ।
అపుడాశృంగార ఛస్తురాలాయె । వెండియ్యకాగులా వేడినీళ్ళుతోడి ।
చన్నీళ్లువేన్నీళ్లుసమముగాతొలిపి । దానిపైముత్యాలముంతొప్పనుంచి ।
శ్రీరాములుసీత మజ్జన్నమాడె । దశదిక్కులాదీప్తి వాటిల్లగాను ।
దశరథకోడల్లు మజ్జన్నమాడె । కనకగుబ్బగొడుగులు కాంతలుబట్టగను ।
కౌసల్యకోడల్లు మజ్జన్నమాడె । శానాయగొడుగులు చేడెలుబట్టగను ।
శాంతమ్మమరదల్లు మజ్జన్నమాడె । లక్షవేలగొడుగులు రమణులుబట్ట ।
లక్ష్మణునివదెనెతా మజ్జన్నమాడె । పసిడిచెంగుల దుప్పటితెచ్చి ।
పణతికేతలలొత్తుదురు పద్మముఖులంత । శృంగారమౌచున్న బంగారుచీరె ।

జానకిమహాదేవి జానొప్పగట్టె । శుద్ధసువర్ణ శోభితంబయిన ।
పెద్దపూసలపేరు విరజాజిదండ । పతివ్రతకింపయిన పిల్లేళ్లబెట్టె ।
చెవులకుయింపయిన చెంతసరులుంచె । దండవుత్తాండాలు తరుణితాబెట్టె ।
కంఠాభరణాలు కాంతధరియించె । కస్తూరిబొట్టెట్టె కమలాయతాక్షి ।
ఒయ్యారినడకలా పయిటజారగను । వారచూపులుచూస్తు వచ్చెనుసీత ।
అల్లంతటశ్రీదేవి రాకలుజూచి । గడియగక్కిన బెట్టెకాకుత్థ్సుడూను ।
తలుపుదగ్గరకొచ్చి ధవళయతాక్షి । శ్రీరామచంద్రుడ తీయనయ్యగడియ ।
శ్రీరామచంద్రుడా శ్రితపారిజాత । ఆదినారాయణుడ తీయవయ్యగడియ ।
ముద్దుమాటలువిని మురవైరిరాము । ముదితకుతీసెను ముత్యాలగడియ ।
శ్రీదేవినెత్తియా తొడలపయినుంచి । మహాసుఖమున నిద్రిస్తిమయ్య ।
ఇదియొకఆనవాలని చెప్పుమాహనుమా । మరియొకఅనువాలు కలదుసుమి హనుమా ।
మరువకజెప్పుమా మాసీతతోను ।
సీతయుమేమును పానుపుమీద । శ్రీదేవితోమేము కూడింటిమయ్య ।
హారములు సరములు భన్నస్వరములు । తగమెడహారమ్ము తీసెగదరాము ।
సుగంధపుష్పముల శుభగాలివిసర । శుభకోమలాంగికి కుచమధ్యమందు ।
పండ్లపుష్పముదీసి పరిమళములలదె । ఇదియొకఆనవాలని చెప్పుమాహనుమా ।
మరియొకఆనవాలు కలదుసుమీహనుమా । మరువకజెప్పుమా మాసీతతోను ।
అద్దమ్ములోపలా అతివతనరూపు । అందులోజూచి కురులంకించిముడువా ।
యీఅద్దములోను యీరూపుతోను । యింతచక్కనిదేవి యిదియెవ్వరనుచు ।
అహాహాశ్రీరామా అయోధ్యరామ । సృష్టికితవులుచేసి యిట్టులెరిగితివా ।
ఏకపత్నీవ్రతుడవని యిచ్చెమాతండ్రీ । ఏకపత్నీత్వంబు యింపుగాతెలిసె ।
ఇట్టిమాయలసతిని పిలిపించదగునా । అవనిజకడుముగ్ధ అగుటతాదెలసి ।
లోలాక్షియెరుగదని మదిలోనునవ్వె । కరస్థలముపట్టుకొని కాంతనిట్లంటీ ।
పతిలేనిసతిజూచి అతివకోపిస్తివి । పతిజూచితె అలుక బాసునాచెవుమీ ।
నిలువుటద్దమ్ముదెచ్చి మెరుగుతుడిపించి । మెరపుబోడి ముందారానిలపే ।
ఇద్దరీరూపులు అందులోజూచి । ఇద్దరీవన్నె సౌందర్యములుజూచి ।
నరనాథవారెవరో యెరిగించుమనెను । సీతభయముబాప అతివరోవినవే ।
సీతయూరాముడూ చేరియున్నారు । ఈయింట నింకెవ్వరుండంగ గలరె ।
అతివవెరచి పాదములకుమ్రొక్కె । ఇదిఒకఆనవాలు కలదుసుమీహనుమా ।
మరియొకఆనవాలు కలదుసుమహనుమా । మరవకజెప్పుమా మాసీతతోను ।

క్రొత్తగాగట్టినా చిత్రకూటమ్మూ । రత్నంపుతగుమాన మయినట్టికొలను ।
పచ్చిపసుపులందుకుని పద్మాయతాక్షి । కొలనుదగ్గిరకెళ్లె గోవిందుదేవి ।
తననీడజూచుకొని ధవళాయతాక్షి । మార్నీళ్ళచూచుకొని మల్లెశ్రీగంధీ ।
ఎప్పుడుతనతోటి కూడాడినట్టి । శ్రీపద్మగంధీతా నిట్లన్నిపలికె ।
ఇదియేమిసోద్యమో యినవంశజుండా । మింటచంద్రుడువచ్చి ధరణినున్నాడు ।
తుమ్మెదలువచ్చాడు చూడరమ్మనెనూ । అనియిట్లుపలుకగా శ్రీపద్మగంధీ ।
అప్పుడుదగ్గరకువచ్చి అష్టైశ్వర్యమ్ములా । మిమ్ముఁరాబంపింది సీతామహాదేవి ।
ఆచిలుకలాకొలికి ఆచిత్రకన్యా । ఆకలికివయ్యారి ఆముద్దుగుమ్మ ।
ముమ్మలరాబంపె మల్లెశ్రీగంధీ । కొలువుదగ్గరలేచి గోవిందస్వామి ।
గొడుగులుపగడలూ గోరుటెక్కేములు । వజ్రంపుటెక్కేములు వాల్చిపట్టగాను ।
కొలనుదగ్గరకువచ్చి గోవిందస్వామి । యిదియేమిసోద్యమో యిక్ష్వాకుతిలకా ।
మింటచంద్రుడువచ్చి ధరణినున్నాడు । తమ్మెదలవియాడు చూడరమ్మనెను ।
మింటచంద్రుడుగాడు అతియనీమోమూ । తుమ్మెదలవిగావు సఖియనీకురులూ ।
అనియిటుబలుకగా యిందీవరాక్షి । సిగ్గుపడిశిరసొప్ప వంచుకొనియుండె ।
ఇదిఒకఆనవాలని చెప్పుహనుమా । మరియొకఆనవాలుకలదు సుమీహనుమా ।
మరువకజెప్పుమా మాసీతతోను । పాదపద్మములు వత్తుచూసీతా ।
పరమపతివ్రితా సంకేజగంధి । వికసించినాపువుల సురటిచేబట్టి ।
విజయీభవాయని వికసించివిసరా । చిట్టిచిటివజ్రాలు చిలికించినట్లు ।
సీతసిరిమేనెల్ల చెమ్మటలుబోసె । అలసితివిచాలించు అతివరోనీవు ।
మాసేవచాలించు మగువరోనీవు । చీనాంబ్రిమగుచున్న దుప్పటిచెంగునను ।
సీతసిరిమేనెల్ల చెమటలూదుడిచితిని । ఇదియొకఆనవాలని చెప్పుమాహనుమా ।
మరియొకఆనవాలు కలదుసుమీహనుమా । మరువకజెప్పుమా మాసీతతో ।
శృంగారమౌచున్న బంగారుతూగూ । బంగారుతూగుపై హంసలాపాన్పు ।
పవళించుచుండగా పరంజ్యోతిరామ । ఆవలమొగమయి ఆదేవియుండె ।
తొందరగానేను తుమ్మెప్పతుమ్మ । కోటంతఆయుస్సు గోవిందుకనుచు ।
బ్రహ్మంతఆయుస్సు పరంజ్యోతికనెను । చిరంజీవిఅనితీసి భవిడాకుచెవిని ।
ఉంచుకునెఅదిఒక ఆనవాలనుమీ । ఇదిఒకఅనవాలని జెపుమాహనుమా ।
మరియొకఆనవాలుకలదు సుమీహనుమా । మరవకజెపుమా మాసీతతోనూ ।
కొత్తగాకట్టినా మేడలలోను । శ్రీరాములూ సీతమాట్లాడుచుండె ।
నాకుప్రొద్దూపోదు నళినాయతాక్షి । సోగటాలుయాడుదామని యాత్మదలచె ।

బంగారుపాచికలు పట్టుకొనివచ్చి । తి త్తికితీమంచమిది చక్కభారా ।
అష్టారదష్టోకఅది భారయనుచూ । సరియనుచుదుగయనుచు పారీవేయుచును ।
మాటమాటకుసీత రామునోడించె । ఇంతయోడింతురా యిందీవరాక్షీ ।
కలికిచిలుకలకొలికి కలహంసగమనా । సీతమీదకోపించి చెలగినేనుండి ।
పట్టుశాలూముసుకు పెట్టుకొనెనంతా । తప్పుగలదూ దేవధరణీశ్వరుడా ।
పద్మనాభల శ్రీపాదములకుమ్రొక్కె । నవ్వుతూలేచెనే నారాయణులూ ।
ఇదిఒకఆనవాలని జెపుమాహనుమా । మరిఒకఆనవాలు కలదుసుమీహనుమా ।
మరువకజెపుమా మాసీతతోను ।
అయోధ్యవిడనాడి అరణ్యమునను । అత్రిమునియాశ్రమముల కేగినానాడూ ।
నాడుమనఅనుసూయ కాంచినానాడూ । ఆదేవికిదేవి యిచ్చినావరము ।
జాయనీశృంగారము మాయనీకుడతా । కందనీభూషణములు కాంతతానిచ్చే ।
వరమియడము ఒకఆనవాలనుమీ । ఇదిఒకఆనవాలని జెప్పుహనుమా ।
మరివకఆనవాలు గలదుహనుమా । మరువకచెప్పుమీ మాసీతతోను ।
దండకారణ్యములు దవ్వునేతెంచి । మండలాపతివెడలె మహిమనొకనాడు ।
తనుగూర్చిజానకి తొడపైశిరసు । వీడుకొనినిద్రించె వినలేకవరుడు ।
పక్షిగూఢ్యాతన పైవారగాను । ఆక్షణమెమేల్కాంచె అయోధ్యపతియు ।
ముగుదచింతించుటకు మెల్కాంచెపతియు । ఇంతినీవింతేల యులికిపడితివనెను ।
లోకేశ్వరావినుమి కావరఅసుర । కావనుచుఅరుచుతూ కరుణతనరూపు ।
తనరూపుహొగడుతు కావరపుఅసుర । ఉరమునకుయెగిరి యోస్తనమందుచీరె ।
కరుణించిఒక దర్భకఙ్జమంత్రించి । శిరసుదెమ్మనిపనిచె శ్రీరాఘవులు ।
దేవలోకమ్ములే దివ్యలోకములు । అమరాదిలోకంబులపుడు తాతిరిగె ।
పద్నాల్గులోకములు పక్షితాతిరిగె । పతులులేరు తనుగావసతులులేరనుచు ।
ఎవ్వరూతనుగాయ జాలలేరంచు । శరణంబెకాచి రక్షించేటిబిరుదు ।
శరణురఘుకులతిలక శరణురాజేంద్ర । క్షణమాయజంగమ తేజుడాఅజుడా ।
తృణముగరచుకువచ్చి రఘుపతికిమ్రొక్కె । పూరిగరచుకువచ్చి పుడమిపతిజూచె ।
వాణించిఒకతృణము వాణ్ణిగారించె । ముందుమీదేవిని ముట్టినాతప్పు ।
కాకాసురునికన్ను దండుగాగొనెను । రూఢమైయానవాలిదియని బలికె ।
చెవులోనుజెప్పుమనిరి శ్రీరాఘవులు । ఇదియొకఆనవాలని చెపుమాహనుమా ।
మరివకఆనవాలు కలదుసుమీహనుమా । మరువకజెపుమా మాసీతతోను ।
అభినరత్నములు తాపించినారు । ఆమంచివన్నెలా మహిమగలది ।

పచ్చనరత్నము తాపించినారు । భాస్కరతేజులు విరచించినారు ।
అనేకరత్నములు స్థాపించినారు । ఆమంచిరత్నముల మహిమగలగుంది ।
తమతల్లిదండ్రులూ ప్రసాదమనుచు । అతిశీఘ్రముగాను పోయిరావయ్యా ।
శ్రీరామలక్ష్మణులు యిచ్చినముద్రికా । సీతమ్మయిదిగోను అందుకోవమ్మ ।
మాణిక్యముతనకొంగు మాణిక్యములువిప్పి । మారుజాబులుయిచ్చె మగువసీతమ్మా ।
ఓరామానేగను గొంటిపై దేహిని । బలుపైనామూలా పంజరమునడుమ ।
చిక్కి అలసినరాజ హంసవలెనున్న । వైదేహినిగనుగొంటి నోరామనేను ।
నారీమణినన్ను నమ్మాకయుండున । మీరానతిచ్చినా మేరాలువినిపిస్తే ।
కూరిమితోవినెను ఆరామలక్ష్మణు । లేతీరువారనెను తానువర్ణిస్తే ।
ధారుణిపై వాలెను ధరణిజతాను ।
సంతతమటువంటి పతిగల్గగానే । సద్గతిజెందునేనెంతొ కర్మరాలా ।
ననుచుమితియేలేని వెతజెందెసీత । కన్నులకద్దిపయ్యాద వెతదీర్చుకొని ।
ప్రతియానవాలిచ్చె మగువసీతమ్మ ॥

# సీత చెఱ

నిన్ను నే చెఱగొన్న వార్తలువిన్న । సమ్మతిగ జనకులకు సంతోషమనేను ।
ఈవార్తనాతండ్రి జనకుడేవిన్న । తలలుకొట్టించుమని చాటించునన్న ।
అన్న అన్ననియేవు అత్రమలుమాను । నీమీది మోహమున నిను దెస్తిచెఱలు ।
ఒకరిభామనునీవు ఒనగోరితెస్తే । గొఱ్ఱెవలెనీగొంతు కోసురాయముడు ।
యముడుయముడనుచు నీవేలవెరపించేవు । యముడుమాలంకలో చెఱలవున్నాడు ।
ఇటువంటిచెఱలన్ని విరచి తునకలుచెయ్య । చక్రధరుడొచ్చేను క్షణముతాళన్న ।
ఏవేళచూసినా ఏలచింతించేవు । సీతరోమాలంక యేలిస్తునిన్ను ।
అన్నరోమీలంక యేలమాకేటికి । మక్కువతొమావదిన మండోదరేలు ।
కలకలమాటాడి కనులెత్తిచూడవే । సకలాభరణమ్ములూ సొమ్ములిచ్చేను ।
నారచీరలుగట్టి వనముసొమ్ములుచేసి । రాములేనాసొమ్ము ఎల్లకాలమ్ము ।
వచ్చినదానవు వనములోనిలిచితివి । చనవునామాలంక చొచ్చిరావేమి ।
వచ్చేనుశ్రీరాము చొచ్చేనులంక । పదితలలునరకంగ అపుడుచూసేను ।
వెరపకానాతోను ఇట్లుమాట్లాడ । దిక్కెవ్వరేనీకు ఈవనములోను ।
దిక్కుమారాములు జగదీశ్వరులువచ్చు । ఘన్నునిమిషముగాను గడుచునోయన్న ।
లక్షకొమాన్ను మరి లక్షపైమనములు । నాకంటెనీవిభుడు బలముగలవాడ ।
ఇట్టిసహవాసమ్ము ఎట్లువిడచాసేవు । పగయేలరామునికి తపసంటెచాలు ।
చెఱపోయినదాన్ని చెయిబట్టునావాడు । రాముకెదురుగనిలచి రణమందు యుద్ధమున ।
ఓడించిరాముణ్ణి తెస్తినీకీచెఱలు । దొంగకుక్కవలె చొచ్చితెచ్చితివి ।
అగ్నిమీదనుఈగలు వాలునాయన్న । చీంబోతులెన్నయిన ఏనుగతొ సరియౌన ।
కుక్కలెన్నయినాను కరచునాసింహము । సింహముపిల్లలు కొంగకలుసౌన ।
పట్టిపారదోలి విసరునోయన్న । ఘన్ననిమిషముగాను గడచునోయన్న ।
నీరూపుచూచితే నేనిల్వజాలను । పొందకాఓభుడియ పోనివ్వననెను ।
ఆదినారాయణుడాలోకరక్షకుడా । ఇటువంటి దుర్మార్గునెట్లుమరచితివి ।
పగవానిసాధించి పదితలలుఖండించి । పట్టాభిరామనను తోడ్కుపోరాద ।
తనచెడ్డపట్టున్న నోము ఫలమిట్లుండె । ఇహనైనదయవచ్చి తోడ్కుపోరాద ।

(కిటతకిట, కిటతకిట, కిటతకిట, కిటతకిట,)

ఇకరాములా కనుల చూసేననే.... - నీచెరలోనుంచి వెళ్లేన....,
నన్నూపెండ్లాడిన రాముడునా.... - జాడాతెలియాకున్నాడూ
ఎన్నాడుకన్నూల ఎడబాసుండాలేదు - నన్నూఎడబాసి పదినెలలుఆయెను ॥ ఇక ॥
కనకంపుఆమాయ మృగమునూ - దానిపట్టితెమ్మంటిని భర్తనూ
ఆవేశమృగముతోస్వామి వెళ్లినవెనుక - ఆవేదనొందితిని అపుడంతాతెలియక ॥ ఇక ॥
నాముద్దుమరది లక్ష్మణానేను - తామసమాడితి సద్గుణా
ఆవేశమృగముతోస్వామి వెళ్లినవెనుక - ఆవేదనొందితిని అపుడంతాతెలియక ॥ ఇక ॥
అరాఘవవీరు బాసితీనిద్ర - హారామకన్నులరోసితీ
కోరనుదేనినా పురుషునిఎపుడుశ్శ్రం - గారమైనకళ్లచూసినట్టేబాసు
కారుణ్యామైనవారెవ్వరూ - శ్రీరాముణ్ణీతెచ్చీచూపరు
ఈరాక్షసుడునన్ను ఇందుతెచ్చినవార్త - వారీతొ తెల్పేటి వారెవ్వరున్నారు ॥ ఇక ॥
భూమిధరించిన రాములాధర్మ - పూజితులైన శ్రీరాములు
నానోముఫలమూలిడేరు నెన్నటికైన - భానువంశజులు పైనమైనారేమొ ॥ ఇక ॥
అనియిట్లుసీతమ్మ విలపింపగానపుడు - హనుమంతుడేతెంచె ఆవనములోకి
ఏలమ్మసీతమ్మనేను రాములబంటు - నమ్మనాపేరు హనుమంతుడమ్మ
భద్రాద్రిపరదులేడానకీ - రామ - భద్రూలెనన్నంపెజానకీ
ముద్రికగొనితెస్తిజానకీ - సా - ముద్రాముదాటీతిజానకీ
ఏమోయిహనుమంతవస్తివీ - మాట - ఏమిఆనవాళ్లుతెస్తివి
ముద్దుటుంగారాముతెచ్చావా - మా - ముద్దులరఘురాముచేతీదీ
శిరసూమాణిక్యాముతెచ్చావా - మా - శ్రీరామచంద్రూలశిరసుదీ
రాములులెస్సగాఉన్నారా - మరదీ - లక్ష్మణువద్దనున్నారా
నాచెరవిడిపించనున్నారా - తాము - వచ్చేర అయోధ్యరాములూ
అరునెలలూఎడ బాసుంటినీ - మా - అయోధ్యరామూలచూతూనా
పదినెలలూఎడబాసుంటినీ - మా - బంగారుమరిదినిచూతూనా
కైకమ్మమమ్మింతచేసెగా - నాదు - కర్మఫలమిట్లుండెగా
దేవేంద్రరథమెక్కగానూ - మమ్మ - దేవతలిట్టులచేసిరీ
ఇట్టిఅడవులలోకిహనుమంతా - మీరు - ఎట్లువస్తిరయ్య హనుమంతా
కారడవిలోపల హనుమంతా - ఒక్క - పర్ణశాలకలదు హనుమంతా
పతినివేడితినయ్య హనుమంతా - ఎల్లు - బట్టుకుకదిలేను హనుమంతా

సృష్టంతఏలేటిస్వామి - ఇంత - చింతింపదగదమ్మ జానకీ
కరవునాళ్లనునీవు ఉంటివీ - నీదు - లీడేరులేవమ్మ
అశోకవృక్షముకిందనూ - నే -నతిసొక్కూచున్నాను రమ్మాను
సీతాయనిపేరపిలుసూనా - మా - శ్రీరామునీ మరలచూతూనా
వైదేహియని పేరపిలుచూనా - మా - వైకుంఠవాసుని చూతునా
ఠంగారువీధినిరాగానూ - మా - బంగారుమరదీని చూతునా
కైకమ్మమమ్మింత చేసెగా - మాదు - కారణమిట్లూఉండెగా
మారుజాబులుతిప్పి యిచ్చెను - రావణు - రామూడుయుద్ధమ్మూ చేసెను
రావణునిపదితలలు త్రుంచెను - పుష్ప - వర్షములప్పుడు కురిసెను
పట్టమువారంత చూడగ - వారు - పట్టపేనుగునెక్కి వెళ్లిరి
వసిష్టుమహామునులు వచ్చిరీ - అప్పుడు - వైదేహిపట్టము కట్టిరి

# సీత ముద్రికలు

౧

(తకిట తకిట తకిట । తకిట తకిట తకిట)
వనమునకనకాంగీ । వైరిబాధలకు కుంగీ ।
మనసునతలపోసీ । హాపతీయనుచుసొలసి ।
శ్రీరామ రామయంచూ । చింతచేపలవరించీ ।
ధరణిజనగతోనూ । తల్లడము పొందగానూ ।
శ్రీమూర్తి రఘురామ చంద్రులా । ముద్రికను చెయిబూనీ ।
(కిటతకకిట, కిటతకకిట, కిటతకకిట, కిటతకకిట)
వేమారుతాత్మజు డద్దిసీ । కాలపవలె దాటీ ।
భీమరావణు రాజధానిని । చొచ్చి వీధివీధిలో ।
వేమారు శ్రీరాముపత్నినీ । వెతకుచు రాగానె ।
కనుగొనె ఉద్యానవనములో । మారుతినందనుడూ ।

౨

ఒణుకుచు మనసీతా । ఉండగా లోకమాతా ।
అడలచు తలపూచీ । ఆమె శోకంబుచూచీ ।
చిపురులు పొలుపొందూ । శింశుపావృక్ష మందూ ।
పవనసుతుడు డాగె । బాష్పముల్ కనులదోగె ।
ఆరామ సీతనెలకొని । పాపిష్టి రావణుని ।
పేరెత్తి శోకింపగాకను । గొనిముద్రికను బూని ।
మారుతి పడవేసెదాని । నిచూచి పరమపావని ।
శ్రీరామ నామాంగుళమని । మూర్ఛిలి లేచె జనని ।
పలికె ముద్రిక జూచిజానకి ॥

3

ఆరుదుగ మిముజూడ । అద్భుతంబాయె నేడు ।
సుదినముకద నేడు । చూచినానమ్మ నేడు ।
తనపతి పంపినారా । నీవె తావచ్చినావా ।

తెలుపుమతని ప్రేమ । విచిత్ర మేమందునమ్మ ।
పలికెముద్రికజూచి జానకి ॥
జనకునిపంతమీడేరెనె । రామచంద్రుడుతాను ।
దనరుసింహం పలెలేచనె । బాలచంద్ర భూషణుని ।
ధనువెత్తి పెళపెళవిరిచెనె । మీనలగ్నమందు ।
నెనరుగ తనబొట్టుకట్టెనె । తన్నొంటి జేసెనె ।
వినవెముద్రిక నాటివింతలు ॥

౪

తనపతి వినయమునా । తండ్రీ వాక్యమ్ముపూని ।
తాపసుల మహిమ । దండకారణ్యసీమ ।
అలసి తిరిగిచాలా । ఆడనే పర్ణశాలా ।
ఉచితముగ నొకటివేసీ । ఉంటిమేమార్తిబాసీ ।
వినవేపాచికలాడు చుంటిమి । పర్ణశాలా వాకిటను ।
కనకమృగము కనుగొంటిని । నామనసు గుత్తెరిగి ।
చనెనేరాముడు దానివెంటను । దానవుడనితెలసి ।
దనరుబాణము సంధించెనె । సూటిగావేసెనె ।
వినవెముద్రిక నాటివింతలు ॥

౫

తనపతిశరమేయా । తాకీదద్దిరిల్లిమాయా ।
హరిణముధాత్రీజ । హాసుమిత్రాతనూజ
అనిమొరలిడనమ్మా । అద్భుతంబాయెనమ్మ ।
ఆయార్తరవమూనేవింటిని । విన్నంతమూర్ఛిల్లి ।
ఆయానె మైమరచియుంటిని । నాబుద్ధికెమోసము ।
ఆయెనె మదియెంచుకొంటిని । నామరదిలక్ష్మణుని ।
ఛాయాకు అందుపొమ్మంటిని । పొరాకుచేసెను ।
వినవే ముద్రిక నాటివింతలు ॥
రఘుపతికనుజాతా । లక్ష్మణా యిట్టికూతా ।
వినియటు జనవేమీ । వేగ రాడాయెస్వామి ।
తన్నువలచినావో । తన్నుకాంక్షించినావో ।
అనిపలికితినేనూ । ఎంతపాపిష్టినైతి ।

నామాటవిని భ్రమియించెనే । నామరది లక్ష్మణుడు ।
రామానామము స్మరియించెనే । వెంబడిని చనెనె ।
విసవె ముద్రిక నాటివింతలు ॥

౬

రయమున చెలరేగీ । రాక్షసుండిందుడాగి ।
వలపున తన్నుగోరీ । వచ్చెసన్యాసిదారి ।
అడిగెను తన్నుభిక్షా । అక్కటాలేదురక్షా ।
తరిమితిచేజేతా । తప్పునాబ్రహ్మరాతా ।
దనుజదానునవుడిందు వచ్చెనె । జవ్వనురాలవొంటి ।
నిలుతువా అని పలుకరించెనె । లోకములోలేని ।
కటపమంత్రములుచ్చరించెనె । నానిజరూపుజూచి ।
నిలబడినన్నాదరించనె । తనరథమూపైతన్నూ ।
బలిమిచేకొని తన్నూవుంచెనె । భయమందూచుచనెనె ।
వినవె ముద్రిక నాటివింతలు ॥

౭

జడియకదివిజారీ । ధర్మమార్గంబుమీరి ।
ననుచెఱగొనిపోగా । నాయమా నీకుదాగ ।
వినిరవికులసోమా । కాచిరక్షించురామా ।
అనిపలికితిచాలా । అశ్రువుల్కనులరాల ।
నామొరాల వుడాలకించెనె । జటాయువుతాను ।
భీమరూపమున గద్దించెనె । రాముని సతిననుచు ।
తనమీద అభిమానముంచెనె । వానిచేతిధనుసు ।
వేమారుముక్కున తుంచెనె । వానిచేత బడెనె ।
వినవే ముద్రిక నాటివింతలు ॥

౮

కటకటా దయలేకా । కష్టురాలైన కైకా ।
రఘుపతి వనికంపీ । రాజ వంశంబుముంచీ ।
తరుణికిపుడు చెల్లె । దానిసంకల్ప మెల్ల ।
అనిపలికితి చాలా । అశ్రువుల్ కనులరాల ।
దనుజాదానవుడిందు తెచ్చెనె । కావలి పెట్టితన్నూ ।

వనపాదపము కిందావుంచెనె । రాక్షసుల నంపించి ।
దినదినమూబెదరించెనె । యేమని తాళుదునె ।
విసవె ముద్రికనాటి వింతలు ॥

౯

వినయముతనుబూనీ । వేడుకున్నాను గానీ ।
తొడరిబల్కవేమీ । తొల్లినాకర్మమేమీ ।
చెలువుడు ఇటలేడో । చెంతనే దాగినాడో ।
కదలి తెల్పవమ్మా । కాంక్షలీడేర్ప వమ్మా ।
ఈరీతి సీతశోకింపుచు । రావణబాధలన్నీ ।
తనమదినెంచి శోకింపుచు । ఉన్నది చూచియెల్ల ।
మారుతివిభు ఖభామెంచూచు । మారుపలికె సీతకుమెల్ల ।

౧౦

శుభము కలిగెనమ్మా । శోకమింకేలనమ్మా ।
నీపతికి హితుడనమ్మా । బంటునై యుందునమ్మా ।
కపివరులు భజియింపా । కాంతుడు నన్నుపంపా ।
వచ్చితిని నిజముగానా । తల్లి నీకన్నులాన ।
అనినా మారుతిశుభవాక్యము । జానకివిని పలికె ।
వనచరనీమాట నిక్కము । అయినను ఇనుమంత ।
తీరనామనసు సందేహము । తెలుపతని చిన్నె ।
అనినపొంగుచు కపిసింహము । వైదేహికిట్లనెను ।

౧౧

జనకజసుకుమారి । స్వామిచంద్రూల మీరి ।
తెలిపెదను తనప్రభలా । దేవినేనెంతవాడ ।
నిజమునిఖిలమాతా । నీకటాక్షంబుచేతా ।
అజానుబాహుడురాముడు । పంచాననవిక్రముడు ।
రాజీవాక్షుడు సత్యసంధుడు । నీలాంబుధివర్ణం ।
ఆజన్మపరిశుద్ధు డనఘుడు । అతని తమ్ముడైన ।
తేజోమయుడు హేమవర్ణుడు । వర్ణింపనాతరమా ।
ఆజాను బాహుడు రాముడు ॥

౧౨

దిగులుపడి ఇటువాళా । దీనురాలై న వేళా ।
నిలువున నినుగంటి । నేడుసౌఖ్యంబు వింటి ।
వెలయునసురుల వల్ల । నేపడేబాధలెల్లా ।
వినుముసుజనగేయ । వీరమాహాంజనేయ ।
పులులలో మెలగుధేను । వటునేరాక్షసులలో ।
తలపోయుచుందురా నావలె । పాతకురాలుకలదా ।
తనపతితొ పూసగుచ్చిన రీతిమారుతి వినుయతివలె ।

౧౩

వాడునన్నిందు తెచ్చి । నెలలొక పదిఆయె ।
నిత్యదుఃఖమ్ములాయె । రామపతిని బాసి ।
తాళలేనింతగాసి । తాళలేనింకదాస ।
శిరోమణి మణికొమ్మా । మారుతీ వేగలెమ్మా ।
హనుమంత నేనున్నచందాము । తప్పకపతితోను ।
నెనరుకలుగ వినిపించుమ । నామరది లక్ష్మణుతో ।
తనధిగామనవి విన్నవించుమ । తన్నుతిట్టినఫలము ।
అనుభవించితినని తెల్పుమ । సుగ్రీవాదులతో ।
మనసురంజిల మాటలాడుమ । గ్రక్కునపోయిరమ్మా ।
పతితోనావెత లెల్ల దెల్పుమి ।

౧౪

ఇహఒకనెలసుమ్మా । ఇచ్చేసుమ్మా ।
అనిపల్కెనుభామా । అర్కవంశాబ్ధిసోమ ।
పతియిటురాకున్నా । ప్రాణసందేహమన్నా ।
అనిపల్కెనుభామా । అర్కవంశాబ్ధిసోమ ।
అనినమారుతిశుభవాక్యము । వై దేహికిట్లనెను ।
"ఓయమ్మానీకేలె క్లేశము । వానరదళములతో ।
నీఆత్మవిభుదెస్తు నిక్కము । పూరికెపోతె ।
పతికినాయెడపుట్టు సందేహము । సంశయమేలేనమ్మా ।
జానకీ నీశిరోరత్నము । ఇమ్మని అదిగొని ।

౧౪

ఆదిజననికి మ్రొక్కి । ఆమెసన్నిధివీడి ।
తరువుల పడగొట్టి । దానవశ్రేణిగొట్టి ।
లఘువునచాలదాటి । లంకభస్మంబుచేసి ।
పతిపదమునవాలి । పల్కెనాదాసమౌళి ।
కనుగొంటి దేవవై దేహిని । సాత్వికశిరోమణిని ।
వనమందు దినములగడపుచు । దేవరచరణముల ।
మనసులోధ్యానముచేయుచు । ఉన్నదిలంకలోన ।
శ్రీరామయేమని తెల్పుదు ।
"ఇహ ఒకనెలసుమ్మా । ఇచ్చెసుమ్మా ।
అనిపల్కెను భామా । అర్కవంశాబ్ధిసోమ"
అనియిచ్చె పతికిశిరోమణి । మీచేతికిమ్మని ।
నాచేతికిచ్చెశిరోమణి । స్వామిచేకొమ్మదాని ।
అనుచును పతికిచ్చెశిరోమణి ॥

౧౬

అవనిజపతిజూచి । అంతమూర్ఛిల్లిలేచి ।
పలువరసకడుమెరసీ । పల్కెసౌమిత్రిచూసీ ।
ఏమిచేయుదునికలక్ష్మణా । ఏదిక్కుచూచినను ।
భూమిజనుకానలక్ష్మణా । ననునమ్మినావెంట ।
వామలోచన వచ్చెలక్ష్మణా । రాక్షసుడుగొంపోయె ।

౧౭

గుణవతితోడనాడు । కూడివుండేటినేను ।
తపసిని కానునేడు । తమ్ముడా యాదుకొమ్మా ।
ఇపుడు తపసినైతి । నేనధీరుండనైతి ।
గుణవతి ముఖమువాసి । ఓర్వలేనింత గాసి ।
ఎన్నడు సీతనుచూతును । వియోగవేదనల ।
నేనెటు ఈరీతినుందును । లోకకంటకు రావణు ।
ఎన్నడు నేసంహరింతును । భామ ప్రియవచన ।
మెన్నడునాచెవుల విందును । సౌమిత్రిదెల్పుమా ।
ఏమిసేయుదునింక లక్ష్మణా ॥

అనుచుశోకింపుచు రాముడు । సుగ్రీవునిజూచె ।
"జననాథవినుదశకంఠుని । రేపెసంహరించి ।
తోడితెస్తువువై దేహిని । సంశయమేల ।
కూడియుందురువై దేహిని ॥

౧౨

అనవిని ఒకసారి । అంతకోదండధారి ।
"తపనతనయయింకా । తామసంబేలలంకా ।
పురమున విడియింపా । పూనిసైన్యంబునింపా ।
అని శత్రువులచంపా । ఆశ్రియశ్రేణిపెంపా"
చనిరినానరయోధులప్పుడు । జాంబవంతుడునీలుడు ।
పవనసూనుడు సుగ్రీవుడు । సుషేణుడుకూడి ।
చెంతనుచేరి కొలువా । అనుజతో శ్రీరాముడూ ।
ప్రభువటువసియించె । భాస్కరుండస్తమించె ।
రావణాధముడంతా । రామవృత్తాంతమంతా ।
వినిపరుగునలేచి । విస్తరించంగ జూచి ।
పతికి ధనణిజనిచ్చి । ప్రాణముల్ కాచుకొమ్మా ।
అనివిభీషణుడు ఆడిన । మాటలు వినినపుడే ।
దనుజనాయకుడు కోపంబున । తమ్ముని తన్నెనంత ।
వినువీధికెగసి కోపంబున । శరణుశరణు రామ ।
సకలలోకాభి రామా । సదయ సభయమిమ్మా ।
స్వామినన్నాదు కొమ్మా । దశముఖు ననుజుడ ।
దీనుడనై వచ్చినాను । ప్రణతిగైకొమ్మా ।
అనుచు విభీషణుడాడిన । మాటలవిని నపుడె ।
చనివేగవాని వృత్తాంతము । తెలిసితోడి తెమ్మా ।

౧౩

అనిరఘుపతి పల్కా । "అగ్రజుండెంచె దారి ।
దనుజులుఒక మాయ । దారులై వత్తురయ్యా ।
పదరు రిపులనోమ । పాటిగాదయ్య రామ ।
తెలిపితి కొకకొంతా । దేవయాలింపు మంత ।
అనుచు సుగ్రీవుడాడిన । మాటలు వినినపుడె ।

విను శిబితనమీది మాంసము । పక్షికోసము ఇచ్చె ।
తనవంశరాజుల కుచితము । శరణాభిపాలనము ।
మనసిచ్చి నేనిస్తునభయము ॥

౨౦

అనిరఘుపతి పల్క । ఆదైత్యునిని తెచ్చి ।
పతిపదమున చేర్చి । భానుసూనుండు మెచ్చె ।
'దనుజ వెరువకింకా । తామసంబేల లంకా ।
పతివి ఆయితివి సుమ్మా । పట్ట భద్రుండలెమ్మా ।
అనిన రామాజ్ఞను నీలుడు । సేతువుకట్టి రంతా ।
వింతగచూచె శ్రీరాముడు । ముట్టడి వేసిరంతా ।
రావణాదులు । భయమందగా ।
రవిదశముఖుడంతా । రామవృత్తాంతమంతా ।
వినిపరుగునలేచి । ఉగ్రకోపంబుతోను ।
తనసారధినిపిలిచి । యుద్ధసన్నద్ధుడయ్యె ।
కనకపు రధమెక్కి । కదలి శ్రీరాముచూడ ।
సతిసుత హితులతోను । సాధారణశ్రేణితోను ।
రవిదశముఖుద్రుంచె । రాఘవుడుజయించె ।
పుడమిసుతను గూడి । పుష్పకం దెక్కిఅయోధ్యా ।
పురమునకేతెంచి । భూమిసత్కీర్తినొందె ।
ముదముమీరగసీతా । ముద్రికా దరిశనంబు ।
పరగచదువుకొన్నా । భక్తిమైకొంతవిన్నా ।
రఘుపతికరుణించు । రాజ్యభోగములిచ్చు
ధనముతనయులనిచ్చు । ధాన్యభోగంబులిచ్చు ।

# లంకాయాగము

శ్రీరామ రఘుపతి సీత విలిపించుకొని కోరివేగమునడువగా
తల్లిని పిలుచుకొని తమ్ముణ్ని బిలుచుకొని తాను యిట్లనిపలికెను
అమ్మ మన బ్రతుకులు అడవిలో తపసులూ ఆరాము విన్నవించే
పదునాలుగుయేండ్లు తమ్ముణ్నితోగూడి తగ వత్తుమని బలికెనూ
అన్న నిన్నెడబాసి అరక్షణము తాళను మీవెంట వత్తుననెను
కుంటివాడో మగడు గ్రుడ్డివాడో భర్త కుష్టుడయిననుగానీ
పతినివిడచి తల్లిసుతుల వెంటవస్తే లోకు లేమందురమ్మా
లోకదూషణనీవు చాలపొందేవుతల్లి తగదుయిట్లని పలికెను
ముందుగా శ్రీరామువెనుకను లక్ష్మణుడు వనములకును పయనమైరీ
తనవెనుక తమ్ముణ్ని తాతిరిగిచూచి యో తమ్ముడా యని పిలిచెను
ఒప్పుగా మీతల్లి సుమిత్రతో బోయి ఒకమారు జెప్పిరమ్మూ
అప్పుడు లక్ష్మన్న అతివేగిరమ్మునా తల్లినగరికి వచ్చెను
ఒప్పుగా సుమిత్ర వొప్పుటేకులమీద కొలువుదీరుండగాను
మాయన్నమావదినె పదునాలుగుయేండ్లు వనము ప్రవేశమమ్మా
వారివెంటా నేను తల్లి వెళ్ళుతాను దీవెనలు యివ్వమమ్మా
శ్రీరాములు తండ్రిగా సీతమ్మతల్లిగా భావించులక్షుమయ్యా
ప్రొద్దుప్రొద్దునలేచి వదినె పాదమ్ములకు దండమయినా బెట్టుమీ
తోటలపండ్లన్ని దొన్నెల బెట్టుకొని మీదుగా దెచ్చియిమ్మూ
పదునాలుగేండ్లు తర్లిపోయినమీరు కలయరమ్మనిపలికెను
దీవెనలు అందుకొని అప్పుడు లక్ష్మన్న అతివేగిరము వెడలెను
ముందరా శ్రీరాము వెనుక లక్ష్మణుడు వనములకు పైనమయిరీ
తనవెనుక తమ్ముణ్ని తాతిరిగిచూచి యో తమ్ముడా యని పిలిచెనూ
ఒప్పుగా నీభార్య ఊర్మికాతోబోయి వొకమాట జెప్పిరమ్మూ
అప్పుడు లక్ష్మన్న అతివేగిరమ్మునా యతివనగిరికి వచ్చెను
ఒప్పుగా ఊర్మికా జాలారిసుంటలో జలకమ్ములాడునపుడు
పతినిజూచి తాను యెదురువచ్చి ముందరా నిలుచుండెను

పెద్దదానవునీవు బుద్ధిశాలివి గనుక యింతిరో వినుమనెను
మాయన్నమావదినె పదునాలుగుయేండ్లు వనప్రవేశమనెను
వారివెంటా నేను కొలువపోతాను వనితరో వినుమానెను
మిమ్మువాసీనేను యెట్లు తాళుదును మీ వెంట వత్తుననెను
నిలువవూప్రాణాలు నిజమునమ్మి నామాటనమ్మము మమ్మాటికీ
బావనడిచిన మార్గాన నడవరాదందురూ యేలాగువేగింతును
బావమాటధ్వని భూమిపైవినరాదు యేరాగువేగింతునూ
కాంతరో నీవింతశోకింపనేటికే నాకు వెళ్ళక తీరదూ
పచ్చనిపోకలూ పండ్లు తెల్లాకులూ గావించునా సున్నమూ
పట్టుమని ఊర్మిళా దోసిటబోసెను ఏడుగిరులేత్రావానెనూ
అప్పుడులక్ష్మన్న అతివనుజూచితా అన్నవద్దకువెళ్లెనూ
అప్పుడు ఊర్మిళావారు వచ్చినదాక నొకవ్రతము పట్టుండెను
నిద్రాహారముమాని పాన్పున ఆదేవిపవళించి తానుండెను
వీపునా నెమలిపురి కసువులే మొలచెను నెత్తివెదురుకొమ్మలు
గడ్డాన గేదంగిగూళ్ళను బెట్టుచును చంకవెదురూ బోదెలూ
గుండెలమీదనే గూళ్ళను బెట్టుచును వొడలెల్ల పుట్టబెట్టె
అంతట వూర్మిళ వారువచ్చినదాక నొకమ్రానుయై యుండెను
అప్పుడు లక్ష్మన్న అతివేగిరమ్మునా అన్నదగ్గిరకొచ్చెను
ముందర శ్రీరాము వెనుకను లక్ష్మన్న వనములకు పయనమైరి
తన వెనుక తమ్ముని తాతిరిగిజూచి యోతమ్ముడా యని పిలచెను
ఒప్పుగా మీవదినె జానకిదగ్గర నొకమాట జెప్పిరమ్మూ
అన్నరో వోయన్న శ్రీరామచంద్రుడ నామనవి వినుముదేవ
ఆడవాండ్లడవులకు తోడుకబోయేది నీతిగాదని పలికెను
ఆడవారడవులలో కాళ్ళసంకెళ్ళుగా వద్దోయి రాఘువన్నా
ఆపలుకులూ విని రాముడతివేగమున అతివనగరికి వచ్చెను
చిలుకలు కోవిలా వలపులుమీరగా చాయపప్పులు మేపుచూ
ఆచిలుకలాకోవిళ్ళ నటుపారవేసెను తనపతికి నెదురువచ్చె
పెద్దదానవునీవు బుద్ధిశాలివి యింతిరో వినుమానెను
వానరగా మీయత్తమామలను పోషించి అయోధ్యనుండమానే
మానుపారినతీగె మానుదప్పినవెనుక మణియెట్లు నిల్వగలదూ

చమురులేనిదివ్వె యెంతకాలముదాక వెలిగేది యనిపలికెనూ
భరతశత్రుఘ్నులు రాజ్యములేలగా తొత్తువలె వేసిపొండి
ఆపలుకులావిని రాముడతివేగముగ వనములకు పయనమాయె
వెనుకనూ లక్ష్మన్న నడుమజానకిదేవి వనములకు పయనమైరి
తనవెనుక తమ్ముని తాతిరిగిచూచెను తమ్ముడా యని పిలిచెను
పులులు యెలుగులు గలవు గండభేరుండాలు పక్షులే గలవురన్నా
ఆకళ్ళుగొని మీను అన్నము లడిగితే యెక్కడ దెత్తురన్నా
పండ్లునూ ఫలములు దండిగా కలిగించు దేవుడూ అన్న మనకూ
పట్టుచీరెలు మీరు కోరితే తమ్ముడా నెక్కడ దెత్తుననెను
పట్టుచీరెలు మనకు యేలనో వోయన్న నారచీరా లుండగా
పట్టెమంచము పరుపు కోరితే తమ్ముడా యెక్కడా దెత్తుననె
పుష్పాలకన్నను పూరిపానుపు గలవు వోయన్న పగవనేల
కటకటాతమ్ముడా కారణమ్మున ఫలముకట్ట యిట్లా నిండెను
చెట్లకాయలు తిని దొన్నెనీళ్ళుత్రాగి మనము తపసుల మయితిమీ
మాణిక్యమోయన్న మసిపాతగట్టినా మనరూపు దరుగదన్నా
కొండలకు నరిగినా మండలములవారు పర్వతమ్ములు దాటిరీ
చీమలుదూరని చిట్టడవి దాటిరీ కాకులయినా పారవూ
కాకులుపారని కారడవి క్రిందను పర్ణ శాలను దీర్చిరీ
చిలుకనారాయణమ్మ చిలికి పొదలనడుమ అలికిరి పొదలనడుమా
గుట్టమామిళ్లను భూసుతల వెలుగులూ గున్న చింతల నీడలు
పచ్చాకుమామిళ్ళ పండుజలవెలుగులూ యేపయిన హెచ్చు వనమూ
పట్టివేళ్ళాతోను వానపూలవారు ముత్యాల ముంజూరులూ
నవరత్నజంబులూ ముత్యమ్ములతోను పర్ణశాలా దీర్చిరి
యెందాక శ్రీరామ వొంటిగా నుందును చెలికత్తెలా దెమ్మనెను
ఆదికాలమునాడు అదినీకుజెప్పనా అయోధ్యయేనా యిది
కారడవిలోన చెలికత్తెలా దెమ్మంటే నెక్కడదెత్తుననెను
చెలికత్తెలమీరు తేలేకుంటేను మాతండ్రి సముద్రు డున్నాడనెను
చిన్ననాడాడినా పగడశాలున్నవని తెప్పించుమని పలికెను
కాకులపిలిపించి కమ్మలూ వ్రాయించి కాకికాలా గట్టెను
యెగసెనే యాకాకి యేడుయోజనాలు చెరువుగట్టున వ్రాలెను

కావుకావుమని కావనీ కూసెనూ కాకిగర్జనచేసెనూ
కాకిగర్జనవిని గడగడవణకుచు సముద్రుండు యెదురువచ్చె
పర్ణ శాలలోను సీతతో రాముడు నిద్రలేకా యుండెను
కాలున గట్టేను కమ్మపత్రికజూడు పగడశాల తేవయా
అప్పుడు సముద్రుడు పగడశాలదెచ్చి కాకి కాలికిగట్టెగా
ఎగసెనే యాకాకి యేడుయోజనాల్ పొడవు పర్ణశాలకు వ్రాలెనూ
పతియును సతియును యిరువురు నొక్కటయి పగడశాలందుకొనిరి
నిలుచున్న చోటికీ కూర్చున్న చోటికి నీవుండుమని పలికిరి
పండ్లును ఫలములు దెచ్చుచు లక్ష్మణుడు పదిలాన యిచ్చుచుండు
ఇద్దరిలో నొకరయిన పొమ్మని వొకపండు చేతిలో పెట్టరయిరి
పులుగుపులుగునుజూచి ముఖములా జూచెను తర్లెనే లక్షుమన్న
ఆకాశవీధులా గాలివానాతనకు వశముగాకాబోయెను
వశపడక లక్ష్మన్న వార్తలేక తాను మ్రానుదగ్గిర జేరెను
చుప్పనాతికొడుకు చక్రభూపాలుడయి ఒకమ్రానుదగ్గిర చేరెను
వానికి చంద్రుడు వానితపసులుమెచ్చి ఆయుధంబులు యిచ్చెను
ఇస్తీవాగోపన్న తెమ్మని లక్ష్మన్న దోసిలయినా బట్టెను
కత్తిపదునుతాను జూచుకుందామని మ్రానంట తెగవేసెను
నెత్తురుసారెకు వరదలయిపారగా వాలుకాలువగట్టెను
కటకటా యిదియెంత ఖర్మమొచ్చిందని కాకచేసుక అడలెను
మాయన్నవింటేను యేమీబాధవచ్చు నని పర్ణశాలకు వచ్చెను
ఏదారిపోయినా తమ్ముడూ యీకత్తి యేమరబోకు మనెను
తమ్ముడా యీకత్తి యేమరబోకుమి ముందుకాల్వలున్నవి
నేత్తేడుదొంతులూ పెట్టుకొని చుప్పనాతిచంక కోడిపిల్లలూ
కొడుకుదగ్గిరచేరి దెగదుడుచుకొని తాను కొంచపోయెదనుచూడు
వానిదగ్గిరనున్న శిశుబాలురుపోయి వానితల్లితో చెప్పిరి
కారడవిలోపలా నీకొడుకు నెవ్వరో జోగివాడు జంపెను
ఆయేడుదొంతులూ అటాపారవేసెను పండ్లుపటపట గొఱికెను
కొడుకు జంపినవాని కొన్నాళ్ళకయినాను కూల్చకపోయెదనా
కాంతకావిచీరె నడుమునగట్టెను చెంగల్వకీలుగంటూ
చిన్నదీ తననుదుట వీణెకస్తురిరేఖ సోగచక్కగ దీర్చెను

నప్పుడు చుప్పనాతతివేగిరమ్మునా బ్రమానుదగ్గిరకొచ్చెను
సత్తారుగా నన్ను సంసారంచేసితే గాపురము చేతుననెను
మాయన్నదగ్గిరవెళ్ళి సెలవడిగిరమ్మని లక్ష్మన్న పలకెనపుడు
అప్పుడు చుప్పనాతతివేగిరమ్మునా పర్ణశాలకు వచ్చెను
సత్తారుగానన్ను సంసారము చేసితే కాపురము చేతుననెను
చేతిపగడశాలా విడిచెనే శ్రీరాము తప్పకా తానుజూచె
తగునయా శ్రీరామ లక్షుమన్నకని శ్రీజానకీ పలికెను
తనసతి పలుకువివి అప్పుడూ శ్రీరాము తలయయిన వంచుకొనెను
ఇంటిపూరీదీసి యిటుమళ్ళమనుచునూ వీపునా వ్రాలువ్రాసే
అప్పుడు చుప్పనా డతివేగిరమ్మునా బ్రమానుదగ్గిరకొచ్చెను
వీపునా మీయన్నవ్రాలయిన వ్రాసెను చదువుకుందువు రావయా
నీవువ్రాలుచూచి యిటుమళ్లమనుచును ముందరానొడిసిపట్టె
ఆరుళ్ళ మంగలికత్తులున్న తాను పదిలముగ తీసుకొనెనూ
ముక్కుచెవులుగోసి చేతులోబెట్టెను చెప్పుకొమ్మని పలికెనూ
దిక్కుగలచోటులో తరుణిరోనీకుంటె అక్కడికి పొమ్మనెనూ
ఆక్షణము సభలోను అక్షయమ్ములలోను రావణుడు గొలువుండగా
అసురులు రావణుడు జూదమ్ములాడగా అంతటనిలుచుండెను
నీసిగ్గుయెవ్వడే పుచ్చుకొన్నవాడు నీముక్కుగోసినాడు
కాంతరోజెప్పవే కడువేగిరమ్మునా యుద్ధమునకుబోయెదనూ
అనియిట్లు రావణుడుయడుగగా చుప్పనాతన్నరో వినుమానెను
మండోదరికన్న మఱిచక్కనికన్య లోకానలేదురన్నా
ఇందరిస్త్రీలలో వెదకిచూచినగాని అటువంటి కన్యలేదు
ప్రొద్దున్నెపోదురు మాపటికివత్తురు మరిదిక్కులేదురన్నా
ఏవిధంబునయిన వానిసతిని నీవు తెచ్చుకొమ్మని పలికెనూ
వెండయ్య చారలాభమిడయ్య లేడియయి మారీచుతావచ్చెనూ
నన్నుబంపుముదేవ నేబోయి సీతను దోడిదెత్తును వేగమే
నీవుబోయిముందర ఆడుతూయుండుమా నేపోయిదానిదెత్తు
వెండయ్యకొమ్ములా భమిడయ్య లేడియయి పర్ణశాలన యాడెను
అమృగమునుజూచి పట్టితెమ్మనిపలికి తాను పతికిమ్రొక్కెనూ
యామృగమును తనకుపట్టి యివ్వకుంటే తనప్రాణములుండవు

వెంటనే రాఘవుండు లక్ష్మణునిబిలచి యిట్లాని పలికెనపుడు
అసుర మృగామది అరచితేనీవు రావద్దని పలికెనపుడూ
విల్లునంబులు దొడిగి ఈటెలు దీసుకొని మృగమువేటకు వెళ్ళెను
గుంటలకుగ్రుంకేను మెట్టలకు యెగసేను కారడవికే తీసెనూ
అప్పుడు శ్రీరాము ఉగ్రకోపమ్మునా అగ్నిబాణమువేసెనూ
హాసీత హాలక్ష్మణా యనుచు బలుకుచు తన ప్రాణములువిడిచెనూ
హాలక్ష్మణాయనుచులేడి యప్పుడు తనప్రాణములు విడిచెనూ
అన్నన్న లక్ష్మణా అడవిలో మీయన్న కతిభార మయ్యేనయ్యా
అడవిలో మాయన్న కతిభార మయితేను చుక్కలే పిక్కటిల్లూ
చుక్కలుపిక్కటిల్లు సూర్యుడు వణకును పగలెల్ల రాతిరవునూ
ఇహములు యింకును జగములు చెడిపోను రాఘవుల కొపదేమీ
తమ్ములు కారయ అన్నలు చస్తైను గాపురమ్ములు జేతురు
పట్ణమంతాలాగి భరతుడు బంపించె యరణ్యావాసములకు
రాజ్యమతడు గోరెనను నీవుగోరుటా యిదినీకు న్యాయమవునా
చేను దున్నినవెనుక చేనువెంబడిబీడు చేలోదికాదుటవునే
తాటాకుమంటవలె పలికెను లక్ష్మన్న యేడుగిరులేవ్రాసెను
యెంతపని నీకున్న అమ్మరో నీవయిన యీగిరులు దాటవద్దు
అనిచెప్పి లక్ష్మన్న యేగెనె తనఅన్న వెళ్ళినాజాడపట్టి
అగ్గంబు ముంతకు వుగ్గంబు కట్టుకొని పచ్చబెత్తముపట్టుక
పెదవులు దడవుచు పేదబ్రాహ్మణుడువలె వారభిక్షలు అడిగెను
కటకటయిదియెంత కర్మమొచ్చిందని పండ్లుదోసిటబెట్టెను
పాపిష్టి రావణుండు పదితలలుచూపితే పడిమూర్ఛ తాబోయెను
అదయశూలముదెచ్చి గెడ్డపెల్లగించి రథముపయి బెట్టుకొనెనూ
నవ్వుచూవాడును నాలుగుయోజనాల్పొడవు సీతయెత్తుకపోయెను
ఆడుచువాడును నాల్గుయోజనాల్పొడువు నాతినెత్తుకపోయెను
సగముదూరముబోవ నప్పుడు జానకీమూర్ఛలయినా దెలిసెనూ
గోడుగోడుమని ఘోషింపుచునుసీత లంకకేచేరవెళ్లెను
శ్రీరాములాదేవి సీతచేరవెళ్ళెనని సిరివిన్నవించలేదా
మున్నూటరువది నోములునోచితి విష్ణుక్రాంతానోచితీ
సంధ్యాలవెన్నెలా జ్యోతిగావించుకొని వడిగట్టుచూనోచితీ

ఆడరానిమాట ఆడితినిలక్ష్మణుని యాదోషమే తలిగెనూ
అనిసీతదుఃఖించి రావణునితోకూడ  లంకకేచేరవెళ్ళెను
అప్పుడు లక్ష్మణుడు అతివేగిరమ్మునా అన్నవద్దకువచ్చెనూ
ఏమోయిలక్ష్మణా సీతవిడచిపెట్టి యీలాగువచ్చినావు
మాయామృగంబులు మరి యడవిలోపల నొంటిగావిడిచొ_స్తివి
అవశకునమ్ములు అడవిలోపలనాకు పెక్కు_లు గానవచ్చె
లక్షబెట్టకతాను తమ్మునితోడను పర్ణశాలకువచ్చిరి
చిలుకశాలాలన్ని చిన్నబోయున్నావి వనితలేదుర లక్ష్మణా
పగడశాలాలన్ని చిన్నబోయున్నావి పనితిలేదుర తమ్ముడా
పణతినొక్క_తివిడచి యేలాగువ_స్తివి పర్వతమ్ముల నడమికీ
పర్ణశాలా విడిచి యేలాగువస్తావి పర్వతమ్ములనడిమికీ
పర్నశాలావిడిచి వెళ్ళకాపదిలాన యుండుమంటిని లక్ష్మణా
అన్నమీరు మళ్ళిరాకుండగా సీతఅంపగా నేవచ్చితి
ఆడవారిమాట అసురబుద్ధనుచునే వినవద్దు రాఘవంటే
మృగమువెంటనీవు వేటకుపోగానే నిలువనియ్యదు జానకీ
శ్రీదేవిమాటకు తొలగితొయ్యాలేక శ్రీఘానవిల్లుదె_స్తీ
వన్నెచక్క_నిలేడి పట్టిదెస్తామని వస్తినోయి లక్ష్మణా
అజుడు యెంతటివాడు యెంతవిద్యాపరుడు యింతేసివారలన్న
అజుడువ్రాసినవ్రాలు తప్పదూయందురు తొలియేమిజేసినానో
గంధపుకస్తూరి కలయమెఱపులచాయ గాంతజానకీదేహమూ
వినవోయిలక్ష్మణా రాజహంసలతీరు కలికికోమలి పలుకులు
యెండవానలజాడ యెన్నడూ యెఱుగాదు యెదేశముకువెళ్ళెనో
యెలమితో బంగారుమేడనుండెడి సీతయేనీడలా నిలిచెనో
అన్నాహారము నిద్రగలుగునో కలుగదొ ఆకలి బడియుండునో
ఆసురుసురు మనగాను కల్పవృక్షముక్రింద కామధేనువు జూచెనో
సురులార మునులార సూర్యచంద్రులార సుదతి నెక్క_డజూపరూ
తరులార మునులార తామరకసులార సత్వాంగపక్షులారా
ధరణి యాకాశమా ధర్మదేవతలారా ధరణిజేదారి వెళ్లె
అతివసీతా తనకు అన్నసౌఖ్యములు ఆరగించాబెట్టెను
బాలపడుచూవలె బాయదుర తొడలపై బాలనెక్క_డజూతును

సీతకోసరము మనము చిన్నబోయుంటేను సృష్టంత యేలగలమూ
సప్తసముద్రాల నడుమ వెదకుదము బ్రహ్మతలలే దుర్గింతము
అక్కడ జానకీ అడలుతు తానపుడు విలపంపగా దొడగెను
అత్తగారీమాట విని అయోధ్యవెడలితిమి ఆరణ్యమునకొస్తిమి
సారమయిన పిండి తేనెలారాగించి నారచీరలు గడితిమీ
కందమూలమ్ములే గంగరేగూపండ్లు మాదీఫలములు తింటిమీ
పారుటాకులవిడియం పారుటాకుల పసుపు పారుటాకుల పాన్పుపై
ఏమిసేయుదు తల్లి యెఱుపయిన భూదేవి యెన్నడెరుగని యాడుది
కైకసంతోషాన కడలేని యాపదలు కరుణించదొ దైవమూ
మాయవేషంబునా మాయమంత్రింబునా మటుమాయజోగివచ్చె
పంచరాత్రులు పస్తు ప్రాణాలు నిలుపుమని పరమభిక్షలు యడిగెను
ఆకొన్న తపసికీ ఆపాపి రావణునికి ఆరగించా బెటితిని
ఆపాపి రావణుడు పదితలల జూపితే పడిమూర్ఛలే పోయితి
ఆశూలముతోను పెల్లుపెల్లాగించి రథముపయి పెట్టుకోని
కొండలు గోపెట్టె ధరణి తల్లాడించే ఆకాశమంత వణకె
ముక్కోటి దేవతలు చుక్కలుదీప్తులయి సూర్యచంద్రులు వణకిరీ
రఘురాముడంటె నావయినతేయుడువచ్చి రావణుని అడ్డుకొనెనూ
ఓరి రాములదేవి నేల తెస్తీవని రథముగూలాదన్నెనూ
యెగసిపోయెడివాణ్ణి యేడుయోజనాల్ పొడవు వయినతేయుడువేసెను
తెక్కలు పట్టుకొని భూమిపయి రావణుడు కూలగా తావేసెను
బొందిలో ప్రాణాలుపోకుండ వుండుమని జానకీదీవించెనూ
శ్రీరామచంద్రులకు వేగమే జెప్పమని జానకీ తాబలికెనూ
తగదప్పులుగొని దాహములు గయికొవి తల్లడింపుచు పోయెను
చేడెరోతొలియేమి చేసితినో ద్రోహాలు జేజింతలులేవుగా
నరమాంసమదియౌను లంకసిరిభూతాలు లంకవేల్పులుకలరుగా
వేగుచుక్కవినుమ వెడలు శృంగారు బంగారుబొమ్మ వినుమా
తీగమెఱుపా వినుము చీకటింటద్దమా వీభీషణునిపుత్రి వినుమా
వంటిభూషణాలు సుగ్రీవు పర్వతానవేసి నేనువచ్చితి
శ్రీరామలక్ష్మణుల కిచ్చునో యివ్వడో ఆకబురు తెలియదాయె
జటాయువునకు ప్రాణాలునిలిపి తావచ్చితిని ఆకబురు తెలియదాయె

అనిసీతచింతించి కన్నీరునింపగా ఆకాంతయిట్లానెను
చందమామచెల్లెలా శ్రీమహాలక్ష్మి మన్మధుని జనని వినుమా
వెన్నెలాప్రొద్దుకూ వేగబంటువచ్చు సీతరో చింతించకూ
అడవులు గడచియు ఆరామలక్ష్మణులు సుగ్రీవువనమువచ్చి
హనుమంతునిజూచి ఆరామలక్ష్మణులు సుగ్రీవుని యేలిరీ
వాలినిగూల్చియూ తారనుగూర్చియూ సుగ్రీవునకు గట్టిరీ
పట్టంబుగట్టుకొని పదిలానయేలెనూ అంగదుల జాంబవులకు
హనుమంతుని బిలిచియో ఆరామచంద్రులు ముద్రికను చేతికిచ్చె
జగములువెదికియూ జానకినిజూచియూ వేగరమ్మనిపలికెను
అంబుధీదాటియూ అసురులనుజూచియూ ఆలంక కేవెళ్లెను
వచ్చెనేలఆలంక రవిసోమవీధులు రాజవీధులు చూచెనూ
భద్రంపుచావిళ్ల బలువయినమేడలు పంచటరుగులు జూచెను
చిత్తరపుచావిళ్ల చిరుమల్లెశాలలు పిక్కటిల్లి జూచెను
ఒప్పయినఅర్రలేవో మల్లెశాలలు అక్కడిల్లె జూచెను
ఉన్నతావుజూచి మిద్దెటిల్లుజూచి పూరంత జూచివచ్చె
రావణుడుయుండేడి రత్నమేడలుజూచి రాజ్యమంతాజాచెను
నేరేళ్ళమారేళ్ళ విప్పలానీడలా సీత చింతింపుచుండె
వెళ్ళెనే రావణుడు వెంటనేనుంగులు గుర్రాలు పరగణాలు
చప్పట్లుబూరలూ తారలూ శంఖులూ ఘోరుగలుగుచువెళ్లేనూ
యేవేళజూచినా రాముడని తలచేవువాడ గట్టినదూలమా
మీయక్క చెల్లెండ్రు మాయింటికి కోడండ్రు మండోదరి మొదలుగా
లంకిణికి గొడబడక సీత జింతింపకూ రఘురామ దలపకనేనూ
వొడబడకయుండుమీ వొకనాటికయినాను యేలుమా లంకనీవూ
మావదినె మారుగా మన్నించి పిలిచేము మాలంకయేలవమ్మా
అష్టదిక్పాలకులు కష్టపడలేక ఆతణ్ని తలవనయిరీ
ఆదిమూర్తనుచు అతిగర్వబడబోకు ఆతణ్ని తలపకనేను
ఆదిబలుకులూవిని అతికోపమ్మునా పూరిచేతను బట్టుక
ఆదిమూర్తినేడు అవతారమైనాడు అయోధ్యలో రాముడూ
పాలసముద్రము మీద శేషశయనుడయి పవళించెనే రాముడూ
క్రూరులనుజూచితా శాపములిచ్చితె పెళ్ళునా పగులు శిరసు

ప్రతివ్రతను జూచియు పలుమారుపలికితే జనకసుత తానె యనెను
దవడలుదాటించి గ్రుడ్లెర్రజేసియు వుగ్రమ్ముతో బలికెను
యెల్లుండిప్రొద్దుకూ అతివకూడాకంబెబలి మహాంకాళి కనెను
లంకిణికి జెప్పెను రావణుడుమళ్లెను యేనుగులు గుఱ్ఱిలతో
చూడవచ్చినవారు తెరువు గానాలేక అచ్చోటనే నిలిచిరీ
రఘురాము డంపినా హనుమంతుడే వచ్చి సీతమ్మను జూచెను
రాముణ్ని దలచుచూ రాజ్యాల గోరింది రాములా సీత యపుడు
రఘురాము డంపినా ముద్రికలు దెచ్చె సీతమ్మ అంపవమ్మా
అందుకొని ముద్రికా అనుమానముతీరె అన్న నీవెవ్వరనెను
వెనుకటి యెన్నడూ అయోధ్య యెరుగవు యేలాగువస్తివన్నా
ఆనవాలునాకు గురుతుజూపించితివి అన్ననీపేరుయేమి
వాలిసుగ్రీవులకు మేనల్లుడను నేను వల్లభుల బంటునమ్మా
ఆవాయుసుతుడను హనుమంతు నాపేరు సీతమ్మనమ్మవమ్మా
వాలినిజంపి మాసుగ్రీవుడేలెను వరుసకల జాంబవులను
పదిలక్ష పదికోట్ల పట్టపురాజులూ పట్టభద్రును యేలిరీ
శ్రీరామలక్ష్మణుల క్షేమాన పొడగని శీఘ్రాన దండుతేండి
ఈలంకచెరగొన్న యారునెలలానుంచి దినమొక్కయేడుయాయె
దినదినాగండాలు దెయ్యాలతోపోరు హనుమన్న జెప్పవయ్యా
రాముణ్నిబాసినే పడరానవస్థలూ పడితి నసురులచేతను
చెప్పరాదోయన్న చెల్లెలాయంటేను చెడ్డమాటలు పుట్టును
వింటివే సీతమ్మ యీబెలయితోచెనే విన్నవేళానుంచియు
రాముడాజ్ఞాలేదు రావణునీ దీసుకొని లంకంత గొనిపోదును
అకలిచేతను అవస్థలు బడితని అన్నము బెట్టించుమీ
యెన్నగల యీకొమ్మ పండొక్కటయినాను ఆనతియ్యవె జానకీ
పట్టితెచ్చినవాని పండ్లుమనకేటికి పదిలాన వెళ్ళుమన్నా
ఒక్కపండూ నాకు సెలవిచ్చితేగాని వెళ్ళలేనే జానకీ
వొక్కపండుతిని యెంటివెళ్ళాలేవు చల్లగా వెడలుమన్నా
యినుపగుగ్గిళ్ళవి విప్పముష్టిపండు అంటరానిగరలమూ
ఓపలేనునేను వోర్వలేమూ మనము వొక్కపండేకోసుకో
సాష్టాంగదండ నమస్కారములుజేసెనూ వృక్షములపై పుతిరిగే

నిమ్మపండ్లుదబ్బ దానిమ్మపనసలు ఖండఖర్జుర ఫలముల్
కొమ్మకొమ్మకు గోటిరాక్షసులుయుండగా గోలుపోయిరి తోటను
కొల్లరావణలంక కోతికొల్లలాడె కొట్టుమనె నాలంకిణి
వనముచుట్టుతిరిగి వనములోపలికొచ్చి నొక్కదెబ్బను తీసెను
ఉరికిరీ రాక్షసులు వురివేగమూతోను కెవ్వునా కేకవేసె
అదికోతికాదయా అలవిగా దెవ్వనికి అహంకార పురుషుడేమో
అవతార పురుషుడో అతడెవ్వడోకాని అలవిగా దెవ్వరికిని
సెలవియ్యి దేవరా లంకిణింజంపెను లంకజొచ్చె నెవ్వడో
సామంతరాజులూ యమదగ్నిమంత్రిలూ ధరనున్న యసురులూను
చుట్టుప్రక్కలవారు చూతామురమ్మని చూచిపారిపోయిరీ
పట్టవచ్చినయట్టి అక్షయకుమారుణ్ణి కాలితాకునజంపెనూ
ఆమాట వింటూనే రావణుడు లేసొచ్చి కొల్వులో గోపించెనూ
ఉక్కుగుండారమ్మ ఉరవరానిపిడుగు ఉదరకామంటరమ్మా
జగతుండారమ్మ జాంబవులదుర్గి విరజాంబవులసేవరమ్మా
ఈడుగల నాయకులు అందరూకూడుకా నింద్రజిత్తువెంటనూ
తప్పటులు బూరలు తారలు పుంఖులూ ఘోరుగొలుపుచు వెళ్ళెనూ
మదపుఏనుగులచేత మట్టిత్తమనుచూను పట్టమూ దరలివచ్చె
బలముచూతామని పట్టుబడు హనుమంతు పట్టపుధరులచేత
యేనూరుజంఝుణి యేకగొలుసులువేసి కట్టిరే కంభమునకు
కొట్టరా దీన్నినే గట్టిగా జెప్పరాకోతి నీవెవ్వడవురా
ఏదేశమునీది యేలాగువచ్చేవు యేడుసముద్రములు దాటి
దాటకను యెంచరా చవిటి కాలువలివిపంగజాపే వస్తినీ
హరిహర బ్రహ్మదులులంటి యీశ్వరులంట అందనీ వెవ్వడవురా
ఆదినారాయణుని బంటునూ నేనురా హనుమన్ననాపేరురా
ఆదిలక్ష్మిసీత నెలదెచ్చినావు అంత్యకాలమురనీకూ
చిన్నబుద్ధులుమాని సీతారామునికిచ్చి దేవతల చెరలు విడువూ
నరుడమాత్రానకు సీతనిచ్చితేను నవ్వరా లోకులంతా
వనచరుడు నీవంటి బంటు నాకుంటేను వొక్కడే బంటుచాలు
మారురాజ్యా మనక మావద్ద కొన్నాళ్ళు కొలిచినిలిచేయుండుమా
రాజ్యంబులొసగము రాజ్యమిచ్చేదనీకు నమ్మినాచెంత నుండూ

సృష్టంతా యేలేటి శ్రీరాములాబంటు నిలువనెవరితరమురా
బందుయీటెలు బలువయిన బల్లెములు బాణాలు ఫిరంగీలను
ఉత్తమయశ్వాలు కొమ్ముఏనుగులునూ వూరికే పారిపోయె
తీర్థమ్మ సాగినట్లు మూకమూకలుగూడి తిరిగి మళ్ళీపోయిరి
మైలాడవాడును మూటలు వేసుకొని మంటచేతా బట్టుక
ఆమంట చూచింది అడలింది యీకోతి అడుగుతోనే నిలచెను
మైలాడయీకోతి మంకుతూ వెరచింది మఱితెండి యీచీరలూ
చుట్టిరిచీరలు తోకవాలమునిండ బాకిపోదు నిండను
తోడనవిపడుగులు తోవులుచుట్టిరి తోకమిక్కిలి పెంచెనూ
పట్టుచీరలుమంచి వోణిలుగుడ్డలూ పరకాలజలతారులూ
మేలయినమగవారి శాల్వలన్నియుదెచ్చి చమురుముంచీ జుట్టిరి
అపరాధదేవరా సరిపోయెచీరలూ యికనొక్కచీరదెస్తే
సీతచీరాయని రావణుడు దలచితే చివుకునా తోకముడిచె
ముట్టించి వడివడి ముందురాలేలెండి మునుపుగొందరి జంపెను
దిట్టిచాటూ దించి ముట్టించినిలచితే దిక్కులను వెలుగాయెను
లంక కాల్చేకొరకు మూల లంకేగట్లు స్తంభాలకడ కొచ్చెను
మ్రానుమీదనుండి సాముద్రిప్పితేను మండిపోయెను పట్నమూ
రావణుడు తనవద్ద రాక్షసుల బిలిపించి యీలగువు జూడగోరి
పట్టితెచ్చినఫలము ఉత్తమ్మలేగాని పట్నమంతా గాల్చెను
చిత్తరువు చదురులేఆమల్లెశాలలే లక్కటిల్లే గాల్చెను
వొప్పయిన అర్రలే వోమంచిమేడలూ పంచటిల్లెగాల్చెను
ఉన్నతావులు గాలె మేడయిండ్లుగాలె ఊరంత గాలిపోయె
సన్నంపు మేడలూ సన్నంపుమిద్దెలు పంచటరుగులు గాలెనూ
రావణుడు యుండేటి రత్నమేడలు కాలె రాజ్యమంతా కాలెనూ
దాసీలు కొందరు చీరలుకట్టుకొని లఘువులోపల కొచ్చిరి
మాకుదిక్కులేదు చూడాలనీవనుచు చేతులెత్తుక మ్రొక్కిరి
అన్నముచేబట్టి అనకనేర్తుమని ఆనతిచ్చెను యిప్పుడూ
వెళ్ళనే హనుమంతు వేడిచల్లారమని నిలచె యంబుధివొడ్డునా
వేడిమొహానికే యెదుట నిలువలేక దారిజేసుకయుండెను
సంతోషమందునా సముద్రుడూ యేతెంచి చల్లార్చిపొమ్మనెను

వెళ్ళేనేహనుమంతు వేగచల్లార్చుకొని నిలిచె జానకిజెంతను
అణిముత్యెముచెంగు మరిరత్నముమ్మారు మారుజాబులు జెప్పుమీ
దినదినాగండాలు దయ్యాలతోపోరు హనుమంత జెప్పవయ్యా
రావణుజంపేసి రాజ్యమంతాగెలిచి తన్ను తోడుకపొమ్మను
ఆనవాలందుకొని సంతోషముగనేడు హనుమంతుదేతెంచెను
సంతోషచిత్తుడయి నీరధీదాటివెళ్ళె సుగ్రీవువనముజొచ్చె
అవునయ్యాకపిరాజ అదుగోనుసుగ్రీవ వచ్చెనెమేనల్లుడు
మీకుమించినపండ్లు మీయాజ్ఞలేకుండ హనుమంతుడారగించె
గోపముతోసుగ్రీవ గోపించిలేచెను కొట్టెదనని పల్కెను
ఆజ్ఞదప్పినవాని అల్లుడనవచ్చునా అడిగితె నేనివ్వనా
వెళ్ళినకార్యాలు జయమాయెగాబోలు వేగమందునవచ్చెను
రావోయిహనుమన్న రామచంద్రులకును మనవిని వినుపింతువూ
అడిగిన సేనలను చెప్పకాపోతేను అతిగర్వుడా నందురూ
ఇనుపగంటాగడలు యిత్తడిబిరుదులూ వీధువీధుల యందునూ
కంచుకట్లాగడలు కత్తులంటీపొగలు కొండమ్మున నుండునూ
మల్లెపూస్తంభాలు మాణిక్యదీపాలు మాపురేపును వెల్గును
ఏవేళకొత్వాలు గస్తుతిరుగుతుండ్రు యేబయిలక్షలమూకతో
లంకజొచ్చితిని రావణుని చూచితిని అక్షయకుమారు జంపితీ
పట్టుబడ్డాచోట భయమెంత లేదాయె ప్రాణములు యెట్లుండెనో
అవునయ్యాహనుమంత అవునంతవాడవు అప్పుడా సుగ్రీవుడూ
అధికసంతోషాన కట్టుకర్గమ్ములూ యిప్పించెనె రాముడూ
వారధిగట్టండి సేనలనుపిలవండి పోవలెను లంకకిపుడు
జాంబవంతుసేనలో విశ్వకర్మున్నాడు సెలవివ్వవో దేవరా
ఏనుగులూ గుర్రాలు వెళ్ళలేకున్నవి సెలవివ్వవో దేవరా
సముద్రునికోపించి పగవాని కూడెనని సంధించెనా బాణమూ
అప్పుడు సముద్రుడు గడగడ వణకుచూ మ్రొక్కిముందర నిలచెనూ
దిక్కెమాకెవ్వరూ దీనులగాపుడి పగవాణ్ణి కానుదేవా
అదుగో సుమత్స్యమో వారధినియది కోటికొండల మ్రింగెను
ఆకొండనూవేగ నీలుణ్ణి యందుకొని వారధిని గట్టుమనిరీ
హిమవంత పర్వతము యింద్రనీలాచలము విశ్వాస సంజీవిని

ఘనమైన కైలాస గోవర్ధనగిరి మహమ్మేరు పర్వతాలూ
సేతుసేనలగాదు సిరిసేన కొండలు చేరవేసిరి కొండలు
అలస్యముసుచేసి యలసినారయితిరో యలసినారో సేనలూ
అరచేతికొండలు యటుపారవేయగా అటుముఖము యేలనయ్యా
సంగాతులముమనము సరిబోయె హనుమంతు నీకునాకును భేదమా
పదిలముగవారధి సంధించికట్టుడి పర్వతములు దాటుడి
ఏనుగామడపొడవు యేకముగజాచేను యంత్రసామగ్రిలతోను
వెడల్పువారధిగట్ట అవిభీషణుడు యన్నతోయిట్లనెను
సీతబుట్టంగానే లంకచెడుతుందని చిన్ననాడేజెప్పినా
వారిబంటువచ్చి వనమెల్లా పెకలించి వనపాలకుల జంపెను
ముక్కంటివిలువిరచి ఆసీతపెండ్లాడి మునుపుజనకునియింటను
తాటకివధియించి చుప్పనాతిముక్కు చక్కగా మరిచూడవా
చతుర్భుజములు గలవు రెండుచేతులవాని చేరితీసుకరండిగా
పగవాణ్నినాతావున పలుమారుపిలిచేవు సభవారుచూడగాను
పరమాత్ముడిచ్చినా వరము తనకున్నదని పాదమెత్తుకతన్నెను
తాక్రొవ్విరావణుడు తన్నెనేయోతల్లి తగనిమాటలాడెను
వేగలేచినవిధి వేళగుణమోగాని బ్రహ్మవ్రాసిన వ్రాలయా
కొన్నాళ్ళకోతలు కొట్టుపడిపొగాను కొడుకునెందుకు తన్నెరా
ఆదివారమునాడు విష్ణుసీతాదేవి అతివచెర విడువమంచే
కొట్టెనోయాతల్లి కోపించనేననుకో పొమ్మనుచు పారదోలె
అనిభక్తితోడనే రామచంద్రులూను నీలంకకధిపతౌను
శరణంటిఅయ్యోధ్య శరణు దశరథరామ సకలజీవుల రక్షకా
మాయన్నరావణుని కపరాధినై వచ్చి హరినన్ను కావుమనెను
పగవార్తలుబట్ట వంటింటికుందేళ్ళు పట్టివీడినగొర్రెలూ
దగచేతులోజిక్కె పట్టివిడువరాదు గుట్టుదెలియగ వచ్చును
యెందుకుమనమాట వినుడు యారావణుడు తెలుసుకొని రమ్మనెను
ఎందరూజెప్పినా యేలనెరగడుబుద్ధి అంగదుడ తెలుసుకొమ్మి
యెలుగుచర్మముదెచ్చి వేసారగాసాకి యెన్నాళ్లు వుతికినాను
అంతకంతకు నలుపు అధికమవునెగాని యెన్నటికి తెల్లబడదు
శునకతోకనుదెచ్చి వెదురుబద్దనువేసి తిన్నగాగట్టితేసు

అంతకంతకు జవుకు యధికమవునేగాని యెన్నటికి తిన్నబడదు
గువ్వపిట్టనుదెచ్చి పంజరములోపెట్టి పాలుపోసిపెంచినా
అదియేల రామరామయని పలుకును గువ్వగువ్వ మనునూ
వేపచెట్టుకుయెంత పాలుబోసినా యెన్నటికిని తియ్యబడదూ
ఎందరూజెప్పిన యేలయెరుగదుబుద్ధి అంగదుడ దెలుసుకొమ్మి
డాముడాముయనుచు ఢణఢణారణభేరి తనకుతానే మ్రోగును
గుబులుగుబులుమని గుండెల్లాజెదరను దండొచ్చెనేదేవరా
రావణుడు రత్నాల గద్దెమీదనుపడెను లంకంత భీతిల్లెనూ
రాయబారమునేడు రాముడంపినాడు అంగదుడు తానొచ్చెనూ
పారకండిమీరు ఉద్దండనరులార యెదటికెవ్వరుబోకుడీ
ఏమిరావానరుడ వచ్చినపనియేమి నీవు యెవ్వరిబంటువు
నిన్నుతోకనుజుట్టి నీరధినిముంచినా ఆవాలిసుతుడనేను
నీలంకగాల్చినా హనుమన్నమాబావ అంగదుడునాపేరును
ముందువచ్చినవాణ్ణి గుడ్డతోకనుజుట్టి మునుయెడు వీధులాను
త్రిప్పించి శృంగారించి పారదోలినాము తిన్నగా పోరయోరీ
బలులేని బలిమినీదెచ్చుకోర ఓరిరావణ బలిమిచూడ
తలకుంచవిరగాడ మంకించిపలికేవు తగువు పొందినబంటువు
హర్షించి మాతావున అయిదుదినములుంటే ఆపగనుసాధింతుమూ
రావణునిచెక్కిలి అంగదుడునొక్కెను రాణువంతా బెదరెను
మకరకిరీటము నాగబెత్తందెచ్చి రాజుముందర వేసెను
చేరలేవనుకొంటి చల్లాగక్షేమాన శాబాసు వచ్చితన్నా
పాపిష్టిరావణుడు పాపాత్ముడువాడు పణతి పంపడాయెనే
చిన్నబుద్ధులుమాని సీతనంపడాయె యేమిసేయుదు దైవమా
కొడుకునూపగదీర పొట్టక్రొవ్వుదీర కండలు బెరికెదను
వేతునోపగదీర వేడికోపముదీర చూడ నెన్నడుగలుగునో
మాబంటుచేతను మండోదరికొప్పు నూడిపించకమానను
కాకబడిరఘురాము కన్నుఱ్ఱచేసితే జగములన్ని వణకును
ఇహములుయింకను జగములుచెడిపోను పక్షులే పారిపోను
చైత్రమాసముప్రొద్దు వెన్నెలుసరిపోయె సేనలందరిబిలువుడీ
ఆదివారమునాడు ఆయత్తపడిరండి నీలంకలోనికనేను

కదలెనే రఘురాము జయమనుచు రణభేరి తనకుతానే మ్రోగెను
గంగనదిదాటిరి గట్టన కుంకిరి గడితలెత్తిరిమూకకు
చిత్తరువు చవుకులో రత్నాలశయ్యపై రావణుడు మండోదరి
పతితరావణుదేవి పవ్వలించిలేచి కలగంటినని బలికెను
యేమి కలగంటివే వెలదిరో జెప్పవే యేమి ఫలముగంటివే
పగరాజులాతలలు పగలకలగంటివా పణతిదక్కాగంటివా
రఘురామునిబలము నణతునని గంటివా రమణిదక్కా గంటివా
మాత్రువంశమువారు అణగిరని గంటివా మగువదక్కాగంటివా
అర్కవంశమువారు అణగిరనిగంటివా అతివదక్కా గంటివా
పగరాజులాతలలు పగిలెననికాదయా పణతిదక్కాకాదయా
రఘురాములబలము అణగెననికాదయా రమణిదక్కాకాదయా
మాతృవంశమువారు మణిగెననికాదయా మగువదక్కాకాదయా
శత్రువంశమువారు చెదరిసనికాదయా చేడెదక్కాగాదయా
అర్కవంశము అణగిరనికాదయా అతివదక్కాగాదయా
ఈ రణమధ్యంబున యీరణభూమిలో సమరమని కలగంటిని
ఇంటి కెదురుగనున్న ఒంటిస్తంభముమేడ కూలెనని కలగంటిని
యున్నట్టిచేమపువ్వు చేతిలో కడియాలు విరిగెనని కలగంటిని
ముక్కునాయున్నట్టి ముత్యములయానత్తు మణిగెనని కలగంటిని
మెడలోనుయున్నట్టి మంగళసూత్రములు జారెనని కలగంటిని
నిన్ను జంపివేసి విభీషణునికి పట్టమని కలగంటిని
యెనభై లక్షలా సేన బలముతోను రావణుడు మేడెక్కెను
పులితోనుతోడెలు పూనుకోవచ్చునా రాబందుతో కొంగను
యెలుకపిల్లితో నెదురాడవచ్చునా నరుడునాతో గెలుచునా
యెనభై లక్షలా గొడుగునీడలలోను రావణుడు నిలుచుండెను
వెంటనెవ్వరులేరు వొంటిగా దండునీబలముజూడుమి దేవరా
దిక్కుయెవ్వరులేరు ధీరుడనియుంటివి బలముజూడుమి దేవరా
వాక వేగులవాడు అక్కడాజూచియు యిచ్చోటికేతెంచెనూ
వోరోరి వేగులవాడ శ్రీరామచంద్రులు యెక్కడదిగిరి
శంకలేకా వానరబలముతో సముద్రపుగట్టున దిగిరయ్యా
దిగులంది భయమొందిరయ్యా గుంపులుగుంపులు వచ్చినారయ్యా

సున్నపు యిసుకతో వారధి నరుజు క్షణానవారధి గట్టిరయ్యా
ఊష్ప అగ్రహారముజేసిన అగ్రహారములు బ్రాహ్మణుల కిచ్చిన
అగ్రంపు చెరగొడుగుల నీడను సుగ్రీవ మహారాజు వచ్చెనయ్యా
యేడుకోట్లవానరబలమూ యెనుబదికోట్ల చెంచితబలమూ
ముందర పయనము నడచిన అంగద మహారాజు వచ్చెనయ్యా
పచ్చనిబంటూ జంబునీ గట్టివచ్చా విల్లుచేతాబట్టి
పట్టుగొడుగుల నీడలవాడు పటాలనీలుడు వచ్చెనయ్యా
భూమికిముందర నరికినవాడు దుబుల్‌మని సైన్యముతోను
యెనభై కోట్ల వెలుగులరాజు జాంబవంతుడు వచ్చెనయ్యా
లంకమూడుచుట్టులేజుట్టిన లంక వాకిటను లంకిణిజంపిన
లంకచూడ రణరంగము పెరిగిన బింకపడి హనుమాను వచ్చెనయ్యా
పువ్వుపేరే జాజిపువ్వు పురము అయోధ్యపురము
అంబుపేరే రాక్షసవైరే నారిపేరే నాగబాణము
దేవిపేరు సీతాదేవి రాజులే రఘురాముడయ్యా

## యుద్ధ ప్రారంభము

అంతటనింతట కొలువయ్యియుండగనెత్తిరి రఘురాములుయాటా
కదిలున్న లొటిపిటలు బాణమ్ములను కలిసిగానవచ్చిరి యెవ్వరూ
అలనాటి కింకిణి కాశిదేశపురాజు గుందమానసుండు దేవ
ఇన్నూరుగోటలా మున్నూరుజట్టీలు యావచ్చువారెవ్వరూ
మకరకన్నులవాడు జంభిణిరాజు సుషేణుండు దేవరా పల్లకీలు
యెఱ్ఱగొడుగులా నీడల సుందరమైనట్టి రాజులు వీరెవ్వరు
అరువదియారురాజ్యములు యేలేటినీలుండు తావచ్చెనుదేవరా
పాటిలేవాయెను యీదుకొనివచ్చిరీ పట్టజాలరు లంకకూ
ఈవడీనీరంత యేరులయి పారెను యీవచ్చువాడెవ్వడూ
గూడయినచోడాడ గూడమాన్యమ్ములకు వెలుగుటకు రాజు యితడూ
పంతగించివచ్చె జాంబవంతుడవైరి బలవైరి యితడూ
ఏవేళజూచినా పూచినారలపలె యొరలుదీసికత్తులు
యేవేళచూచినా దండులోనంతాను రాముడన్నదివాక్యము
తరతరమ్ములనుంచి గ్రాసములిచ్చితే కొలిచేను రాఘవులానూ

సైన్యాలుగొడుగులు పెక్కాలుబిరుదులు యెత్తినారే గొడుగులూ
యెత్తి పెట్టగజూచి కాకబడి రఘురాము గోడులన్నీ లేపెను
చెల్లెనే మనలంక క్షేమాననుండకా చేటుదెచ్చునె లంకకు
వేడిబాణముదీసి యెగసెనే రావణుడు యేరులన్నీ యింకెను
ఆకాశమే పొడవు ఆవనము మండుచూ అగ్నివర్షముదువచ్చెను
మరపించి రాఘవుడు మేఘబాణము దొడగి అగ్నివర్షనివేసెను
సకలాచార్యుడు అంగమహిమునివచ్చి ఆమర్మమే జెప్పెనూ
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా చక్రధరుడు మొదలుగా
రావణుడు తనతావున శక్తిబాణముదొడిగి సేనలాపడవేసెనూ
రఘురాము తనతావున బాణమ్ముదొడగి నారాణువా పడవేసెను
రావణుడు తనతావు శక్తిబాణమేదీసి లక్ష్మణుని పడవేసెను
హస్తములుబట్టినా విల్లునంబులునేల విడచెలక్ష్మణదేవరా
అతనిముఖముజూచి శ్రీరామచంద్రులు మూర్ఛలయినా జెందెను
సుగ్రీవసుషేణు డంగదుడు జాంబవుడు హనుమంతుడు మొదలుగా
సౌమిత్రినీ కావుమనుచు శ్రీరాఘవులు సేనలకొప్పగించి
రావణునిజూచి యతియుగ్రత్వముగ రక్తలోచనుండయి రాముడు
ప్రాణాలు విడిపింతుననుచు శ్రీరాఘవులువిడిచి రావణునిమీదా
కాలాగ్నిసమయమున ఆరాముతీక్ష్ణ బాణములకోర్వలేకా
పారిపోయిలంకజొచ్చె రావణుడు తన బాష్పములు కురియగాను
అపుడు శ్రీరాములు తమ సేనలజూచి బాష్పములు కురియగాను
పడియున్నసౌమిత్రిజూచి కడుశోకము విలపింపగా దొడగెను
పదునాలుగుయేండ్లు నిద్రాహారములేదు పడియుండ దెన్నడూను
వెనుకనుండుటేగాని యెదటికెన్నడురాడు తొడలమీదికి వచ్చితీ
కైకమ్మ వరములు దశరథుమమ్మడుగ కార్యము వేరాయెను
అడవులకు పొమ్మని అన్యాయమేజేసె అన్ననీపాలిణములకు
హాలక్ష్మణావీర అనిపిలిచెపలుమారు హా సోదరుడయనుచును
శత్రుసంహారకా సౌమిత్రినందనా ఆధార యని పిలుచుచూ
యింకెన్నిజన్మాల తపసునానీవంటి ఆత్మబంధుడు గలుగునూ
వినవోయిలక్ష్మణా సీతవంటిస్త్రీని వడయంగవచ్చుగాని
యరణ్యవాసములు అవనిజకు తనకూను అహారనిద్రలేక

ఇటువంటిసహోదరుడు తనకెట్లుగలుగునో యెన్ని జన్మములకయినా
జడలుకట్టితపసు చరియించినప్పుడు చాలించిపోయెదవా
జడలొల్లక తపసుచరియించి నీవిపుడు యెందుబోతివి లక్ష్మణా
తనజట్టుబట్టుకొని సమరములోనిన్ను గోలుపోతినితమ్ముడా
భరతుపట్టముగట్టి పారిపోదలచితివి పగవాణ్ణిగానునీకు
ఉప్పుకోసమువచ్చి సుగ్రీవుడానేను కర్పూము గోలుపోతి
ఆలికోసమువచ్చి జాంబవంతుడనేను అనుజుణి గోలుపోతి
ధరణిసుతకయివచ్చి నీలుడానేనిపుడు తమ్ముని గోలుపోతి
ఏలోకానికి పోతివోతమ్ముడా ఆలోకమునకునన్ను
గొంపొమ్ము లక్ష్మణా గూడివచ్చితిమి మనము కూడియుండుట ధర్మము
నినువిడిచి యొకగడియ నిలిచినేనుండలేను నీవెంటవచ్చెదను
నిన్ను విడువాలేక నాతోయడవులకు చనుదెంచినట్టి తండ్రి
అయ్యోధ్యకేనిపుడు నేనొంటిగా బోతేను యాప్రజల కేమందును
గురువులకు యేమందు గూడిచదివిన తోడిచెలికాళ్ళకేమందురా
తల్లియయిన కౌసల్యకేమందు నేనిపుడు కయికమ్మకేమందురా
శుభగుణమ్ములుగల సుమిత్రకుయేమందు యెన్నోజెప్పి పంపెరా
పంచభాషలుగల యెరిగియున్న సుమిత్ర గోపించి ననుదిట్టదా
శత్రుఘ్నుగోపించి నన్నేమిదిట్టునో యేమిసేతును దైవమా
రంగయిన ముత్యాలచేరు దిగబడ్డట్టురాలె కన్నులవుదకమూ
మాణిక్యభూషణము మణికలు తామరాక కెదురుచూచుచు నుండెను
ఇకనాకులంకేల యికనాకుయిల్లేల యికనాకుసీతయేల
ఇకనాకుపగనేల నికనాకురణమేల నికనాకుతల్లియేల
అంగదుడు నీలుడు గంధమాధనుడను రాజుదగ్గిరకొచ్చిరీ
ఆరాములు యతిశోకించుచుండగా ఆసుషేణుడు బలికెనూ
రాజీవలోచనా రఘుకులోత్తమమీరు యింత శోకింపనేలా
వాడలునుష్ణముగలదు ఉన్నవీ కనులలో మెరుగునొప్పుగ నున్నవీ
హస్తములలోపలా నాడిబాగున్నదని అఖిలేశ భయములేదూ
నీరమునుబోల అరకాళ్ళున్నవిగాని రాజేంద్ర భయములేదూ
సంపూర్ణచంద్రునీ బోలేటి లక్ష్మణుని ముఖముతేజము జూడుము
గండమో గాత్రమో లక్ష్మణుని కివ్వనూ ఓషధులు దేనంపుమీ

అపురూపసంజీవి ఉత్తరానా కిద్దు సౌమిత్రికి తేబంపుమీ
ఆలస్యమూలేక నోరామచంద్రుడా యోషధులకు బంపుమీ
ఆపలుకులూవిని ఔననుచు శ్రీరామచంద్రులు అపుడులేచి
అంజనీ తేజమ్ము సేనదగ్గరకొచ్చి నిలచియిట్లని పలికెను
అంజనీ సుతురమ్మి వాయునందనవేగ హనుమంత నీవువెళ్ళి
అపురూపసంజీవి ఉత్తరానా గలదు సౌమిత్రికి తెమ్మానెనూ
అట్లైగాక హనుమంతనీవు మాపాలిటి ఆత్మబంధుడవయ్యా
ఆయుష్మంహొమ్మనుచు దీవించి ఆశీర్వచనముజేసెను
పరమాత్మకుమ్రొక్కి పరగునా జనుదెంచి పర్వతాలెదాటెను
ఆసముద్రమూను అవలీలగాదాటి అతివేగమునవెళ్ళేను
హనుమంతు గమనాన అతివేగచిత్తుడయి కడువేగ రావణుడు
కాలనేమినితను అడ్డుగా బంపెను కడువేగసమరమునకు
ధీరముతో సౌమిత్రిని బ్రతికించుకొందునని నుప్పొంగి హనుమంతుడు
అచ్చట సంజీవి గలుగుచున్నది అచ్చటికి నీవువెళ్ళి
ఆదితరమూనుంచి ఈమడుగులోనను యుండుటకు కరుణిస్తినీ
ఆవాయునందనుడు వారధిదాటుగానటనుండు పర్వతములూ
వృక్షములు విరిగెను పక్షులూ తమలోను పారిచెదరిపోయెను
అందున్న వెండిభమిడీ కొండవేడుతు సంజీవినీ వెదకుచును
సంజీవిగనలేక అతివేగచిత్తుడయి కడువిచారం బొందుచూ
హస్తాలు ముడుచుకొని ఆపర్వతాత్ముని ప్రార్థింప దొణగెనంత
ఓపర్వతపు రాజ పరమకళ్యాణుడవు ఔషధమ్మునుచూపుమా
సంజీవికరణము సంధానకరణము విలసిల్లు కరుణానిధీ
సంజీవిసహితముగ అనినాలుగుకొండలు అడుగగా నూరకుంటే
అడిగినా నెరుగునా యీరాళ్లు కరుగునా యీలోకమందు నిపుడు
పెద్దపెట్టునజుట్టి బెల్లుపెల్లాగించె సంజీవిపర్వతమ్ము
సకలలోకాలకే అయినరామునిబంటు హనుమంతు నాపేరునూ
మేరు పర్వతమూ యెత్తుకొనివచ్చెను దమసేన దగ్గరికిని
భాను డుదయాద్రికి పయనమవుచున్నాడు విల్లునంబులు తెమ్మనెనూ
పెద్దవాడుతాను జాంబవంతుడను ఆతావుననిలువగానె
భానుండు కాడుసుమీ పర్వతపురుషుడు ప్రార్థించు శ్రీరాఘవా

వెయ్యకు శ్రీరామ సంజీవిపర్వతము హనుమంతుడేతెచ్చెను
కోపమ్మెదోడను యెక్కుపెట్టినవిల్లు నేలదించెను రాముడు
సంజీవి హితముగ అని నాలుగు ఔషధలు యేరుపరచిరప్పుడు
సంజీవికరణము సంధానకరణము విలసిల్లుకరుణానిధీ
ఔషధమ్ము యనుచు ఆసుషేణుడువచ్చి సౌమిత్రికి బోసెనూ
దీవించిపోయగా లేచెను లక్ష్మణుడు బ్రతికె లక్ష్మణదేవరా
సంపూర్ణచంద్రుని బోలేటి లక్ష్మణుడు బ్రతికె లక్ష్మణదేవరా
తొల్లెక్కడున్నవో ఆపర్వతమ్ములు ఆక్కడానేసివచ్చె
అయోధ్యకేలవో ఆపర్వతమ్ములు అక్కడానేసివచ్చె
అయోధ్యకేలవో నంటివియోరామ రాజ్యమేలా నంటివి
మనమువచ్చుట రణసమరమపుచేగాని మరియొకటిగాదు యనెను
మేఘములచాటున ఇంద్రజిత్తునిలచి బాణముల గురిపించెను
అన్నాహారమునిద్ర పదునాలుగేండ్లొల్లా నాచారపురుషుగాని
అంత నియమావతి యీలోకములోకాని అతని సాధించలేరూ
అంత నియమావతీ యీలోకంబునలేమ యిందుకెల్లాననెను
అన్నాహారమునిద్ర పదునాలుగేండ్లుగల ఆచారపతినినేను
అలనాడిచ్చిన యమృతపాణులును తేవోయిలక్ష్మణుడా
ననియన్న యనుపగా అట్టెతొడతీసియో యమృతపాణులు జూపెను
రావోయి తమ్ముడా హనుమన్నా లక్ష్మన్న యతని సాధించగలమూ
పేరుదెలిసినదాకా నునుక నింద్రాజిత్తు వెయ్యండి వేయికోరలు
యంజనీ తనయుని భుజమెక్కి లక్ష్మన్న యట్టె వెలుగుపోయెను
ఆకాశము పొడుగు బాణములప్పుడు లక్ష్మణుడు తావేసెను
బాణము చాయకూ మేఘముల చాటున యిందృజిత్తు నిలిచెను
ఒక్కబాణముదీసి లక్ష్మణు డప్పుడు మేఘముల తాకొట్టెను
అప్పుడు మైమరచి మేఘనాధుండును లక్ష్మణునికి త్రోవిచ్చెను
మేఘమండలములో లక్ష్మణుండే యపుడు త్రోవజేసుకపోయెను
యప్పుడు హనుమంతు లక్ష్మణుని యెత్తుకొని మేఘములలో నిలిచెను
మేఘముల చాటున యింద్రజిత్తు తాను బాణములు తావేసెను
అప్పుడు లక్ష్మన్న యిందృజిత్తుమీద బాణములు గురుపించెను
మేఘమండలములో మెరుపున్నరీతిగ బాణములు గురిపించెను

నారాయణాస్త్రమ్ము నాభినే సంధించ నింద్రజిత్తుకూలెను
యరుపులు సేయుచు యతికాచుకొమ్మనుచు యతీకాయు డటవచ్చెనూ
చెన్నయినబాణములు బిరుదయిన వడమూక రెక్కకోవులయీా పెలు
గజకర్ణమ్ములూ గోకర్నమ్ములూ ఘనమయిన ఝల్లీ పెలూ
వెంట నెవ్వరులేక శ్రీజానకిని దెస్తే సమరమునకు వచ్చితిరా
పోకుడీ అయోధ్య పలువురు తలచేరు పోనిస్తునా నిన్నునూ
నాయకులముందర దాచినగొర్రెలు యెక్కడికి పోనిత్తురా
చిగురుకొమ్మలచాయ నాలంకపట్నము చీమదూరానిత్తునా
రాల్పుమీ లక్ష్మన్న రౌద్రంబు బాణములు అతికాయుడు వచ్చెను
ఒక్కబాణముదీసి లక్ష్మణుడు వేసెను అతికాయుడే మడిసెనూ
ఆకబురు వింటానే అడలుతూరావణుడు కన్నీరు తాదెచ్చెను
కుంభకర్ణునిమీరు నిద్రలేపుమని యానతిచ్చెను యప్పుడూ
ఏనుగులు గుర్రాలు తెప్పించి తామపుడుయెక్కించి త్రొక్కించగా
తిమ్మయ్యచేతనూ సీసములు గావించి చిలికించి పోసిరపుడు
నిదురసేయగ చిన్ననల్లికరచెనని కుంభకర్ణుడు లేచెనూ
కుంభకర్నునిజూచి గూడినామూకలు గుండెబెదరుచూ బోయిరీ
యేనుగులు గుర్రాలు వెళ్ళలేకున్నాయి కుంభకర్నుని ధాటికి
శ్రీరాములతోను జోడుగాపోరెను కుంభకర్ణుడు యప్పుడు
గురిజూచి రఘురాము కుంభకర్ణునిరొమ్ము గుండెచెదరాగొట్టెను
కుభేరపర్వతమువలె దాను యప్పుడు కుంభకర్ణుడు గూలెను
యిత్తడిగోడలకు నిచ్చెనలు వేసిరీ జొచ్చిలగ్గలనెత్తిరీ
కంచుకోటలమీద కదలిపోయెనుదండు నీలుడు సుగ్రీవుడు
ఛమిడికోటలమీద పట్టాభిషేకమయి రఘురాముడే గెలిచెను
బలువైన ముత్యాలరత్నాలు గద్దెపయి రావణుడు మండోదరి
అందుకొని శిఖపట్టి అంగదుడు యీడ్చెను రావణునిజూపుమనెను
రావోయి యింకేల రాజ్యమంతాపోయె రఘురాముడే గెలిచెను
యమదుర్గిదుర్గాలు నాయకులు దెచ్చిరి స్వామి తానేగెలిచెను
పాసినా అన్నము పదునుకువచ్చునా పాతాళహోమమ్ములో
మండోదరి తాను దుఃఖించగాజూచి రావణుడు లేచివచ్చె
మాణిక్యభూషణా మండోదరీనీవు నామాట కతిచేయకె

బంగారు చిటిపాప బాయలేక నిన్ను పడతి నావెంటరావె
ముదిమివిధవరికమ్ములు రాకుండ మీతండ్రి మునుపువరము నిచ్చెను
పట్టవుదేవివే గుట్టుచెప్పాకుండ మాటమంతులకంతను
మేలయినగుండాము నేలనుతీయించి చుట్టుచుట్టును బారిరీ
అసురులూ రావణుడు శూలమ్ము దీసుకొని వేవేలు పైకొచ్చిరీ
గోతులాలా రఘురామునికి మీరును కొడుకులై వేంచేస్తిరా
కొమ్మకొమ్మలకి నీగంగ రేగుపళ్ళు కొండకొండలనుండకా
తినగతినగా పండ్లు విషమెక్కె నామీద తిరిగిమళ్ళీ వస్తిరి
నాచేతిలోజచ్చి జడిసిపోదురుగాని నమ్మకొని చెడిపోకుడీ
వెండిడామామీలు యేనూరుకోటులూ ఢమిడి వీరణభేరులూ
కంచుగొడుగులులక్ష కమ్మకొని రాగాను పెనుబూరలు మ్రోయగా
లంకపట్ణములోను జగ్గంపుగొడుగులూ నవరత్న సూర్యపటమూ
వింజామర సురటీలు విసరుచు నప్పుడూను మేలుగొడుగులు పట్టిరి
రణమురణము గలిసి రణరంగవీధిలో రైతులిద్దరు పోరిరీ
వెనుకముందుగాను వెయిలక్ష వెయికోట్లు రావణుని యడ్డుకొనిరి
తప్పించుకోయికా తాళదూ ఆయుధము వె యెత్తును నీకోసమూ
రణగోలుచేయగా క్షణము దప్పాకుండు తునకవేసెను రాముడు
కండెరాముని ముఖము పొందుచెమటలుపోసె కరములు వణకదొడగె
శిరసుపోగా శిరసు మొలచుచూయుండెను శ్రీరాముడలసిపోయె
ఏమోయి మీయన్న కెన్నిమాయలు గలవో యెప్పటికి చావలేదు
ఆదేవతలగొట్టి అమృతంపు బానపుడు తెచ్చుకొని నాభియందు
పెట్టుకొనియున్నాడు శ్రీరామచంద్రుడా అమృతము తెగవేయుడు
నారాయణాస్త్రమ్ము సంధించె రఘురాము నాభినే తెగవేసెను
గుడివిరిగి శిఖరమ్ముగూలినచందమున కూలెరావణుడప్పుడూ
బంటుపూలవారు బావిపోగులవారు బంటురాచా కొడుకులూ
పట్టభద్రుని విడిచిపారి పోవస్తిమి యెందుపోతివి రావణా
రావణుడు పోయెనని మండోదరితోజెప్ప మగువ తానెవచ్చెను
మహరాజనేనంత నినుగొలిచియుండగా యెందుపోతివి రావణా
పదిశిరస్సులు నేడు దిగువపొర్లాడెనని పయిదీసుకే వెడలెను
నేలపడుకుంటేను ఒడలు ఒత్తైనని పయిదీసుకె వెడలెను

వీడెనా సంపదలు నారాజ్యభోగములు వీటికెవ్వరు కర్తలో
దయలేదు మీయన్న దగ్గరకుచేరవూ నీకన్న యెవ్వరయ్యా
రఘురాముతోజెప్పి యన్నను జంపిస్తియడలంగ నీకేటికి
వానరాబలమంత లంకలోకిప్పుడు పోకుండనీవుజూడు

లక్ష్మణుడు విభీషణునికి పట్టంబుగట్టుట

తండ్రివరములునేడు సంపూర్ణమైపోయె పోదాము యయోధ్యకు
లక్ష్మణా ఈపట్నం విభీషణునకిపుడు ధారపోసి గట్టుడి
ఎంతయిల్లాలయిన నెడబాసితడవాయె సీతమనకేటికనెనూ
అయ్యోధ్యరమనసీత అయోధ్యలోనుంటె రావణునిజంపనేలా
దేవేంద్రదేవతల చెరలవిడిపించను కానకేజన్మించెను
భూమిపయినాబుట్టినా భూకాంతనాధుడను భువిలోపల లేదుగా
జనకునింటాపెరిగి జానకియాడను జగములోపలలేదుగా
యనియన్నతోజెప్పి జానకినిదెమ్మని చారులనుబంపించెను
చారులుయేతెంచి చేరిమ్రొక్కివారు జానకితో నిట్లనిరీ
రావమ్మజానకి రావణుడుజచ్చెను రాములాజ్ఞయాయెను
చింతమానిసీత సంతోషమునలేచి రాముపద్దికివచ్చెను
సీతనుజూచియు చింతించిశ్రీరాము సీతవద్దని పలికెనూ
ఆపలుకులువిని అతివదుఃఖింపుచు నగ్నిజొత్తును కానుమీ
మంచిగ్రంధపుమానులు గుగ్గిలపు తరువులు చందనపు తరువాలూను
భగభగామండగా భూదేవికూతురు గంగస్నానముజేసెను
పరమపతివ్రత సీతమంటలో జోరగానే పాలజలధులాయెను
ఈశ్వరుడు బ్రహ్మను దేవేంద్రదేవతలు ముక్కోటి దేవతలు
ఆదిలక్ష్మిసీత భాషలే జేయించితి యనుమానముంచకయ్యా
ఆదిలక్ష్మివల్ల దోషములేదని అందరూ బలికిరపుడు
యపుడు విభీషణు డతివేగిరమ్మున పారివచ్చి యానతిచ్చెనక్కడా
ఆదరించీదేవి సన్నములో చని యారగించి వెళ్ళుడీ
మాతండ్రి వరములు మాతల్లికియ్యకా ఆరగించానానెను
తమసేనలాకెల్లా సెలవియ్యుమీ దేవ ఆరగించి వెళ్ళుము
పరమసంతోషాన ఆరగించుమని సెలవిచ్చెను రాముడూ

పాలుపెరుగునెయ్యి పాయసపు జున్నులు పచ్చని పెసరపప్పు
సూక్ష్మమయినా మంచిరాజా యన్నములూ సకలమును వడ్డించిరీ
వెనకసేనంత అరగించిలేచి కరములు కడుగుకొనిరీ
కర్పూరవిడియములు కడుచేత నందుకొని అతిశీఘ్రమున కదలిరీ
రావోయి హనుమంత అతిశీఘ్రముగాను అయోధ్యకు వెళ్ళుమీ
పట్టుమని అంజలి భరతశత్రుఘ్నులకు చెప్పిరమ్మనిపల్కెను
వాయువేగముగాను హనుమంతుడప్పుడు అయోధ్యకు వెళ్లెను
సేతుదాటిరినేడు సీతశ్రీరాములు సంతోషమవి జెప్పెను
అపరసంతోషాన బంగారుపచ్చలా పతకమిచ్చెను భరతుడు
కనువుదుడిచెటివారు కస్తూరికల్లావు జల్లెటివారలూను
యంగనలు యింకను శృంగారించుకొని బంగారు పళ్లెములలో
రంగయిన ముత్యాల హారతుల నిచ్చిరీ రామునిసీతకూను
కయికమ్మ వరములు తమతల్లికిచ్చిరి కౌసల్యనుజూచిరీ
సుమిత్రనుజూచియు తమ్ములనుజూచియు సంతోషమునుండిరీ
యతివేగిరంబునా పట్టంబుగట్టిరి ఆరామచంద్రులాకు
పదివేల వత్సరాల్ రాజ్యంబు చేయుమని బ్రహ్మతాదీవించెను
వచ్చినవారికీ వరుసతోడను రాము కట్నంబు లిప్పించెనూ
కాపుల బండ్లకూ కరణాలకందరికి నాట్యకాంతలకిచ్చెను
సతులతోగూడాను సౌభాగ్యపదవిని సంతోషమయినేలూతూ
వారిస్థానములకు వారందరేగియు వర్ధిల్లుచుండిరపుడు
యీపాటపాడినా విన్నవారికెల్లా విష్ణులోకము కల్గునూ
సిరిసంపదలనిచ్చు శ్రీరామచంద్రులు వైకుంఠమును నిచ్చును॥

# సీత అగ్ని ప్రవేశము

సీతాంగననియేటి పరమపవిత్రకూ । చిత్రించికట్టిరేచిరిపర్ణశాల ।
అమర్చికట్టిరే అడిదంపుశాల । ఆపర్ణశాలకూ పచ్చలాతలుపు ।
తలుపుదీయగనుండె బంగారుగద్దె । శృంగారుగద్దెపయి చిటిచాపబరచి ।
సీతయుశ్రీరాము జూదమాడంగ । వెండికొమ్ములుగల ఆభమిడిలేడి ।
ముచ్చటతోఆపర్ణశాలకేతెంచె । సీతజూతామంటే చీరతెరవన్నె ।
పణతినిజూచితే తొలకరిమెరపు । చిరునవ్వునవ్వుచూ శ్రీరాముజూచి ।
సీతఅప్పుడుబల్కె శ్రీరాఘవులతో । ఓప్రాణనాథుడా లేడిజూచితివా ।
యీలేడిబట్టితే దశరథులపట్టి । యీలేడిపట్టితే కౌసల్యపట్టి ।
యీలేడిబట్టితే శాంతతమ్ముడవూ । యీలేడిబట్టితే సుమిత్రపుత్రుడవు ।
అనిసీతబల్కగారామచంద్రుండు । లేడిగాదేసీత రావణునిమాయ ।
కల్లలెన్నోగలవు కలియుగమందు । మాయలేన్నగలవు మనసీమలోను ।
రావణునిమాయయనిరమణితోబల్క । దనుజమాయలుగావుయినకులాధీశ ।
బ్రహ్మెట్లుజేసెనో బంగారులేడి । ఆడుకొందునుయిమ్ము ఓఅవనినాథ ।
తెచ్చియిమ్మనిసీత పతితోనుబల్క । బాణతూణీరములు తాచేతబూని ।
లేడివెంబడినేగె దశరథసుతుడు । పుడకలుకొరుకుచు పూరిమేయుచును ।
ఆకులుకొరుకుచుగెంతులేయుచును । చంగునదాటుచును చొకళించుచును ।
అడవులన్నితిరిగి అలసటనుజెంది । రాముబాణముచేతరాక్షసుడపుడు ।
హాసీతహాలక్ష్మణాసీతయనుచు । ఆర్తరవముజేసి ధరణిపైదెళ్ళె ।
ఆవార్తవినిసీతదుఃఖంబుబొంది । లక్ష్మణవినవయ్య మీయన్నమాట ।
శ్రీరామవాక్యమేచింతించివినుమా । వేగమేనీవేగి తోడితెమ్మనెను ।
అన్నకేమీభయమువదినరోవినుమా । ఆదిమహావిష్ణు అవుతారమూర్తి ।
అన్నరాఘవులకు ఆపదలుగలవా । యుగములుక్రుంగినా జగములుచెడినా ।
సోమసూర్యులనడక యెప్పుడుతప్పినను । అగ్నికిచెదబట్టినా ఆపదలురావు ।
అతివరోసీపతి వచ్చువేళాయె । పరితాపమొందక పణతిగూర్చుండు ।
అనిలక్ష్మణుడుబల్క వినిసీతతాను । ఆగ్రహంబునపల్కె మరదితోనిట్లు ।
అన్ననుభరతుడు అడవులకుబంపె । అన్నజచ్చిననన్ను హరియింతువీవు ।

సవతిబిడ్డలకిట్టి స్వామిద్రోహమ్మ । చేయంగదలుచుట స్థిరబుద్దేసుమ్మి ।
సీతపల్కినమాట శ్రీలక్ష్మణులకు । కర్ణశూలమ్ములై నాటినట్టుండె
అగ్నిమంటలుబుట్టె నాలక్ష్మణులకు । గిరిగీసి ఆనెట్టి బాసలుజేసి ।
కన్నులజలములు కాలువైపార । వనదేవతలకు సీతవలనొప్పగించి ।
అన్నకడకేగెను ఆలక్ష్మనుండు । సన్యాసివేషమున రావణుడువచ్చి
యతిభిక్షబెట్టుమని సతినితానడిగె । యతిపూజజేయుటకు పణితితాలేచి ।
దోసిలితోబియ్యమ్ము తరుణియందివ్వ । యెవరిసతివేనీవు యొంటిగానుండ ,
శ్రీలక్ష్మివానీవు భూలక్ష్మివోను । వనలక్ష్మివోనీవు వొప్పుగాదెలుపు ।
గిరిదాటిరావమ్మ భిక్షమ్ములివ్వ । రాక్షసునిపల్కులు వినిసీతతాను ।
వినవయ్యసన్యాసి విశదముగనీవు । దశరథసుతుడను ధరణిపాలకుడు ।
సూర్యవంశజులగు రామలక్ష్మణులు । తండ్రియానతిమీద తాపసవృత్తి ।
దండకారణ్యాన మేముచరియించె । వచ్చియీపంచవటి నున్నాముమేము ।
హెచ్చయిన ఒకమృగము వనమునకురాగ । మచ్చికతోదాన్ని తెచ్చిమ్మనంటి ।
యిచ్చెదననిరాము డింపుతోతాను । విల్లునంబులుబూని ఆమృగమువెంట ।
వెళ్ళెనుఆఘోరవిపిన భూములకు । హాసీత హాలక్ష్మణని యార్తరవము ।
వినబడినాగుండె దిగులునుపొంది । మరదినిబంపితిని అగ్రజునికొరకు ।
అన్నదమ్ములరాక తడువాయెనని । బలుశోకమునుబొందె పద్మాయతాక్షి ।
చింతింపపనియేమి సీతనీకనుచు । వింతరూపముజూపె విశ్వావసుండు ।
కన్నులుమిరుమిట్లు కాంతకుకమ్మె । ధరణిమీదనుబడి తామూర్ఛబోయె ।
సీతనుపెల్లతో రథముపైనుంచి । శీఘ్రానతాబోయె లంకమార్గమున ।
అంతలోజనకజ మూర్ఛతాదెలసి । హడలుచునందరనపుడు ప్రార్థించె ।
వనదేవతలార యోవనజమ్ములార । ఋషులార నదులార వృక్షంబులార ।
దేవాదిదేవతలు దిక్పాలులార । పాపపురావణుడు పట్టిబంధించి ।
పతిలేనిసమయమున గొంపోవుచుండె । ఆమాటలూవినీ పక్షిరాజయిన ।
జటాయువువచ్చె రథముకడ్డంబు । నిలునిలురావణా నిల్చుండమనుచు ।
బరువైనయుద్ధంబు పక్షితాజేసె । రాక్షసరాజేడ పక్షిరాజేడ ।
ప్రాణావశిష్టుగాదశకంధరుడు । బలిమిమైకత్తితో పడగొట్టికొట్టి ।
పక్షిరాజునుకూల్చితావెళ్ళిపోయె । వానరులున్నట్టి ఋష్యమూకాద్రి ।
వనితంతతాజూచినగలన్నివల్చి । కట్టుపుట్టమునను కట్టగాగట్టి
రాఘవులతోజెప్పుమని రమణితావైచె । లంకకుచనుదెంచిరావణుడంత ।

ఉద్యానవనములో వృక్షంబుక్రింద । అసురస్త్రీలుగొల్వ నాదేవినుంచె ।
తమ్మునిజూచియు రాఘవులప్పుడు । సీతను విడచినీవిటులేలవస్తి ।
అబలఆడుదిగదా విడచిరాదగునా । అన్నపాదములపై నొరిగెలక్ష్మణుడు ।
పాదములపైనున్నతమ్ముని్నయెత్తి । పలుకరించగతను అన్నతోబల్కె ।
హాసీతహాలక్ష్మణాను యార్తరవము । వినుయునుసీతమ్మ తాదిగులుజెంది ।
వింటివాఆమాట మరదిలక్ష్మణ । మాయరాక్షసువల్లరామునకుకీడు ।
పాటిల్లయింకనుసందేహమేలా । వేగవెంచేయుమీ మీఅన్నకడకు ।
అనరానిమాటలు ఆసీతబల్క । మసలకనేవస్తి వసుధపాలకుడ ।
తమ్మున్నిఅనలేక ధరణిజనుదూరి । మాయలేడిని అచ్చటమరణంబుజేసి ।
బాణతూణీరంబులపొదలుమెడివేసి । యిద్దరుఆపర్ణశాలకేతెంచి ।
సీతనుగానకశ్రీరాఘవూలు । కొండగుహలునువెదకె వృక్షములువెదకె ।
అడవులన్నీతిరిగిఅలసిరాముండు । జటాయువునుచూచి చేరితానపుడు ।
వార్తలన్నీదెలిసి వసుధేశ్వరుండు । ఉత్తరక్రియజేసె పక్షిరాజునకు ।
ఆదారిగన్గొని ఆరాజసుతులు । ఋష్యమూకముజేరిరూఢిగానిల్వ ।
వాయుసుతుడూవచ్చితానుబ్రణమిల్లె । ఓరాజపుత్రులు మీరెవ్వరయ్యా ।
రామలక్ష్మణులమురాజసుతులము । ఇక్ష్వాకుకులజులము రక్షోహరణులము ।
పణతినిగోల్పోయి పలుకష్టమొంది । వచ్చితిమియీఘోర విపినభూములకు ।
వాయుసుతుసుగ్రీవు లొప్పుగాగాంచి । చెప్పెనుయినకులు నీవృత్తాంతమెల్ల ।
యినసూనుడు రాముదొప్పుగాగలిసె । వాలినిజంపినీకు వసుధపట్నంబు ।
కట్టినిన్నేలింతు కడుసంభ్రమమున । అగ్నిసాక్షిగాను ఆరాముడపుడు ।
బలుప్రమాణంబులు బాసలుజేసి । ఒక్కబాణంబున వాలినిద్రుంచి ।
కిష్కింధనగరంబు సుగ్రీవునికిచ్చె । సీతయిచ్చిననగలు శీఘ్రానదెచ్చి ।
వాయుసుతుడిచ్చెను వనజనాభులకు । చేడెయిచ్చిననగలు శిరసుననుదాల్చి ।
సోదరులుపటుతర శోకంబునొంద్రి । అంజనీసుతుడగు హనుమంతుబిలచి ।
చంగునవారధి సరగుననుదాటీ । భూమిజజాడల చూచిరమ్మనగా ।
శ్రీరాముముద్రిక చేతనందుకొని । యేగెనుహనుమంతు వాయువేగమున ।
ముద్రికఅందించి మ్రొక్కితానిలచె । చెప్పెనుసతితోడ శ్రీరామచరిత ।
మగువశిరోమాణిక్యంబు చేబూని । రాజుకొల్వుకువచ్చి రావణునిగాంచి ।
లంకభస్మముజేసి లంకిణినిగూల్చి । అక్షయకుమారు నతివేగద్రుంచి ।
మేడుగడియలలోన చేరెశ్రీరాము । వందనంబులుజేసి ముందరసునిలచి ।

సీతక్షేమందెల్పి మాణిక్యమిచ్చె । మాణిక్యము చేబూని యామహారాజు ।
దరిలేనిశోకాబ్ధిలో మునిగితేలి । వానరులబిల్చి వారధిగట్టి ।
లంకముట్టడివేసె రమ్యంబుగాను । అన్నతోకలహించి ఆ విభీషణుడు ।
శరణనిరాగ యాదనుజునిగాచె । అతికాయమహాకాయ యింద్రజిత్తులను ।
యుద్ధములో ద్రుంచెనా విబుధేశ్వరుండు । లక్ష్మణుడుమూర్ఛిల్ల సంజీవిదెచ్చి ।
వాయుసుతుడివ్వగా మెచ్చివరమిచ్చె । రావణునివధియించి లంకపట్నంబు ।
అనుజునికిగట్టెనుదనుజారియపుడు । సీతనుదెమ్మనెను శ్రీరాఘవులూ ।
యిప్పటిరూపమున దెత్తుమాదేవా । పూర్వంపు రూపమున మేదెత్తుమ ।
యిప్పటిరూపంబు తెరగువెరగింపు । కారెనుకన్నీరు కట్టినవిజడలు ।
మాసినవస్త్రములు మరిమురికితోళ్ళు । హృదయమున మొలిచింది ఒకవెదురుమొలక ।
ఆసతిపరపురుషు నెదుటికేరాదు । అనియిట్లు ఆవిభీషణుడు బల్కగను ।
వినిదనుజునితోబల్కె యినకులేశుండు । తొల్లింటిరూపమున సతినిదెమ్మనగ ।
వినికపులందరు జనకజకడకు । వెళ్ళిదండముబెట్టి ఓకోమలాంగి ।
రాములుకోరెను రమణిరమ్మనుచు । శృగారంజేయవమ్మ శ్రీలక్ష్మినీవు ।
అనెడుదనుజునిపల్కు లాలించిసీత । చెరనున్నకన్యలు వెరవెంతురేమో ।
కొలువులోతనపతీ కోపించునేమొ । అనిదేవిపల్కగా విభీషణుండు ।
భయమేమిలేదమ్మ పద్మాయతాక్షి । నవరత్నసొమ్ములు నాతినీవుంచు ।
అనగమహాదేవి అపుడుహర్షించి । సరమమొదలగు తనసఖులనుబిల్చి ।
జాజిసంపెంగాది తైలముతోడ । కర్పూరపునలుగులు ఘణముగాబెట్టి ।
శ్రీగంధమలదుకొని శిరసొప్పనంటి । వెండిగాబులతోను వేనీళ్లగాచి ।
భమిడికలశముతో పణతులందివ్వ । ముదముతోజనకపుత్రి మజ్జన్నమాడె ।
పట్టుచీరలుదెచ్చి పణతులందివ్వ । ముదముతో జనకపుత్రి మజ్జన్నమాడె ।
పట్టుచీరలుదెచ్చి పణతులందివ్వ । ముదముతో జనకపుత్రి మజ్జన్నమాడె ।
పట్టుచీరలుదెచ్చి పణతులందివ్వ । కట్టెనుఆకాంతకడు వేడ్కతోను ।
కన్నులకాటుక కడువేడ్కబెట్టి । నుదుటతిలకందీర్చె యిందీవరాక్షి ।
అద్దాలరవికయు నతివతాదొడిగె । బండారమేలేటి సేవకులబిల్చి ।
తాళాలుతీయించి నాణెంపుసొమ్ము । తొడుగులు భమిడి పళ్లెరాలనుంచె ।
ఏసొమ్ములిష్టమో యెంచుకోతల్లి । గట్టిమట్టెలును కడియంబులును ।
నీలంపుగాజులు కంకణంబులును । గంటలొడ్డాణంబు యాపలకసరులు ।
నవరత్నసొమ్ములు నాతితానుంచె । కర్పూరవిడెమంత కాంతతాజేసి ।

నిలువుటద్దముజూచి అతివచింతించె । రారాజుతన్నింక నమ్మదనిపల్కె ।
నాకుఆభరణాలు యేలయిచ్చితిరీ । దేవరనమించ వచ్చనోలేదో ।
రత్నాలసొమ్ములు విడపింతుమనిరి । విడపించవద్దనె రాక్షసేశ్వరుడు ।
కనకచామరాలు కన్యకలువీవ । దివ్యరథముపైన దేవితానెక్కి ।
వేంచేసెనాసీత రామునన్నిధికి । రథముదిగి ఆసీత వందనముజేసి ।
పరమాత్మ పాదములపై బడెనుసీత । పాదములపైనున్న పణతినటుదీసి ।
తూర్పుముఖముగ తిరిగె శ్రీరామచంద్రు । దేవితూర్పుకుదిరుగ వుత్తరముకేగె ।
వుత్తరపుదిశకేగె యాజనకపుత్రి । ముందరనిలుచున్న సతినిదగజూచి ।
ఆగ్రహంబుతోడ రఘునందనుడు । క్షేమమాకుశలమా యిందీవరాక్షి ।
ఆపాపరావణుని వశములోనీవు । వసియించియుంటివా వైదేహినీవు ।
కోరుమునీమనసు కోర్కెలోడగూరు । అభిషేకపట్నాలు అన్నికట్టిస్తు ।
ఆనందరాజ్యాలు అన్నియేలిస్తు । అనుపతిపల్కులు వినిసీతతాను ।
విసవిసలాడుచు వెలదియిట్లనియె । వేడినారాసములు కర్నములుబొడచె ।
నిప్పుమంటలుబుట్టె నెలతదేహమున । కారానిమాటలు యిటులాడదగునా ।
అనుచుసుశోకించి తామూర్ఛబోయె । మూర్ఛబోవుటజూచి పురుషోత్తముండు ।
కనకరథమెక్కియు కడువేగబోగ । భూపుత్రియాజాడ పొందుగాదెలసి ।
అతిదుఃఖమునసీత హడలుచుబల్కె । పోకుపోకురామ పుణ్యశ్రీరామ ।
ముగ్గురన్నదమ్ముల ఆనసుమ్మనెను । అందరిఆనకు నిలువకారథము ।
యెగిరిపోతూవుండె నంతరిక్షముకు । పోకుపోకూరామ పోకుశ్రీరామ ।
భూదేవిపుత్రికను జనకకన్యకును । నాయానఅనిపల్కె సీతమహాదేవి ।
పరమపతివ్రత సీతపైఆనబెట్ట । పంకజనాభులరథము కదలాదు ।
గడగడవణకుచూ యిందీవరాక్షి । తావచ్చిశ్రీరాము ముందరనునిలచె ।
ముందరనిలుచున్న మగువనుజూచి । శ్రీరామచంద్రుండు సీతతోబల్కె ।
అనుజుడతమ్ముడా ఓయిలక్ష్మణుడ । కుక్కముట్టినకుండ కుదరదుమాకు ।
మాతల్లికౌసల్య వద్దకేతెంచి । ఆలాగుకాకుంటె అంబుజేక్షణ ।
యీమూడులోకాల వారెల్లజూడ । జోలైనగట్టుకొని భిక్షంబుయెత్తు ।
అనిపల్కశ్రీరాము పల్కులువిని । వినిచింతబల్కె విశ్వమోహిని ।
ఆరునెలలుచెరలోన నేనుంటిగాని । అపాపరావణుని నేజూడలేదు ।
పదినెలలుచెరలోన నేనుంటికాని । జనకుడనుకుంటినీ దనుజవల్లభుని ।
అనరానిమాటలు ఆడంగదగునా । వినరానిమాటలు యిటుబల్కదగునా ।

కోరుముఓదేవి కోర్కెలేవయిన । అవనిజమాట్లాడ కటలూరకుండె ।
తమ్మునిబిల్చియు అన్నరాఘవుడు । లక్ష్మణునితోసత్యంబు చేయమనిపల్కె ।
ఇదియేమిచోద్యంబు యినకులధీశా । మరదులతోసత్యాలు చేయుదురాఘనని ।
ఆడజన్మముబుట్టి అజ్ఞానినైతి । గుణ్ణాలలోనయిన పుట్టలేనయితి ।
యేనుగలవలెనేను మరిపుట్టనయితి । బంటువలెనేనుంటె బ్రతుకయినపోదు ।
కపిభల్లూకములసాటి కాకుండనయితి । పక్షులలోనైన జన్మించనైతి ।
తక్కువనోములకు అధికఫలంబు । కోరికలుకోరుతే కొనసాగుపెట్లు ।
పూర్వజన్మమునందు చేసినపూజ । భువిలోనస్త్రీయై పుట్టిందెచాలు ।
భూలోకమాతకు భూమందుబుట్టి । పొలుపుగా జనకునీ యింటనేపెరిగి ।
ఇంద్రాదులెత్తని ఆయింద్రధనస్సు । క్షణమునసువిరచి నీవు చేపట్టలేదా ।
నాడుజనకుడు మీతోయేమనెను చెప్పుమీ । ఇడుమలుబడమనకు యింతెట్లువచ్చె ।
బ్రహ్మాదిరుద్రులు పరమమునులెల్ల । పంచభూతంబులు భాసిల్లుచుండ ।
అష్టదిక్పాలురు అమరులుగొల్వ । సత్యానికధికుడవు స్వామివీరుడవు ।
అనిపల్కు అవనిజ వార్తలువినుచు । అంజనీసుతుడంత నతివేగవచ్చె ।
వాయుపుత్రానీవు వడిగానుబోయి । అగ్నిగావింపుమీ అతిశీఘ్రమునను ।
శ్రీరామపల్కులకు చింతిచితాను । వేగమేచనుదెంచె కారడవులకు ।
అరువై యోజనముల పొడుగైనబెట్టి । నలుబై యోజనముల వెడల్పుపేబెట్టి ।
అగ్నిగుండంవేల్చె నంజనీసుతుడు । చిరితాళవృక్షములు చింతవృక్షములు ।
దానిమ్మలూమంచి దబ్బవృక్షములు । నారికేళాపనస ఖర్జూరతరులు ।
నేరేడుమారేడు ఆమర్రిజువ్వి । వనములన్నీపెరికి తెచ్చెనావరుడు ।
చిరివేళ్ళవృక్షముకు చిచ్చులేబెట్టె । కొల్లలుగనేతులూ కావిళ్ళదెచ్చి ।
ఆయగ్నిగుండాన అమరబోయించె । భగభగమంటలతో పావకుడువెలుగ ।
వచ్చిరివానరులు వైదేహికడకు । రామచెంద్రులసీత లక్ష్మణునివదినె ।
అగ్నిగుండానికే వేంచాయవమ్మ । దశరథులకోడలా శాంతమరదలా ।
అగ్నిగుండానికే వేంచాయవమ్మ । కౌసల్యకోడలా కడుబుద్ధిశాలి ।
అగ్నిగుండానికే వేంచేయవమ్మ । సుమిత్రకోడలా సుగుణసంపన్నా ।
అగ్నిగుండానికే వేంచాయవమ్మ । కైకమ్మకోడలా కడుముద్దరాలా ।
అగ్నుగుండానికే వేంచాయవమ్మ । జనకునికూతురా బహుశౌర్యశాలి ।
అగ్నిగుండానికే వేంచాయవమ్మ । భూదేవికూతురా భూలోకమాత ।
అగ్నిగుండానికే వేంచాయవమ్మ । అనియిట్లువానరులు భూసుతనుబిల్వ ।

తొలకరిమెరుపువలె తాకదలివచ్చె । సీతరాకడజూచి శ్రీలక్ష్మణుండు ।
గడగడవణకెను మరదిలక్ష్మన్న । లక్ష్మణునివణకులు ఆవదినజూచి ।
చింతించుతూబల్కె శ్రీమహాలక్ష్మి । హడలకుమి లక్ష్మణా జడుపేలనిపుడు ।
మిమ్మన్నమాటలు అనుభవంబయ్యె । చేసినపాపమ్ము వండినచద్ధి ।
కుడువకపోమయ్య కొంతకాలమునకు । అగ్నిజొచ్చీనేను వోడితినైనా ।
నెలమూడువర్షాలు కురువవెన్నటికి । అగ్నిజొచ్చీనేను వోడితినైనా ।
శ్రీరామసతిగాను శ్రీలక్ష్మణుండ । అగ్నిజొచ్చీనేను వోడితినైనా ।
జనకునికూతురనేగాను అనెను । అగ్నిజోచ్చీనేను వోడితినైనా ।
భూలోకమాతనరు యీపృధివియందు । అనిపల్కె జానకీమాటలూవిని ।
అష్టదిక్పాలకులుహడలదొడగిరి । బ్రహ్మాదిరుద్రులు ఆవిష్ణుమూర్తి ।
అంతరిక్షమందె హడలుచుండిరి । దశరధులుమొదలగు పితృదేవతలు ।
ఆంతరిక్షమందు హడలుచుండిరి । యింద్రాదిదేవతులు యినుడుసోముండు ।
అంతరిక్షమందు హడలుచుండిరి । ముగ్గురుశక్తులుముందరనిలచి ।
సీతపరిభవమని చింతింపుచుండె । భూమిగడగడవణకె ఆకాశమదరె ।
దశదిక్కులెల్లను చాలకంపించె । గుండమ్ముకెదురుగా సీతయేతెంచి ।
ముమ్మారు ప్రదక్షణంచేసినిలుచుండె । దోసెడుముత్యాలు గుండానబోసి ।
ముందుశ్రీరాములను హృదయమునదలచి । వెయికోట్లజన్మములుయెత్తినగాని ।
గోవిందునాకు పతియుగావలెను । లక్షవేలజన్మములు యెత్తినాగాని ।
లక్ష్మనుండేనాకు మరదిగావలెను । శక్యముకానట్టి జన్మమెత్తినను ।
శతృఘ్నుడేనాకు మరదిగావలెను । అనిపల్కి అగ్నికి వందనంచేసి ।
కొలనుజొచ్చీనట్లు అగ్నిలోజొచ్చె । కణకణలనిప్పులూ కుంకమ్ములాయె ।
పరిచున్ననిప్పులూ పన్నీరుఆయె । దాపిననిప్పులూ చందనంబాయె ।
మండేటినిప్పులూ వడగళ్ళుఅయె । చిలుకలుకోవెలలు హంసలుగుమిగ ।
సీతకుతోడుగా కొలనాడుచుండె । ఒకచక్రవాకములు భేరుండపక్షి ।
సీతకుతోడుగా కొలనాడుచుండె । సింహాసనముమీద సీతగూర్చుండె ।
శ్రీరాముతోసీత భాషింపదొడగె । జయిస్తిశ్రీరామ జయిస్తినగ్ని ।
దశరధలతనయుడా జయిస్తినగ్ని । కౌసల్యతనయుడా జయిస్తినగ్ని ।
కాకుస్థతిలకుడా జయిస్తినగ్ని । సూర్యకులవర్ధనుడ జయిస్తినగ్ని ।
శాంతకుతమ్ముడా జయిస్తినగ్ని । రాఘవులతమ్ముడా జయిస్తినగ్ని ।
లక్ష్మణదేవరా జయిస్తినగ్ని । అనియిట్లుపలికేటి పల్కులువిని ।

అన్నతోలక్ష్మణుడు అడలుచుబల్కె । యిదియేమిచోద్యమో అన్నరాఘవుడా ।
మంటలోమావదినె మాట్లాడుతుంది । అటులనకులక్ష్మన్న అటులనకుమయ్యా ।
ఆడవారికిగలవు అగ్నిమంత్రములు । అలికేరుతుడచేరు ముగ్గుబెట్టేరు ।
మండేటినుంటలకు మారుమసిలేరు । కాగేటియెసరయిన కలియదీసేరు ।
అనియట్లుపలికెడు శ్రీరాములకును । అగ్నిహోత్రునికపుడు అహంకారమొచ్చి
ఆకాశమంతటా పెరిగెనేఅగ్ని । అంతలోభూదేవి అతివేగవచ్చి ।
సీతనుయెత్తుకుని తొడలపైనుంచి । కొమ్మలకునింతింత తెగువగునచెపుమ ।
కోమలిమాసీత కొండికగాదా । సీతయు శ్రీరాములోన గూడకుంటె ।
యింకునుజలనిధులు యిదినిజముసుమ్మి । సీతయు శ్రీరాము లొప్పువినకుంటే ।
ధరమీదపంటలు పండవెన్నటికీ । ఆదేవిపలుకులకు ఆత్మనుపొంగి ।
దశరధుతావచ్చి తనయునితొబల్కె । పరమపతివ్రతసీత పణతీయుసుమ్మీ
పరమాత్మ శ్రీరామ సతిచేకొనుమీ । జానకినీవింక చేకొనకుంటే ।
వుర్వినిలోకములు వుండనేరవుగ । పరలోకములులేవు పరమాత్మమాకు ।
సీతనురావణుడు చెరనుంచుమొదలు । నరకవాసమునందు మేముంటిమయ్య ।
దుష్టరావణునీవు ద్రుంచినదిమొదలు । సురలుమేమందిగా సుఖముగంటిమి ।
ఆదివిష్ణుమూర్తి అవతారమెత్తి । బాధగలనరకములోన నుంచదగనా ।
భూలోకమాతను పురుషోత్తముడా । చేకొంటివామాకు క్షేమంబుసుమ్ము ।
దశరధులమాటలకు అశరీరవాణి । సీతపతివ్రతయని సిద్ధముగబల్కె ।
దుందుభులుమ్రోగెనూ తుంబురులుపాడె । రంభఊర్వసులపుడు నాట్యములుజేసె ।
పుష్పవర్షముగురిసె నాపృథ్వియందు । సీతనుభూదేవి శీఘ్రముగయెత్తి ।
శ్రీరాముతొడలపై సీతనేవుంచె । భూదేవితాగ్రుంగె పాతాళమునకు ।
శ్రీదేవితోగూడి శ్రీరాములపుడూ । ఆనందముపొందె ఆదివిష్ణుండు ।
తమ్ములకపులతో తనసేనతోను । అయోధ్యపురముకు యేగుచుకడగను ।
ఆశబరిఅగ్నిలో అటుచొరబోవ । కావుమనిబంపె అంజనీసుతుని ।
శ్రీఘ్రానశబరికి మోక్షంబుయిచ్చె । నందిగ్రామమునకేగి అనుజుణ్ణిజూచి ।
భరతునిక్షేమంబు బాగుగానెరిగి । తమ్ముడుతానును కనకరథమెక్కి ।
భారద్వజునివిందు బాగునారగించి । అయోధ్యపురమునకు అతివేగవచ్చె ।
జయభేరివేయించె శ్రీరాములపుడు । వాయుదేవుడువచ్చి వసుధంతవూడ్చె ।
వరుణదేవుండొచ్చి తానీళ్ళుజల్లె । ముత్యాలముగ్గులూపెట్టేటివారు ।
రత్నాలరంగవల్లమర్చేటివారు । పచ్చలతోరణాలు కట్టేటివారు ।

వశిష్ఠువామదేవులెదురుగావచ్చి । పట్టపేనుగుపైన శ్రీరామునుంచి ।
పుష్పకారూఢులై పురికివేంచేయ । బంగారుకలశముల గంగతెప్పించి ।
పుణ్యాంగనలెల్ల పొందుగావచ్చి । పాదములుకడిగిరీ పరమాత్మకపుడు ।
పాదతీర్థములంత పైజల్లుకొని । ధన్యులమైతిమని వనితలుబల్కె ।
శ్రీరామలక్ష్మణాభరతశత్రుఘ్న । సీతమహాదేవితో శీఘ్రముగాగూడి ।
పట్టాభిషిక్తులై పొంగుచూనుండె । సుతునికోడలజూచి కౌసల్యాదేవి ।
ఆనందమునపొంగి వోలలాడేను । పుణ్యాంగనలువచ్చి మధుసూదనునికి ।
హారతులుయిచ్చిరీ అతివేడ్కతోను । పణతులుయెవరైన పాడినావ్నినా ।
సిరిసంపదలు యిచ్చు శ్రీరామమూర్తి ॥

# సేతు మాహాత్మ్యము

విఘ్నంబుగాకుండ విఘ్నేశ్వరూడ । దండములనేజేతు దయతోడకావు ।
వాక్కునస్తుతిజేతు వరముమాకిమ్ము । అచ్యుతునికథలెల్ల ఆత్మలోదలచి ।
ఇక్ష్వాకుచరితంబు యింపుగాచెపుదు । పాపంబులూబోను పదవియునుగలుగు ।
లంకందురాముడు లంకేశుజంపి । రావణానుజునంత రాజ్యముననిల్పె ।
సూర్యసోమూలూను యున్నంతకాలం । ఆచంద్రతారకం ఆలంకయేలు ।
పుడమిఆకాశంబు సాక్షిగాయిస్తి । అనురకులాంతకుండగు అన్నపోలకుమీ ।
మహిమీదమాకథలు మానకెన్నటికి । అనుచునుదీవించి అసురేశుబిలచి ।
యేభయములేదని అభయమ్ములిచ్చె । చరబట్టినాస్త్రీల చరలువిడిపించి ।
అష్టసంపదలిచ్చె ఆమగువలకును । వామకరమూచేత వడికోలబట్టి ।
ప్లవంగకులమూచేత బరిమార్చెపగర । మాయబలియుండయిన మేఘనాధుండు ।
మొయిళ్ళచాటున మరిరణముశాయ । మేఘనాధునిజంపె మైథిలీమరది ।
ఆసురకులంబంత హతముగావించె । రాక్షసకులంబంత హరణంబుజేసి ।
ప్రజ్ఞచేకొనిఅంత పార్థివోత్తముడు । అనుజుచేరగబిలిచి అంబులనుయిచ్చె ।
విల్లందుకొనిమ్రొక్కి విజయుండుతాను । శ్రీలక్ష్మణుడుబల్కె శ్రీరాఘవులతో ।
రాఘవాయిధియేమి రాచకార్యంబొ । విమానమెటువయివు వెళ్ళినాగాని ।
బ్రహ్మత్యరూపంబు బాయుటాలేదు । సుగుణాకరుండయిన సుగ్రీవుబిలచి ।
తమ్ముడాడినమాట దగవినుపించె । సూర్యపుత్రానిన్న యసురేశుజంపి ।
లంకేశుతమ్మునికి లంకగట్టిస్తి । పోయినదనుజుండు మరియేలవచ్చె ।
వాలితమ్ముడుఅంత వసుధీశుతోను । కలడుజాంబవంతుడు కడుపెద్ధవాడు ।
భూమికిపూర్వమున బుట్టినావాడు । ఆతనిచేరగబిల్చి ఆనతీయివ్వ ।
యోరామరాజేంద్ర యోకీర్తిసాంద్ర । లోకరక్షకమనవి యాలకించూమీ ।
జగములుయెరుగుదునుయుగములెరుగుదును । సూర్యచంద్రులయొక్కసృష్టియెరుగుదును ।
యిక్ష్వాకయెరుగుదును యినవంశకులము । భరద్వాజూలాది బ్రహ్మఋషులాను ।
సాగరంమొదలుగా సరయుపూనదులు । మేరువుహిమాద్రి మంధరాగిరుల
జన్మాదులెరుగుదును జనకులల్లూడ । నారాయణామూర్తి నాభికమలమున ।
సృష్టిశుడయినట్టి యాస్రష్టబుట్టె । బ్రహ్మలతొమ్మండ్ర బొమ్మసృజియించె ।

విశ్రావస్సనియేటి విప్రునీసుతుడు । పులస్త్యుడనియేటి పుత్రుడొకడుబ్టె ।
పౌలస్త్యపుత్రుండు బహుళపాపిష్టి । దనుజకులామారి తాదర్పకారి ।
యసురకులసంహారి లంకాధికారి । రావణుండనియేడి రాజొకడుబుట్టె ।
భల్లూకరాజుతో పట్టభద్రుండు । విశ్వావసూకులము వివరంబుదెల్పి ।
అంజలిబుద్ధుడయి జాంబవంతుండు । అసురవంశముకదా హరియెరీగింతు ।
విశ్వావసూపత్ని కైకేశియనగా । పతినిపతీగోరెసుతుని ఇమ్మనుచు ।
కాలమెరుగకనీవు కాంతరాదగునా । అసురసంధ్యావేళ అడిగితివిగనుక ।
అసురులనిద్దరా గనుమనీజెప్పె । కూరూపిఅయినట్టి కుమార్తెగనుమి ।
వరునిపల్కులువినీ వనితశోకించి । నాజీవితేశ్వరా నాప్రాణనాథ ।
తప్పులన్నియుగాచి దరిజేర్చునాథ । అనుచుపాదంబడ్డ అతివనూదీసి ।
కంజాసనుండంత కరుణతోబల్కె । వైష్ణవభక్తుండు విష్ణుసేవకుడు ।
వంశవర్ధనుడయిన వరకుమారుణ్ని । యిమ్మగాగల్గుటకు యిస్తినీవరము ।
అంగననెలదప్పె నతివకళలొప్పె । వొకటిరెండూమూడు వసరుగాగడిచె ।
నాల్గవమాసాన నాతికుచమూలు । నలుపెక్కినడుమూను నందముగబెరిగె ।
నవమాసములునిండ నాటర్ధరాత్రి । జెష్టమ్మబోలేటి జ్యేష్టపుత్రూనీ ।
దశకంఠునీగనియె తరుణికయికేశి । జంబుకంబులుగూసె జగములల్లాడె ।
చుక్కలురాలెనూ దిక్కులల్లాడె । సూర్యసోములదీప్తిసంకుచితమాయె ।
కోమలాంగికిబుట్టె కుంభకర్ణుండు । పలలమాహారంబు పడకకూరాజు ।
చేడెనుకన్నాది శూర్పణకయనగ । సురుచిరగుణమణీ శుభశరీరుండు ।
పట్టాభిరామునకు పరమభక్తుండు । వైష్ణవకులజుండు విభీషణుండు ।
గంధర్వులూబాడ అప్సర్సలాడ । సురలెల్లసభమునా సుమవృష్టిగురియ ।
మంగళవాద్యములు మహినిరంజిల్ల । భూమియాకాశములు పుణ్యాత్ముడనగ ।
మూడవపుత్రుండు ముగుదకునుగల్గె । పదితలలరావణుని పరిభయేమిచెపుదు ।
నవకోటిలింగముల నర్చించునెపుడు । దేవాదిదేవతల పట్టికట్టించు ।
వరుణకుబేరాది వాయువీశాన । అష్టదిక్పాలకుల పట్టిబంధించె ।
శ్రీరామచంద్రులకు సీతనిమ్మనుచు । భ్రాతజెప్పినపల్కు పాటిచేయకను ।
కులక్షయమాయె తనకుమాళ్ళతోను । రావణుండనగాను రాక్షసుడుదేవ ।
యెల్లశాస్త్రంబులు తెలిసినావాడు । యజ్ఞాదిక్రతువులూ వొనరించినాడు ।
నీచేతనుజచ్చె నీశాచరుండు । నీచరణద్వయంబట్ట నిర్మలుండయ్యె ।
బ్రహ్మపుత్రుండగు బ్రాహ్మణునినీవు । బలిమినిచంపినా పాపంబుతగిలె ।

భవునిప్రతిష్టించు యోపార్థివేంద్ర । యీతీర్థములయందు యింపొందగాను ।
స్నానజపములుజేసి సంధ్యలువార్చి । పెద్దలకుపిండములు పేర్మితోజేయి ।
భల్లూకరాజుల్లు బల్కుపల్కులకు । శ్రీరామచంద్రుండు చిరునవ్వునవ్వి ।
వాయుపుత్రునివేగ వడిచేరబిల్చి । వారణాశికిబోయి వక్కలింగంబు ।
గరళకంఠునిదెమ్ము గడియలోపలను । అంజలిబద్ధుడయి అంజనీసుతుడు ।
అనుజ్ఞపుచ్చుకుని అటువేగచనియె । అనుజఅవనిజగూడి అయోధ్యరాజు ।
ముచ్చటతోస్నానాలు ముగ్గురూజేసె । గోదానభూదాన మన్యదానములు ।
కోటానకోట్లిచ్చె కోసలేశ్వరుడు । పిండప్రదానములు ప్రీతితోజేసె ।
అరయధనుష్కోటి ఆజలములందు । అనుష్టానవిధియంత అచ్యుతుడుదీర్చె ।
అటుమీదవానర్లు అందరూవచ్చి । ధనుష్కోటిమునుగుతూ ధన్యులామనిరి ।
గోహత్యబ్రహ్మహత్య గురుపత్నిగమన । జారత్వచోరత్వ భ్రూణహత్యాది ।
ఆచారహీనుండు చాడీలకోరు । మునుగవిముక్తియె మోక్షంబులిచ్చు ।
పాపంబులెల్లనూ పరిహారమగును । బ్రహ్మాండనాయకుతో బ్రహ్మదేవుండు ।
సేతుమహత్యంబు చరితంబుజెప్పి । స్రష్టతానేగెను స్వర్గలోకముకు ।
శ్రీకంఠుపూజించ శ్రీరాఘవులు । గురుదేవమాకింక గంధమాధనము ।
శిలవున్నచోటేది శీఘ్రముగదెల్పు । నావిన్నపంవిను నరనాదచంద్ర ।
శుభముహూర్తంబయిన చేరంగవచ్చె । వనచరుడురాలేదు భవునితేలేదు ।
త్రిపురాంతకునియిపుడు తీరుగానిల్ప । అవుసరమయ్యెనూ అనుజుడాచూడు ।
ప్లవగుడొచ్చేదారి పరీక్షించిచూడ । పవమానసుతురాక యనుమానమయ్యె ।
పంచాక్షరీమంత్ర పఠనంబుజేసి । అచ్యుతుడుజపియించె నష్టోత్రశతము ।
నాగభూషణుడుమూడు నయనములవాణ్ని । సైకతలింగంబుస్థిరముగాజేసి ।
గంధమాదనమందు గంగాధరూని । మహాత్మునిమంత్రిమునకు మహిమీదనిల్పె ।
పట్టాభిరాముండు ప్రతిష్టజేయా । జనకపుత్రికజేసె నందికేశ్వరుల ।
కమలదళములబోలు కన్నులాసీత । గౌరినిఅర్చించి గిరిసుతనునిల్పె ।
పార్థివుడుపూజించె పారతీశ్వరుల । అంతలోహనుమంతు డతివేగవచ్చి ।
ఘోరునవనుదెంచి ప్రదక్షిణంజేసి । విశ్వేశుదెస్తినీ వీరాధివీరా ।
హనుమంతుదెచ్చినా ఆశిలనుయెత్తి । హస్తమునబట్టుకొని ఆశ్చర్యపడగా ।
ప్రాణలింగముజూచి ప్లవగపుంగవుడు । ఆహాహశ్రీరామ అయోధ్యవాస ।
దానవాంతకనన్ను దరిజేర్చవయ్య । తప్పేమిలేదయ్య ధరణీశవినుమి ।
వారణాశికిబోయి వడిగనేవస్తి । యేడుగడియలలోన యీశ్వరునిదెస్తి ।

నన్నువృధజేయు టాన్యాయంబుగాదు । అనగనక్కునజేర్చి యంజనీసుతుని ।
పరుషంబులాడకు పార్వతీశ్వరుల । హనుమంతులింగంబు నర్చించిగాని ।
రామలింగనిజూడ నరహంబుగాదు । తీర్థఫలమూలేదు త్రిలోకములను ।
నీలకంఠేశుశీ నిందించితేను । గోహత్యబ్రహ్మత్య శిశుహత్యాది ।
పాతకంబులకెల్ల పాత్రుడై యుండు । హనుమంతలింగంబు దర్శించిగాని ।
శ్రీరామలింగముకు దర్శనములేదు । యినవంశతిలకుండు యీరీతిదెల్ప ।
కోతిబంటూనిల్పె కోటీశ్వరూని । రాక్షసకులమంత నాశమ్ముచేసి ।
రమణియేలిన రాజేంద్రశరణు । పరశురామునిప్రజ్ఞ భంగపరచీన ।
పరవాసుదేవుడా పాదముకుశరణు । రామలింగమునిల్పి యారాజసుతుడు ।
అనుజుఅవనిజతోడ పుష్పకంబెక్కి । కపిరాజుఆదిగా కపులకందరికి ।
లంకేశుడాదియగు రాక్షసులకెల్ల । యెవరివీటికివారు వేంచేయుడనిన ।
అవనిపతిఅయోధ్య అఖిలరాజ్యంబు । పట్నంబుగట్టకా మరిమళ్ళమనిరి ।
శీతారాములా చిరునవ్వునవ్వి । పుష్పకంబెక్కిమీరేతెంచుమన్న ।
కోటానకోట్లయిన భటమూకగద్దు । కూర్చుండస్థలమేది కాకుస్థవంశ ।
విడువకరమ్మనీ విభుడానతివ్వ । అరువై ఆరుకోట్ల వనచరులుయెక్కె ।
దానవర్గముతోను దనుజేశుడెక్కె । వికవికలాడుచు వాలికులమంత ।
మనపూర్వపుణ్యంబు మనపూజఫలము । మహరాజునూజూడ మహిమీదపండె ।
సాగుతూవచ్చేటి స్వామిపుష్పకము । సాగరుండూజూచి సాగిలీమ్రొక్కె ।
యిదిఅర్ఘ్యమిదిపాద్య మిదికానుకనుచు । అసురకులాంతకూ నడుగులాబడియు ।
రత్నములుముత్యములు హారములుయిచ్చె । కమలాక్షి కరములకుకంకణములిచ్చె ।
పగడంపుసరములూ మైథిలీకిచ్చె । రత్నాకరునిబోను రాజుశెలవిచ్చి ।
మహేంద్రిమాదిగా బహుపర్వతములు । నదులునునగరులూ వనసౌధమూలు ।
గడచికిష్కింధకూ కడుచేరరాగ । సూర్యసుతుండగు సుగ్రీవుడొచ్చి ।
మార్తాండవంశజా మాకానుకాలు । అందుకునిఅటుమీద వేంచేయుమనిన ।
హర్షించిఅంతటా ఆసనంనిల్పె । అవనిజతాబిల్చె అంగదునిఅంత ।
క్షీరవాదధిలోన స్త్రీలమిద్దరము । అమరంగబుట్టితిమి ఆదికాలమున ।
తారనాతోడుసుమి త్వరితముగనేగి । అమ్మనుబిల్వంగ సమ్మతిగబొమ్మ ।
వైదేహిపల్కువిని వానరాసుతుడు । వనితన్నుబంపినా ప్రసాదమనుచు ।
వాలిపుత్రుడుగదలె వాయువేగమున । ముత్యంబులమర్చినా ముంగిళ్ళదాటి ।
వజ్రాలస్తంభాల వాకిళ్ళదాటి । కనకనవరత్నాలగడపలూదాటి ।

తల్లినిగనుగొని తనయుండుమ్రొక్కి । జానకీవార్తలూ జననికీదెల్పి ।
అవనిజయెవరనీ అడగితీపయిన । వాలినిమర్దించినా వల్లభులదేవి ।
లంకసాధించినా లక్ష్మణునివదినె । రావణాంతకుడయిన రాఘవులపత్ని ।
మిమ్ముజూడగగోరి మముబంపెనిట్లు । పుత్రుపల్కువిని పూర్ణేందువదన ।
తనయునిదీవించి తాగారవించి । చుంచునుముద్దాడి చుబుకంబుదువ్వి ।
ఆలింగనముజేసె అంగదునితార । అడిగిరిసతివరులు అంగదునిజూచి ।
చచ్చినవారెవరు సమరరంగమున । బ్రతికినవారెవరు బంధువులలోను ।
వానరవనితలా కాన్పులందరిని । చూడుమియంగదపొడగాంచినీవు ।
వాలిపుత్రుడుబల్కె వనితలాతోడ । రావణునికీఎదిరి రణమందునిల్చి ।
కయ్యానజచ్చినా కపివకడులేడు । రాముచేజచ్చినా రాక్షసులలెక్క ।
యమధర్మరాజయిన యెన్నంగలేడు । ఓతారవినవమ్మ వకనాటిపొద్దున్ని ।
నాటికయ్యామంత మామీదసోకె । సౌమిత్రిమొదలయిన సఖులమందరము ।
చచ్చితిమివగరూము సమరరంగమున । అందిప్రాణములిచ్చె అంజనీసుతుడు ।
సంజీవిదెప్పించి సర్వేశుడిచ్చె । జయలక్ష్మిగోరుచును జగదీశుడొచ్చె ।
తప్పకజెప్పితిని తల్లినీతోను । శ్రీపద్మనాభులా చరణంబులాన ।
అంగదునిమాటలూ అంగనలువినియు । కపిరాజుకొడుకుకూ కట్నంబులిచ్చి ।
అడుగులపయిబడిరి ఆనందముగను । తారతనకోడుగులూ త్వరితముగబెట్టి ।
కిష్కింధలోగల కులసతులనెల్ల । పేరుపేరునబిల్చె రారాజుజూడ ।
ఖర్జూరఫలములూ కదళిఫలమూలు । తియ్యమామిడిపండ్లు తీగెద్రాక్షలునూ ।
మెర్కజీడిపప్పు మోహనపుదుంప । మరకతహారములు మాణిక్యసరులు ।
నవరత్నసొమ్ములూ నాతులందరును । కౌసల్యకోడలికి కానుకలుగొంచు ।
కొడుకునుచేయిబట్టి కోటలూదాటి । ముత్యాలుదాపినా ముంగిళ్ళుదాటి ।
రత్నాలుదాపినారచ్చలూదాటి । పుష్పకంగనిమ్రొక్కి పుణ్యవతీలలామ ।
తెచ్చినకానుకలు అచ్యుతునికిచ్చె । పడతీనిజూచియు పంకజాక్షుండు ।
రతిభారతులకన్న రమ్యమయియుప్పె । సూర్యసోములకన్న చోద్యమయియుండె ।
యీరూపుయీరేఖ యేసతీమణులు । పూబోణి నెవరయిన బోల్పంగదరమె ।
గిరిరాజసుతయనీ కొందరందూరు । కంజభవుదేవనీ కొందరందూరు ।
కలకంఠుగౌరనీ కొందరందూరు । యింద్రునిశశియనీ కొందరందూరు ।
చంద్రురోహిణియని కొందరందూరు । అనిఇట్లుపనపరీ జనములుబల్క ।
కనకపళ్లెంబులా కానుకలుఅంది । దీవించెతనమంచి దేవవాక్యముల ।

అమృతానబుట్టిన అంగనామణిరో । యేకించలేకుండ కిష్కింధయేలు ।
అనిసీతబల్కగా నంతలోతార । కాకుస్థతిలకునీ కన్నులాజూచి ।
పాతకులశిక్షించ హితులనూబ్రోవ । సురలనురక్షించి అసురశిక్షించ ।
రాజువయిపుడితివీ ఓరామచంద్ర । శ్రీపద్మనాభుడా శ్రితపారిజాత ।
శ్రీభూమిసుతనెంచ శ్రీలక్ష్మిసుమ్మి । పంకజనేత్రినీ పరిహరించకుమీ ।
యెడబాపుచేయకుమి యిక్ష్వాకుతిలకా । అనియిట్లుఆదేవి పల్కుచుండగను ।
తారకుకట్నాలు తగనిచ్చిపంపె । తారనువీడ్కొల్పి సర్వేశ్వరుండు ।
పుష్పకంపోగాను పణతికినిజూపె । యింతిరోజూస్తివా మీయేడుతాళ్లు ।
వాలినిజంపినా వనమిదీచూడు । చేడెరోచూస్తివా శబరిఅనుకన్య ।
మధురఫలములుయిచ్చి మామరుగుజేరె । జనకజచూస్తివా జటాయునిచట ।
దశరథునిగానెంచి దహనంబుజేస్తి । చిత్రకూటాద్రిపయి చిత్రంబుజూడు ।
అగస్త్యమహామునీ ఆశ్రమంజూడు । దీవించియిచ్చిరీ దివ్యాయుధములు ।
ఆమునిప్రసాదాన అసురలకులమంతా । క్షణమునజంపితిని సందేహమేల ।
అతివరోజూస్తివా అగ్నిహోత్రములు । హోమములుప్రేల్చినా ధూమములుచూడు ।
పుష్పకంబచటచట పొందుగానిల్పి । ఋషియాశ్రిమంబులూ రూఢిగాజూపి ।
జటలనుధరియించి జపమాలబూని । జపముచేసెటిజన్ని గట్లనూజూడు ।
ఒకకాలుభూమిపై ఒనరంగనిల్పి । వూర్ధ్వరేతస్కులై వున్నారుజూడు ।
పులులుమేకలు వొక్కకొలనులోద్రాగి । పిల్లులుయెలుకలు ప్రీతితోగూడి ।
జాతిభేదములేక చరియింపుచుండు । మునులతోగూడియు మునికాంతలెల్ల ।
తాపసులతోగూడి తరుణులుందురూ । పేరయిన రుద్రాక్షపేర్లుధరియించి ।
మణులహారంబులూ మగువలూబెట్టీ । శిష్యతతితోగూడి సతిపతులువుంద్రూ ।
భామినిగంటివా భరద్వాజాశ్రమం । యిందలివృక్షతతి యెందయినలేదు ।
పూలునూఒకకొమ్మ పిందెలొకకొమ్మ । కాయలుఒకకొమ్మ ఫలములొకకొమ్మ ।
యేకాలమునపండ్లు యెడతెగకయుండు । వృక్షములక్రిందనే వన్నెమీరిన ।
పులితోలుచిత్రాసన దర్భాసనములు । ఋషియునుగూర్చుండి రూఢిమనసూతో ।
భూతభీతియునగు వీభూదిసలది । తపముచేయుచునుండు తాపసోత్తముని ।
కోసలేంద్రుడుజూచి కోమలియుదాను । సాష్టాంగదండములు సాగిలీమ్రొక్కి ।
పాదములపయినున్న దంపతులనెత్తి । దీవించెతనమంచి దేవవాక్యముల ।
పితృవాక్యముమీరు గడిపితిరిగనుక । మాతృభక్తికల్గి మహియేలరయ్య ।
యిక్ష్వాకుతిలక మీరీలోకమంత । యేకచక్రంబుగా యేలుమీతండ్రి ।

కులదీపకరులగూ కోమాళ్ళగనుమి । వింటిమికష్టములు కంటిమీమిమ్ము ।
నీచేతజచ్చెనూ నీశాచరుండు । అంజనినుతుడేమొ అక్షయునిజంపె ।
యింద్రజాలకుడగూ యింద్రజిత్తూను । సుమిత్రనుతుడగు సౌమిత్రిజంపే ।
వనవాసకష్టంబు జనకుండెరింగి । పితృలోకముకేగి పిద్రేతువుండు ।
తమ్ముడుకాకుసుమీ తండ్రిలక్ష్మన్న । యెరుగనిదేముంది యోలోకనాథా ।
విందారగించియూ విజయంబుసెయుమీ । పారునిపల్కులు పార్థివుకడువినియు ।
సూర్యోదయంబునాను రుచిరంబుగను । వాహనముతోగూడి వనుధపయినడచి ।
సేతుపుస్నానంబు స్థిరముగాజేసి । ప్లవగరాజూయొక్క పట్నంబుజేరి ।
కపిరాజుసతియుగూ తారమహాదేవి । యిచ్చినకప్పములు యింపొందదీసి ।
యీసేనతోగూడ ఆయోధ్యకరిగి । మాతలువడ్డించ మేమారగించ ।
నిశ్చయించితిమనే నీరజాక్షుండు । క్రమ్మరమహఋషికి రాములిట్లనియె ।
పర్వతంబులుయేవి ప్లవంగకులమునకు । వుదకంబులూయేవి వృక్షంబులేవి ।
మధురంబుగానిమా సేనగయుకొనదు । ఆమిషంబూలేక అసురులుండారు ।
విప్రకులదీపకుడ విందుజేయించు । రామచంద్రుడుబల్క ఋషివరుడుమెచ్చి ।
కాంక్షతోప్రార్థించె కామధేనువను । నున్నపుచిరితొడలు నునుపురోమములు ।
గొప్పవికన్నులూ వనరయినచెవులు । చిక్కనిపాలుగల చక్కనీవనులు ।
కురుచనికొమ్ములూ వంకరాతోక । ఆడబిడ్డాయొక్క యర్రునాకుచును ।
ఋషిచుట్టునూతిరిగి ఋషికినీమొక్కి । పనులేమిగలవాకో పంపించుమనగ ।
కోసలేంద్రునిసేన కోరికలుదీర । సంపూర్ణముగనిమ్ము సకలపాకములు ।
కల్పించెనంతటా కామధేనూవు । పప్పుకూరలుమెండు పాయసాన్నములు ।
కదళీఫలంబులు చూతఫలములును । బూరెలుఘృతమును పొంగళ్ళుగూడ ।
నవరసాన్నంబులు నాధునకుబెట్టి । నాకలోకముకేగె నాగవీరాజు ।
సూర్యతిలకులకు సురకన్యలాచే । వడ్డించిబంపిరీ వనితలందరిని ।
రాజనపుఅన్నంబు అరటిఫలములును । వొబ్బట్లుబూరెలూ వలుపుపప్పులును ।
కందానుచామాది కాయగూరలును । గుమ్మడివడియములు బుడమవరుగులును ।
అడివిపుశిరీకాయ ఆవమామిళ్ళు । కమ్మంగ కాచినాగోవులానెయ్యి ।
మీగడపెరుగులే మంచిమజ్జిగలూ । బంతియువడ్డించ పట్టభద్రుండు ।
హస్తంబుచాపియూ హనుమంతుబిల్చి । ధీరుడవు సుగుణగంభీరుడవునీవు ।
పుత్రుడవుమిత్రుడవు సౌమిత్రికంటె । జలరాశికట్టించి లంకసాధించి ।
రావణున్నిజంపి రామదెస్తీవి । నీఋణముయెన్నటికి తీర్చంగలేను ।

కోరినాపొత్తునా కుడవరమ్మనగ । యిట్లానతిత్తురా యినకులాధీశ ।
వానరబలగములో నేనెంతవాడ । మీపాదసేవకుడ మీపాలిబంట ।
వనచరులనేలేటి మనుజపతిగలడ । మాపూర్వపుణ్యము మాపూజఫలము ।
నేటికిపండెనూ కన్నులాజూడ । కవళంబుయిచ్చితే కుడిచెదానన్న ।
ధరణీశుడంజనా తనయునకిచ్చె । కపియుభల్లూకాది సపరివారముగ ।
కుడిచికూర్చుండిరీ కుదురుగానంత । రత్నాలగద్దియా రామునకువేసి ।
కర్పూరతాంబూలాలును ఋషిదెచ్చియిచ్చె । మౌనినిపీడ్కొల్పి మనుజేశ్వరుండు ।
వీమానమూపైని వేంచేసినంత । రావయ్యహనుమంత పోవయ్యవేగా ।
అభిజిత్తురాకుండ అయోధ్యకరిగి । మహాఋషిశాలలో మనమున్నయునికి ।
శతృఘ్నుతోజెప్పు చింతలేకుండ । కౌసల్యకెరిగించు కార్యమంతాను ।
మరివక్క కథవినుమి మారుతాత్మజుడ । గంగదాటించేటి జాలారివాడు ।
గుహుండనేభక్తుండు బహుగొప్పవాడు । నారాకలేజూచి నన్నుదలచుచును ।
తారకనామమే తలపోయుచుండు । నావార్త తెరిగించి వేవేగజనుమి ।
పనివడితనుబంప ప్రాసాదమనుచు । వాయుపుత్రుడుగదలె వాయువేగమున ।
గృహములోగుహుడంత గృహలక్ష్మితోను । ఆరునెలలాగడపు హరియించిపోయె ।
రాజీవనేత్రునీ రాకలేలేవు । ఘటమునప్రాణంబు లికనిల్పజాల ।
అయోధ్యకన్నాను అనుజులాకన్న । కిష్కింధయేలేటి సుగ్రీవుకన్న ।
జాంబవంతూకన్న విభీషణుకన్న । భక్తుండనానేను పాలించుటకునూ ।
అవనిజపతియగూ నయోధ్యరాము । అఖిలాండనాయకుం డీదినమురారు ।
శ్రీపద్మనాభులూ రాకుండిరైన । అగ్నిజొత్తునుఅనుచు ఆహుతులువేల్చె ।
శ్రీగంధతరువులా చిచ్చుజేయించె । ఆజ్యంబుతెప్పించి ఆహుతియుజేసె ।
పట్నంబులోగల ప్రజలెల్లగూడి । యిదియేమిచోద్యమని యింతులడుగంగ ।
కైకచేబంపువడి కరుణాకరూలు । అడవులకుబోగాను అయోధ్యరాము ।
గుహునికివరమిచ్చు గడుపుదాటెనుగా । గుహునిగుండంబులు అగ్నిజొచ్చుటలు ।
కపినాయకుండంత కన్నులాజూచి । కలవరంబందుచు గుహునితాబిల్చి ।
కరుణాసముద్రుండు కోసలేంద్రుండు । నేటరేపటవచ్చు నీకోర్కెలిచ్చు ।
జాలారిబాలకా ఝుడియంగబోకు । మహిపతివచ్చునూ మనకుసిరులిచ్చు ।
అనుచుఅంజనిసుతుడు అటుమందలించి । సరయువునదిలోన స్నానంబుజేసి ।
అందంబుగల నందిగ్రామంబుజేరి । భరతుపాదంబులకు భక్తితోమ్రొక్కె ।
మ్రొక్కినహనుమంతు మోదమునజూచి । యెవ్వరుయేపూరు యేలవచ్చితివి ।

అనినరాజుతోబల్కె అంజనీసుతుడు । రవితనయ సఖుడనూరాము సేవకుడ ।
అనిచెప్పిరఘురాము డడవికరుగుటయు । రావణాసురులాది రణముగెల్చుటయు ।
భరద్వాజాశ్రమం రాములుండుటయు । అయోధ్యబంపుటా అన్నికుశలములు ।
చెప్పెనుభరతునకు చెవులపండుగగ । హారములుపతకములు రత్నంపుమణులు ।
పవమానసుతునకూ బహుమానమిచ్చె । భరతుడుతమ్మునీ రమ్మనీబిల్చి ।
అయోధ్యపట్నముకు అతివేగబోయి । శృంగారమొనరించు బంగారుతండ్రి ।
అనిబల్కెఅనుజుండు అతివేగబోయి । సాకేతపురమపుడు చక్కగాజేరి ।
తల్లులకునుమ్రొక్కి దీవనలుబొంది । కోటలుపేటలూ మేటిసావిళ్లూ ।
మేడలుసౌధములు మహలులుపందిళ్ళ । పట్నంపువీధులు ప్రాకారములునూ ।
కస్తూరికళ్ళాపు ముత్యాలముగ్గు । నీలపుస్తంభములు నేర్పునాపాతి ।
మరకతములూగ్రుచ్చి తోరణాల్గట్టి । రామురావణకథలు రచ్చసావిళ్ళ ।
చిత్రముగవ్రాయించె చిత్రకారులచే । కుంభకర్ణునిబట్టి కూల్చినావిధము ।
రాక్షసుతమ్మునీ రక్షించువిధము । లక్ష్మణుండతికాయు నణగించువిధము ।
యీరీతివ్రాయించె యినకులేశుండు । అక్కడశ్రీరాము డవనిజతోగూడి ।
కపులుఋషులను రాక్షసులగూడి । వీరోత్తముడంత వేంచేయుచుండ ।
గుహుడనేనని యెక్కకూక వినబడియె । దాసునిమాటలు దాశరథివినియు ।
కౌగలించెనుగుహుని కడుగారవమున । అంతటభరతుండు అక్షియుగమునకూ ।
కనుపించగానేడ్చె ఘనముగానపుడు । అనుజునితాబిల్చి ఆసనంబిచ్చి ।
అయోధ్యపట్నముకు అందరూచనిరి । రాజులమేటియా రామచంద్రుని ।
రాకలువీక్షించి రాజ్యప్రజలెల్ల । అశ్వములుగజములు ఆందోళికములు ।
పతకములుహారములు ఫలములాదిగా । కర్పూరహారతులు కానుకలుగొంచు ।
కాకుస్థునీజూడ కాంతలూవచ్చె । భూతలపతియంత పుష్పకందిగియు ।
తల్లులజూచుటకు ధరణీశ్వరుండు । అతివనుచేబూని అంతిపురికేగి ।
కౌసల్యసుమిత్ర కైకయాదిగా । తల్లులుముగ్గురికి తగుభక్తిమ్రొక్కి ।
తండ్రిమరణములదలచి తాముశోకించి । మహారాజుతనసభా మంటపముకేగె ।
సభవారలందరూ సంతోషులగుచు । రాజమహారాజ రాజదేవేంద్ర ।
రావణసంహార రాజీవనేత్ర । వీరాధివీరుడా విష్ణురూపుడ ।
వెల్లయేనుగనెక్కి వేంచేయుమయ్య ।అనిబల్కెమంత్రులకు అవనీశ్వరుండు ।
కనుసంజ్ఞచేసెను కానిమ్మటనుచు । అంతకంతకుదంతి నందమ్ముజేసి ।
మనవిజేసిరివారు మహరాజుతోను । గజగమనయగు సీతగజరాజునెక్కె ।

వెల్లగొడుగుభరతుండు వినయముతొబట్ట । నురటివిసరుచునుండె శుభలక్ష్మణుండు ।
చిట్టితమ్ముడుబట్టె శ్రీకుంచకోల । వినయముతోజానకీ విడియమందియ్య ।
పదములొత్తుచునుండె యాపవనసుతుడు । మాళవనేపాళ మగధపాంచాల ।
అంగవంగకళింగ ఆంధ్రబంగాళా । పారశీకవిదర్భ బర్బరాగౌళ ।
శింధుకాశ్మీరాది చక్రవర్తులును । తెచ్చిరికట్నములు యిచ్చిరచ్యుతుకు ।
కట్నంబులందుకొనె కపిచక్రవర్తి । దివ్యకిరీటంబు దేవేంద్రుడంపె ।
సర్వమంగళగూడి శంకరుండొచ్చె । వాక్కుశాసనుడొచ్చె వాణితోగూడి ।
పరమదేవతలు దిక్పాలకులంత । వకరయినదప్పక సకుటుంబులగుచు ।
వచ్చిరిఋష్యాది పరయోగులెల్ల । అయిరావతమునెక్కి అమరాధిపతియు ।
దశరథమహారాజు తనవెంటరాగ । వీణవాయిద్యంబు వినుపించుచూను ।
శారదుండనబోలు నారదుండొచ్చె । ముప్పదిమూడుకోట్ల దేవతలు ముదముతోవచ్చె ।
వేలసంఖ్యలకపులు వెనకనున్నారు । దరిలేనిజనముముందర నడచువారు ।
పట్టజాలకజనము పట్టణములోన । తోటలాపేటలా తొలగియున్నారు ।
పట్టణపుకాంతలు బహుసంతసమున । పురుషోత్తమునిపయిని పూలుజల్లుచును ।
మల్లెలుమొల్లలు తెల్లచామంతి । మరువములుదవనంబు మొగలిపూవులును ।
మరిమరిజల్లుచు మందగమనాలు । తిరువీధులన్నియు తామయూరేగి ।
చదురుకువచ్చెను సంతోషమునను । మాకులమువారి కభిషేకమ్మురేపు ।
సేయునురనివిని జలరాశివొడిచె । మావలె శత్రువుల్మాయుమూరనుచు ।
నక్షత్రముల్మానె నభముపయినపుడు । అన్యాయమీరీతి నణగునన్నట్లు ।
అలరుచీకటిబాసె అలరుభాగమున । రాజ్యాభిషేకంబు రామునికిశాయ ।
శుభముహూర్తంబుంచె శుభలీలమునులు । నాల్గువారధులనవసింధు జలము ।
తెప్పించిరంజనీ దేవిసుతుచేత । రాజ్యాభిషేకంబు రామునకుసేయ ।
అభ్యంగనముచేసె నాదంపతులకు । పట్టువస్త్రంబులు కట్టిదంపతుల ।
కుందనపుపీటలా కూర్చుండబెట్టి । బ్రహ్మాదిదేవతలు పరగమునులెల్ల ।
గంగయుదకముదెచ్చి రఘురాముపయిని । అభిషేకమొనరించె అవనీశ్వరునకు ।
సభవారికందరికి సాష్టాంగంబుబెట్ట । దీవనలువుంచిరీ దేవఋషులెల్ల ।
గోదానభూదాన కన్యదానములు । వస్త్రదానంబులు వరభూషణములు ।
విప్రకోటికినిచ్చె వీరోత్తముండు । సంవత్సరముజేసె సంతర్పణంబు ।-
కోసలేంద్రుడుబల్కె కోమలీతోను । రత్నములుహారములు ముత్యసరమూలు ।
రాజీవనేత్రియీ రాణువకుయిమ్ము । చిరునవ్వునవ్వుచూ సీతమహాదేవి ।

వక్షహారమువేసె వాయుసుతుమెడను । విభీషణునిబిల్చి విశ్వేశ్వరుండు ।
నిధులుగలవాడయ్య నీయన్నగారు । దనుజవిరోధిచ్చె తావళంబొకటి ।
వేదాంతసుకుమార విష్ణుస్వరూపా । నిర్గుణపరమాత్మ నిర్మలాకార ।
సకలలోకాధార యసురసంహార । యిట్టిమాటలు యానతివ్వంగదగునా ।
మీయందుభక్తియు మీనామజపము । యినకులోత్తమమాకు యిమ్మనుచుబల్కె ।
యిక్ష్వాకువంశజుడు యిచ్చెనూవరము । కొదువవారికినెల్ల కోరినవెల్ల ।
కానుకలుతానిచ్చె కమలనాథుండు । వానరవీరుండు వృక్షంబునెక్కె ।
పణుగురాతీపయిని పతకంబుయుంచి । పరమాత్ముడుండునని బద్దలుగగొట్టె ।
తారకంలేదని తలపోసిమదిని । వాలిమర్దనుచేరువొక్క లఘువునను ।
వనమునకేగినా వనవాసరామ । తాటకాంతనడయిన దశరథారామా ।
పట్నంబుగయికొన్న పట్టాభిరామ । దాసునిదరిజేర్చు తారకములేని ।
యీతావళంబేల పతకంబులేల । అనుచుపాదంబడ్డ అంజనీసుతునీ ।
కరములరెంటితో గ్రుచ్చియెత్తుకుని । కరుణాసముద్రుండు కపికులోత్తముకు ।
కర్ణములోతారకా మంత్రంబుజెప్పె । రాణువకందరికి రాజుసెలవిచ్చి ।
పుష్పకంబప్పుడూ పురుషోత్తముండు । కుబేరునీకడకు కుదురుగాబంపి ।
అవనిజతోగూడి జనకులల్లాడు । పదకొండువేలేండ్లు పాటిదప్పకను ।
యేకఛత్రంబుగా యేలుచూనుండె । పూబోణులందరూ యీపుణ్యకథను ।
పఠియించిచదివిననూ పాడినావిన్నా । పాపములుహరియించు పదవియునుగలుగు ।

ఆచంద్రతారకం అవినిసుండెదరు ॥

# గుహ భరతుల అగ్నిప్రవేశము

రావయ్యహనుమంత పోవయ్యవేగ । అభిజిత్తుకాకుండ అయోధ్యపురికి ।
మనరాకమనవీటి మహాత్ములకుజెప్పు । కౌసల్యకెరిగించు కార్యమంతాను ।
సుమిత్రకెరిగించు సుగుణమంతాను । వేషమ్ముభరతుడూ రోషమ్ములైనా ।
భావించిహర్షమున భాషించిరమ్మీ । రాజ్యకాముడైన రాజ్యమ్ములిచ్చి ।
ఇక్కడనుందాము యీమునులగొలిచీ । అనియిట్లురఘురామ పలుకగావినుచు ।
వినిజానకిట్లనెను వినయమ్ముతోను । మరియునుగలడయా మనవీటిలోను ।
అధికభక్తుడుగలడు ఆ గుహారాజు । ఓడలుగట్టుకూ కడలేనిగంగ ।
కడువేడ్కనాగుహుడు కడగడుపుతుండూ । ఏతెంచుతాంబేళ్ళ యెత్తిపట్టివాడా ।
కదలకుండాదెచ్చె కమలనాభులను । అల్లనేరడిపండ్లు తేనరటిపండ్లు ।
మామిడిపండ్లును మదనరుచులున్న । పట్టుకొని ఆగుహుడు చనుదెంచినాడు ।
పదునాలుగేండ్లకు రాకుంటిరైనా । అనలముజొత్తు ననుమానమ్ములేదు ।
అనియిట్లుశపథమ్ము జేసియున్నాడు । అంపుడీహనుమంతు నక్కడికివేగ ।
అనియిట్లుజానకీ పలకగావినుచు । హనుమంతునీబిలచి పొమ్మనుచుబలికె ।
హనుమంతుడప్పుడు అతివేగవచ్చి । ముమ్మారువలగొని ప్రదక్షిణముజేసి ।
సాష్టాంగ దండనమస్కారములుజేసీ । అంబరముపైకెగసె హనుమంతుడపుడు ।
శృంగిబేరిలోను గుహుడుతానపుడు । తనయునికిబుద్ధులు చెప్పంగదొణగె ।
రావయ్యతనయుడా రామచంద్రుడా । శృంగిబేరిపురము శీఘ్రముగనేలు ।
అక్షయుడనీవక్ష భవనములనేలూ । శ్రీరామచంద్రుల పాదములనమ్మి ।
జానికీ కరుణకటాక్షముననేలు । భరతలక్ష్మణశతృఘ్నులగొలచి ।
కింకరుడయేలు మాకిరాతరాజ్యంబు । అనియిట్లుతనయునికి బుద్ధులుజెప్పి ।
కాష్టమ్ముపేర్పించె కడుపెద్దపొడవు । శృంగిబేరములోను చిందెములమోతా ।
చిడిబిడిగావేడి చిందెములమోతా । పట్నమ్ములోకంద్రు ప్రభగలుగువెలుగు ।
జాలకర్రలవెంట సఖియలందారూ । ఇదియేవిఘోషయో యెరిగించుమనిరి ।
కైకవరములచేత కరుణాకరులు । అడవులకుజనగాను ఆగుహారాజు ।
ప్రతిజ్ఞచేసినాడు పంచిమికిరాముడు । రాకున్నదానగ్ని జొచ్చెదననుచు ।
నేడుపంచమిగనుక నేడురాకున్న । అగ్నిజొచ్చేటట్టి అరవళియనిరి ।

అక్కడనాగుహుండు అగ్నిజొరగాను । ఇక్కడుండామనకు యిదినీతికాదు ।
ఒకరొకరిమొగములు ఒగిజూచుకొనుచూ । చనుగుడుచుబిడ్డలా ధరణిదిగవిడచి ।
అందుకునికురులువిడి నెరచిక్కుదూలా । కట్టుకున్నబట్టలు ఘనముగనువెలుగా ।
గురిగింజపూసల కొలికిముత్యాలు । కుచములనడుమను సరులుతూలాడ ।
పట్టుచీరలుదెచ్చి పయిమెట్లపరచి । ఎదురుగాదెచ్చిరీ యేడందనాలు ।
అందనాలెక్కమూ అగ్నిపురుషునికి । కాల్నడలఆహుతులు కావలెనుమాకు ।
తిరిగిచూచెను గుహుడుతరుణులవంక । ఎవ్వరూరాబంపి రేలవచ్చితిరే ।
నావ్రతముచెరచనువస్తిరామీరు । అప్పుడుఆగుహుని పట్టంపుదేవి ।
నీతిబుద్ధులుచెప్పి తావిన్నవించె । సతులతోగూడి యికఅగ్నిజొరమనెను ।
అపలుకులువిని ఆగుహుడుతాను । మారుజెప్పకతాను అగ్నిముఖమాయె ।
అగ్నినీజూచి యాదేవునకుమ్రొక్కి । దోనెడుపుష్పముల నగ్నిలోబోసె ।
అగ్నిజొచ్చేటట్టి అరవళిజూచి । అంబరముపైనుండి హనుమంతుడపుడూ ।
అగ్నిజొరకుమిగుహుడ వల్లభుడుబంపె । రాజగిరివీటిలో రాములున్నారు ।
జానకీదేవాన సౌమిత్రిఆన । రణవిజయులైనట్టి రాఘవులఆన ।
భరతాగ్రజులబంట భరతులఆన । అందరీలోనిన్ను ముందరదలచె ।
క్షేమమునవస్తిమని క్షేమములమీకు । అనిజెప్పిబంపెతను హర్షించవయ్యా ।
భూమిలోనేమేమి పోవుచచ్చినను । చచ్చేమికొరగాను సకలజీవులకు ।
బ్రతికినేకొరగాను బంధువులకెల్లా । పేదలకుభరతుండు రాజ్యాధిపుండు ।
అగ్నిలోభరతుండు పడకుండబొమ్మీ । అవధారుఅవధారు అంజనీసుతుడు ।
అవధరించీవేగ నయోధ్యకరిగే । అంగుష్ఠమాత్రుడై యరయంగదొణగె ।
పువ్వులాచప్పరము పూర్వమునట్టి । రంగవల్లులులేని అంగళ్ళుగనెను ।
శృంగారములేని అంగనలగనెను । తోరణమ్ములులేని ద్వారములుదూరె ।
జారుడుచోరుడు చలచిత్తుడగుచు । అవనిగర్జింపుచు పవననందనుడు ।
పురమువారందరినీ చూచుచునుండే । రామునీక్షేమములు రాకలేగోరీ ।
నోములుభక్తితో నోచేటివారు । చేతిమొగిడ్చులు మ్రొక్కి యింతులందరు ।
పాటించిపంతములు పైనడుచువారు । వసుమతితనయను వనలములోను ।
దశకంఠుడనువాడు తరుణిచెరగొనెను । అవార్తలీలగా వినిరితమలోను ।
అచటనుండెటివారు అంగనలుఅనిరీ । రామునివనవాస వ్రతమునేమెంచి ।
అర్ధమర్ధముదినము మధ్యదశమికినీ । సరిపోయెనిన్నటి చవితికినిలెక్క ।
వీటిలోగలయట్టి వృద్ధులుయనిరి । పంచమికిసరిపోయె పదునాలుగేండ్లు ।

తల్లివృద్ధనివేగ తలచిరావయ్యా । తమ్ములనైనను తలచిరావయ్యా ।
మమ్ముదలచవుగాని మాతలనుదలచి । రాకున్నవగచేము రావయ్యావేగ ।
రాజరాజశ్రీ రమ్మనుచుకుయ్యా । కోవిలలుకూసె నోకకోటానుకోటి ।
వాటినెపమేమైన వనములలోను । ఈములక యీభంగి యిట్లుండగాను ।
మరిములకబుట్టింది మనవీటిలోను । పణతులుతమతమాపట్లుదిగవిడచి ।
పారుదురుభరతుణ్ణి పరిహరింపగను । వేసారివిసిగేరు వేళ్లవిరచేరు ।
మెట్టికలువిరచేరు మెట్టెలుగలియ । ఈకీడుగడచితే యీకైకతలలు ।
చెణుకుదామనిచాల చాటేటివారు । వారిధిపండిన వరిముంచినట్లు ।
కైకతాముంచెనే గడియలోగాను । గడియంగరాకుండ కానరాకుండ ।
ఏకళ్లగానక ఆకైకతాను । మంథరతోకైక మరిమేడలోను ।
అంగలారుస్తుండె అనాధవలెను । వశిష్టమొదలైన వరమునులెల్లా ।
మహాఋషులువత్తురే మరికైకతిట్ట । శాంతమ్మపతి ఋష్యశృంగుండుతాను ।
బంధులువత్తురే భరతుణ్ణిగాన । సత్యరూపుడభరత సత్యమ్మనీవే ।
వినవయ్యాభరతుడా నిలచిమామాట । వార్తవచ్చేయుండొస్తునేయుండో ।
పట్టివికాపుమన యిట్టికార్యములు । సత్యమెప్పుడు భువినిసరిగానెయుండు ।
అనియిట్లువశిష్టు డానతియ్యాగాను । వినిభరతుడిట్లులనెను వివరమ్ముగాను ।
ఆదిగురువులుమీరు అయోధ్యకల్లా । అతిక్రమించవెరుతుము అయ్యమీయాజ్ఞ ।
మాఅన్నరాఘవులు అడవిలోపలను । మాతల్లివరములు పాలించగాను ।
పంచమికిసరిపోయె పదునాలుగేండ్లు । చేసినప్రతిజ్ఞ చెల్లబోకుండ ।
నిలుచుటలు యిదిమాకు నీతిగాదయ్యా । ఈశ్వరుడుబ్రహ్మను గురువులుగూడి ।
అగ్నిజొరుభరతుడాని ఆజ్ఞనియ్యాడి । అగ్నిజొరుమనిసెలవు లొసగుటలుగలవు ।
ఊరాడపలకకా ఉత్తములుఉండిరి । పళ్లెరముదెప్పించి పావాలుఉంచి ।
పూజించిపావలకు పుష్పాంజలిచ్చె । సుగంధగంధ దీపమ్ములనిచ్చె ।
ఫలములుగొనిదెచ్చి నైవేద్యమిచ్చి । శిరసునబెట్టుకొని చెయ్యెత్తిమ్రొక్కి ।
దోసెడుపువ్వుల నగ్నిలోబోసె । ముమ్మారువలగొని ప్రదక్షణముజేసి ।
సాష్టాంగదండ నమస్కారముచేసి । అగ్నిజొచ్చేటట్టి ఆరవళిజూచి ।
కౌసల్యవచ్చెనే కడుమోదుకొనుచు । పావకునికడ్డముగ భరతుణ్నిజూచి ।
ఇదియేమిభరతుడా యిట్లేలదలచ । ఈఅగ్నిజొరగాను యిదినీకుతగునా ।
అయోధ్యమహరాజు అగ్నివరములకు । హర్షించడావార్త ఆహుతులువేల్చి ।
మీకొరకుపడినట్టి మాక్లేశములను । రావయ్యాచెప్పేను రామనుజుండ ।

పట్టిగానకరాజు పదివేలయేండ్లు । అపుత్రకుడై యుండె అరువై వేలేండ్లు ।
పురోహితుల పిలిపించిపుత్రకామేష్టి । ఋష్యశృంగులచేత వేల్పించెహోమము ।
పాయసముదెచ్చి యాపరమమునియిచ్చే । పణతులకునిమ్మని పరమమునిజెప్పె ।
వశిష్ఠునిబిలిపించి పరమహర్షమున । ఇంటగలదనమంత ఇలజూరలిచ్చె ।
ఆధారపాత్రలా ఆపాయసమ్ము । పరగగానొక ఋషిపట్టుకొనివచ్చె ।
పణతులజూచిమీరు పంచుడీఅన్న । కొంతకొంతాపంచి కోమలులకిడిరీ ।
అంతానసుమిత్ర యేతేరగాను । దీవించికౌసల్యాదేవి సుమిత్రకు ।
చెయినిండకడదీసి చెల్లెలకుబెట్టె । సవతిపాలిక్కడికి తప్పకుండాను ।
తగువులకువస్తివా చందనగంధి । అర్థమ్ముకడియిందమని పెట్టెకైక ।
కోపించికొంత కడిపొమ్మనుచుబెట్టె । పక్షిసుతుడంద్రు పాయసభేదమంద్రు ।
పాపజాతికైక పదరుచూపెట్టె । పదరుచుబెట్టేటి పణతినీజూచి ।
సమస్తదేశముల వారందరునగిరి । అగడితలనిచ్చేటి అయోధ్యలోనూ ।
ఆగడతాలాడిమేము అనంతమూర్తినీ । జల్లుపసుపాడితిమి సంభ్రమముతోను ।
ఇంటదైవముగొలచి పండినాయట్లు । పుత్రుణ్ణిగంటినే పుణ్యాధిపుణ్ణి ।
రాముడనిపేరుబెట్రి రాజుఋషులెల్ల । కైకయువరమందు కడునొప్పుభరతా ।
జన్మిస్తివయ్యనీపు జగమెల్లవెలుగా । మాకంటెభాగ్యములు మహిమారజేసి ।
సుమిత్రతాగనెను సుతులనిద్దరని । ఎన్నడుచూలాయె యెన్నడుగంటీ ।
ఎన్నడుపెంచితినో యెరుగనేభరతా । నళినయతాక్షుడు నాటికేరాడు ।
కడువేగిరముపెరిగె కౌసల్యసుతుడు । పెంచగారాముడు పెరిగెనడవులకు ।
దక్కదేరాముడు దక్కెఋషులకును । అకగడేమీయమ్మ కతిథకర్తడాయె ।
పొమ్మనగరాముడు పోయెనడవులకు । ఏకక్షరక్షరము నెవ్వరేమనిరో ।
ఏకతమ్ముని తమ్ములెవ్వరేమనిరో । సవతులుగలయట్టి భామినులకెల్ల ।
పట్టునలేదంద్రు తగినట్టివారు । సవతాలిసుతచావు సవతివిననైనా ।
సంక్రాతినేడనీ సంతోషమునపొంగు । భయమునదుఃఖించు భాషలువగచు ।
అభ్యంతరమునందు ఆనందమునపొంగు । శోకమాసతులకు చోద్యమాభరతా ।
రౌద్రాలుదాల్చుంటి రాతిరీపగలూ । కానకనుంటితాను కడుపెద్దనయ్యా ।
కానవోయెడికొడుకు కంటినేభరతా । వైదేహితోకూడ వసుసుతయునేడు ।
వనములుచరియించ వసుధపైవ్రాసె । కొడుకుతాగంటినే కులదీపకరుని ।
ఏడికొడుకంటేను మరినోరులేదు । ఎన్నిజెప్పుదుభరత ఎన్నింటికన్నీ ,
ఎన్నుదుసుమీయమ్మ నేమందునయ్యా । వజ్రాయుదమ్ములు గంటులేకుండా ।

వాక్కాయధర్మములు కూడవెన్నటికీ । కైకమ్మరఘురాము చేసినచేత ।
ఇహములుగ్రుంగినా మరపురాదయ్యా । నీవగ్నిజస్తేను నీతల్లినేడు ।
బ్రతికెడివిధమేమి భరతుడజెపుమా । నీవెట్లుబ్రతికితివని తన్నడిగితేను ।
తనకేమిభరతుడా నీవుండగాను । వృద్ధుసుమీభరత తావర్థిల్లనోప ।
అగ్నిలోనుతన్ను పడద్రోయవయ్యా । తనదేహకఠినమ్ము తనకుసోద్యమ్ము ।
కదలకున్నదిభరత పాషాణమయ్యా । రామునిదలచియో లక్ష్మణునిదలచీ ।
తానడలెకౌసల్య తనసుతులదలచి । కొడుకులనుదలచియో కోడలనుదలచీ ।
వాకూర్చికౌసల్య అడలంగదొడగె । ఓహోరాముడనిహో అనిరిసభలో ।
అర్కకులకన్నీళ్ళు అరచేతదుడిచె । అగ్రజులజూపెను అగ్నిజొరకయ్యా ।
మీఅన్నతోకూడ మీవదినెనేడూ । మీఅన్నచూపెను మరియగ్నిచొరకు ।
నీవెట్లెరిగితని తన్నడిగితివైన । అడిగినందులకైన యట్లుచెప్పేను ।
ఎరిగినాకార్యమ్ము చెప్పేనువినుమా । కన్నూలుఅదరేను కడుపెద్దఘటము ।
పాలిండ్లస్తన్యములు పాలుచేపెను । నేడునీకొడుకును నీవుచూతువనుచు ।
తనవామనయనమ్ము తన్నూరడించు । ఈలక్షణములెపుడు యూరకబోవు ।
వేగిరపడకుభరత వ్రతమోపినట్లు । వాయువువల్లనే వైదేహిగాంతు ।
కౌసల్యక్లేశములు కపిబాపదలచీ । అంబరముపైనుండి హనుమంతుడపుడూ ।
అమ్మనీకింతేలె అంగలార్వగనూ । నీకొడుకువిచ్చేసె నీఅడుగులాన ।
మైథిలీవిచ్చేసె మరిలోకమాతా । దుష్టులాపైసకల దుష్టులజంపి ।
వానరేశ్వరుడైన వాలినిజంపి । సుగ్రీవునికికపిరాజ్య మవనిపతియిచ్చె ।
సేనలతోగూడి సేతువుబంధించి । లవణసముద్రముదాటి లంకకేతెంచె ।
లంకాధిపతియైన రావణునిజంపి । రావణానుజుని తారాజ్యముననిలిపె ।
కాంతనుదోడుకొని కడుసంభ్రమునను । భారద్వాజాశ్రమమున నెయ్యములవిందు ।
విందారగించేటి విశ్వమానసుడు । భోరునావచ్చేనే భూమిపాలించా ।
ఏమిరాపావకుడ వీగుచున్నావు । మారులేకా పెద్దమండేదవింక ।
ఇక్కడక్కడనక నెచ్చోటననక । కుడిచేటికష్టుడవు కార్యమెరుగవు ।
భరతుడుచూడగా బంధించినిన్ను । భస్మమ్ముచేసేను బంటువైనిలువు ।
పదరుచుఉరికెనే పావకునిలోనూ । వల్లభుని దూతాగ్నిభస్మమ్ముజేసే ।
అటుతూవచ్చెనే ఆసభలోకి । శుభవిషయమూనేడు శోభనంబనుచూ ।
వైదేహిపతివచ్చె వర్తించరయ్యా । వీరుడితమ్ముడా వినవలెభరతుండా ।
భూభారమంతాను భర్తమీయన్నా । పుచ్చెసుమి పదునాల్గువింధ్యేశ్వరములు ।

యుద్ధవీరులజంపి అహనములందు । రక్షించివచ్చెనే రఘునందనులు ।
రాక్షసులనెల్లాను రాముడూభరతా । కైకవరమ్మునా కాజేసివచ్చె ।
ముత్యాలురత్నాలు మణిభూషణాలు । కట్నమిప్పించెనే కపివరునికంతా ।
కుంచవీడికిబంపె పంచమటుగులను । అంగళ్ళవీధులు తుడవమనిబంపె ।
ముత్యాలముగ్గులు పెట్టుమనిబంపె । రత్నాలరంగవల్లి రాయమనిబంపె ।
మాణిక్యములదివ్వె లెత్తమనిబంపె । మకరతోరణములు కట్టుమనిబంపె ।
అప్పుడయోధ్యపురి అంగళ్ళలోను । ఘమిడిళ్లకసువులూ పారంగవూడ్చీ ।
కస్తూరిదెప్పించి కలయంగగలిపీ । కస్తూరిచిలికించె ప్రాంగణములెల్ల ।
కర్పూరపుఖండములు కలయముత్యాలు । ముగ్గులొప్పంగబెట్రి ముంగిళ్ళలోను ।
మొగసాలగోడల మదురుగోడలను । చిగురులొప్పగ జల్లిరిశృంగారమునను ।
గోడలమేడలు గోపురమ్ములును । వాడవాడలనీళ్ళ వన్నెచిత్రవులు ।
లక్ష్మికుంభమ్ములు లక్ష్మిప్రతిమలను । లక్ష్మినారాయణుల గంధపత్రిమలను ।
అజగజతురగములు రాజహంసలను । రతిమల్లెతీగెలూ రంగవల్లులును ।
బూటకోలాడములు బూరుగుమ్మళ్ళు । నాటకాలంకార నవుబత్తుకములు ।
పలరాజుకొలవులో వన్నెచిత్రములు । పుత్తడిబొమ్మలిటు పుట్టెనోయనగ ।
నిండుకుండలుదెచ్చి నింపినట్లుండె । బొడ్డుమల్లెలపోగులు పోసినటుండె ।
మాఅమ్మకుజెప్పరే మాఅన్నరాక । సుమిత్రకుజెప్పరే సౌమిత్రికాక ।
కాంతలలోనెల్ల కష్టురాలైన । కైకకుజెప్పరే కాకుస్థునిరాక ।
ఆకైకనుతిట్టువారు అయోధ్యలోను । లోచాటరేకముల లోచనునిరాక ।
పీరుపీరనుచును పీరినందనుడు । నందివదనుడివద్ద నాదమ్ముజేసె ।
కర్ణములుముడిబెట్టి కాలార్చటించి । భూదేవితోజెప్పగగనమునకెగసె ।
సమస్తవానరుల సభనడుమనున్న । చంద్రునివంటిస్వామి నేగనెనే ।
శిరసునాచంద్రుడూ ఉన్నవాడన్ని । చంద్రశేఖరుడనీ తానెరుగనైతి ।
శిరసునచంద్రుడూ కంఠమునరేఖా । అవిలేకభరతుడని అనినిశ్చయిస్తీ ।
భూనాథచూస్తినిభూమిలోపలను । భరతునిబోలినా భక్తుడేలేడు ।
అయోధ్యవారెల్ల అయ్యమీకెదురు । కదలివచ్చిరివారి నేగడచివస్తీ ।
స్వస్తిమంత్రములు ఋషివరులుజెప్ప । రాజఋషులు పెడుదురు రామునికినేస
పెక్కుచేమంతులు పెనిసినదండ । మంత్రపుష్పముబెట్టి మౌనమ్ముతోను ।
తనుగొలిచియున్నట్టి తావిభీషణునికి । హస్తమునబెట్టినాడా రాఘవుడు ।
నీలవర్ణునిమనసు నిఖిలమ్ముతెలిసీ । పట్టితీమని పళ్ళగెల చేతబట్రి ।

అచ్చోటివిద్వాంసులు ఆబ్రహ్మఋషులు । ఆశీర్వాదముజేసి అక్షింతలిడిరి ।
పెక్కుదక్షిణలు కర్పూరవీడెములును । ఒప్పుతోనందరికి కలయనిప్పించే ।
అందరూదీవించి నక్షింతలన్నీ । అనుజునిశిరసునా అవనిపతియుంచె ।
అందరూదీవించి నక్షింతలన్నీ । మైథిలీశిరస్సునా మహాత్ముడుంచె ।
అందరూదీవించి నక్షింతలన్నీ । శిరసుననుంచుకొని చెయ్యెత్తిమొక్కె ।
వీరువారనకుండ వారలతోను । కలజూచియెక్కిరే కపిసేనలెల్ల ।
బ్రహ్మసభ్వడుకొని శ్రీరాఘవులు । శివగంగతీరముకు శీఘ్రమునవచ్చీ ।
శ్రీగంగవిజయంచేసె శివకాశినుండీ । శ్రీగౌరివిజయంచేసె శివభూమినుండి ।
గోత్రపవిత్రుడు గోత్రములుజెప్పి । జాహ్నవీనందొక్క స్నానమ్ముచేసె ।
పరమపవిత్రుడు పవిత్రములుబట్టి । జాహ్నవీనందొక్క సాన్నముజేసె ।
సీతతోవచ్చినాశివసతికినాడు । భూషణమ్ముతగిన పూజలిమ్మనెను ।
అట్టైకానిమ్మనుచు సీతమహాదేవీ । సింహాసనముమీద కూర్చుండబెట్టి ।
లోహాసనముమీద కాళ్ళుగడిగించే । పచ్చిపోకలు పండుటాకులుదెచ్చి ।
పచ్చకర్పూరముతో తాంబూలమిచ్చె । నీలకంఠునిరాణికి సీతామహాదేవీ ।
చీనిచీనాంబరములు చీరలేయిచ్చే । కలకంఠునిరాణికి కాకుస్థుదేవి ।
కరకంచుపుట్టములు కట్నమిప్పించె । పతినడిగిముత్యాలు పద్మదళనేత్రి ।
పన్నెండుదోసిళ్ళు భాగిరధికిచ్చే । శివగంగవీడుకొని శ్రీరాఘవులు ।
శృంగిభేరములోకి శీఘ్రమ్ముగవచ్చీ । చిట్టిచిట్టిజడలనుతానొప్పముడిచి ।
మోసేటిగంటలు మెడనిండజుట్టె । తమకుతమకుతగినట్టి కురచగడ్డాలు ।
పొలుపుగాదిద్దిరి కోరమీసములు । ఎరుకులువేయికోట్ల నడుమతాగుహుడు ।
తప్పకాశ్రీహరిని స్మరణజేయుచును । క్షేమములుకుశలములు అడిగిరచ్యుతులు ।
మీరువచ్చుట మాకుమిగులక్షేమమ్ము । అధికక్షేమమునుమ్మి ఆదియ్యమూర్తి ।
శివగంగతీరమున శీఘ్రముగమిమ్ము । దురితములు బాయగను దర్శిస్తిమయ్య ।
లక్ష్మణానుజులుపలికె లక్షణముగాను । మువ్వంచులేలయ్య మనకెదురుగాను ।
పరులైనముత్యాల పలకసరిగొడుగులు । భూమీశమీబోవుదారులుయేలా ।
సర్వేశసంగతి దారులుయేల । అతిసంభ్రమ్ముతో అనునుజులజూతు ।
సంభ్రముగ కనకదండందనాలేలా । పసిడిపల్లకీలు పరమేశయేలా ।
మునుకొనిమనమీద ముద్రకళలేలా । మీక్లేశమెరుగడు మేదినీధరుడు ।
మిగులసంతోషాన మిన్నందినాడు । తండ్రిచావెరుగడా ధాత్రేశుతనయ ।
వగలెల్లనుడిగిట్లు వచ్చుచున్నాడు । క్రూరుడుభరతుడు కోపుడునువామ్మి ।

కైకసుతుడూవీడు కల్లరుడుదేవా । శత్రుడువీడు సహోదరుడుగాడు ।
మిత్రుకులధశరథుల పుత్రుజనుమనెను । తాకెదమనిన రాజుతలయూపకున్న ।
అతిభక్తితోడుత తనఅన్నకేమ్రొక్కె । వినయమ్ముమలవుచున్న విల్లందుకూనీ ।
రణఘోషణముచేసె జానకిమరిది । రామానుజుని చాపరవములేవినుచూ ।
సప్తసముద్రమ్ములు సగమింకిపోయె , సప్తసముద్రమ్ములు సంభ్రమములుడిగే ।
దశరథరాముడు తానవ్విబలికె । తగదునుమిలక్ష్మణుడ తగదుడుగవయ్యా ।
భావించికృపజూడు భరతునిమీద । చింతించిచూడవే చిత్రకూటమున ।
జడలల్లుకొనిపోయి వటవనముక్రింద , మనతోటిఅయ్యోధ్య మఱిబాసినాడు ।
నందిగ్రామమునంపు నవిసున్నవాడు । నందిగ్రామమునందు మందిరములోను ।
వసియించి అయ్యోధ్యవాకిటికిరాడు । వశిష్టులతోగూడ సంధ్యలువార్చు ।
ప్రాతస్నానముచేయు ప్రతివశిష్టనగ । భుజయించడన్నంబు భూమిశయనించు ।
మూలఫలములుగాని ముట్టడెన్నడును , భరతునిచర్యయిది భావించివినుమా ।
అంతటనుతమ అన్నరాగానుజూచీ । తమ్ముడుతానును సాష్టాంగమొరిగె ।
ఎత్తుకొనిముమ్మారు యెత్తుకొనియెత్తు । బాహులవిడువడే భ్రాతృమోహమున ।
శ్రీరాఘవేశ్వరుల నయనజలములను । కైకాత్మజుని కభిషేకమ్ములాయె ।
అంతటతమపదిన రాకలుచూచి । తమ్ముడుతానును సాష్టాంగమొరిగె ।
మరదులదీవించి మైథిలిపెక్కు । కనకసూత్రముపట్టు కట్నమిప్పించే ।
అప్పుడుభరతుడు యిట్లనిబలికె । తల్లియనిమన్నించ తమ్ముడనుగాయ ,
తప్పినవారినీ తలగొందుననెను । తిరుమణిధరయించి హస్తములుమోడ్చి ।
చెప్పంగదొరకొనెను శత్రుఘ్నులంత । మీతోటిఅయ్యోధ్య మరిబాసినాడు ।
నందిగ్రామమునందు నవినున్నవాడు । నందిగ్రామమునందు మందిరములోను ।
వసియించిఅయ్యోధ్య వాకిటికిరాడు । వశిష్ఠులతోగూడ సంధ్యలువార్చు ।
ప్రాతస్నానముచేయు ప్రతివశిష్టనగ । భుజయించడన్నంబు భూముశయనించు ।
మూలఫలములుగాని ముట్టడెన్నడును । మునిలీలచరియించు ముఖ్యభరతుండు ।
భరతునిచర్యయిది భావించివినుమా । నామనవివినుదేవ నన్నవధరించు ।
అడవులుతిరిగియో అంగళ్ళుతిరిగి । రాజమార్గంబులు రచ్చల్లుతిరిగి ।
వెలిపల్లెలోనున్న వ్యవహార్లనెల్ల । వంచించగాతాను వరుసతోతిరిగి ,
భూమెల్లతిరిగియో భూలోకనాథ । భరతునిపంపునా భండారమునబెడుదు ।
తప్పనుమి బొంక సుమితప్పులేకుండ । కాదయ్యదేవమీ కరణాలనడుగు ।
తప్పులేకుండగా త్రైలోకస్వామి । సుంకించిగుడిచితి సుంకరినగుచు ।

తొల్లినేనిలిచిన నందిగ్రామమిదిగో । నందిగ్రామములోకి విచ్చేయుమనెను ।
చిటికాళ్లలేమ్రోసె చెలగిబంగారు । చిటితాళములులేసి శ్రీపతికిరుగడల ।
అందందిధారలు కందుకొనిమ్రోయ । నందిగ్రామముజొచ్చె నరలోకస్వామి ।
అవనిజమనమున్ను అడవిలోపలను । కాలములుపుచ్చుటకు క్షణమాయెసుమ్మా ।
ఏకాంతభరతుడు మెట్లుండెనొక్కొ । తమ్ముణ్నిగుచ్చెత్తి తాగౌగలించె ।
చిన్నకాశెలుమోగ్రిసి చెలగిబంగారు । చిటితాళములువ్రేసి శ్రీపతికిరుగడలా ।
అందందితాళాలు కందుకొనిమోయ । నందిగ్రామమువెడలె నరలోకస్వామి ।
అల్లంతటవశిష్ఠులు రాగానుజూచి । తమ్ముడుతాను సాష్టాంగమొరిగె ।
తమతండ్రియేడనుచు ధరణీశ్వరులు । మహాఋషులుపైనొరగి మనుజేశుడడలె ।
దశరథులకేమిటికి తండ్రివగచెదవు , త్రిభువనమంతాను తానేలినాడు ।
ఏడుద్వీపాంతరములేలి యారాజు । ఏలియింద్రునిపురికి నేగియున్నాడు ।
ఇట్టికోతులువెలుగులీ రాక్షసులును । ఇట్టిరాజువగొల్వ నిక్ష్వాకుతిలక ।
ఇంతసంతోషమున నిందరుగొలువ । ఇంతమీకుప్రీతి యినకులాధీశా ।
కాంతెట్టువెరువదాయె కారడవిలోన । కడుపుతోసీతకు కన్నెట్లుమణిగె ।
ఎండకన్నెన్నడు ఎరుగదుసీత । పతితోగూడికడు నిడుమలుబడెను ।
శ్రీపద్మగంధినీ శ్రీరామచంద్రా । తమ్ములనురక్షించు త్రైలోక్యస్వామి ।
బంధువులరక్షించు భక్తవత్సలుడా । అంతటాఋష్యశృంగుడు రాగానుజూచి ।
తమ్ముడూతానూను సాష్టాంగమొరిగె । తమతండ్రియేరనుచు ధరణీశ్వరులు ।
మహామునిపైనొరిగి ధరణీశుడడలె । దశరథులకేమిటికి తండ్రివగచెదవు ।
త్రిభువనమంతాను తానేలినాడు । ఏడుద్వీపాంతరము లేలియారాజు ।
ఏలియింద్రునిపురికి నేగియున్నాడు । ఇట్టికోతులుపులులు యీరాక్షసులును ।
ఇట్టివెలుగులుగొలువ నిక్ష్వాకుతిలక । ఇంతసంతోషాన యిందరుగొలువ ।
యింతమీకుప్రీతి యినకులాధీశా । కాంతెట్లువెరువదాయె కారడవిలోను ।
కానలోసీతకు కన్నెట్లుమణగె । ఎండకన్నెన్నడూ యెరుగదుసీత ।
పతితోడగూడికడుయిడుమలబడెను । శ్రీపద్మగంధినీ శ్రీరామచంద్ర ।
తమ్ములనురక్షించుత్రైలోకస్వామి । బంధువులరక్షింను భక్తవత్సలుడా ।
కోదండపండితుని కైనట్టిదాసు । గుహుడుతామ్రొక్కెనే గుహసేనతోను ।
సూర్యపుత్రుడైన సుగ్రీవరాజు । వసుధేశుతోగూడ వందనముజేసె ।
అంగదుడుమ్రొక్కగా హనుమంతుడాడె । వానరసేనెల్ల వరుసతోమ్రొక్కి ।
వరుసతోమ్రొక్కినా వానరులజూచి । దీవించెమహాముని దీవెనలుపెక్కు ।

ఎందరైనామునులు యేతెంచిరిగాని । ఏడిపించెటిమునిని యెక్కడాజూడ ।
హనుమంతునిపలుకులకు సీతనవ్వుచును । హస్తములకంఠమాల హనుమంతునకిచ్చె ।
పెట్టగాపవనుజుడు ప్రాసాదమనుచు । చప్పట్లుచరచుచూ తానాడదొణగె ।
అయ్యోధ్యమహారాజు అయ్యోధ్యలోను । పురుహూతుబూజించి పుష్పకముదిగెను ।
ఏమెక్కిరాఘవులు యేతెంచిరైనా । ఎదురువెళితివినీవు యేమిభరతుండా ।
భమిడిమేడలలోను కనకస్తంభమునా । బంధించియున్నదీ పట్నపేనూగా ।
భమిడిగొలుసులతోను పట్టుకొనివచ్చి । రంగానుఇడజలము కడునొప్పదుడిచి ।
గంగభాండంబులా కడిగితళ్కార్చి । ఆదరంబులతోడ అంభారివేసె ।
బొడ్డునఘంటలు పొలుపమరగట్టి, అరుదునఘంటలు అందముతొగట్టె ।
మూపురమ్మునగంట ముదమమరగాను । వచ్చెభరతునికడకుదెచ్చె మదగజము ।
తెచ్చియోశ్రీరాము ముందరనిలపె । ఆకంచిమోసెనే అవనిపతియెదుట ।
తెచ్చెదటనిలపినా కన్నీరుతెచ్చె । ఉన్నగజమునుజూచి యుర్వీశ్వరులు ।
దశరథులుజచ్చెనని సామజంబులకు । దుఃఖములుపడుచుండె నీమత్తగజము ।
భరతుడుయేతెంచి పట్టుచలవులను । గజముకళ్ళనీళ్ల కడువేగదుడిచె ।
వశిష్ఠుమొదలైన వరమునులెల్ల । గజమునెక్కుమనిరి కరుణాకరులను ।
భారద్వాజులుమొదలైన పరమఋషులెల్ల । గజమునెక్కుమనిరి కరుణాకరులను ।
అష్టదిక్పాలకులు సప్తమహాఋషులు । గజమునెక్కుమనిరి కరుణాకరులను ।
మాతండ్రివరములు మాతల్లికియకా । మరిగానియెక్కను మత్తగజమనెను ।
మొనలుమొనలూగూడి మొత్తముగావారు । గజవిజయులైయుండ్రి గవినివాకిటను ।
అసురులకువనచరుల కారాక్షసులు । గజవిజయులైయుండ్రి గవినివాకిటను ।
నెరబ్రహ్మగడపను నేరసుమిత్రను । పడాళ్ళపిలువమని బంపెవారలను ।
పచ్చబెత్తులవారు పడాళ్ళురాగ । బ్రహ్మసభజల్లునా బాసినిలుచుండే ।
నీలుడుతనసేన జూచియిట్లనెను । ఏమరకమొనల నేరుపడమనెను ।
సుగ్రీవుడుతనసేన జూచియిట్లనెను । ఏమరకమొనల నేరుపడమనెను ।
జాంబవంతుడు తనసేనజూచి యిట్లనెనూ । చుంచులువంచుకొని సొక్కుచురండి ।
విభీషణుడుతన తనసేనజూచి యిట్లనెను । హనుమంతుకృపగలదు అటుమీదమనకు ।
అణగిరమ్మనిపలికె ఆవిభీషణుడు । బ్రహ్మసభవీడుకొని శ్రీరాఘవులు ।
అశ్వశాలకువచ్చి అతిశీఘ్రముననను । కుంజరంబులుకోటి కోటానకోటి ।
ఈనంగాజూచెనే యిక్ష్వాకుగురుడు । అడవులకువిజయము చేసినదిమొదలునుండి ।
అశ్వములుచెడకుండ అలసినారెవరూ । సౌమిత్రితమ్ముడూ శతృఘ్నుడనిరి ।

అన్ననీపనిమేలు యిందరిలోను । తమ్మణ్ణిగుచ్చెత్తి తాకౌగలించె ।
అంతటఋష్యశృంగు డయోధ్యవెడలి । శాంతకడకేతెంచె సంతోషముగను ।
అక్కడశాంతమ్మ అడలుతూనుండె । ధరణిపతికూతురు తండ్రిదావులకు ।
కడుశోకమునుబొంది కాంతతానుండె । చెప్పేటివారెవరు సృష్టేశుమహిమ ।
అనియిట్లుశాంతమ్మ అడలుచుండగను । ఋష్యశృంగుడేతెంచి యిట్లనుచుబలికె ।
హనుమంతుడనువాడు ఆపెద్దకోతి । తాచాటునున్నాడు సప్తలోకములు ।
బ్రహ్మాండమైవచ్చె రావణునిజంపి । చూడవచ్చెదవేమె సుదతిరోనీవు ।
కడువేగకదులుమీ కాంతరోనీవు । శాంతఅందలముతోను ముందరతాను ।
అయోధ్యరాజపురి కట్టెచనుదెంచె । అల్లంతటశాంతమ్మ రాగానుజూచి ।
ముత్యాలచిరితారు ముదమొప్పదీసె । భక్తితోశాంతని తమరందుకొనిరి ।
హేమవర్ణమ్మునా ప్రేమకళలొప్పి । స్వామిహెచ్చరిక పరాక్రమలీలలను ।
సందడిచేయుచు సర్వేశ్వరులు । ముందరప్రతీహార్లు మూకలైగొలువ ।
అవనిజతోగూడ ఆదిదేవుండూ । అచ్చనవరత్నాల తోరణాలుదూరె ।
మైధిలితోగూడ మన్మధునితండ్రి । మరిమాణిక్యాలతోరణాలుదూరె ।
ఇందుముఖితోగూడ ఇనకులరాము । వెలలేనివజ్రాల తోరణాలుదూరె ।
ఇంద్రజిత్తునిజంపి ఇంద్రాదిసురులా । బాధమాన్పినసీత మరదిబాడెదరు ।
అన్నకంటేవ్రతము అధికముగనిలిపి । పుణ్యమూర్తిభరత దేవుబాడెదరు ।
శత్రుసంహారుడు సౌమిత్రితమ్ముడు । శతుఘ్నిదేవుణ్ణి చెలగిబాడెదరు ।
ఇంటింటివాకిట నిమ్ముగాశివుని । మంత్రమూమైధిలీ పతినిబాడెదరు ।
పార్వతీశ్వరులకు పిరియములైనట్టి । శ్రీరాఘవేశ్వరులకు జనులందరును ।
పువులవసంతములు చాలధూపాలు । చాలకర్పూరహారతుల దీపాలు ।
పచ్చనక్షంతలు పరిమళగంధాలు । గంధములుమొదలైన ఘనపరిమళములు ।
సుదతులుదెచ్చిన కానుకలందుకొనుచు । వేదవినోది శ్రీనారాయణులు ।
చెరుకుచేతుల రామచంద్రునికింటింట । చాలకర్పూరహారతులు దీపాలు ।
సీతచిటికెనబట్టి శ్రీరాఘవులు । శ్రీరాఘవులుదిగిరి సీతతోతేరు ।
వనరుకై నడపగాపలికెకైకమ్మ । ముత్యాలముగ్గులు పెట్టించెకైకమ్మ ।
రత్నాలరంగవల్లి రాయించెకైకమ్మ । మాణిక్యములదివ్వె లెత్తించెకైకమ్మ ।
మకరతోరణములు కట్టించెకైకమ్మ । తనకెదురువచ్చేటి తనయులమీద ।
భామినులయెదురుసేసలు చల్లించెకైకమ్మ । సేసలుచల్లగా ఆశేషలోక ।
నాధుడుమొగసాల నడుమతానిలచె । కైకనుజూచియో కాంతయుతాను ।

పడి(మొక్కెరాముడు పత్నితోగూడ । అడగులపైనున్న తనయులనెత్తి ।
దీవించెకైకమ్మ దీవెనలుపెక్కు । అతిప్రీతికైకమ్మ అనియెనిట్టులను ।
చిరంజీవులై పదకొండువేలేండ్లు । ఎదురులేనిరాజ్య మేలుకొమ్మనెను ।
అక్షయుడని పక్షభవనములనేలు । అప్పుడుహనుమంతు డిట్లనిపలికె ।
అడవులకుబొమ్మని అతిభక్తితోను । అంపినమ్మాయెవరు యిందరిలోను ।
నయనసంజ్ఞలజెప్పె లక్ష్మణేశ్వరులు । నాడొక్కడు రఘురాముడుండగను ।
పొమ్మనిపంపగా పోయెసుమితల్లీ । నేడిందరముగలము నెలతరోవినవే ।
క్రొత్తగలిగినపనులు మరచితివేమొ । పనులానతిచ్చిమము బంపవేతల్లి ।
అనియిట్లుహనుమన్న పలుకగావినుచు । లజ్జించితలవాల్చె కైకమహాదేవి ।
తలవాల్చుకొనియున్న తల్లినిజూచి । బొంకిరేదేవతలు బొంకిరేఋషులు ।
బొంకినీమీదనే పొర్షించిరమ్మ । నీవుజెప్పినయట్లు నేచేయగలను ।
అనియూరడించెనే ఆరాఘవులూ । వసుధేశ్వరులంత సుమిత్రనగరునకు ।
వనరుకైనడవగా పలికెసుమిత్రా । ముత్యాలముగ్గులూ పెట్టుమనిపలికె ।
రత్నాలరంగవల్లి రాయమనిపలికె । మాణిక్యములదివ్వె లెత్తమనిపలికె ।
మకరతోరణములు కట్టమనిపలికె । తనకెదురువచ్చేటి తనయులమీద ।
భామినులయెదురు సేసలుజల్లించెసుమిత్రా । సేసలుజల్లగా ఆశేషలోకా ।
నాథుడుమొగసాల నడుమతానిలచే । తల్లినిజూచియో తమ్ముడుతాను ।
పడి(మొక్కెరాముడు పత్నితోగూడా । అడుగులాపైనున్న తనయులనెత్తి ।
దీవించెసుమిత్ర దీవెనలుపెక్కు । చిరంజీవులై మీరు పదకొండువేలయేండ్లు ।
ఎదురులేనీరాజ్య మేలుకొమ్మనెను । అక్షయుడనీవక్ష భవనములనేలు ।
వసుధేశ్వరులంత కౌసల్యానగరునకు । వనరుగానడచిరీ శ్రీరాఘవులు ।
ఎదురగావచ్చేటి తనయులనుజూచీ । కన్నులాజలములూ కారుతూనిలచె ।
దశరథులకేమిటికి తల్లివగచెదవు । త్రిభువనామంతాను తానేలినాడు ।
ముమ్మారువలగొని ప్రదక్షణముజేసీ । పడి(మొక్కెరాముడు పత్నితోగూడ ।
అడుగులపైనున్న తనయులానెత్తి । దీవించెకౌసల్య దీవెనలుపెక్కు ।
చిరంజీవులై మీరు పదకొండువేలయేండ్లు । ఎదురులేనీరాజ్యమేలు కొమ్మనెను ।
అక్షయుడనీవక్ష భవనములుయేలు । తండ్రిగద్దెజూచి తనప్రజలజూచి ।
తల్లిముఖముజూచి తలవంచుకొనెను । తలవాల్చుకున్నట్టి తనయుణ్ణిజూచీ ।
కన్నులజలములు కారుతుబలికే । రాజాన్నములుగాని మీరుభోంచెయరు ।
ఏవనముపళ్ళో యేయేరునీళ్లో । అనియిట్లుతమతల్లి పలుకగావినుచు ।

రాఘవులుయిట్లనిరి తమతల్లితోను । కూరేమినారేమి క్షుత్తుబాపుటకు ।
నారేమిచీరేమి నడుముగట్టుటకు । అడవాయనేమి అయోధ్యాయెనేమి ।
ఏరాజ్యమాయెనేమి తమకుండుటకును । పూరిపాన్పాయెనేమి పాన్పాయెనేమి ।
పట్టెమంచమాయెనేమి శయనించుటకును । దేవిచెరబోపుటకు సుగ్రీవుగాంచుటకు ।
అధికపుణ్యుడైన హనుమంతుగలుగుటకు । పెద్దలుజేసినా సుకృతమ్ము వలన ।
వారియోగ్యమ్మున వారిపుణ్యమున । అరణ్యమంతాను గెలిచినేవస్తి ।
అడవులనిడుమలు అన్నీనుజెప్పె । తనయులయిడుములు వినితల్లిమూర్ఛిల్లె ।
త్రైలోక్యతమతల్లి మూర్ఛలుదెలిసీ । తమ్ములుతానును సతులతోగూడి ।
అయోధ్యరాజ్యమ్ము తమరేలుచుండ్రి । భక్తితోనీపాట పాడినావిన్నా ।
తప్పకనురాఘవులు త్రైలోక్యమిచ్చు ॥

# శ్రీరామ పట్టాభిషేకము

వనములువీడుకొనివచ్చి రాఘవులూ । తమ్ముడూతానూను జనకసుతగూడి ।
ముగ్గురుకోడళ్ళకు మూడువేలస్త్రీలూ । పనిశాయతొడగి రావణతులలటుచెలగీ ।
కౌసల్యపంపునా కైకమహాదేవీ । పనిశాయబంపినా పణతూలనెల్లా ।
ఊర్మిళనిద్రదెలుప ఉర్వీశతిలకా । పణతిపాన్పుపైని పవళించియుందీ ।
పరమపతివ్రితగనుక పవళించెగానీ । పతివచ్చినానిద్ర తెలియదాచెపుమా ।
ధీరుడాలక్ష్మణుడ శీఘ్రముగవెళ్ళీ । నీదేవిలేపుకొని నిమిషమునరమ్మీ ।
అనియిట్లుపలుకగా ప్రసాదమనుచూ । అట్టెనేయుదుననీ శ్రీలక్ష్మణూడూ ।
సరగునచనుదెంచె తనదేవికడకూ । ముత్యమ్ములమరినా ముంగిళ్లగడచీ ।
కనకనవరత్నాల గడపలుదాటీ , మరిమాణిక్యాల తోరణాలుదూరీ ।
క్రొత్తగాగట్టినా కొలువింటిలోనూ । కొలువుసావిళ్లాప్ప కొమరొప్పగడిచీ ।
సేవలుజేసేటి సఖియలందారూ । సౌమిత్రిపొడగాంచి చక్కజనిరంతా ।
నాలుగూదిక్కులూ కలియపరీక్షించీ । శయ్యపైగూర్చుండ్రీ జగదీశ్వరూలూ ।
కురులుచిక్కుదీసి శిరసుబట్టెత్తి । కౌగిటచేర్చుకొని కన్నీరుదెచ్చే ।
చల్లగానింతికి చామరములువిసరా । మెల్లగానిట్లనెను మేదినీశ్వరుడూ ।
ఈమూడులోకముల వారెల్లవచ్చీ । ఇంతినీవెరుగవా ఇందీవరాక్షి ।
పదునాల్గులోకముల వారెల్లవచ్చీ । పణతినీవెరుగవా పద్మాయతాక్షి ।
మీబావవచ్చెనూ మరిమేదినుంచి । మీయక్కవచ్చింది మేదినీసుతయో ।
నేనూనువస్తినీ నెలతరోచూడే । కనువిప్పిచూడవే గర్వమేమిటికి ।
తనకామువలుకులకు కలవిలాబడుచూ । తనయెదుటనున్నట్టి పతినిపొడగనెనూ ।
కమ్మకొనితననిద్ర కన్నులూవిప్పి । పణతిపానుపుదిగెను పద్మాయతాక్షి ।
బంగారుచెంబుతో పన్నీరుదెచ్చీ । పాదములుగడగగా పణతితావచ్చే ।
ఇక్కడానాలస్యమిక శాయరామా । కాకుత్థ్సపట్నమ్ము గట్టుతున్నారూ ।
మంగళాస్నానములు మగువనీవుజేసి । శ్రీరాముదర్శించ శీఘ్రానరమ్మా ।
సతినిద్రలేపియో సర్వేశ్వరూడూ । సరగునతమఅన్న కడకునేతెంచే ।
అంతటలక్ష్మన్న రాకపొడగాంచీ । ఫాలకంతుడుపలికె కలకలానవుతూ ।
ఇన్నాళ్ళవలెగాదు యినకులోత్తముడా । సౌమిత్రివచ్చేటి సంభ్రమ్మజూడూ ।

సతిలేపుకొనిరాగ సౌమిత్రిముఖమూ । పొంగుచూనున్నదీ పుండరీకాక్ష ।
పదునాలుగూయేండ్ల బడలికలుదీరా । లక్ష్మన్నముఖార విందములుజూడూ ।
అనియిట్లుహరుడు పరిహాసమునుశాయా । చిరునవ్వునవ్వెరీ శ్రీలక్ష్మణులూ ।
అత్తలవెనుక తమరందరూనడువా । అందెలమోృత మిన్నందిమ్రోయ ।
చీరెతెరచాట్లనే చేడెలందారు । సూర్యకులతిలకుణ్ని జూచిమ్రొక్కేరూ ।
నందదెచ్చినకానుక నాతవధరించి । అందమానందమని అందరుజూడా ।
అందరికిగద్దెలూ అమరబెట్టించి । అందరినిగూర్చుండమనెను యాశాంతా ।
అందరూగూర్చుంద్రి యాశాంతగూడి । అందరుయెత్తితమ అక్కననుజేర్చి ।
ఊర్మిళచెయిబట్టి యువిదలిట్లనిరి । రాఘవులుచనియెటికి రావణునిచావూ ।
కాంతలుజెప్పగా కడుసోద్యమొందే । రాఘవులుచనియెటికి రావణునిచావూ ।
అతివలుజెప్పగా నాశ్చర్యపడెను । వశిష్టునిజూచి వనితయిట్లనెనూ ।
తండ్రిమీరేగురువు తండ్రిసుమిమీరూ । ఏగడియలగ్నమ్ము యెరిగించుమనెనూ ।
అభిజిత్తులగ్నమే అమ్మరోయనెనూ । ముందువేళగాకుండ త్రైలోక్యపతినీ ।
మంత్రమ్ములూమాని మహాఋషులారా । శ్రీరామునిగద్దెపై శీఘ్రముగనిలుపుడీ ।
విఘ్నమ్ముగాకుండ విఘ్నేశ్వరులకూ । తగినన్నియుండ్రాళ్లు తగురాసిబోయుడీ ।
మూషకవాహనుని మొదటనేయుంచీ । భమిడిపుట్టముదెచ్చి ప్రయత్నముతోకట్టుడీ ।
ఆవశిష్టమునులు అభీషేకములకూ । ఏతెంచినట్టిలగ్నమ్ము శోధించుడీ ।
మంగళద్రవ్యములు మరిచాలదెచ్చి । విచిత్రముగరత్నవేదికపైనుంచ్రీ ।
సువర్ణపుకుడకలా జాజాలుప్రాలూ । మేలుకుడకల మంచిమృత్తికలతోనూ ।
రావిచిగుళ్ళేమంచి రత్నాలనేతా । మామిడిచిగుళ్ళు మండపమ్ములనూ ।
తోరణాలూగట్టి శుభదుందుభులుమ్రోయా । ధారుణీశ్వరులు వేదార్థములుజదువా ।
హరిపట్లునాడుగా హరినాడుగానూ । హరిపట్లుగప్లేరుయా అర్కకులజులకు ।
వశిష్టువచ్చియో మండపమ్ములకు । గవిసెనలువిప్పి సింహాసనముగనెనూ ।
పదునాలుగూయేండ్లు పైకప్పుతోనూ । ఉండితివినిన్నెక్కు నుర్విపతిలేకా ।
రావణునిగెలచి శ్రీరాఘవులువచ్రీ । నీమీదగూర్చుండి యీభూమంతనేలా ।
అనియిట్లుపలుకుతూ సింహాసనమునూ । అర్చించిపూజించి నైవేద్యమిచ్చే ।
కుంచలచేతనే ధూళితుడిపించి । పంచఋషసుతయొక్క ప్రయత్నమ్ముజేస్రీ ।
శ్రీరాములెక్కేటి సింహాసనమ్మూ । వర్ణించవెయితలల వాసుకేవశమా ।
అయినానుతననేర్పు విధములచేత । వర్ణింతునోకాంత శృంగారమనెనూ ।
సహస్రమణులా మణులజగమెల్లవెలుగా । శేషువమీద భమిడికూర్మమమిరిందీ ।

సృష్టీశ్వరులగద్దె చెలగిమ్రోయగనూ । అష్టదిగ్గజములా తేతోడగలఆది ।
సింహములచేత శృంగారములచేతా । సిరివెలుగుతుండు శ్రీరాఘవులగద్దే ।
రవకెంపులాఇంద్రా నీలవజ్రములా । తళుకులచేగద్దె తళతళామెరయా ।
ఇంద్రనీలమ్ముగరే చంద్రకాంతములూ । కుందనపుబంగారముల జేసినారూ ।
నిండునవరత్నాలు స్థాపించినారూ । రతిమల్లెతీగలే పద్మరాగములూ ।
గోమేధికములచే కొమరొప్పుగద్దే । పుష్యరాగాన పూజితమైనగద్దే ।
వెలయంగసోపాణి ముత్యాలబోలూ । వెలసిల్లుశ్రీవీర రాఘవులగద్దె ।
బాలరవిపూర్ణ చంద్రుడువచ్చి । రామచంద్రునిగద్దెపై చెరలాడినట్లూ ।
సింహాసనముమీద జెలగిశతకోట్లు । త్రిమూర్తులున్నట్టు స్థిరమైనగద్దె ।
అట్టిసింహాసనము ఆదిదేవునికి । భక్తితోగూర్చుండ బ్రయత్నములుజేసి ।
సింహవిక్రములైన శ్రీరాఘవూలూ । సింహాసనంబెక్కె సింహలగ్నమున ।
సింహాసనంబెక్కె చంద్రరాయూలూ । కాలిపెండెముగట్టె మ్రోసెదుందుభులూ ।
జోళ్ళునాగస్వరములు బూరగములూ । తాళగతిమద్దెళ్ళు మేళమైయొప్పూ ।
భమిడిపిల్లెనగ్రోళ్ళు పదిదిశలుబట్టా । తప్పెట్లుదారగమ్ముల క్రిందమోయా ।
ధారలుబూరలే టమ్ముటమ్ముగనూ । శంఖములుకనక తప్పెటలొప్పమ్రోయా ।
నీలవర్ణుని వామభాగమునలక్ష్మి । కోలమెరుగొప్పగా గూర్చుండెలక్ష్మి ।
ఉన్నజానకిచూచియు విదలెల్లారు । కనులపండువజూడ గలిగెనేడనిరీ ।
హరుడుపార్వతిదేవి అయత్నబుషులూ । దేవేంద్రుశచీదేవి యరుంధతీదేవీ ।
కాముసిరతియునూ కమలజునిసతియూ । అమరకన్యకలు సావిత్రిగాయిత్రీ ।
దేవాంగనలుదేవ దేవునికిదక్షిణా । భాగమునలక్ష్మి కళ్యాణిమనిబాడా ।
అయ్యోధ్యపేరంటాండ్రు అచ్యుతులవామా । భాగమునలక్ష్మి కళ్యాణమనిబాడా ।
వచ్చిరిపేరంటాండ్రు వరుసతో । నాల్గుదిక్కులనుండి దేవునిమాటలనిరీ ।
సీతారాములపేరగూర్చి యాపెద్దా । ముత్తైదులూరాము ముందరాపాడ్రీ ।
జనకనందనకు సర్వేశ్వరులకూ । ఇరుగడలనిలచి చిటితాళములుమ్రోయా ।
భాగవతజనలోల రాఘవులరామా । దేవుని దశావతారములుపాడా ।
భక్తిజనులందరూ తొట్రుకొనిదశరథులా । నిష్కళంకుడు రామచంద్రుణ్ణిగన్నా ।
కాంచనాఫలమింత కలిగెనేడనుచూ । శాంతమరుగుననుండి కౌసల్యజూడా ।
కౌసల్యవెనుక కైకమ్మసుమిత్రా । దశరథమహరాజు సతులంతజూడా ।
ఆజనకచక్రవర్తి ఆయోగమూర్తీ । కులభావకుని రాచకులమెల్లగదలే ।
చనుదెంచిరావేళ సంభ్రానమమృత । ఫలములమర్చి నాథమిడిపందిళ్ళలోకీ ।

నిలచిజనకుడు తనానెలతలనుజూచీ । హర్షపలుకులుబలికిన నాత్మజనుజూచీ ।
ఈసీతబెంచినేనీ రాఘవులకూ । ఇచ్చినఫలము నేడది సఫలమాయే ।
నిగమగోచరుడైన నీలవర్ణునికీ । అవనిజనుపట్నంపు దేవిగాగంటీ ।
అనిజనకుడూ బలుక వినివిప్రులెల్లా । జానయ్యనీభాగ్య మహిమయది యనిరీ ।
కూతుళ్ళనెత్తి తనకౌగిటనుజేర్చి । కాంతలనందరాకలసి నిలుచుండె ।
ఆభరణభూషితూరాలు యైనట్టీ । భూదేవియేతెంచె శ్రీదేవిజూడా ।
శ్రీదేవిదేవాంగనల జేరియున్నా । భూమిజరాముణ్ని పులంకించిజూడా ।
ఆటలకందువా పాటలకందువా । కోటానకోట్లుపాటలు జనకకందువా ।
యిద్యములాకందు వచ్చేటిప్రజలా । కందుఘనమాయె రఘునందనలమోతా ।
అల్లుకునితామరలు నల్లకలువల్లూ । అల్లిబిల్లిగబూసి రెల్లిగొన్నట్టూ ।
క్షీరకన్యకచుట్టు వారాధిలోనూ । కోరికింతామరలు బూసినాయట్టూ ।
మేఘముఖులవద్దయో మేలైననెమలీ । కదుపులుకొదనిచ్చి కమ్ముకున్నట్టూ ।
ఇంద్రనీలాలు పోగులు బోసినట్టూ । పచ్చిపగడాల రాసులుబోసినట్టూ ।
ప్రాతఃకాలము భానుడుదయించినట్టూ । ఉరగరమ్మున చంద్రపరివేషమువలెనూ ।
కడువొప్పుచుండేటి కాంతినింబోలూ । ఇందరుసతులు వీణెలుగొన్న తెరువూ ।
తాటంకములలోను తమకళ్ళజూస్రీ । జూచినవారును శుభరాఘవులకూ ।
చేతులుముడుచుకుని దండములుబెట్టి । అక్కనీహొడుగు నేడక్కరకువచ్చే ।
నిక్కముగబాడేటి నెలతలూగొందారూ । తంగేడుబూసియో కవిభూషణములూ ।
శృంగారమైన దేవాంగనలమూకా । కుమారసింహమే రఘురామగన్నా ।
కౌసల్యభాగ్యమేమని జెప్పవచ్చూ । దేవాదిదేవునీ తొడలపైనున్నా ।
దేవిజూచినిట్లనరి దేవకన్యకలూ । పట్నంపుదేవివై పరమాత్మతొడల ।
వచ్చిగూర్చున్న యుర్విజదేభాగ్యం । ఇతనిపతిగా గోరియీసీతతొల్లి ।
మితిమేరలేనినోములు యేమినోచే । రాముడేపతిగాను కామ్యానగోరీ ।
నీమానయేమి వ్రతమాచరించిందో । నోచినభాగ్యవతి సీతయైబుట్టి ।
కాకుత్థ్సుతొడలపై గలసికూర్చుండీ । ఈసీతకోడలు రాముండుకొడుకూ ।
తానోచికన్న కౌసల్యదేభాగ్యం । భూమిజసుతగాను రాముడల్లుడుగా ।
జనకుడుచేసినాతపము లెట్టివో । అనియిట్లుబలుకుతూ అతివలందరూ ।
చిరికన్నులాకరువు దీరజూసెరూ । అగస్త్యులత్రిముని మునిభారద్వాజులూ ।
క్రమమునవేద మంత్రములు జదువుతునూ । బ్రహ్మవశిష్టాదితారకామయినా ।
బ్రహ్మతండ్రికి పరిమళాగంధమ్ములలదే । పరమేశ్వరులువచ్చి రఘునాయకులనూ ।

ఎదురుగానిలచి పరిహాసముశాయా । మాకాంతవచ్చి మీతొడలపైనున్న ।
మీకాంతిఫలయించె నీలవర్ణుండా । రత్నమండపములోను ముత్యాలుబోసీ ।
కుదురుగాబోసి కనకపుగూననిలిపీ । చక్రధరుడన్ని యవతారములలోనూ ।
చక్కగాతారక బ్రహ్మరూపమునా । నవరసమైన పదివారగారామా ।
ప్రభగట్టైపట్టంపు దేవితోగూడీ । నిండగంగాజలము నిలిపియాగూన ।
కుందనపుభమిడి కుండకముతోనుంచి । ఘడియారమమర్చి తమరుఘడియలెన్నుచునూ ।
కులగురువునకిట్లనెను సూర్యకులగురువు । అభిజిత్తుగడిస్తి మికనాలస్యమేలా ।
చదవవోయిమంగళాష్ట కములనీవేళా । పాయకకులగురువు మంగళాష్టకములూ ।
ఆయెడజదువగా నాయత్తలుడిరి । పదియారువన్నె బంగారములచాయా ।
ముదమమరగగట్టిరీ మురవైరిపట్టం । ఆరోగ్యమైనసభ ఆణిముత్యాలూ ।
అమర్చినాయట్లుండు అచ్యుతులపట్టం । జగదీప్యమాన మయినట్టిరత్నాలూ ।
జగత్రయమువెలిగేటి జగదీశ్వరులపట్టం । లగ్నముదగ్గరాయే శీఘ్రమునభరతా ।
అగ్రిజులనుదుట పట్టముగట్టవలెనూ । పాలానునేతాను స్నపనంబుజేసీ ।
పట్టముభమిడి పళ్ళెరాలనుంచీరి । భరతుడుగొనిదెచ్చి బ్రహ్మసభనడుమా ।
ఎదురుచనుదెంచి చతుర్ముఖుడందుకొనెనూ । వశిష్ఠువచ్చియో రఘునాయకులకూ ।
ఘనమైనభమిడి పట్టపునూళ్లుగట్టీ । కమలజుడువశిష్టు కమలనాభులనూ ।
అమృతవాక్యముగాను అనుచుదీవించె । చిరంజీవివై పదుకొండువేలయేండ్లూ ।
ఎదురులేనిరాజ్యమేలి మమ్మేల్లా । రక్షించుత్రైలోక్య రక్షకారామా ।
ఇష్టజుడనీవేలు అష్టభువనములూ । జానకితోగూడ జగదేకరామా ।
కులదీపకరులైన కొమాళ్ళనుగనుమా । అనియొప్పదీవించి ఆవశిష్టపుడూ ।
సురరాజుపూవులా వానగురిపించే । కొటివేలముత్యాలు అమరినాపట్టం ।
కోసలేంద్రుడుగట్టె సీతతోగూడి । లక్ష్మణాగ్రజుగట్టి లక్ష్మితోగూడి ।
పట్టముగట్టుకొని ప్రభురాఘవూలూ । గజదానాలిచ్చిరీ కాకుజూత్థులూ ।
పట్టమ్ముగట్టుకొని ప్రభురాఘవూలూ । అగ్రహారాలిచ్చిరి ఆరాఘవూలూ ।
వైకుంఠమందు భూవరదట్టిసురవూ । కొలచిననట్లుండు కోసలేంద్రుండూ ।
ఆసమయమునబ్రహ్మ అతివనుబిలచీ । నివ్వాళిదెమ్మనిరి నీలవర్ణునికి ।
హరినీలకుంతనలు హంసగామనలూ । కడుపెద్దలౌచున్న అంబుజాననలూ ।
సుందరామైన దేవాంగనలుయెల్లా । కుందనపుబంగారు పళ్లెరమ్ములనూ ।
మత్స్యపద్మమ్ములు కూర్మపద్మములూ । శంకుపద్మమ్ములూ చక్రములుగొన్ని ।
షోడశదళపద్మములు అవిమంచి । అష్టాదలపద్మములు గజపద్మములుకొన్నీ ।

స్వస్తికమ్ములమంచి బృందావనములూ । మందారవృక్షములు మరిచిలకటిప్పూ ।
నందనవనములే బృందములుగడుపు । లింగమండపమ్ములూ శ్రీరంగమధ్యములూ ।
తామరకొలనులే ద్రాక్షపందిళ్లూ । బాగైనాసర్వతో భద్రములుగొన్నీ ।
వనితలుగొలిచేటి విష్ణువినిపించీ । వినోదమైన వేణునాదములుగొన్నీ ।
మూర్తిప్రదాయకుడు యైనరఘుపతికీ । ముఖ్యమైనవి పూలగుత్తులవికొన్నీ ।
కడుసన్నమైనట్టి అణిముత్యాలూ । వరుసతోగూర్చితన చతురతనమునను ।
పంచరత్నమ్ములా పంచవన్నెలను । అంచితంబుగగుచ్చి మించికడమంచీ ।
కోరిశ్రీరాముల చారిత్రమెల్లా । నారీమణులుబాడ నలుదిశలుతట్టి ।
ఆయాయివిధములను అనురాగములనూ । గౌరికల్యాణాలు కాంతలటుబాడా ।
దేవాంగనలు దేవదేవునికిసదా । జయమంగళం సదా మంగళంబనిరీ ।
సోమకునిజంపి వేదములుద్ధరించినా । మీనావతార జయమంగళంబనిరీ ।
కుదురుగానిలచి కులగిరియెత్తినట్టి । కూర్మావతార జయమంగళంబనిరీ ।
వసుధకొమ్మెత్తి అసురులమర్ధించినా । వరహావతార జయమంగళంబనిరీ ।
స్తంభమునవెడలి హిరణ్యకశిపునిజీరినా । నరసింహావతార జయమంగళంబనిరీ ।
వడుగురూపమున బలినివసుధప్రార్థించినా । వామనావతార జయమంగళంబనిరీ ।
రావణునిగెలిచి శ్రీలక్ష్మీచేకోన్నా । రామావతార జయమంగళంబనిరీ ।
నందుగొని త్రిపులాసతులజేకోన్నా । బుద్ధావతార జయమంగళంబనిరీ ।
గోవులమందలుగాచి యానందుడైయున్నా । నందునితనయునకు నివ్వాళులిచ్చే ।
ధరణిభారమునిలపి దశరధేశ్వరులకు । కరుణతోకౌసల్య గర్భనిధికీ ।
పరమయోగీంద్రులకు బాధలణచీనట్టి । పరమాత్మ శ్రీరామచంద్రులకు ।
జయమంగళం శుభమంగళం । వెలమివిశ్వామిత్ర యాగమ్మునకువచ్చి ।
వెలయంగతాటకిని యమ్మునగూల్చి । బరువైనమారీచు బాధలణచినట్టి ।
పరమాత్మ శ్రీరామచంద్రులకూ ॥ జయ ॥ రాతియైబడియున్న రమణిఅహల్యను జేసె ।
ఖ్యాతిమీరగనుంచి నయముతోనూ । ఖ్యాతిగాహరివిల్లు చేతబట్టుకద్రుంచి ।
సీతపెండ్లాడినా శ్రీరాముకూ ॥ జయ ॥ పినతల్లిమాటలకు ప్రియముచేకొనివచ్చి ।
తనపత్నియును తానుతనతమ్ముడూ । వనవాసమునకేగివచ్చి వేడుకతోను ।
మునులరక్షించినా మురహరులకూ ॥ జయ ॥ హరిబాణమూదొడగి వాలినీపడవేసి ।
తరువాత కిష్కింధతారగూర్చి । పరమసుగ్రీవులకు పట్టాభిషేకమ్ము ।
ధారబోసినారామ దశరధులకూ । జయమంగళం శుభమంగళం ।
వారాధిబంధించి పడిలంకపైజొచ్చి । ఘోరరాక్షసబలము క్రొవ్వులణచీ ।

చేరిరావణతలలు చెండాడిద్రుంచినా । సీతగై కొన్నట్టి శ్రీరాముకూ ॥ జయ ॥
లలితవిభీషణునికి లంకపట్టముగట్టి । అమరపుష్పకమెక్కి యతివగూడి ।
దివినుండిదేవతలు దీవించిపొగడగా । చెలగివేడిన రామచంద్రులకునూ ॥ జయ ॥
లంకేడుకోటలను నాడులగ్గలంక । కొంకకను రావణునికొట్టివేసీ ।
దివినుండిపసిడి పువ్వులవానగురియగాను । తిరిగివచ్చిన రామచంద్రులకూ ॥ జయ ॥
మంగళము గైకొని మమ్మురక్షించీ । పాలించుభువిపదకొండువేలేండ్లూ ।
మంగళముపాడినా మగువలకునెల్లా । కట్టువర్గమ్ములూ కట్నమిచ్చేరూ ।
ముత్యాలురత్నాలు ముప్పిరీగొన్నా । ముట్టినురాశించిరా మురవైరికపుడూ ।
సీతకురామునికి సురాశించిసతులూ । అరుగుదిగినిలచిరా యతివలందారూ ।
అచ్యుతార్పణమనుచు ఆవశిష్టపుడూ । కట్నాలు కనకపళ్లెరాలవుంచే ।
దేవబ్రాహ్మణులకూ ఆవశిష్టపుడూ । దానములుయిప్పించె ఆవశిష్టపుడూ ।
దీవించిరాముని దేవమునులెల్లా । వేదోక్తమార్గ సిద్ధిరస్తునుచువారూ ।
చంద్రుడుశాంతపతి దీవించిరంతా । శ్రీలక్ష్మితోడనే సిద్ధిరస్తనుచు ।
ఎఱ్ఱముత్యాలు పందిటిపట్టుచీర । ఇలసుతకువాశిష్ఠ కట్నమిప్పించె ।
వరుసముత్యాల పందిటిపట్టుచీరా । వాల్మీకులుసీతకూ కట్నమిప్పించే ।
అచ్చముత్యాల పందిటిపట్టుచీరా । అగస్త్యులుసీతకూ కట్నమిప్పించే ।
కందువబొమ్మంచు పట్టుచీరెనూ । చీరెలూపట్టుచీరెలు పసిడిచీరెలూ ।
నిండువన్నెచంగాయి చీరెలూమంచీ । నీలాంబరపుచీరెలవి మంచినీలూ ।
చీరెలుశాలూలు అయోధ్యవారూ । కట్నాలుతేమరచినట్టి రాజులునూ ।
మాడలాభరణాలు మన్నీలుదొరలు । క్రొత్తముత్యమ్ములే కొన్నిరత్నములు ।
లక్ష్మికినిరామునికి కట్నమిప్పించే । లంకలోగలయట్టి మేలైనరత్నాలు ।
కంకణసూడిగములు కైకేసిసుతుడూ । మైథిలికిచదివింప మహిమతోరామా ।
రామచంద్రుడుతనదేవి హస్తమందుంచే । నమ్మించితనరాజ్య మేలించినట్టి ।
బ్రహ్మతంత్రికిమంచి పతకహారములూ । రామదేవునకు సుగ్రీవమహారాజు ।
ప్రేమతోజదివించి పెట్టెకంఠమునా । మేలైనరత్నాల బంగారుదండా ।
నందజనకుడుజనక నందనకుయిచ్చే । ముత్యాలచూచకమ్మురవైరిసతికీ ।
భూదేవిగొనితెచ్చి ముడిచెముందరనూ । చదివింపరాముడూ తనకరముమెరయా ।
తురుముపైముడిచి నవ్వుచునిట్లుపలికే । జనకజామనకిద్దరకు పెండ్లినేడూ ।
ముత్యాలతలబ్రాలు దండముడిచితిమీ । సీతకుజదివినా కట్నమ్ములన్నీ ।
శాంతపతితా పోగులుంచగాదొణగే । రామునికిచదివినా కట్నమ్ములన్నీ ।

లక్ష్మన్నతా రాసులుంచగాదొణగే । నడుమమాణిక్యమూ నమరించిగుచ్చీ ।
సరమొకటిదెచ్చి సుగ్రీవమహారాజూ । మైధిలికీచదివించె మహిమతోరామా ।
చంద్రుడుతనదేవి చేతికందిచ్చే । హస్తములబట్టుకొని పతిముఖముజూచే ।
ఎవ్వరిమూలాన వృద్ధిబొందితివో । వారికిమ్మనిపలికె వనజనాభూలు ।
నాయాత్మబంధుండ జీవరక్షకుడా । మాయన్నహనుమంత రమ్మనుచుబిలిచే ।
తనచేతకంఠమాల హనుమంతుకేసే । హారమ్ముధరియించి హనుమంతుడపుడూ ।
ఇట్లనెనుసభలోన మరివారలువినగా । వనచరులుజాంబవులు వనరరాక్షసులూ ।
కలలోనురఘుపతిని జూసియెరుగుదుమూ । మనభాగ్యమున కైకవరమడిగెగానా ।
అడవిమృగములనేల అవనిపతికిగలిగే । కోతులుకడుపెద్ద కొనియాడినట్టి ।
భ్రాంతిపడగల యట్టిప్రభువులాగలరా । అనియిట్లుహనుమంతు పలుకులువినుచూ ।
చిరునవ్వునవ్విరి శ్రీరాఘవూలు । సంజీవిపర్వతంబెత్తిన హస్తములా ।
సుమిత్రపచ్చలా కడియాలుబెట్టె । బంగారుఅందెలుబెట్టె కౌసల్యా ।
కట్నాలుఅందుకుని వాయునందనుడూ । చప్పట్లుజరచుచూ తానాడదొడగే ।
ఆయవసరమ్మునా రఘురాముముఖమూ । ఎట్లుండెఅష్టదిక్కుల వారుజూడా ।
నిండుపున్నమచంద్రుడున్న విధముననూ । ఉండెనేకౌసల్య నందనునిముఖమూ ।
అట్టియవసరమ్మునా వశిష్టమహామునియో । సుమంతుబిలచి యోపనులానతిచ్చే ।
అమర్చినపచ్చపగడపు రాశియొకటీ । రంధ్రములులేని ముత్యపురాశియొకటి ।
నవరత్నమౌచున్న రాసులనుఅప్ప । అందమైనవివిధ ధాన్యరాసులనూ ।
పాలుపెరుగూన వానీతమ్మునెయ్యి । తేనెకడవలదెచ్చి తేటబడనుంచే ।
లవణరాశికుసమానమైన గోధుంబులా । రాశితీలరాశి జలరాసులందుంచే ।
పన్నెండుధాన్యాల రాసులందుంచే । బొండుమెల్లలయెడల పోగులనుబోస్రీ ।
ఘనమైనవస్త్రాల రాసులందుంచ్రీ । అంబులూవిళ్ళున్ను ఆయుధములునూ ।
నెమ్మితోబూజించి నిలిపిరచ్చోటా । పరిమళగంధాలు భమిడిగొప్పెరలా ।
రఘుపతికినెదురుగా నిలిపిరచ్చోటా । రఘుపతినివిజయమ్ము చేయించమనిరీ ।
రఘువంశకోద్ధార రాక్షసాంతకుడా । త్రిభువనేశ్వరుడ దేవేంద్రవర్ణితుడా ।
అభయప్రదాయకా అయోధ్యనాధా । విభీషణశరణమైధిలీమనోహరా ।
సుగ్రీవబాంధవా సురలరక్షకుడా । అగ్రపూజ్య శ్రీహరిమూర్తిరామా ।
ఒకబాణంబున తాటకినిగూలనేసి । కోటిసూర్య ప్రకాశంబైనరామా ।
ఖరదూషణాంతకా కౌసల్యతనయా । అహల్యనిర్బంధనా అహల్యపావనుడా ।
కబంధునిబాహువులు ఖండించిబుచ్చినా , శబరివిందారగించిన చక్రవర్తీ ।

ముఖమందుదీర్ఘాలు రణమందుబ్రహ్మ । మనమరుపదితలలు పదిగూల్చినారామా ।
పాపసంహరుడ పార్వతిదేవిగురుడా । రూపసుందరుడ శ్రీకాంతప్రాణేశా ।
జయభక్తజగదీశ జగమేలుస్వామీ । అగణితగుణగణా రామభూపాలా ।
మునిముఖముచేకొనీ మునులరక్షించీ । మునిమఖంబుగైకొన్న మోహనాకారా ।
మునులుమోహించ యాదవకులమందూ । వుదయించీనట్టి దేవకీనందనుడా ।
ఇక్ష్వాకునందనా పక్షివాహనుడా । లక్ష్మణాగ్రజుడలలనాధవేంచేయుడీ ।
కోదండపండితుడ కోసలేంద్రుడా । స్త్రీలచేకొన్నలల నాధవేంచేయుడీ ।
నందవిజయములోను మందలుగాచున్నా । నందకప్రియ రామచంద్రవేంచేయుడీ ।
క్షీరాబ్ధిమీద శేషాహిపాన్పునను । పవ్వళించున్న పరంజ్యోతివేంచేయండీ ।
అనియిట్లుతమగురువు లొప్పనుతియింప । రఘుపతి రత్నసింహాసనంబు దిగెనూ ।
మనోహరుడేతెంచెరి నవ్వుతోను । పసుపుముంచినపట్లు ప్రయత్నమునదెచ్చి ।
రఘుపతికనుగంట దీర్ఘనయనమున । కరమొప్పగాగట్టి కరుణాకరులకు ।
మునిదీవించియా శేసల్లూజల్ల । నడచిరియిరుగడల సురదుందుభులుమ్రోయ ।
దేవేంద్రునగరిలో దేవదుందుభులూ । వెయివేగములమ్రోసె వెయ్యివిధములనూ ।
మదహస్తిబోల రఘుతిపారుదెంచి । నవనిధులమీద తనకరములటుజూచే ।
పరిమళాదులమీద ఫలములామీద । తేనెకడవలమీద తేటబడజూచే ।
వస్త్రాలిలమీద కరములటుజాచే । పూలరాసులమీద పురుషోత్తమూడూ ।
హస్తములుజాచి హరియుల్లభంబట్టె । రఘువంశరాజులూ అనేకములుతోల్లీ ।
పట్టముగట్టిరాసులు ముట్టివత్రూ । ఇట్టిలక్షణమైన రాసులెన్నాడు ।
ముట్టిచూడగలేదు ముట్టెమురవైరీ । అట్టియవసరాన వాశిష్టమహామునియో ।
సుమంతులబిచియో పనులానతిచ్చే । తేరాయతముజేసితే బంపెవేగా ।
రఘునాయకులు ఎక్కరమణితోగూడా । శ్రీరాములెక్కేటి తేరుతాదెచ్చే ।
ఇంద్రనీలమ్ములా తోరణములుగట్రీ । ఇక్ష్వకుతేరుయుత్తర ద్వారమందూ ।
పచ్చపగడాల తోరణములుగట్టేరు । పరమాత్మతేరు పడమరద్వారమందూ ।
అచ్చముత్యాల తోరణములుగట్రి । అచ్యుతులతేరు దక్షిణద్వారమందూ ।
సువర్ణంపుతోరణములు జూసిగట్టేరు । సూర్యకులతేరు తూరుపుద్వారమందూ ।
తేరులోనవరత్న ఖచితమౌచున్నా । గద్దెపీటమర్చిరా కాకుత్థసజులకూ ।
రఘుపతికి విజయమ్ము చేయించమనిరీ । జేజేరఘురామ జయరామచంద్రా ।
జయజానకీనాథ నగధరుడరామా । సీతాపతితేరు శీఘ్రానయెక్కూ ।
అనియిట్లుతనగురువు లొప్పనుదుతియింపా । రఘుపతిరత్న సింహాసనముదిగెనూ ।

మనోహరుడు యేతెంచెచిరునవ్వుతోటీ । సర్వంబింబోళినీ పన్నినారథమూ ।
నారాయణుండెక్కె రమణితోగూడీ । రఘుపతిరథమెక్కె సుదతితోగూడా ।
కాలిపెండెముగట్టి మోగిసెదుందుభులూ । జోళ్ళనాగస్వరములు బూరగములూ ।
తాళగతిమద్దెళ్ళు మేలమైయొప్పె । చిన్నికాశెలుబట్టి చెలగిమ్రోయగనూ ।
ఏవీధివచ్చునో యెరుగవలెననీ । అరువైవీధులవారు ఆయత్తపడిరీ ।
హేమవర్ణమ్మునా ప్రేమచేపట్టి । స్వామిహెచ్చరిక పరాకిమలీలలనూ ।
సందడిధ్వనులలో సర్వేశ్వరుడూ । ముందరగొనియాడు మూకలటుగొలువా ।
అవనిజతోడనూ ఆదిదేవుండూ । ఆణిముత్యాల తోరణాలొప్పదూరే ।
ఇందుముఖితోడనే ఇనకులరామూ । ఇంద్రనీలాల తోరణాలొప్పదూరే ।
మైధిలితోడనే మన్మధునితండ్రి । మరిమాణిక్యాల తోరణాలుదూరే ।
ఇంద్రజిత్తునిజంపి ఇంద్రాదిసురలా । బాధమాన్పిన సౌమిత్రిపాడేరూ ।
అన్నకంటెవ్రతము అధికముగనిలిపినా । పుణ్యమూర్తీ భరతదేవునిబాడేరూ ।
మిత్రసంహారుడూ సౌమిత్రితమ్ముడూ । శతృఘ్నదేవుణ్ణి చెలగిబాడేరూ ।
పువులవసంతాలు చాలధూపాలూ । చాలకర్పూర హారతులదీపాలూ ।
చెరుకుచేతుల రామచంద్రునికింటింటా । కస్తూరిమొదలైన ఘనపరిమళాలూ ।
సుదతులుతెచ్చినా కానుకలందుకొనుచూ । నాదావినోది శ్రీనారాయణుడూ ।
వేదఘోషలుజదువ విప్రులునువెడలా । సనకసనందనులు సన్నుతులుశాయా ।
జనకనందనకు సమర్పించుమనిరీ । తుంబురులునారదులు గానమ్ముశాయా ।
ఆడెనేనారదుడు పాడెతుంబురుడూ । తేరుపైమరిమంచి తేరుపొడవులనూ ।
ఆరూఢిగాజేరు ఆవనముగాంచే । ఇంద్రుడుకుబేరుడు ఈశ్వరుడుబ్రహ్మా ।
అందరుతమతమా వాహనములుదిగిరీ । సీతాపతీతేరు శీఘ్రానదిగెనూ ।
దిగెనురాముడు అనుజునికరముబట్టి । సీతచిటికనబట్టి శ్రీరాఘవులూ ।
ఏతెంచెనుదుట పట్టముప్రజ్వరిల్లా । పట్టముగట్టుకొని ప్రభురాఘవులూ ।
పార్వతీనాధునికి భక్తితోమ్రొక్కె । అడుగులపైనున్న ఆరామునెత్తి ।
ఆలింగనముజేసి అపుడుదీవించే । పట్టముగట్టుకొని ప్రభురాఘవులూ ।
వశిష్టమహామునికి వందనముజేసే । అడుగులపైనున్న ఆరామునెత్తి ।
ఆలింగనముజేసి అతడుదీవించె । పట్టముగట్టుకొని ప్రభురాఘవులూ ।
శాంతపతికీమ్రొక్కె తాభక్తితోనూ । అడుగులపైనున్న అరామునెత్తి ।
ఆలింగనముజేసి అతడుదీవించె । పట్టమ్ముగట్టుకొని ప్రభురాఘవులూ ।
పత్నితోగూడ తమతల్లులకుమ్రొక్కె । అడుగులాపైనున్న సతిపతినియెత్తి ।

ఆలింగనముజేసి వారుదీవింౘ్రీ । పట్టనముగట్టుకొని ప్రభురాఘవూలూ ।
శాంతకుమ్రొక్కెను అతిభక్తితోను । అడుగులపైనున్న ఆరామునెత్తి ।
దీవించెశాంతమ్మ దీవెనలుపెక్కు । భూభారము మోసి పుత్రులనుగనుమీ ।
శంకలేకారాజ్యము చెయ్యినాతండ్రీ ॥

# సీత సురటి

(కిటతకిట,....,....,)

పట్నముగట్టుకొని ప్రభురాఘవులు । తులాపురుషముతూగె తోడ్తోడరాజు ।
పట్నముగట్టుకొని పత్నితోగూడా । కోసలేంద్రుండంత కొలువుగూర్చుండే ।
ఛోరునావత్తురే భోగాలవారూ । అతిశీఘ్రాన వస్తురాటవారెల్లా ।
కేళినేచనుదెంత్రు కిన్నెరాంగనలు । రంభఊర్వసులనగ రమణులిద్దారూ ।
అంగనలుచనుదెంతురా రాజుకడకూ , తారలుటమటమలు తమ్మటమ్ములనూ ।
ఛోరునానాలుగు దిక్కులుమోగినే । పిల్లంగోరుల గతికికానె గోవులనూ ।
చిటితాలముల మ్రోతాచిందెముల మ్రోత । చిందెముల మ్రోతకే ఇందుముఖియాడే ।
రంభాడగాజూచి రమణియొక్కర్తె । కనకంపుపళ్లెరము కడువేగదెచ్చె ।
ఛమిడిపళ్లెముదెచ్చి ప్రయత్నమ్ముతోను । నిండజలములుబోసి నిలిపెసభనడుమా ।
ఎలనాగయీపువులు ఇందీవరములు । సరసిజకమలములు జలమందునుంచె ।
జలములబిందువులు చెదరకుండానూ । కనకంపుదిపళ్లెరము కదలకుండానూ ।
ఛమిడిపళ్లెరమునడుమ పద్మమ్ముమీదా । పంకజాక్షియాడె రఘుపతిజూడగానూ ।
పిల్లంబరమువేసి సయ్యానామెగసీ । అందందమెలగుచూనిటుచెంగుజాచె ।
చిత్రవన్నెలపట్టు కాసెలుబోసీ । జవనించినరవికెలే జవనమ్ముమీదా ।
పసిడిసిరిగజ్జెలు పాదమున మ్రోయా । ముదుపుకడియమ్ములు మోదమలరగను ।
కరమునవరత్న కంకణాలమరా । కరములుదిప్పుతూ గజ్జతోడనాడే ।
రంభకంటేమీరి రాజహంసగమనా , కుసుమగంధాదేనూ కుముదమ్ముమాడి ।
వచ్చినతంత్రములు వనితలనుచూడా । పుష్పంగంధాడినా పొద్దుంటిదాకా ।
మహిమలకువెరగందె మగువలనుచూడా । మూడవరూమా యెత్రైలోక్యపతికీ ।
అలసిరిసతులనుచు అభయమ్ములిచ్చె । కాంతలుచనుదెంత్రు ఘనముతోడుతను ।
కంకణాలాచేతుల్లు కలయంగమోడ్చి । కనకస్తంభమ్ములను కాంతలుచేరుండ్రూ ।
మగువలకునొప్పేటి మణిహారములనూ । రఘుపతిదయచేసె రత్నహారములు ।
పద్నాలుగూయేళ్ల పళ్యారగించీ । అలసినాడోరాజు ఆయర్కకులుడు ।
చాలించుకొలువింక శతృఘ్నువేగ । ఛోరునావీడుగొల్పు భోగాలవార్నీ ।
శీఘ్రమునవీడుగొలుపు మావారలనూ । అట్టెవసరాన కౌసల్యామహాదేవి ।

జలకమ్ములమర్పించె సర్వేశ్వరులకూ । జలకమ్ములాడువారు జనులుబహుజనులు ।
తల్లివద్దకు వస్త్రుతమరుహర్షమునా । తడిబట్టువిడిచి యోపొడిబట్లుగట్టి ।
తల్లివద్దకువత్తురి తమరుహర్షమునా । కమలాక్షిశిరస్సందుకలసి వెలగగనూ ।
చెంద్రశేఖర్లొత్తురి తమరారగించా । కనకంపుగొడుగులు కలిసిపట్టగనూ ।
బ్రహ్మదేవుడువచ్చె తానారగించా । పట్టముశిరస్సునా ప్రజ్వలించగనూ ।
త్రైలోక్యపతివచ్చె తానారగించా । దొరలుమన్నీలు తన్నుబలసికొలువగనూ ।
జనకరాజేతెంచె తానారగించా । బంధువులుతనవెంట బలసికొలువగనూ ।
నందజనకుడువచ్చె తానారగించా । కోటిఋషులుతన్నుకొలుచు కొనిరాగా ।
వశిష్టుడేతెంచె తానారగించా । కోటిమునులుతన్ను కొలుచుకొనిరాగా ।
ఋష్యశృంగుడేతెంచె తానారగించా । కోటికపినాయకులు తన్నుకొలువగనూ ।
సుగ్రీవుడేతెంచె తానారగించా । అష్టదిక్పాలకులు చుట్టుతనుగొలువా ।
దేవేంద్రుడేతెంచె తానారగించా । రామలక్ష్మణులను సమ్మినాబంటూ ।
హనుమంతుడేతెంచె తానారగించా । శ్రీరామలక్ష్మణులకు నిజభక్తుడైనా ।
విభీషణుడేతెంచె తానారగించా । యెలుగులకుపెద్ద వెలుగులవేది ।
జాంబవంతుడేతెంచె తానారగించా । మానమైనట్టి భోజనశాలయందు ।
మేలైన కనకపీఠములపై నుంద్రూ । నవరత్నఖచితమౌ నడుమపీఠమునా ।
రఘుపతితానొప్ప నగుచుగూర్చుండే । ముత్యాలగద్దెపై మురియుచునంతా ।
సౌమిత్రితనఅన్న సరసకూర్చుండే । ఈశ్వరుడుబ్రహ్మను యిద్దరూవచ్చి ।
స్వామికిఇరుగడల గూర్చుండిరంతా । అల్లుడుఋష్యశృంగుడా మునులతోనూ ।
చల్లనిచంద్రకాంతపు వేదిమీదా । రామలక్ష్మణులదక్షిణ భాగమందూ ।
ఆమునులుకూర్చుంద్రు అతిసంభ్రమమునా । అట్టివసరాన కౌసల్యామహదేవీ ।
పళ్లెములమర్పించే పరమహర్షమునా । పళ్లెములఉదకములు భావ్యముగజల్లి ।
భమిడిపళ్లెరాలు ఉంచిరంతటనూ । ఇడ్డెనలుబెట్టిరే ఆయవసరమునా ।
కానదివ్వేలబెట్రి శ్రేణిపంక్తులనూ । మేలుగంగాజలము పానీయములుంచి ।
వడ్డించిరయోధ్య వల్లభులపంక్తీ । ప్రథమమేవడ్డించె పాయసాన్నములూ ।
సిరిసేవపాయసము సిరిపాయసములు । సజ్జపాయసము మంచిచొక్కమైనట్టి ।
పరిమళబియ్యముల పాయసాన్నములు । రాజన్నములు మంచిరమణీశాకములు ।
వడ్డించిరయోధ్య వల్లభులపంక్తి । చిక్కుడుకాయను సిరిపొట్లకాయ ।
కాకారకాయతో గారపడియమును । అరటికాయమొదలైన అట్టెకూరలనూ ।
అమరవడ్డింతురూ ఆరాజుపంక్తీ । పనసకాయమొదలైన పాకంపుకూర్లూ ।

భక్తితోవడ్డింతురా రాజుపంక్తి । తాలింపుకూరలు తరుచుగాదెచ్చి ।
చాలవడ్డింతురే సర్వేశ్వర్లపంక్తి । కందానుచేమానూ కాయపెండలమూ ।
కలసివడ్డింతురా కాకుత్థ్సపంక్తి । సెనగపప్పూ మంచి సిరిసెనగపప్పూ ।
పరుసపప్పులతోను పనరవడ్డింత్రూ । అచ్చంగకాచినా ఆవునేతూలు ।
కర్పూరరసనతో పరిమళింపగను । తగినవారికీతగిన బంధువులకల్లా ।
కీనుకుడకలనేత్లు చాలవడ్డింత్రూ । శ్రీభరతదేవరా శీఘ్రముగవచ్చీ ।
అపోశనములు వడ్డించే ఆరాజులకునూ । అపోశనములు వడ్డించిన అనుజుణ్ణిజూచీ ।
ధీరుడా శ్రీరామ విభుడానతిచ్చే । నీవున్నమాయట్లు పథ్నాలుగేండ్లూ ।
ఆరగించవు అన్నపానాదులుడిగీ । మేమైనభారద్వాజు లాశ్రమమ్మునసూ ।
కుడిచితిమిగాని కుతికలుతడపవలెను । వివేకభరతనాపంక్తి గూర్చుండీ ।
భుజియింపుమనిరి యాపురుషోత్తమూలూ । తగినవారికి తగినవరసవడ్డించా ।
శత్రుఘ్నుడున్నాడు జననియున్నాది । అనియిట్లుతమఅన్న ఆనతియ్యగనూ ।
కూర్చుండిభరతుడూ కుడువకడియెత్తే । భమిడిచట్లాతోను పాయసముదెచ్చీ ।
అతివకౌసల్యాను ఆసుమిత్రానూ । పరగగాకైకమ్మ అరసివడ్డించా ।
బంధుకోట్లాతోను తమరారగింత్రూ । ఆరగించెటికపుల వనచరులజూచీ ।
ధీరుడా శ్రీరామ విభుడానతిచ్చే । అరటిపండ్లూతేరె అర్కజేశునికీ ।
నలనాధునికిభక్ష్య భోజనములుతేరే । గుహునిపంక్తికితేరె కూరగాయలనూ ।
బహువిధమ్ములజేసి పంపుశత్రుఘ్నా । నీతండ్రితలచుకొని మిరియంపుకూర్లా ।
మాతోడచవిచూడ నీలుడాయనెనూ । వరుణుడుఉద్యాన వనముపెద్దోక్కో ।
మాకువిందనితెచ్చె పనసపండ్లానూ । ఆతొనలురసములూ ఎంతైనతీపా ।
తాజాంబవంతునికి తలములగపోయుడీ । అడవులోకాచినా ఆములగపండ్లూ ।
అక్కఋష్యశృంగునకి చాలవడ్డించూ । తేనెతొనలిడ్డెనలు దివ్యాన్నములనూ ।
దేవబ్రహ్మణుల పంక్తికితేరవడ్డించు । మండిగలుమరిపెక్కు పిండివంటలనూ ।
మామజనకులపంక్తి మారువడ్డించు । పచ్చళ్ళుయిగురులే పాయసాన్నములూ ।
బ్రహ్మదేవరపంక్తి పరగవడ్డించూ । శ్రీరామదేవర శివుదిక్కుజూచీ ।
కప్పెరబెట్టామనిరి కరుణాకరులకూ । కప్పెరబెట్టామాకు తప్పేమిలేదూ ।
వినీవిద్యనిగిడింది విశ్వమంతానూ । సదాశివునికి చల్దియోదెమ్మూ ।
సరగునాదేబంపు జానకిమరదీ । దశకంఠుమర్దించే తమ్ములుమీరూ ।
దప్పిగొనియున్నారు భరతుడావినుమీ । క్షీరకలశమ్ములే శీఘ్రముగదెచ్చి ।
శిరస్సునపొయ్యవలె శ్రీరాఘవులకూ । వారికివారికికడు సంభ్రమైనా ।

ప్రియములుజెప్పుచూ ఘనులురాఘవులూ । శ్రీరాఘవేశ్వర్లు హనుమంతుజూచి ।
నయనసంజ్ఞలఅతణ్ణి చేరంగబిలచే । శ్రీహస్తమునహనుమ చెయ్యొప్పబట్టి ।
శ్రీరాఘవేశ్వరులు ఆనతిస్తూరు । ధీరుడవునిర్మలా చారుడవునీవూ ।
ధీరుడవుఅతి గంభీరుడవునీవూ । పుత్రుడవుపుణ్య చారిత్రుడవునీవూ ।
మిత్రుడవునీవు సౌమిత్రికన్నానూ । ఈ సేతుగట్టుటా ఆలంకగనుటా ।
ఆరావణునిజంపనా సీతదేనూ । ఈతల్లులీతమ్ములీ బంధుజనులూ ।
ఈమంత్రిగణముతో నీరాజ్యమేలా । అక్షయకులనామ మన్నినివీవూ ।
నీకతమ్మునగలిగె నిఖిలగుణశౌర్యా । మెడబలిమితలప కొమ్ములవాడిగాక ।
సీతేశ్వరమాకు యెక్కుడిదిబలిమీ । మీరుకలుగగ మాకుసకల కార్యములూ ।
అన్నినిసాధ్యమూ అయ్యెరఘురామా । లేళ్ళఅడవిపులి లేళ్ళనుగాక ।
కోళ్ళనుబెంతురా కోసలేంద్రుడా । మాభాగ్యమునకైక వరమడిగెగానీ ।
అడవిమృగములమేలు అవనిపతిగలడా । కోతూలమనిపెద్ద కోనియాడునట్టి ।
భ్రాంతిబడ్డాయట్టి ప్రభువుఖంగలరా । ఉత్తమవంశజులు క్షత్రియులుమీరు ।
పొత్తుకుడనామాకు ఉత్తముడతగదూ । పూర్ణాధిమీరొక్క కడిపుచ్చుకోగా ।
కుడిచెదననిన హరికుడువకడియెత్తె । కడిచేసిఆవాయు తనయునికినిచ్చీ ।
ఉత్సవమ్మునమేను ఉప్పొంగెరాజూ । ఆపళ్లెమెత్తుకొని హనుమపైకెగసె ।
పారణకివకమెతుకు పవనజుడుదాచే । అవిసిచెట్టూమీదకూర్చుండిహనుమా ।
జమ్మిచెట్టూమీద కాళ్ళుజాచుకొనీ । అంతారగించెనేతాను హనుమన్నా ।
క్రిమ్మరమరిభమిడి పళ్ళెముదెచ్చి । పంచపదార్థములు పరగవడ్డింత్రూ ।
అల్లమ్ముమొదలైన అరవై పచ్చళ్లూ । అమరవడ్డింతురిరా అచ్యుతులపంక్తి ।
చల్లరసము మొదలయినరసావళ్ళూ । వడ్డించిరిఆయోధ్య వల్లభులపంక్తి ।
వడియగట్టిన హేమపాలుపెరుగులనూ । వానించినముజ్జిగలు వనితలొడ్డింత్రూ ।
గోష్టములబట్టేరు గరియలఉదకములూ । పణతులందియ్యగా హస్తములుగడిగ్రీ ।
ఉష్ణోదకముదెచ్చి సర్వేశ్వరులకూ । శ్రీలక్ష్మిసహితముగ చేతులకుబోస్రీ ।
పొలుపైనపూల చప్పరములోపలికీ । మలయుచుమలయ మారుతమువీచా ।
జనపతిభోజన సమయమ్ముగడచినావెనుకా । కనకసింహాసనము గద్దెకొలువుండే ।
విభీషణుడూపెక్కు వీడెములుదెచ్చి । శ్రీరాఘవేశ్వర్ల చేతికందించె ।
వీడెమందుకుని వినయమ్ముతోనూ । వరుసతోదయచేసె వాలిమర్దనులూ ।
పడమరఘామ పొద్దున్నరాజుపంక్తి । కుడిచిలేచెంగిళ్ళు కలయువార్తూరూ ।
పార్వతికిసరస్వతికి భావజునిసతికి । కుంభసంభవుసతికి అరుంధతికిమొదలూ ।

ఋషిపత్నులకు దేవకన్యలకునెల్లా । రతిమొదలైన దేవాంగనలకెల్లా ।
చంద్రిరోహిణీ మార్తాండునియుషకూ । యిందుముఖులకు కనకమందిరములోనూ ।
భూదేవిమొదలైన పుణ్యాంగనలకూ । కౌసల్యబెట్టించె కనకపీఠములు ।
శాంతనురత్నపీఠము నందునుంచి । సీతగూర్చుండె ముత్యాలగద్దియనూ ।
మాళవిఊర్మిళా మగువశతకీర్తి । సీతపంక్తికివత్తురి శాంతతోగూడ ।
తల్లులుచుట్టాలు తగినబంధువులు । సీతకీశాంతకిరుగడల కూర్చుండ్రూ ।
జనకుసుతచెల్లెళ్ళు కనకపీఠములా । జనకసుతనుకలసి సంభ్రమునగూర్చుండ్రూ ।
అట్టివసరాన కౌసల్యమహాదేవీ । పళ్లెరాలమర్పించే పరమహర్షమునా ।
పళ్లెరాలఉదకమ్ములు పారంగజల్లీ । ఖమిడిపళ్లెరాలు వుంచిరంతటనూ ।
ఇడ్డెనిలుబెట్టిరే ఆయవసరమునా । కానదివ్వెలుబెట్రి శ్రీణిపంక్తులనూ ।
గంగాజలాలు బంగారుచెంబులను । రంగుగాబెట్టించె అంగనలసరసా ।
ప్రథమమేబెట్టించె పాయసాన్నములూ । శిరిసేవపాయసము శిరిపాయసములూ ।
సజ్జపాయసము మంచిచొక్కమయినట్టి । పరిమళబియ్యముల పాయసాన్నములూ ।
రాజాన్నములు మంచిరమణిశాకములు । వడ్డించెకౌసల్య వైదేహిపంక్తి ।
చిక్కుడికాయాను సిరిపొట్లకాయా । కాకారికాయతో గారవడియములూ ।
అరటికాయమొదలైన అట్టెకూరలనూ । అమరవడ్డింతురూ ఆదేవిపంక్తి ।
పనసకాయమొదలైన పాకంపుకూర్లూ । భక్తితోవడ్డింత్రు వైదేహిపంక్తి ।
తాలింపుకూరలు తరుచుగాదెచ్చి । చాలవడ్డింతురా శ్రీదేవిపంక్తి ।
కందానుచేమాను కాయపెండలమూ । కలసివడ్డింతురా కమలాక్షిపంక్తి ।
అప్పడమ్ములు వడియమ్ములూమంచి । ఒప్పైనయొరుగులాతో నూరుబిండీ ।
పాలతిమ్మనమ్ములే బూరగుమ్మళ్ళూ । పాలిండ్లుగదల వడ్డింతురంగనలూ ।
రాజాన్నముబుకనక ఖాండములతోనూ । తనచేతికందిచ్చె తరుణికౌసల్య ।
సుమిత్ర మొదలైన సుదతులతోనూ । వడ్డించెకౌసల్య వైదేహిపంక్తి ।
చిటిచిట్టికన్యలా చెలగివైదేహీ । పంక్తివడ్డింతురా పద్మముఖులెల్లా ।
అచ్చమైగాచినా ఆవునేతూలు । కర్పూరరసనతో పరిమళింపగను ।
తగినవారికితగిన బంధువులకెల్లా । కీలుకుడకలనేత్లు చాలవడ్డింత్రూ ।
అనిజెప్పియొకరొకరి యుపచారములనూ । కౌసల్యజెప్పి కళ్లెత్తమనిబలికె ।
అనియిట్లుకౌసల్య ఆనతివ్వగనూ । కలిపిపాయసము నేత్లుకుడవకళ్లెత్రి ।
మారురాజాన్నములు మీగడాపెరుగూ । ఊరగాయలుచల్ల యుప్పువడ్డింత్రూ ।
పురములోగలయట్టి భామినులుజూచీ । సంతోషమునవారు యుప్పొంగిరంతా ।

అనుకొనుచునొకరొకరి యుపచారములనూ । సీతతల్లినిజూచి శాంతయిట్లనెనూ ।
అత్తరోవినవే మాఅమ్మఉపచారం । శాయనేరదువలసినా పదార్థములూ ।
అడిగివడ్డించుకొమ్మనెను తాశాంతా । అనిశాంతబలుకగా వినిసీతతల్లి ।
వినయముగకౌసల్య వినగనిట్లనెనూ । దశరథులులేని వెలితియొక్కటేగానీ ।
ఉన్నవెలుతులులేవు యువిదరోమనకూ । శచీదేవీసరస్వతీ రతిదేవినిన్ను ।
మతినున్నఅరంధతీ ఋషులభార్యలను । రాముపట్నము నిమిత్యార్థభావమునా ।
చూడగలిగెను సుదతులారమిమ్మనెను । అనిశాంతబలుకగా వినివివేకైనా ।
గిరిజయిట్లనేను మునినాథుభార్యకును । మీకతమ్ముని ఋష్యశృంగుదేతెంచే ।
రాముడుదయించె రావణుడుచావగను । దేవకన్యల చెరలుదేవి ఆసీతా ।
తామాన్పిఅయ్యోధ్య పురముకేరాగా । సృష్టిసుతతోకూడ చెలరేగినేడూ ।
పట్టముగట్టగా భరతాగ్రజులకూ । ఎన్నెన్నినిమిత్త భావములకేశాంతా ।
కనులారమిముచూడ కలిగెనేడనెను । అనుచునుయొకరొకరి యుపచారములనూ ।
మొలకనవ్వులశాంత పలకెఊర్మిళనూ । నిద్రబోయి పధ్నాలుగేళ్ళుఅయ్యోధ్యలో ।
భుజియించకున్నట్టి భూమీశుపత్ని । చాలనుపాయసము మేలైనపిండి ।
వంటలుగలవంట వొంటరాసులను । సంతుష్టిగాకుడిచి సరయునదినీళ్ళు ।
వాంఛతోతాగవే వచ్చెలక్ష్మణుడూ । నిర్విచారము నిద్రలేదుయిరాత్రీ ।
సరసమాడావలెను సౌమిత్రితోను । అనిశాంతపలుకగ నవ్వుతువూర్మిళయూ ।
ఊరకున్నంతలో జనకసుతబలికే । సతులరూపెరుగని ఋషితల్పమందూ ।
ఋష్యశృంగుడు అన్నమిత్రభ్రమంబడెనూ । ముగ్ధరాలవుచున్న ముగ్ధవోవదినే ।
బుద్ధినీవెనుకసుమ్మ పణతూలకెల్లా । మీరుపెద్దలు మీకుప్రతియుత్తరములూ ।
ఇచ్చేటివారు యెంతటివారుగలరూ । వదినెగారట మీరుమరదళ్ళతోనూ ।
నవ్వేటిభాగ్యమెంతటి వారికిగలదూ । మీవంటివదినగార్లూ గలగభమిడి ।
పువులపూజిస్తిమో పురుషోత్తములనూ । శాంతనుమన్నించి సీతవేడుకలా ।
శతకీర్తిచెయిబట్టి అతివతాలేచే । ఆరగించిలేచినా అతివలకునెల్లా ।
కరములకుదకముల కడుగంగబోత్రూ । కరములుగడుగుకొని కాంతలందారూ ।
భవనములోనికిని పణతులేతెంచ్రీ । చిట్టిచాపలురత్న కంబళ్ళుపరచీ ।
సుదతులనుగూర్చుండుమనెను తాశాంతా । సురపుష్పములు శాంతసుదతులకునెల్లా ।
కురులాతురిమెనే తోయజాగంధీ । కస్తూరికలుపుకుని కాంతయూర్మిళయూ ।
చుక్కబొట్టులనిడును సుదతులకునెల్లా । పరిమళగంధములు భరతులదేవీ ।
ఉరమెల్లలలదెనూ యువిదలకెల్లా । ఘనమైనకాంతి చేమెరుగుగిన్నెలలో ।

ఆమరంగకెంపులా అక్షతలుకలపి । అర్ధచంద్రునిబోలి అంగనలనుదుటా ।
ముద్దుశతకీర్తిదెను ముదముతోనపుడూ । సౌమిత్రితల్లి తాసంభ్రమమ్మునను ।
కర్పూరవీడెములను కాంతలకునిచ్చే । తగినవారికితగినట్టు కట్నములూ ।
కౌసల్యదెప్పించి కట్నమిప్పించె । సీతయునుశాంతయును శుభసంభ్రమముల ।
సుఖగోష్టిచేయుచూ సుఖమునందుండ్రీ । శోభనముసంపదలు శుభకరములాయే ।
విఘ్నములుగాకుండ విఘ్నేశ్వరుడా । నీకునమస్కారము జేసేముదేవా ।
ప్రస్తుతింపుదుదేవ విస్తారముగనూ । స్తోత్రములుచాలగా జేసేముదేవా ।
సూడిదహరిరామచంద్రునిసతికీ । సురటికానుకదెచ్చె సురరాజుదేవీ ।
నవరత్నములు మొదటనడుమబంధించ్రీ । ప్రభగల్గుముత్యాలు యిరుగడలజేర్చె ।
పగడంపుకానుకే పచ్చలంకించి । జగదీప్యమానముగ కుందమునచెక్కె ।
దేవకుసుమంబులను బాగుగానల్లి । ఆమంచిసురటి సోమునికళబోలు ।
ఇంద్రునిసతి రామచంద్రునిసతికీ । అందముగకానుకా నమరంగదెచ్చె ।
అమరాంగనలుతాము అంజనీచేరా । అమరేంద్రులసతి పలికెఅచ్యుతులసతిని ।
వేదములుచదువగా విప్రవాక్యమునా । ఆదినుదయించినా అవనిజవునీవే ।
ఆదికిన్నరివైన వేదవతికాన్యా । వేదగోచరవీర రాఘవులరాణీ ।
తండ్రిసంకల్పము తగసిద్ధిజేసి । పుండరీకాక్షులను పురుషుగాకోరి ।
ఉగ్రమునరావణుని యుక్కణచవలసి । నెపమణచవలసి చపలాక్షిక్రోధమునా ।
భూమియాకాశంబు కూడిన్నచోటా । నీమముగతపమున్న భామవునీవే ।
ఆరాక్షసుడుకేరి అసురమార్గమున । తాబోకకాలసర్పము చెనణగినట్టూ ।
తపమువిఘ్నముచెయ్య దానవునికులము । నెపమణచవలసి చపలాక్షిక్రోధమునా ।
పంకజంబున బుట్టిలంకకేతెంచి । కొంకకసీతలలు కొందునికననుచూ ।
నీలంకకేతెంచి నీవనమునందు । చరనుండినిను చెరతువదరకికననుచూ ।
పంక్తికంతుడనిన్ను చంపింతుననుచూ । పంతమాడినయట్టి పణతివినీవే ।
ఆరాక్షసుడుపాపి యానిశాచరుడూ । సోకినదేహమ్ముతోనుండననుచూ ।
నేత్రమునఅగ్నిహోత్రములు పుట్టించి ఆతపోదేహమాహుతి జేసివిడిచి ।
పద్మకొలనుకువచ్చి పద్మమ్మునందూ । ఉద్భవించినట్టియువిదవునీవే ।
ఆతామరలుపంక్తి కంఠుండుగోసి । ఇందీవరములు దెచ్చియింతులకునిచ్చే ।
మరిపక్కనాడు తామరపువులసజ్జా । ఇరువదిచేతులకు బరువాయెనెత్త ।
ఇంతిపువ్వులసజ్జ అతిభారమైన । చింతింపుచూవచ్చె పంక్తికంఠుండూ ।
బరువాయెయీపువులు పణతిరోవినవే । వివరించివెదకివెలదులు ముడువుడనెనూ ।

పతిపలుకగాథమిడి సజ్జలోపువులూ । వివరించిచూడ ఒకకమలమ్మునందూ ।
లక్ష్మీకళగలయట్టి లక్ష్మినిసుగాంచి । విస్మయముపడి రాక్షసేశ్వర్ల దేవీ ।
సీతకమలములోబుట్టి శ్రీలక్ష్మితాను । ఏతెంచెమనలంక కేమికారణమో।
లంకకుమనకున్ను రాక్షసేశ్వరుడా । మంచిదాతెలసినా కెరిగించుమనెను ।
మంచిదైతేకననీ పెంచనీపుత్రీ । ఎంతవారికికలదు యీపృథివియందు ।
అనిసతిపలుకగా వినిరాక్షసుడూ । విప్రులాబిలిచి వినయమ్ముతోనూ ।
ఆసనమ్ములుబెట్టె భూసురులకెల్లా । విప్రులకుకర్పూర వీడెమ్ములిచ్చి ।
విప్రులకురాక్షసుడు విన్నపముజేసె । ఆశ్చర్యమిదియొకటి చూస్తిరాయనెను ।
శరణుశంకరునీ యాధరుడివెలపలనూ । ఎన్నగలకొలనులో నున్నతామరలూ ।
ఆపువులు నవలక్షకోటినేగోసీ । శ్రీకంఠునిపూజింతు దినదినమ్మునను ।
హరిదినముతప్పకుండ హరునిపూజించీ । ఆప్రసాదముదెచ్చి యింతులకునిత్తూ ।
ఆప్రసాదమునేడు చేతులకుబరువై । ఉండగాజూచియు విదలముడువమంటీ ।
మండోదరాపువులు మరివెదకిజూచీ । ఇందీవరములోను ఇంతిపొడగాంచే ।
కన్యపుట్టినవేళ కడుమంచిదైతే । సువర్ణవృష్టిమీకు కురిపింతుననెను ।
అనిరాక్షసుడుబలుక వినివిప్రవరులూ । తమలోనెతెలసి తలలూనుయిట్లనిరీ ।
లంకేశమీరడుగ బొంకంగరాదు । లంకకుత్పాతముగ రమణిబుట్టిందీ ।
సీతబుట్టినలంక చెడురాక్షసేశా । కాంతనీలంకలో గడియుండరాదు ।
రావణుకుచెడులంక తావిభీషణుడూ । ఏమికారణముగా నింతిపుట్టిందీ ।
పెరిగేటిఆల్ల మందసమునూదెచ్చి । కండువెలదములు పొందైనవెలిపట్టూ ।
మందసములోపలను మగువకునుపరచీ । దివ్యాంబరముదెచ్చి దేవికినిగట్టి ।
పరిమళగంధములు బాలకూనలవీ । లక్ష్మీకళగలయట్టి లక్ష్మిదేవతకూ ।
ముత్యాలతొడుగులూ ముదముతోదొడగీ । దేవకుసుమములనే దేవిపూజించీ ।
కుసుమగంధిని మందాసములోనునుంచి । ఫలములుకొనితెచ్చి నైవేద్యమిచ్చి ।
చెలికాళ్ళదన్నుమని సాష్టాంగమొరిగి । మందసమ్మునకు కవాటములు బంధించి ।
చంద్రసోదరిని జలనిధిగడువుమనెను । ఇన్నిన్నిచెప్పంపినా యీదేవితాను ।
సంతుష్టిపొందుటకు సామాన్యమనిరీ । విప్రుఖన్నా ఇట్లువేడ్కతోజెప్పా ।
రాక్షసుడువెరచి కడుభయార్తుడాయె । కాలమృత్యువుకళ్ళ కనపడినటులు ।
మరణకంపముబుట్టి మరివణకదొడగే । వెరచిరాక్షస చక్రవర్తినిముషమునా ।
తనలోనదెలసి ధైర్యముదెచ్చుకొనెను । మత్తుడుతనపూర్వ వృత్తాంతమంతా ।
మరచియున్నాడు మాదాంధగర్వమునా । విప్రులూజెప్పినా విధమెల్లజేసి ।

రక్షసూనణచి నారమణివినీవే । జలనిథికడచియో నదివెంటవచ్చి ।
మిథిలాపురము నందు మేదినీలోను । ఉన్న జనకుడుయజ్ఞ మూకొరకుచాలా ।
శోధించనాగేటసాగె మందసమూ । నిధిగంటినని జనకరాజువినివచ్చీ ।
మందసముదెప్పించి మరిదీసిజూచే । లక్ష్మికళగలయట్టి లక్ష్మినినుగాంచీ ।
ఉత్సవమ్ముననమేను యుప్పొంగిరాజూ । చందురునిజూచి జలనిధిపొంగినట్లూ ।
ఆనందభాష్పములు అందందుగురిసే । జనకుడుజన్మాంత్రమున జేసినట్టి ।
తపసునకుమెచ్చి వరమీవచ్చినట్టు । విప్రముఖ్యులైనట్టి బ్రాహ్మణులబిలచి ।
జనకుడిట్లనెను తనసరిదొరలువినగా । ధశరథులు పుత్రకామేష్టందుసుతులా ।
వడయుడకంటెతన బలమధికమనెనూ । సర్వలక్షణములను సంపూర్ణురాలూ ।
సర్వేశ్వరీరూపమున యవతరించె । నీకులపావనీ నీరజనేత్రి ।
లోకములురక్షింప శ్రీకాంతబుట్టే । తనయమాత్రమేగాదు వినుజనకరాజా ।
కులముద్ధరించేటి కూతురీదేవి । ఈదేవిపుట్టినా యామహూర్తమునా ।
ఇకనొక్కతనయ జన్మించవగాగలదూ । మెచ్చినమనస్సునాబండారముననూ ।
అచ్చుగావడిసి పుత్రికగన్ననాడూ । తప్పకనాకిమ్ము ధారుణీశ్వరుడా ।
దప్పదుమాపలుకులు తత్త్వార్ధమనిరీ । ముహూర్తముజెప్పిన జోతిష్కులకునెల్లా ।
కన్నుమడియగట్టు వర్గమ్ములిచ్చే । దేహియనువచనములు పాహియనిపించి ।
ధనధాన్యదానములు తాజేసెరాజు । కోటివేలైనబంగారు పళ్ళేములా ।
సువర్ణములుదెప్పించి శోభితముగానూ । గంధకస్తూరికర్పూర వీడెములనూ ।
పుత్రినిగని పుత్రోత్సవముబెట్టె । జాతకర్మమ్ము నామకర్మమ్ములూనూ ।
నాతినీకుజేసనామమ్మునిడిరీ । విదేహరాజుకీ వుదయిస్తివానీ ।
వైదేహివ్యవహార నామమ్మునిడిరీ । సీతళములోనీవు జన్మిస్తివానీ ।
సీతాంగననిపేరు చెలియనీకిడిరీ । జానకిజనక మహరాజింట పెరగగా ।
జానకియనిజన్మ నామమ్మునిడిరీ । శ్రీరామపట్టంపు దేవివీగానా ।
శ్రీలక్ష్మియనిపేరు చెలియనీకిడిరీ । ప్రఖ్యాతినామములు వెలసిల్లగానూ ।
చక్రధరులకు ప్రాణనాయకివినీవే । కలహంసగతినడల యెలనాగనీవూ ।
చెలికత్తెలూనీవు చెలిగియాడగను । తొలకరిమెరపు తళుకునాచెరసినట్లూ ।
కొలువులోనున్న జనకుడునిన్నుజూచి । అల్లంతనినుజూచి జనకమహారాజు ।
తల్లిరమ్మనికరములనుచూచి పిలచే । రమ్మిముద్దులగుమ్మ రమ్మమాయమ్మా ।
రావమ్మజానకీ రాజ్యరత్నామా । తొలకరిమెరుపరా తోయజాగంధి ।
కమలదళనేత్రిరా కలహంసగమనా । వెలలేనిసొపాణి ముత్యామారావె ।

ఇందుముఖిరావమ్మ కుందనపుబొమ్మా । కామునిరతికన్నకడు రూపవతివీ ।
బాలలబోలు సౌభాగ్యవతిరావే । స్వారమున అలరుకోవెలరావెతల్లి ।
చదువులశారదా విగ్రహమారావే । దారిద్ర్యమునవిసికి తరుణినినుగోరీ ।
కొలిచినవారికొంగుల పసిడిరావే । పెదజల్లుకాంతలా విజయజయలక్ష్మి ।
మలయనైదువరావె వల్లిసిరిగింధీ । ఒప్పులకుప్పరా కర్పూరగంధీ ।
ఒప్పులేనట్టి ముత్తయిదురావమ్మా । చందలగంధిరా సాధుశృంగారీ ।
వాడనిపారిజాతపు బంతిరావే । షోడశకళలుగల సుందరీరావే ।
పుష్పమాలికరావె పొన్నశిరిగంధీ । సుప్రదీపమరావె సుదతివైదేహీ ।
మురిపెంపునీమోము ముద్దుదీరగనూ । చెఱకువిరిగిన కలలజహ్నవిరాశి ।
వార్నిధివలెతొణకకుండేటితల్లి । వనదేవతారావె వరలక్ష్మిరావే ।
భూమిపైదేవతా శ్రీలక్ష్మిరావే । కమలదళనేత్రి రాసురకల్పవల్లీ ।
చుట్టాలసురభిరా కుంజరమైనలక్ష్మి । మదగజగమన రామముగన్నతల్లి ।
చదారాలరావె చక్కనివేగుచుక్కా । గజరాజవరదులా కౌగిటనున్నా ।
మకరాదిసేనలా నాతిరావమ్మా । సోమకునిసాధించి శృతులుద్ధరించీ ।
మీనావతారులా మానినీరావే । ధరకుకుదురై కూర్మము బరువెల్లమోసినా ।
కూర్మావతారులా గొంతిరావమ్మా । వడివేగిరముబోయి వసుధకొమ్మెత్తినా ।
వరహావతారులా పణతిరావమ్మా । కలడన్నప్రహ్లాదుడు కంభమునవెడలినా ।
నరసింహావతారులా నాతిరావమ్మా । బలినిమూడడుగులు పాదమునమట్టినా ।
వామనావతారులా వనితరావమ్మా । క్షత్రియులనణచియో రణమందుపరశూ ।
రామావతారులా నాతిరావమ్మా । రాక్షసులనణచియో లక్ష్మిచేకొన్నా ।
రామావతారులా రమణిరావమ్మా । గోవర్ధనమువెల్ల గొడుగాబట్టినా ।
కృష్ణావతారులా లక్ష్మిరావమ్మా । పురసతులయిరుపుల పుచ్చిపురిగొన్నా ।
బుద్ధావతారులా పొలతిరావమ్మా । కలియందుదుష్టులను కలయపురిగొన్నా ।
కలికావతారులా కలికిరావమ్మా । ప్రథమనామమ్ములా శ్రీదేవిరావె ।
విదియనామమ్ములా శ్రీలక్ష్మిరావే । తదియనామమ్ములా అమృతోద్భవీరావె ।
చుతుర్థమునసర్వ సుందరిరావె । పంచమమ్మునవిష్ణు పత్నిరావమ్మా ।
షష్టినామమ్ములా వైష్ణవీరావె । సప్తమమ్మున వరారోహరావమ్మా ।
అష్టమీనామముల హరివల్లభిరావె । నవమినామము శారదమనిపుత్రిరావె ।
దశమినామముల దేవదేవకీరావె । ఏకాదశినామముల శ్రీలక్ష్మిరావె ।
ద్వాదశరిమున త్రిపురసుందరిరావె । దశావతారమ్ముల ద్వాదశనామములా ।

వసుధసుతనినుగొలచు వారలకునెల్లా । బాసిపోవుపాపములు పొందుపుణ్యములూ ।
పరిమలముతోడనే ప్రభువుదీపింపా । మలయుచుమొలక రామముగన్నతల్లి ।
వేనాంగిరేఖరా నాదావినోదీ । వేదాంతవేద్యులా వెలదిరావమ్మా ।
పుత్తడిబొమ్మరా భూభారమంతా । నెట్టుకొనిపాపబుట్టి నణతిరావె ।
మాకులంబునబుట్టి దేవాలయమునా । తిరముగసిరులనె త్తిన పణతిరావె ।
కౌసల్యనందనులకు కంఠమాలిచ్చి । కాకుత్థ్సుగోరినా కమలాక్షిరావే ।
వారిజానాభూలా వక్షస్థలమునూ । బాయకున్నట్టి జీవరత్నమారావే ।
అనియిట్లుతమతండ్రి అంకించిబిలువా । వినిజానకేతెంచె విభవమ్ముతోనూ ।
అభయమునతొడిగినా ఆభరణమ్ములూ । రవశిజేయుచుపెద్ద రాజసమ్మునను ।
రాచిలుకరాజుచేతికి వాలినట్టు । ఓజతోతమతండ్రీ యొద్దనిలుచుండే ।
కూతురునియెత్తుకూ జనకమహారాజూ । తొడలపైబెట్టుకుని అఘ్రాణించెశిరసూ ।
బ్రహ్మగన్నట్టి పరబ్రహ్మకూగానీ । తల్లినిన్నియ్యనని ఆజనకరాజూ ।
స్వయంవరముచాటించె సప్తద్వీపపతులా । భూపతులరాబంపు పుడమిపాలకుడూ ।
ధనువుశృంగారించి పుడమిపాలకుడూ । ఉంచిజనకుడుపలికె నుర్విపాలకుడూ ।
విల్లుముత్తునకలగ విరచెడిదిచూడుడీ । విభవమ్ముతోనెక్కు పెట్టెడిదిచూడూ ।
వీరరసమునవారి బిరియించిధనువూ । చనగానుదాని ఘోషణిజేయుచుండ్రే ।
అనిజనకుడాడగాచిరుత మహారాజులూ । ధనువుకడకేతెంచి తమరూరకుండ్రు ।
తమభాహుబలిమిగల సప్తద్వీపపతులూ । భూపతులువిల్లెత్త నోపలేరైరి ।
అవనీవశాలుగల అవనీధరూలూ । నివ్వెరగులై పడివెర చూరుకుండ్రు ।
జనకుడువిచారించి చేసినప్రతిజ్ఞా । భంగమ్ములాయే యీరంగమ్ముకొరకూ ।
తనయెకోరినయట్టి వరునునికిపెళ్ళి । చేయకప్రతిజ్ఞచేసినే వెట్టినైతీ ।
యేమిసేయుదుననుచు ఆజనకరాజు । చిన్నబోయికొలువులో చింతింపుచుండే ।
కాకపక్షములతో కడుముద్దులొలుకా । శ్రీపతిశ్రీరాఘవేశ్వర్లువత్రు ।
తాటకినివధియించి కౌశికునిక్రతువు । కాచుద్ధరించి యాకారడవిలోనూ ।
అహల్యశాపముబాపి ఆక్షణమేశివునీ । విల్లుముత్తునకలగవిరచె నిమిషమున ।
జనకులకుసంతోష చిత్తమొనరించి । జనవల్లభులునిను తోడుకొనిరాగా ।
ఎదిరించిపరశురాముడు పుణ్యలోకా , లోకమునకుచనకుండ బాణమునువేసే ।
అవనిజనినుగూడి అయోధ్యలోను । క్రీడజేయుచురాక్షసారి సుఖముండే ।
దశరధులురామునకభిషేకమ్ముజేయు । అసురబాధలకోడి అమరులందారు ।
విఘ్నముశాయమని విఘ్నేశ్వరునిప్రార్థించే । మందరకై కమరచిన వరముదెలుపా ।

కానలకునేతెంచి దానవులనెల్లా । పూనిజంపించినా మానినివినీవే ।
క్షీరవారిధికన్య ఘారమణతనయా । పేరుగలజనకులా పెద్దాడపడుచా ।
చిలకపలుకుల చెలియతిలకమాభూమి । తపనకులవర్ధనుల సతిపుణ్యవతివే ।
క్షీరాబ్ధిశయనులా చెలియమాకెల్లా । అభయదానమిచ్చినా అమ్మవూనీవే ।
చెరనుండిమాచెరలు విడిపించినట్టి । కాంతనీఋణమంత తీర్చుకోగలమే ।
మాచెరలువిడిపించి మమ్మురక్షిస్తివీ । అలుపుతీరగసురటి అవధరించనెను ।
సురటందుకొని సీతసురరాజుసతికీ । వెలయంగకర్పూర వీడెమిప్పించే ।
తనకిచ్చినాసురటి ధారుణీతనయా । శాంతకువిసరమని శతకీర్తికిచ్చే ।
శాంతకుసీతకు శతకీర్తిసురటి । ప్రీతివిసరగచేతి భూషణాలరయ ।
మాళవీసీతపాదార విందములు । మరివత్తగా ఊర్మిళాకు మణచివ్వా ।
ప్రమథగణములసతులు పార్వతినిగొలువా । తామరాకుమణచి యగవెయిపన్నెవిసరా ।
కొలువిచ్చేటీసుతులు కొలిచేటిసతులు । సరసమాడేటిసతులు సౌభాగ్యవతులు ।
సరిసమానముగానుసతులు తనుగొలువా । వెలిగినట్లుండెమైథిలీ కొలువులోనూ ।
క్షీరకన్యకచుట్టు వారిఢీనడుమా । కోరికెందామరలు తీర్చినట్లుండూ ।
తగుతామరలుకొన్ని వికసించినట్లు । తగినపుష్పాలచే తావిగొన్నట్లు ।
అల్లుకొనితామరలు నల్లకలువలును । అల్లిబిల్లయిపూసి వెల్లిగొన్నట్లు ।
కొలనులలోను కలహంసలున్నట్టు । కనకమేడలలోను కాంతలందారు ।
ఆభరణములకాంతీ అతివలకాంతి । శోభిల్లుభువనేశ్వరములలోకాంతీ ।
పణతులాకాంతి యాభరణములకాంతీ । కనకమేడలలోను కంభములకాంతీ ।
నిలుపుటద్దములు తళతళకుమన్నట్టు । తరుణులచెక్కుటద్దములదొౕకకాంతీ ।
పంచరత్నమ్ములా బంతులున్నట్టు । ఇంతులునవ్వినా దంతములకాంతీ ।
పణతులుకట్టిన పట్టుపుట్టములు । చెరగుసరులముత్యములు దొౕకకాంతీ ।
మెరపుతీగెలుభూమి మెరసినట్లుండూ । కొమ్మలుతురిమినా తురిములదికాంతీ ।
మెరుగుతీగెలుభూమి మేలైననెమలీ । కదుపులుపురివిచ్చికమ్ముకొన్నట్లు ।
తుమ్మెదగుంపులు కమ్ముకున్నట్లు । కొమ్మలుతురిమినా కొప్పులాకాంతీ ।
కొమ్మలుతురిమినా కొప్పులలోను । విరులువికసించినా పరిమళముతావీ ।
పరిమళాగంధాలు పణతులమేనా । మరిమలయమారుతము వసియించుతావీ ।
ఎంతైనగాదుసుమ అవనిజాకొలువూ । ఎంతవింతైయొప్పె నంతఃపురమ్మూ ।
కుప్పలుగరాశసా కప్పలన్రమింగి । ఒప్పుచున్నాకాల సర్పమ్ముపలెనూ ।
రాముడనేమంత్ర వేదికిచిక్కిఛమిడీ । మేననెడిపెట్టెలో మెలగుచూనుండే ।

కోడలు మేడలో కొలువుండగాను । వేడుకచూతమని చేడెలందారూ ।
పంక్తిరథుసతులెల్ల పరమహర్షమునా । సంతోషమునజానకీ కొలువుజూడా ।
సుమిత్రతనకనుల జూచితాబోయీ । కౌసల్యకిట్లనెను సంతోషమునను ।
ముక్కోటిదేవతాంగన లెల్లకొలువా । అక్కచూస్తివే మనాచక్రధరులసతినీ ।
కందువమాటలా కనకగిరిగున్నా । కమలజునిసతి మొదలుకామురతి వెనుకా ।
ఇంద్రసతిసహితముగ చంద్రసతిజేరీ । ఇంద్రాదిదేవతాంగన లెల్లకొలువా ।
మనగృహంబింత పావనమాయేనేడూ । జానకినిరామచంద్రుడు పెండ్లియాడా ।
శాంతకూతురుగాను సీతకోడలుగా । నోచిననోములన్నియు సఫలమాయే ।
అనియిట్లసుమిత్ర హర్షమునపలుకా । కౌసల్యయిట్లనెను సంతోషమునను ।
చల్లనిచూపులా సౌమిత్రిగన్నా । చెల్లెలనినుబోల గలరెచెల్లెళ్ళు ।
సవతిలేనట్టి యాసైదోడుమనకూ । సవతెల్లువాణినెనే సరస్వతిబ్రహ్మ ।
అనికౌసల్యసుమిత్రనీ హర్షమునబలుకా । పరగగాకైకమ్మ తలపోయదొడగే ।
దుర్బుద్ధినైతాను దురితసంహారులా । కానలకుబంపిత జ్ఞానమ్ముచేతా ।
ఒట్టిదూరులబడితి యిట్టిలోకములో । రట్టయితి రవిచంద్రులున్నంతకాలమూ ।
అగ్నిసేవించి ప్రఖ్యాతిగావడిసి । షడ్వర్గబుద్ధిచే కులముద్ధరించా ।
ఉత్తమాంగనకొలువు దృష్టించిచూచీ । ముత్యముపులిగడగ మురికిబోయినట్లు ।
పరమపతివ్రతకొలువు పాడినావిన్నా । బాసిబోవుపాపములు పొందుపుణ్యములూ ।
అనితనాకనుల దప్పంతానుతీరా । కైకజానకిబలికె సంతోషమునను ।
కౌసల్యకైక సుమిత్రమహాదేవులు । శతృఘ్నునిపంక్తి నారగించిరీ ।
శోభనముసంపదలు శుభకరములాయే । వెన్నలబైటఒక వేలసంఖ్యలకూ ।
గద్దెలుబెట్టించె కరుణాకరులూ । ఛపన్నదేశాల రాజులకెల్లా ।
పునుగుగంధమిప్పించె పుడమిపాలకుడు । అయోధ్యగలయట్టి బ్రాహ్మణులకెల్లా ।
భూరిదక్షిణలిచ్చె పుడమిపాలకుడు । సమస్తదేశముల రాజులకునెల్లా ।
గంధంబులొసగిరా కరుణాకరులూ । అన్నన్నలక్ష్మణా ఋష్యశృంగునికీ ।
కొమ్మునగంధమ్ము పూయుసౌమిత్రీ । పాదెద్దుమనబావ ఋష్యశృంగునికీ ।
మూపునమూడుపిడికెళ్ళ ధనముబొయ్యా । ఏమంటిరఘుపతీ యిందీవరాక్షా ।
ఏగుణమునసునేను యెద్దుగానైతీ । ఎరగిన్నియెరుగను యిల్లాలునగ్నీ ।
బొరజేసినయట్టి నరపశువునేగాను । పొంచుండివాలినీ పోనీకఆచీ ।
పొడిచివేసిన గజేంద్రుడనుతాగాను । నెలమూడువర్షములు నేనున్నచోటా ।
కురియపండించేటి వరపతిని నేనూ । అగ్నిహోత్రునివేడి అత్తగారలకు ।

యజ్ఞపాయసమునెయ్యి వండించ పెట్ట । కౌసల్యఅను కామధేనుకుదయించి ।
కంసారినినుబోలగలదె కర్రెద్దూ । కైకమ్మఅను కామధేనుకుదయించి ।
భరతుడనిను బోలగలదె బర్రెద్దూ । సుమిత్రఅను కామధేనుకుదయించి ।
సౌమిత్రినిను బోలగలదే వాదెద్దూ । ఎద్దులకుతమ్ముడవు ముద్దుశతృఘ్నా ।
ఎద్దులలోను గంగిరెద్దువైతిరుగూ । ఆమహామునికి ప్రతియుత్తరములీయగా ।
రాముడనుజులతో నవుతూరకుండ్రీ । రాముడునవ్వగా లక్ష్మితోగూడా ।
లక్ష్మణుడునవ్వెనే లక్షణముగాను । భరతుడునవ్వగా ప్రజలంతనవ్వీరీ ।
శాంతతమ్ముడు నవ్వేశతకీర్తివిభుడూ । శోభనముసంపదలు శుభకరములాయే ।
రవిగ్రుంకెరవిపొడచె రాత్రికొలువుండే ॥

# లక్ష్మణదేవర నవ్వు

వెన్నెలబైటనే వేలసంఖ్యలను । గద్దెలుబెట్టించ్రీ కరుణాకరూలు ।
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకులు । కోసలేంద్రులంత కొలువుగూర్చుండ్రి ।
విభీషణుడూపెక్కు వీడెములుదెచ్చి । ఆరాఘవేశ్వర్ల హస్తానయుంచే ।
వీడెములుదెచ్చినా విప్రూలకెల్లా । వరుసతోదయచేసి వాలిమర్దనులూ ।
వాలిమర్దనులచే వామభాగమునా । వానర్ల సేనంత వసియించికొలువా ।
వస్త్రాంబరమ్ములే వరభూషణములు । విస్తారముగదెచ్చి విభీషణునకిచ్చె ।
తగినఅందానాలు తురగములుపసిడి । ధరణిపతికనబోయె ఏడుకోట్లతోనా ।
మ్రొక్కిముందరనిలిచి నిజభక్తుడనియె । పనులేమియనుచునో పరదిక్కులానా ।
సింహాసనముగద్దె చేరియిరుగడలా । సింహవిక్రములైన శ్రీరాముపాద ।
పద్మములువత్తుచూ వరములడుగుచును । దివాకరసుతుడైన సుగ్రీవుడొచ్చికొలువ ।
వున్నంతకొలువునో యురవమైయుండె । బద్ధకమువిజయ భూపాలుతమ్మునకు ।
అధికశ్రీరాఘవులు అనుగుతమ్మునికి । ఘనుడులక్ష్మణ సన్నిధిదేవునకును ।
జననాధవంట్లోను జాడ్యమైతోచె । భావించిపలుకులు బలువులయియుండె ।
మెల్లమెల్లలేచి మేలుకునికునికీ । తనలోనెతలయూచి తలవంచుకొనెను ।
వజ్రవళమూర్తయిన అన్నకొలువులో । ఆలకించీలేచినవ్వె లక్ష్మణుడు ।
కిలకిలనవ్వె లక్ష్మణదేవరపుడు । కలతలుబుట్టెనూ కపులకందరికి ।
కిలకిలనవ్వె లక్ష్మణదేవరపుడు । కిలకిలనవ్వగా ఖిన్నుడాయెరాజు ।
ఇందరిచిత్తమ్ము యీవిధమ్మననూ । నిండినకొలువెల్ల కడుచిన్నబోయే ।
శంకరుడుతనలోను తలచియిట్లనెను । జాలారివీధులా నీలకన్యకను ।
జడలెత్తిశిరసునా ధరియిస్తినన్నీ । తలచిలక్ష్మణనేడు తానెవ్వనన్నీ ।
శంకరుడుకొలువులో తలవంచుకొనెను । జాంబవంతుడుతనలోను తలచియిట్లనెను
ఈశ్వరునిపెండ్లికి ఈజగమంతా । పిలువనంపిరి తన్ను ప్రేమతోడుతను ।
గునగుననడువగా కురచజంఘలను । పనిపూనినడువగా పదములోపలను ।
నడుమువిరిగెనుతనకు నాడుమొదలుకొనీ । తలచిలక్ష్మణనేడు తానెవ్వననుచు ।
జాంబంతుడుకొలువులో తలవంచుకొనెను । శేషుడుతనలోను తలచియిట్లనెను ।
ఎల్లకాలమురాజు పానుపుగానుండి । పగవానికీవీడు భక్తుడాయెననుచు ।

తలచిలక్ష్మణనేడు తానెవ్వనసుచు । శేషుకుకొలువులో తలవంచుకొనెను ।
నీలుడుతనలోను తలచియిట్లనెను । తండ్రిదేవాపూజ తగుననుచుచేసె ।
నీళ్ళలోపలాముంచి నిండంగబట్టీ । తేలకుండాబట్టీ చెప్పకుండాను ।
తలచిలక్ష్మణనేడు తానెవ్వనసుచు । నీలుడుకొలువులో తలవంచుకొనెను ।
అంగధుడుతలోను తలచియిట్లనెను । సాహసమ్మునతండ్రి చంపినారాజూ ।
తలచివేసుకకూడు కుడిచెవీడనచూ । తలచిలక్ష్మణనేడు తానెవ్వనసుచు ।
అంగదుడుకొలువులో తలవంచుకొనెను । సుగ్రీవుడుతనలోను తలచియిట్లనెను ।
తనవెనుకతనఅన్న ఆవాలిజంపి । చంపితనవదినెను సతిచేసుకొని ।
కానకయున్నాడు కపీంద్రుడనుచు । కిష్కంధరాజ్యమ్ము యేలెవీడనుచు ।
తలచిలక్ష్మణనేడు తానెవ్వనసుచు । సుగ్రీవుడుకొలువులో తలవంచుకొనెను ।
విభీషణుడుతనలోను తలచియిట్లనెను । ఆయువులుదెలిపి యుపాయమమరించి ।
అక్షోహిణిబలగములు అందరినిజంపి । లంకకుపట్నపు రాజైతిననుచు ।
తలచిలక్ష్మణనేడు తానెవ్వనసుచు । విభీషణుడుకొలువులో తలవంచుకొనెను ।
హనుమంతుడు తనలోనుతలచియిట్లనెనూ । పెద్దవాడినెంతయిన పేరులకుపెద్దా ।
పడుచువానిచేత పట్టుబడితిననుచు । తలచిలక్ష్మణనేడు తానవ్వెననుచు ।
అంజనీసుతుడైన హనుమతలవాల్చె । భరతశత్రుఘ్నులు భయమందిరంతా ।
భరణెల్లబుచ్చుకొని తమతల్లికైకా । పంపెనుయుగ్రంపు నడవులకనుచు ।
ఇమ్మహివత్తురే ఈమహీపతులు । ఇష్టసంపదలతో నిట్లున్నవారు ।
తలలుగానీతలలు వాల్చిరిద్దరును । ధాత్రిసుతతనలోను తలచియిట్లనెను ।
కారడవిలో దశకంఠునిచేత । పట్టుపడ్డట్టియో సతితోడలమీద ।
పెట్టుకొనియున్నాడు సృష్టీశ్వరడనుచు । అతివయారు నెలలుబాసియీరాజు ।
ప్రాణములుయెట్లుండెయో కోమలాంగి । ఆడరానిమాటలాడి తివనుచూ ।
ఆడవారీమాట నమ్మరాదనుచు । తలచిలక్ష్మణ నేడుతానవ్వెననుచు ।
ధాత్రిసుతకొలువులో తలవంచుకొనెను । సభవిడిచిచెడియున్న సర్వేశ్వరూలు ।
సతిముఖముజూచియు తాచిన్నబోయె । ఇంతకాలమాయె నీకపులనేలి ।
కలకలబుట్టుటకు కారణంబేమి । కొలువులోనవ్వుటకు కోపించెరాజు ।
తలతెగవేతునని తాఖడ్గమెత్తి । వారుయెత్తుకబోయిరి వనజనాభులను ।
వనితశంభూలంత తమరడ్డుపడిరి । భూమీశలక్ష్మన్న బాలుండుగాడా ।
ధరణీశతగదయ్య సౌమిత్రినరుక । వీరుడాశూరుడా శౌర్యపరుండా ।
కారణమునవ్వేమి అనుజుడచెపుమా । ధరణీశతమ్ముడని సయ్యబిలచినను ।

ధరణిజతావణకె చెమ్మటగురిసే । గడగడావణకుచు కమలాయతాక్షి ।
వెరవుతోవత్తెతన విభునిపాదములు । అత్యంతవరమూర్తి అతిదాయకుడవు ।
శ్రితకల్పవృక్షమా సిరిదాయకుడవు । రాజులభోజుడవు రామచంద్రుడవు ।
ధర్మచారిత్రుడవు తర్కమేమిటికి । ఇందిరానాయకా ఇక్ష్వాకులతిలకా ।
నాదొకవిన్నపము నరనాథవినుమి । ముందుమనమడవులకు పోయున్ననాడు ।
ఆపర్ణశాలలో మనముండగాను । పరమాత్మమీసేవ చేయగాజూచి ।
ఉండగానేవచ్చె ఉత్తమ్మునిద్రా । రెండుజాములవేళ్ళ నిద్రయేతెంచె ।
వాలేటిఅంబులను లక్కబంతులను । పొందవచ్చినప్పుడే వాలుటంబులను ।
సతిరూపుజేకొని దిగజడియెద్యా । అతివనీవ్వారే అంగలార్చేవు ।
భూమీశపుట్టు నిద్రాదేవితాను । అష్టదిగ్గజములను ఆదిఋషులా ।
వైకుంఠనాథులను వసియింతునేను । సప్తసాగరంబులను చవటపడుగులను ।
పారేటినదులను భ్రమయింతునేను । పక్షులజాతులలోను పర్వతంబులను ।
వృక్షాలపైనుండి విహరింతునేమ । నరులుయెవ్వారును ననుగెల్వలేరు ।
దీనతపడియుందు నీయాజ్ఞాలేదు । నిలువరానివ్వదే దీనిచేతాజ్ఞ ।
వలగొనిముమ్మారు ప్రదక్షిణముజేసి । సాష్టాంగ దండనమస్కారములుజేసీ ।
మాయన్నరఘుపతికి మావదినకూను । ఈపర్ణశాలకే తానుకాపనెను ।
పొమ్మిడిఅయోధ్య వేగపురినగరు । తన్నుబాసితన సతియుండదగదు ।
రాత్రియునుపగలును లేవకుండగును । తనువిడచిపొందు మీధవళాక్షినిద్ర ।
కడువేడ్కఅయోధ్య కనకపట్నాన । కాకుత్థ్సతిలకుడూ గట్టిననాడు ।
నేనలుమంత్రులూ కొలువైయుండగను । అపుడుతనుపొందుమని పలికీతిననెను ।
తప్పకయొకఘడియ తడబడకుండ । తనునిద్రపొందుతే నవ్వీతిననెను ।
అనెడితమ్మునిపల్కు లాలించివినుచూ । అరచేతికన్నీరు అతిసహస్రమాయె ।
జలముఅంజలిపైని కలయగురిపించే । ఈపాపభయము తనకేవిధంబునను ।
పరిహరించేటి యుపాయంబులేదు । తనలోనెతలవిడవ తలచెరాఘవులు ।
ఆఋషులువాశిష్టు అప్పుడిట్లనిరి । భూమీశమీకిట్లు బుద్ధిగాదయ్యా ।
మీరులక్ష్మన్నకే నిదర్పిటమమర్చి । పాదాలువత్తుమని పలికెరాముని ।
ఆమాటవినియపుడు సంతోషముగను । కనకకుంచలవార్ని కలయబిలపించే ।
అంగళ్ళవీధులూ తుడిచేటివారు । ముత్యాలమ్రుగ్గులూ పెట్టేటివారు ।
రత్నాలరంగవల్లి వ్రాసేటివారు । మాణిక్యాలదివ్వెల నెత్తేటీవారు ।
మకరతోరణాలు కట్టేటివారు । కడులెస్సకనక స్తంభంబులామీద ।

మరిలెన్నదీపాలు పెట్టేటివారు । నిండుకుండలుదెచ్చి నిలిపేటివారు ।
బొడ్డుమల్లెలు పోగులుబోసేటివారు । ఏడునిలువుల కనకమేడలోపలనుంచీ ।
పాన్పుపై నేత్రావళి పచ్చాడముంచి । అచ్చచామంతులు అభ్యాంగలూను ।
ఆమంచిపానుపున అవిచాలబరచిరి । ప్రొద్దుపోయి పూసినవిబొడ్డుమల్లెల్లు ।
ఆమంచిపానుపున అవిచాలబరచిరి । పందెళ్ళబూసినవి పారిజాతములు ।
ఆమంచిపానుపున అవిచాలబరచిరి । ఘడియోయిబూసినవి కనకరత్నములు ।
ఆమంచిపానుపున అవిచాలబరచిరి । కావిళ్ళదెచ్చేరు కలపపువ్వాలు ।
ఆమంచిపానుపున అవిచాలబరచిరి । మోపులతోదెచ్చేరు మొగలిపువ్వాలు ।
ఆమంచిపానుపున అవిచాలబరచిరి । ఝామోయిపూసినవి జాజిపువ్వులు ।
ఆమంచిపానుపున అవిచాలబరచిరి । మొగలిపువురేకులా తలగడలుయుంచి ।
మల్లెపువ్వులుజాజులు పానుపునాబరచిరీ । అంగదుడుహనుమంతు సుగ్రీవుడును ।
చెట్టలుబట్టుకొని శీఘ్రానవచ్చిరి । ఆసొంపుజూడగా నలవియేగాదు ।
రెండుకన్నులు బ్రహ్మకావించేగాని । వెయ్యికన్నులజూడ తీరదాపేక్ష ।
అంపుమీయోస్వామి అనుజ్ఞలిచ్చి । ముమ్మారువలగొని ప్రదక్షిణముజేసి ।
సాష్టాంగదండ నమస్కారములుజేసె । పాదములపైనున్న తమ్ముణ్ణియెత్తి ।
అలసితివినాతండ్రి నిద్రబోవయ్య । వద్దనూనిలుచున్న పదినెకుమ్రొక్కి ।
భద్రగజంబుపై యెక్కించిరపుడు । కంచుమద్దెలవారు కమ్ముకొనిరాగా ।
బాగుశ్రీరాముని బంట్లుపొగడగను । రాజద్వారముజొచ్చె రాముతమ్ముడూ ।
అటకలితలగడిగెనే అంభోజనేత్రి । పితాంబరముగట్టె ప్రతిభమీరంగ ।
నాలుగువేలూజేయు నానుమెడవేసె । పదివేలుజేయు పతకములువేసె ।
చేడెకుయింపైన చెవులపువ్వులుబెట్టె । నవరత్నపువత్తులు నాతితానుంచె ।
వయ్యారినడకతో పయ్యదజార । వారచూపులుజూస్తు వచ్చెనాదేవి ।
వయ్యారితనపతి నొయ్యారగాను । పాన్పొద్దనిలుచుండె పద్మాయతాక్షి ।
ఊర్మిళాభావంబు తెలసిలక్ష్మణుడు । ఇంతినీవురాను వేళగాదనెను ।
ఊర్మిళనువీడుగొలిపె శ్రీలక్ష్మణుడు । శేషునిపైనిద్ర సేయుచున్నారు ।
ఓఘడియనిద్రిస్తి ఒకజాములాయె । ఒకజామునిద్రిస్తె పకరోజులాయె ।
ఇదియేమితమ్ముడు తడవునిద్రించె । అవనిజవల్లభుబు నిరుపనితహొందీ ।
జూచిహనుమన్న జూచిరావోయి । ముద్దియతో ముచ్చటాడుచున్నాడో ।
చేడెతోజెలక్రీడ లాడుచున్నాడో । ఈవలాఓజంఘ ఆవలాజూచి ।
ముద్దియలేదని ముదముతోబలికె । తమ్ముని పాన్పును జూడవలెననియు ।

చేడెలేదనినతనకు అభిలాషపుట్టె । అంతప్రధానుల నంతటనుంచె ।
శతృఘ్నునితోడుకొని శీఘ్రానవచ్చె । అంతటశతృఘ్ను నంతటనుంచి ।
పాన్పుపైగూర్చిండి శ్రీరాఘవులు । తమ్ముని పాదములు తొడలపైనుంచి ।
వొయ్యనిపాదములు వత్తుచున్నారు । ఒకమారువత్తితే నూరుకొనియుండే ।
రెండవమాటకీ కలగంటిననేను । మూడవమాటికీ కనువిప్పిజూచి ।
కలగాదునిజమనీ కడుభీతినొంది । కలగాదునిజమని కనువిప్పిజూచి ।
ధరణీశుడగుటదెలిసి ధరణిపైవ్రాలె । మీయడుగులొత్తేటి ప్రాయమువాణ్ని ।
అహల్యపావనమైన అడుగుమీయడుగు । బలిశిరసునున్నదీ అడుగుమీఅడుగు ।
మీయడుగులొత్తుదురు సమస్తదేవతలు । నాయడుగులొత్త శ్రీజగన్నాథతగదు ।
పాదములపైనున్న తమ్ముణ్నియెత్తి । కనకసింహాసనమున కూర్చుండబెట్టి ।
చంద్రుడులేనిరాత్రి యెట్టిదటబోలు । తమ్ముడానీవులేని సభయట్లైబోలు ।
దీపమ్ములేనిల్లు యెట్టిదటబోలు । తమ్ముడానీవులేని సభయట్లైబోలు ।
పతిలేనిసతి యెట్టిదటబోలు । తమ్ముడానీవులేని సభయట్లైబోలు ।
ఉదకమ్ములేని కలశమెట్టిదటబోలు । తమ్ముడానీవులేని సభయట్లైబోలు ।
చిలుకలేని పంజరమెట్టిదటబోలు । తమ్ముడానీవులేని సభయట్లైబోలు ।
తమ్ముడానీవిపుడు సభకుయేతెంచు । తమ్ముడుతానును సభకుయేతెంచి ।
ముత్యాలగద్దెపై తమ్ములనుయుంచి । రత్నసింహాసనమున తాముగూర్చుండ్రి ।
సకలగుణములుగల సంపూర్ణవినుమా । హనుమంతాకీర్తి వంతరమ్మనెను ।
శాంతమేడలకు నీవుయేతెంచి । శాంతమ్మనుదోడుకొని శీఘ్రానరమ్మి ।
ఆపలుకులువిని సంతోషముననూ । అప్పుడూహనుమాన్లు యేతెంచెతాను ।
ఏమోయిహనుమాన్లు యిటువచ్చినావు । నీవువచ్చినపనులు యెరిగించుమనెను ।
అమ్మశ్రీరాములూ మిమ్ములనుయిపుడు । తోడుకురమ్మనీ సెలవిచ్చెరాజు ।
ఆపలుకులువివి శాంతసంతోషమునను । వజ్రాలపల్లకీ యెక్కితావచ్చె ।
అల్లంతటశాంతమ్మ రాకలూజూచి । తమ్ములుతమరును యెదురుచనుదెంచ్రీ ।
ముమ్మారువలగొనీ ప్రదక్షిణములుజేసి । సాష్టాంగ దండనమస్కారములుజేసిరి ।
తమసరసనుశాంతమ్మ గద్దెబెట్టించి । కొలువైగూర్చుండిరి శ్రీరాఘవులు ।
వింటివాశాంతమ్మ యిప్పుడూనీవు । వివాహము లయ్యేటినాడు ।
వీరుచిన్నలువారు బాల్యలేసుమ్మి । ఈవెనుకపదునాల్గు యేండ్లుఅడవులలో ।
తిరిగెవ్వరోమరి గుర్తెరుగరైరి । వీరికినివారికిని తగునోలేదో ।
జూడవలెననితనకు అభిలాషబుట్టె । మనవారినిమనము మనమనుకోరాదు ।

వారిముందరవీరు రాణించరనెనూ । గవాలీమార్గమున చూడుశ్రీరామ ।
కనుదృష్టిమార్గాన చూడుశ్రీరామా । భోజనపుశాలలో చూడుశ్రీరామ ।
శాంతమరుగుననుండి జూడుశ్రీరామ । సకలగుణములుగలా సంపూర్ణవినుమా ।
హనుమంతాకీర్తి మంతరమ్మనెను । శీఘ్రిమునఋషిపల్లె నగరికేతెంచూ ।
మూడుకోట్లమునుల ఆరుకోట్లఋషుల । జమదగ్నిదూర్వాస సప్తమహాఋషుల ।
సప్తమహాఋషుల సమస్తదేవతలా । వశిష్ఠమొదలైన ఋష్యశృంగులను ।
వారలదోడుకొని శీఘ్రానరమ్మీ । ఆమాటవినియపుడు సంతోషముగను ।
శీఘ్రానఋషిపల్లె నగరికేతెంచే । వందనమ్ములుచేసి ముందరానిలచి ।
అయ్యశ్రీరాఘవులు మమ్మంపినారు । మూడుకోట్లమునులను ఆరుకోట్లఋషుల ।
జమదగ్నిదూర్వాస సప్తమహాఋషుల । సప్తమహాఋషులను సమస్తదేవతలా ।
ఋష్యశృంగుల్నిదోడుకొని వేంచేయుమనిరి । అతిశీఘ్రముగాను వేంచేయుమనిరి ।
అతిశీఘ్రముగవచ్చి రామునులంతా । వచ్చినవారికీ వందనముజేసి ।
వారికితగిన సింహాసనాలిచ్చి । కొలువైగూర్చుండ్రి శ్రీరాఘవులు ।
వింటిరావశిష్ఠ యిప్పుడుమీరు । వీరికివివాహమ్ములయ్యేటినాడు ।
వీరుచీన్నలు వారుబాలలేసుమ్మీ । ఈవెనుకపదునాల్గేండ్లు యడవులలో ।
తిరిగెవ్వరోమరీ గుర్తెరుగరేరి । వీరికివివాహముహూర్తమెప్పుడో ।
ఆమంచిముహూర్తమ్ము బెట్టుమనిబలికె ।మునులపుడు సంతోషమునగూరుచుండి ।
అప్పుడుపంచాంగములు విప్పిజూచీరి । క్షేత్రమైనామంచి కార్తీకమాసము ।
అందమైనామంచి ఆదివారమున । పంచమీఆమంచి ఆదివారమున ।
ఝామేడుఘడియలా రాతిరివేళా । వీరికితగినట్టి వివాహముహూర్తమ్మూ ।
నిర్ణయించీరపుడు మహామునులెల్ల । సభలోనుయున్న మహామునులజూచి ।
మరదళ్ళనుజూడవచ్చు నాయనితానుబలికే । తరుణులకళ్లను తమరుబడకుండ ।
తరుణులనుజూడవచ్చు తప్పేమిలేదు । అంతఃపురములోను లోగిళ్ళలోను ।
రాణివాసమ్మున నేనుకొలువుండ । తరుణుబిల్వగా తమ్ముడాజూడూ ।
సీతముఖమూజూచి రామచంద్రూలూ । చిరినవ్వునవ్వుచు ఇట్లనిరపుడూ ।
అతివరోసీతోడి చెల్లెళ్ళనల్లా । మరదళ్ళనేరీతి జూపెదవనెను ।
రాణివాసస్త్రీలను రాజుజూచుటకు । ఇటువంటికోరికలు నేజూడలేదు ।
అతివరోఅందుకూ అడ్డాడబోకు । అందుకూమాఅక్క హర్షించినదీ ।
పెద్దలుమహామునులు ఒప్పుకున్నారు । ఆమాటవినియపుడు సంతోషముగను ।
రావోయిహనుమన్న వాయునందనుడ । శీఘ్రానకౌసల్య నగరికేతెంచు ।

అత్తలకోడళ్ళ వేంచేయుమనుమి । ఆమాటవినియపుడు సంతోషముగనూ ।
శ్రీఘనకౌసల్య నగరికేతెంచె । వందనంబులుజేసి ముందరానిలచి ।
అమ్మశ్రీరాఘవులు మమ్మంపినారు । వార్తచెప్పెదవినుడు వరుసగామిమ్ము ।
అత్తకోడళ్ళ వేంచేయుమనిరీ । మాళవినిదీసుకుని యొప్పుతోడుతను ।
కౌసల్యకనక దండందనాలెక్కె । ఊర్మిళనుదీసుకొని యొప్పుతోడుతను ।
కైకమ్మపచ్చల పల్లకీలెక్కె । శతకీర్తినిదీసుకొని యొప్పుతోడుతను ।
సుమిత్రసువర్ణంపు పల్లకీలెక్కె । అత్తలుకోడళ్ళు వేంచేయగాను ।
అత్తలకుముగ్గురికి వందనములుజేసి । జనకసుతచెల్లెళ్ళ తాకౌగలించె ।
పతిచూచిపొంగితివా పద్మాయతాక్షి । జనకసుతచెల్లెళ్ళు సంతోషమునను ।
రావోయిహనుమంతు వాయునందనుడ । శ్రీఘనజానకి నగరికేతెంచు ।
చేడెలకుశృంగారం చేయమనిచెప్పు । శ్రీఘనజానకి నగరికేతెంచీ ।
వందనంబులుజేసి ముందరనిలచి । అమ్మశ్రీరాఘవులు మమ్మంపినారు ।
చేడెలకుశృంగారము జేయుమన్నారు । ఆమాటలువినియపుడు సంతోషముగను ।
అరుంధతీనృసింహ పార్వతీదేవి । పాడుతుశిరసంత్రి పణతులుముగ్గురు ।
పరిమళమ్ములుదెచ్చి నలుగులుబెట్టింత్రి । అచ్చశ్రీగంధాన అటకళ్ళగాత్రీ ।
వెండెయ్యకాగుల వేణీళ్ళదోడి । ఛమిడయ్యపదికాగుల చన్నీళ్ళదోడి ।
చన్నీళ్ళవేణీళ్ళ సమముగాదొలిపి । కుంకమ్మలమరినాకుదు ళ్ళనిలిపే ।
ముత్యాలముంతలు ముగుదలందియ్యా । ముదపైరిమరదళ్ళు మజ్జనంబాడ్రీ ।
చంద్రకావిముంతలు చేడియలందియ్య । జనకునికూతుళ్ళ మజ్జనంబాడ్రీ ।
శంఖులట్టగా భేరిజేగంటలుమ్రోయా । దశరథులకోడళ్ళు మజ్జనంబాడ్రి ।
కళ్యాణజేగంట కంచుదిభేరి । కౌసల్యకోడళ్ళు మజ్జనంబాడ్రీ ।
సన్నవలిపముదెచ్చి తళ్ళొప్పతొత్తిరి । కురులుచిక్కులుదీసి మురువెన్నముడిచిరి ।
భాండారమేలేటి బ్రజలబిలిపించి । తాళాలచేతనే పెట్టెలుదీయించి ।
ఛరిణలుదెప్పించి పైకప్పులుదీస్రీ । గట్టిమట్టిలుబెట్టిరి కడయమ్ములుంచిరి ।
అందెలుచరణా రవిందములబెట్టిరి । చిరిగజ్జెలుపెట్టిరి శృంగారముగను ।
చిటికెనబొద్దులుపెట్రి పిల్లేళ్ళుపెట్రి । అన్నివేళ్ళకును అమరించినారు ।
శుద్ధసువర్ణాన జేయించినట్టి । సూడిగాజులుబెట్రి సుదతులచేత ।
చామపుపుకడియములు హస్తకడియములు । చెన్నుమీరగవారి చేతులనుంత్రీ ।
నవరత్నఖచితమున నరులొప్పుచున్న । గిరిగిరంబులనుంచెతాను ఆశాంతా ।
సందెటిదండలుబెట్రి తావేజులుబెట్రి । దండకడియములు బన్నస్వరములేబెట్రి ।

చేడెకుయింపైన చెవులపువులబెట్టి । నవరత్నపుజుమకాలు నాతులకునుంచ్రి ।
బలువైనముత్యాల పాపిటచేరులను । చేరుచుక్కలుంచెనే చెలియజానకి ।
నవరత్నఖచితముతో నడుమచెక్కినవి । బలువైనజడలువేసిరి పణతులకపుడు ।
సన్నజాజులుదెచ్చి బంతులేగట్టి । బంతులుజడపై బదిలముగనుంచ్రి ।
మొగలిరేకుకుట్రి మోహమలరగను । మరదళ్ళనుజూచి యోశాంతామహాదేవి ।
తెమ్మనవేజానకి తొడుగులఃయనెను । మునుపుగౌతిముడుమెచ్చిచ్చినాడనుచు ।
అవిదెచ్చిమాళవికి హస్తమునసుంచ్రి । అగ్నిహోత్రుడుమెచ్చి యిచ్చినాడనుచు ।
అవిదెచ్చిశతకీర్తి హస్తమునసుంచ్రి । ఇంద్రాకావిరవికెలు ఈడుకావన్నీ ।
చంద్రికావిరవికెలు జానకివన్ని । బిగుదట్టిరవికెలు తొడగించిరపుడు ।
అమరగవంకీలు అతివలకునుంచిరి । హస్తములకమరిన ఆభరణములుంచిరి ।
బంగారునీరుతో పరిపూర్ణమైన । పట్టుచీరలుదెచ్చి కట్టించిరపుడు ।
అమరినయొడ్డాన మతివలకునుంచిరి । బిళ్ళలమొలత్రాళ్లు బిగువుగానుంచిరి ।
అందమైనామంచి మొహర్లపేర్లుంచిరి । కనుసోగకన్నులకాటుక దీర్చి ।
తీర్చైనకస్తూరి తిలకములుదిద్ది । గంధంబుకస్తూరి కలపంబుజేసి ।
అప్పుడుచెల్లెళ్ళ కలదెజానకి । వీవనపుచ్చుకొని విసరుచుండగను ।
సంతోషవారధితేలె జానకి । బంగారునీరుతో పరిపూర్ణమైన ।
పట్టుశాలులుదెచ్చిగవిసెనలవేసిరి । రెండుకన్నులబ్రహ్మగావించెగాని ।
వెయ్యికన్నులజూడ దీరదాపేక్ష । హంసలనడకల అతివొప్పుచుండె ।
భోజనపుశాలకేవేంచేసిరపుడు । నవరత్నఖచితమయి అమరాపీఠమున ।
శాంతమహాదేవి నగుచుగూర్చుండె । మాళవిఊర్మిళ మగువశతకీర్తి ।
శాంతకుయిరుగడల సురటివిసరగను । ఆసీతమహదేవి ఆకుమణచిచ్చె ।
అచ్చకర్పూర ఆకుమణచిచ్చె । రావోయిహనుమన్నా వాయునందనుడ ।
శీఘ్రానశ్రీరామ కొలువుకేతెంచు । భోజనపుశాలకే వేంచేయుమనుమీ ।
ఆమాటవినియపుడు సంతోషముగను । అంతటప్రధాన్ల నంతటినుంచి ।
శత్రుఘ్నునిదోడుకొని శీఘ్రానవచ్చె । గవాక్షమార్గాన కను దృష్టియుంచి ।
రెప్పవేయకను కనులువిప్పెమోహమున । అట్టెతొలకరిమెరుపు హంసనడకలది ।
పుత్తడిబొమ్మ లేడివలెజూపు । శాంతకుచందనం బూయుచున్నది ।
ఆదేవియెవ్వరు శత్రుఘ్నుయనెను । సౌమిత్రిభార్య ఊర్మిళయనెను ।
చిగురుటాకులబోలు చిన్నపాదములు । బోలునువజ్రాల బోలుపలువరస ।
అట్టెతొలకరిమెరుపు హంసనడకలది । శాంతమ్మకును సురటివిసురుచున్నది ।

ఆదేవిఎవ్వరో శతృఘ్నుయనెను । భరతునిపట్నంపుదేవి సుమియనెనూ ।
చిగురాకుపాదములు సింహమద్యములు । తగువింటిచేతులే తగువంటిచాయ ।
శింగిణివిత్కులబోలు కనుబొమలతీరు । కలువరేకులబోలు కన్నులతీరు ।
దానిమ్మగింజలే తరుణిపలువరస । చామంతిరేకులే చెలియచెక్కిళ్ళు ।
చంద్రుడుతనలోన సిగ్గుపడుచుండు । ఆదేవిముఖకాంతి సాటిరాదనెను ।
తుమ్మెదలుతలలోను ఝుంకారముండు । ఆదేవికురులందము సాటిరాదనెను ।
నల్లనిమేనుదీనగు మోముగలది । ఆదేవియెవ్వరో శతృఘ్నుయనెను ।
తనదేవిజెప్పక తానూరకుండె । సిగ్గుపడినిలుచున్న తమ్ముణ్ణిజూచి ।
చిరునవ్వునవ్విరి శ్రీరాఘవులు । ముందునీవుజేసిన ఫలమేమోగాని ।
యింతచక్కనిదేవి సతిగలుగుటకును । చుక్కలలోబాల చంద్రుడునట్లు ।
కొలువైగూర్చున్న మనఅక్కజూడు । అందరిలోపల సుందరిననుచు ।
అష్టవంకర్లతో మీవదినెనుజూడు । అలాగుననరాదు అన్నరాఘవులు ।
ఆదిలక్ష్మీసీత అలోకమాత । ఇదిముహూర్తమువేళాయె యేమిమాటల్లు ।
కదలుడుశీఘ్రాన కాకుత్థ్సుయనెను । రావోయిహనుమన్న వాయునందనుడ ।
శీఘ్రానశాంతమ్మ నగరికేతేంచు । ఎంతోశృంగారంబు యెంతయోసొగసు ।
భరతునికిసౌమిత్రికి శతృఘ్నునికినీ । అభ్యంగనమ్ములు గావలెనుయనుమీ ।
ఆమాటవినియప్పుడు సంతోషముగను । శీఘ్రానశాంతమ్మ నగరికేతెంచె ।
వందనములుజేసి ముందరనిలచి । అమ్మశ్రీరాఘవులు మమ్మంపినారు ।
భరతునికిసౌమిత్రికి శతృఘ్ననికి । అభ్యంగనమ్ములు కావలెననిరి ।
అరుంధతీన్నృశింహపార్వతీదేవీ । పాడుచుశిరసంట్రి పణతులుముగ్గురు ।
పరిమెళమ్ములుదెచ్చి నలుగుబెట్టింర్రీ । అచ్చశ్రీగంధాన అటకళ్లుగాచిరి ।
కుంకమ్ములమరి కుదుళ్ళనుంచ్రి । ముత్యాలముంతలు ముగుదలందియ్య ।
మురవైరితమ్ములు మజ్జనంబాడ్రీ । లోకంబులెల్ల విలోకించెసొగసు ।
దశదిశదిక్కులు దీప్తిల్లగాను । దశరథులకొమాళ్ళు మజ్జనంబాడ్రి ।
చంద్రకావిగొడులుచేర్చిబట్టగను । జనకులఅల్లుళ్ళు మజ్జనంబాడ్రీ ।
కళ్యాణపేగంట కంచుదిభేరి । కౌసల్యకొమాళ్ళు మజ్జనంబాడ్రి ।
శంఖులుబట్టగభేరి జాగంటలుమోగ్రియ । శాంతమ్మతమ్ములు మజ్జనంబాడిరి ।
పసిడిచిలుకలపసిడి దుప్పట్లుదెచ్చి । ఘమిడితశ్యోత్తుదురు పరమాత్ములకును ।
బంగారపూజిలుగు పద్మాలపట్టూ । పట్టుపీతాంబ్రములు కట్టనిచ్చిరీ ।
కురులుచిక్కులుదీసి వేఋసిగలువేసి । తిరుమణిబెట్టిరి తిరిచూర్ణమిడిరి ।

చుక్కలకుమిక్కిలి గొప్పలుగవెలుగు । ఆణిముత్యమ్ములే యెంచిగుచ్చినవి ।
పచ్చలపతకములు బాగుగావేస్రీ । చిన్ననాటీగోరు పులిగోరుతోను ।
నేవళమ్ములుబెట్టె తమ్ములకపుడు । సందటిదండలు బెట్టితావేజుబెట్రి ।
దండగడయములు బన్నస్వరములేబెట్రి । నాలుగువేలుజేయు నానుమెడవేస్రి ।
పదివేలుజేయు పతకములువేసిరి । ముత్యాలపోగులు ముదముతోనుంచిరి ।
ఆకిరీటముభరతునికి అమరదుఅని । తనశిరస్సుకిరీటము భరతునికిచ్చుంచే ।
గంధమ్ముకస్తూరి కలపనంబుజేసి । అప్పుడుతమ్ములకు అలదెరాఘవులు ।
వీవనబుచ్చుకు విసరుచుండగను । సంతోషవారధి తేలెరాముండు ।
అచ్చకర్పూరాన తాంబూలమిచ్చె । అంతఃపురమ్ములో లోగిళ్ళలోను ।
అలంకరించిరిమూడు మహలులుతమకు । ఏడునిలువుల కనకమేడల్లలోను ।
పానుపుమీదనే పచ్చావళించిరి । పట్టుతలగడయో పూలచెక్కాలు ।
ఆమంచిపాన్పున అవిచాలనుంచె । ప్రొద్దోయిబూసినవి పొన్నపువ్వూలు ।
ఆమంచిపాన్పున అవిచాలబరచి । నిశోయిబూసినవి నీలాంబరాలు ।
ఆమంచిపానుపున అవిచాలపరచి । ఇంకానుపువ్వులు ఏమేమియైన ।
కావిళ్లదెచ్చేరు కలవపువ్వుల్లు । అమంచిపానుపున అవిచాలబరచి ।
జాజికాయజాపత్రిలవంగాలు । మంచిపరిమళాదులే బాగుగనుంచిరి ।
నవరత్నఖచితమౌ నడుమపీఠమున । ఫలములుపంచపదార్ధములనుంచిరి ।
బంగారుచెంబుతో పానకంబుంచిరి । నిలువుటద్దమ్ములే నిలిపిరచ్చోట ।
మాణిక్యదీపాలు మరివెలుగుచుండ । కర్పూరదీపాలు ఘనముగానుంచిరి ।
పచ్చకర్పూరాన తాంబూలాలుంచ్రీ । రావోయిహనుమన్న వాయునందనుడ ।
శీఘ్రానకౌసల్య నగరికేతెంచు । తల్లుల్నిదోడుకొని శీఘ్రానరమ్మ ।
ఆపలుకులువినిసంతోషమునను । ఏతెంచెకౌసల్య నగరిలోపలికి ।
ఏమోయిహనుమాన్లు యిటువచ్చినావు । నీవువచ్చినపనులు యెరిగించుమనెను ।
అయ్యశ్రీరాములు మిమ్మలనుయిపుడు । తోడుకొనిరమ్మని సెలవిచ్చినారు ।
ఆపలుకులువినిసంతోషమునను । ముత్యాలపల్లకీ యెక్కెకౌసల్య ।
పచ్చలపల్లకీ యెక్కెకైకమ్మ । సుమిత్రసువర్ణంపుపల్లకియెక్కె ।
తనయులమేడలకు తల్లులేతెంచిరి । అల్లంతదూరాన తల్లులనుజూచి ।
వలగొనిముమ్మారు ప్రదక్షిణముజేసె । తప్పకదండ నమస్కారములుజేసి ।
ముత్యాలగద్దెపై తల్లులనుయుంచి । రత్నసింహాసనమున తమరుగూర్చుండ్రి ।
తనయులశృంగారముతల్లులుజూచి । దశరథులనుతలచుకొనికన్నీరుదెచ్చె ।

దశరథులులేని వెలితొక్కటేగాని । ఉన్నవెల్తులులేవు యువిదరోమనకు ।
రావోయిహనుమన్న వాయునందనుడా । శీఘ్రానఅశ్వములసాలకేతెంచు ।
ఉత్తమయినశ్వాల తోడితెమ్మనిరి । గంగజలములుదెచ్చి కడిగితశ్వాత్తి ।
అర్చించిపూజించి నైవేద్యమిచ్చె । ముత్యాలహారములుముందరవేసి ।
పగడాలహారములు పలకసములేస్రీ । ఢెంకిభేరీవారు బిరుదులుదెచ్చి ।
తెచ్చిరిఅయ్యోధ్య వీధులనుంచిరి । నివ్వాళ్ళుదెమ్మనుచు నెలతలకుసాటించిరి ।
హారతులుసతుల దెమ్మనుచుసాటించిరి । నివాళ్ళుదెచ్చిరి నెలతలందరును ।
హారతులుదెచ్చిరతివలందరును । బంగారుపావాలు భరతునకునిచ్చె ।
అంగుళీకములు సౌమిత్రికియిచ్చె । బాహుదండలు శతృఘ్నునకిచ్చె ।
ఆట్టియాదశరథులు యెక్కేటిగజము । శ్రీరాముని మోతునని కరముపొంగుచు ।
కుడిజంఘలీడ్చుకొని పొంగుచువచ్చె । అశ్వములనెక్కుమనిరి ఆరాఘవులు ।
ఈమునులుయుండగా మీరుయుండగను । అశ్వములనెక్కేటి ధర్మమాయనెను ।
వివాహమప్పుడూ వేడుకప్పుడు । తప్పులేదుసుమ్మి సౌమిత్రియనెను ।
అశ్వరత్నాలెక్కి రన్నదమ్ములు । భద్రగజంబునెక్కిరి శ్రీరాఘవులు ।
కంచుమద్దెలవారు కమ్ముకొనిరాగా । పాటకులుపాడగా భటులుపొగడగను ।
కైవారములుజేసిరి కవులిరుగడలా । పాడుచుఅప్సరా స్త్రీలుయాడగను ।
రాజద్వారముపెడలిరి రామచంద్రులు । ఒప్పైనసౌధములు యెక్కేటివారు ।
ఉప్పరములమీద నిలచేటివారు । కర్పూరహారతు లిచ్చేటివారు ।
కనుదృష్టితప్పక చూచేటివారు । కరుణాకరులనుజూచి పలికేటివారు ।
వజ్రంపుగొడుగులు వారుపట్టగను । నగరిలోపలకొచ్చె నారాయణులు ।
తనయులకుయెదురు చనుదెంచెకైకేయి । పచ్చకూశ్మాదెచ్చి బడిసివేయించె ।
అనేకశల్లాలు బడిసివేయించె । పచ్చంగవేసినా పందిళ్ళలోను ।
అనుజులతోనిలచి రారాఘవులు । శ్రీరాఘవునిజూడ అతివేడ్కతోను ।
దిక్కుదిక్కులవారు గ్రిక్కునవచ్చిరి । అంజనీసుతుడయిన హనుమంతుడపుడు ।
మునుచేతబెత్తములు బార్లుజేయించె । బారులుజెయ్యగా భరతుండుజూచి ।
శుభకరంబునజనులు జూడవచ్చితే । యింతనొప్పింతురా ఈప్రజలనెల్ల ।
ఇందులోమనకెవరు అన్యులున్నారు । అనియిట్లుభరతుడు పలుకకావినుచు ।
చెలగిచెలగి బార్లుజేయుచున్నారు । పొట్టివారంతాను నిలుచుండిచూడా ।
నీలవర్ణపుస్వామిని నెలతలుజూచిరి । కరుణాకరులను జూచికాంతలిట్లనిరి ।

మెత్తన్నిశయ్యపై మెనొత్తురాము । పూరిశయ్యపైన పవళింపనోపె ।
భక్తవత్సలుడైన పరమపావనుడు । సృష్టికొరకై సీతతోడనుబుట్టి ।
అనుజులతోటి అరణ్యములకరిగే । పాపాత్మురాలైన కైకేయివల్ల ।
అడవులకువెళ్లినా అచ్యుతుండితడు । అమహారాజుకే అవిజయమైనా ।
భరతుడుమహారాజుని జూస్తిరాయనెను । ఉత్తమైనాఅశ్వాల్ని యెక్కివున్నారు ।
అర్కతేజముకంటె మిక్కిలిగవెలుగు । సౌమిత్రితమ్ముడే శత్రుఘ్నుడనిరి ।
భరతుడుసౌమిత్రి శత్రుఘ్నుడును । వచ్చిరనిహనుమన్న ముందారజెప్పె ।
ముమ్మారువలగొని ప్రదక్షిణముజేసి । సాష్టాంగదండ నమస్కారములుజేసె ।
పాదములపైనున్న కొమాళ్ళనెత్తి । దీవించితల్లులూ దేవవాక్యమున ।
సతులతోసౌభాగ్య పదవనుభవిస్తు । అభివృద్ధిపొందండి అయోధ్యలోను ।
భరతుడుసౌమిత్రి శత్రుఘ్నుడును । వచ్చిరనిహనుమన్న ముందారజెప్పె ।
ముమ్మారువలగొని ప్రదక్షిణముజేసి । సాష్టాంగదండ నమస్కారములుజేసి ।
పాదములపైనున్న తమ్ములనుయెత్తి । దీవించెశాంతమ్మ దేవవాక్యమున ।
సతులతోసౌభాగ్య పదవనుభవిస్తు । అభివృద్ధిపొందండి అయ్యోధ్యలోను ।
భరతుడుసౌమిత్రి శత్రుఘ్నుడును । వచ్చిరనిహనుమన్న ముందరజెప్పె ।
ముమ్మారువలగొని ప్రదక్షిణముజేసే । పాదములపైనున్న మరదులయెత్తి ।
దీవించెజానకి దేవవాక్యమున । సతులతోసౌభాగ్య పదవనుభవిస్తు ।
అభివృద్ధిపొందండి అయ్యోధ్యలోను । భరతునిహస్తంబు తాబట్టుకొని ।
భరతుడానీవెంత బుద్ధిశాలీవి । తమ్ములుఅయినాను మీరెనుమీమాకు ।
మరుదులుఅయిన మీరెనుమీమాకు । సహోదర్లులేక తమరిప్పుడూను ।
అభ్రాతృకన్యలము అయివుంటిమనిరి । భరతుడుమాళవీ యిల్లడఅనెను ।
సౌమిత్రిహస్తంబు తాబట్టుకూని । సౌమిత్రినీవెంత బుద్ధిశాలీవి ।
తమ్ములుయైనను మీరెనుమీతమకు । మరుదులుఅయినాను మీరెనుమితమకు ।
సహోదరులులేక తమరిప్పుడును । అభ్రాతృకన్యలము అయివుంటిమనిరి ।
సౌమిత్రిఊర్మిళా ఇల్లడఅనెను । శత్రుఘ్నుహస్తమ్ము తాబట్టుకుని ।
శత్రుఘ్నుడనీవెంత బుద్ధిశాలీవి । తమ్ములుయైనను మీరుసుమీతమకు ।
మరుదులుఅయినను మీరెనుమితమకు । సహోదరూలేక తమరిప్పుడును ।
అభ్రాతృకన్యలము అయివుంటిమనిరి । ముగ్గురువెనుకను అబలసుమిఅన్న ।
మూడుమాటలమీరు తప్పులెన్నకుమి । ఒకమారుతాంబూల మియ్యవచ్చినను ।
వద్దనిశతకీర్తి పూరికేయున్న । గర్వియనితోచకుమి నీమనసులోను ।

రెండవమాటికే పలికినగాని । గండ్రినితోచకుమి మీమనసులోను ।
ముగ్ధలుగారటోమీరుజానకీ । మీవెనుకచెల్లెళ్ళు ముగ్ధలేగార ।
కుసులుగూడనిముందు కుంకల్లుకురువా । పతితోనుఅడవులకు యేగీనదానవు ।
మాయమృగమునుబట్టితెమ్మన్నదానవు । ముగ్ధలుగారటోమీరుజానకి ।
మీవెనుకచెల్లెళ్ళుముగ్ధలేగార । అనియిట్లుశత్రుఘ్ను పలుకగావినుచు ।
తలవంచుకొనిసిగ్గున తానూరకుండె । తలవంచుకనిలుచున్న కోడలనుజూచి ।
కౌసల్యయేతెంచియిట్లనిబలికె । ముగ్గురువెనుకను నుండదేవీడు ।
మూడుమాటలు ఆయతప్పులెరుగాడు । గాంఢ్రపుపలుకులు పలుకనేటికి ।
ఆనియిట్లుజానకిని ఆడనేటికి । తల్లన్నభాషలు తనయునికిదెలసీ ।
ముమ్మారువలగొని ప్రదక్షిణముజేసి । సాష్టాంగదండనమస్కారములుజేసె ।
యెందుకూజానకీ వప్పగిస్తావు । చెల్లెళ్ళునిన్నేమి యుద్ధరిస్తారు ।
శత్రుఘ్నుడుశతకీర్తి యిల్లడఅనిరి । ముత్యాలచౌకిలో రత్నాలపాన్పు ।
పణతులుభరతునికి ఆయత్నమనిరి । బంగారుచౌకిలో రత్నాలపాన్పు ।
చేడెలు సౌమిత్రి కాయత్నమనిరి । చిలుకచిత్రపుమేడ చెంగల్వపాన్పు ।
చేడెలు శత్రుఘ్నుని కాయత్నమనిరి । మాళవిఊర్మిళా మగువశతకీర్తి ।
వచ్చిరనిహనుమన్నముందరజెప్పె । ముమ్మారువలగొని ప్రదక్షిణముజేసి ।
సాష్టాంగదండనమస్కారములుజేసి । పాదములపైనున్న కోడళ్ళనెత్తి ।
దీవించిరిఅత్తలు దేవవాక్యమున । పతులతోసౌభాగ్య పదవనుభవిస్తూ ।
అభివృద్ధిపొందండి అయోధ్యలోను । మాళవిఊర్మిళమగువశతకీర్తి ।
వచ్చిరనిహనుమన్న ముందరజెప్పె । ముమ్మారువలగొని ప్రదక్షిణముజేసి ।
సాష్టాంగదండనమస్కారములుజేసె । పాదములపైనున్న మరదళ్లనెత్తి ।
దీవించె శాంతమ్మ దేవవాక్యమున । పతులతోసౌభాగ్యపదవనుభవిస్తూ ।
అభివృద్ధిపొందండి అయోధ్యలోను । మాళవిఊర్మిళా మగువశతకీర్తి ।
వచ్చిరనిహనుమన్న ముందరజెప్పే । ముమ్మారువలగొని ప్రదక్షిణముచేసి ।
సాష్టాంగదండనమస్కారములుచేసె । పాదములపైనున్న చెల్లెళ్ల నెత్తి ।
దీవించెజానకిదేవవాక్యమున । పతులతోసౌభాగ్య పదవనుభవిస్తు ।
అభివృద్ధిపొందండి అయోధ్యలోను । మాళవిహస్తంబు తాబట్టుకుని ।
మాళవినీవెంత బుద్ధిశాలీవి । భరతునివంటి పతినిగలుగుటకు ।
నీవుచేసినపూర్వ పుణ్యమేతల్లి । అతిపరాక్రమశాలి అమ్మనీవిభుడు ।
మనసులోమరిజాణ వాడుసుమిఅతడు । భరతునిచిత్తాన గురుతెరిగితిరుగు ।

ఊర్మిళహస్తములు చేతబట్టుకొని । నీకేమిజెప్పుదును నేనుఊర్మిళ ।
నీవుయెరుగవటమ్మ బుద్ధిశాలీవి । అతిమాటకారియో అమ్మనీవిభుడు ।
వసుధలోమరిజాణ వాడుసుమిఅతడు । సౌమిత్రిచిత్తమును గుర్తెరిగితిరుగు ।
శతకీర్తినీజూచి యోతానుజానకి । శతకీర్తిహస్తమును చేతబట్టుకుని ।
నీకేమిజెపుదును నేనుశతకీర్తి । నీవుయెరుగవటమ్మ బుద్ధిశాలీవి ।
పుయ్యమనక చందనముపుయ్యబోకుమీ । పుయ్యమంటేనీవు పూరుకోకుమి ।
ఒకమారుతాంబూల మియ్యవచ్చినను । వద్దనిశతకీర్తి పూరికేయుండ ।
రెండొమాటికే బిలచినగాని । పలుకుమీశతకీర్తి పద్మాయతాక్షి ।
బంగారుపావాలు తొడగరేతల్లి । వెయ్యవేమీపతి వవ్వారిలోకి ।
వారివారిపాన్పున గూర్చుండబెట్రి । ఆశీర్వాదముచేసి అక్షంతలిచ్రి ।
శతకీర్తినిబంపక తానూరకుండె । శతృఘ్నుడేతెంచి యిట్లనిబలికె ।
అమ్మరోవినవమ్మ అమ్మకౌసల్య । నీముద్దుకోడలిని చెప్పంపవమ్మా ।
చెలికత్తెలాతోను ఆడుచున్నది । ఎత్తుకుపొమ్మని వెలదితాబల్కె ।
చెలికత్తెలాతోఆడేటి శతకీర్తిజూచి । శతృఘ్నునిపాన్పున ఆడుచుపురమ్మి ।
అనియిట్లుకౌసల్య చయ్యనబిలుచుకొని । శతృఘ్నునిశయ్యకు తానుబంపించె ।
శతకీర్తివచ్చేటి తేజమ్ముజూచి । కంచుశ్రీస్తంబాలు కాంతలనుమణగె ।
మాణిక్యపుదిపాలు మరివెలుగవాయె । శతృఘ్నునిపానుపున గూర్చుండబెట్రి ।
ఆశీర్వాదముచ్చేసి అక్షంతలిచ్చిరి । మాణిక్యాలఘడియలు శాంతమ్మబెట్టె ।
రావోయిహనుమన్న వాయునందనుడా । శీఘ్రమునజానకి నగరికేతెంచు ।
శృంగారముగాను వేంచేయుమనుమి । ఆమాటవినియపుడు సంతోషమునను ।
శీఘ్రానజానకీ నగరుకేతెంచె । అమ్మశ్రీరాములు నన్నంపినారు ।
శృంగారముగాను వేంచేయుమనిరి । ఆమాటవిని యపుడుసంతోషమునను ।
ముత్యమ్ముసాకురులు మురిపానవిప్పి । పగడంపునాకురులు బాగుగాదువ్వి ।
చెంపకొప్పుబెట్టి చెలియజానకి । ముడిచెనాకొప్పులో మోదమలరగను ।
మొగలిరేకులుజుట్టె మోదమలరగను । భండారమేలేటి ప్రజలబిలిపించి ।
తాళములచేతనే పెట్టెలుదీయించి । ధరణెలుదెప్పించి పైకప్పులుదీసి ।
ఘట్టిమెట్టెలుబెట్టి కడియములుబెట్టీ । అందెలుచరణారవిందములబెట్టె ।
చిట్టికెనబొద్దులుబెట్టి పిల్లేళ్లుబెట్టి । బొబ్బిలికాయవే వీరమద్దులను ।
అన్నివ్రేళ్ళకును అమరించినారు । సుద్ధసువర్ణాన చేయించినట్టి ।
సూడిగాజులుబెట్టె సుదతితనచేత । చేమపూకడియములు హస్తకడియములు ।

చెన్నుమీరగసీత చేతులనుంచే । నవరత్నఖచితమున సరులొప్పుచున్న ।
గిరగిరంబులునుంచె తానుఆశాంత । ఇంద్రకావిరవికలు ఈడుగావన్నీ ।
చంద్రకాంతిపురవికె తొడిగించిరపుడు । సందిటిదండలుబెట్టి తావేజులుబెట్రి ।
దండకడియములు ఘన్నస్వరములుంచ్రీ । నవరత్నపువంకీలు నాతికినియుంచీరి ।
చేడెకుయింపైన చెవులపువులుబెట్రి । బలువైనముత్యాల పాపిటచేరులను ।
చేరుచుక్కవుంచె చెలియజానకి । జానకియెంతయు చెలువారుచుండ ।
చేరుచుక్కావంటి మరదల్నిజూచి । తెమ్మనవేజానకి తొడుగులూయనెను ।
మునుపుగౌతముడుదెచ్చిచ్చినాడన్ని । అవిదెచ్చిజానకికి అలంకరించీరి ।
నాగలోకముననున్న ఫణింద్రుడపుడు । నవరత్నపుతొడుగులు యిచ్చినాడనుచు ।
అవిదెచ్చిజానకికి అలంకరించ్రీ । అగ్నిహోత్రుడు మెచ్చిచ్చినాడనుచు ।
అవిదెచ్చిజానకికి అలంకరించిరి । మూడువేలుజేయునాను మెడవేసి ।
సొగకన్నుల కాటుకలుదీర్చె । కస్తూరితిలకంబు కాంతకుదీర్చి ।
బంగారునీరుతోపరిపూర్ణమైన । పట్టుచీరాదెచ్చి కట్టించిరపుడు ।
ఘంటలవడ్డాణము కాంతకువుంచిరి । ఆందమయిన మొహర్ల పేరులనుంచ్రీ ।
గంధమ్ముకస్తూరి కలపంబుజేసి । అప్పుడుజానకికి అలదెశాంతమ్మ ।
పచ్చకర్పూరాన ఆకుమడచిచ్చి । బంగారునీరుతో పరిపూర్ణమైన ।
పట్టుశాలులుదెచ్చి గవిశనలవేసిరి । వయ్యారినడకతో పయ్యదజార ।
వారచూపులుజూస్తువచ్చెనాదేవి । అల్లంతటశ్రీదేవి రాకలుజూచి ।
కలకలనవ్వుతు పలికెరాఘవులు । వేసంగికాలాన పచ్చన్నిపూరి ।
మేసినగోవులకు ఆనందమేను । పరమపతివ్రతలైన స్త్రీలకందరికి ।
పతిరాకజూచితే సంతోషమౌను । పాలునుపంచదార కలసియున్నట్లు ।
శ్రీరాములుసీత కలసిరపుడు । పాలునుబెల్లంబు కలసియున్నట్లు ।
భరతుడుమాళవి కలసిరప్పుడు । జీలకర్రబెల్లంబు కలసియున్నట్లు ।
సౌమిత్రియూర్మిళ గలసిరపుడు । ఒకమారుతాంబూల మియ్యవచ్చినను ।
వద్దనిశతకీర్తి యూరికెయుండె । సంవాదముచెయ్య జాలనీతోటి ।
సరగునశయ్యపై తాద్రోసివేసె । ప్రాణాలుమూర్ఛిల్లి దద్దిల్లిపోయే ।
అందరుజెప్పి అప్పగించినట్లు । అప్పుడేశతృఘ్ను డతిభీతినొందె ।
శతకీర్తినెత్తియో తొడలపైనుంచి । కర్పూరరజమంత కర్ణములనూదె ।
అచ్చపన్నీటను కన్నులుగడగే । శతృఘ్నుకోపదారని యెవరినోటా ।
ఎవరినోటాపైని వినిజడసితివేమొ । ఎవరికైనా కోపదారినేగాని ।

నీకుశాంతుడసుమ్మి నిజమునామాట । పాలునుపంచదార గలసియున్నట్లు ।
శత్రుఘ్నుడుశతకీర్తి గలసిరప్పాడు । అతివకలగనిలేచి అతిభీతినొంది ।
శత్రుఘ్నుడు శతకీర్తినేమిజేసెనో । శత్రుఘ్నుడు శతకీర్తినేమిజెయ్యడు ।
అహోరమార్వాళ్ళుఅని జెప్పసతికి । సాహంసంబేడుపాళ్ళు అనిజెప్పెసతికి ।
దేవిడిముందరనున్న హనుమంతునిబిలచి । వేగానభేరీలు వేయించుమనిరి ।
భేరీమృదంగములు భోరుగొల్పగను । అదరిపడిలేచిరి అన్నదమ్ములును ।
భరతునిపైరెండు పసుపుడాగులు । సౌమిత్రిలలాటమున కుంకుమబొట్టు ।
శత్రుఘ్నునిచెక్కిట కాటుకరేఖా । ఆకుంకుమబొట్టు అమరియున్నది ।
ఋష్యశృంగుడుజూచితే గేలిజెయ్యడ । రావోయిహనుమన్న వాయునందనుడా ।
భరతునికిసౌమిత్రికి శత్రుఘ్నునికీ । భోజనంబులువేగ కావలెనుసుమీ ।
శీఘ్రముగశాంతమ్మ నగరుకేతెంచె । వందనంబులుజేసి ముందరనిలచి ।
అమ్మశ్రీరాములు మమ్మంపినారు । భరతునికిసౌమిత్రికి శత్రుఘ్నునికినీ ।
భోజనంబులువేగ కావలెననిరి । ఆమాటలువినియపుడు· సంతోషముగను ।
నీలవేణివీపుపై కొప్పుతూలాడ । నెలతపాపిటక్రింద బొట్టుతూలాడ ।
గాజులుధవళస్వరములు మ్రోయగను । ఆయత్నములుయాయె వేగరమ్మనుమీ ।
ఆట్టవసరానకౌసల్య మహదేవి । పళ్లెరములమర్పించె పరమహర్షమున ।
మేలుగంగాజలాల్పానీయముంచిరి । సుందరిపెరిటిదే సోద్యంపుసురటీ ।
వడ్డించెఅయోధ్య వల్లభులపంక్తి । చిక్కుడికాయా చిరిపొట్లకాయా ।
కాకరకాయతో గారవడియములు । అరటికాయమొదలైన అరువదికూరల్లు ।
అట్టెవడ్డించిరా అచ్యుతులపంక్తి । పనసకాయమొదలైన పాకంపుకూరలు ।
చాలవడ్డించిరా సర్వేశ్వర్లపంక్తి । సిరసేవపాయసము చిప్పపాయసాన్నము ।
సజ్జపాయసాన్నము సఖియలొడ్డించిరి । రాజనపుఅన్నములు రమణిశాకములు ।
సాగివడ్డించిరా సర్వేశ్వర్లపంక్తి । సెనగపప్పుమంచి సిరిశెనగపప్పు ।
వలువుపప్పులతోటి అమరవడ్డించిరి । అప్పడమ్ములుమంచి అతిరసంబులును ।
అమరవడ్డించిరా అచ్యుతులపంక్తి । పచ్చళ్ళుసిరికిలే పణతులేవడ్డించ్రి ।
కీలుకుడకలనేతులు చాలవడ్డించిరి । వారివారిక్రేమ ప్రియములుజెప్పి ।
బంధుకొట్లాతోను తమరారగింత్రూ । అనాడులంకలో ముచ్చటలన్నీ ।
జెప్పుకొనుచువారు భుజియింపుచుండ్రి । ఆనాడురావణుని ముచ్చటలుయన్నీ ।
జెప్పుకొనుచువారు భుజియింపుచుండ్రి । ఆనాడుఅడవిలో దుంపలుయన్నీ ।
ఇవికూరపులసనీ తమరారగింతురు । అప్పుడుహనుమన్నను మరచియుండంగ ।

పులుతుపులుతుమనీ వచ్చెహనుమాన్లు । ఇంటివాడవుగనుక నూరకుంటిమి ।
పొత్తునగూర్చొమ్మి ఉత్తమపురుష । నీవంటిబంధుండునేవంకలేడు ।
నీవుండగాగదాసతిని దెచ్చుకునీ । అయ్యోధ్యపట్నమ్ము యేలగలిగితిని ।
నీవుండగాగదా తమ్ములపంక్తి । భుజించగలిగితిని హనుమన్నవినుమ ।
పొత్తునగూర్చొమ్మి ఉత్తమపురుష । పొత్తునగూర్చుండ ఉత్తముడగాను ।
సర్వేశుభోజనము తాగాగజూచి । ముందరాపళ్ళెమ్ము యెత్తుకొనిబోయే ।
తాబోయి హనుమన్న అవిసిచెట్టెక్కె । ద్వాదశికి ఒకముద్దకొమ్మపైనుంచే ।
ఆందుమీదపళ్ళెము అందిపడవేసే । వృక్షమునకెదురుగా రామచంద్రులు ।
చెయిజాచిహనుమన్నను రమ్మనిబిలచె । రామచిలుకవలె చేతిపైవ్రాలే ।
చేతిపైహనుమన్నను ధరణిపై దించి । ముత్యాలహారమ్ము మెచ్చిమెడవేసే ।
ఈపాటయెవరైన పాడినవిన్న । పరబ్రహ్మలోకంబుపరమాత్ములిచ్చు ॥

# ఊర్మిళాదేవి నిద్ర

(కిటతకిట, కిటతకిట, కిటతకిట.....,)

శ్రీరామభూపాలుడూ । పట్టాభిషిక్తుడై కొలువుండగాను ।
భరతశతృఘ్నులపుడూ । సౌమిత్రి వరుస సేవలు సేయగా ।
మారుతాత్మజులపుడూ । రాఘవులజేరి పాదములొత్తగా ।
సుగ్రీవుడా కొలువులో । కూర్మితోనమ్రుడై కొలువుండగా ।
తుంబురులు నారదులునూ । యేతెంచినిలచి గానము సేయగా ।
రంభాదులాసభలలో ఇంతిశుభ । రమ్యమున నాట్యమాడా ।
సనకాదిమౌనీంద్రలూ కొలువులో । శాస్త్రములు తర్కించగా ।
సకలదేవతలుగొలువ । ఉదయాన పుష్పవర్షముగురిసెను ।
సభయంత కలయజూచి । యేతెంచె సంతోషమునజానకీ ।
పతిముఖముజూచి నిలచి । వినయమునపట్టి అంజలిగ్రక్కున ।
దేవదేవేంద్ర వినుమా । విన్నపము తెలిపేను చిత్తగింపు ।
ధరణీశు డవతరించ । ఒకచిన్నమనవి కద్దనిపలికెను ।
ముందుమన మడవులకును । పోగానుముద్దు మరదివెంటనూ ।
పయనమైరాగజూచి తనచెలియ । పయనమాయెను ఊర్మిళా ।
వద్దునీవుండుమనుచు సౌమిత్రి । మనలసేవింప వచ్చే ।
నాడుమొదలు శయ్యపైకనుమూసి । నాతి పవళించుచున్నది ।
యికనైక యానతిచ్చితమ్మని । యిందుముఖి కడకంపుడి ।
ప్రాణపత్ని యీలాగునకూర్మితో । పలుకంగ వినిరాముడు ।
తలపోసిచూడ నెంతేతనమదికి । తగువిచారము బుట్టెను ।
ఆశ్చర్యపడి రాముడుగ్రక్కున । అన్నలక్ష్మణ రమ్మనె ।
రమ్మిలక్ష్మణ గ్రక్కునయుచితమా । రమణి నెడబాసియుంట ।
తడవాయెయికనైనను ప్రియురాలి । దగ్గరకునీవుబోయి ।
సరస సల్లాపములచే । దుఃఖోపశ్రమలెల్ల మాన్పవయ్యా ।
అన్నమాటలకు రామానుజుడూ । మహాప్రసాదమనుచు ।
అనిపించుకుని గ్రక్కునాసభవిడచి । చనుదెంచె తనగృహముకు ।

వచ్చేలక్ష్మణుడు చలవసత్రంపు । వాకిళ్ళుగడచివచ్చీ ।
కేళిగృహాము జొచ్చియులక్ష్మన్న । కీరవాణినిజూచెను ।
కోమలీపాన్పుపై నీ వత్తిగిలి । కోకసవరించివేగా ।
తొడుగుల ధరించివేగా । చల్లనీ తళ్ల పూరించెమేనా ।
ప్రాణనాయకి పాన్పునకూర్చుండి । భాంషించె విరహమ్మునా ।
కొమ్మనీముద్దుమొగము । సేవింప కోరినాడేచందురిడు ।
తాంభూలమేడమాయెను । ఓ పెనే నగుమోవి చిగురుకొనకా ।
అమృతధారలు కురియగాపలుకవే । ఆత్మచల్లనసేయవే ।
చిటితామరలుబోలెడి । పాదముల కీలించవేస్వర్ణము ।
తన్ను తామరచియున్నఆకొమ్మ । తమకమున వణకదొడగే ।
అయ్యమీరెవ్వరయ్యామీరింత । యాగడంబులకొస్త్రిరి ।
సందుగొందులువెతుకుచు । మీరింత తప్పునేయగవస్త్రిరి ।
ఎవ్వరునులేనివేళమీరిపుడు । యేకాంతములకొస్త్రిరా ।
మాతండ్రిజనకరాజు వింటెమిము । ఆజ్ఞనేయకమానరు ।
మాయక్కబావవిన్న మీకిపుడు । ప్రాణములకు హానివచ్చు ।
మాఅక్కమరదివిన్న మిమ్మిపుడు । బ్రతుకనివ్వరుజగతిలో ।
హెచ్చయిన వంశానికి । అపకీర్తి వచ్చెనేనేమిజేతు ।
కీర్తిగలయింటబుట్టి । అపకీర్తి వచ్చెనేనేమిజేతు ।
ఒకడాలిగోరె కాదాఇంద్రునికి । ఒడలెల్ల హీనమాయె ।
పరసతినికోరెగాదా రావణుడు । మూలముతో హతమాయెను ।
ఇట్టిదోర్హిహములు మీరుయెరిగుండి । యింతద్రోహముకొస్తురా ।
ఆడతోడాబుట్టరా । మావంటి తల్లిలేదామీకును ।
అనుచుఊర్మిలపలుకగా లక్ష్మణుడు । వినివగచియిట్లనియెను ।
శ్రీరాముతమ్ముండనే అతడనగ । సృష్టిలోనొకరుగలరా ।
జనకులల్లునిగానపేభూమిలో । జనకులనగానెవ్వరు ।
శతపత్రములోబుట్టినా చేడెరో । సీతకుమరదిగాన ।
సీతయనగానెవ్వరూ సృష్టిలో । సృష్టిశనేనుయెరుగా ।
భూమి నూర్మిళవందురే । నీపేరుబొంకకు యీపట్లను ।
దశరథుల నెడబాసియు । అక్కడజానకీ చెరబోయెను ।
రావణునిసంహరించీ ఆసీత । దేవితోడుకు వస్తిమి ।

చేకొన్నయిందు వదనాలోకాప । కీర్తికేలోనాదును ।

సీతమరదిని గానఁచేదెరో । దయయుంచి మేలుకొనవే ।

నిన్నుబాసినది మొదలూప్రాణసఖి । నిద్రహారము లెరుగనే ।

నీవులేవకయున్నను ఓసఖి । ప్రాణములు నిలుపలేనే ।

అనుచుకన్నుల జలములుకారంగ । లక్ష్మణుడు తాబలికెను ।

కత్తివరదీసి యపుడులక్ష్మణుడు । తావేసు కొందుననెను ।

అనుచు వాదముసేయగా । ఊర్మిళ దద్దిల్లిపడిలేచెను ।

ప్రాణేశుడగుట దెలసికోపలికి । ప్రాణములు తేజరిల్లే ।

పతిపాదపద్మములకు అప్పుడూ । పంకజాక్షి మ్రొక్కెను ।

పాదముల పయినియున్న । తనసతిని కరమునాలేవనెత్తి ।

గ్రుచ్చికౌగిట చేర్చుకుకాంతకు । కళ్ళజలములు దుడిచెను ।

మాతండ్రిజనకరాజు మిమునమ్మి । మరచి కళ్యాణమిచ్చె ।

మానవంతుల్లు డనుచుతెలియకా । మదినియుప్పొంగు చుండె ।

చిత్తమొకదిక్కునుంచి సమయమున । చిన్నబుత్తుర యింతులా ।

అనుచుఊర్మిళ బలుకగా । లక్ష్మణుడుమనసులో చింతింపుచు ।

దుఃఖవశమున బలుకుతూయుండేటి । సుదతి భావమ్ము దెలసీ ।

చింతింపనికనేటికే ఓబాల । అనియిట్లు లాలింపుచు ।

తరుణి పదునాలుగేండ్లూ । నినువిడచి ధరియిస్తినేప్రాణము ।

ఆహారనిద్రలును యెరుగనే । అతివనీమీదయాన ।

పుణ్యపురుషులస్త్రీలను యెడబాపి । పూర్వజన్మమున మనమూ ।

ఎన్నెన్నియుగములైనా ఇదిమనకు । అనుభవించక తీరదు ।

సతిపతులచింత జూచికౌసల్య । సంపెంగ నూనెదెచ్చి ।

రత్నపీఠములనుంచి కౌసల్య । దంపతుల శిరసంటెను ।

గంధముటకలిదెచ్చియుఓచెలియ । పన్నీటజలకమార్చె ।

మేలైనపలిపట్టుతో లక్ష్మణునికి । మేలుతళ్కొత్తిరపుడు ।

బంగారుపూలపట్టు ఊర్మిలకు । బాగుమీరగ గట్టెను ।

కోటిసూర్యదీప్తితోవెలిగేటి । మేలైనరవికదొడగ ।

ఆభరణములుసొమ్ములు । ఆయాదిలక్ష్మికే యలంకరించి ।

ముత్యాలతిరుచూర్ణము లక్ష్మన్న । ముద్దుముఖమునదీర్చెను ।

వెలలేనిమాణిక్యముపతిగూడి । నిలువుటద్దముజూచెను ।

సిగ్గుపడిశిరసొంచుకుడుఊర్మిళా । చిరునవ్వుతోనిలచెను ।
భోజనపుశాలలోను । ఆయాణి ముత్యాలపీటమీద ।
రాజశేఖరులప్పుడు । దేవేంద్ర భోగముతోగూర్చుండెను ।
పరదలామాణిక్యమారమ్మని । మగువవోడుకువచ్చెను ।
మురిపెంపుసిగ్గుచేతా । చిలుకలా కొలికి ముఖమటువంచుకు ।
హంసనడకలచేడెలాపాదముల । అందెలటురవముసేయ ।
వయ్యారమునుజూపుచూనుండెనొక । యొప్పుల కుప్పవలెను ।
పలుకుముద్దులగుమ్మను । సుమిత్ర కొడుకుపొత్తునయుంచెను ।
బంగారుపళ్ళెరములా పంచ । పదార్థమువడ్డించెను ।
వెండిగెన్నెలనేతులు కౌసల్య । వేడుకతొవడ్డించెను ।
ఆవునెయ్యిఅతిరసములూ । సుమిత్ర కొడుకునకువడ్డించెను ।
కౌసల్యగారాములపట్టితో । శాంతతానిట్లుబలికె ।
అన్నపదునాలుగేండ్లు అడవిలో । ఆహారనిద్రలును ।
ఉన్నబడలికలుదీరనేడుమన । యూర్మిళతోనారగించు ।
పిండివంటలునేతులు । బొబ్బట్లుదండిగా నారగించు ।
మీగడపెరుగుమీరు । మజ్జిగలువాంఛదీరగత్రాగుడి ।
ఆరగించిలేచిరి సంపూర్ణ । మారగించినిలచిరి ।
గంగజలమునహస్తమూ । కడిగితాంబూలములువేయుచుండ్రి ।
చేడెవినవేజానకి నీచెలియ । యూర్మిళాబుద్ధులన్ని ।
భమిడిపానుపున సొలసియుండెనొక । పదునాలుగేండ్లు పణతి ।
కుందనపు ప్రతిమకళలు । ఈకళలు యెందుండిదాగున్నవో ।
దృష్టితగులకుండను । నీలాలనివ్వాళ లివ్వరమ్మా ।
అనిశాంతబలుకగాను వినిసీత । వినయముతో యిట్లనియెను ।
సృష్టంత యేలేటియో । శ్రీరామచంద్ర లక్ష్మణదేవరా ।
భరతశతృఘ్నులూ అయినట్టి । పట్టాభిషేకులమ్మా ।
ఇంద్రాదిచంద్రూలను వలపించేటి । చంద్రూలు మీతమ్ములు ।
దృష్టితగులకుండను । నీలాలునివ్వాళ లివ్వరమ్మా ।
అనిసీతబలుకగాను । వినిశాంతనవ్వుచూ నిట్లనియెను ।
అక్కచెల్లెండ్రు మీరుమిక్కిలీ । సౌందర్య శాలులమ్మా ।
మాతమ్ములు నలుగురిని । వలపించుజాణలకు దృష్టితగులు ।

అనిశాంత బలుకగాను । వినిసీతనవ్వుచు యిట్లనియెను ।
మాయన్న ఋష్యశృంగునీ । వనములోకూడి యెడబాయకున్న ।
ఏమియెరుగని తపసిని । ఓవదిన కేళించి విడిచినావు ।
తామరకమలమందు । పుట్టియో ధరణీపై నిలువలేక ।
ఈశ్వరునికృపవలనూ నీవుమా । యిల్లుజొచ్చినావు ।
కోమలీసీతనీవు కోడలవు । పావనమాయె గృహము ।
అలసివచ్చిన కొడుకుకు । సుమిత్రి హంసపానుపుబరచెను ।
పట్టుతలగడలు పరచి । పాన్పుపై పన్నీరుచిలకించెను ।
వట్టివేళ్ళసురటినీ ఓకీర । వాణి అక్కడనుంచెను ।
గంధకస్తూరిపునుగు జవ్వాది । గిన్నెలతో తెచ్చుంచెను ।
పచ్చిపోకలుయాకులు । ముత్యాల సున్నముక్కడనుంచెను ।
సంపెంగపువులగాలీ విసరగా । తలుపులప్పుడువేసిరి ।
మల్లెపువ్వులగాలియు విసరగా । శయ్యపై కూర్చుండిరి ।
కీలుకొప్పమరవిడచి । లక్ష్మణుడు నేర్పుతోజడలల్లెను ।
బొడ్డుమల్లెలు జాజులు । జడపైని శృంగారముగజుట్టెను ।
తాంబూలములు వేయుచు । దంపతులుకలసి ముచ్చటలాడుచూ ।
అక్కచెరబోవు విధముయేమని । యడిగెనప్పుడు ఊర్మిళా ।
సింహవిక్రములు మీరుయుండగా । సీతెట్లు చెరబోయెను ।
కౌసల్యమొదలైనా సుమిత్ర । కైకశాంత దేవులూ ।
గద్దెపీటలువేసుకు వురవున । సద్దుసేయక యుందురు ।
రామలక్ష్మణులుమీరు యుండగా । రమణెట్లు చెరబోయెను ।
అనుచుయూర్మిళ బలుకగా । లక్ష్మణుడువిని మగుడియిట్లనియెను ।
కాలవిధి గడుపవశమా । కడకు నాబ్రహ్మకేయైనగాని ।
అయ్యోధ్యవెడిలి మేముఅందొక్క । పర్ణశాలల నుంటిమీ ।
కనకంపు మాయమృగము । ఆపర్ణశాల వాకిటకొచ్చెను ।
అమృగము తెమ్మనుచుసుమీయక్క । స్వామికాళ్ళకు మ్రొక్కెను ।
విల్లంబులు చేతబట్టి । శ్రీరామ చంద్రులువేటవెడలి ।
విల్లంబుతొడిగి వేయా । అమృగము వింతైనకూతగూసె ।
హాసీతహాలక్ష్మణా యనికూయ । అతివభీతిల్లి పలికె ।
తన్నుబొమ్మని పలికినా । యెరుగవూ తల్లివద్దంటినేను ।

కర్ణశూలంబు లయిన । యెన్నయిన మాటలేనన్నాడెను ।
గిరిగీసి యానబెట్టి । పోయితిని మాయన్నదగ్గరకును ।
పోయినంతావేగమే రావణుడు । మాయవేశము వేసుకు ।
నారాయణనుచు వచ్చి । నలినాక్షిఎదుటనే నిలుచుండెను ।
హరిభక్తుడనినమ్మిచూ ఆమగువ । అతివేగ భిక్షబెట్టె ।
పదితలలు చూడగానె । ఆచేడెమూర్ఛ పడిపోవగాను ।
గెడ్డతోపెల్లగించి యెత్తుకొని । పోయెనే తనలంకకు ।
పసిడిమృగమును బట్టుకు । శ్రీరామ చంద్రులుయేతెంచిరీ ।
వనమంత జూచివెదకి । ఆపర్ణశాలెల్ల వెతకిఅలసీ ।
కిష్కింధ పర్వతానవెతుకగా । పరమఋషి సుగ్రీవుడు ।
కౌసల్యతనయులనుచు సుగ్రీవుడు । కానుకలు దెచ్చిచ్చెను ।
కానుకలువిప్పిచూడా । అందులోజానకి తొడుగులుండే ।
తమ్ముడారమ్మనుచును నను బిలచి । నాకుజూపెను తొడుగులు ।
ఇన్నితొడుగులుయెరుగను । శ్రీరామ సూర్యఉదయమునకొక్క ।
ఇందుముఖిపాదమ్ములయుండెటి । అందెలటునమ్మిస్తిని ।
అంజనీసుతునిబిలచి । ఆరాము డుంగరముజేతికిచ్చి ।
ఆనవాలెల్లజెప్పి హనుమంతు । ఆంపెనేదేవిజూడ ।
వారధిదాటిపోయి । అశోక వనమెల్ల వెతకిచూచి ।
ఉంగరముచేతికిచ్చి । మాణిక్య మందుకొనిమాటలాడీ ।
తిరిగివచ్చివేగమే । శ్రీరామ చందు్రిలయెదుటనిలిచె ।
రాజభూపాలచంద్ర మీసతిని । యేవిధమ్మనదెత్తును ।
తలలెల్లజడలుగట్టియుండె ఉదరమున । వెదురుమొలచియుండెను ।
తల్లియుండెటివిధముతలచితే । తాళశక్యముగాదయా ।
దుఃఖవశమునజెప్పిన రాఘవులు । వినిమూర్ఛబోయిదెలసి ।
ఆలంకచుట్టువిడిసీ రావణుని । అక్షోహిణిబలముగూల్చె ।
శృంగారముజేసియో తెమ్మనెను । సీతనుతనయెదుటకి ।
తెచ్చిశ్రీరాములయెదుటనిలుపగా । అచ్యుతుండిట్లానెను ।
పదినెలలుచెరయున్నది । భామతో భాషించననిపలికెను ।
ఒట్టుసత్యములేటికీ । ఓరామ చిచ్చుగావించుమనెను ।
ఆకాశమంతపొడవుమంటలో । మావదినెమాటలాడె ।

జగములునిండినయట్టుల । జలముల తటాకమైయొప్పెను ।
పరమపతివ్రతగనుకను మావదినె । పట్టైనేరాముచెట్ట ।
సీతశ్రీరాములకును సృష్టిలో । కట్టిరయోధ్యపురము ।
తాబడ్డక్లేశమ్ములు ఊర్మిలతో । తప్పకుండాజెప్పెను ।
అక్కరోవింటిరటె నేడుమన । చక్రధరుబుద్ధులు ।
నీలవర్ణునిజానకి యెడబాసి । ఘోరమాయడవిలోను ।
పాపకర్మునిలంకలో పదినెలలు । భామచెరయున్నదటవే ।
అనుచుఅందరుబలుకుచు । చింతించి సంతోషమునతేలిరీ ।
అయినకార్యమునకు మనమూ । చింతించి కారణములేదుఅనిరీ ।
పట్టాభిషేకులై నారాఘవుల । జూచిపొంగుచుండిరీ ।
ఊర్మిళావిరహమ్ములూఇది । యెవరు పాడినావిన్నగానీ ।
శ్రీవిష్ణుకైవల్యమూసౌమిత్రి । విష్ణులోకమునిచ్చును ॥

# సీత శుభ గోష్టి

క్షేమానఅయ్యోధ్య ప్రవేశమైవారు - జయమూతో రాజ్యమ్ములేలూచునూ
ప్రాణవల్లభుడయిన శ్రీరామచంద్రూల - అవనీజశుభగోష్టి అడిగేనే సీత
అవనీజశుభగోష్టి అడిగేనే

ప్రేమతోడుతనన్నడిగితివీ గనుక - ప్రియమూన వినిపింతునీనేరమూ
పలుమారునేరమ్ము లెంచీతివనితన్ను - పలికీతెనిన్నేమనందునే సీత
పలికీతె నిన్నేమనందూనే

అనిపలికినవ్వూచూ శ్రీరాములప్పుడు - శృంగారమౌచున్న శ్రీతొడలపై
సంభ్రమముతోనున్న సతిజూచిశాంతనా - కాంక్షతీరాప్రేమ కళ్లజూస్తీ
కాంక్షతీరాపే్రిమ కళ్లజూస్తీసీత

హరునివిల్లూఒక క్షణములోపలవిరచి - అవనీజనిన్నూ కల్యాణమొందీ
ఆనందములతో అయోధ్యాకునూబోయి - అగభోగాలతో నుంటిమే సీత
అగభోగాలతో నుంటీమే

శుభముహూర్తంవేళ పట్టమూకట్టవలె - ననిశుభద్రవ్యాలను సమకూర్చి
అభిషేకపట్నమూ కట్టించగారాజు - ఆత్మలోఆనందమున పొంగనేరాజు
ఆత్మలోఆనందమున పొంగనే

కర్మశేషముచేత ఒకనిదంతనుబొంద - అసురూలఉసురూలు బాపుకొరకూ
తనయుడికి పట్టమ్ముకట్టించుమనికైక - తండ్రితో వాదింపుచుండేనే సీత
తండ్రితోవాదింపు చుండేనే

అక్లైకానిమ్మనుచు అంతసంతోషాన. - ఆమహూత్సవమూలు అటునిలిపి
భరతూడ యీరాజ్యమంత నీవేయేలు - రాముడాకానలకు వేంచేయుమనె సీత
రాముడాకానలకు వేంచేయమనే

రావోయిలక్ష్మణా కానలకుబోదాము - రమ్మాని అయ్యోధ్యవెడలీతిమే
సీతవుండామనీ నిన్నూడించితిమి - ఉండకమాతోను వచ్చీతివే సీత
ఉండాకమాతోను వచ్చీతివే

భరతూడు ఆచిత్రికూటానికేతెంచి - భక్తీతో మమ్మూప్రార్ధించేనే
నాయొక్కపాదుకలు కోరగానవియిచ్చి - అతని వినయంచేసిపంపీతిమే సీత
అతని వినయంచేసిపంపీతిమే

పంపీనభరతూడు పంతాముతోడుతా - ప్రతిజ్ఞ దప్పకయుండేనే
నాయొక్కపావాలు పూజించుతూతాను - నందిగ్రామంబోయి యుండేనేసీత
నందిగ్రామంబోయి యుండేనే
లక్షణమ్ములుగలమజిది లక్ష్మణుమనల - రక్షించెనేసీత రక్షించెనే
అందమయినట్టియా పర్ణశాలలోన - ఆనందముగపొంగు చుంటిమేసీత
ఆనందముగ పొంగుచుంటిమే
అలనల్లానాడు లేడిదెమ్మనినీవు - యేలమమ్మా యెడబాసీతివే
మాయలేడీఅదీ యేటికీమృగమని - మర్మమెంచక యెరుగవై తీవేసీత
మర్మమెంచక యెరుగవై తీవే
సీతగుణధీరుడూ లక్ష్మణుకిమనసు - కరిగేటట్టు ఏలపతికితివే
క్షణములోపలదాన్ని తెగవేసిరాగాను - చెల్లునానీకింత శౌర్యముసీత
చెల్లునానీకింత శౌర్యము
తమ్మూనినీవాడు వాక్యములుఅన్నీని - తనకుమ్రొక్కి వినిపించేనే
అబలవీపలుకులూ అవిలెక్కయేమిటి - అనినేను వినియూరకుంటినేసీత
అనినేను వినియూరకుంటినే
కైకనల్లానాడు కంటకాలాడగా - వింటినెఅడవుల్ల లోపలనూ
అనరానిమాటలు హడిలియాడితివని - వినినేను ఊరకుంటినెసీత
వినినేను ఊరకుంటినె
హర్షముతొజటాయు నీవుపోయినదారి - ఆనవాలుమాకు చెప్పించెనే
ఆదనుజదారికి అడ్డేలవస్తివని - తరువునీడలమేము తడపుంటిమేసీత
తరువునీడలమేము తడపుంటిమే
అవనిజ నీభూషణమ్ములు సుగ్రీవు - డానవాలుమాకు దెచ్చిచ్చెనె
శబరిఫలములుదెస్తె అరగించిమేము - శాంతానసంతుష్టి బొందీతిమేసీత
శాంతానసంతుష్టి బొందీతిమే
పంతానరావణుని పదిశిరస్సులుద్రుంచి - సంతోషమునలంక సాధించగా
అంబుధీనీదాటి ఆకపిసేనతో - అంతానుఅచ్చోటి కేతెస్తిమే సీత
అంతానుఅచ్చోటి కేతెస్తిమే
అడవిలోకలగిరులు అన్నివెదకితెచ్చి - ఆచ్చోటవారిధిగావిస్తిమే
వారిధయినాకట్టి రావణుతలద్రుంచి - వనజాక్షినిన్ను చేపట్టితినే సీత
వనజాక్షినిన్ను చేపట్టితినే

ముక్కోటిదేవతలు ముదమూనిపొగడగా - దేవాదిదేవతలు పొగడగాను

దేవాదిదేవతలు జయమనుచుపొగడగా - క్షేమాన అయ్యోధ్యకొస్తిమే సీత

క్షేమాన అయ్యోధ్యకొస్తిమే

అయ్యోధ్యలోనేను పూలపాన్పుమీద - అవనిజనితోను పవళించీ

మదిరాక్షిరోనీవు అడిగినదానికి - మరువక యీ కథజెప్పితినే సీత

మరువక యీ కథజెప్పితినే

# శ్రీరామ మానస పూజ

రాగద్వేషాములుమాని రామునిగొలువారె । బాగుమీరవై కుంఠపదవిపొందేరు ।
కామక్రోధలోభమోహాములు కడకూజిమ్మారె । శ్యామసుందరమైన రాముని
ప్రేమాదలువారె ।

చతుర్మధ్యామూనజిక్కి చింతాశాయా కెమనసా । పరమాత్ముఁడైన రామునిదలచ
ముక్తిపొందేరు ।

మరువకుమీయెప్పుడు రామానామామంత్రము । స్థిరముగానీపూజేయ పదవిపొందెదవూ ।
అందమయినహృదయకమల మందునరాముని । సుందరమైననీలమేఘ శ్యామలరామునీ ।
మీగాళ్ళనీలంపుతామరలు మించూమణులూ । రంగుమీరినదొంతి చక్రాలేరామునిజఘనాలు ।
కమలమేనాభియందు సింహమధ్యాము । నిర్మలమయిన వక్షస్థలము విజయారామునికి ।
గండస్థలముముద్దుచక్కనిగళముశంఖాము । నిండుచంద్రునిబోలు మోముకెంపువదనము ।
బాలాచంద్రునిప్రభలబోలు లలాటపంక్తియు । నీలమూలుబోలు కురులు బాలరామునికి ।
పాదామూలయందునుండు పాతాళలోకాము । పాదాగర్భమునందె రజాతాళము ।
పరమాత్ముని తిన్నెలందునప్తాతాళము । హరికి జానులయందునుండు నూర్ధ్వలోకము ।
హరిమీజంఘలయందునా సత్యాలోకము । హరిమీహృదయమందు అంత్రావృక్షము ।
దేవదేవామీదివ్యదేహమందూన । భావించిచూచితేను పరబ్రహ్మమూ ।
భరతుడుముత్యాలగొడుగుపట్టి కొలువాగ । సరససౌమిత్రివిల్లుశరములూగాగ ।
ప్రీతితోశత్రుఘ్నుడు సురటీవిసరగ । సీతాదేవి రామునీతొడలపైనీచెలగగ ।
హనుమంతుడురాముని పాదంభక్తివొత్తగ । శౌనకాదిమునులు రామునిసన్నుతిసేయంగ ।
తుంబురూడు నారదూడు గానముసేయంగ । రంభవూర్వశిమేనకాదులు నాట్యమాడంగ ।
అక్షయమైనదీపారాధన పక్షివాహనునకు । లక్ష్మీదేవివచ్చి అర్ఘ్యవుదకమీయంగ ।
పంచిపాత్రతోను పంచామృతమూలు । బ్రహ్మవచ్చిశ్రీరామునకభిషేకంచెయ్యగా ।
క్షీరదధిమధుఘృతశర్కర అభిషేకంసేయుదురు । గంధకస్తూరికర్పూరపన్నీట జలకం
సేయుదురు ।

దివ్యవస్త్రాలపుడుదెచ్చిరామునితశొత్తిరి । నవ్వుమోమున కస్తూరినామంనాతులుయుంచిరి ।
కనకాపీతాంబరంగట్టికౌసల్యరామునికి । జనకజాకోటిమన్మథతేజోరామునికి ।
బ్రహ్మపంపినవైజయంతివనమాలికపేర్లురామునికి । సమ్మతిగాఆణిముత్యాలసరులురామునికి ।

ప్రాకటముగరత్నకిరీటంపట్టాభిరామునికి । మకరకుండలములకాంతి మణులురామునికి ।
ముద్దులుగుల్కుకర్ణములకుముత్యాలపోగులు। అద్దంపుచెక్కెళ్ళుగలవుఅయోధ్యరాములకు।
సంపెంగమొగ్గతీరు అందపునాసికము । కలువారేకులబోలువానినేత్రపంక్తియు ।
యెంచినశింగినీవిల్లుకన్బొమలు । నవరత్నహేమసింహాసనంబురామునికి ।
ముత్యాలమేనుచందంమోహనరామునికి । నవరత్నసింహాసనముమీదకూర్చుండిరి ।
దశదిక్కులందు దేవాదుందుభులుమ్రోయ । సీతారాములపైనికురిసెపుష్పవర్షాము ।
పారిజాతమ్ముల రామునిపాదంపూజింత్రు । మల్లెపూవుల నారాయణునఖములుపూజింత్రు ।
పొన్నపూవులమాధవరాముని పూర్వులుపూజింత్రు । గన్నేరుపూలగోవిందరాముని
జంఘలుపూజింత్రు ।
మొగలీపూవుల విష్ణూరామునిపిరుదులు పూజింత్రు । రామామానసపూజభువిలో
రమణులుపాడిన ।
కామీతార్ధములిచ్చి బ్రోచుకౌసల్యతనయుడూ ॥

# సీతాదేవి వేవిళ్లు

సృష్టంతయేలేటి రామచంద్రులూ । రాజ్యపాలకులైన రామచంద్రులు ।
యెదురులేకాభూము లేలుచున్నారు । ఆనందభక్తులయిన అయ్యోధ్యలోను ।
అంతటజనక సుతగర్భమ్ములాయె । నెలవెళ్లిరెన్నెళ్ల అమరియుండగను ।
వేవిళ్ళుఘనమాయె లోపల్కులాయె । తలవాల్చికుడిచెయ్యి తలక్రిందనుంచి ।
పాన్పుమీదపవళించె పద్మాయతాక్షి । అన్నము ముట్టదూఆరామసీత ।
తాంబూలమువెయ్యదు సర్వేశ్వర్ల దేవి । నిత్యతనదాసీల నిల్చిపిలువాదు ।
పాదాలువత్తుమని పణతిపలుకాదు । మధురాల మామిడిపండ్లయినగోరు ।
అతివ అరటిపండ్లయినగోరు । కాంత ఖర్జూరము నయినగోరు ।
పణతిపనసా పండ్లయినగోరు । వెలదివెలగా పండ్లయినగోరు ।
నాతినారింజ పండ్లయినగోరు । పాలకొమ్మలమీద పండ్లయినగోరు ।
చింతకొమ్మలమీద చిగురయినగోరు । దోరచింతలుగోరు యాపద్మగంధి ।
ఈరీతికోరికలు కోరుచుండగను । ముగుదకు ముత్యాలపట్టెడేసడలె ।
నాతినడుము వడ్డాణ మెసడలె । పణతిచేతి బాజుబందులేసడలె ।
అచ్చనవరత్నాలపేరు లేసడలె । అనేకరత్నాలసొమ్ము లేసడలె ।
పాన్పుమీద పవళించెపద్మాయతాక్షి । రాముడు తనసతిమేడకువచ్చి ।
రెప్పవేయక కనువిప్పిమోహమున । తప్పకజూచెను తరుణితావంక ।
రణభీతిగొనిరమ్మ రామచంద్రూలుయేమి । జనకసుతనీవున్నవిధము ।
కారడవితిరిగావు కష్టపడ్డావు । ఆనాడుఈరీతి వదిలుండలేదు ।
అడవులన్నీదిరిగి ఆకుభక్షించి । ఆనాడు ఈరీతివదిలుండలేదు ।
బావులనీళ్ళన్ని జేదిపడిత్రావి । ఆనాడు ఈరీతివదిలుండలేదు ।
యెండలోయెండి వానలోనేతడసి । ఆనాడు ఈరీతివదిలుండలేదు ।
పండుటాకువలె వాలివున్నావు । పారుటాకులవలె పవ్వళించావు ।
నీవిధములక్ష్మన్న కెరిగింపవలెను । గాజులమరించినా గడపలుదాటి ।
ముత్యాలమర్చినా ముంగిళ్లుదాటి । పగడాలమర్చిన పందిళ్లుదాటి ।
పచ్చలమరించినా రచల్లుదాటి । వచ్చెనేరఘురాములక్ష్మన్న కడకూ ।
అల్లంతటొచ్చేటి అన్నపొడజూచి । వలగొనిముమ్మారు ప్రదక్షిణంజేసే ।

సాష్టాంగదండ ప్రణామంబుజేసె । వందనముజేసి కడుముందరానిలవ ।
అన్నవినులక్ష్మణా విన్నపమునాది । అన్నమీవదినెంత బడలివున్నది ।
కారడవిదిరిగింది కష్టపడ్డాది । ఆనాడుయారీతి వదిలుండలేదు ।
అడవులన్నిదిరిగి ఆకుభక్షించి । ఆనాడుఈరీతి వదిలుండలేదు ।
బావులనీళ్ళన్నీ చేదిపడత్రాగి । ఆనాడుయిూరీతి వదిలుండలేదు ।
యెండలోనేయెండి వాననేతడిసి । అనాడుయిూరీతి వదిలుండలేదు ।
పండుటాకులవలె పాలివున్నాది । పారుటాకూవలె పవ్వళించింది ।
నాచేతినొక్కటి ముద్దుటుంగరము । ముంజేతదొడగొచ్చు శ్రీలక్ష్మన్నా ।
అయింతిగర్భిణి అనివిచారించి । మనసుసంతోషాన మరిపొంగుచుండె ।
పాలుపొంగినట్లు పొంగిలక్ష్మన్నా । నక్షత్రిపర్వతం నడచినట్లుండె ।
చుక్కలాపర్వతం జూచినట్లుండె । అట్లయితేమావదినెను చూచివత్తూను ।
అంబులు ఆయుధాలన్న కడనుంచీ । బిగదీసిలక్ష్మన్న పిడికట్లుకట్టె ।
లక్షవేలాఅడుగు తాచేతబట్టె । వచ్చెనేలక్ష్మన్న వదినమేడల్లకు ।
అల్లంతటొచ్చేటి మరిదిపొడజూచి । కాళ్ళుసాపీరావె కడుశీఘ్రముగను ।
బంగారుచెంబుతో పన్నీరుదెచ్చి । పాదములుకడగించె నారాముదేవి ।
బంగారుతీగెలా తివాసిబరసి । పచ్చకర్పూరాన తాంబూలంజుట్టి ।
అలసలసివచ్చారు కూర్చుండవయ్యా । సాష్టాంగదండప్రణామంబుచేసె ।
వందనంజేసికడు ముందరానిలచి । అమ్మ మేముపోతాము ఆజ్ఞయివ్వండి ।
వేగిరంమీయన్నకడకు పొండయ్య । కడువేగమీయన్న కడకుపొండయ్య ।
గాజులమరించినాగడపలుదాటి । ముత్యాలమర్చినా ముంగిళ్లుదాటి ।
పచ్చలమరించిన రచ్చల్లుదాటి । పగడాలమర్చినా పందిళ్లుదాటి ।
అల్లంతవచ్చేటి అన్నపొడజూచీ । పొడగనిముమ్మారు ప్రదక్షిణంజేసి ।
సాష్టాంగ దండప్రణామంబుజేసె । వందనంజేసి కడుముందరానిలచె ।
మీకంటెఘనులు యికపుట్టనున్నారు । మీరేలురాజ్యమ్ము లేలనున్నారు ।
మీరెక్కినసింహాసనం యెక్కనున్నారు । మీరుపట్టు ఆయుధంపట్టనున్నారు ।
ఆయింతిగర్భిణీని తావిచారించి । మనసులోసంతోషం మరిపొంగుచుండె ।
పాలుపొంగీనట్లు పొంగురఘురాము । నక్షత్రపర్వతము నడచినట్లుండె ।
చుక్కలాపర్వతం చూచినట్లుండె । ఆలంకలోపలా దండుదిగిరాగ ।
అక్కడారావణా బ్రహ్మకూతురు । అలగితనఅత్తింటి కెళ్ళిపోగాను ।
హస్తములుచేపట్టి యెత్తలేనైతి । నిండుగావున్నది సీలభద్రి ।

ప్రక్కలునిండు పంకాజగంధి । ఆయింతికదిముదురు గర్భిణాయన్న ।
యాయింతికిది లేతగర్భిణాయన్న । వెండిబల్యాలవారు వెయిలక్షవేలు ।
రాగిబల్యాలవారు లక్షవెయివేలు । కంచుబల్యాలవారు కమ్ముకున్నారు ।
పాదాలచప్పుడు పణతివినకుండ । పాన్పుమీదకొచ్చిరి పద్మనాభులు ।
కూర్చున్నదాసీలు నిల్చుండిరంతా । ఆడవలె వోడవలెగెల్వవలెగాని ।
ఆటవిడచీమీరు లేవపనిలేదు । చిరునవ్వునవ్వీరీ దాసీలుఅంతా ।
ఉత్తరందక్షిణం చూచినాదేవి । తూరుపూపడమరా చూచెనాదేవి ।
ఆడేటిసొగటాలు అటపారవేసి । పాన్పుమీదికొచ్చెనూ పద్మాయతాక్షి ।
గ్రుచ్చికౌగాలించి యెత్తితొడనుంచి । అటుకులు చక్కిలాల్మంచివస్తువులు ।
ఈమాటమాఅమ్మకి చెప్పిపంపితేను । యీక్షణము తెప్పిస్తుయిందీవరాక్షి ।
ఆనాడునీమేడ కొస్తినేదేవి । చాలచిక్కుంటివె చదరాలనీవు ।
ఆనాడు నీవద్దనేపవ్వళిస్తె । చాలచోటాయెనె చదరాలనాకు ।
మీనాడునీమేడకోస్తినేదేవి । చాలనిండుంటివే చదమలదేవి ।
నీసుతులు నీపూనుపైబవ్వళిస్తే । పాదాలక్రిందనె నేపవళిస్తు ।
రాజాధిరాజులకు విన్నాపమయ్యా । రాజులక్షల్లకూ విన్నపామయ్య ।
ఆమాటమీరేల ఆజ్ఞజేసేరు । మామీద దయయుంచి మమ్మురక్షించు ।
దండంబుదండంబునీకు రఘురామ । యీపాటపాడినా విన్ననుగాని ।
యిహపరంబులయందు సుఖము జెందుదూరు । మోక్షమిచ్చునుమీకు రామచంద్రులు ॥

# సీతమ్మ వేవిళ్లు

అడవిలో సీతమ్మ కాయె వేవిళ్ళు
పులిజున్ను మనసని పురుషుతో జెప్పె
పుట్టమీద బోనొగ్గి పులిని బడగొట్టి
మోదుగాకులు దెచ్చి దొన్నెల్లు కుట్టి
దొన్నెలో ఆపాలు పితికె రామన్న
ఏరుపిడకలు తెచ్చి దాయలు వేసి
ఎండలో పులిజున్ను వండె రామన్న
వండిన ఆజున్ను పళ్ళెన బెట్టి
పుచ్చుకో పులిజున్ను పుచ్చుకోమనెను
అదితినీ సీతమ్మ అనియె నీలాగు
మరియొక్క మనసుంది మరితీర్చగలర
నట్టేటి నడుమన నడిగడ్డలోను
పేకుమానుల జుంటి తేనె మనసాయె
రామన్న తేనెకై రయమున బోయె
తేనెకెరళ్ళు దీసి దొన్నెలో బట్టి
పెళ్ళాము సీతకు ప్రేమతో నిచ్చె
ఆరెండు పనులాను అత్తగారు విని
తొలిచూలు రామన్న గర్భిణినాడు
దోరచింతకాయ దొగ్గలికూర
మలిజాలి లక్ష్మన్న గర్భిణినాడు
పుల్లచల్ల మామిడి పండుగోరాము
ఈసీత బూసట్లు మేమెరగమమ్మ
పులిజున్ను మనసాట బుద్దెరుగమమ్మ
జుంటితేనె మనసాట జూడలేదమ్మ
అని సీతనాడుచు హాస్యాలు చేసె

# సీత మేలుకొలుపు

లేవేసీతమ్మా మాయమ్మా ముద్దులగుమ్మ లేవేబంగరుబొమ్మ లేవే
లేచిరాముని లేపవెవేగము లేడికన్నులదానలేవే తెల్లవారవచ్చెనూ
కాకులన్నిలేచి కావుకావుమని కూయుచున్నవి యింకలేవే
కాకాసురునిమీద కోపగించియున్న కలికిచిలకొలకొలికి లేవే
చిలుకలన్నిలేచి చిరునవ్వుమోమున పల్కుతున్నవి యికలేవే
చేతిమీదకెక్కించి జామఫలములుచేత బెట్టుదువుగాని లేవే
అత్తమామ మరదితోటి కోడళ్ళుఅంతా అపుడెలేచినారు లేవే
అదియేమెఓయమ్మ అదుపూలేదానీకు అత్తవారిల్లిది లేవే
జనకునింటనీవు యెపుడైనయీలాగు జాగుచేసినావ లేవే
జలతారునీకొంగుజారె తీసుకొవేగ జనకపుత్రికవేగ లేవే
దంతాధావనము చేయుటయిచ్చోట తీర్ధముగలదింక లేవే
పలుకవేమేనాతొ బ్రతిమాలుకొన్న బధ్ధకించకయింక లేవే
లేచిరామునినీవు లేపుమీవేగము లేవకున్నావింక లేవే
లేడినిచ్చినిన్ను లాలానాసేసేటి లోకరక్షకుడువచ్చె లేవే
కుశలవులు కుర్రలుయిద్దరు యిపుడేలేచిరి లేవే
లేచికురుమద్దాల వెంకటదాసుని బ్రోచియున్నాతల్లి లేవే

# కుశలవ కుచ్చలకథ

శ్రీగణనాయక నిన్నేదలతూ । శ్రీవినాయకా నిన్నేగొలుతూ । శ్రీరఘుపతి చిత్తమున దలతు । రామనామమే వేనామముల । మరువకయెప్పుడు మదిలోదలతు । అంతటదశరథు లయోధ్యపురము । యెంతొపదిలమున ఏలుచునుండ్రీ । కౌసల్యాకైక సుమిత్రా । పట్టపుదేవులు పాలింపుచును । పుత్రులులేనిది రాజ్యములేలా । పుత్రులులేకున్న పుట్టుగతిలేదూ । యేలారాజ్యము లేమిటికనుచూ । యేలావై భోగము లేమిటికనుచు । ఏలాభాగ్యము లేమిటికనుచూ । ఒక్కనాడుసవతులు ముగ్గురునూ । తలపోసిరి తమచిత్తములోనూ । కలలుగనిరి కడువేడుకతోను । బంగారుమేడలోపలను । కొలువైకూర్చున్నరాజుకు । కలలంతా ఆరాజుకుచెప్పిరిగా । సంతానములేదని చింతించిరి । ఆపలుకులువిని దశరథులప్పుడూ । పుత్రకామేష్టిని పూనిరప్పుడూ । సకలమైన రాజులువత్తురుగా । కౌశికఅత్రి వసిష్ఠ మొదలుగా । ఋషులు ఋత్విక్కులు ధాత మొదలుగా । చప్పన్నా భూపతులేతెంచ్రీ । అయిదు దినములు హోమమువేల్చిరి । యజ్ఞపాయసాన్నములు బెట్టి । ఆరగించిరీ అతివలంతటా । గర్భపుచిన్నెలు కనుపడదోచ । తెలుచుకన్నులు వాలుచు మొగములూ । వడువై మెడనూళ్లల్లాడగనూ । నలుపెక్కెను చనుమొనలందరికీ । పెట్టినయిష్టాన్నముల ముట్టరు । సద్దులుమీదనే పొద్దులుపుత్తురు । గోడలమృత్తిక వేడుకలనుచూ । వెలిమిడిమీదనె కోరికలుండే । చిలుకలకూపలుకులు చెప్పరుగా । హంసలకు నడకలదిద్దిరుగా । రాచకేళికి మారుచెప్పరుగా । రుద్రవీణమీటరె కొమ్మలునూ । తాంబూలమ్ముల సహ్యములాయె । తలవాల్చుచునూ ఎల్లివేళలా । అలయుచుపవళించిరి పాన్పులపై । ఆచందములు చూచిదశరథులు । భాసురముగ సీమంతము చేసిరి । పొందుగచైత్రశుద్ధనవమందున । ఒనరగపునర్వసు నక్షత్రమున । రామభరత లక్ష్మణశత్రుఘ్నులు । ఉదయమైరి బాలురు నలువురును । దశ దినమ్ములు గడచినమీదటా । జాతకనామకరణములు వ్రాసిరీ । గొప్పగవార్లకు తొట్లనుగట్టి । రొప్పుగబాల నుయ్యేలనుంచి । పాటలగంధులు పాటలుపాడా । అందరుచనుదెంచిరి శీఘ్రమునా । పసిడిపళ్లెముల హారతులు తెచ్చి । బాలురాకూ హారతులిచ్చిరిగ, నానబోసినా సెనగలుతెచ్చి । వేడుకతో వాయనమ్ములుయిచ్చి । పచ్చిపోకలు పండుటాకులు । పడతులకు విడియములిప్పించ్రీ । తాంబూలాలందుకొని తరుణులందరూ । తరుణులు తమగృహములకేతెంచ్రీ । దినదినమ్మునా పెరిగిరి బాలురూ । వుపనయనమ్ములు చేసిరివారు । తిలకర్నా గోకర్నా యనిదీవించిరి, పసుపుగోచులు

పచ్చనక్షతలు । పొందుగ యజ్ఞోపవీతములు । భవభిక్షాందేహి యనుచు । అడిగిరిబాలురు పెద్దలభిక్ష । పచ్చనక్షతలు పచ్చని మొహరులు । పెట్టిరి పెద్దలు బాలురభిక్ష । దిన దినమ్మును పెరిగిరిబాలురు । అస్త్రశస్త్రకుల విద్యలు నేర్చిరి । అప్పుడు విశ్వామిత్రుడు వచ్చెను । తాటకినొక కోలనుబడగ వేసిరి । మారీచ సుబాహులను ద్రుంచిరి । మునులయాగ మప్పుడురక్షించిరి । మునిసతిశిలనహల్యగజేసిరి । శీఘ్రమ్మున శివవిల్లటువిరచిరి । మెచ్చి యిచ్చెను యాజనకుడు । సీతనుపెండ్లాడెను శ్రీరామూ । పరశురాముని భంగపరచిరి । భూసుతతోడను పుష్పకమెక్కి । అచ్చటయోధ్యాపట్ణముకేగే । పట్ణముగట్టుదామని అందరూనూ । ప్రియముతోటి జనములు యెన్నిరిగా । కైకవరముచే కానలకేగిరి । ఖరదూషణాదుల కడువడిద్రుంచిరి । చుప్పనాతి ముక్కప్పుడుచెక్కిరి । మాయమృగము వేటకు చనుదెంచిరి । జానకినెడబాసెను శ్రీరాము । చెట్లలోపల వెతకగాబోయీ । శబరి చేతవిందవపుడారగింౘీ । జటాయువుకు పిండమువేసీ । సుగ్రీవునిచే సొమ్ములందిరీ । హనుమంతుని తనుబంటుగయేలే । వాలినిజంపి తారనుగూర్చి । సుగ్రీవునకును పట్టముగట్టిరి । వారధివేగమ్మున బంధించిరి । రావణకుంభ కర్ణులగూల్చి । ఆవిభీషణునికి పట్ణముగట్టిరి । ఆకాశవాణిపలుకగను । సీతచేసినా బాసలందుకొని । భూసుతతోడుక పుష్పకమెక్కి । అంతటనయోధ్య పట్ణముకేగి । పంకజాక్షితొ పట్టగట్టి । పట్ణములోపల పంకజాక్షులూ । సీతను చూతామనిచనుదెంత్రూ । కొందరుసీతకు మ్రొక్కెడివారు । కొందరుకౌగిటజేర్చెడు వారు । అందరిని కౌగిటచేర్చుకొని । ఆదుకొనెను ఆజానకిదేవీ । ''అమ్మలారా మీరందరు నన్ను । తలతురనిపుడూ కానలకేగినా'' । కాంతరొనీకడగారపుకూతురూ । చిన్నదిగదనే వెళ్లెడునాడు । ముగ్గురుబిడ్డల కన్నాదటవే । అత్తింటనెవున్నదయాకొమ్మా । తోడుకరాగదే చూతుముగాని । రేపయినా తోడుకరమ్మనెను । వెలదిరొనీ పెద్దకొడుకిప్పుడు । ఎడబాసెనట నీలోటౌనా । కొమ్మగానినీకోడలిగుణములూ । వింటినిగదనేవేడుకతోను । యెంతదిట్టరికాంతాకలిగిందే । ఏవేళావాదులుజేసె । నీకోరికతెస్తివేఅక్కరొనీవూ । అనుభ విస్తివేమక్కవదీరా'' । అంతలోనెకౌశల్యేతెంచి । అందరితొ తానిట్లనిపలికె । అత్తకొంగిన కోడండ్లెవ్వరూ । అందరు ఆలాగనితాబలికె । అంతలోనెకైకాచనుదెంచి । అందరితో తానిట్లనిపలికె । రచ్చకెక్కిన రమణులెవ్వరూ । అందరు ఆలాగనితాబలికె । అంతలో సుమిత్రేతెంచె । అందరితో తానిట్లనితలికె । అత్తలకెదిరించనికోడండ్లు । వాదులుచేయక వుందురెతల్లి । అంతలోనెశాంతాచనుదెంచి । అందరితో తానిట్లనిబలికె । కౌసల్యవంటి అత్త గలిగితే । అందరుఆలాగనితాబలికె । వచ్చినవారికి జానకిదేవి । కప్పురంపుతాంబూలము లిచ్చె । కొందరికిముత్యాలచీరెలు । కొందరికి రత్నపురవికెలును । కొందరకు బంగారు చీరెలు । కొందరికి పగడంపురవికెలను । అకులుపోకలు అతిహర్షమున । అందరికిప్పించెను

ఆసీతా । కట్నాలందుకు కాంతలందరు । శాంతవినగజానకినిట్లనిరి । పుత్రులు లేని యొక్కటి వెత్తి । పున్నవెలతులా యువిదకులేవు । ఆపలుకులువిని శాంతఅప్పుడు , ఆభాగ్యము మాకెక్కడిదనెను । జానకితనయుల కనునేకొమ్మా । ఏమికొదవ కాగలదే శాంతా । సెలవులందుకొని సఖియలందరూ । తమలో తమరు యిట్లని రపుడు । పదియునునాలుగు వత్సరమ్ములూ । వనములుదిరిగిటు వచ్చినకొమ్మా । మరువగ లేదేమనలనెవ్వరిని । ఆనాడేభాగ్యముపండెనని । జానకినికొనియాడుచుమదిలో । నవ్వుచు తమగృహముల కేతెంచ్రీ । అంతటరాముడు అతివకోసము । అంతఃపురములోపలకేగె । తలచుట్టు చిత్తరుబంగారు । జరీపోగులు పాదముమెరయగను । నింగులుదేరగనిగ్గులు మెరయగా । కెంపులతురాయి అందముమించా । ఆణిముత్యపు చొకట్లమరగా । దిద్దినకస్తూరి తిలకముజారా పచ్చలబెత్తము చేతబట్టుక । పగడపుపాగాలందముమించా । అక్కరోజానకి యెక్కడవున్నదే । పిలువవేజానకిచూచెదననెను । ఏవేళాఅలినియెడబాయవు । ఏమిరరాఘవ నీవనిపలికే । అడవులలోపలజానకిచాలా । పెట్టినమందులుతలకెక్కినవా । అనగవవ్వుచూ రాఘవులప్పుడు । పిలువవెజానకి చూతునుఅనెను । రావేజనకుని ముద్దులకూతురా । రావే భూమిలోపుట్టినకన్యా । రావేదశరథ ముద్దులకోడలా । రావేరాముని చిలకలకొలికి । రావే రాముని రాజ్యరత్నమా । రావేజానకిరమ్మనిపిలుప । అందమైన కాళ్ళందెలుమ్రోయగా । నట నటవీధుల నాట్యములాడా । బటువుగముత్యాల పాపటచేరులూ । కడానిగుళ్ళందముమించా । జాళువపసిడి వజ్రాలగుత్తులూ । జాలీరుముత్యాలమేలుపుట్టెళ్ళు । కులుకుకుచమ్ముల గుత్తుల నడుమను । గుత్తపుముత్యపు పేరులుగదలా , సిగపైపువ్వుల బంతులుజారగా । చక్కగ సందిటిదండలుగదలా । గంధపువాసనలందము మీరగా , తాంబూలమ్ములు వాయలు దేరా । పున్నమచంద్రునిబోలెడు ముఖమునా । దిద్దినకస్తూరితిలకముజారా । గొప్పకన్నులా కాటుకమెరయగా । నొప్పుగముత్యపు నత్తుటుతూలా । తళుకులు తాటంకమ్ములమెరపులు , చెక్కిళ్ళసొంపులుమెఱయగను । పసిడివెన్నెలాచీరగట్టియూ । జిలుగుగుచ్చెలావల్లెవాటమరా । లేతనడుముకూ వడ్డాణమ్ములు । వొయ్యనకీలందియలునుమ్రోయ । అంగుళమ్ములవుంగ రమ్ములతో । సీతవచ్చి శాంతచాటున నిలిచే । వచ్చిన సీతను చూచిరాముడు । చక్కపగ డాలాడుదమనిపలికె । దాచినసొగటా లప్పుడుదీసిరి । మరివేసి ఆటకుజొరగానిరీ । శాంత రాఘవులొకవైపై రీ । సీతాలక్ష్మణు లొకవైపై రీ । తిత్తికతీపంచమ్మిదిక్కూ । పగడభార తొమ్మిదియనుకొనుచూ । భారభిత్రీదుగ యనుకొనుచు । దుగ భిత్రీపంచ భారనుచూ , తప్పుజోడుగాదు దిగజోడురమ్మీ । యిదిసారెగాదు ముదమునసారె । ఒకవేటునగట్టిందిర జోడు । జచ్చెలక్ష్మణా వారలందిచ్చెసుమీ । చచ్చెసుమీ లోపటిసారెను । నిర్గతిజేయక నిలువకరమ్మీ । శాంతరాఘవుల కిద్దరికిప్పుడు । వేటె పడవేయివిధములనైనా । పడదువేటు

బారారమ్మనుచూ । రాముతోడెజానకితాగెలిచెను । వోడినధనమడిగెను రాముని । రమ్మి
లక్ష్మణాముందరి కట్టమూ । తెమ్మనవయ్యా వోడినధనమూ । ఆపలుకు విని రాఘవు
డప్పుడు । అప్పుడుజానకితో నిట్లనిరీ । యెంతదానవేజానకినీవు । యెంతదానవికాకుంటేను ।
చిన్ననాడు శివవిల్లెత్తుదువా । యెంతదానవే జానకినీవు । యెంతదానివికాకుంటేను । అడవికి
మాతోవత్తునందువా । యెంతదానివి కాకుంటేను । మాయలేడిని తెమ్మందువా । యెంత
దానివి కాకుంటేను । రావణాలంకలో చెరలువుందువా । ఆపలుకులువిని జానకప్పడు ।
కన్నులజలములు గ్రక్కునదెచ్చె । ఆపలుకులువిని శాంతఅప్పడు । అప్పుడుతమ్మునితో
యిట్లనెను । చిన్నవాడవా రాఘవనీవూ । సీతతోను పంతములేలర । ఆటమన్నదాజానకి
నిన్నూ । ఓడమన్నదా జానకినిన్నూ । ఆడవారితో ఆడగనేలా । వోడినధనమడిగితె
కోపములా । రమ్మిలక్ష్మణా ముందరికడ్డమూ । తెమ్మనవయ్యా వోడినధనమూ । ఆపలు
కులువిని లక్ష్మణుడప్పుడు । అక్కకువదినెకు మ్రొక్కుచునిలచే । సీతయెవ్వరి సొమ్మో
యన్న । సీతాలక్ష్మియు మనదేకాదా । రాముడెవ్వడి వాడేసీతా । రాజ్యమంతా మనదేకాదా ।
అంతట రాముడు అతివేగమున । అంతఃపురముల లోపలకేగె । శాంతతోటి సరసమ్ము
లాడుతు । రాకయుండె నాజానకిదేవి । తడవాయెను జానకి రాదాయెను । తమ్ముణ్ణి పిలి
పించెనురాముడు । అపలుకులువిని లక్ష్మణుడపుడు । కావించెను కడువేడుకతోను । మందగ
మనలందములునపుడు । వేడుకవింజామరవిసరుచూను । ఆకుల మడుపులు అందిచ్చుచును ।
పాదములొత్తుచు శ్రీరాములకు । కూడివుండిరా రామునితోను । సందడిఘనమాయెను
ఆనగరిలో । చూచిపత్తమని జానకిదేవి । జాలకజ్జులా వెంటనెచూచుచు । విశ్రాంతినిగొని
యిట్లనిపలికె । యేకపత్ని వ్రతుడవు అనుచూ । యిచ్చేగాక మాతండ్రయితే । యేకపత్నీ
వ్రతములూఅన్ని । తెలిసెగదాయిక్కడయీలాగు । ఆపలుకులువినికాంతలుఅపుడు । అంత
జానకితో యిట్లనిరి । యెక్కడిదానవె జానకినీవు । యెప్పటికి మేమేవున్నాము ।
అడవుల లోపల నీవుబాసినా । అంత వేడుకతో మాతోగూడె । విల్లువిరవగా వచ్చినదానవూ ।
యెక్కడిదానవె జానకినీవు । ఆపలుకులువిని జానకపుడు । కన్నులజలములు గ్రక్కున
దెచ్చె । ఆపలుకులవినిశాంతపుడు । తమ్మునిసదురుకెతానేతెంచె । తమ్ముడికాంతల తాను
జూచియో । విశ్రాంతికొనియిట్లనిపలికె । సీతతోడిపంతము లేటికిరా । చిన్నవాడవారాఘవా
నీవు । అబలకానకడు ముగ్ధవుపెరుగవా । పంతము లేటికిరాఘవనీకు । ఆపలుకులు విని
రాఘవులపుడు । అపుడుకాంతతో యిట్లనిపలికెను । అక్కరోజూడవే అస్త్రమ్ములా ।
సీతనుపట్టితెచ్చినఅస్త్రములు । యేమనిజూచెదన స్త్రమ్ములనూ । తెచ్చివుంచెనా శ్రీలక్ష్మణుడు ।
ఆరగించేనా జానకీదేవి । కూడివుండెనా రామునితోడ । అతివర్షమ్ములు సాగిపోగను ।
అవనీసుతకటుగర్భము దోచె । వెల్లబారుటలువెలవెలచూపు । ఆసతిముఖకళకందము

దోచె । బింబాధర పూబోణికియింపై । బింబముపాండువర్ణ మెబోలు । అంబుజాక్షియని యాడితెనడువ । వడియనికట్టినముడియనబోలు । హేమకమలముల యింపులుతుమ్మెద ।
గుంపుగూడిన చందమెబోలు । చెలికత్తెలుకడు బాంధవులెల్ల । వెలయగమనసీత వేకటి యనీరీ । మరియుతక్కిన బాంధవులెల్ల । అవనిజమనసీత వేకటియనీరీ । కౌసల్యకైక సుమిత్ర । శాంతయు జానకీకడకేతెంచ్రీ । ముఖమేటికీతెలుపెక్కెనుసీత । వొళ్లేటికి సిక్కిందీలాగు । అన్నమేల ఆరగించవుసీత । యేమేనీవున్నా విధమనిరి । ఆవేళకాలము గందినఫలములు । అటువంటి కోరికలు యేమిగోరెదవు । అత్తలుఅడిగిన భయమున జానకి । తలవంచుకొని సిగ్గునబలికే । ఇన్నాళ్ళాకళ్లకు భోజనంబాయె । అసహ్యముతె లోచెడుననెను । నిన్నటనేటనురుచులతొ అన్నము । హితవాయెనుయని జానకీబలికె ।
ఆపలుకులువిని శాంతమ్మపుడు । అప్పుడుతల్లులకిట్లని పలికె । తగవుగాదు కౌసల్యతోమీకు ।
ఆరగించిబెట్టవే కోడలకు । నిలువలేదు జానకితానపుడు । తరుణులమీదనె చేరున్నదిగ ।
ఎల్లలోకమ్ములవారందరు । గర్భముదాల్చిన తరుణినిజూడా । వత్తురెకౌసల్య యెల్లవారలు చూతురె మన కాంతలనలుగురుని । తల్లితోడుకొని బోయేవరకూ । ఆరగించబెట్టవెనీ వలెను । అనియిటుదాసును బుద్ధులుజెప్పగా । అనుదినము కోడలకు తావడ్డించే । అత్తయు బెట్టిన భయమునసిగ్గునా । రుచులతోడ నన్నముభుజియించె । శుక్లపక్షమందు సోమకళలు దేరగా । వైదేహిగర్భము వర్ధిల్లెను । అమరసమానులు కుక్షిలోనుండగా । ఆయింతిగర్భ ముపర్ధిల్లె । పట్నములోపల పంకజాక్షులు । సీతకుదెస్తురుదినుసులు చాలా । వాకకాయ వదీకాయలను । జప్పైనామారేడు కాయలను । చింతకాయపులి చింతకాయలను । మేలి మైన మామిడికాయలను । గిరికాయావోరిక్కాయలను । గంగరేగు కాయలు మొదలు గను । కిసిమిసికాయలు గరిమికాయలు । అందమైనా యుసిరికాయలను । బాగుమీర పాడికాయలను । మూలమైన మునగకాయలను । అల్లపుముక్కలు జీడిపిందెలు । ఆముస గకాయలు మొదలుగను । దానిమ్మా గజనిమ్మ కాయలు । అందమయిన బుడమకాయ లను । ఏసికదుంపలు టెంకాయలును । ఊరుబిండిగొని తెత్తురువారు । సింహద్వారమున పణతులురాగను । రాముడుతానిండు కొలువై యుండె । పాణిద్వారమున నరుగుదుమనిరి ।
అపహాస్యముల కొచ్చును రాముడు । తప్పకపొగడే కాంతలుమీరు । అక్కడచెలికత్తెలు వేగమెవచ్చి । ఇట్లని పలికిరి వివరముతోను । అమ్మరోపట్ణపు కాంతలందరు । చూడగ వచ్చిరి తమరినిఅనుచు । ఆపలుకులవిని శాంతమ్మపుడు । ఆవలకేగవే జానకినీవు ।
తెచ్చినతగువులు శాంతందుకొని । ప్రియభోజనమ్ములు వారికినుంచే । నిర్మలోదకమ్ములు దెప్పించెను । పాదంబులు గడుగుడుమీరనెను । పాదంబులు గడిగినమీదటను । జానకి పిలువుడని తాబలికె । రావే జానకిరమ్మనిబలికె । చెల్లెలాతో జానకిదేవి । తొలకరి మెఱ

పనదానేతెంచె । నవమాసమ్ములు నిండగలేదే । ఎంతఎత్తుగా నున్నదెబాలా । యెక్కువ మోహమె జానకిమీదను । గర్భముదాల్చి నతరుణినిజూడ । యెంత మోహముఅయి నాకాని । నరినెలనోతుర సఖియరాయనెను । కోరికలెట్టివో కోరవేసీత । కోరినఫలములు తెచ్చేమనిరి । ఆపలుకులువిని శాంతమ్మపుడు । అతికోపమ్మున నిట్లనిబలికె । అనేక కాలానికి అందినఫలములు । నటువంటి కోరికెలు యేలకోరితివే । చెప్పంపితివా జానకినీవు । కడుమోహమ్మున తెచ్చెదనేను । అతిమోహమ్మున మీరలుండగా । చెప్పంగకారణమే మనెను । అందమైన గంధముకస్తూరి । అందరికి సెలవందించెనుశాంతా । కొందరికి ముత్యాల చీరెలూ కొందరికి మేలైనసొమ్ములు । కట్నాలిప్పించెను ఆశాంతా । కట్నాలందుక కాంతలందరు । శాంతతోను తమరిట్లనిరపుడు । అమ్మరోమేము ఆడాయొకప్పుడు । యేమనిపలికితిమి మీతోను । జానకికిబాలురు కలుగుదురనుచు । పలికితిమమ్మ వివరము తోను । మామాటలకును తిరుగరాదుగ । పంతము తోడుతపలికితిమనిరి । జానకిబాలుర కనియేటినాడు । చెప్పదగవె శాంతరో నీవనిరి । ఆలాగే చెప్పంపెదననెను । సెలవులుపుచ్చు కొని సఖియలందరు । తమతమగృహముల కేతెంచిరీ । అంతలోను రాఘవులు తమరప్పుడు । అంతఃపురములలోపలకొచ్చి । అమ్మరోపట్టపు కాంతలందరు । యెందుకు తెచ్చిరి దినుసులు చాలా । జూడవచ్చిన వారలు గనుకను । కడుమోహమ్మున తెచ్చెదరనెను । వీధివెంటను తెచ్చినవస్తువుల । సీతకుపెట్టవద్దనె రాముండు । కావలసినమన యిండ్లినులేవ । కావింతము కడుశీఘ్రముగాను । ఒల్లనొల్లనని జానకిదేవి । పరికింపుచు కడువేగమెలేచె । అందమైన నగరితరువుక్రిందికి । ఒంటిగనరిగెను జానకిదేవి । ఒంటిగనరుగుట వుచితమెసీత । వెంట తోడులేరా యెవరైనాను । మొన్నజనకుడు పంపినచెలికత్తెలు । చేరరుగామాసీతకుఅనెను । వెల్లలనెడబాయక యుందురు । పిలువగాదుగా జానకితన్ను । ఈలాగుతిరుగుట యుచితమ సీత । అణగియుండరాదు యికనైన । అనుచుబలుకుచు సీతకుశాంత । అంగరక్షగావింపుచు నుండే । తల్లినిదండ్రిని దనమదిలోపల । ధరణిజతనమది చూడగదలచే । జానకిభావము శాంతకుదెలిసి । తరుణివచ్చితల్లులకేజీగించే । కోమలాంగులు కోడలనిజూచుటకు । కనకపు మేడకు గ్రక్కునవత్తురు । అత్తలునాడ బిడ్డయువచ్చుట । తనుచూచుటకని ధరణిజలేచె । తీగెరత్నపు తివాసులమీదను । తరుణిచుట్టు గూర్చుంచిడిరివారు । ముదముతో కౌసల్యా ముందరందుకొని । ముద్దులకోడలిని కోరికలడిగె । లంకలోనుండేటి రాక్షసకాంతల । వనచరకాంతల వనమృగములను । మునిఋషికాంతల మునుపటికాంతల । మైథిలిచూడగ మక్కువలేమొ అతివినయమ్మున నాదరించగ । కన్నులజలములు గ్రక్కునదెచ్చే । సుమిత్రకోడలి చెయిపట్టుకొని । కౌగిలించుకొని కన్నీరుతాదుడిచే । మేముగాకనీకెవ్వా రిక్కడ । కోరిందేమొ కోమలిచెపుమ । అత్తసవతి తన్నడిగినపిమ్మట । బంధువులను

చూడవలెననెను । అడవులుతిరుగుట వనములకేగుట । చెరబోవుటయసురులుచచ్చుట । అగ్ని
లొజొచ్చుట భూసతితెచ్చుట । మైధిలిగర్భిణి వారెరుగరుగా । కౌసల్యాకైకాసుమిత్ర ।
శాంతతోను చదురునకేతెంచిరీ । గర్భిణిస్త్రీకిని కోరికగూడదె । అక్కడకునుమన మంపగ
వలెను । అనుచుబలుకుచు నలుగురతివలు । చదురుకు చనుదెంచ శ్రీఘ్రమున । తగిన
వారుతమ్ములుచెలికాండ్రతో । రత్నపుగద్దెపై రాఘవులుండిరి । మొలకనవ్వులు మురియుచు
ముఖమున । ముద్దులరఘుపతిమాతలగనియె । అక్కానీతల్లులతోడ్కొని । ఇచ్చటికొచ్చిన
కారణమేమి । నెపము లేక మీ రిచటికిరారుగ । వచ్చిన కార్యము దాచక చెపుడీ । ఓపిక
చేయక వంచనచేయక । శాంతరఘుపతి చేయిబట్టుకొని । తల్లులువినగా తమ్మునికిట్లనె ।
చక్రవర్తి పెద్దకూతురికప్పుడు । మాసములు నాలుగు గడచినవి । తల్లినిదండ్రిని తనమది
లోన । ధరణిజయెప్పుడు తలచుచునుండె । అన్నచిత్తమే ముందరనెరిగి । ఇప్పుడులక్ష్మణు
డక్కకునినియె । నదులునగమ్ములు నగరముదూరము । నాతినిబంపుట న్యాయముగాదు ।
భూములుపాములు పుట్టలుగుట్టలు । మగువనుబంపుట చెల్లదెమాకు । మారాడక మీరరుగు
డనెను । ఆపలుకులువిని సుమిత్రయప్పుడు । అప్పుడుకొడుకుకు నిట్లనిబలికె । నన్నుగన్న
తండ్రివి న్యాయంబగున । నీకేటికిజానకిపై మాట । రాముడుండగ భరతుడుండగ । శత్రు
ఘ్నుడు ప్రధానులుండగను । నీకేటికి జానకిపై మాట । ఆడుతోడునేపుట్టలేదని । ఆడితివని
జనులాడుదురయ్యి । శాంతకుగర్భిణులైన మీ ద ట । తల్లడించు మనచిత్తములన్ని ।
ఆలాగేయని యనుకోరాదా । కాంక్షతోను రాఘవులు నప్పుడు । సుగుణవతిసుమిత్రకుబలికె ।
వేరుచేతువావెలదిరోవేరని । ఏటికిలక్ష్మణుడనుజుడై కాడా । అతనిసమ్మతినాకనుకూలము ।
అమ్మానీవిట్లాడగనగున । చెప్పంపితెజనకుడుతావచ్చును । చూతామప్పటి యాచందములు ।
అనుమానింపుచు నతివలునలుగురు । అంతఃపురములకే చనుదెంచిరి । తల్లులబుద్ధులు
మదినుంచుకొని । తమ్ముల జూచెను నతిరహస్యముతో । చక్రవర్తిక్షేమము తెలియదుగ ।
తనయులులేరని దలతురుమదిని । బి ల్వ న ం పి తే ప్రియమొందెదరు । అనిచెప్పగ
శాంతాచనుదెంచె । భమిడిపత్రికా పణతితెచ్చెను । ర త్న ము ల రంగవల్లువ్రాసె ।
ఆణిముత్యములక్షరములచే । సుమంతుడు శుభలేఖలువ్రాసె । హరునివిల్లు విరచియతివను
దోడ్కొని । అయోధ్యకు వచ్చేమార్గములో । పరశురామునిభంగపరచిరీ । పదుమూడేడులు
పట్ణమునుండీ । కైకవరమునకరుణచాలక । తండ్రిబంపె దాపసివనములకు । దండక
మండలముల వనిదిరిగి । అసురులజంపుచు పదునాలుగేండ్లు । వాలినిచంపి వనచర
రాజ్యము । తారనుగూర్చి సుగ్రీవుకుగట్టి । జలనిధికొండల సేతువుగట్టి । రావణకుంభకర్ణుల
గూల్చె । రావణుతమ్మునిరాజుగజేసీ । పన్నుగసురకాంతల బాధల నణచి । సీతంజూచిరి
మునుపటిలాగు । కందదుకుందదు కాంతతరుగదు । వాసరగభూతములొచ్చినజడియదు ।

అగ్నిలొజొచ్చి యచ్చటనేయుండె । అనుజులుమునులు నమరులురుద్రులు । తగునేరాఘ
వతప్పేమనిరి । పావకుడుదెచ్చా బాలికనిచ్చెను । జానకితో నామృగములతోను । కుబేరుని
వరపుష్పకమెక్కి । సౌమిత్రితొసాకేతమువచ్చిరీ । మేముఅడిగిన యేడవదినమున ।
దశరథుడు మృతిబొందెను । తాను రారై తిరి పోరై తిరిచూడను । వార్తకైన నొక్కరి
నంపరుగ । బాంధవగుణ ప్రియబాంధవులంటే । రారాపోరాఘనులైవాను ।
మీసుపుత్రిక గర్భముదాల్చెను । మిమ్మల నెప్పుడు దలచుచునుండె ।
మాకిందరికిని పరమానందము । మిథిలానాయక వేంచేయుడనెను । అని వ్రాసి
సపత్రికను చేపునికింపుగ । చేరవచ్చిశతృఘ్నుడు చదివే । చారులబిలిచిజే
తులకిచ్చె । చక్రవర్తికనిపొమ్మని పల్కె । అంతటమిథిలనుమిథిలేశ్వరుడు । అజుడును
మునులు అమరులు గొలువ । వేదశాస్త్రపురాణమ్ములు చదువగ । వ్యాఖ్యానములు విప్రులు
జెప్పగ । మంత్రివచనములు మంత్రులుజెప్పగ । ఆశ్రితజనులును యిమ్మనియడుగ ।
ఆటలపాటల అప్సర స్త్రీలు । వీణమీటుచువిద్దెలుచూప । గౌతమపుత్రుడుగద్దియనుండి ।
క్రితువులుజేసెటి క్రిమములదెలుపను । ఈవిధమున నారదుండేతెంచె । తెల్లనిదేహము
తెల్లనిజడలతో । తెల్లకమండలము చేబట్టుకొని । వీణమీటుచు విష్ణునిబాడుచు । చనుదెంచెను
జనకునిచదురుకును । అర్ఘ్యముగొనుచు యెదురుగవచ్చి । అర్చనలిచ్చుచు అడుగుల
వ్రాలే । దర్ప పీఠమున తాపసినుంచి । తమ్ముడు తానును కొలువైయుండె । యేదివినుండి
యేతెంచితిరి । ఏతీర్థము లాడితిరీవేళా । ఏన్నాళ్ళాయెమిమ్మునుజూచి । యెన్నగపుత్తడి
మాయనుండే । కోసలాధీశ్వరుండు కొమారులతోను । కోడలుఅక్కలు సుఖమున్నారా ।
అనియడిగిననా నేర్పరినవ్వుచు । వినుమనినారదముని యిట్లనియెను । హరువిల్లువిఱిచి
యతివను తోడ్కొని । అయోధ్యకువచ్చే మార్గములో । పరశురాముని భంగపరచిరి ।
పదమూడేండ్లును పట్టమునుండిరి । పట్టముకట్టుదమని యందరును । వేడుకతోదినమును
యెన్నుదురూ । కైకవరమున కానల కేగిరి । ఖరదూషణాగుల ఖండించిరుంచే ।
అన్నతోగూడ అడవికి బోతు । అప్పుడులక్ష్మణుడతివకుబలికె । అన్నయు వదినయు
నడవికిబోదురే । వారినికొలువను బోయెదనేను । తలయెత్తిసుతునితప్పకజూచి । తల్లడింపు
చుతరుణియిట్లనెను । అక్కతొగూడ నడవికిపోతె । మిమ్ముబాసి నేనెట్లోర్వగలను ।
చావలత్రోవ నడవరాదందురే । తలయెత్తి సతిని తప్పగజూచె । తనువునిలవకా ధరణినివ్రాలె ।
మాళవశతకీర్తి మగువలిద్దరు । భయమున భరతుని కెరిగించిరి । జలముబబోసి చలువను
గట్టరే । చందనమలది సురటీవిసరిరే । పచ్చకర్పూరపు పలుకులుదెచ్చి । పూటపూటకు
కన్నులనుంచరె । మాళవశ్రతకీర్తి మగువలిద్దరు । శైత్యోపచారములు చేయుచునుండిరి ।
సతికియిచ్చిన సత్యమ్ముకువెరచి । తపించి దశరథపతియేచచ్చె । తల్లిజేసెనని తనమది

నుంచి । తాపసియాయెను నాభరతుండు । సీతాలక్ష్మణ సేవితులగుచు । చిత్రకూటమున
కొన్నాళ్లుండీ । పంచవటి భాగీరథిపొంతను । పర్ణశాలకడ నుండగనపుడు । రావణుచెల్లెలు
రాము మోహించెను । లక్ష్మణుడారక్కసినిశిక్షించె । మాయమృగము మారీచుతోడను ।
దశకంఠుండుతరుణిని గొనిపోయె । ఆకలినిద్రా దప్పింపణచె । చీకటివెన్నెల చింతేమాని ।
పక్షులమృగముల భయమేవిడిచె । నెఱుకవేణి సీతకుజడలనల్లె । అశోకమనువృక్షమున
నుంచిరి । వాలినిజంపి వనచరరాజ్యము । తారనుగూర్చి సుగ్రీవుకుగట్టిరి । జలనిధికొండల
సేతువగట్టి । రావణకుంభకర్ణాదులగూల్చె । రావణుతమ్ముని రాజుగజేసె । పన్నగసురకాంతల
బాధలణచి । సీతనుజూచిరి మునుపటిలాగున । కందదు కుందదు కాంతితరగదు ।
ఒనరుగ ఘాతముఁ జొచ్చిన జడవదు । అగ్నినిజొరగా నక్కడనుంచి । అజుడును
మునులును అమరుల్ రుద్రులు । తగునే రాఘవతప్పేమనిరి । పావకుడు తెచ్చి
బాలికనిచ్చిరి । జానకితోనె మృగములతోనే । కుబేరుని వరపుష్పక మెక్కి । సౌమిత్రితో
సాకేతమువచ్చిరి । అన్నలుతమ్ములు అతివినయమ్మున । అక్కచెల్లెలుసతి వినయమ్మున ।
కువలయేశనీ కూతుల్లు అల్లిరు । అయిదువేల వత్సరముల క్రిందట । అయోధ్యనుండగ
నేగంటి , వినిజనకుడు తనవీనులుమూసే । సింహాసనమున దిగ్గునలేచి । తాపసిపూజకు
తమ్ముని యుంచి । అభ్యంతర మందిరములజనెను । జానకిపెంచిన చెలులను బిలచి ।
వాసంతిని పిలుమని తాబనిచె । వడవడనాడెటి వదనముజూచి । ఒనరవసంతయు నిట్లని
బలికె । ఎక్కడనుండి యెవ్వరువచ్చిరి । యేమివార్తలు యెవ్వరిమీదా । అయో
ధ్యలో రాముడు అ ను జు ల తో ను । చెల్లెంద్రతో జా న కి సు ఖ ము న్న దా ।
యడిగినతన స తి న డ ల క వి ను మ ని । నారదవాక్యములంతా జెప్పె । నటికిన
క ద శీ త రు వో య న గా । యవని వ్రాలెనుయశ్రులుకురియా । దాదులు చెలులజేరి
యడలగా । యేరాలేమని యె దు రు గ న డ వ గ । యప్పుడు వసంతయిట్లనిపలికె ।
దిక్కులేక దిగవిడచినందుకు । యడవులకంపిరి యననేమిటికి । యెలాభూములు దున్నగ
బంపినా । ఎందుకుకనిపిస్తివెమాతల్లి । యేలాయజ్ఞము జేయదలచినా । ఎందుకుపుట్టితె
ఊర్మిలనీవు । కనిపంపగ దమపుత్రులు యేగిరి । భూమిజతానేటికి పోనాక్కా । తనసతి
కూడుకుతానుండకను । ఒంటిగనుండుట ఉచితంబగున । పతియగ్నిగుండము చొరబంపితే ।
యేమని నీమదితలచితివమ్మా । తల్లిని దండ్రిని తలచితివమ్మా । దాదులచెలులను తలచితి
వమ్మా । చెల్లెలను చూడగవలెననుచు । శోకించితివో జానకినీవు । సిరిగలముఖమున
చిలుకపలుకులు । జేరిపిలుతువే జానకినీవు । తల్లికంటెనుదాదిమంచిది । తనకిమ్మందువె
మాశనినీవు । బొమ్మరిండ్లలో పొలతులగూడి । ప్రొద్దులుబుత్తువె పూర్మిశనీవు । చాలభూష
ణమ్ములు ప్రభలుదేరగా । పారాడుదు వేశుశ్రితకీర్తినీవు । ఆలుమగడునీరీతినియడలగా ।

సీతకొఱకుమీకు చింతయేటికి । సీతారాములు శ్రీధరులనుచు । వగవకుమని నారదుడు
చనియెను । వినిజనకుడు నాశ్చర్యమునొందె । యయ్యోధ్యేశ్వరుడు పంపినచారులు ।
యప్పుడు మిధిలాపట్టణము కొచ్చిరి । చక్రవర్తి పరిచారులజూచి । జనకుండెక్కడ
నున్నాడనెను । రాముడుబంపినదూతలువచ్చిరి । చారులు చెప్పిరి జనకుని
తోను । చదురుచావడిలొ కూర్చొనియపుడు । తమ్ముడుచదువగ తగతానుచ్చె ।
యచ్చరత్నమ్ముల మాణిక్యమ్ముల । పట్టుకట్టములు బాగుగనిచ్చె । పాలునునెయ్యి పంచ
దారలు । పరమాన్నములు భక్ష్యభోజ్యములు । భోజనమ్ములు నియమించిరి వారికి ।
కర్పూరము తాంబూలములిచ్చిరి । యభ్యంతరమందిరమ్ముల కేతెంచె । జానకిపెంచిన
చెలులనుబిలిచి । వసంతనుపులువుండనితాబలికె । రాముడంపిన దూతలువచ్చిరి । రమణిరొ
రమ్మనె రాముడుతన్ను । రాజీవాక్షికి గర్భమాయెను । రమ్మనె రమ్మనె రాముడు నన్ను ।
జేతులమోడ్చుక చేరగవచ్చి । చరణంబులపైకొరిగిట్లనెను । మీతోనేనునువస్తేగాని ।
తరుణులనెన్నడు చూడగలుగుదును । నాతోకూడానీవువస్తువే । నవ్వరెలోకులువిన్ననుగాని ।
యంపినల్వురితోడ్కొనివచ్చెద । యంపకున్న జానకినేదెత్తు । వియ్యంపువారును కన్నడ
సేతురే । విన్నవారునవ్వరచేనిన్ను । ఆపలుకులువిని వసంతయప్పుడు । కన్నులజలములు
కార్చుచుబలికె । పంచరంగులుపాత్రలుగూర్చి । పటములువ్రాసే జానకిజూస్తి । రామచిలుక
నుప్రేమతొపిలుచుచు । మాటలుచెప్పే మాళవి చూస్తి । బొమ్మరింటిలోపొలతులగూర్చి ।
ప్రొద్దులుపుచ్చె ఊర్మిళచూస్తి । చంద్రకాంతములు చాయలుదేరగ । పారాడే శ్రుతకీర్తిని
చూస్తి । మీతోకూడావచ్చెదనేను । నాతోకూడానీవువచ్చితె । రాముడుసీతా కాదందురుగా । వల
దునిలువుమనినగరమువెడలే । కాల్బలమ్ములుకమ్ముకరాగ । బహుజనమ్ములుసాగనంపగ ।
యేడునేడు పధ్నాలుగుదినములకు । అయ్యోధ్యాపట్ణముచనుదెంచె । భేరిమోతవిని బెదురు
చునప్పుడు । చారులురఘుపతిపాలికిపోయి । దండువచ్చెనుదశరథతనయా । మమ్ముగావుమని
చెప్పిరిమ్రొక్కి । ఆసుమంతుడు హనుమాంగదులు । మైందుడుద్వివిదుడుగంధమాధనుడు ।
గజుడునుగవయుడు గవాక్షుండు । రఘువరునిసేనలు తొమ్మిడి నిలచే । సామంతులసేనల
పని జూడగను । కలకలవాదించెనుసౌమిత్రి । యచ్చటి రాజు తామసుడాయెనో । ఎత్తి
వచ్చెవారెవరో వినుమీ । చారులుపోయి చెప్పినమీదట । చక్రవర్తిమిము చూడగవచ్చె ।
వారలయుద్ధం బరుపైతోచెను । తమ్ముపలుకులకు తానవ్వుచును । దశరథరాజు చని
పోయెనుగా । యెవ్వరునెదురు జనంగవలెనో । పండ్లుతమ్ములు పంచదారలూ । భాంధవులతొ
భరతునంపించూ । విడినవిడెమ్ములుఫలములుచవులూ । సామంతులతో సౌమిత్రిని । పంపు
మంచు నాటలపాటలతొ । సేనలతోశతృఘ్నునిబంపూ । నీవునుతానును సుషేణసుగ్రీవులు ।
చదురుచావిటికెదురుగనిలచేమూ । యనిగురువుతన కానతిచ్చినా । యట్లేచేయుమని

యనుజులనియమించె । తెల్లనిగొడుగుల వింజామరలో । జేరిమ్రొక్కిరా జనకునిపుడు । శశివలెపొంగెడు జలనిధిజనకుడు । రవిపతిమించాభార్గవిబోలు । రామభరతులహస్తముపట్టుకొని । మెల్లగజనకుడుచదురుకువచ్చె । లక్ష్మణశత్రుఘ్నుల జేపట్టుకొని । జనకునితమ్ముడుచమురుకువచ్చె । వసిష్ఠాదిఋషులకుమ్రొక్కిరి । చిరంజీవిగమ్మని దీవించిరి । వారిక్షేమము వసిష్ఠుడడుగగా । క్షేమమనుచుశత్రుఘ్నుడుచెప్పె । ప్రత్యుత్థానముత్రియుత్తరమున । రత్నపుసింహాసనమునగూర్చుండి । రామునిచూచెజనకుడుబలికె । మగువలచూచిమళ్ళివచ్చెదను । మందిరములకు నప్పుడుతన్ను । చిరుచిరునగవుల శ్రీరాఘవులూ । ఋష్యశృంగినితొనిట్లనిబలికె । బావనీవును మామలతోడ్కొని । అంతఃపురముల కరుగుండనెను । ఆపలుకులువిని ఋష్యశృంగుడు । యప్పుడుజనకునికిట్లనిబలికె । తంద్రులుమీరుతనయుడనేను । రాణివాసకురమ్మనిపిలిచె । సంతోషింపుచు జనకుడుగదిలే । అంతకౌసల్య యాత్మదాదుల । అలంకరించుమనినగరులుయన్ని । పచ్చకర్పూరపుపలుకులుగలిపి । పన్నీరుజల్లగవిరజల్లెను । పసిడిపీటలే బహుమణిగత్తెలు । కెంపులతివాసీలు పఱపించె । రమ్మిశాంత మాటకారివీ । జనకుల కేమని చెప్పగవలెనో । తమ్ములతోను బాంధవులతోను । ఋష్యశృంగుల చెయిపట్టుకొని । కనకపుగడపలు క్రమముగ దాటే । పగడపుతీగెల పందిరిని నిలచే । కౌసల్యాకైకాసుమిత్రలు । వెక్కెడిచిరి జనకుడువినగ । కలిమి లేములు కావడికుండలు । సుఖదుఃములుజోడె యుండును । చీకటివెన్నెలచింతయేటికని । జనకుడుబలికెకొమరితలగని । యంతకౌసల్య యాత్మదాదులూ । సీతను పిలుమని చెలువముతోను । వొప్పగ సుమిత్రశాంతతోబలికె । అమ్మానీవుచనియవనిజ మొదలుగా । కొమ్మలతోడుకరమ్మనిపలికె । పరువునరాగాపాపటచెదరగా । పయ్యెదజరగగ పతకములూడగా । యచటనుండెచెలియయొకర్తు । జనకునిరాకలు చెప్పుచునుండే । యక్కలారా మీకునాటలేటికె । నయ్యవచ్చెపిన్నయ్యనుగూడి । జనకనందనాదిగ్గునలేచి । చెలియను చూచియిట్లనిపలికె । చాలించరెయాటలుసీపాటి । సద్దుజేయకావినరేయనెను । మంత్రాలోచన మంత్రివినీవు । మాళవిమన కష్టమ్ములుచెప్పా । ప్రియభోజనంబుల ప్రధానివినీవు । వూర్మిళనీవు కార్యములుదాచకజెప్పా । తంద్రివచ్చెనని మదిపొంగుచును । తల్లులుబాంధవులు సుఖమున్నారో । చాల కాలమునకుజూడగవచ్చిరి । అంపిదురేమోయవలచూడ । యక్కకు శ్రుతకీర్తికి యిట్లనిపలికె । అత్తగార్లతోనలిగియుందమో । పతులతోటిపలుకకనుందామూ । యయ్యలతో నమ్మలకబోదామూ । యనివినియూర్మిళ యిట్లనిపలికె । చాలు నీమాటలు చాలించగదె । పిన్నవునీవు ప్రియలముమేమూ । మమ్ముల మెచ్చరే మనసులయినా । శాంతవచ్చెనని జానకిలేచే । జనకపుత్రికలతొ శాంతయిట్లనెను । కొమ్మలార మీకోర్కెసాగెనే । జనకుడువచ్చెనె మిమ్ములచూడా ।

విడా

కౌసల్యాఅంతఃపురముననున్నారే । మాతల్లియడిగెమీతల్లులను । నేడుకన్నులాపండువు
గాను । నెలతరొరమ్మని చెయిబట్టుకొని । యందమైన కాలందెలుకదలగా । చక్కాగ
సందెటివండలుగదల । సీతగర్భిణివిన్నెలు మెరయగ । తాంబూలమ్ములుచాయలుదేర ।
శాంతచుట్టునిలిచుండిరివారూ । అక్కాల చూచుచునడలదెలుపుచు । చేరిమ్రొకినా శ్రుతకీ
ర్తిప్పుడు । అలివేణిసీ మదియడలగనేటికే । అవనిజమాళవిఊర్మిళలేదే । మరచితివా
మమ్మునుకన్నతండ్రీ । మరుపేలాగునమాపైవచ్చే । అదిజానకి ఋపిమాళవి యది
యూర్మిళ । శ్రుతకీర్తినిమీరెరుగరుగా । వాలుకన్నుల వరదలుకారగా । వారిజముఖి
తామాళవిమ్రొక్కె । మ్రొక్కినతన సుతయక్కునజేరిచి । ఆశ్వాసింపుచు దీవనలుంచే ।
తొలకరిమెరుపుతో సోయగమొప్పగా । భామయూర్మిళా తండ్రికిమ్రొక్కె । గమ్మారఘు
కులాసోమలక్ష్మణా । కోమలిరమ్మని హస్తముచాచే । తళుకుకన్నులాబెళుకుచూపులా ।
నీరజముఖిసీత తండ్రికిమ్రొక్కె । మ్రొక్కిన తనసుత యక్కునజేరిచి । ఆశ్వాసింపుచు
నంకమునుంచే । దీర్ఘాయువు గమ్మనిదీవించే । సూర్యకాంతమణి చంద్రనీలము । జానకి
మ్మాళవిమేడలకిచ్చె । చంద్రకాంతమణి సూర్యనీలము । ఊర్మిళశ్రుతకీర్తి మేడలకిచ్చెద ।
మణిఅక్షరముల మంచిఅద్దము । జనకుడు మెచ్చాశాంతకునిచ్చె । అప్పరత్నముల అంద
లమ్ములు । అల్లుండ్రకుతగినరాణువలిచ్చె । యెక్కువతరుచుగ మొహర్లుమణులను । దశ
రథపట్నపుతరుణులకిచ్చెను । ఆవులుపెయ్యలు అగ్రహారమ్ములు । వసిష్ఠఋష్య శృంగుల
కిచ్చె । ధనవస్త్రమ్ములు తరుణిరోనీకు । తరుచుగగలదా దాచకచెప్పు । జెల్లెండ్రూజెలిక
త్తెలుదాదులు । మాటకులోనై వుందరజెప్పూ । జెల్లెలనునీజనని మూరుగా । చేపట్టిరక్షిస్తివ
జెప్పూ । అడవుల తిరుగను ఆకులునమలను । అజుడుర్రావాసెనాఅమ్మరొనీకు । కూతుళ్ళా
తండ్రి గౌగిలించుచు । కోరికంటిమనిగోడుననేడ్చిరి । అప్పుడుశాంతాయిట్లనిపలికె ।
కౌసల్యా భూదేవికితోడు । సుమిత్రా వసంతికితోడు । మాప్రజలుమరిచెప్పనేటికి । మాటలు
కెల్లమంత్రేనేను । పతులమారుగాసతులుజూచెద । సతులమారుగా పతులుజూడరు । కానల
కంపినకారణమొకటే । మామామావల్లనుతప్పేమి । అడుగుడిమీసుతనావలబిలచి । మీరు
పలకగామగువలడించీ । చదురులోకి తాసరగునవచ్చే । కొంతసేపు కొలువువగూర్చుండి ।
రామునిజూచి జనకుడుబలికె । అడవులదిరుగుట వనముల కేగుట । చెరలోవుండుట అసరు
డుచచ్చుట । అగ్నిలో జొచ్చుట భూపతిజచ్చుట । నారదుడు తెల్పిననాటనుండి । కన్న
తల్లికన్నీరుదించదూ । అంపితె నలుగురితోడుకపోదు । అచ్చటబంధువులు చూడగను ।
ఆపలుకులువిని శత్రుఘ్నుడప్పుడు । అపుడుజనకుని కిట్లనిపలికె । తనయులకనిమీతనయ
వచ్చును । తనయవెంటవస్తురు యెల్లవారూ । అనవినిజనకుడు అతికోపమునా । తడవే
టికియని తమ్మునిచూచె । సమస్తసేనలు చదురువెడలిరి । వద్దనివారించెను వశిష్ఠుడు ।

నిలువునిలుమన నిలువజాలకా । తిరిగిచూడకా ధీరుడుపోయె । పర్ణశాలలుపంచటరుగులూ కలిపించి భోజనవిధులేగడిపే । ఏడునేడు పద్నాలుగుదినములకు । తమసన్నిధికివెళ్ళిరి వారు । జానకిపంపినచెలియయొకర్తు । కనకపుస్తంభము మరుగుననిలిచీ । జనకునిచందము శతృఘ్నుని పలుకులు । చేరిజెప్పెను చెలితానపుడు । కన్నులనిండగ చూడగలేదే । తమకిష్టమ్ములు చెప్పగలేదె । అయ్యలనుచు తొడలెక్కగలేదే । అమ్మలక్షేమంబడుగగ లేదే । ఎంతకఠినులే యిక్ష్వాకులు । ఇందువదనలేద్చిరి బాదులును । శ్రుతకీర్తిని తన ముంగిటజేర్చి । ముదముతొదేవికి ముంగురుదువ్వె । పోదాములని బుజ్జగింపుచూ । బుజ్జ గింపుచూ బుద్ధులుజెప్పె । రాచకులమున పుట్టినవారికి । రాకలుపోకలు యెట్టివిజెపుమ । అయ్యలచూస్తిమి అంతేచాలును । అతివలముగ్గురి అలసటమాన్పె । సుమిత్రకోడండ్రను చూడగవచ్చె । అంపెదరఘుపతిననుమతిజేసెద । జెప్పింతునువాశిష్ఠులచేత । శృంగారమ్ము లుచేయరెఆనెను । రామునిపట్టపుదేవికియిపుడు । సీమంతములుచేయగవలెను । రాము నరసను రమణి యుంచిరి । సీమంతహోమమ్ములు వేల్చిరి । తలుపులువేసుక తరుణు లందరు । పేరుజెప్పవె జానకి అనిరి । సీతారాములు శ్రీధరులనుచు । జానకిజెప్పెను చేడెలువినగ । పచ్చిపోకలుపండుటాకులు । టెంకాయలతొ వాయనములిచ్చిరి । ఎవరిగృహ మునకు వారుచనుదెంచిరి । అంతఃపురమున కేగెనురాముడు । చిన్నబోయిసీతశిరసువంచు చునుండె । నీకోపము మరినేనెరుగుదును । అంపలేదని అలిగితివనెను । అంపెదలక్ష్మణు ననుమతిజేసెద । పంపెదహనుమంతుని తోడిచ్చి । ఆముద్దుగుమ్మకుఅలుకలుదీర్చి । గుచ్చి కౌగిలించెను తనప్రేమ । ముఖము ముఖమున చేర్చుకరాముడు । చక్కనవెక్కిలిముద్దులు కొనెను । ఇందువదనను తొడపైనుంచి । మందగమనతో నిట్లనిపలికె । మందగమననె వేటకువెళ్లెద । మధ్యాహ్నవిధికివస్తాననెను । మిమునెడబాసి నిమిషమోర్వను । మీతో కూడా వస్తాననెను । వెంటనునీవు వేటకురాగా । నవ్వరెలోకులు వీథులవారును । నాడు యడవిలో యెవ్వరు లేకుండగా । చెరగొని పోయిరి దానవులైన । నేడయో్యా ధ్యలొ మనవారుండగా । ఏమిభయమే జానకినీకూ । ఎడబాయక మనశాంతవుండగా । ఏమికొదవగావచ్చునె నీకూ । ఆపలుకులువిని జానకప్పుడు । కన్నులజలములు గ్రక్కున దెచ్చె । బంగారుదుప్పటిచెంగులతో । సీతకన్నులాజలములుదుడిచె । కర్పూరమువీడెములు చుట్టిచ్చును । పాదమ్ములపైనవాలిగెనుసీత । పాదమ్ములపైనున్నజానకినెత్తి । అతిశీఘ్రమ్మున కదిలెనురాము । పోకుపోకుమనిపలుకుచుతాను । తిరిగిచూచె శ్రీరాములవైపు । చదురుకుచను దెంచెను శ్రీరాముడు । భరతునిబిలిచియిట్లనిపలికె । రాణువ శ్రీఘ్రమ్మునరప్పించూ । అన్న ఆజ్ఞఅయిన మీదటను । కావించెనుకడు శీఘ్రమ్మనను । కూడిరిసేనలు రాణువాలూ । హరియలుగొడుగులు అందలమ్ములూ । చేకత్తులుజవుతాశమ్ములును । గురుచకత్తులు గొప్పయీ

పెలు । బాకులుపందిరి బల్లెమ్ములును । శింగిరేడుబోరి ప్రజలు । తులగాౝహి హేరమ్ములు మొదలూ । దివ్యదృష్టిదండను మొదలుగను । అందగించగ కదిలెను రాముడు । నల్ల వారమ్ములు తెల్లవారమ్ములూ । పచ్చదేహమ్ములు బాహులుమీరా । వెండికణతమ్ములు వేసిరివారికి । బంగారపుగొలుసులువేసిరిగా । అంగదహనుమంతా సుగ్రీవులూ । జాంబవంత విభీషణు మొదలుగా । నీలజపింగళులు మొదలుగను । అందముతోడుత కదిలెనురాముడు । ఆడుదము కొడుదము కడుద మనుచు । ఆటలాడిరా వనములలోను । చుప్పనాతి తప్పక తాచూచె । దుఃఖించెను తనచిత్తములోను । మగవానిగానైతి పగలుసాధించగను । ఆడదాని నైయజ్ఞానినైతి । ఏమిసేతునని యేడ్వగదొడగె । రాముసీత కెడబాపుదు ననుచు । యతి వేషము దప్పకతాదాల్చె । దండక మండలములు సకలముదాలిచి । కావివస్త్రములు గట్టెనుమేనా । ఎక్కడనుంచోయతి వచ్చినదనుచు । రాముతో జెప్పిరి రాఘవవారు । అందములమదిగి తానందముజేసి । ఏదేశము మన యతులదియనెను । అన్ని దేశమ్ములు మావే రామ । నినుచూడగ వచ్చినదాన । విద్యలునావద్దను కలిగి యున్నవి । వేడుకతోడను చూడగవలెను । ఆపలుకులువిని రాఘవులపుడు । ఏమివిద్యలో యెటింగించుమనెను । రామకీర్తనలు రాజ్యములోని । రామకీర్తనలు నావద్దనుగలవు । వాడిగట్టిచుక్కలుయెగర నేరుతును । ఏరికిచుక్కలువిడువకనేర్తు । పారెడుపిడుగులపట్టగ నేర్తు । పటినపిడుగులుపిలువగనేర్తు । మంచుగుంచానబోసి కాలువగనేర్తు । మాయలెల్ల రథముగావింపగనేర్తు । అరచేయిపాత్రగవాడగనేర్తు । వానత్రాడుగాపేసగనేర్తు । మడుగుపై జెంగునువేసి నిద్రింపగనేర్తు । సముద్రము జెంగునదాటగనేర్తు । జెరుపుచేటగ జెరుగగ నేర్తు । చత్రాటపతీకొయ్యగనేర్తు । చత్రాతినినారల వొలువగనేర్తు । బోడితలకు బొందు మల్లెలుముడువగనేర్తు । మోకాలుపగిలిపరువగనేర్తు । ఇసుకలపొయిబెట్టివండగనేర్తు । వుసిరికాయదొంతిపెట్టగనేర్తు । ఊరికెకాపురము జెయ్యగనేర్తు । ఆవకాయదొంతులు పెట్టగనేర్తు । ఆలిమగలనెడ బాపగనేర్తు । చింతలెక్కిచిగురుకొయ్యగనేర్తు । సీతారాముల నెడబాపగనేర్తు । ఆపలుకులువిని రాఘవులపుడు । అంగదునిపిలిచిట్లనిపలికె । మనమైతె నెక్కడజూచెదముసీత । శాంతకడకు తోడుకపొమ్మనెను । ఆపలుకులువినిలక్ష్మణుడపుడు । అన్నరాఘవాయిట్లనిపలికె । యతులుపురమునకెందుకురాఘవా । వద్దనివాదించెనులక్ష్మణుడు । అయినానీయతియాడదిగనుకను । సీతశాంతకడకుతోడుక పొమ్మనెను । అడుగులకూ మడుగులొత్తుచు । ఆయోధ్యాపట్నానికీవచ్చిరి । కౌసల్యాకైకాసుమిత్రలూ । యతికి నెదురుగావచ్చినారు । ఎంతధన్యులమో యెంతపుణ్యులమో । యెంతభాగ్యవంతులమో మేము । మాగృహమంతాపావనమాయెను । మమ్ముధన్యులుగాజేసితిరిమీరు । నిర్మలోదకమ్ములు దెప్పించిరీ । పాదములు గడుగుడిమీరనెను । పాదములు గడిగిన మీదటను । సింహాసనమ్మున

కొలువుంచిరిగా । జానకినిపిలువుండనితాబలికె । రత్నస్థాపితమైనమేడలోపలా । హంస
తూలికా తల్పమునందూ । జెల్లెంద్రతో జానకిదేవి । చక్కపగడాలాడుచునుండెను ।
యెక్కడనుంచోయతివచ్చినదనుచు । విద్యలుచూతువుగారమ్మనెను । జెల్లెలతో జానకిదేవి ।
అల్లంతటదూరమునా నిలుచుండె । జానకినీజూచి ఆయతియపుడు । యేమేజానకి యెరుగు
దువటవే । యాదిక్కున్నదాతనపేరైనా । నాటికినేడేనిన్నుజూచుట । నాపై మోహ
ముకలదానీకును । తానుఎవ్వరో నేనుయెరుగను । శాంతనుపిలువుండని తాబలికె ।
రత్నస్థాపితమైన మేడలోపల । హంసతూలికా తల్పమునందు । పరుపుపైనున్న
రాముని అక్కని । వేడుకతోడుతలేపిరివారు । ఎక్కడనుంచో యతివచ్చినదని ।
విద్యలుచూతవుగారమ్మనెను । కన్నులనిద్రా కడలుకొనంగా । కనకరత్నపు వడ్డాణము
మెరయగ । సిగపైపువ్వులబంతులుజారగ । నటనటవీపులనాట్యములాడ । బటువుగ
ముత్యాల పాపటపేరులు । కంటాన్నీగులందము మించ । రలుకులుతాటంకమ్ముల మెరు
పులూ । చెక్కిళ్లను సొంపులుమెరయగను । గొప్పకన్నులాకాటుక మెరయగా । వొప్పుగ
ముత్యపు నత్తుదూర । పున్నమచంద్రుని బోలుమొగమున । దిద్దినకస్తూరితిలకముజార ।
అందపుశాసనలందముమించగా । తాంబూలమ్ములు చాయలుదేరా । నామకర్మమున రామ
చిలుకలూ । రామరామయని నాదముచేయా । వల్లెవాటుచుంగులునుజారగా । వచ్చెశాంత
యతిదగ్గరకూ । యేదేశము మీయతులదిఅనెను । శాంతనుజూచియు యాయతియప్పుడు ।
అన్నిదేశమ్ములుమాదేశాంతా । నిన్నుచూడగావచ్చినదాన్ని । విద్యలునావద్దనుకలిగున్నవి ।
వేడుకతోమీరుచూడవలెను । ఆపలుకులువిని శాంతమ్మప్పుడు । అతికోపమున నిట్లనిపలికె ।
యతులకువిద్యలు యేమిచేయనె । గారడివారికి విద్యలుగాని । అయినాతమ్ములు అతిసాహ
సులే । నిన్నుజూచితెగవేసేరే । నీవంటిదానిని అడవిలోపల । ముక్కుచెవులజెక్కె లక్ష్మ
ణుడు । తమ్ములనుచుబెదరించేవేమే । రాముడుబంపగవచ్చినదాన్ని । ఓహోరామునియేమ
నవచ్చు । ఆహారమునుయేమనవచ్చు । వీరులైననిక్ష్వాకుండేలెను । ఆవెనుకనుదిలీపుండేలెను ।
ఆవెనుకభాగీరథుడేలే । తప్పకదశరథుడు తమరేలిరి । దగిఇందరేలినాకాలమునాడు । ఎరు
గముగామేమిటువంటియతులా । రాములేలేటికాలమునాడు । కలిగినారుగయీవిధమునయతులు ।
చేసేదిమర్కటసహవాసము । రాజనీతులేరీతిగవచ్చు । చెట్లుచెదేకాలానికిపిందెలు । జెప్పిన
సామెతలేనిజమాయె । పట్ణములోపలపంకజాక్షులు । యతినిచూడజనుదెంచిరివారె । వారిని
చూచిశాంతమ్మపుడు । అతికొపముననిట్లనిపలికె । అత్తయింటికోడండ్రుకారబె । ఆజ్ఞశిక్షలు
లేవామీకు । పసిబిడ్డలుపాలకునేడవరే । బావలమరదులఆజ్ఞలులేవే । రాచననగరులకడ్డులేదా
యెనే । సంతచావిడాయెనుమీకెల్ల । దశరథుడుచనిపోయినవెనుక । సంతచావిడిమీకందరికి ।
ఆపలుకులువినిసఖియలప్పుడు । తమతమగృహములకే చనుదెంచిరీ । కౌసల్యకైకసుమిత్ర

లప్పుడు । యతనిచూడ జనుదెంచిరివారు । వారిని చూచియాశాంతమ్మప్పుడు । అతికోప
మ్మునినిట్లనిపలికె । దశరథుడుచనిపోయినవెనుక । యతిపూజలుచేతురు చేయదలచి । ఆ
పలుకులువిని తల్లులముగ్గురు । ఆవలికిచనుదెంచిరివారు । ఆపలుకులువిని ఆయతియప్పుడు ।
శాంతతోను యిట్లనిపలికె । అందరినిఅజ్ఞలు పెట్టెదవు । ఇందువదన నీవెక్కడి
దానవు । మందగమన జెప్పవెనాతోను । కూటికిజేరిన బాపనపడుచవు । కూతలేటికే
శాంతరోనీకు । ఆపలుకులు విని శాంత మ్మప్పుడు । అతికోపమ్మున నిట్లనిపలికె ।
ఎందుకుంచితివె జానకిదీన్ని । అంపరాదుగనిపాపైన । అచ్చరత్నంబులు మణిక్యములు ,
కనకపుచీరెలు కట్నాలిచ్చే । ఏలాచీరలు కట్టెదనటవే । ఏలాసొమ్ములు పెట్టెదనటవే ।
చోరులుజూచిన నపహరింతురు । రాజులుచూచిన తలగొట్టుదురు । రావణపటమువ్రాసి
యిచ్చితే । బ్రతుకుదునే నీలోకములోను , రావణుడెక్కడ పటముయెక్కడే । వ్రాయుట
యెక్కడజెప్పవెయనెను । అత్తలుఆడ బిడ్డలునుండగ । పటమైతే జానకి వ్రాయదుగ ,
పటమువ్రాయకాపట్నముకదలను । అనుచుపలికెను ఆయతితాను । అంతలోను రాఘవులు
తమరప్పుడు । ప్రయాణభేరిమెట్టుగ వేయించె । భేరీరవమునుభోరునవినుచు । బెదరుచు
శాంత యిట్లనిపలికె । రాముచిత్తమేరీతియున్నదొ । వ్రాయవెజానకి పటమనిపలికె ।
అప్పుడుజానకియిట్లనిపలికె । పదినెలలును చెరనుంటినిగాని । పాపకర్మునికన్నుల
చూడ । జనకునిగాథావిస్తినినేను । అంగుష్ఠ మొక్కటియెరుగుదును । అంతమాత్రమె
వ్రాయవేయనెను । అంగుష్ఠముజానకితావ్రాసెను । ఆమీదటయతిఅంతావ్రాసే । కాళ్లవ్రేళ్లు
పిరుదులుపిక్కలు । ఆభాగములన్నియువ్రాసె । నీరూపునలుపుతెలుపె । వన్నెలుపేరులు
పేరలందుకొని । చక్కగదాని వజ్రములు చెక్కించెనుదాన్ని । వైడూర్యము
పొదిగించెనుదాన్ని । వ్రాసెను పటమురమ్యముతొ । పరుగున వెళ్లెను పటము
పట్టుకొని । చనుదెంచెను బ్రహ్మసన్నిధికపుడు । అన్నచచ్చి ఆరునెలలాయెను
నాటనుండిఅన్నసుతాగానను । అన్నమారుగాచూచుకొందును । పటమునకాయుపుపోయుమని
యెను । పటముకునాయుస్సు బ్రహ్మపోసెను । పరగునవచ్చెనుపటముపట్టుకొని । నీపటము
నీనెత్తినిపొడుచుకో । ఆకాశవీధులబోయెనుఅసుర । పటమొచ్చిముందరనిలుచుండి । రావె
పోదములంకకుననుచు । సీతనుబట్టుక ఆపదబట్టెను । జానకిపట్టుకనీడ్వగదొణగె । శాంత
మంత్రులభార్యలందరు । గొప్పజ్వాల నప్పుడుగావించిరి । అందులోను పటమప్పుడువేసిరి ।
యగ్నియంత చల్లార్చునపుడు । పరుగునవచ్చెను పటమక్కడికి । రావేపోదము లంకకు
అనుచు । సీతనునాపదబట్టుకబెట్టె । జానకిపట్టుక నీడ్వగవొడగె । పాడునూతిలోపటమటు
వేసిరి । పాషాణమ్ములపై దోసిరిగ । పాషాణములుమ్మ పగులదన్నుచు । పరుగునవచ్చెను
పటమక్కడికి । రావెపోదములంకకనుచును । సీతనుబట్టి కాపదబెట్టె । జానకిబట్టుగనీడ్వ

గదొణగె । ఓహోసీతాయనియెటివారు । ఆహాజానకి అనియేటివారు । కన్నులజలములు తెచ్చేటివారు । కడలేనిశోకముపొందెటివారు । జానకికర్మంబనియెటివారు । వూరకచూచుచు నుండెటివారు । రాముడాజ్ఞకు జగములు వణకును । రాఘువులపై నానలుపెడుదాము । గేశవులాపై ఆనలుబెట్టి । హంసతూలికా తల్పముకిరింది । ఇంద్రనీలములు మీదికి వెలుగగా । చందరికాంతమ్ముల శయ్యనుంచిరి । అంతలోన రాఘువుడు నప్పుడు । వేటనుండిఅయ్యోధ్యకువస్తు । యేమిరలక్ష్మణయేమోకానీ । అవశకునమ్ములుపెక్కులుతోచె । నాశకునమ్మ నేడెతోచె । ఉండునా అయ్యోధ్యలోసీతా । ఆపలుకులువిని లక్ష్మణుడప్పుడు । అన్నరాఘవా యిదివిను మనెనూ । నాడడవిలోనెవరు లేకుండగా । జేరగొనిబోయెను రావణుడనెను । నేడుచలమునా అయ్యోధ్యలోపలను । యెడబాయక మనశాంతవుండగా । సీతకేమికాదవ శ్రీరామా । ఏమిరలక్ష్మణ యేమోకానీ । అవశకునమ్ములుపెక్కులుతోచె । నాశకునమ్ములునేడయితోచే । వుండేనాఅయ్యోధ్యలోసీతా । కాకులుకూసెను గద్దలువ్రాలెను । కూర్మనాథుడూపాదునగప్పె । పాలపిట్టఅడ్డముగాబారెను । ఆదిశేషుడూ అడ్డంబాయె । ఏమిరలక్ష్మణాయేమోగానీ । ఆపలుకువినిలక్ష్మణుడపుడు । అన్నరాఘవాయిట్లు వినుమనెను । అయినాముందర వెళ్లెదననుచూ । అతిశీఘ్రమ్మున అందల మెక్కె । అపుడులక్ష్మణుడన్నకు మ్రొక్కె । అయ్యోధ్యాపట్నానికిజనెను । అక్కలారా మీచక్కముఖములూ । మిక్కిలి వాడున్నయిదిఏమే । పున్నమచంద్రునిబోలెటి మోములు । పాడ్యమిచంద్రుని బోలిన వేమే । అడవిలోపలా తడవాయెనని । తలచితిమి మదిలోచాలా । అంతరాఘవులు చనుదెంచిరి । జలకములాడిరి ఆరాఘవులూ । తమ్ములు ముగ్గురు నెమ్మది తోడా । పాలునుపెరుగూ జున్నుచక్కెరలు । ఆరగించి లేచిరి రాఘవులు । బబ్బట్లుతేనెలు వొలుపుపప్పులు । కమ్మనినేతులుకజ్జముతోను । మాళవిడిఊర్మిళ మగు లందరూ । ఆరగించిలేచిరి అంగనలు । ముత్యపుశయ్యల తమ్ములబంపీ । రత్నపుసెజ్జకు దానేతెంచే । అందమైనకాళ్ళందెలు మెఱయగా । ఒప్పుగవ్రేళ్ళకుమెట్టెలూమెరయ । తీరుగ కస్తూరితిలకముజారగా । కన్నులసన్నపుకాటుకలమరా । ఒప్పుగరత్నపుగాజులముందర । దత్తులచేకట్లందముమించా । ముందరముత్యాల బంతులుజారగా । అంచునుమరి వజ్ర మ్ములూమెరయ । పగడవన్నె చీరప్పుడుదీసి । రంగుకుచ్చెలాచెంగులుజారా । లేతనడు మున నొడ్డ్యాణములమరగా । అందుమొహర్లపే రందముమెరయా । జలతారూ వేసినరవి కెలనూ । రవికెతొడగెసీతా సంభ్రమముతోను । కులుకుకుచమ్ముల సందులనడుమను । గుత్తపుముత్యపు పేరులుగదలా । తళుకుందా టంకమ్ములామెరుపులు । చెక్కిళ్ళపయి చాయలుదేరా । బటువుముత్యపు పాపటచేరులూ । కడానిగుళ్ళనందముమించా । గంధపు వాసనగుమ్మని మ్రోయగా । తాంబూలమ్ములు చాయలుదేరా । వాడుకరమునాచిలుకలు

బలుకగ । గొప్పముత్యపుపేరులుగదల । అంగుళమున పసిడి యుంగరములూ । హస్త
కంకణములు వేడుకలమరా । సీతవచ్చే రామునిసన్నిధికి । వచ్చినసీతనుజూచిరాముడు ।
గుర్రిచ్చికౌగలించెను తనప్రేమా । మొగముమోము నాచేర్చుకరాముడు । చక్కనిజెక్కిలి
ముద్దులుగొనెను । ఇందువదనసుతోడ పయినుంచీ । ఇందువదనతో యిట్లనిపలికె । ఇందు
వదననీవాడనుగానా । మందగమననుజూడగరాదా ।మందగమననీవాడనుగానె । కోమలాంగి
ననుచూడగరాదా । కోమలాంగినీ వాడనుగానా । సుందరాంగిననుచూడగరాదా । మత్స్య
గంధినీవాడనుగానా । పద్మగంధిననుచూడగరాదా । నీకుమించిపరకాంతనెరుగనే । కడమ
వారు కౌసల్యలుసుమీ్మ । రవికెముడిచే జారవిప్పెను । గంధముమెల్లన కంఠమునలదె ।
ఆకులుమడుపును అందిచ్చుచును । సగముసగము కోరికనంతిచ్చే । నూతన చేష్టలు చేసే
వేమే । చిన్న దానవా సిగ్గేమిటికె । నాకోరికలికతీరెనుసీతా । నీకోరికెలికజెప్పవెనాతో ।
కోరికలెట్టివో నేరనుఅబలా । కోరెనుమునికన్యలతోనాడా । చూచిచూచితలయూచిరాముడు ।
సుందరాంగితో నిట్లనిపలికె । ఇప్పటిపనిగాదేమోజానకి । అంపెదనులక్ష్మణునీగూర్చి ।
నాతినీవునడవగ లేవిప్పుడూ । బాలునెత్తుకపోదువుగాని । పక్కబెదురుచు పవ్వళించెను ।
రాముడుజానకిసరసమాడగా । పడదోసెనురాముని యాపటమూ । అడుదురుపాడుదురు
నవ్వుదురుకానీ । పడద్రోయుటలివిసరసమౌనటవే । ఒంటిమన్నుదులుపుకొని రాముడు ।
పట్టెమంచమూపైగూర్చుండే । పటమురికి ముందర నిలచుండే । పటముజూచి పరిగర్భము
లాడుచూ । ఎంతొమంది దండింపదొడగె । ఆహాఆడది సాహసురాలూ । దైవముతనవలను
కలిగుండే । నమ్మరాదుగా యాడవారిని । నమ్మరాదు అగ్నిహోత్రునైనా । నమ్మరాదు
యీసేనలవారిని । నమ్మరాదు ఆబ్రిహ్మనుఅయినా । నాకనియిచ్చెను జనకుడునిన్నూ ।
మోహమురావణుపై గద్దనెను । ఎంతమోహమురావణుమీదా । ఎక్కడిస్నేహమె రావణు
పైనీ । హనుమంతునిచే నానవాలంపి । అక్కరలేదన వద్దానాడు । రావణునిచంపకనట్టె
వుంతును । సుఖముననుందువ వాడినిగూడి । దక్కినదానవనినమ్మితిసీతా । యెంతజేస్తివే
జానకినీవు । ఇంతజేతుననిఎరుగనెనేను । పటమువ్రాసుకొనిపక్కనుబెట్టుక । రాగానే
అడవులుకోరితివి । ఎంతదానవేజానకినీవు । ఇంతదానవుగాకుంటేను । చిన్ననాడు శివు
విల్లెత్తుదువా । ఇంతదానవుకాకుంటేను । మాయమృగమును తెమ్మనిపంపీ । వేడుకతోరథ
మెక్కగలేద । నిలువనోర్తువా జానకినీవు । తక్కువదానవు తరుణిరొనీవు । చంపింతును
లక్ష్మణుచేనిన్ను । రారాలక్ష్మణ రారాయనెను । చంద్రకాంతమ్ముల శయ్యలమీదను । నిద్రిం
పుచున్నలక్ష్మణుడు లేచె । యెదపైయూర్మిల నప్పుడుదీసి । పరుపుపైనుంచెను
లక్ష్మణుడు । అంతలోననూర్మిళ దిగ్గునలేచి । లక్ష్మణుని పాదపద్మములబడెను ।
సీతకునేరములేదుజూడుడి । సీతనుగావుమశీఘ్రమ్మనను । సీతయేమినేరమ్ములుయేమే ।

కాచుటయేమిటిచెప్పవునాతొ । అలనాడుమీరంపినఅసుర । ఒనరుగరావణపటమటువ్రాసె ।
రావేపోదాములంకకుఅనుచు । సీతనుబట్టుకఆపదబెట్టె । రాముడాజ్ఞకుజగములు వణకును ।
రాఘువులపైఆనవుంతము । కేశవులపైఆనవుంచితే । హంసతూలికాతల్పమునుండె । చూచిరి
గాబోలు రాఘువులును । చంపదలచిరతిసాహసముననను । సీతనుచంపనుఅంటేగాని । పాద
ములువిడువనుప్రాణేశ్వరుడ । రామునినిలప బ్రహ్మకువశమ । కారణమేలాగున కాద
లచిందో । అప్పటికది యెట్లయ్యెనొకాని । ఇప్పుడుపాదములు విడువవెయనెను । అస్త్రశాల
కేతెంచి గ్రక్కున । ఆయుధములు పూనుకనిలచుండే । ఆదిదేవసకలాగమపూజిత । వేద
ప్రియ గోవిందముకుంద । నీతిశాస్త్రజ్ఞుడవు నిజమూర్తివినీవు । బాసురముగ సుజ్ఞానులు
మీరు । అవనిజకడుముగ్దగుటయెరుగవ । రాజీవభూషిత కావుముదేవ । తమ్ముడనీవుయెరు
గవుగాని ।అరయగరావణపటమటుజూడు।తల్లివినీవుతలచినతలపెక్కడే । యెన్నికపటములు
లువ్రాసినవమ్మ । భరతశతృఘ్నులుబాగుగ నప్పుడు । పరపుమీద నిద్రింపుచులేచిరి ।
మాశవిశ్రుతకీర్తినియప్పుడు । పతులపాదపద్మములబడిరి । సీతకునేరములేదుచూడుడీ।సీతను
గావుము శీఘ్రమ్ముగను । సీతయేమి నేరమ్ములుయేమే । కాచుటయేమొ కాంతజెప్పుమా ।
అప్పుడుమీరంపినఅసురుడు । అరయగరావణుపటమటువ్రాసె । నగరముజొచ్చిన పటమిం
దుంచి । ఆకాశవీధులపోయెను । అసురపటము ను పరిపరివిధములనణచిన । అక్కడనుండ
నేరకపటము । రామునాజ్ఞకుజగములువణకును । రాఘువులపయిఆనపెడుదాము । కేశవులపయి
ఆనబెట్టితె । హంసతూలికాతల్పమునుండే । చూచిరికాబోలును రాఘువులు । చంప
దలచితి రతిసాహసముననను । సీతనుజంపను అంటేగాని । పాదములు విడువను
ప్రాణేశ్వరుడ । రామునినిలపా బ్రహ్మకువశమ । కారణమేమోకాదలచిందీ । అప్పటికది
యెట్లయ్యెనొగాని । ఇప్పుడు పాదమ్ములువిడువవెయనెను । అస్త్రశాలకేతెంచిగ్రక్కున ।
ఆయుధమ్ములు పూనుకనిలుచుండె । ఆదిదేవసకలాగమపూజిత । వేదపిరియగోవింద
ముకుంద । నీవుశాస్త్రజ్ఞుడవు నిజమూర్తివినీవు । భాసురముగ సుజ్ఞానులుమీరు । అవనిజ
గడుముగ్ధగుటయెఱుగవ । రాఘువభూషిత కావుముదేవ । తమ్ములార మీరెఱుగరుగాని
అరయగరావణ పటమటు జూడు । తల్లినీవుతలచినతలపెక్కడే । యెన్నగపటములు
వ్రాసితివమ్మ । అంతలోను కౌసల్యతావచ్చెను । ఔరరాఘువఅని తాబిలచే । సీతకునేరము
లేదు చూడుమి । సీతనుకావుమిశీఘ్రమ్ముగను । తల్లిననుచునే యుడిగితిగాని । తలచుంతును
యింకయెవరయినా । ఆవలికీ చనుదెంచెనుతాను । యేమిసేతునని యేడ్వగదొణగె ।
అంతలోనుసుమిత్ర చనుదెంచెను । ఔరరాఘువ అనితాబిలచె । సీతకునేరము లేదురరామ ।
సీతనుకావుమి శీఘ్రమ్ముగను । చిన్నవాడవా రాఘువనీవు । సీతకునేరము కలిగియుండిన ।
నిలుపుదుమీనీవొచ్చినదాకా । ఆపలుకులువిని రాఘువులపుడు । అతికోపంబున నిట్లనిపలికె ।

అమ్మరోసీకా కోడలిమీదను । యెక్కువమోహము కలిగుంటేను । ఆకొడుకును యీ కోడలినిబెట్టుకొని । యెన్నగరాజ్యము యేలుమతల్లి । దండకమండలములు చేబట్టి । ఉత్తరాభిముఖమయ్యెదనేను । ఆపలుకులువిని సుమిత్రప్పుడు । అతిదుఃఖమ్మునడలగ దొణగె । ఏమి సేతునని యేడ్వగదొణగె । అంతలోనుకైకమ్మ చనుదెంచెను । ఔరరాఘవ అనితాబిలచె । అపుడురాఘవులతికోపమ్మున । నీతల్లినితండ్రని జంపెదనే । నీవెమాతండ్రిని జంపితివి । నీకోడలునను జంపదలచినవీ । సరిపోయెనుయికపాలిక్కడికి । కైకవచనమంతా యెఱుగుదురు । చాలు ఆపలికిచనుదెంచెనుకైక । అంతలోసుమిత్ర యేతెంచి । రాఘవ ఘాషితకావుముదేవా । యెక్కువకొడుకుల గన్నాననుచు । అతిగర్వమె అమ్మరోసీకు । ఆవలికి చనుదెంచవె యనెను । ఏమిసేతునని యేడ్వగదొణగె । అంతలో ననుదెంచెను శాంత । ఔరరాఘవాఅని తాబిలచె । సీతకునేరము లేదురరామ । చిన్నవాడవ శ్రీరాఘవుల । సీతకునేరముగలిగియుండితే । నిలుపుదునాసీవొచ్చినదాక । నీదేఅర్కవంశంబైతె । నీదేక్షత్రియధర్మంబైతె । నాకీఅర్కవంశముగాద । నాదీక్షత్రియ ధర్మముగాదా । ఆర్కవంశమటె అక్కరోసిది । యెక్కడక్షత్రియ ధర్మమేసీవీ । కూటికి చేరినబాపనపడుచువు । కూతలేటికెఅక్కరోసీకూ । నాడు పెద్దలుతలచితెచ్చిరె । నేడు పంపెదనునెలతరొపదవె । కంచముమంతకట్టుకోబట్ట । ఇచ్చిపంపెదయికపదమనెను । యేమిసేతుననియేడ్వగదొణగె । తిరిగి వచ్చిరీతరుణులునలుగురు । చెలియలు చెలికత్తెలు చనుదెంచిరి । చెప్పిరి జానకి వార్తలుకొన్ని । వినశక్యముగాదేయోకొమ్మా । కనశక్యము గాదేయోకొమ్మా । ఇకనెక్కడజానకి యోకొమ్మ । జానకిమనపాలనులేదని । అండ జయానలు వారుముగ్గురు । పదరేచదురుకుపోదామనిరి । అక్కచావగా అణకువలేటికె । శాంతకడకుబోదామనిరి । కౌసల్యకోడండ్రు కైకకోడండ్రు । ఆసుమిత్రాదేవిఅనుగు కోడండ్రు । చెలికత్తెలతోకలసినడువను । అందెలచప్పుడువిని రాఘవులు । అదియేమో తెలుసుకరమ్మనెను । చదురులోనుతలవంచెనురాముడు । తిరిగిచూచియామాళవియపుడు చెల్లెలాతోనిట్లనిపలికె । సకలమైన రాజులువుండగను । అన్నదమ్ములుకొలువై యుండ । తగదుమనకు చదురుకుబోవుట । ఏవిధంబునబోయెదమనెను । ఈపలుకులుమనజనకుడు విన్నను । అక్కడ తెగువచేసునుగదవె । శాంతతోడుకుపోదామనెను । ఆడరానిమాటలు రాముడాడె । కదలివచ్చెనుఆశాంతైన । అనుచుపలుకుచు కాంతలుముగ్గురు । శాంతనగరికి వారేతెంచే । అల్లంతటవారిరాకలుచూచియో । అతిదుఃఖమునయడలెనుశాంత । ఏమిచేతునని యేడ్వగదొణగె । ఇట్టిదిశాంత యెట్టిదోబుద్ధి । చిన్నదానవాయమ్మరోసీవు । మీరుపెంచిన తమ్ములుకార । యెక్కడబుద్ధులు వచ్చెను చెపుమ । యండజయానలు వారుముగ్గురు । శాంతపాదపద్మంబులబడిరి । నాతోటియేమున్నదెమీకు । చదురులోకిచనుదెంచరెయనెను ।

తరుణులపయిదయ పుట్టిశాంత । యతిశీఘ్రమ్మున కదలెనుశాంత । విలువంచినడసినచంద మున । కలిసినడచిరికాంతలుతమరు । కౌసల్యకోడండ్రు కైకకోడండ్రు । ఆసుమిత్రాదేవిఅను గుకోడండ్రు । కౌసల్యగూతురుకలిసినడువంగా । కమలధూళియా కమలబాంధవుగప్పె । అది యేమోతెలుసుకొరమ్మనేనూ । కాళ్ళందెమోతగా కాకుత్థ్సవినుమా । కమలధూళియాకమల బాంధవులగప్పె । చదురులోనుతలపంగా రాముడు । తిరిగిచూచియాశ్రుతకీర్తిప్పుడు । అక్కలతోను యిట్లనిపలికె । ఇదేసమయము చదురుకూపోవగ । పదరేచదురుకు పోదామ నెను । అక్కచావగఅణుకువలేటికె । మీరంతాయిక్కడయుండ । నేనైనాచదురుకుబోయె దనూ । ఆపలుకులువిని అతివలు నలుగురు । చదురులోకి చనుదెంచిరి వేగా । అంతలోను మాళవితానప్పుడు । పసిడిస్తంభము మరుగుననిలచీ । తమలపాకులావంటిచేతులు । ఊచుకొంటుతానిట్లనిబలికె । మత్స్యకూర్మవరాహ నార సింహ । వామనభార్గవదశరథరామ । సీతకునేరములేదుచూడుడి । సీతంగావుశీఘ్రము గానూ । అనిబలికిమాళవిచనుదెంచె । అంతలోనుయూర్మిళతానప్పుడు । పసిడిస్తంభము మరుగుననిలిచె । తమలపాకులవంటిచేతులూ । వూచుకొంటుతానిట్లనిపలికె । మత్స్యకూర్మ వరాహ నారసింహ । వామనభార్గవదశరథరామ । అక్కకునేరములేదుచూడుడి । అక్కని కావుముఅతిశీఘ్రముపోయి । శాంతచాటుగా నడచియువేగమే । శత్రుఘ్నునిసతితానిట్లని పలికె । గొప్పగళమునాబలికిగ్రక్కనా । కోకిలసర్వముతొ నిట్లనిపలికె । చిలకపలుకులు పలికెటిరీతిని । హస్తముఊచుచునిట్లనిపలికె । ఓహోదశరథవంశాధీశా । ఓహోదశరథ రాజకుమారా । తాటకాంతకాధర్మపాలనా । శివచాపబంధనాలోకేశా । అహల్యపావనాఅంబుధి బంధనా । వాలిమర్దనావారధిశయనా । ఒక్కయింటనెపుట్టినవారమూ । ఒక్కయింటనే చొచ్చినవారము । రావణునిపయిమోహములిప్పుడు । అక్కకిమాత్రమెకాదుచూడుడి । మాకందరికికలిగున్నదిదేవ । యందరినితెగటార్చుడియనెను । సీతజేసిననేరముజెప్పక । చెంద నీయముమిమ్మనిపలికె । యభ్యంతర కన్యలమైయుండగను । చెల్లెగదమీకీలాగునను । మరి యెవ్వరికిదిచెల్లదుయనెను । తలయెత్తిచూచిరాఘవులు । మహాఋషులతోనిట్లనిబలికె । జనక చక్రవర్తికూతుళ్ళ మహిమలు । తెలిసెగదామీకందరికనెను । యేమియెరుగనియబలలమ ముచు । యెటులచెప్పెదరొతమరైతేను । యందుకుశ్రుతకీర్తిట్లనిపలికె । అడవులలోపలకసు రవచ్చితే । మన్ననతోడుతమాట్లాడగనేల । యంగదుసాహాయ్యమిచ్చిపంపగనేల । యసురుని లోపలకంపినవారు । యేమాయెననియడుగగరాదా । యంతఃపురకన్యలమయియుండగ । చెల్లెగదామీకీలాగునను । మరియెవ్వరికిచెల్లదుయనెను । తలయెత్తిజూచిరిరాఘవులు । రారా లక్ష్మణరమ్మనిపిలచె । మునికన్నెలతోఆడినవెనుకా । తెగటార్చిఖడ్గముగొనితెమ్మా । ఆపలు కులువిని లక్ష్మణుడపుడు । అమ్మరోపదమనిహర్షముతోడు । జూడనివ్వరెవ్వరినయినాను ।

చేరనివ్వ రెవ్వరి చెంతలను । మాటాడనివ్వరు మరియెవ్వరితో । జూడనివ్వరాజానకినయిన
ఓహోజానకియనియెటివారు । ఆహాజానకియని యెటివారు । కన్నులజలమునునుంచెటివారు ,
కడలేనిశోకము బొందెటివారు । యెవ్వరుదిక్కుయనియేటివారు । యేమిసేతుమని
యేడ్చెటివారు । జానకికర్మముఅనియేటివారు । జనులపాపమనియనియెటివారు । పుప్పుచ్చింత
పండ్లుపుగ్గినట్లుగా । యువిదముఖములుపూసవిడిచెను । మామిడిపండులు మగ్గినట్లుగా ।
మగువలముఖముల మానముచెడెను । చేమంతిరేకులు చెదరినట్లుగ । చేడెలముఖముల
తేజముచెడెను । కలువారేకులు కగినట్టులు । కాంతలముఖముల కాంతిచెడెను । పాలసము
ద్రునిపెద్దకూతురు । పట్టణమువెడలెను భావ్యముగాను । పతితోటడవులునడిచెటినాడు ।
ఎన్నివిధంబులజేసునొయితడు । దోవలోరాళ్లతొలగద్రోయుచు । పలుకంపలుపారగవేయు
చును । సన్నపరాళ్లసరిగవత్తుచు । ఎన్నోవిధములచేసెనుయితడు । పతినన్నడవులచంప
బంపితే । కేశవుతోవలుతీసెనుయితడు । ఎంతనిర్దయుడెయీలక్ష్మణుడు । దుఃఖించెనుతన
చిత్తమునోను । నడచినకాళ్లబొక్కులుయెక్కెను । ఊచినచేతులునెత్తురుదిగెను । వేసినవిడి
యము చిట్టముగట్టెను । అప్పుడుమరదితొ యిట్లనిపలికె । మిత్రవినవెనుమిత్రనందన ।
యిచ్చటదూరముయికనేనోప । అనినదులలో స్నానముచేసి । అప్పుడుతన యిష్టదేవతల
తలచె । ఎన్నిజన్మములు ఎత్తియైనాను । కూరిమిజనకుల గూతురినౌదు । ఏడుజన్మములు
ఎత్తియైనాను । కూరిమిదశరథుల కోడలినౌదు । కోటిజన్మములుయెత్తియైనను । కౌసల్య
కైకకుకోడలినౌదు । కడలేనిజన్మములుయెత్తియైనాను । సుమిత్రకోడలినయ్యెదనేను । పది
వేలాజన్మములనయినా । భరతశతృఘ్నుల వదినెఅవుదు । లక్షవేల జన్మములనయినా ।
లక్ష్మణునకు వదినెనౌతానపుడు । సహస్రజన్మములయెత్తియైనాను । శాంతకుమరదలినయ్యెద
నేను । గోటివేలజన్మములనైన । గోవిందునిభార్యనుయపుడు । ఆలక్ష్మణుడా ఖడ్గమంకించ ,
ముందరితనపుష్ప మాలికలాయె । చేదప్పితినో నాతప్పితినో । ఘనమునసత్యముడా
తప్పితినో । ఉగ్రముతొఅతివుగ్రుండాయె । రెండవమారు ఖడ్గమంకించ । ధరణి
గర్భములో ధగధగమనెను । మూడవమారు ఖడ్గమువిసర । ముందరభూదే
విట్లనిపలికె । సుమిత్రవినవె సూమిత్రనందనా । అచ్చటజానకి నేరముఏమి ।
ఎల్లలోకములవారెరుగరె సీతను । తెల్లంబగూటాయెరుగడెరాజు । తెల్లంబగుట సీత
వల్లకున్న । కల్లగలిగితెనేతల్లినిగానా । రామదశరథరఘుకులరామ । రామశ్రీ అయోధ్య
రామా । బామనడవులకంప నేమినేరముచేసె । భూమిలో మాసీతరామా । యెన్ని
నోములునోచి । ఎన్నితపములుజేసి నిన్నుపతిగాగోరెనోరామా । ఎన్నడునిన్నును యెడబాసి
నదిగాదు । ఎట్లుతాళునుసీతరామా । పక్షమింతయులేక అభిమానవతిమీద । శతపక్షములు
బలికితివిరామా । చిన్ననాటానుంచిచెలియలి । గుణములుచిత్తాన తెలియవారామా । ఎన్నగా

మావంటివారియందరికెల్ల।వంచనలునడుపునురామా। ముక్కంటివిలువిరువమునులు। దేవతలు
బొగడముగుద। సీతనుయిచ్చితిరామా । మీతండ్రిచెప్పగామీరుఅడవుల।నడవమీవెంటవచ్చెతా
రామా । సీతమీతోటట్లు అడవిఫలములుతిని । సుఖమెన్న డెరుగదురామా । ఇచ్చిందిమొదలు
కొనియీలాగునేకాని । సుఖముయించుకలేదురామా । రచ్చలురాలురవ్వలకునోచెనో। రమణి
యీమాసీతరామ । మత్స్యగంధిసీత మాకుభారములేదు । మాటవానేగానిరామ । వంచ
నింతయులేక నభిమానవతిమీద । వంచననేగదజేస్తిరామా । పతులుమెచ్చాయగ్నిదేవతలు
కొనియాడ । గుణమునాదెఱుగవారామ । సీతవిడనాథుదుర ధరణిలోనా । మేయిక
శుష్కించెగదసీతారామ । నీప్రాణేశుకునీవేమెగ్గూ। జేసెనక్రతువంత జెప్పవేనాతో । యని
తల్లి యడుగగమదిశోకింపుచు । కన్నులబాష్పము లొలుకుచుబలికె । గోరితినాదగుకర్మ
వశమ్మున । గోరియడవులపాలొ బెరుగ । మునికన్యలతో నాడగోరితి । రూపమ్ముల
నేతెంచెను ఆసుర । నరయుగ రావణ పటములువ్రాసే । సగరముజొచ్చి పటమందుంచి ,
ఆకాశవీధులపోయెనుఅసురా । పటములు పరిపరివిధములనణచినా । వేయివిధములవేసెను
తన్ను । యనుచుకష్టముతల్లితోచెప్పె । రుద్రాక్షతరువుల నీడల । ఊరికెచూచుచునుండెనే
లక్ష్మణుడానన్ను చంపకపోతె । లక్ష్మణనీవెంటానేవెళ్ళి । వత్తునునన్నుచంపకపోతె ,
ఇద్దరిసందున యుద్ధముపెడుదు । యన్నకుఆనవా లేమనిపలికె । వావికివదినెవు వరసకు
తల్లివీ । మమ్మగన్నాతల్లివినీవు । మాకునెలవిపుడు యియ్యవెఅమ్మా । ఇలలోమీయన్న
శ్రీరాఘవులకు । యేడునెలలగర్భిణీయనిచెప్పు । మరచిబోకుమిలక్ష్మణనీవు । మాటలు
ముందరపుట్టునుసుమ్మీ । ఆపలుకులువిని లక్ష్మణుడపుడు । కన్నులజలములు గ్రక్కున
దెచ్చె । హరిబుషివల్ల యతివకుజెప్పి । తనభూమికి ఎప్పటిచందమున । పాలెటికుందేలును
గూల్చినట్టెను । రక్తముతనదౌ ఖడ్గమునిండ । రాయుచురక్తము దొన్నెలోబోసుక ।
యూరకెచూచుచునుండెనునతడు । యడవులలోపలజానకిదేవి । యతిదుఃఖమున నడచుచు
నుండె । కోరితితనవిధిపూర్వ వశమునా । కోమలితనలోనడలగదొణగె । మునికుమారులు
మోదముతొనపుడు । ఫలములకొచ్చిరి వనములలోకి । శ్రీలక్ష్మినిచూచిరియంతవేగమునా ।
యతిశీఘ్రమ్మున యిండ్లకుబోయి । అమ్మయెవ్వరో అడవిలోపలా । నతిదుఃఖమ్మున నడలు
చున్నది । స్త్రీపురుషులు చేకొనివగవంగా । శ్రీలక్ష్మినిచేరగవచ్చిరి । శ్రీలక్ష్మివో
భూలక్ష్మివో । మందరగిరినాథునిలక్ష్మివో । రామునిసతివోకామునికాంతవో । ఎవ్వరిసతివో
ఎరుగముమేమూ । శ్రీలక్ష్మిచెప్పవేమాతోను । అమ్మలారమీపతిని నమ్మకుడి । ఎన్నగ
రాఘవులతన్నిటుసేయ । నెలతానీవుపుట్టినయింటికి నీళ్ళాడగవస్తివిచింతేల । కోమలులెల్లా
సమ్మతిపరచిరి । సమ్మతినాబుషిపల్లెనువుంచె । కొందరుసీతకొప్పుదువ్వుచు । కొందరుసీతతో
చక్కవలాడుచు । సమ్మతిగాబుషిపల్లెనువుంచిరి । వదిననడవిలో విడిచిలక్ష్మణుడు । తన

భూమికియెప్పటిచందముననూ । కట్టికొంగునుముసుకుబెట్టుచు । గ్రక్కున అయ్యోధ్య పట్నముకొచ్చే । సీతయయితేసుఖముననున్నదిగా । కారణమీలాగునగాబోలు । అగ్నిఆరెను అయ్యోధ్యలోపలా । యనుచుబలికె ఆలక్ష్మణుడు । అదుగోలక్ష్మణుడొచ్చెను యనుచు । యంతఃపురములోపలచెప్పిరీ । కౌసల్యాకైక సుమిత్రలూ । లక్ష్మణునిదగ్గర కేతెంచిరీ । యేఖడ్గముతోవేసితివొరా । యేమనిప్రాణము విడచెరసీతా । చెల్లెల్లకు ఏమనిచెప్పింది । శాంతమ్మకుయేమనిచెప్పింది । రాజుతోటియేమనిచెప్పింది । తమకైతేయేమనిఅన్నదిరా । ఆడదిమగవాడాగర్భమునా । అన్నలక్ష్మణాచెప్పరనాతో । అంతవృత్తాంతముయెరిగినాను । చంపివస్తివియడవులలోను । ఉంచివస్తివివనములలోను । ఆపలుకులువినిరాఘవుడప్పుడు । ఔరాతమ్ముడయని తాబిలచె । రారాతమ్ముడదగ్గిరకనెను । నాయుగ్రముకంటే నీకు నుగ్రమూ । జానకినీతెగటార్చివచ్చితివా । సతిలేనివానికిరాజ్యములేలా । ఆలియున్నవాడవు నీవేలు । యేమనిప్రాణమువిడిచెరసీతా । తననోటియేమనియన్నదిరా । కౌసలక్కుయేమని చెప్పిందీ । కడమవారికేమనియన్నదిరా । ఆడదిమగవాడా గర్భమునా । యన్నలక్ష్మణా చెప్పరనాతో । ఇంతవృత్తాంతముయెరుగనునేను । చంపివస్తినీయడవులలోను । అన్నినదు లలోకలిపివస్తివా । అక్కడనెయుంచివచ్చితివా । యమునాతీరమునదిలోపలను । కలిపి వస్తినీయిక్కడికనెను । ఎన్నిదినములుఆయెరనేటికి । చెప్పరలక్ష్మణశీఘ్రముగాను । అయినమీదరెండు దినములాయెను । అనుచుబలికెను ఆలక్ష్మణుడు । సీతకుదినములు యేవిధమ్మున । దినవారమ్ములుసేయగవలెనో । పిలువుడిశాంతను యనితాబలికె । ఆపలు కులువినిశాంతప్పుడు । అతికోపమ్మునిట్లనిపలికె । సీతనుయడవికిజంపబంపుతూ । పిలవ రుగానీలాగునయనెనూ । పంపినవాడవురాఘవనీవుర । చంపినవాడవులక్ష్మణనీవు । జేతులారగా చెయ్యరమీరు । ఆపలుకులువిని రాఘవులప్పుడు । కన్నుల జలములు గ్రుక్కునదెచ్చె । ఆదరించి । రక్కడివారెల్లా । ఓదార్చిరి రాముని దుఃఖములు । ఔరాతమ్ముడయని తాబిలచె । రారాలక్ష్మణ రమ్మనిపిలిచె । రారాతమ్ముడ దగ్గిరకనెను । సన్నబియ్యమునసఖియకుప్రేమా । చాలాతెప్పించుమి లక్ష్మన్నా । చాయపప్పులుసఖియకు ప్రేమా । చాలాతెప్పించుమిలక్ష్మన్నా । కూరకాయలాకాంతకుప్రేమా । చాలగదెప్పించుమి హనుమంతా । చాయపసుపు కుంకుమసఖియకుప్రేమా । చాలగదెప్పించుమిహనుమంతా । మంచిగంధమూ మగువకు ప్రేమా । ప్రూరులు దెప్పించుమిశతృఘ్న । కుసుమ చీరెలు సీతకుప్రేమ । చాలగదెప్పించుమిలక్ష్మన్నా । మల్లెపువ్వుదండలు మగువకుప్రేమా । గుత్తులుగగట్టించుమి లక్ష్మన్నా । జాజిపువ్వులదండలుసీతకుప్రేమా । చాలగదెప్పించుమి లక్ష్మన్నా । పట్టుచీరెలాపణతికి ప్రేమా । అవియేతెప్పించుమిశతృఘ్నా । చిలుకలరవికెలు సీతకుప్రేమ । అవియేతెప్పించుమి భరతుండా । పట్టురవికెలాపణతికి ప్రేమా । అవియే

తెప్పించుమి హనుమంత । రత్నపుసరులు రమణికిప్రేమ । చాలగదెప్పించుమిలక్ష్మన్నా ।
యూరియూరికంసాలులబిలిపించి । సొంపుమీర బంగారముతూపించి । బాగుమీరపుటములు
వేయించీ । బంగారపుచేటలు చేయించిరి । ముప్పదిపుస్తెలు మున్నూరు చేటలు ।
సీతకుచేయించిరి శీఘ్రములోను । యారతమ్మడయనితాబిలిచే । రారతమ్మడదగ్గరకనెను ।
మునికాంతలపై సీతకు ప్రేమా । తోడుకరారాలక్ష్మణయనెను । ఆపలుకులువిని
లక్ష్మణుడప్పుడు । ఋషిపల్లెకు చనుదెంచెనువేగ । అంతటవచ్చెడి మరిదినిజూచి ।
యెదురుగవచ్చెను జానకిదేవి । యెదురుగవచ్చినా వదినెనుజూచి । తప్పకుండ
నమస్కారముజేసె । పాదములాపై మరిదినియెత్తి । దీర్ఘాయువని దీవించెతాను । పుత్ర
పౌత్రవంతుడవుగమ్మనుచు । అనిచాలాదీవెనెలదీవించె । తడవాయెనునేను వచ్చితినమ్మ ।
చెలికత్తెలకూనెలవులుయియ్యవే । ఆపలుకులువిని జానకప్పుడు । దినవారమ్మలు
తనకేయనెను । దినవారమ్ములుకావోనేడు । పీడపరిహారమని లక్ష్మణుడుపలికె । కామేశ్వరీ
ముత్తైదులుగనుక । యిక్కడికొస్తిని అమ్మరోనేను । కామేశ్వరీ ముత్తైదులుగారు ।
దినవారమ్మలు తనకేయనెనూ । నాధర్మంబున పట్టుచీరలు । కట్టుకురండే
కాంతలుమీరు । నాధర్మంబున చిలకరవికెలు । తొడుక్కురండే వెలదులుమీరు ।
నాధర్మమునమూసివాయనంబులు । అందుకురండే అతివలుయెల్లా । కాంతలదోడుకు
లక్ష్మణుడప్పుడు । యమునకుచనుదెంచెను శీఘ్రమునా । వచ్చినవారినిజూచిరాముడు ।
తప్పకతలవాల్చెనురాఘవుడు । ఆదరించిరీ అక్కడివారెల్లా । ఓదార్చిరీరామునిదుఃఖములు ।
సంపెంగాతైలముతోటప్పుడు । స్త్రీలకు శిరసంటించెనే రాముండు । పచ్చాకునుకచ్చూర
ములువేసినా । ఒంటినిండ నలుగులు పెట్టించె । మజ్జనమాడిరి యమునానదిలోను ।
పట్టుచీరలు పణతులకిచ్చిరి । సరిగరవికలు పణతులకిచ్చిరి । మంచిగంధమామగువల
కిచ్చెను । మల్లెపువ్వుదండలు మగువలకిచ్చెను । చాయకుంకుమ సఖియలకిచ్చెను । రత్న
పుసరులురమణులకిచ్చె । ముప్పదిపుస్తెమున్నూరుచేటలు । మూసివాయనమ్ముల నిచ్చెనే
రాముడు । ఔరాతమ్మడ అనితాబిలచే । రారాతమ్మడదగ్గిరకనెను । ధర్మోదకమ్ములకు
తరుణులనెల్ల । దోడుకురావలె శీఘ్రముగాను । ఆపలుకులువిని ఋష్యశృంగుడు । అంతః
పురములోపలికేతెంచె । కాంతలనుతోడ్కొని ఋష్యశృంగుడు । యమునకుచనుదెంచెను
శీఘ్రమున । అంతలోను శాంతమ్మప్పుడు । అతిదుఃఖమ్మున అడలగదొణగే । యెక్కడ
నుంటివె జానకీనీవు । ఒంటిగనుంటివ జానకియనెను । ఇల్లులేదటే జానకినీకు । భయము
లేదటె జానకియనెను । అతిదుఃఖమ్మున అడలెనుశాంత । ఆదరించిరీ అక్కడివారెల్ల ।
వోదార్చిరిశాంతాదుఃఖములు । కౌసల్యాకైకసుమిత్రలు । వనరుగఋష్యశృంగుడుశాంతా ।
భరతశత్రుఘ్నులు బాగునుమీర । యెరిగినలక్ష్మణు డెరుగనిసతియు । మాళవిశ్రుతకీర్తివార

లిద్దరూ । అంతలోనెరాఘవులు తానప్పుడు । తిలోదకమ్ములు సీతకువిడిచే । నాతినీవు
స్వర్గానికిపొమ్మనీ । నయముతోడను మ్రొక్కె రాముడు ।మునులుఋషులు అందరుకూడుకు ।
చుట్టునునిలచిరీ రాములచుట్టు । అపురాతమ్ముడ అనితాబిలచే । రారాతమ్ముడదగ్గరకనెను ।
యయోధ్యనగరములోపలను । అంతఃపురమేడలలోపల । హంసతూలికా తల్పములన్ని ।
యెందుకుతమ్ముడతగదనిపలికె । యెత్తికట్టరాతమ్ముడఅనెను । హంసతూలికాతల్పము
క్రిందను । తుంగచాపలుపరిపించుమనెను । రామునితోడుకు మహర్షులందరు । అంతః
పురములోపలవొచ్చిరి । అంతఃపురములమేడలలోపల । హంసతూలికాతల్పముక్రింద
తుంగచాపల్పై రాముడుపవళించి । యప్పుడుపరిపరివిధములశోకింపగ । ఆదరించి
యక్కడివారెల్ల । వోదార్చిరి రామునిదుఃఖములు । యోరాతమ్ముడయనితాబిలచే , రారా
తమ్ముడదగ్గరకనెను । దోసెడేసియరిసెలువండించు । దొప్పలకొలదినెయి బోయించు ।
గొప్పగారెలైతేవండించు । కాయకూరలైతేవండించు । సన్నబియ్యమైతేవండించు ।
చాయపప్పులైతేచేయించు । సన్నబియ్యపూ పాయసమువండించు । చేయించులక్ష్మణ
శీఘ్రముగాను । యన్నయానతిమీదసెతమ్ము । చెప్పినట్టుగాచేయించెను వేగా । దోసిడేసి
యరిసెలువండించిరి , దొప్పలకొలది నెయిబోయించిరి । కాయకూరలై తేవండించిరి ।
చాయపప్పులైతేచేయించిరి । అపురా తమ్ముడఅనితాబిలచె । రారాతమ్ముడ దగ్గరకనెను ।
ముత్తైదులకు నక్షంతలిప్పుడు । యేవిధమ్మునా వేయగవలెను । పిలుపుడిశాంతను
అనితాబలికె । పంపినవాడు రాఘవులుండగా । చంపినవాడవు లక్ష్మణనీవు । చేతు
లారగా జెయ్యరేమీరు । ఆపలుకువిని రాఘవులప్పుడు । కన్నులజలముబు
గ్గిక్కునదెచ్చె । ఆదరించిరి అక్కడివారెల్ల । వోదార్చిరిరాముని దుఃఖములు ।
ముత్తయిదులకు నక్షంతలప్పుడు । అందరికివేసెను శ్రీరాముండు । వినరా లక్ష్మణజానకి
బుద్ధులు । మరపురావుర చిత్తమునకును । పద్మగంధిపసుపాడెటినాడు । బాగుమీరగ
పసుపులంటేది । బాలసవ్వెరచదురులోపల । నాటినుండి పసుపాడదురసీతా । ప్రేమ
దీరనూపసుపుపూసెర । ఎన్నజానకి యెదుటనిలువదు । ప్రేమదీరగా నిలిచెరనేడు ।
హంసతూలికాతల్పముకిందనూ । తుంగచాపల శ్రీరాముడుపవళించె । పాదములొత్తెటి
తమ్మునిజూచి , అప్పుడురాముండిట్లనిబలికె । అంగనామణులా దుఃఖముమాన్పి । అతి
శీఘ్రమ్మునరారాఅనెను । అంతలోనులక్ష్మణుతానప్పుడు । అంతఃపురములో పలికేగె ।
తేలుచుకన్నులు వాలుచుముఖములూ । నడవగమెడ నూళ్ళల్లాడగను । తమలపాకుల తీగె
కైవడిని । గద్గదస్వరముతొ కాంతయిట్లనెను । నీదేఅర్కునివంశంబైతె । నీదేక్షత్రియ
ధర్మంబయితె । నీచేతిశాపంబయితే । అన్నకుతప్పనితమ్ముండయితే । అతిబలశౌర్యశాలివి
నీవయితే । అక్కనుజంపిన ఆయుధమ్మునా । నన్నుజంపుమి దశరథతనయా । సీతను

జంపాలేదని పలికే । సీతనుజంపాకుంటె నిప్పుడు । దినవారమ్ముల యెవ్వరికనెను । దిన
వారమ్ములుకావేనేడు । పీడపరిహారమనిలక్ష్మణుడుపలికె । వాల్మీకునియాశ్రమమునగలదే ।
వనజాక్షినీతోడనిపలికె । వాల్మీకుని యాశ్రమమునునుంటె । యెన్నాళ్ళకు యికవచ్చు
ననెను । పంచవర్షమ్ముల బాలులనెత్తుక । వస్తుందేమన పట్టపుదేవి । ఋషిపల్లెలోను
వున్నదేసీతా । నమ్మకుంటె నేలాగునఅనెను । ఆపలుకులువిని ఊర్మిళదేవికి । ఆనంద
మాయెనె వూర్మిళమనసు । భరతశతృఘ్నులు బాగుగనప్పుడు । పంకజాక్షులా కడకే
తెంచిరి । వస్త్రమ్ములు ముఖమునజేర్చుకొని । అడలిరివారు అడలిరివీరూ । పైటచెంగులూ
ముఖమునజేర్చుక । అడలిరివారు అడలిరివీరూ । వారివారిధైర్యమ్ముల చూచుతూ ।
వనితలదుఃఖము కొంతతుబాసె । అంతలోను శాంతమ్మ యప్పుడూ । అతిదుఃఖమున
అడలెనుశాంతా । ఆదరించి రెక్కడివారెల్లా । వోదార్చిరీశాంతాదుఃఖములో । అంతలోను
లక్ష్మణుడు తానప్పుడు । అక్కసన్నిధికి తానుచనుదెంచె । నీదేఅర్కుని వంశంబయితే ।
నీదేక్షత్రియధర్మంబైతే । అక్కకుతప్పనితమ్ముడవైతే । అతిశౌర్యశాలివినీవైతె । సీతను
జంపినఆయుధమ్మునా । తన్నుజంపుమీ దశరథతనయా । సీతనుజంపితేనిన్నుజంపుదూ ।
సీతను జంపలేదని పలికె । సీతనుజంకపకుంటె నిప్పుడు । దినవారమ్ములు
యెవరికనెను । దినవారమ్ములుకావేనేడు । పీడపరిహారమనిలక్ష్మణుడు పలికె ।
వాల్మీకుని యాశ్రిమమ్మునగలదే । వనజాక్షీతోడనిపలికె । వాల్మీకుని యాశ్రమమ్మున
నుంటె । యెన్నాళ్ళకు యికవచ్చుననెను । పంచవర్షమ్ముల బాలులనెత్తుక ।
వస్తుందేమనపట్టపుదేవి । ఋషిపల్లెలలోనున్నదెసీతా । నమ్మకుంటెనేలాగున అనెను ।
ఆపలుకులువిని శాంతమ్మప్పుడు । ఆనందమాయెను శాంతకుమనసు । చాలవేడుకపొందుతు
నుండే । అమ్మకు తెలియవద్దని పలికె । శాంతదినమ్ములు పైబడెనన్ని । జెప్పిరియెల్ల
వారు రామునితోను । ఆపలుకులువినిరాఘవులప్పుడు । అక్కసన్నిధికితానను దెంచి । అబల
బాలుడయెరుగనివాడను । అక్కరానేరముకావవెఅనెను । ఆరంగించకారగించనుఅనుచు ।
అక్కపాదపద్మముల బడెను । అంతలోనువాల్మీకిమహాముని । రాముపరామర్శింపగవచ్చె ।
ఆపలుకులువిని రాఘవులప్పుడు । చదురుకుచనుదెంచెను శీఘ్రమున । వచ్చినవారినిజూచి
రాముడు । తప్పకతలవాల్చెను రాఘవుడు । కన్నులజలములు గ్రక్కునదెచ్చె । ఇతిహాసం
బొక్కటిజెప్పెదనూ । వినుమీరాముడవినుమనిపలికె । తొల్లిఋషిపల్లెలేలెటిరాజు । అతని
భార్యాచెంచలక్ష్మనగ । కమలగంధితాగర్భముదాల్చె । కోరికలేమనిఅడిగెనురాజు । కోరిక
లెట్టివోనేరకఅబలా । కోరెనుమునికన్యలతోనాడ । అంతటరాజుకోపముజేసి । చంపబంపె
తమ్ముని వెంబడినీ । అన్నవాక్యములు తప్పనితమ్ముడు । వనములోను బాణములంకించె ।
కాచిరిసుమ్మా ఆమునులంత । సుఖిమునన్నున్నది ఆగృహములలోను । తలయెత్తి

చూచిరి రాఘవులు । అప్పుడు వాల్మీకునికిట్లనెను । చచ్చినవారు ఎట్లుబ్రతుకుదురు ।
యెటుజెప్పితిరి యితిహాసమ్ములు । సత్యవంతులకు చావులెక్కడివి । మనసుకు
అవిమూర్ఛలు గాబోలు । తెలుసుకొనజాలక రాఘవులుండిరి । అంతలోముని
కాంతలందరు । ఆరగించిలేచిరివేగమునా । అందరికి విడియమ్ములుయిచ్చిరి । పచ్చి
పోకలుపండుటాకులు । తాంబూలాలు ఇచ్చిరివారికి । సెలవులుపుచ్చుక సఖియలందరు ।
చనుదెంచిరీ గృహములకు శీఘ్రిమున । వచ్చినవారిని జానకిచూచి । ఎదురుగవచ్చెను
జానకిదేవి । నీధర్మమ్మునపట్టుజీరెలు । కట్టుకవస్తిమికాంతరోనేడు । నీధర్మమ్మునసరిగ
రవికెలు । తొడుక్కువస్తిమి వెలదిరోచూడు । నీధర్మమ్మునరత్నపుసరులు । తొడుక్కు
వస్తిమిజానకిచూడు । నీధర్మమ్మున మూసివాయనమ్ములు । అందుకువస్తిమి అతివరో
చూడు । అమ్మలార మాగృహములలోపలా । తలతురమరతుర తన్నిపలికె । యత్తల
దుఃఖములడుగగనేలా । చెల్లెలాదుఃఖముచెప్పంగలమా । మరలదుఃఖము మాన్పగలేమూ ।
దోసెడేసియరిసెలువండెరే । సన్నబియ్యమైతెవండేరే । చాయపప్పులై తేవండేరే । విల్లువిరచి
పెండ్లీఆడిననాడు । ఇంతవైభోగముఎరుగమెమేము । పట్టాభిషేకమునాడైనాడు । ఇంత
వైభోగము యెరుగమెమేము । ఎంతచక్కగాజేసిరెవారు । ఆపలుకులువిని జానకి
నవ్వెను । యంతానవ్విరిహర్షముతోను । ఇక్కడపరలోకపు క్రియలమనంగా । యక్కడ
జానకి గర్భ తేజం । నవమాసంబులు నిండగనప్పుడు । నాతికితొమ్మిది నెలలేనిండే ।
ముఖమువాడికడుపువాడుటజూచి । తడవులేదుఈతరుణికియనిరి । సంపెంగా తైలముతో
నప్పుడు । సీతకుశిరసూయంటిరివారు । పచ్చాకూకచ్చూరాలువేసిన । ఒంటిపిండినలుగులు
బెట్టించే । పసుపుతోటిపన్నెండూనలుగులూ । సీతకుపెట్టిరివేడుకతోను । వెండిగావులా
వేన్నీళ్లుకాచిరి । చన్నీళ్లవేన్నీళ్లసమముగాతొరిపి । మజ్జనమాడించిరిసీతకును । పట్టువస్త్రముల
పణతికిఒత్తిరి । సాంబ్రాణిధూపము వేసిరి । సఖియకుతలకురులార్చిరివారు । చుక్కబొట్టు
నొప్పమరగబెట్టిరి । సోగకన్నులకాటుకబెట్టిరీ । పాలజావులకాచిదెచ్చిరీ । బంగారుగిన్నెలో
పోయించిరి । పాలజావులారగించిరప్పుడు । వోకలింతలుఘనముగనుంటె । తిరుగుముఖమా
యెనుజానకికప్పుడు । తడవులేదుఈతరుణికియనిరీ । అంతలోనజానకితానప్పుడు । కాని
దానివలెకడనున్నదీ । మ్రొక్కిరివారుదైవములకు । మ్రొక్కరాదు దైవములకైనా ।
యనిమునికాంతలుఅందరుగ్రక్కునా । అరణాలుచదివింతామనిరి । వేడిక్షీరములుతాగవే
తల్లి । జడియకయుండవే యమ్మరోనీవు । కన్నవాడుజనకుడుండగను । కడుమోహమ్మున
రాఘవులుండ । ఇష్టమేమాకు జానకిచూడ । ఎంతజేసిరిరాఘవులయిన । ఘనముగకార్తిక
మాసమందున । ఘనమయినాపున్నమదినముననూ । అందమయినాసప్తమి ఆదివారము
నాడూ । ఆరుఘడియలారాత్రీవేళా । కన్యతులారాశీలగ్నమందునా । కలిగెను బాలుడు

వేడుకతోను । లవణాసురునిచంపబోవుచు । చనుదెంచెనుభరతుడుఆరాత్రి । గుసగుసపొయ్యేటి
కాంతలనెల్లా । జాలకజ్బులావెంటనాజూచె । నిర్ఘాంతాపడియిట్లనిపలికె । ఎంతవాడుగాతమ్ముడు
నేడు । యేమనవచ్చునుతమ్ముణ్ణయినా । చంపలేదుగాశ్రీలక్ష్మణుడు।దాచివచ్చెనుశ్రీలక్ష్మణుడు ।
మర్మముబెట్టెనుమాకందరికి । చేతులోనున్నాచేతిరుమాలు । సూరకత్తిచందముపోగులను ।
జాలకజ్బులావెంటవేసి । పొలుపుగదర్భలు బొడ్డుపయినుంచిరి । పూబోణులు బొడ్డువొప్ప
గకోసిరి । మీదిపుడతి మీతండ్రిప్పుడు । బంగారపుచేటలుజేయించె । అనుచుపుణుకులూ
చేటలోబోసి । పట్టుచీరలు పక్కకుపరచి । పవళించాబెట్టిరిబాలున్ని । బిడ్డామాదిగెడ్డమీది ।
యనుచుబలికిరికాంతలుతమరు । యంతలోసుభరతుడుతానప్పుడు । నదితీరానికి గ్రక్కు
ననేగె । తానేస్నానంబులుగ్రక్కునజేసే । గోదానంబులు భూదానంబులు । సాగ్రాలిమదాన
ములుసమముగజేసే । కన్యాదానంబులు గజదానమ్ములూ । అశ్వదానములు చక్కగజేసే ।
అన్నదానములు స్వర్ణదానములు । శయ్యాదానములుక్షణములోజేసె । పంచదారలుమును
లకునిచ్చెను । అయోధ్యకుగ్రక్కునజనుదెంచె । ఆక్కనగరికేతెంచె గ్రక్కున । అక్కరో
మేలొక్కటి జెప్పెదను । యేమికట్నము నిచ్చెదవనెను । సకలాభరణ భూషితురాలినీ ।
ఇస్త్రీరతమ్ముడమాళవిననెను । యింకానేమియిచ్చెదవనెను । అడవులలోమనజానకిదేవి ।
బాలుణ్ణిగనిసుఖముగనున్నాది । చంపలేదుగా శ్రీలక్ష్మణుడు । దాచివచ్చెనుమనలక్ష్మణుడు ।
మర్మముబెట్టెను మనకిందరికి । ఎంతవాడుగాతమ్ముడునేడూ । యేమనవచ్చును
తమ్ముణ్ణయినా । ఆపలుకులువినిశాంతయప్పుడు । దిగులుపడిదిగ్గునతాలేచే । చాటుకు
లక్ష్మణుడుబిలచియుశాంతా । సకలవిధములజెప్పగదొణగే । ఆపలుకులువినిలక్ష్మణు
డప్పుడు । అక్కకు పలికెనునిట్లనితాను । ఆడవారికిమర్మముఖుండును । మర్మములేదే
మాకనిపలికె । కైకకొడుకుగాభరతుడునేడు । జూచివచ్చెరాతమ్ముడయనెను । తానుభరతుడు
నొక్కటియనెను । ఆపలుకులువినిశాంతయప్పుడు । ఆనందమునపొంగుతునుండే ।
యంతలోనుఋషిపల్లెలోపలా । గండదినమ్ములుగడుపుతునుండిరీ । ఉల్లిమల్లెరాబూతుల
నప్పుడు । కాపుధూపమ్ములుకావించిరపుడు । యగ్నిదీపమ్ములు ఆరకుండగను ।
కనిపెట్టిరీకాంతలుయందరును । కానకయున్నకడుమిత్రులారా।బిడ్డామానిగెడ్డమీదనిరి। సందు
గొందులాసావిత్రులారా । బిడ్డామాదిగెడ్డమీదనిరీ । ఆవలముఖమయియుండెదవేమే ।
చిన్నదానావా సిగ్గేమిటికె । తల్లీ నీవునాజేష్టయుండును । తిరిగియుండవె యమ్మరో
యనిరీ । పసుపుకుంకుమ మాపట్నములోపల । పంచిరి మునిపల్లెలవారికినెల్లా ।
అయోధ్యకు గ్రక్కునజనుదెంచె । కొమ్మలార మీగృహములోపలా । ఏమిటీఅని
కౌసల్యపలికె । ఆడపడుచునిపురిటికిదెస్తిమీ । పురుడుబోస్తిమీ పుణ్యాంగనకిపుడు ।
ఆపలుకులువినికౌసల్యప్పుడు । యతిదుఃఖమ్మున కడంగదొణగె । ఈపాటీమనజానకి

యుంటె । జానకినెలలువొక్క టేసుమ్మీ । ఆదరించిరక్కడీవారెల్లా । వోదార్చిరికౌసల్యా దుఃఖములు । చాటుకుశాంతాపిలిచిగ్రక్కునా । సకలవిధములజెప్పగదొణగే । తల్లిలేదుగా జానకికిప్పుడు । తండ్రిలేదుగజానకికైనా । సమస్తముమీరనిశాంతపలికె । రఘువంశమున రామునికొమరులు । బాలునికిభయములేదనీరి । సెలవులుపుచ్చుక సఖియలందరు । చనుదెంచిరిరుషిపల్లెకువేగా । నవరాత్రమ్ములు గడచినవెనుకను । గ్రామదేవతకు జాతరయనిరీ । దశరాత్రములుగడచినవెనుకను । పురుడుజేసిరిపుణ్యాంగనకపుడు । బిందెలనీళ్ళుముద్దల పసుపులూ । తెచ్చిరికాంతలువేడుకతోను । పచ్చగవేసిన పందిళ్ళక్రింద । ముత్యాలపీటలు ముందుగవేసిరీ । మంత్రసాన్ని బిలిపించిగ్రక్కున । బాలునికిశిరసంటవేయనిరీ । సంపెంగా తైలముతోనప్పుడు । బాలునిశిరమంటిరివారు । పచ్చాకుపసరూలువేసిన । ఒంటపిండి నలుగులుబెట్టించె । వెండికాగులవేణ్ణీళ్ళుగాచిరి । పైడికాగులచన్నీళ్ళుతోడె । చన్నీళ్లు వేనీళ్ళుసమముగాజేసిరి । మజ్జనమాడించిరి బాలుణ్ణీ । పట్టువస్త్రబులపణతులొత్తిరి । సాంబ్రాణి దూపములువేసిరీ । బాలుడుజలకము లాడేటప్పుడు । లక్ష్మణ భరతులు యిద్దరువచ్చిరి । రూపురేఖలు మనరామునిబోయి । మృదువేషములు జానకీబోలు । చక్కదనమునకు చంద్రునిబోలు । సన్నపుమాటలు శాంతనుబోలు । నొయ్యారమునకు దశరథునిబోలు । అందమునకుచందురుబోలు । శౌర్యానికిశత్రుఘ్నునిబోలవచ్చు । రూపురేఖలుస్థిరముగజూచిరీ । చుక్కబొట్టువొప్పమరగబెట్టిరి । సోగకన్నులకాటుకబెట్టిరీ । పవళించబెట్టిరి బాలునియపుడు । పచ్చగవేసిన పందిటిక్రిందను । ముత్యాలపీటనుముందుగ వేసిరీ । రావేజానకిరమ్మనిపిలచిరి । నడికట్టుకట్టిసంతోషముగను । కుడిపాదమునకూర్చుండబెట్టిరి । ఉల్లివేసికాచిననూనెలను । సీతకుసిరసంటిరివారు । పచ్చాకుకచ్చూరాలువేసిన । వొంటిపిండినలుగులుపెట్టించె । చన్నీళ్లవేణ్ణీళ్లసమముగచేసి । మజ్జనమాడించిరిసీతకును । పట్టువస్త్రములతరుణులుతళ్లొత్తిరీ । సాంబ్రాణిదూపములువేసిరీ । సఖియకుతలకులార్చివారు । కుసుమపువ్వులాచీరిగట్టిరీ । నడికట్టుకట్టిరినాణెముతోను । చిలుకరవికెలుసీతకుదొడిగిరీ । తలవాశనమ్ములుగట్టిరివారూ । సోగకన్నులకాటుకబెట్టిరీ । ముక్కుకుముంగరము గుదకునుంచిరి । కొట్టుకాయముకొట్టిదెచ్చిరి । అప్పుడుకాచినఆవులపాలూ । బంగారుగిన్నెలోపోయించిరి । పణతులుపాదమ్ములుతొడగించిరి । బొడ్డుకోసినాకత్తిచేతికియిచ్చిరి । వేపకొమ్మలా వెలదికియిచ్చిరి । తూర్పువైపునా నిలువవేజానకి । మొక్కవె జానకి భాస్కరుకయినా । మొక్కెను జానకి భాస్కరుకైన । ఏటనేట చూలింతచాలింకా । దయచేయుమి యోభాస్కరయనెను । అక్కడనున్నాయతివలకెల్లా । పసుపు కుంకుమా పణతులు యిచ్చిరీ । ఆకులు పోకలు కాయపుండలూ యిచ్చెనుజానకివేడుకతోను । అంతవచ్చెనుజానికిజూచి । లక్ష్మణభరతులుయెదురుగవచ్చి

తప్పకుండనమస్కారముజేసిరి । మోదముతోపై మరదులనెత్తి । దీర్ఘాయువుగా దీవించెను
తానూ । పుత్రపౌత్రవంతులుగమ్మనుచునూ । అనేకదీవెనలూదీవించే । ఇక్కడనున్నా
చందముయంతా । రామునకు జెప్పితివాలక్ష్మణనీవు । రామునకుజెప్పి భరతుణ్నితీసుక ।
తన్నుజంపగా వస్తివయనెనూ । ఆపలుకులువినిభరతుడు తాను । కన్నులజలములు
గ్రక్కునదెచ్చె । యిక్కడనున్నా చందముయంతా । రాముకుజెప్పాలేదనిబలికె । రాముకు
జెప్పినన్నుతీసుక । చంపగరాలేదందురొయనెనూ । లవణాసురుని చంపబోవుచూ ।
చనుదెంచితినారాత్రివేళా । గుసగుసలాడెడి కాంతాలనెల్లా । జాలకర్రలావెంటనేజూస్తి ।
చేతిలొనున్నా చేతిరుమాలూ । సూరకత్తిజందెముపోగుఽనూ । జాలకర్రిలవెంటనేవేస్తి ।
నదీతీరానికి గ్రక్కునచనుదెంచి । నదిస్నానములు గ్రక్కునజేస్తి । గోదానమ్ములు
భూదానమ్ములు । అశ్వదానమ్ములుయన్నిజేస్తి । పంచదారలు మునులకుయిస్తిని ।
అయోధ్యకుగ్రక్కున చనుదెంచితి । అక్కకు మేలొక్కటిజెప్పితీ । నీపలుకులువిని
జానకప్పుడు । ఆనందమాయెను జానకిమనసు । చాలవేడుకా పొందుతునుండే ।
జానకిరాగాచూచియపుడు । తలుపులువేసిరితరుణులుయెల్లా । పేరులుజెప్పకా తలుపులు
తియ్యమూ । యనుచుబలికిరీకాంతలుతమరూ । అయోధ్యాదశరథరాఘవులు । బాలుడువచ్చె
నుతలుపులుదీయరే । అనిపేరు జెప్పగతమరప్పుడు । తలుపులుదీసిరి తరుణులతమరూ ।
ఆవనకాంతలు యందరుగ్రక్కునా । బావికిచనుదెంచిరిశీఘ్రమునా । బావిలోపలాచేదలు
వేసిరి । మూడుచేదలుముందుగతీసిరి । బొత్తిళ్లాబట్టలుతడిపించిరి । అలుకులుముగ్గులు
అక్కడబెట్టిరి । తప్పక మ్రొక్కిరికాంతలందరూ । లోనికిచనుదెంచిరి యతిశీఘ్రమున ।
చక్కనిబాలుణ్నీ తొట్టెలొనుంచిరి । ఉంచాపణతులు పాడుచునూదిరి । జోజోరఘుకుల
రాముకొమారుడా । జోజోదీపక వరదాయనిరీ । జోజోకౌసల్యాకైకమనమడా । జోజోదీప
కవరదాయనిరి । జోజోదామము సొగసుగపాడుతు । పాటలగంధులు పాటలుపాడిరి ।
నూరుగరిసెలాసెనగలు దెప్పించిరి । నీళ్ళలోపలానానబోయించిరి । కొబ్బెరబెల్లముకలి
పించిరప్పుడు । పాయసమ్ములుతగు విచ్చిరివారికి । ఆశీర్వచనముల నక్షంతలిచ్చిరి । హార
తులిచ్చిరియతివలుయెల్లా । కర్పూరాహారతులుయిచ్చిరి । ఆనందమున నుండిరివారూ ।
పురుడువెళ్లె పుణ్యాంగనకపుడు । ముదముతో వాల్మీకుల కెరిగించిరి । ఏదినామమో
యెఱిగించమనిరి । మానకప్పుడి మునిఘనులారా । కుశడనునామము నయముగనిడిరి ।
పండ్లుఫలమ్ములు పంచదారలు । భుజియించిలేచిరిఆవనమునులు । పుణ్యాహవాచనపువుద
కముబట్టుక । లక్ష్మణభరతులుయిద్దరువచ్చిరి । అయోధ్యానగరములోపలను । అభ్యంగన
మ్ములుజేసిరివారు । పులగములువండించివారు । ఇదియేమనెనేశ్రీరాఘవులు । మైలమునొ
కునుగృహములోపలా । అనుచుబలికెను ఆలక్ష్మణుడు । అంతలోనుఋషిపల్లెలోపలా ।

జానకిసుతుడు పెరుగుతు నుండే । పుత్రుని తొట్లైను పువ్వులబంతులు । తెచ్చిగట్టైదనని
జానకితాలేచె । కనకపుతొట్టిలో పుత్రునియుంచి । కనిపెట్టండి ఘనమునులార । జానక్కి
కదిలెను చెలికత్తెలతో । పాలుబ్బరించెను జానకికపుడు । అచ్చటిపుత్రుడు ఆకలిగొనెను ।
యిచ్చటికి తానెందుకు వచ్చితినో । అందందనడవగ నందెలు మ్రోయగ । సుందరి జానకి
పుత్రునికడకు । సుదతికి నవరత్నములు మెఱయగ । సుదతి తనపుత్రునిచంకను బెట్టు
కొని । జానకికదలెను చెలికత్తెలతో । అచ్చట మునులుజపములు చాలించుక । జానకి
పుత్రుడు తొట్లైనులేడు । జేరిజాణలశపించిపోననుచు । భయముతోచెను మునులందరికి ।
కుశదర్భకు జీవములుపోసిరి । కుశడనిబాలుని నామమునుంచిరి । పవళించ బెట్టిరిబాలుని
యపుడు । పారిజాతపు బంతులుబట్టుక । జానకివచ్చెను చెలికత్తెలతో । తోడనుపుత్రుడు
తొట్టిన పుత్రుడు । యిదియేమనెనే జానకిదేవి । వెలదియిద్దరు పుత్రులేనీకు ।
యెన్నగరాజ్యములేలేరమ్మా । నీకుముందుకీఆధరవెతల్లి । అయోధ్యపట్ణమునేలెదరు ।
ఆపలుకులువిని జానకప్పుడు । ఆనందమాయెను జానకిమనసు । చాలవేడుక పొందుతు
నుండే । ఒక్కొక్కమాసము నిండగనప్పుడు । ఒత్తిగిలిరి జానకిసుతులు । రెండొ
మాసము నిండగనప్పుడు । మందగిరిచెదరమరితలలెత్తిరి । మూడొమాసము నిండగ
నప్పుడు । కూర్మముపైకూర్చుండనేర్చిరి । నవమాసములునిండగనప్పుడు । నడవనేర్చిరి
నానాటనాటికి । ఆటలు మాటలు అనురాగమ్ములు । చూచినజానకి కడుశోకముబొందె ।
యీముద్దులు యీపలుకులు నవ్వులు । యెవ్వరుజూతురు తనసుతులకును । తాతలు
ముత్తవ్వలు పినతండ్రులు । యిందరు గలిగుండీవిధమాయె । యెన్నివిందులో చేసునో
రాజు । యేవిధమున లాలించునొశాంత । శాంతను అప్పుడు మదిలోదలచి । వూర్మెళను
చిత్తమునదలచే । నత్తలముగ్గురి నప్పుడుదలచి । ఇతరమైన బాంధవులదలచే । తల్లి
దండ్రినితలచుకపడలే । మూడోయేటను జానకిసుతులకు । ముందరజుట్లువుంచిరిమునులు ।
నాలుగోయేడు బాలులకిప్పుడు । అక్షరాభ్యాసముచేతామనిరీ । గర్భాష్టకముబాలులకిప్పుడు ।
వుపనయనమ్ములు చేతామనిరీ । పంచగోచులును పసుపుగోచులు । బాగుగాయజ్ఞోప
వీతములు । శిఖదండమిచ్చిరి క్షేమముజేసిరీ । గోచులుతండములు బాలులకిచ్చిరి ।
బంగారపుపాత్రలుచేతికిచ్చిరి । బాలులభిక్షానికిపంపిరివారూ । భవతిభిక్షాందేహి యనుచును ।
అడిగిరిబాలురు మాతృభిక్షతాజానకిబెట్టైను । వుపనయనమ్ముల చేసిరివారూ । ఆచందమ్ముల
చూచినజానకి । అతిదుఃఖంబునఅడలగదొణగే । ఈచందమ్ములుఅన్నీనేడు । యెవ్వరు
జూతురు తనసుతులకును । యెన్నిముద్దులూచేసునొరాజు । యేవిధమున లాలించునొశాంతా ।
శాంతనుఅప్పుడు మదిలోదలచి । ఊర్మెళనుచిత్తమ్మునదలచే । అత్తలముగ్గురి నప్పుడు
తలచి । ఇతరమైన బాంధవులాతలచి । తల్లినితండ్రినితలచుచుఅడలే । అస్త్రశస్త్రనావిద్యలు

అన్ని । ఆరుశాస్త్రములు నాల్గువేదమ్ములు । పరగగపదునెనిమిది పురాణములు । చతు
రార్థమ్ములుపంచకావ్యములు । వనములలో వాల్మీకుడునేర్పె । పత్తిరిపుడకలు చేతబట్టుక ।
ఒనరగ రామాయణమ్ములుచదువుచు । ఒదిగియుండిరీ వనములలోనూ । అడవులకు
కుశలవులేతెంచిరీ । పండ్లుపలమ్ములను పట్టుకవత్తురు । అమ్మరొామమ్మున కన్నదిబొజ్జా ।
ఆకొంటివితినుమని ఫలమిచ్చే । బిడ్డనుజూచీజానకి కడుశోకముబొందె । ఆదరించిరి
అక్కడివారెల్లా।నోదార్చిరి జానకిదుఃఖములు । అప్పుడుతల్లిని తప్పకజూచితే । రాజసతీలా
గున్నదిచూడ । అక్కడ నేమోనేరముజేసితె । చంపబంపిరతి సాహసమునను । దేవికి
నేరములేకయుండగ । కాచిరిగాబోలు యీమునులు । ఇద్దరెబాలురము పుడితిమిమనము ।
సుఖముగానుంటిమియీగృహముల । భారతమ్ముడఅనిబలుకుదురు।ఊరకచెప్పెరుఆడవారులు।
ఉగ్రముచేసితె మేలనిపలికే । కన్నులనిప్పులుకమ్ముకరాగ । ఖడ్గములువేళ్లకుసంధించిరి ।
తల్లికిమ్రొక్కినతనయులపుడు । ఖడ్గము వ్రేళ్లకుబూనుకొనినిలుచుండిరి । ఆమునికాంతలు
అందగ్రక్కున । చుట్టునిలచి రాజానకిచుట్టు । ఎవరేకాంతలు మీరందరును । చనుదెంచిరె
మాగృహములకనిరి । యెవరేనిన్నుకన్నారిప్పుడు । యేదేశముమాకెరుగగజెప్పు । అని
సుతులడుగగ నతివశోకించుచు । పలికెనుకన్నులబాష్పముకురియా । అక్కడనేడ్వగ
మరచితివేమొ । యిక్కడనేడ్వగవచ్చితివేమొ । ఆవెనుకాఅదిఅయ్యేగాని । పూసగ్రుచ్చినట్టు
తాజెప్పు । ఆపలుకులువిని జానకప్పుడు । గడగడవణకుచుకాంతయిట్లనెను । మథిలానగరమే
నాపుట్టినిల్లు । జనకచక్రవర్తేనాతండ్రి । అయోధ్యానగరమే నాఅత్తిల్లు । ఆదశరథుడుతన
మామనిపలికె । అందురుతాతలేగాని । అయ్యయేడే యిందరిలోపలను । అయోధ్యాదశరథ
రాఘవులు । అయ్యసుమీ మిమ్ములగన్నట్టి । పొందుగలక్ష్మణ భరతశతృఘ్నులు । వారు
ముగ్గురుపినతండ్రులుసుమ్మీ । మాశవిపూర్మెళశృతకీర్తనగ।వారుముగ్గురుపిన్నతల్లులుమీకు ।
అరయగఋష్యశృంగునికాంతా । యిరవుగమేనత్తామీకు । కౌసల్యాకైకాసుమిత్రలూ ।
అయ్యనిగన్నతల్లులువారు । మరితక్కినబాంధవులెల్లా । మిథిలాపురమున నున్నారనెను ।
వారేవిధమునబుట్టిరిగాని । యెరిగింపుమిమాతో ననిబలికె । తాటకనొకకోలను పడవేసిరీ ।
మారీచసుబాహులద్రుంచిరీ । మునులయాగమప్పుడురక్షించిరి । మునిసతినిఅహల్యానుజేసిరీ ।
శ్రీఘమ్మునశివవిల్లటు విఱిచిరీ । మెచ్చియిచ్చెను మాజనకుడు । సీతనుపెండ్లాడెను
శ్రీరాముడు । పరశురాముని భంగపరచిరి । పకపకనవ్విరి బాలలుతమరూ । శివవిల్లువిరచిన
మాతాౕిన । సీతరానిన్నిచ్చిన జనకూడు । ఆవెనుకను యేవిధమునఆయె । కౌశికసుతుని
యాగమ్ముకొాఱకునై । కలసివచ్చెసుమీ మీతండ్రనెను । వారికినీకుపగయెందూకె ।
వనములలోపలవచ్చుచుండనెను । వనమేచంధమ్మిల వచ్చిందే । కైకబంపగాబోయి
తిమనెను । కైకబంపగారణమేమిటికే । సీలవిరుగతాసారథిగడపె । ఆడదిసారథియెట్లు

గడిపెనే । రథికుండెచ్చోటను వున్నాడు । సతిచేతికి బాణమ్ములయిచ్చి । తరుణి
వెనుకనేతానిలుచుండి । ఆడదానిపంతము చెల్లించి । తనయులను అడవులకంపించి ।
యెంతకీర్తి వాడేదశరథుడు । సిగ్గుమాలినవాడే దశరథుడు । లజ్జమాలినవాడేజనకుడు ।
నీతిమాలినవాడేజనకుడు । జాతిలేనివాడేదశరథుడు । గోత్రహీనుడేఆజనకుడు । కాగా
యిద్దరికి సరిపోయెను । యిద్దరినిగూర్చినబ్రహ్మనుకాగా । అతడేవిధమునయేతెనునిన్ను ।
పోయితి మండేటి మంటలోను । తెచ్చుకోక రాదెంతటివారికి । గారణమీలాగున
గాబోలూ । నిన్నురాఘవులను గూర్చెదసుమ్మా । నమ్ముకుండు మీఆమ్మరోయనిరి ।

# కుశలవుల తొట్టె

ఏడవకు కుశలవుడ రామకుమార । యేడిస్తే మిమ్మెవ్వ రెత్తుకుందూరు ।
మెరుగుటందెలు గొనుచుఅయ్య । మీరఘురాము డొచ్చెనేడువకు ।
అంచుపంచెలుకొనుచు అంగీలకొనుచు । అయ్యమీరఘురాము డొచ్చెనేడువకు ।
ఉంగరమ్ములుగొనుచు ఉయ్యాలగొనుచు । ఊర్మిళపినతల్లి వచ్చెనేడువకు ।
సిరిగల్గుఋషిపల్లె సోమవీధులకు । ముత్యాలుగూర్చిన పందిళ్ళలోను ।
నారచీరలతోను ఉయ్యాలవేసి । జానకితనయులను జోలలుపాడె ।
జోజోదశరధరాముకుమారా । జోజోశతకోటిభానుప్రకాశా ।
జోజోమనితొట్టె సొంపుమీరగను । జానకితనయులను తలచియిట్లనెను ।
గుర్తుకాకగుర్తిళ్ళ కోనేటినడుమా । పాపయ్యముగంటి పంటమరుగులను ।
పట్టుటంగీగొనుచు పులిగోరుగొనుచు । భూదేవిఅమ్మమ్మ వచ్చెనేడువకు ।
కాళ్ళగజ్జగొనుచు కంఠమాలగొనుచు । కైకమ్మమీముత్తవ్వ వచ్చెనేడువకు ।
కాళ్ళకడియాలుగొనుచు కంకణాలుగొనుచు । కౌసల్యమీముత్తవ్వ వచ్చెనేడువకు ।
సూదిగమ్ములుగొనుచు చుక్కబొట్టుగొనుచు । సుమిత్రమీముత్తవ్వ వచ్చెనేడువకు ।
దండకడియాలుగొనుచు తావేదులుగొనుచు । దశరధుడుమీతాత వచ్చెనేడువకు ।
శంఖచక్రముమెరయ చొకట్లుమెరయ । శత్రుఘ్నుడుపినతండ్రి వచ్చెనేడువకు ।
దేవదేవతల దేవుళ్ళనుదలచి । జనకుడుమీతాత వచ్చెనేడువకు ।
బంగారుగిన్నెలో పాలునెయిపోసి । శాంతమ్మమేనత్త వచ్చెనేడువకు ।
చేతిరుమాళ్ళుగొనుచు చొకట్లుగొనుచు । ఋష్యశృంగులుమీమామ వచ్చెనేడువకు ।
రావిరేకలుగొనుచు రత్నాలుగొనుచు । లక్ష్మన్నపినతండ్రి వచ్చెనేడువకు ।

# కుశలవుల యుద్ధము

( మోచేటి పద్మము నోచేటి వేళ ) వలె.

రత్నమాణిక్యముల మేడలోపలనూ । యింద్రనీలమ్ములు యింపుతో మెఱయా । ఇంద్ర నీలావజ్ర మాణిక్యమూలు । పచ్చలుకెంపులు గోమేధికములూ । చిలుకలు హంసలు పావురమ్ములు । పుష్యరాగమ్ముల పాన్పుపైనా । చంద్రకాంతపుశయ్య యందునా । పగడపుకోళ్ళ మంచంమీదా । పట్టుపరుపులూ పరిమళమ్ములూ । బాలీసులు తలగడల నుంచిరీ । హేమవింజామర్లు నేర్పుతోవిసరా । భక్తితో లక్ష్మన్న పాదములొత్తా । పవ్వ శించిరి శ్రీరాఘవులూ । అతడై ననిద్రించుచుతూవుండే । సతీతనయులూ ముగ్గురువెళ్ళీ । వెళ్ళీ కన్నులముందరనిలిచీ । మీధనములకూ మీఋణములకూ । కర్తలమయ్యేడి పుత్రుల మనిరీ । రావణమాయలు మీరెరుగుండి । అపవాదములూ సీతకువేసి । అడవులలో చంపా నంపితిరా । మీవాక్యములు తప్పనీతమ్ముడు । అప్పుడు ఖడ్గమును అంకించే । సత్యవాక్య ములుగలిగిన సీత । బాలరంపెరుగుతూవున్నమనిరి । తపసుజేసిమీ తల్లిల్కంటే । అయో ధ్యరాజ్యం బేలిరితమరూ । తపములేక మాతల్లికంటే । అరణ్యమేగృహమాయెనుమాకు । పళ్ళుఫలములు భుజింపుచూను । పెరుగుచున్నాము కానలఅనిరీ । ఆపలుకులువిని శ్రీరాఘ వులూ । అదరిపడుతు దిగ్గునతాలేచె । పాదములొత్తేడి తమ్మునిపిలిచీ । స్వప్నమాయేరా తమ్ముడా యనెనూ । ఆపలుకులువిని శ్రీలక్ష్మణుచు । యేమిస్వప్నమో యెరిగించుమనెను । సతీతనయులూ ముగ్గురూవచ్చీ । నాదగుకనులా ముందరనిలిచీ । మీధనములకూ మీఋణ ములకూ । కర్తలమనియేటి పుత్రులమనిరీ । రావణమాయలు మీరెరుగుండి । అపవాదులు మాసీతకువేసి । అడవులలో చంపాపంపితిరా । మముజేసినదంతా మిమ్ములను । చేతుము చెయ్యకమానముఅనిరీ । పెరుగుచున్నాముకానలాయనిరీ । ఆపలుకులువిని శ్రీలక్ష్మణుడు । చిరునవ్వునవ్వుచు చిత్తములోన । కలగన్నచోటను గంపనింపుదుర । కలనిజమగునా మన రాఘవులు । నేకన్నకలలూ కల్లలుగావుర । కలనిజమౌరా తమ్ముడాయనెను । అశ్వమేధ యాగం జేసినకాని । యిటుపైని యిహపరములులేవో । అనుమానమ్ములు తీరవుగనుకా । ముందరకార్యం తెలియగరాదు । తల్లీతనయులు తల్లడిల్లుతూ । తిరుగుతుపుండిరీ వనముల లోను । అశ్వమేధయాగమ్ము జేసి । ధారపోసెదా తనయులకనెను । అశ్వమెట్టిదో యాగ మెట్టిదో । అడుగుమనిరీ వశిష్టునిబిలిచీ । ఆపలుకులువిని శ్రీలక్ష్మణుడు । అతివేగమున లేచెనుతానూ । హనుమంతునిపిలిచి వేగముగా । వశిష్ఠుని తోడుకురమ్మనెను । వశిష్ఠాదులూ వామదేవులు । వచ్చికూర్చుండిరీ మహామునులంతా । వచ్చినమునులను జూచి రాముడు ।

వందనమ్ములు వారికిజేసి । అప్పుడు వసిష్టునకిట్లనిరీ । రావణుజంపిన బ్రహ్మహత్యలు , పోక
వున్నవి రాములయెదుట । అశ్వమేధయాగం జేసినగాని । యిటుపైనయిహపరములులేవు ।
అనుమానమ్ములు తీరవుగనుకా । ముందరికార్యం తెలియగరాదు । అశ్వముయెట్టిదో యాగ
మెట్టిదో ।స్నానంబెట్టిదో తడయకజెపుడీ । సతిలేనిస్నానంబప్పదు । సతిలేనిదానం నొప్పదు
అనిరీ । యేకపత్నీవ్రతుడగుతాను । మారువివాహమొందనితాను । యేలాగునయాగంబయ్యా ।
నీజనకపుత్రితో సమమైనట్టి । కనకపుబొమ్మనుగావించుమనిరీ । ఖోరుకొల్వగాపసిడిసీతతో ।
సాన్నభూదానమ్ము చెయ్యగవచ్చు । మంత్రశాస్త్రమ్ములు హోమగుండములు । జరుపగ
వచ్చును యనిబలికిరంతా । ఆపలుకులువిని శ్రీరాఘవులూ । బౌరతమ్ముడా యని తాబిలిచె ।
కనకంపుసీతనూ గావించుమనెను । పూరపూర కంసాలుల బిలిచీ । తీరగుబంగరు
తూనికబట్టి । బాగుమీర పుటములు బెట్టించి । బంగారపు సీతనుజేయించీ । ప్రాణప్రతిష్ఠలు
చేసిరిదానికి । జానకనుచునామమ్ముపెట్టిరీ । బలుకుచుండెనా బంగారుసీత । బంగారు
మేడలోపలను । చిత్తరువులు రాయించిరీ , అపుడు రత్నపు మేడలరంగ । వల్లులు
రమణులిద్దరు రాసిరి । సూత్రాన సున్నము ధవళించువారు । నేత్రానకై వత్తు లేసేటివారు ,
తెల్లని ఆకులేసేటివారు । బొండుమల్లెలపోగు చేసేటివారు । నిండుకడవలుతెచ్చి నిలి
పేటివారు । కస్తూరికళ్ళాపిచల్లేటివారు । ముత్యాలముగ్గులు పెట్టేటివారు । రత్నాలరంగవల్లి
రాసేటివారు । మాణిక్యాలదివ్వెల్పెట్టేటివారు । మకరతోరణాలు కట్టేటివారు । కౌసల్య
మహాదేవి నగరు వాకిటను । కనకపు తోరణాలు కట్టించెరాజు । కైకమహాదేవి నగరు
వాకిటనూ । వజ్రాలుతోరణాలు కట్టించెరాజు । సుమిత్రామహదేవి నగరువాకిటను ।
సువర్నపుతోరణాలు కట్టించెరాజు । పణతిరో బ్రహ్మపురి తనరు వాకిటనూ । ప్రయత్నాల
తోరణాలు కట్టించెరాజు । ఆయజ్ఞశాలలా పందిళ్ళలోను । అందముగ తోరణాలు కట్టిరి
రాము । కలకలమనుచు యజ్ఞశాలలు । రవ్వల తోరణాలు కట్టించిరపుడు । పచ్చనాకులు
పందిళ్ల వేసిరీ । హెచ్చుగ నవరత్నమ్ములుమెరయా । దిగ్గజమ్ములు తేజమ్ములును ।
మాణిక్య స్తంభమ్ములు వెలగగను । వజ్రాలవాకిళ్ళలోపలను । గోడలపైగోమేధికములు
రాసి । లక్ష్మీకటాక్షము రామునినందరూ । అలంకరించిరి అయోధ్యంతా । అంతలోను
శ్రీరాముడప్పుడు । అక్కసన్నిధికితానేతెంచి । అక్కరోవింటివ వొక్కటిమనవి । మనవి
జెప్పెద వినుమీ యక్కా । పుట్టిందిమొదలుకు యెన్నడును । యేస్వప్నము లెరుగనె
అక్కరొ యనెను । సతీతనయు లిద్దరూ వచ్చి । వచ్చి కన్నులముందరనిలిచీ । ఆడిన
మాటలన్నియు తెల్పి । అక్కయేమి ఆలోచనలనెను । గర్భిణిస్త్రీయని కనికరించకా ।
వధియించా వనములకంపిస్తి । తల్లితనయులూ తగుశోకమున । వనములలోతిరుగు
చున్నారు । అశ్వమేధములు యమరగాజేసి । ధారబోసెదా తనయులకనెను । అశ్వమేధ

యాగం చేయవలె ననుచు । ఆలోచిస్తినిఅక్కరోనేను । అశ్వమేధయాగం జేసితెగాని । యిటుపైని యిహపరములులేవు । ఆపలుకులువిని శాంత యప్పుడు । విననట్లుగ తానూరు కొనెను । ఆవలకార్యం చాలగ గలదు । యతివేగమునపోవలె నేను । ఆలోచించి అక్కరో నీవు । శెలవియ్యవేనీవు శీఘ్రముగాను । తప్పకచెయ్యుమి రాఘవ యిప్పుడు । బిరుదులు చెప్పగవచ్చెదనేను । ఆపలుకులువిని శిరసంటుటకు । పిలువమనిరి శాంతనురాఘవులు । ఆపలుకులువిని శ్రీలక్ష్మణుడు । యక్కసన్నిధికి తానేతెంచి । పసిడిసీతకు శిరసంటుటకు । రమ్మనె రాములు యక్కరోనిన్ను । ఆపలుకులువిని శాంతఅప్పుడు । లక్ష్మణునితో తానిట్టుబలికె । రామలక్ష్మణులుమీరువుండగా । మాకెందుకుయీయాగములనెను । అన్న దమ్ముల ఆలోచనలుండగా । మాకెందుకు ఈయజ్ఞములనెను । వదిననుచంపగ పంపేటి నాడు । యడిగెన రాముడువొక్కమాపైన । జానకినడవులకును నంపుతు । జెప్పెనే రాముడు తనతోడయిన । జానకియేమనియన్నదీయంటె । యేమియెరగననియంటివిగాని । సుఖముగజానకివున్నది అనుచు । జెప్పితివలక్ష్మణ వొక్కనాడైన । ఆరగించగాహడలుతూ వుంటె । అక్కరోవద్దని యంటివనీవు । వనములోపల బడితేనేమి । జానకితనయులు సుఖము నవుంటె । అంతె చాలునిక ఆవలకేగూ । ఆ పలుకులు విని శ్రీలక్ష్మణుడు । అన్న దగ్గఱకు తానేతెంచి । యెవరిని పిలిచిన వత్తురు గాని । అక్కను పిలిచితె రాదని పలికె । అందరు యెందుకు లక్ష్మణ యిపుడు । మనమే చాలు తమ్ముడ యనెను । భమిడిగిన్నెలా తైలముబట్టుకు । యరుంధతి చనుదెంచెను శీఘ్రముగ । అడ్డమెుచ్చి శాంత యప్పుడు । యరుంధతితో తానిట్టులుపలికె । సీతకుజలకంబాయిన వెనుకా । రాముని శిరసంటగ చనుదెంచు । సంపెగతయిలం చేరబట్టుకూ । జానకి శిరసంటిరి రాఘవులూ । రామలమ్మణులు నలుగులు పెట్టిరి । పన్నీట జలకము లార్చిరియపుడు । చెంగావీచీరగట్టిరి । సంపెగ తయిలం చేతబట్టుకు । యరుంధతిశిరసంటును రాములకు । పుత్త్రవ తట్టున వన్యాశ్రమమున । పుత్రులుసతిమీకున్నారనెను । ముని దీవింపుచు యరుంధతి తాను । వచ్చి కస్తూరి నలుగులూపెట్టె । ముత్యాల ముంతలు ముంచివ్వగను । మజ్జనమాడిరీ శ్రీరాఘవులూ । చలువ చీరెల మేనవత్తిరి । సాంబ్రాణిధూపమ్ములు వేసిరీ । ముఖమున వశిదీర్చుచు రాజాది తీరుగ । తిరుచూర్ణపు రేఖలుపెట్టిరి । శిఖలువేసెను శ్రీలక్ష్మణుడు । శిఖపై పువ్వుల బంతుల చుట్టె । మల్లెమొగ్గలూ సంపెగలూను । యంద మయిన ఆభరణములును । అలంకరించిరి శ్రీరాములకు । మంచిగంధము యలదెను లక్ష్మణుడు । మల్లెపువ్వులు ముడిచె లక్ష్మణుడు । పట్టుపీతాంబరము బట్టుకువచ్చి । కట్టి పెట్టెను శ్రీలక్ష్మణుడు । కలముతో ఉపకం బట్టుకు । కనకపు జానికితోకూడాను । యేకాదశి శుభముహూర్తమున । శాలా ప్రవేశమయ్యిరి వారు । కనకపుపీటలు వరుసగవేసి ।

కూర్చుండిరి జానకీ రాఘవులు । ఛోరుకొల్వగా పసిడిసీతతో । స్నానదానము లొనర్చిరపుడు ।
కన్యాదానమ్ములు  గజదానమ్ములు । సాలగ్రామ దానములుచేసిరీ । యన్నసువర్ణమ్ములు
వరుసగ యిచ్చిరి । కోట్లకొలదిగా గోవులనిచ్చి । యంగదుడు యడపంబట్టుకను । బేరిగుబ్బ
గొడుగూ భరతుడు బట్టా । ధనుర్బాణములు సౌమిత్రి బట్టగా । చామరము శత్రుఘ్నుడు
బట్టా । సూర్యచంద్రులు వింజామరలు । సూర్యపటము సుగ్రీవుడుబట్ట । యేకాంత స్థలమున
విభీషణుడుండ । హనుమంతుడు అడుగులొత్తగను । జాంబవంతుడు జేరికొల్వగా । పరమ
మునీంద్రులు సేవలుచెయ్యా । కొలువై గూర్చుండిరి రాఘవులు । అశ్వముయెట్టిదో ఆవృత్తాం
తము । యడుగుమనిరి వశిష్టుని పిలిచి । నలుపూ చెవులునల్ల వాలమ్ములూ । తెలుపూ
కాళ్లు దీర్ఘపూతోకా । పదికోట్ల తురంగములతోను । పంచకళ్యాణిని బట్టుకవచ్చి ।
పట్టుకోలేరెంతటివారైన । పదివేలైతే పట్టుకువచ్చిరి । బిరుదులు యేవిధమున రాయ
గవలెనో । పిలువమనిరీ శాంతను రాఘవులు । ఆ పలుకులు విని శాంత నవ్వుతూ । ఆనం
దమ్మున పొంగుతువచ్చె । యఖిలేశనందనుడు ఆనందగురుడు । ఆసత్యసంధుడు ఆయత్న
పరుడు । యహల్య పావన యంబుధిబంధన । వాలిమర్ధన వారధిఘనుడు । సేతుబంధన
చలనాయకుడు । రాక్షసాంతకుడురావణవైరీ । శిష్టరక్షకా సీతసమేతుడు । శివధనుబంజన
వీరశేఖరుడు । దశరథతనయుడు జనకుడల్లుడు । పుండరీకాక్షుడు పురుషోత్తముడు । వీరుడు
రఘుపతి విడిచినహయము । ధీరులుశూరులు యగుసాహసులు । బట్టికట్టిపోరాడిగెలిచితే ।
యిచ్చెదము మాయయోధ్యపురము । బట్టలేని యెంతటివారైన । మాయశ్వమ్ముకుమ్రొక్కగ
వలెను । మాపురములకు మడిగిచనుదెంచి । యాకర్తువులు యజ్ఞములుపొందచూచి ।
హరియర్చనములుయివ్వగవలెను । మాశరణుగావలెననిరీ । అనియక్షరమున ఉత్తరంబంది ।
నరనాథుడా పత్రిక వ్రాసీ । ఛమిడిపత్రికకు పసుపుపూసిరీ । యశ్వంలలాట మమరగగట్టి ।
యశ్వమువెంటా యెవర్నంపగవలెను । యడిగిరిశాంతను రాఘవులు, పోవోయి శత్రుఘ్నుడ
నీవుపోయిదేశాంతరములను । రాజులనుహతమార్చియైనను । మన యశ్వమునుతోడుకరమ్ము
ప్రేమతోశత్రుఘ్నుని పిలిచి । చేరదీసి కౌగిటనుచేర్చుకొని । హయము వెంటనే తర్లుమి
యనుచు । ఆలోచించిరి శ్రీరాఘవులు । దావలుబూరలు డమ్మడమ్మలను । ధవళశంఖలు
తాళపుజోళ్లు । వెండిరథములు కంచుయీాటెలు । వెండాయుధములు ఛమిడకత్తులును ।
కురుచయీాటెలు గొప్పకత్తులును । వెండిడాలుకత్తులవారు । రాగస్వరములు చిరితాళములు ।
తీరైనపదిటెక్కములను । వేదికవింజామర్లు విసరగా । రథమెక్కెనుతాశత్రుఘ్నుడు ।
వెనకాలవేయివేల రాణువకదల । ముందరమూడుకోట్ల రాణువకదలా । రథములుగజములు
తురంగములను । కాల్బలమ్ములు కమ్మకరాగ । ఆడుదము పాడుదముకడుదామనుచు ।
ఆటలాడిరావనచరులంతా । ముప్పయికోట్లరాణువకదల । ముందరయశ్వం నడచెనుయపుడు ।

నదులును సరసులు నానాదేశమ్ములు । తిరిగెనుయశ్వం ద్వీపాంతరములు । సురులు మునులు గంధర్వులును । హరియశ్వమ్మకు మ్రొక్కేటివారు । హరియప్పనములు యిచ్చేటివారు । ఆనాటికొస్తమని యనియేటివారూ , వెంటసహాయం వెడలేటివారూ । యనుచు భుజమ్ములు యిచ్చేటివారు । అక్కడవిందులు జేసేటివారు । గంధమక్షతలుకడు మోదముతో । ధూపదీపనైవేద్యములిచ్చి । వాయువేగము యశ్వంబపుడు । వడిగలతురగం పరుగులుపట్టె । అక్కడగందురు యిక్కడచూతురు । యాకాశమార్గమున నదిగోయంద్రు । యశ్వముతిరిగిన తెరువదియనుచు । జూచుచునుండిరి వేడుకతోను । అంతలోనవాల్మీక మహాముని । యతిదూరపుభూములకేతెంచె । వనమునసున్ననీబాలలనుంచి।వరుసతోటివెళ్ళగ చనుదెంచి । యిరువదినాల్గు దినములకొచ్చెద । బాలులారా పదిలగమ్మనుచు । ఆకాశ మార్గమున కంటునుయశ్వం । అక్కడక్కడ లఘువులుచేసే । రంకెలువేయుచు తిరిగెను యశ్వం । చూడయశ్వం జేరగాలేకా । మమ్ముగావుమని మ్రొక్కేటివారు । అశ్వంవాల్మీకి మహాముని । వనములు చేరగచనుదెంచెను । పూచినబూరుగ వృక్షముక్రింద । నిలచెను యశ్వంనీడనుయపుడు । ఋషులగోదావరితీరమందున । గంగగర్భంబున నిలిచెనుయశ్వం । కదళీవృక్షముల తరవులనీడలా । అక్కడక్కడతిరుగుతువుంటే । యిక్కడ ఈవిధంబుగ నుండగను । ఆపై యక్కడవృత్తాంతంబులు । పరగ పతియుతనమేడలకేగెను । తూరుపు శాలలో ముఖ్యమైయుండే । మన్మధుడున్నచందముబోలు । మహాలక్ష్మిశృంగారముబోలు । యంగదహనుమంతసుగ్రీవులు । జాంబవంత సుషేణు మొదలగు । నలుడు నీలుడు మొదలుగాగను । కొలువైయందరు కూర్చుండిరి । రాఘవులు పోవోయియంగదుడా నీవు । తపస్సన్నద్ధు లున్నట్టి । ఋషిపల్లెకు నీవేతెంచినపుడు । ఋషులను దోడుకురమ్మనిపలికే । వాల్మీకుడుమొదలైన మునులను । యందరిని దోడుకరమ్మనిబంపె । ఆపలుకులవిని యంగదుడపుడు । అంతట ఋషిపల్లెకుజనుదెంచె । యల్లంతట మహామునలనుజూచి । రామునాజ్ఞాయెను అనితాబలికె । ఆపలుకులువిని వాల్మీకుండు । తొందరపొందుచు గొబ్బున లేచె । వాల్మీకులరాకలు జూచుచును । వచ్చిరిగాఈబాలురు తమరూ । వలదువలదు శ్రీరాముల కడకు । వద్దువద్దనిబలికెను తాను । గర్భిణిస్త్రీయని కటకటమనగా । వధియించ వనములకంపెను । నాటిరాముడే కాడానేడు । నమ్మరాదు శ్రీరాములనైన । నమ్మరాదుగా విష్ణుమాయలను । కాయకష్టములు కానలబోను । ఆకులనములుచు అడువులలోను । మిమ్ములగాంచెను మీతల్లియైతే । యక్కడిప్పుడు వద్దనిపలికె । వలదువలదని యన్ని విధముల । వాదించినవచ్చిరిగ ఈబాలకులు । తనుముందర వాల్మీకులనడవగను । ముద్దు బాలకులు వెనుకనడచె । రామాయణములు చంకనపెట్టి । అయోధ్యకు కుశలవులేతెంచిరి । అత్రికశ్యపా యావసిష్టులు । అగస్త్యులు మొదలగు ఆ మునులంతా । వశిష్టకశ్యపవామ

దేవులు । వాల్మీకి మహామునులందరును । యయోధ్యకు చనుదెంచిరివారు । అల్లంతట మహా మునులను చూచి । నమస్కరించిరి నారాయణులు । పుత్రపౌత్రాభి వృద్ధుల్గమ్మని । ఆశీర్వదించిరి ఆ మునులంతా । వ్యాఘ్రచర్మంబులు వేగ తెప్పించిరి । వేయించిరిగా వాల్మీకులకు । నవరత్నఖచిత సింహాసనముతెచ్చి । మునిమధ్యంబున రామునుంచె । సింహాసనంబున గూర్చుండె రాము । సేనలంతయును కొలువైయుండిరి । సాటిరాజులకు వరసకుర్చీలు । వనచరులందరు గూర్చుండిరిగా । మహామునులును యోగీంద్రులును । తపశ్శాలులూ వారందరును । తీర్చికూర్చుండిరి వాల్మీకుకొల్వా । తమ్ములుమంత్రులు ప్రధానులతోను । తీర్చికూర్చుండిరి రాములకొలువు । ఆసమయంబున వాల్మీకుండు । బాలురకు కనుసాజ్ఞలుచేసె । అన్నదమ్ములూ ఆలోచించుకొని । అందుకొనిరి తమ రామాయణములు । కుశరాజు రామాయణము చదువ । లవుడుఅర్థప్రసంగముసేయ । ఆపలుకుల్విని శ్రీరాఘవులు । యతి యాశ్చర్యంబున అద్భుతపడుచు । నవరత్నాభరణ అంగుళీయకము । నాశిఖరంబున వుంకుచు రాఘవులు । యింత చక్కనిబాలురుయెక్కడ । మునియాశ్రమందున యెవ్వరుగలరు । విప్రజనబాలకుల్ వీరుకారు । క్షత్రియ బాలురవలె యున్నారు । విప్రబాలకుల్ వీరయితేను । యిట్టిశౌర్యములు ఉండవుయనెను । సూర్యవంశపూ రాజులవలెనే। జూడగా మావలెనే యున్నారు । రూపురేఖలుమమ్ములబోలు । దేహచ్ఛాయమాజానకిబోలు । బాహుపరాక్రమున భరతునిబోలు । కనుపట్టెచక్కదనమంతా । వాకతీరు జనకుణ్నిబోలె । నాజ్ఞాతీరునడక యంతయు । మాతండ్రిదశరథరాజునిబోలు । కన్నులైన మన కౌసల్యనుబోలు । చూపులయితెమన సుమిత్రనుబోలు । సన్నపుమాజలు శాంతవోలె । చెక్కులుమన శ్రుతకీర్తినిబోలు । ఉగ్రముచాల ఊర్మిళబోలు । మాటలు చాలమాండవిబోలు । దీర్ఘబాహువులు నీలపుకురులు । కలువ రేఖలా కన్నులతీరు । చక్కదనంబుకీ మమ్ములబోలు । చక్కనిదేహమూ జానకిబోలు । పుట్టుబుద్ధులు భూమినిబోలు । పాదమ్ముల్ యాజానకిబోలు । యిటుయేడు అటుయేడుతరంబుల । అందర్నిబోలిన వారేవీరు । యింతచక్కని బాలురుయిక్కడ । మునిపల్లెలోపల యెవ రెవ్వరుకలరో । వాల్మీకమహాముని ఆశ్రమందున । యెవ్వరిబాలురో తెలియగరాదు । అయినను మనసున తెలుయుదామనచు । మనసున తలచిరి శ్రీరాఘవులు । యెవ్వరయ్యా వసిష్టాదివాల్మీకమునులు । విన్నపంబుల వినమనిపలికె । పలికి బొంకనీ వారలుమీరు । ఆడితప్పనివారలుగనుక । అన్యాయంబులు జెప్పనివారు । అబద్ధంబులు ఆడనివారు । సత్యవాక్యపరుల్ మీరనెను । కల్లయుపల్కక వున్నట్లు జెప్పుడు । యింతచక్కని బాలురుయిక్కడ । మీయాశ్రమందున యెవ్వరుగలరు । యెవ్వరిబాలలో మాకెరుగించుడి । యాపలుకులువిని వాల్మీకుండు ; గడగడవణకుతు గొబ్బున లేచె । వొడలంతయును వణకసాగె । శరణుశరణు చక్రధరుండ । సకల జీవితా

ధారాశరణు । అఖిలాండకోటి బ్రహ్మాండనాయక । ఆదిమూర్తి మీకు శరణనిబలికె ।
చప్పన్నవిద్యల చెప్పనలవిగాదు । సంగీతసాహిత్యంబులయందున । మేరుసుధీరుల్ వీరని
పలికె । మీరెరుగని దేమున్నదిగనుక । మాయాశ్రమంబున కలిగిరి రాఘవా । పెంచు
కొంటిమి ప్రేమలతోను । తేజోవంతులు రాజపుత్రులూ । జగతికిచంద్రులు వీరని బలికె ।
ఆపలుకులువిని శ్రీరాఘవులు । అతిఆశ్చర్యంబున అద్భుతపడెను । తప్పకజూచెనుబాలుల
వంక । యిక్కడుండమనకిరువుగాదనుచు । గ్రక్కునలేచిరి బాలలుగనుక । పచ్చలుజెక్కిన
పావలుతొడిగి । బంగారుబెత్తమును చేతబట్టుకొని । యన్నరోయతివేగంబున రమ్మనుచు ।
యప్పటితమ నిజపల్లెకుజనిరీ । బాలలువెళ్లగశ్రీరాఘవులు । పరిపరివిధముల మనసునదలచె ।
యిటువంటిబాలలు మా యయోధ్యపురిలో । యెన్నడు కల్గుదురని తాబలికె । తనకయితె
ప్రాప్తిలేదాయెను । తమ్ములకయిన గలుగరాదా । ముగ్గురుతమ్ములకు ముచ్చటబరగా ।
ముద్దులతనయుల జూచెదననెను । ధరణిజనప్పుడు చంపకవుంచితే । యిటువంటితనయులు
కల్గుదురేమో । యనిశ్రీరాములు హడలెనపుడు । మెల్లగలక్ష్మణు డిట్లనిపలికె । మించిన
పనులకు మనసులోపల । చింతజెందితే కార్యములవున । విప్రబాలురను జూచిమోహము ।
తగదుసుమీ రాఘవమీకనెను । ఆదరించె శ్రీలక్ష్మణుడపుడు । అంతవారలు వేగముపోయి ।
అల్లంతటనుతల్లినిజూచి । నమస్కరించిరి బాలకులపుడు । దీర్ఘాయువుగమ్మని దీవించెను ।
యింతకుఎక్కడికేగితిరి । తడవాయెను యనిజానకిబలికె । అయోధ్యనగరం బేగితిమేమూ ।
యశ్వమేధంబు జూడగామేమూ । యయోధ్య దశరథ మహీపతితనయుడు । అశ్వమేధ
యాగంబునుజేసె । పిల్వబంపిరి ఋషులందరిని । తనరుగ వాల్మీకుం డేతెంచె । వారి
వెంట చనుదెంచితిమమ్మా । పోయివచ్చిన వృత్తాంతంబులు । తప్పకతల్లికి వారెరిగించి ।
ముద్దుబాలలు ముందర గూర్చుని । పాలుత్రాగిలేచిరి వారపుడు । ఒకచేతను పత్రంబుల
నేరుచు । ఒకచేతనుఖడ్గంబులందుకొని । వనంబులకు కుశలవులేతెంచి । వనంబులోపల
తిరుగుతూవుండ । పండ్లుఫలంబులను దెచ్చెదమనుచు । నంతట కుశుడు తానేతెంచె ।
మునిబాలురతో ఆడుచులవుడు । యశ్వంబుముందర నిలచెనుయపుడు । యేరాజుదీతురం
గంబు యనుచు । బట్టితెచ్చి కదలించుకుజూచె । పూసినబూరుగ వృక్షముక్రింద । యేరాజు
దో యశ్వంబనుచు । పత్రికవిప్పుకు బాలుడుదిగెను । చెట్టుక్రింద నిలుచుండి శౌర్యము
తోను । పత్రికచదివెను బాలుండపుడు । కౌసల్యవీరలా కన్నతల్లి । అఖిలేశనందనుడు ఆ
నందగురుడు । ఆసత్యసంధుడూ ఆనందగురుడు । లోకలోకంబులను నేలినవాడు । యహల్యా
పాలన యంబుధిబంధన । రాక్షసాంతకా రావణవైరీ । యసుర సంహారుడు అంబుజనా
భుడు । ఆత్మరక్షకుడు యవనిజవిభుడు । సృష్టిరక్షకుడు సీతాసమేతుడు । శివధను భంజనవీర
శేఖరుడు । దశరథ తనయుడు జనకునియల్లుడు । పుండరీకాక్షుడు పురుషోత్తముడు ।

వీరుడు రఘుపతి విడిచిన హయమూ । వీరులు శూరులు యతి సాహసులు । పట్టికట్టి
పోరాడిగెలిచితె । యిచ్చెదము మా అయోధ్యపురము । పట్టలేదు యెంతటి వారయిన ।
బట్టినవారికి భాగ్యముగలదు । అర్కవంశంబున వారు బట్టుదురా । బట్టకపోతే పట్టగలేని ।
రాజులశ్వమ్మకు మ్రొక్కగవలెను । మాపురంబులకు మరి చనుదెంచి । మీక్రతువులు
యజ్ఞంబులుజూచి । మాకు శరణుజొచ్చగ వలెననిరి । యని ఈక్షణమున ఉత్తరమం
దుకు । నరనాధుండా పత్రికచదివే । మరిమరిచదువుకు ఉగ్రుండగుచు । పెద్దపేర్లు యివి
కాబోలనెను । చదలంటుచు మిన్నంటుచు కోపంబున । బెదరక యతి వుగ్రుడయి పలికె ।
బుట్టెనువింతలు భూలోకమున । యెట్లుగ వినవచ్చె వార్తలను । యెందుకు తెలిపెను
ఈ కథలనెను । కౌసల్య కడు వీరుల కంటే । మాజానకీ కడు చోరులగనెనా । యర్క
వంశము వారిదియైతే । విప్రవంశము మాదే యవునా । ఒకడే సుతుడయి కౌసల్యకును ।
వీర శేఖరులను కన్నట్టితల్లి । యిరువురుతనయులు జానకికుండి । వీశేఖరులను గనలేదా ।
యెంతబుట్టినా నే విడువను । పంతముతోడుత పట్టెద హయమూ । కలిగితె
కార్యము నిజమేయనుచు । కన్నులనిప్పులు రాలగానిలిచి । గట్టిగా కౌపీనంబును గట్టి ।
కదళీవృక్షముకే గుర్రము కట్టె । యెరుగని వాడువలెను లవుండు । యెప్పటివలెనే
యాడుతూ యుండె । మునులపిల్లలు మోదముతోను । చూచా యశ్వంబు
చేరగావెరచి । అల్లంతట దూరముననిలుచుండి । అక్కడక్కడావృక్షంబులెక్కి ।
బాలుడాయశ్వంబు బట్టితివేలా । విడువరగుఱ్ఱమువేగమె యనిరీ । అందరము మేమున్న
తెరవునా । ఉండుము యశ్వం బట్టకవిడువు । అనిపలికిన వారలతో లవుడు । పలికెను
శౌర్యమూ ధైర్యము మించా । ఆనాడువాల్మీకి మహాముని । అక్షరవిద్యలు జెప్పెడివాడు ।
జపములు తపములు మీకమరించె । క్షత్రియాశ్వములు మా కమరించె । క్షత్రియ వంశము
బుట్టిమానుదునా । శూర జానకిగర్భామునబుట్టి । మానుదునా శూరత్వంబులనేను । వెఱచి
యశ్వంవిడుచుట కిప్పుడు । తపఃశిరోమణి తనయుండగాను । తపః శిరోమణీ తనయులు
మీరు । భూమిజనాధుని పుత్రుడనేను । ఎంత బుట్టినాయికనే విడువ । పంతంతోడుత
నీహయమును । వద్దువద్దువలదు రావాదముకు । వచ్చెనుసేనల సంఖ్యలెచూడు । యెన్ని
విధంబుల జెప్పిన గాని । యెరుగవుబాలుడా యెందుకీహయము । వెఱచి గుఱ్ఱమును
విడుచుటకంటె । వెఱవకప్రాణం విడిచితేమేలు । చచ్చితే వారిచే చావగవలెను । వుంటేను
అయోధ్య యేలగావలెను । వూరికె హయమును విడువనునేడీ । వచ్చినావారి గెలువనో
పెదా । గెలువకపోతే చచ్చెదపొండి । యనుభవించుమనీ యనుచరులంతా । బాలుని
విడిచి పోజాలక వారు । వూరికెజూచుచు వుండిరియపుడు । మునులు మునులంతా మెల్లగా
వచ్చి । చూచాహయమును వేగముఅనిరి । రాక్షసాంతకుండు రాముడనగను । అతనితో

పోరగ యెవ్వరితరము । వద్దుర హయమును విడువరాయనిరి । వెఱచిహయంబును విడుచుటకంటె । వెఱవక ప్రాణంబు విడుచుటమేలు । ఆదిలక్ష్మి పుత్రులే మేమయితే, యయోధ్యరాజ్యం మేమేలెదము । యవుదురౌదురు సత్యవతితనయులు । ఆదివిష్ణుపుత్రులౌదురు మీరూ । అయోధ్యరాజ్యం మీరేలుదురు । సందేహంబులు లేదనిరపుడు । మహా మునులు ఆశీర్వదించి । మఖంబులకు చనుదెంచిరివారు । యెరుగనివాడుగ మరియులవుడు । యెప్పటివలెనె యాడుతూవుంటు । గుఱ్ఱంబుకొరకయి యెవరొచ్చెదరో । యెదురుజూచుచు యుండెను బాలుండు । సముద్రుడువడ్డు విఱిగినరీతి । వచ్చిరి శంఖిణీ సేనలయందీ । యసురతలలూ దొర్లించినట్టుగా । చీమల బారుగా కదలిరీ సేనా । యెవడురా హయమును గట్టినవాడు । యెంతవాడురా హయమునుబట్ట । గుఱ్ఱంబుబట్ట ధైర్యంబుగలదా । రాజ యశ్వమును విడువరయనెను । యెవడురాయశ్వం విడిచేటివాడు । యెంతవాడురా యశ్వం విడువా । చెప్పుకొండి మీ రాజుతోపోయి । యడవులలో మేమున్నదెరుగక । యయోధ్య నేలగ గలడారాజు । యశ్వమేధము యాలిగూడా । సురులుమెచ్చగ చెయ్యగలడని । పెరుగుతున్నదీ కానడరాజు । బొందినివిడువక ప్రాణములుంటె । పోరకయశ్వంబు విడువనునేను । సూర్యచంద్రులు చుక్కలు గుళ్ళినా । సురకోటిదేవతలొచ్చినను । శత్రుకోటి చీకటికమ్మినను । పూరకెయశ్వం విడువనునేను । ఆపలుకులువిని హుంకారంబున । పొడువవచ్చితిరీ వీరులుతమరు । పొడువవచ్చిన వీరులనెల్ల । బాలుడు బాహులు త్రుణముగ ద్రుంచెను । కొందర దేహంబుల ఖండించెను । కొందరివక్షంబులు స్రుక్కించెను । కొందరి శిరముల కొమరుగత్రుంచెను । కొందరీబాహులు తృణముగ తృంచెను । కొందరి పక్కలు చెక్కలు జేసెను । లేగపెయ్యలలోని పాామువలెను । సుడిగుండంబును తిరుగుతూ వుండే । యిందువదనుడయి బాలుడునిలిచి । యక్షౌహిణి బలంబుల సణచెనుగా । ఝుంకారంబులచేత చేబట్టునేమో । హంకారంబునా యిట్లని పలికె । యికనయిన మీ రాజకుమ్రొక్కి । శరణని ప్రాణం కాచుకొండనెను । ఈ వంశంబున రామదూతలు । ప్రాణంబుల కాశింతురయనిరీ । రవివంశమున రాముడెవ్వరు, పేరుగొప్పా చాలాగలిగిందీ । ఆలినితమ్ముడిచే చంపబంపినా । యతన్నిగొలిచే బంట్లుమీరు । యిటుపోరిడివాడశ్వం నిలిపెను । వనముకు దూతలు చనుదెంచి యప్పుడు । ఫణిహారుల్ శత్రుఘ్నునితోజెప్పి । జరిగినవృత్తాంతంబుల నన్నిటిని, వినురాజా మునిబాలు డొక్కడు । పట్టెను హయమును యతిఘోరంగ । విడువర బాలుడాహయముయంటే । యక్షౌహిణి బలంబులనణిచాడు । గ్రిరునణ కయ్యంబుజేసెను । జెప్పతరం కాదు మాకనిరీ । సూర్యవంశా రాజులవలెను । చూడగ మీ వలెనే యున్నాడు । రూపురేఖలు మిమ్ములబోలు । దేహచ్ఛాయ మీ జానకిబోలు । బాహుపరాక్రముల భరతుని బోలు, మితాభాషల సౌమిత్రినిబోలు । వొప్పుతో నడక జనకునిబోలు । వయ్యారంబులు దశ

రఘుబోలు । శౌర్యంబులకు మిమ్ముగబోలు । క్షత్రియధర్మ రామునిబోలు । మమ్ము బోలిన వాడెంతవాడో । వచ్చెను శత్రుఘ్నుడు వాదంబునకు । యెవడుర హయమును బట్టిన వాడు । దొంగవాడుర హయమునుబట్ట । హయమునుబట్ట బలమున్నదా । విడువర హయమును వేగమే యనెను । యెవడుర హయమును విడిచేవాడు । యెంతవాడుర హయమును విడువ । హయమునువిడువ తరమవుతుందా । జెప్పుకొ నీయన్నతోపోయి । పండినచేనులో పశువుమేసితే । దూడలు గట్టుననిలుచుటగలదా । జపములు తపములు కాపురయివి । క్షత్రియాస్త్రమ్ములు యివ్విసుమ్మనెను । యన్నతమ్ములు యందరొకటయి । యయోధ్యరాజ్యం యేలుటగాదు । అన్నయాలిని అడవులకంపి । భోగంబులలో యుండుట గాదు । చెయ్యరమాతో కయ్యమునీవు । జెప్పెదవెందుకు పదిభాషలును । యస్త్రవిద్యలు శస్త్రవిద్యలు । గురుమంత్రంబులుకూడా గలవు । మహనీయంబులు మహాతంత్రములు । మాటలాడిమాతో గెలిచెదవా । వొకటంటే వొకమాటాడేవేరా । మాతోవోడక కడతేరదు చూడు । వొకటంటే వొకమాటనియెదవేర । వోరీనీపేరెవరో జెప్పర । రావణమర్దన రాముతమ్మణ్ణి । శత్రులవైరిని శత్రుఘ్నుని । శత్రుఘ్నుడంటేనీ వేనటర । నీచేజచ్చిన శత్రువులెవరు । ఆలిని తమ్ముడిచే జంపబంపినా । యతనికి తమ్ముడవని యనరాదా । చూచితే చిన్నవాడవుగాని । కర్ణకఠోరంబుల పలికేవు । అణువంతయిన గాని లేవూ । ఇంతమాట నీవాడితివోరి । నిన్ను చంపక విడుతునా । నీలకంఠుడు అడ్డంబయిన । పాలాక్షుడునన్ను బట్టుకున్నను । ప్రాణంబులు తియ్యక మాననురా । మాప్రాణములు తియ్యకుంటేను । మండలాధిపతి తమ్ముడుగావు । యాపలుకులువిని శత్రుఘ్నుండు । చిరునవ్వు నవ్వుతు యిట్లనెను । నీశౌర్యంబునకు మెచ్చగవచ్చు । యాడినమాటలు వినగావింత , యెన్నినోములు నోచెనుతల్లి । యెన్నితపంబులు జేసెనోతండ్రి । యెన్నికనీవంటి పుత్రులు కలగగా । యనేకనోములు నోచెనోతల్లి । పుత్రికామేష్టులు జేసెనోతండ్రి । బ్రాహ్మణులకు భోజనములుబెట్టి । కన్నది మమ్ములను । ఎన్నినోములు నోచికంటెను । అందరివలెనే నుందుముమేము । తపంబుచేసి మీతల్లులుకంటె । అయోధ్యారాజ్యంబేలితిరి । పంతంబేలను మాతల్లికంటె । యడవులలోపల ఉంటేమేము । పప్పునెయ్యిపాయసంబుల మీరారగించితిరి పండ్లుఫలములతింటు మేము । అన్నతమ్ములు నీకెందుకుర । అంతజెప్పర బాలుడవై , యన్నదమ్ములు అందరూవుంటే । యందరివలెనే వుందుము మేము । కొందరువనంబుల తిరుగుతువుంటె । కొందరు రాజ్యంయేలుతువుందుము । యేమిటిజాతము బాలుడమీది । పేరునుకులంబును జెప్పరయనెను । పేరునుకులంబులు ప్రేమతో యడిగిరి । వివరించితె మానియ్యమందెదవ । అప్పుడుమాకులగోత్రములు । తప్పక నీకెరిగింతుముపోరా । చిన్నవాడవనినీవయినేను । వెయ్యలేకనే చూచితిమిసుమ్మి । నీపంయుయస్త్రం వెయ్యగానాకు ।

తోచదుచిత్తము కరుగదుజిహ్వ । చదుపుమానుయిక చాలును పొమ్మని ।
పారిపోరాబాలుడ యికనయిన । పారిపోవుటది బంటుతనమ । చేకొనికార్యము
చెయ్యగవలెను । చిన్న వాడననిజూడగావద్దు । శౌర్యముపుంటే మానగవలదు ।
చిన్నలయితేమి పెద్దలయితేమి । వారతీసిన కత్తులమనిబలికె । ఆపలుకులువిని శత్రు
ఘ్నుండు । అహంకారంబున మండుచులేచె । ఒకటి రెండు మూడు వరుసగా నాలుగు ।
అయిదింటను చక్రధనువటుదాల్చె । బాణవర్షములు కురిపించిరప్పుడు । నారాయణాస్త్రం
నడిమికివేసె । బాలుడిపయిబడ బడిమూర్ఛిల్లె । యిక్కడలవుడు మూర్ఛపోగనే । అక్కడ
రణభేరులు త్రామ్రోగె । చదురుమీద శ్రీరాములుండగా । భీతిల్లెను దద్దరిల్లెనపుడు ।
యేమిరాలక్ష్మణ యేమోగాని । అపశకునంబులు పెక్కులుతోచూ । యెడమకన్ను భుజ
మదురు చున్నది । యేమితోచకయున్నది మనసు । కరకరమంటలు కడుపులోపల ।
హడలుచున్నది మనస్సనిపలికె । ఆపలుకులువిని శ్రీలక్ష్మణుడు । అన్నకుమ్రొక్కుచు
యిట్లనిపలికె । యుద్ధరంగమున మన శత్రుఘ్నుడు । యేవిధమున కనుచున్నాడో । యుద్ధ
రంగమున వుండిరిగనుకా । చిత్తం అటువలె తోచెనుమీకు । అయితె అయివుండవచ్చు
ననుచు । మరలిరి మనసున శ్రీరాఘవులు । భూదేవి నవముద్దుల మనుమన్ని । పువ్వుల
పానుపు పరుపైమ్రొగ్గె । అచ్చమల్లెలు పాన్పువలెను । ఆయువుజీవము అయినిలుచుండె ।
జానకిపెట్టిన అంగరక్షలు । యీవిధంబున జీవనమాయె । పడ్డబాలుని పాలిటికేగి ।
చూచెను శత్రిఘ్నుడు చోద్యమునా । కన్నులు బాహు కాంతులుశౌర్యము । ముఖమును
మనరఘుపతి బోలుతడు । ఇతడెవ్వడో మనకెరుగగరాదు । రాజిలీవులు కలిగున్నవిగా ।
మనపట్నానికి తోడుకపోయి । మహారాజుకు చూపింతముఅంటె । శాపమిస్తురో యీ
మునులందరు । ఆలోచించెను శత్రుఘ్నుండు । కొంతసేపు మనసున చింతించి । బట్టి
రథమున బెట్టుకొనెను । అయోధ్యకు తోడుకుచనుదెంచి । పట్నానికి బలివేయుండనెను ।
బలిపెట్టె బాలుడుకాదయ్య । పట్నముయేలు బాలుండితడు । పట్ణపు రాజని పలికేటివారు ।
మూకలుగూడుచు చూచెడివారు । మునికాంతలతో జానకీదేవి । వామనగుంటలు ఆడుతు
వుంటే । మునిసుతులు లవుని విధమంతా । జెప్పగవిని జానకిమూర్ఛిల్లె । కొంతమూర్ఛ
అంతటతెలిసి । యెంతోమంది శోకించంగదొడగె । పడ్డబాలుని పాలిటకేగి । గానక
వెతుకుతు కడుమూర్ఛిల్లె । కొంతసేపటికి కొమరుగ తెలుసుకు । శోకించి తలపొయ్యగ
దొడగెను । నీవలె ప్రేమలు నాపైనియిప్పుడు । యికనెవ్వరుగలరు నాతండ్రి । ముఖమున
చిరునవ్వు ముద్దులు కులుకంగా । ముఖము చూచావోయి మాతండ్రి । నీముద్దుముఖము
జూపాకపోయి నాతండ్రి । ఘనుడగ్ని మహిషిగ నన్ను పెక్కాడె । కారడవిలో దిగవిడిచె
మీతండ్రి । అష్టకష్టములు మరచి ముఖముజూచి । ఘనతపొందితినోయి మాతండ్రి ।

తురగమును దుటాను బిరుదులురాసి । భూమంతతిరిగిరమ్మని బంపెనోయి । వెరువక ఆ
విభుడి గుఱ్ఱమేల కట్టితివోయ్ మాతండ్రి । మనుజులందరు గూడి మునుపునాకొరకై ।
మనవిజెప్పిన వినడాయె నీతండ్రి । సురులు రాక్షసులు వారకిజెడిచేరు । మీరెంతకలరోయ్
మాతండ్రి । జనకూని అల్లుడుఅయిన శత్రఘ్నూతో । సీతాతనయుడ ననవద్ద ముద్దు
తండ్రి । దానవాంతకు డయిన రాము । తమ్మునితో పోరేల తండ్రి । దశరథ తనయుడు
అయిన శత్రుఘ్నుతో । జానకితనయుడ ననరాద మాతండ్రి । భానువంశమున శరణాగత
త్రాణ । బిరుదువహించేను మీతండ్రి । అనాడుకైకమ్మ అడవులకు బంపగ । ఆరావణుడు
చెరబెట్టెమాతండ్రి । ఆరావణునిగొట్టి చెరవిడిపించె మీతండ్రి । జనకూనిమారుగా నీయడ
వులలోను । మునినన్నుపోషించెను మాతండ్రి । ఆయజ్ఞతురగము అదిబట్టినీవు । ఏల
గట్టితివోయి మాతండ్రి । నేనలుకూర్చుకు శిశుహత్యలను । జేయతలచునున్నారు నీతండ్రి।
అయోధ్యవిడనాడి యడవులలోపలా । చంపిరమ్మని పంపె నీతండ్రి । మీరుగర్భమునా
కలిగియున్నారని । చంపకాదిగి విడిచేసి నాతండ్రి । మీరుగలిగినమీద యీమునులందరు ।
మిమ్ము పెంచీరోయి నాతండ్రి । తండ్రియేడనినన్ను బయపెట్టియడిగిన । తలయెత్తలేనైతి
మాతండ్రి । యెన్ననిలవుజూపు యేలాగుమరతును । యేమిచేయుదునోయి మాతండ్రి ।
అక్కటా దయయింత అయిననూలేదా । యేలాగుశిశువుని గొనిచనెనూ తండ్రీ । నాముద్దు
లయ్య బట్టియశ్వం గట్టివేలా । నిమిషమయినను నన్ను యెడబాయలేవు । యెట్లాబాసితివి
లవకుమారా । అతికష్టములు పొందితిగాని । ఆరునెలలు చెరనుంటినిగాని । రాముని
యెడబాసుంటినిగాని । యిట్టికష్టములు యెన్నడునెరుగా । దడదడ గుండెలు కొట్టుకొను
చునూ । మోదుకొనుచు నాజానకీదేవి । భూమిపైని బొర్లాడుచుసీత । కన్నీరు వర్షం కురి
పించుచును । కలకలకన్నులు మూయుచుచూచుచు । తనయుడారమ్మ తాబిలుచుచును ।
తనయుని పరగున మునికాంతలొచ్చి । బట్టలేరు ఆజానకినెవ్వరూ । పణతుల పాదమ్ముల
ధూలంతా । కప్పెను జానకిపైనిండెను । అతికష్టంబులు బడుతవేసీత । యెన్నిగారములు
జేస్తివేతల్లి । సింహవిక్రమా శూరులు యనుచు । యెన్నడుబలికితివే మాతల్లి । బాలలు
తిరుగాడుతు వుంటె । నవ్వుకొందుమే మాలోమేము । యెంతపుణ్యమె జానకిననుచు ।
జెప్పుకుంటి మెన్నడును మేము । నీవులేక ఒక నిముషంబైనా । ఋషిపల్లెలో మేముండగ
లేము । యాబాలుడు నీబాలుడుగాడే । వున్నవాడె నీతనయుడుసుమ్మి । యెన్ని
విధంబుల జెప్పినాగాని । యేడుపు మానవు జానకినీవు । తమపైజేర్చుకు తరుణు
లందరు । జానకిచుట్టు నిలుచుండిరిగా । మీరందరు ముద్దాడుబెన్నడో । తనయుడుతనదరి
కొచ్చుటెన్నడో । అంతదూరముననే అమ్మాయనుచు । ఆనందమున ఆడుచువచ్చి ।
అర్ధచంద్రునివంటిఫాలము । బాలురతోడి ఎవ్వరినికజూతు । బాలునికన్నా ప్రాణమెక్కువా ।

పట్టుకోకండని మీరనిబలికె । ఎంతధన్యురాలో కౌసల్య । యెంతపుణ్యురాలో సుమిత్ర । యెంతటిఘనురాలో ఆ కైక । సంకటలన్నిపై నెరుగరువారూ । జన్మజన్మముల కైనగాని । శతుృకోటికయినగాని । స్త్రీలకుయిటువంటి శోకమువద్దు । యకటా దైవము యెంతజేసెను । అణగత్రొక్కెనన్ను పాతాళములకు । నింతకొచ్చుట యెరుగనుతండ్రి । పెంచుతుంటి మిమ్ముల జూచుకుని । యేమిసేతు నింకెవ్వరుదిక్కు । యేలాప్రాణము నిలుపుదునయ్యో । ఇలపైజన్మించినదే మొదలు । సుఖమెన్నడెరుగను మాతండ్రి । అనేక యిడుములు బడితిని గాని । అగ్నిలోపల జొచ్చితిగాని । అరణ్యంబుల యుంటినికాని । ఇంతకష్టము యెరుగను తండ్రి । పగసాధించి బ్రహ్మదేవుడు । బట్టుకుపోయెర బాలుడానిన్ను । పణతులలో పాపాత్మురాలను । పాపపు కడుపున పుట్టితివియేలా । యడవిలో నాగర్భమున పుట్టి । అతికష్టంబులు బడితివి తండ్రి । బంగారుమేడలో వుండెటినీవు । పల్లెలోపల వుంటివితండ్రి । పట్టుపరుపుల పవళించెడినీవు । పారుటాకుల బవ్వళించితివి । యమృతాన్నములు భోంచేసేనీవు । ఆకులుఫలములు తింటివితండ్రి । అతిమోదమున పెంచితినిగాని । యింతవచ్చుట యెరుగనుతండ్రి । మునులుఋషులు మునికాంతలుగలరు । అయోధ్యరాజుల సుతులంపేను । రాజ్యమేలుదు రనుకొంటినిగాని । యాయువుజీవము లేదనియెరుగా । యంతట కుశుడుతానే తెంచి । తల్లిశోకము యెందుకోగాని । తమ్ముని జూడ దగ్గఅలేదు । పళ్ళుఫలములు పట్టుకువస్తె । పరుగుపరుగున ఎదురుగవచ్చు । అమ్మచూడు నేతెచ్చితి ననుచు । ఆనందముతో యమ్మకుయిచ్చు । ఈవేళను రాడేమోయనుచు । బెదురుతు అక్కడికివచ్చెను కుశుడు । దరినున్న మునికాంతలనడుగా । జెప్పిరిశత్రుఘ్నుని విధమంతా । అమ్మానీవు హడలనేటికే । యిక్కడలవుని యిప్పుడెతెస్తు । తల్లినీవు శోకింపగానేల । తమ్ముడులవుని క్షణమునదెత్తు । తెచ్చి నీయెదుటను నిలుపకయున్న । నచ్యుతులకు నేనుపుత్రుడకాను । ఆనాడు హనమంతు డిచ్చినాఆనవాలు । యంగుళీయం నాకీయవమ్మా । శస్త్రాస్త్రయుధంబులు జానకిదేవి । దీవించి యియ్యవే అమ్మరోయనెను । ఆపలుకులువిని జానకీదేవి । అప్పుడుబాలున కిట్లనిబలికె । వలదువలదు నీవెళ్ళగవలదు । నిన్నంపినేను నిలువగలేను । యెక్కడ బాలుడు యప్పుడే పోయె । యయోధ్యా నీవేమెరుగుదువు । నిన్ను చూచితే నిలవనివ్వరు । చంపకవిడువరు శత్రుపులంతా । యట్లనబోకుయమ్మరోనీవు । యతివేగమున తోడుకవచ్చెద । తిరిగి యింటికి రానివ్వరుతండ్రి । బలపరాక్రముగల బలవంతులువారు । పసిబాలుడు నీవేమెరుగుదువు । బట్టిదుంతురు నిమిషములోను । సాహసులనగా దశరధసుతులు । తమ్ముణ్నిచంపుట చూస్తివిగాదా । దయాశాలులుగా రెవరయినా । నిన్నుజంపక విడువరుతండ్రి । అమ్మాఅడలక యుండవే నీవు । ఇక్కడ కతివేగముగా వచ్చెదనమ్మా । యెన్నివిధముల జెప్పినాగాని । పట్టినపట్టు వదలవు తనయా । శస్త్రాస్త్రయుధములు జానకిదేవి । దీవించి

యిచ్చెను బాలునికపుడు । తల్లికి మ్రొక్కెను తనయుండపుడు । పాదములపైనున్న
బాలునియెత్తి । కౌగలించుకు తానూహడలె । ఆనాడురాములు నడవులకేగుతు । తల్లికి
మ్రొక్కిరి తగువినయమున । అడుగులపైనున్న తన తనయునెత్తి । హడలదొడగెను
కౌసల్యయపుడు । మయోధ్యలోపల నందరాదరించె । ఇక్కడయెవ్వరు తనకనిబలికె ।
బాలునక్కడకంపి యిక్కడ । తనకెవ్వరు ఉన్నారనెను । మునులు మునికాంతలు
మృగములెతోడు । హడలకబంపు మమ్మానన్ను । పులులుగలవు గోరాటవ్యడవిని ।
పదిలముగ పోరా నాతండ్రి । రధం వెంబడి జాడచూచుకొని । జాడలనడపర తనయుడ
యనెను । అక్కడ సాకేతపురి యెట్టిదియనను । అడుగుతు వెళ్ళర తనయుడనీవు । మన
సున ధైర్యముజెందినా జానకి । భూమిదేవివో యాకాశంబా । పుత్రుడునుమ్మీ మీకందరికి ।
జయమునీక నీజానకప్పుడు । దీవించి బాణంబులుయిచ్చె । తల్లియస్త్రాదీవనలు పొందుచు ।
యక్కడకదలెను బాలుండపుడు । బాటసారుల దారియడుగుతు । రథజాడల వెంబడి
నడచుచు । తమ్మునికన్నుల జూతునుయంచు । యడయడ బలుకుతు మతిదలచుచును ।
చనినడచెను దేవతాగృహంబులకు । ఇదిసాకేతపుర మిచ్చట లవుని । యేవిధమునసే
పొందుదునయ్యో । అంతలోనే నొక యంగనవచ్చి । ఆపురిలోపల . చిత్రకాంతలు ।
అయోధ్యలోపల యాడువారందరు । చుట్టూచేరి కుశుణ్ణి జూచిరి । బాలుడు యితడిదో
అతడినిబోలు । తేజముచూచితే రాజువలె యుండె । యెంతచక్కనివాడె కొమ్మా ।
సీతా సుతుండితడౌనోయమ్మా । జానకిసుతుడు యితడైతేను । జలముపోసే బాలుడు
యెవరు । యనిపలుకుచు యతివలందరు । మూకలుగూడుతు జూచిరివారు । యేదేశముర
బాలుడనీది । ఎవ్వూరునుంచిక్కడి కొచ్చితివి । యెవరిబాలుడవు యేలవస్తివి । కార్యము
లేమిటి జెప్పరయనిరి । అయోధ్యదశరథ రాఘవుల । యశ్వమేధము జూడగావస్తి ।
యశ్వముబట్టిన బాలునిబట్టి । నయోధ్యకు తోడుకవచ్చెరు । బాలుడిజాడలు జూచుట
కిపుడు । పరుగునవచ్చితి నేననిబలికె । అల్లదుగో జూడుమి బాలుండు । యభిషేకపు
జలములు నిలిపేరు । ఆబాలుడు నీవు యేమౌదువుగా । యిరువురొక్క పోలికనున్నారు ।
యన్నదమ్ములు యపుడుమేమూ । ఆదరింపవలె మీరందరును । మీతల్లిదండ్రులు యెచట
నుండిరి । బాలుడొంటిగ వస్తివియేమి । తమ్ముని జూపించిన తరువాత । మావృత్తాం
తంబు జెప్పెదమీకు । యదుగోమంధర బిందెలుముంచెను । వేగంబుగనూ వెళ్లరతండ్రీ ।
పరుగునబాలుడు వెళ్లగజూచి । వలవలకన్నీ రొడ్చిరివారూ । ఆణిముత్యములు రాలిన
యట్లు । కనులజలములు గారుతుండగనే । బిందెయెత్తి మోకాటినుంచిన సమయమందు ।
బిందెత్తెదనని జేరవెళ్లెనూ । యాదరించవలె యమ్మరోమమ్మ । మేమేరవికులమందున
బుట్టితిమా । మాదశరథ కోడలు పతివ్రతయైనా । కౌసల్య వ్రతములు నిజమేయైన ।

మాజానకికడు పతివ్రతయైన । సంగతి సముద్రమొప్పగదాటి । నాకపి మీటిన యుంగర మైనా । నన్నుజేరియే తెంచుచుయందున । బంధమునున్న బాలుకులేచు । యనిసంగు శ్యంబు యందులోవిడిచి । బిందెయెత్తి మంథరకపుడు । గిరులుమీద పడ్డభంగిని । మొయ్యలేక తడబడెనప్పుడు । సింహాద్వారము కడకేతెంచి । తిట్టుకొనుచు చను దెంచెను తాను । దుష్టపుజీవము గష్టపుజంతువా । పట్టుమని యుదకం పైబడపోసె । నంగుళ్య యుదకంబు నతనిపయి సోక । హాయని శ్రీయని నతడేలేచే । అంగుళ్యమందుకొని వేల ధరించుచు । నాల్గుదిక్కులు జూచెనురాజు । తన్నుచేరినా దానవనాలిని । కరచరణంబులు గొబ్బునద్రుంచె । చుప్పనాతిని చీరినట్టుగా । చీరినాడు మంథరనప్పుడు । బలిబలి మంథర బలిమాపురికే । సురులుమంత్రులు ప్రధానులును । జూచుచువుండిరి చోద్యంబుగాను । ఆడదానినే చంపితినియనుచు । వంశాచారం తప్పకుండగను । నిలిపితీననుకొండి మీరనెను । అన్నదగ్గరకు తానేతెంచే । తలవంచుకు కన్నీరుతెచ్చె । ఆవుకోసంబు లేగబంధము । యాతెరవాయెను యన్నరొ బ్రతుకు । అమ్మని కారడవిలో విడిచి । వొంటిగవస్తివ అన్నరోయనెను । తల్లిని యాకారడవిలో విడిచి । వొంటిగవుంచి రాలేదనుచు । అక్కడ మునులు ఋషులు వుండిరి । మునికాంతల కప్పగించితిని । ప్రాణవల్లభుడయిన శ్రీరాఘవుడు । సతికారడవుల చంపబంపెను । పతిబాసిన దుఃఖములువిడిచి । మనల జూచుకొని మరిచెను అమ్మ । అన్నా యిప్పుడు అమ్మను వొంటిగవుంచి । యిక్కడ యుండుట యుచితముగాదు । అమ్మవొంటిగా యడవులలోపల । యెట్లహడలుతు వున్నదో యనెను । హయము విప్పుకు నతివేగమునా । మనయమ్మకడకు బోదామని పలికె । హయముశాలకూ ఏగుతెంచెను । తొల్లిటి యశ్వం గురుతుగా జూనె । నక్కడ లేదాయెను ఆయశ్వం । అక్కడక్కడా తిరుగుతుబాలలు । యశ్వంబును వెదుక చుండిరీ । యన్నరో యిక్కడ వున్నదియశ్వం । యతివేగంబున రమ్మనిపిలిచె । తోరణ స్తంభంపై తరువెక్కె । అశ్వంవిప్పిబాలుడుదిగెను । లేడాయీపూరను లేడారాజు । రాడా మాతో యుద్ధంబులకు । సాటిలేనివాడా యితడూ । సేవలేకతా రాడాయనిరి । చాలలేకతా రాడాయితడూ । న్యాయంలేకారాడా యనిరీ । వాదముకైతె మేమున్నారము । రమ్మనుమా తోయుద్ధముకు । రాజయితే యుద్దానికి రావలెగానీ । మూలనేదాగున్నాడనిరీ । వారూపతిలేని సతిచందంబుగను । దాగియుండుటకు కారణ మేమీ । మంథరచచ్చినమరివార్తలును । జెప్పమనిరీశత్రుఘ్నునితో । దినవారంబులు చేసుకొమ్మనీ । జెప్పమనిరీ వొప్పుగరాముడికి । ఘణఘణఘణఘణఘంటారవములు । కనకంపుగంటలు ఘల్లనిమ్రోయా । యశ్వమున్ను వొకచోటనునిలిపి । అయోధ్యంతా చూచిరివారు । ప్రాసాదంబులు పెక్కుమద్దంబులూ । బిద్దలుకొట్టిరి బాలులుతమలూ । అందమైనమణీరత్నంబులు కొన్ని । నక్కడక్కడను

పారవైచి । కయికనగరుకేతెంచి గర్రిక్కునా । మేడలపైని ఆడిరివారు । సకలవిధంబుల సందడిచేయుచు । కేకలువేయుచు ఆడుతువుంటే । పట్నములోపలి ప్రజలందరును । అతి యాశ్చర్యంబున చూచుచువుండ్రి । నగరిలోపల స్త్రీలందరును । నిర్ఘాంతపడి నిలు చుండిరిగా । మునికాంతల బాలలువీరనుచు । మాట్లాడితె శపింతురనుచు । వీరులు శూరులు బలవంతులంటా । పూరికెజూచుచు ఉండిరివారు । అతివేగంబున పోవలెననుచు । యెప్పటి తమ నిజపల్లెకు జనిరి । జానకిసుతులు అదుగోయనుచు । మునికాంతలుజెప్పిరీ సీతమ్మకును । అమ్మలార తనకంతటిభాగ్యమా । తనయుతోడగతి గలుగునతనకూ । వొంటిగబాలుడు వచ్చెననుచును । యెదురుగ వచ్చెను యశ్వముతోడుకు । ఆడిబాలలు యిద్దరువచ్చిరి । తల్లిజేరి ఈతనయులు మ్రొక్కిరి । యెల్లఋషులు కాంతలు దీవించా । వచ్చిరి వనములకు విచ్చలవిడిగను । మచ్చికకడు హెచ్చరికలుగును । యెదురుకయ్యము నకు యే తెంచిరిగా । మగుడియుద్ధంబుకిమళ్ళిరివారు । యెప్పటికదళీ వృక్షంబుల గట్టిరి । మంథరచచ్చిన మరివార్తలను । జెప్పిరిసేనలు శత్రుఘ్నుడికి । ఆపలుకులువిని హంకారం బున । వచ్చెనుశత్రుఘ్నుడు వాదముకు । అజాహ్నవీతీరమందునా । యన్నాతమ్ముడు వొకజట్టయిరీ । పంచశరంబులు బహుశంఖంబులు । దేవదత్తములు ఘుమ్మనిమ్రోయా । యసురులగుండెలు యవిశటురావా । శశిముఖలు యుద్ధంబునకు జనిరి । కోరిక యిప్పుడు ఘోరయుద్ధము । చింతించకను చేసిరివారు । లవకుమారుని లావణ్యముచే । చేకొనినపుడా చాపముద్రుంచె । జానకిపుత్రుడు జయవీరుండు । దిక్కులేక దివాకరు ప్రార్థించె । ఉదయ భాస్కరా సకలగుణాకర । సహస నమస్కారంబుల బలికె । మెచ్చిప్రభాకరు డిచ్చిన వెనుకా । యచ్చుతుని పుత్రుడు నందరినేసే । కాలాగ్ని మిడతల చందంబునా । లవరాజు చేతను గూలిరివారు । శత్రుఘ్నుడు లవుని చేతను । త్రుళ్లెను జగములు తల్లడమందె । మూకమామిడి చందంబునను । గిరివలెగూలెను శత్రుఘ్నుడు । శౌర్యశాలి శత్రుఘ్నుండు । గూలెనని గోవింద గోవిందాయనిరి । ఆప్రాంతంబున ఆడేటిబాలులు । గోవింద గంతులు వేసిరివారు । అప్పుడు ఫణిహార్లు తమపురికేగి । జూచితెపాళియము లేదుగాని । జేసే కయ్యము జెప్పగలేము । సూర్యవంశా రాజులవలెను । జూడగ మీవలె యున్నారు । మమ్ములబోలే వాడిందెవరని । మండుచులేచెను భరతుండపుడు । పోయెద రణభూమికి నన్నంపరే । పోయెద యింద్రాదుల తోడైనా । చొచ్చెద యమపురి నెంతదైనను । తెచ్చెద ననుజుని తురంగములతోను । భరతుడు పంకజమూర్తిసుతులపయి । పదికోట్ల రణభేర్లను వేయించె । దానినిగాంచి సైన్యమపుడు । గారలుబూరలు టమటమ్మలను । ధవళశంకులు తాళపజోళ్లు । వెండిరథంబు కంచుయీటెలు । వెండాయుధంబులు భమిడికత్తులు । కురుచ ఈటెలు గొప్పకత్తులు । బాకుల్ బెత్తులు బల్లెంబులును । నాగస్వరంబులు చిరితాళములు ।

[illegible]

తీర్లై నవినది పెక్కాంబులును । ఈట్లుతుపాకులు వెల్లగొడుగులు । వింజామరలు విసరగ నప్పుడు । రథమెక్కెను భరతుడు వేగంబునా । పదికోట్ల రాణువతో గదలుదురు । వాన రంబులు సేనలుగూర్చుకు । వచ్చెను భరతుడు వాదంబునకు । యల్లంతటవచ్చె భరతుని జూచి । యన్నకు తమ్ముడు యిటులనిబలికె । అన్నరో ఆవచ్చేవారెవ్వరు । యితడెర భరతుండనగాను । యన్ననువదినను యడవులకంపి । యెన్నగ రాజ్యం బేలినవాడు । యితడే భరతుడనగాను । సతివరమడిగి పతిని జంపించి । సుతుల నడవికంపెనుకయికా । కయికసుతుడితడేరా యనెను । నంది గ్రామములో వున్నచందము । పావాలూ తొడుక్కోకుండాను । పావాలూ గుత్తకొన్నట్టి । ప్రతాపమూర్తి యితడౌనోరి । ఆపలుకులువిని భరతుండప్పుడు । యతివుగ్రుడై యిట్లని పలికె । యేమిరా బాలుడా యితిహాసములు । ఎగ్గులేక వాక్యంబులెన్నేవు । యేమేమ వాక్యంబు లెన్నేవో । యద్భుతంబుగ తెలుపర యిందరివో । గర్భిణీ స్త్రీయని కటకటమనకా । వధియించ వనములకంపితిమా । సతి వరమడిగ్గి పతిచంపించి । సుతులనడవికే పంపించామ । మాయన్నను వదినను యడవికి బంపి । ఎన్నికతో రాజ్యంబు నేలితిమా । పావాలు తొడుక్కోకుండా । పావాలు గుత్తా గొన్నామా । తల్లివరమడిగి తండ్రిజంపిన । అదేతగుననుచు రాజ్యమేలితిమా । యెగ్గులైన పనులను యేమిచేసితిమో । దేటపఱచ తెలుపర యిందరిలో । యనవిని కర్ణకఠోరం పలుకులు । విన భరతునికి కతివేడ్కయిదోచె । పొలుపుగ విప్రుని పోటులకంటె । లేశ మగు కప్పలకాటుకథలనూ । సిగ్గులేక వాక్యము లాడితివీ । సిగ్గులేక మేముచేసిన నేరము । యెగ్గులెంచకా తెలియరనీవు । నీవంటి వాడిక్కడిక్కడా । మిక్కిలి గాంభీర్యములతోను । యెక్కువ జంకారములతోను । యెక్కువైన పలుకులు పలికాడు । గూలినాడు యటుజూడ మని పలికె । పడ్డచందము జూడుమని బలికె । పడ్డతమ్ముడిని పాలిటికిపోయి । మూర్ఛిల్లెను భరతుండప్పుడు । కొంతమూర్ఛ కడుఅంతట । తెలిసిశోకించి వాపోవ దొడగె । లాగులనడికట్లు యటువిడిచి । యిందుకూలితివా తమ్ముడ । కార్యక్షత్రియా ధర్మంవిడిచి । యిందుకూలితివా తమ్ముడ । ఓరదీసిన కత్తులుయటువిడిచి । యిందుకూలితివా తమ్ముడా । అన్నా మాకోసము యజ్ఞంజేసెనా । మరపురాదు తమ్ముడాయనెను । మనతల్లికయికమ్మ మన్నింపచేసెను । మరపురాదురా తమ్ముడా యనెను । లవణాసురుని కొట్టినశౌర్యము । యెక్కడికి పోయెర తమ్ముడానీకు । యిటువంటి బాలులచే గూలుటకు । యిట్లురాసెనా ఈశ్వరుడనెను । సేనలురాణువ లేకపోయిరా । నీవేకూలితివా తమ్ముడా । అనుజుడనిను వంటిగ బంపినందుకు । అనుభవించక తీరదుఅనెను । అని పరిపరివిధముల శోకింపగా । పకపకనవ్విరి బాలలుతమరు । యుద్ధరంగమున కూలినవారికి । యిటువలె శోకింతురర యనిరి । యిందులకేమి యుపాయంబనెను । పన్నీరుతరవుల తెప్పించి । పవ

ళించబెట్టెను శత్రుఘ్నుని । ఆయుధంబులు చేతబట్టుకు । వచ్చెను భరతుడు వాదంబునకు ।
అరవయికోట్ల యశ్వంబులను । యిప్పించెద మాఅశ్వమునిడువు । యిప్పించే వాడెవడు
రావోరీ । హయము యెవరికి పాలిచ్చునురా । గాబులనీళ్ళకు పట్టించెదవా । కాకున్న
మీతల్లిగనర । తల్లులాతలపా నీవెవడవురా । తగదురబాలుడ నీకనిపలికె । కడుపతివ్రతలు
మీతల్లులనగ । తలపనెవ్వారీ తరమానోరి । సతివరములచేత పతిజచ్చేను । పతిజంపిన పతి
వ్రత తనయుడవు । భరతుడనగ కడుప్రతాపశాలి । చిన్నలుగొప్పలు లేవగననెను । చిన్నలు
చేతులు గొప్పవారికాళ్ళు । పట్టుకోవలసిన వాడవునీవు । డీకొనిబాలుడు దిక్కులుచూచిరి ।
చనిభరతుడు వారలకిటులనెను । వోరీమీరు వరుసగపిన్నలు । బాలలుతొందర యెందుకురా ।
హయమువిడిచే మాసాకేతపురంబుకి । యేతెంచండి మాయాగముచూడ । కమ్మనినెయ్యి
కందిపప్పులు । యారగింతురు బాలురరండి । ఆపలుకులువిని యాబాలలు । చిరునవ్వునవ్వుతు
యిట్లనిరీ । మహారాజశ్రీ భూమండలాధిపతియో । పుండరీకాక్షుండు యజ్ఞంబుచేసె । దధిఘృత
మధు సూపంబులతోను । భుజియించగలిగెను మీకనెను । పేరిననెయ్యి పెసరపప్పులు ।
భుజియించకలిగెను మీకనియెను । దంతపు చందుగులు తాళ్ళపుజోళ్లు । ధరియించగలిగెను
మీకనియెను । ధనముపెట్టెలు తగువస్తువులు । సందడితిరుగుతు వుందురుమీరు । మీరన్నా
మామనవి వింటెను । మీవాక్యములు చెల్లించితేను । అయ్యోధ్యేలా గలుగుమీకు । అన్ని
మీవయి వుండునుయనిరీ । అన్నయాలినీ అడవులకంపి । అతిభోగమున వుండిరిమీరు ।
జున్నులు వెన్నలు పాయసంబులు । పాలుమీగడలు భక్షింపుచును । అరమరలేని యన్ని
సకలములు । యేకహంసకల వారలుమీరు । నొక్కమాట కలవారామీరు । ఆపలుకులవిని
భరతుడప్పుడు । యతియుగ్రుడై యిట్లనిపనికె । యింతసేపు తడవాయెకయ్యము ।
పట్టరబాలుడ బాణంబనెను । యెక్కుపెట్టి బాణంబులుతొడిగి । చక్రధరుడీ తనయులపై
వేసె । తొడిగిన బాణము విడువనుమళ్ళి । దలచుకొండి మీయిష్టదైవంబులను । దైవాలను
దలచపనియేమి । దైవాలకు పుత్రులంమేము । సమతుల్యులమై వుండగను । దైవము
లడ్డం వస్తురాయోరీ । వోహోహో వనదేవతలార । వొప్పుగనిలువవి బలిమాయెదుట ।
మట్టియుంటలు బాణంబులాయెను । మరిమరిబాలులు తమరేవేసే । ముందర సేనలు
అడ్డంబుతోను । అంతట కుశుడప్పుడువేసే । గుప్పించిన ముందర భరతుడువెయ్యగను ।
అందరితా లవుడప్పుడు వేసే । గుప్పించిన భరతుడు మూర్ఛిల్లె । మూకమామిడి చందం
బునను । మూర్ఛిల్లెను కడుచమటలుబట్టి । బాహుపరాక్రము భరతుడు గూలెనని ।
గోవిందా గోవిందా యనిరి । భరతుడు పడగా పకపకనవ్వుతూ । అన్నకుతమ్ముడు యిట్లని
పలికె । యిక యిరువురె యున్నారయ్యోధ్యలో । రామలక్ష్మణులు వారలుయనిరి । ఆకట
ప్రాకటములను జేయుచును । రఘుకుల శరముల రంజిలగొట్రీ । యిట్టివిధంబున పెక్కు

నేనల । సృక్కణచెను కుశుడతి సంభ్రమున । యున్న నేనలు మూకలుపోయి । విన్న
వించిరి రాజుకీతాము । యేమని జెప్పుదుమయ్యా వారు । బాలలంటే బాలలుగారయ్య ।
పదునాలుగు భువనములలోను । బాలలవంటి శూరులులేరు । యక్షకిన్నర గంధర్వులకైన ।
సిద్ధసాధ్య కింపురుషులకయినా । యింద్రచంద్ర మహేంద్రులయిన । యిట్టి పరాక్రము
చూడగలేదు । మాయాబలముతో మంత్రబలముతో । మందులుకలవో తెలియదు మనకు ।
నరులుకారు వానరులుకారు । సురులుకారు యసురులుగారు । చూచితెచ్చిన్న బాలలుగాని ।
చేసేకయ్యం చెప్పగలేము । అతిసాహసులు బాలులిరువురు । కయ్యంచేసి భరతుని కూల
వేసిరి । వినిమూర్ఛిల్లి శ్రీరాఘవులు । కొంతసేపటికి తెలిసిట్లనెను । శరములశంకర మహి
మోగాని । తరచుగదానవ మాయయోగాని । భరతశత్రుఘ్నుల కూల్చినవారు । పరాక్రమ
శాలులు వారనిబలికె । సూర్యవంశ రాజులవలెను । జూడగ మీవలెను యున్నారూ ।
మమ్ములబోలిన వారింకెవరో । వెళ్ళరసౌమిత్రి వాదముకి । ఆపలుకులువిని శ్రీలక్ష్మణుండు ।
వారికిమ్రొక్కి తానిట్లుబలికె । పిచ్చికపిల్లపై బ్రహ్మాస్త్రములా । పసిబాలలతో కయ్యం
బేలా । యెరుగనిబాలలు తెలియనిశౌర్యము । యెందుకురాఘవ మనకనిబలికె । పిచ్చికలు
పైచంద్రాయుధము । శౌర్యము నోపగ యేలనిమనకు । యాపలుకులువిని శ్రీరాఘవులు ।
యతివుగ్రంబున యిట్లనిబలికె । తాబోయి సంహరించెదను । యయోధ్యలో యుండర
నీవనెను । బాలుల జంపుట బ్రహ్మయజ్ఞమా । వొంటిగ నేనే సంహరింతును ।
వేలురాణువా యెందుకు యనుచు । వొంటిగాను వెడలెను సౌమిత్రి । యారు
కోట్లరాణువజతకూర్చి । తయినాతిగ బంపించెనువారిని । ముందర సౌమిత్రివెనుక
సేవకులు । ఋషిపల్లెకు చనుదెంచిరివారు । యల్లంతట సౌమిత్రినిజూచి । యన్నకు
తమ్ముడు యిట్లనిబలికె । యన్నరో ఆవచ్చే వారెవరు । యతడేరా సౌమిత్రనగాను ।
యన్నకు తప్పని తమ్ముడుయితడు । సత్యవాక్యములు దప్పనివాడు । యితడురాసౌమిత్రన
గాను । అమ్మనునాడు యడవిలోవిడిచె । మనలనుగాచిన మన్మధుడితడా । శరణు
జొత్తమాశ్రీలక్ష్మన్నకు । కయ్యముజేతమ యన్నరోయనెను । శరణు లక్ష్మణచెంతకుజేరి ।
యశ్వంబునువూరికె విడచెదమా । యటుమీదట కయ్యముజేతముగాని । వూరికెయశ్వము
విడువగవలదు । శ్రీలక్ష్మన్నకు చేరిమ్రొక్కెదమా । వుచితముగ వూరుకోవలదు । నాలుగు
పడికట్లు యటువిడిచి । వారతీసిన కత్తులటువుంచి । సౌమిత్రినిచేర వచ్చిరివారు । భక్తితో
ముమ్మారు ప్రదక్షిణంచేసి । పాదంబులపయి వొరిగేవారు । యడుగులపయి యన్నతమ్ముల
నెత్తి । దీర్ఘాయువుగమ్మని దీవించి । కూరిమితో గూర్చుండబెట్టుకు । మాడపట్టు యాఘ్రా
ణించుకొని । మరికన్నుల జలములు తెచ్చి । సౌమిత్రి కన్నుజలముతోడ । సౌమిత్రికి
పాదములుబడిసె । వరుసతో మమ్ములచూడవచ్చితిరా । వదినెను కొంపోవ స్తిరామీరు ।

యేమిపనులకు యేతెంచితిరో । యెరిగించండి మాకనిపలికె । అపలుకులువిని శ్రీలక్ష్మణుడు
యతిదుఃఖంబున యిట్లనిపలికె । మమ్ముగన్న మాతండ్రులార । వనములలోన దాగి
యున్నార । అయోధ్యరాజ్యం మేమేలగను । అరణ్యంబుల వుంటిరమీరు । ఆభోగములు
మేమనుభవించితె । యతికష్టంబులు బడితిరిమీరు । మమ్ముగన్నా మాతండ్రులార ।
మిమ్ముచూడ మాకుకన్నులులేవా । అయోధ్యరాజ్యం మీరేలగను । మిముజూడకన్నులు
లేవయ్యమాకు । మిమ్ము యడవులా పాలుచేసినా । పాపాత్ముండ నేనేసుమ్మి । యాకులు
యలములు నములుతుసీతా । యతికష్టమున మిమ్ములపెంచె । పండ్లుఫలంబులు భక్షింపుతును
ఈరీతివున్నారమీరు । వలదువలదు శ్రీరాముతో వాదము । గెలువలేరు సుమ్మి బాలలుమీరు ।
అయిదేళ్ళనాడు యతడయినా । కౌశికు యాగము కాచెను అతడు । నొకబాణముతో
వాలినివేసె । సుగ్రీవునిగాచిన సుగుణుండు । యాతనితో పోరగయెవ్వరితరము । రాక్షసాంత
కుడు రాముడుయనెను । రణరంగంబున నిలువగలేరు । యెందుకు హయము విడువం
డనెను । వెరచియశ్వం విడుచుటకంటె । వెరవకప్రాణము విడుచుటమేలు । చన్తేహరిచే
చావగవలెను । వుంటేయయోధ్య నేలగవలెను । పోతేహరిచేతిలోనే పోయెదము । స్వర్గ
లోకంబులు మాకునుగలవు । యుంటే యయోధ్య వుచ్చుకొందుము । వూరికె యశ్వము
విడువము యనిరి । అచ్యుతునకు మేము పుత్రులమైతె । అయోధ్యరాజ్యము మేమేలు
దుము । యనితనయులుబలికిన బలుకులనువిని । లక్ష్మణుడు వీనులమూసె । యెవరు
రామమూర్తికి పుత్రులు । ఆసత్యావతి దనయులుమీరు । అపుడురౌదురని శరణటువుంచి ।
దీవించివారికి శరములుయిచ్చె । అయోధ్యరాజ్యం మీరేలుదురు । సందేహములు లేవని
పలికె । అందర్నికూలగ వేసినవెనుక । మమ్ములగూడ వెయ్యండనెను । మిమ్ములగూల
వేసిన వెనుకా । అశ్వంగట్టుకు పోరగనేలా । మిమ్ముగూలవేసిన వెనుకా । రాములతో
రణకయ్యమేలా । అయోధ్యేలా రాజ్యంబేలా । యెందుకు మాకిక యివి యన్నియును ।
సుతులచేతిలో స్వర్గముకలదని । జెప్పినమాటలు శాస్త్రంగలదు । అన్నవింటె మాకప
కీర్తౌను । వూరిబాణంబున వెయ్యండనెను । అల్లంతట హరిసేనలుచూచి । అదురుతుబెదురు
తుయిట్లని బలికె । శ్రీరాములు సేనలువచ్చారు । హరితోసందేహమ్ములు పన్నుదురు ।
అన్నతో నేరమ్ములు చెప్పుదురు । అవతలి కేగండని తాబలికె । తొడపయివున్నా బాలల్ని
దీవించి । చక్కనిచెక్కిళ్ల ముద్దుల్ బెట్టి । సరగునబాలల నావలికంపి । సేనలకెదురుగ
వచ్చెనుతాను । అంతటసేనలు వేగమేపోయి । యీలాగును నడికట్లు బిగియించి । వరదీసిన
కత్తులుచేబట్టి । యెదురుకయ్యముకు యేతెంచిరిగా । బాలలుబాణంబులు బట్టగను । సంతో
షించెను సౌమిత్రిపుడు । మనసమ్మతమున మనరాజ్యమ్మున । యిటువంటి బాలలచూడ
గలిగె । స్వర్గమునకు మమ్ములబంపి । తద్దయరాజ్యం యేలగగలరు । వీరశేఖరుని తన

యులువీరు । వీరులుశూరులు అతిసాహసులు । పదిలముగానే బలములనడచి । పట్టభద్రుని వంచనచేస్తు । రాముతనయులు రాజ్యమేలగా । వైభోగములు చూడగలేడు । శ్రీరాములకు పట్టముగట్టి । చూడగవలెననె దశరథరాజు । కోరికలు యెంతచెల్లెనో । తమకోరికలు అంతేచెల్లు । బాలురకయ్యముకన్నులజూచి । పరిపరివిధంబుల సంతోషించె । వుత్తరదిశ ప్రాంతముననను । వుత్తరముఖమై దేవరవారు । వుత్తరప్రాంతమ్మున వెయ్యగను । దక్షిణ ముఖమై నిలచెనుతాను । దక్షిణప్రాంతంబున వెయ్యగ । తూరుపుముఖమై నిలిచెనుతాను । తూరుపుప్రాంతమున వెయ్యగను । పడమట ముఖమై నిలిచెనుతాను । బాలురు బాణము లెత్తివెయ్యగా । వూరకచూచుచు తానిలుచుండె । తనచేబాణముపట్టగ లేదు । తనయుల మీదను వెయ్యగలేదు । తగిలేటిపోటుల కోర్వగలేదు । తప్పించుటకు అలసిపోలేదు । అటుయిటుతిరుగుతు సందడిచేయుచు । ఇదిగోబాణము వేసెదననుచు । నరపురప్రాంతమ్ముగ వెయ్యగను । గూలెను సౌమిత్రి లవునిచేత । లక్ష్మణుడుగూలిన గూలెనువిల్లు । గోవిందుని తమ్ముడుగూలెనని । గోవిందా గోవిందాయనిరి । అంగదహనుమంత సుగ్రీవులును । పడతులుకదలగ పవిళించిరిగా । ఆసౌమిత్రిగూలిన వెనుకా । చక్కగతిరిగి సేనలుచూపు । అక్కడహనుమంతుని పొడగాంచి । అన్నకుదమ్ముడిట్లనిపలికె । వనచరములంటె అమ్మకు ప్రేమా । కట్టుకుపోదమ అన్నరో యనెను । అన్నాదమ్ములు యిరువురుచూచి । వీపుల మూపుల పెట్టుకుచనిరి । అల్లంతట తమతల్లినిజూచి । అప్పుడుతనయులు యిట్లనిబలికె । అయోధ్య దశరథ రాఘవులు । అశ్వమేధయాగం చేశారు । యా యశ్వమును బట్టుకు మేము । కడుయిడుములు పెట్టిస్తిమేయమ్మ । భరతశత్రుఘ్నుల సేనలతోను । సౌమిత్రిని గూలవేశామనిరి । ఆ పలుకులువిని జానకిదేవి । మూర్ఛపోయెను అప్పుడుతాను । మూర్ఛ తెలిపిరిబాలలప్పుడు । ముందరనిలిపి యిట్లనిబలికె । బాలలంటెమీరు బాలలుగారు । పిన తల్లికి శోకము దెచ్చారు । బాలులార మిమ్మేమన వచ్చును । వూర్మిళతోయేమని జెప్పు దును । యనేక యిడుమలబడి లక్ష్మణుడు । యడవులలో మమ్ముల రక్షించె । యటువంటి లక్ష్మణునేలవేస్తిరి । అజ్ఞానులుమీవలె యెవ్వరు కలరు । యెంతసుజ్ఞానుడుసౌమిత్రంటె । మీరుగర్భమున కలిగియుండగా । చంపకవిడిచిన చతురుండతడు । మనపయిప్రేమను మరికలవాడు । మనవిజెప్పి దోడుకరారాద । సుతులార మిమ్మేమనందును । సూర్యారాధన జేసెదనేను । పట్టెడు పసుపుబట్టుకొని । గ్రక్కునగంగాస్నానంజేసి । దశరథపుత్రుకె దుర్దో షములు । రాముతనయులకేదుర్దోషము । లేకుండ చల్లగవుంటె । ఆరుపుట్ల ఆవునెయ్యినీ । అఖండజ్యోతైనాపెట్టేను । జపమాచరించెను జానకితాను । యప్పుడు ఫణిహార్లుపురికేగి । హంకారంబునయిట్లనిపలికె । ఏమనిజెప్పుదు మయ్యామీకు । జెప్పనలవికాదుమాకనిరి । చలబట్టు రణకయ్యము చేసి । బాలలు సౌమిత్రిని గూలవేసిరి । యా పలుకులువిని

శ్రీరాఘవులు । అతియాశ్చర్యంబున యద్భుతపడెను । సౌమిత్రేమి గూలుటేమి । సౌమిత్రయితే గూలినవెనుక । యుగములు జగములు నొక్కటికావా । సౌమిత్రేమి కూలడమేమి । సౌమిత్రయితే గూలినవెనుక । సూర్యచంద్రులు యెదురుగానడచు । ఏడుసముద్రములు ఏకముగావా । ఎక్కడిమాటలు అనితాపలికె । అంతట ఋష్యశృంగుడువచ్చి । చింతబాపి శ్రీరాములకిటులనె । మనముండగ వారికి మరణములెక్కడ । వరుసగనివి మూర్ఛలుకాబోలు । వొంటిగ సహించగ లేకామిమ్ము । రణసహాయం రమ్మన్నారు । అంతటిమాటే నిజమనిబలికె । బోయెదరణభూమికి నన్నంపరే । పోయెద యింద్రాదులతోనయిన । జొచ్చెద యమపురి యెంతదయినాను । తెచ్చెద యనుజుల తురగముతోను । పోవోయి యంగదుడ నీవు । నీవుబోయి స్వర్గలోకమునకు । గరుత్మంతుని యతిశీఘ్రముగ । అలంకరించి దోడి తెమ్మనెను । ఆపలుకులువిని యంగదుడప్పుడు । స్వర్గలోకము తానేతెంచి । హరియాజ్ఞాయెను అని తాబలికె । వడిగారెక్కలు విసరుకొనుచును । వచ్చెనుగరుడుడు వేగముగాను । మూపురంబునకు ముత్యాలుజుట్టిరి । హంసనైన అంబారులుగట్టిరి । పచ్చని రెక్కకు పట్టుగట్టిరి । మెచ్చగచప్పుడు రెక్కలూను । కాళ్ళకు కనకపు గొలుసులువేసిరి । నడుమున నవరత్నములు మెరయ । ముక్కుకు ముత్యంబులు స్థాపించి । మూడుకోట్ల దేవతలేతెంచిరి । అందమయిన హవుదావేయించి । కూర్చుండిరి కిన్నెరులందరును । గరుడఖేచర కిన్నెరవానరులు । కింపురుషాదులు నారదమునులు । రంభపూర్వసులు నాట్యమాడగా । మేనకాదులు మేళములుచాయ । నారదుడు వీణమీటగను । తుంబురులూగానము చాయగను । కిన్నరుల్ పాటలుపాడగను । గంధర్వులా క్రమము తెలుపగను । కిలకిలకిలకిల చిలుకలుపలుక । హంసలు ధగధగ నడకనేయగా । మయూరంబులూ మాటలాడగా । మరాళంబులు మరుధ్వనిచాయ । యంజలిజేయుట ఆటలాడుచు । ఘల్లుఘల్లుమని నృత్యంచేస్తు । యందరుతిన్నగ సవరించి । యలంకరించిరి ఆవాహనము । అయోధ్యకు తోడుకవచ్చిరి । దేవర యిదిగో తెస్తిమియనిరి । యాపలుకులవిని శ్రీరాఘవులూ । హనుమంతుని పిలిపించి వేగమునా । యంతఃపురమునకు వెళ్ళియపుడు । యచ్యుతులు పైనముయని జెప్పా । యమ్మలకు యెరిగించివేగమే । శాంతతోటి జెప్పుముయని బలికే । యతి వేగంబున హనుమంతుడు । యంతఃపురంబుల లోపలకెళ్ళి । కౌసల్య పాదములకు మ్రొక్కి । కమలనాభులు పదముల బడెను । ఆపలుకులవిని కౌసల్యప్పుడు । రాముడేమి పైనంబేమి । యజ్ఞవేదికా యగ్నిహోత్రంబులు । విడిచి యెక్కడికి వెళ్లెదమనెను । మునిబాలురతో యుద్ధంబులకు । ముందుగశత్రుఘ్నుని పంపించాను । ఆవెనుకను భరతుని నంపెను । యావెనుక లక్ష్మణుడేగె । చేసినయుద్ధం జెప్పగలేము । భరతశత్రుఘ్నులు పడియున్నారు । లక్ష్మణుండు రామునిరమ్మనెను । యశ్వంలేని యాగమెట్టిదీ । యెందుకు

రాముడు వెళ్ళగవలసె । రణభూములకు రాముడెందుకు । రమ్మనిజెప్పుమి రామునియిటకు
ఆపలుకులవిని హనుమంతుండు । మమ్ముతల్లులు రమ్మనిజెప్ప । పయినున్న సాలువదీసి
కొని । నడుముకుజుట్టి నారాయణుడు । పచ్చలుజెక్కిన పావాల్‌దొడగి । బంగారుబెత్తం
చేతబట్టుకు । యచ్యుతు లంతఃపురముకొచ్చి । కౌసల్యకు కైకకు మ్రొక్కిరి । సుమిత్రకు
మ్రొక్కిరి సూర్యనేత్రులు । యమ్మలార మమ్మతివేగంబున । సెలవిచ్చి పంపుమనిబలికె ।
వద్దువద్దు ఆయుద్ధభూమికి । వెళ్ళవద్దు రాఘవయనెను । యట్లాపలుకుట యపజయ
మమ్మ । సంతోషింపుచు బంపరెతల్లి । యపజయంబులూ గాకయిప్పుడు । జయమయి
యుండెనా రాఘవానీకు । యిరువురితమ్ముల కయ్యమునకు । కప్పగించితిమి అంతేచాలు ।
బ్రతికియుంటెను బహునాళ్ళకు । యరయగ సుఖములు పొందగవచ్చు । సౌమిత్రి సేనల
తోను శీఘ్రముగాను । రమ్మనిబంపు హాయంవద్దు । అయోధ్యలోయుండుమి నీవుయనెను ।
యెంతమాట నీవంటివి తల్లి । యేమనవచ్చును యమ్మరోనిన్ను । తానడవిపాలుగా
తమ్ముని బంపి । యయ్యోధ్య నాకెందుకనెను । శాంతకు మ్రొక్కిరి శ్రీరాఘవులూ ।
సెలవియ్యవే అక్కరోవేగ । యడుగులపయినున్న తమ్ముని యెత్తి । దీర్ఘాయువు
గమ్మని దీవించె । ఆదిలక్ష్మి సీతనయులతోను । బదిలము రారానాతండ్రి । యను
జులు సేనలూ తురగముతోను । అయోధ్యకు రారా నాతండ్రి । సీతతోటి సింహాసన
మెక్కి । రాజ్యం బేలుమి రాఘవయనెను । ఆపలుకులువిని శ్రీరాఘవుడు । నిర్ఘాంతంబున
తానిలుచుండె । తనలోనెతల వంచుకుతాను । కొంతసేపు చింతించెనురాము । ఆలోచింపుతు
శ్రీరాఘవులూ । అపుడుశాంతకు యిటులనిపలికె । యెక్కడజానకి యెక్కడి తనయులే ।
యెక్కడమాటలే యక్కరోయనెను । సత్యవాక్యములు తనవేయౌను । తనయులనెత్తుకు
వస్తువుయనెను । అసత్యాదీవెనలుపొందెను । అంజలిమ్రొక్కెను సుందరధుడు । శ్రీరా
ములూ రథముయెక్కగను । జేజేయని జగములు పొగడే । శ్రీరాముల రథమూ నడవ
గను । జయపత్రికలూ యిచ్చినవారు । జయజయమని దేవతలంత । జయభేరివేయించిరి
యపుడు । సురదుందుభులూ ఘుమ్మనిమ్రోయా । జేయనుచు వానరులు నడువగను ।
దడదడమని రీలుమ్రోయగా । వడివడిపువ్వుల వర్షంగురిసె । శుభశకునంబులు చూడ
గనప్పుడు । బాగాయెనని బలుకుతురామా । శ్రీ రామరాములని బట్టెబూరలు । సీతకుపతి
యని వేయించెభేరి । ఆరామారాములని బట్టె బూరలు । దశావతారుడని వేయించెభేరి ।
జనకుని అల్లుడని బట్టెబూరలూ । శత్రుసంహారులని వేయించెభేరి । కౌసల్యతనయులని
బట్టెబూరలు । కంససంహారులని వేయించెభేరి । కాకుస్థతిలకులని బట్టెబూరెలు । సుమిత్ర
తనయులని వేయించెభేరి । సూర్యవంశపురాజులని బట్టెబూరలు । శాంతకు తమ్ములని
వేయించెభేరి । సేనరక్షకులని బట్టెబూరలు । లంకసాధకులని వేయించెభేరి । వీరాధివీరు

లని బట్టెబూరలు । లక్ష్మణాగ్రజుడని వేయించెభేరి । అసురసంహారులని బట్టెబూరలు । సామంతుల గురువని వేయించెభేరి । అసురసంహారులని బట్టెబూరలు । భేరీనాదం వారు కొలవగా । బంట్లుబరారిబరిచారులుచాయా । విచ్చుకత్తులు యీట్లుతుపాకులు । బాకుసో కుల్ బల్లెములను । తళతళమెరసెటి దండపుకత్తులు । ధగధగమెరసెడి పావపుకోళ్ళు । యింద్రులుచంద్రులు యిలకపులంతా । తగువాహనములు దగ్గరనడువా । ముందరమూడు కోట్ల రాణువకదలగా । వెనకాల వెయ్యికోట్ల రాణువకదలా । అసురసంహారుడు అంబు జనాభుడు । కళాపూర్ణమై వెడలెను యపుడు । కన్నులనిండు చూచెడివారు । కన్నులజల ముల తెచ్చెటివారు । మళ్ళీ అయోధ్య చూతము అనుచు , తిరిగితిరిగి చూచిరిసేనలును । వచ్చిరివనముకు వేగముగాను । రథములుగజములు తురగంబులతో । యుద్ధంవేదికా కన్నులజూచి । చింతించిరి శ్రీరాఘవులపుడు । బడియున్న తమ్ములనుచూచి । మూర్ఛ అయిరి శ్రీరాఘవులా । కొంతతడవుకు మూర్ఛ తెలుసుకు । గోవిందుడుతా హడలదొడంగె । అంబారిఅటుదిగి వేగమునా । బండమీద కూర్చుండెనురామ । కప్పినశాలువ ముసుగెట్టు కొని । హోపరియాయమ శోకించెనురామ । అడవులలో పదునాల్గేండ్లు । ఆహారము నిద్ర లేకుండా । సతికి తనకు సేవల్చేయుచు । తనసతి నెడబాపి నట్టివాడు । యటువంటి సహోదరుడుకలడా । అతివకుతాను అంగరక్షగా । అనేక విధములు కాచినవాడు । యిటు వంటిసహోదరుడుకలడ । పళ్ళుఫలములు తానారగించక । పట్టుకొచ్చి తమకిచ్చినవాడు । యిటువంటి సహోదరుడుకలడా । జానకినెడబాసి నట్లయితేచాలా । అతిదుఃఖమ్ములు పొందుతువుంటె । ధయిర్యస్థయిర్యములు జెప్పుతూను । తనతోటిజోడుకూడుండే । యిటు వంటి సహోదరుడుకలడా । పద్మగంధిని యగ్నిలో తొక్కిస్తే । వలదన్ని యెన్నివిధముల వాదించే । యింద్రజిత్తుని యిలపయిగూర్చి । రావణశక్తికివోర్చినవాడు । యిటువంటి సోదరుడుకలడా । భూసుతతోడుకు పుష్పకమెక్కి । చనుదెస్తిమి కడువేడుకగాను । తన వెనుకను ఛత్రంబట్టుకునీ । శత్రుఘ్నుడు కూడరాగాను । పట్నము గట్టినిద్రపోయెను । యిటువంటి సహోదరుడు కలడా । వలదు బాలలతో వాదముయనుచు । వాదించితివిర తమ్ముడనీవు । బలవంతముచే పంపినందుకు । బాగాయెనురా తమ్ముడాబ్రతుకు । యిటువంటి తమ్ములను విడిచి । యెట్లుగ నయోధ్య నేలుదునేను । యెందుకుమాకు రాజ్యంయనెను । సౌమిత్రిగూడా కూలినవెనుక । యశ్వంపట్టుకు పోరగనేలా । బాలురతోరణ కయ్యములేలా లక్ష్మణుడు గూలినవెనుక । యయోధ్యేలా రాజ్యంబేలా । యజ్ఞములేలా యాగము లేలా । యెందుకుమాలిన యివియన్నియును । పోవోయియంగదుడా నీవుపోయి । సౌధాం తంబులను బాలుల హతమార్చయినాను । హయమును దోడుకరమ్మనెను । యాపలుకుల విని యంగదుడప్పుడు । యంతట ఋషిపల్లెకు యేతెంచె । యెవడురయశ్వం బట్టినవాడు ।

యెంతవాడుర యశ్వంబట్ట । యశ్వంబట్టక కులదస్తున్నదా । మహరాజశ్వం విడువరయనెను ।
యెవడురయశ్వం విడిచెటివాడు । యెంతవాడుర హయమునువిడువా । హయమునువిడువా
నీకులదస్తున్నదా । జెప్పుకోర నీరాజుతోపోయి । మర్కటచేష్టలు మానరనీవు । మారుబలు
కక పోరాయనిరి । మాటాడక నేమళ్ళగాదురా । మాయశ్వంవిడువర యనెను । మీయశ్వం
బును విడువమంటివి । మరిమరినీ పేరెవరోజెప్పర । నాపేరే యంగదుడనిపలికె । యంగ
దుడంటె నీవేనటర । యంగములేని వాడవునీవు । యంగములేని వాడంగదుడంచు ।
వింటిమిచాలా వివరికమీదా । వినడమేవాని జూడగలేదు । జూడకలిగెనా నేటికిన్ని ।
హయముబట్టిన వేళయెట్టిదో । యన్నరోపీని జూచితిమనెను । తండ్రినిజంపిన తామసమెరు
గక । దాసుడవయికొలుచుచున్నావ । గర్భిణిస్త్రీయని కటకటమనకా । వధియించవనముల
కంపించి । యంగదుడానిను అంపకముచేసి । అయోధ్యయేలుతున్నాడ రాజా । చాలుర
యింకసరసమునీతో । యింతేచాలూ యావలబోర । నాపలుకులువిని యంగదుడప్పుడు ।
హరికిమ్రొక్కి విన్నవించెను । తానువొప్పుగవిని తాశ్రీరాఘవులూ । యతి యాశ్చర్యంబున
యద్భుతపడెను । పోవోయిసుగ్రీవానీవు । నీవుబోయి సాధాంతంబులను । బాలలను హత
మార్చయినాను । మనయశ్వమును దోడుకరమ్మి । ఆ పలుకులూవిని సుగ్రీవుండు ।
ఋషిపల్లెకు చనుదెంచెతాను । అల్లంతట హరితనయులజూచి । అశ్వంవిడవండని
తాబలికె । గాలికితరువులు కదలినట్లుగ । దెల్పవస్తివి నీవెవడవుర । ఇంద్రతనయుడనే
సుగ్రీవుడను । పవనతసూభవుడు బంటురనీకు । సుగ్రీవుడంటే నీవేనటర । కిష్కింధపురి
రాజవనీవు । అయోధ్యనేలుతున్నాడారాజు । యారాజునకు యీబంట్లకుకాక । చెల్లిందితర్ల
కెవ్వరికి చెల్లదు । మీరాజ్యానకు జెల్లెనుగాని । మారాజ్యాలకు మరిచెల్లదుర । గ్గుమాలి
యేమనివచ్చితివి । లజ్జమాలి ఆవలికిపోర । ఆపలుకులూవిని సుగ్రీవుండు । హరికి
మ్రొక్కివిన్నవించెను । మమ్మునుగాక మిమ్ములయెంతో । యెగ్గులైన వాక్యములాడె
దరు । యేమేమి వాక్యము లన్నరో । తేటబఱచి తెలుపుమి యిదివరలో । యాలినిజంపి
యనుజులగూడి । రాజ్యంబేలుచున్నాడారాజు । కిష్కిందేలుతు వుంటివనీవు । నీరాజుకునీకు
చెల్లినది । యితర్లకెవరికి చెల్లదుయనిరీ । యాపలుకులువిని శ్రీరాఘవులు । అతి యాశ్చ
ర్యమున అద్భుతపడెను । పోవోయి విభీషణనీవు । పోయి సాధాంతంబులను । బాలురను
హతమార్చయినాను । అశ్వమును దోడితెమ్మనెను । ఆపలుకులువిని విభీషణుడప్పుడు ।
హరికి మ్రొక్కుతునిట్లనిబలికె । యేమిపనులుకు యానతిచ్చితిరీ । హరికార్యంబులు
జేతునుగాని । జెప్పిననిదినే చేయగాను । బాలలకయి బారుగచనుదెంచ । విప్రబాలలకు
వెరచెదవేమి । నాటివారుగనుక వెరచెదవా । సూర్యచంద్రరాజులు యున్నంతకాలము ।
మరణంబు లేకుండగనీకు । సెలవులేక చలనంబులేదని । దీర్ఘాయువుగ దీవించెదవెళ్ళు ।

విధిలేకా విభీషణుడప్పుడు । ఋషిపల్లెకుచను దెంచెనుతాను । యెవడురయశ్వం పట్టినవాడు ।
యెంతటివాడురా యశ్వంబట్ట । యశ్వంబట్ట నీకులదస్తున్నదా । విడువరయశ్వం వేగమేయ
నెను । యెవడుర అశ్వంవిడచేవాడు । యెంతవాడుర అశ్వంవిడువ కులదస్తున్నదా । జెప్పు
కోర నీదిక్కెక్కడగలదో । ప్రొద్దుకలప్పుడు బోవలెమాకు । యశ్వంవిడుచుట లేదెప్పు
డును । వోరీనీపేరెవరోజెప్పర । నాపేరేవిభీషణుడనెను । విభీషణుడంటె నీవేనటరా ।
తెలుసుర నీశౌర్యములన్ని । లంకగుట్టు రాముకెరిగించి । ఆయువుజెప్పి యన్ననుజంపి ।
లంకరాజ్యమున కధికారయితివి । తెలుసురనీశౌర్యములన్ని । జెప్పగనేల నక్కరలేదు ।
లంకపట్నము యేలినవాడవు । రావణుతమ్ముడనీవేనటరా । రామునిచేత రావణునిజంపి ।
లంకయేలుతు వుంటివనీవు । తమ్మునిచే యాలినిజంపించి । అయోధ్యేలూ తున్నదరాజు ।
ఆరాజుకు ఈబంట్లకు చెల్లింది । యితరులకెవ్వరికి చెల్లదురా । మీరాజ్యాలకు చెల్లునుగాని ।
మారాజ్యాలకుమరిచెల్లదుర । అంతేచాలు యావాలికిపోరా । తిన్నగపోరా తన్నులబడకా ।
అనిబాలలు యాడినమాటలకు । విభీషణుడుయిట్లనిపలికె । యాదిమూర్తిగనుక చెల్లును
గాని । అందరికినటులేచెల్లునా । ఆదివిష్ణు అవతారమూర్తి । యనంత పద్మనాభుడు
యతడు । దశావతారుడు స్వామిభూపాలుడు । దశరథరాజ కుమారుడురాముడు । అతనికి
సాటెవ్వరు ఈలోకమునా । పేరువిన్న బ్రహ్మాండము వణకు । ఆదివిష్ణు యవతారమూర్త
యితే । ఆదిలక్ష్మియెందులకు వుండదనిరీ । వారిజాక్షు వక్షస్థలమందు । నావరలక్ష్మివున్న
దనిపలికె । లక్ష్మినిగనుకా నీవు చూపకుందువా । నీదేబిరుదుగాదనిరపుడు । నాడులంక
పట్నము గట్టుటకైన । రావణుతోడ కయ్యముజేసే । యాయువుజెప్పి అన్ననుజంపి । యతి
క్లేశంబులు బడితివినీవు । నేడయోధ్యపట్ణము గట్టించెదను । జూపించుర శ్రీలక్ష్మినియనిరి ।
లక్ష్మినిగనుక నీవుచూపకుంటివా । నీవిభీషణుగాదనిరపుడు । పట్ణముగనుక గట్టకుంటె
మాదేబిరుదుగాదనిరపుడు । యేదిరభూలోకమాతేదిర । యేదిరభూపుత్రిక సీతేదిరా । మమ్ము
లగన్నట్టిమాయమ్మ యేదిర । తారకకమల మందున తరుణేదిర । గొప్పకన్నుల పద్మ
నేత్రి యేదిర । సిరిముఖములగల సీతయేదిరా । యనగవిని కర్ణకఠోరపలుకులూ । విని
వీనులకు విల్లయిదోచె । రథముల్ గజములు తురగంబులను । మావటీలమూకలదోడుకొని
వచ్చబెత్తం గిరగిరత్రిప్పి । పారజూచెను బాలలపయిని । రాక్షసమాయలు తెలియవు
మనకు । రణరంగంబున నిలువగవలదు । వొత్తిగిలిపోయేటిబాలలు । తమరు యంతలో
విభీషణుడేతెంచి । హరికిమ్రొక్కి విన్నవించెనుతాను । యాపలుకులనువిని రాఘవుడు ।
అతియాశ్చర్యమునయిట్లనిబలికే । పొలుపగువిప్రులపోటులకంటె । ఘనమగు కప్పలకాటే
మేలూ । విప్రబాలలకు వెరచివస్తివి । విభీషణా నీశౌర్యముయేది । బాలలంటెను బాలలు
కారు । హరబ్రహ్మాదుల మించినవారు । సురలోకములాను సూర్యచంద్రులతో । బాలరూ

షమునుదాల్చిరీవారు । అందర సేనలబంపితిగాని । అందరి తమ్ములబంపితిగాని । యశ్వము తెచ్చినవారేలేరు । యెవరుధైర్యం చెయ్యగలేరు । హనుమంతుని అంపుదమంటె । అనుజులయిన తనకెవరులేరు । హనుమంతునీ పిలిచితినయినా । చేకొనికార్యం చేసును గాని । క్షణమాత్రమైనా వుండగలేరు । శరములు శంకర మహిమోగానీ । తరచుగదానవ మాయయోగాని । యెట్టిబాలలో తెలియగరాదు । చెప్పగవింటే శక్యముగాదు । వీరులు శూరులు శౌర్యవంతులు । గెల్వలేకబోతిరీమీరంతా । యికనెందరినంపుదు యిటుమీదా । సుమంత్రుడాబోయి రమ్మనెను । అపలుకులవిని సుమంత్రుడు । ఋషిపల్లెకుజను దెంచెను తాను । అల్లంతట సుమంత్రునిజూచి । యన్నకుతమ్ముడు యిట్లనిబలికే । అన్నరో యా వచ్చేవారెవరు । యెవరోతెలియగ రాదనిబలికే । ఆలోచించేటి సమయమందున । గ్రక్కునబాలల కడకేతెంచి । విడువువిడువు విడవండి అశ్వము । రామునితో రణకయ్యంబేలా । ఆమేటితోటి సాటెవరు । అజరుద్రాదులు గెల్వగలేరు । భీమపరాక్రమ రాముభార్గవ । రాముని గెలిచిన రణవిజయుండు । అశ్వము విడువమనుచు వచ్చితివి । నీవెవ్వడవుర సుమంతుతా బలికే । శ్రీరాములకు రథసారథిని । సుమంతుడు పేరనిబలికే । రథసారథివయి రామము గెల్వ । శౌర్యంచూప వస్తివినీవు । రాక్షసాంతకా రామచంద్రుడు । రాయభారము బంపెననిన్ను । ఆపలుకులువిని బాలలు పలికెను । శౌర్యము ధైర్యము చూచెదర । సీతను అడవుల కంపిననాడు । రథమునుదోలిన వాడవునీవు । పాపకర్ముడ యమకింకరుడా । బట్టిద్రుంపక మాననునిన్ను । దగ్గిరనడుమని తరుముకురాగా । అన్నకుతమ్ముడు ఇట్లనిబలికె । నిమ్మళస్తుడు నీతిమంతుడు । దూతనుద్రుంచుట ధర్మముగాదు । అన్నదమ్ములు ఆలోచించుకు । రమ్మి సుమంతూడ రమ్మనిపిలిచే । రాయభారము రాముడంపెనా । యేమనెనో యెరిగించరా అనిరి । ఆపలుకులవిని సుమంతూడు । అతివినయంబున యిట్లనిపలికే । కోరిన యశ్వంబులు నిచ్చెదరమ్మి । రత్నంబులు మణులూ యిచ్చెదము । యెన్నికోరినా యిచ్చెదగాని । యాగపుహయముని అడిగితిమిగాని । మున్నూరుగజములు మాకేల । మూడుకోట్ల రాణువు మాకేలా । అశ్వంవిడవక బోరాడినేను । తలలుద్రుంతునని రాముడు జెప్పె । తలలుద్రుంచుట తరమాతనకు । దైత్యులజంపుట తరమేకాని । జెప్ప వెఱచి అశ్వం విడుచుటకిప్పుడు । వనితాశిరోమణి తనయులముగాము । భూమిజవాణికి పుత్రుల మేము । బారదు మాశూరత్వంబనిరీ । తానైతే కయ్యంబునకు రావలెగాని । రాయభారములు పంపడమేమి । గాజులూ తొడిగించుకొన్నట్లుగా । మూలనేల దాగున్నాడనిరీ । గాజులు తొడిగించుకు మూలదాగితిమా । దశరథరాజ కుమారుడుగాడ । తమ్ములజంపుట ధైర్యంగాదు । సేనలజంపుట శౌర్యంగాదు । రాజుతొకయ్యము చేయవలెగాని । బంట్లతోడి కయ్యం చేయమంటు । బంట్లతోటి కయ్యం మాకేల । జెయ్యమనిరి బాలలాయపుడు ।

కయ్యమునకు రమ్మనుమయ్య । బిరుదు యేవిధంబున రాసితివో । ఆవిధంబుననే జెయ్య
వలెను । బట్టగట్టి పోరాడిగెలిచితే । యిచ్చెదనంటివి అయోధ్యపురము । బడలికగలిగి
పోరాడితిమి । ఊరిక హయమును విడచుటలేదు । యెవరుగెలిచితే వారిదిఅయోధ్య ।
రమ్మనుమా మాతోకయ్యము । రణభిక్షమే మడిగితిమనుమి । ముమ్మాటికి రమ్మనిజెప్పు ।
యీపలుకులువిని సుమంతుడు । హరికిమ్రొక్కి విన్నవించెనుతాను । ఏమనిజెప్పుదునయ్య
మీకు । అబాలలవంటి శూరులు జగమునలేరు । ఇంద్రులు చంద్రులు మహేంద్రులైనా ।
నిలిచి మాటలాడ లేరనెను । అవునుసుమంతుడ యేనంటావ । అంతటిబాలురు అవుదురు
వారు । యేలోకంబున యేదేశంబున । యిటువంటిబాలుర జూడగలేదు । యిటువంటి
తనయులు కలుగుటకునే । తల్లితండ్రులా తనయులఫలము । మనతురగంబును విడువ
మంటేను । యేమనిరో యెరుగించుమి అనిరీ । యెన్నివిధంబుల జెప్పినగాని । యాగపు
అశ్వం విడువముయనిరీ । యెవ్వరినంపిన కార్యములేదు । మిమ్మేకయ్యానికి రమ్మనిరీ ।
రాజుతోయుద్ధం చేయవలెగాని । బంట్లతోయుద్ధం మాకేలా । జెయ్యమనిరి యాబాలలు ।
తనుపలుకులవిని శ్రీరాఘవుడు । అనేకవిధముల ఆలోచించె । తమ్ములవిడిచి పోజాలకను ।
తనలోనే చింతించెనురాముడు । ధరణిపయితమ్ముని తోడపయివుంచుకు । అనేకవిధముల
హడలెనురాము । యెన్నడు యెరిగుండలేదు । యెడబాసితివా తమ్ముడానన్ను । అప్పటికై
నట్లయ్యెగాని । యిందుకేమి యుపాయమనెను । పన్నీరుబోసిన పట్టుపరుపులు । తలగడలు
చాలదెప్పించి । తొడపైనున్నతమ్ముని యెత్తి । పవళించబెట్టెను సౌమిత్రిని । ఇరుగడల
సేనలనేనిలిపి । వీవనలతో విసరగచేసి । పట్టుశాలువ ముసుగుబెట్టి । భరతునికడకు తామే
తెంచి । ఆనాడు పదునాల్గేండ్లు । అరణ్యంబుల నేయుంటె । మిమువిడచి నేనిలువలేనని ।
పావాలూ బట్టుకవచ్చితివి । మాకంటెను మరినీమముగాను । అరణ్యావాసము జేసితివయ్య ।
మానామంబులు స్మరియించితివి । ఇప్పుడుమమ్ము విడిచిపోతివా । యేమిసేతుర తమ్ముడా
అనెను । కాకాసురుని కొట్టినశౌర్యము । యెక్కడబోయెరతమ్ముడ నీకు । పన్నీరుపరుపులు
దెప్పించి పవళించబెట్టెను । భరతుణ్ణపుడుయిరుగడల సేనలనే నిలిపి । వీవనలతో విసరగ
చేసి । పట్టుశాలువ ముసుకమరగబెట్టి । పైబడిశోకించెను శ్రీరాము కొంతసేపు । చింతించిన
వెనుకా శత్రుఘ్నునికడకుయేతెంచె । ధరపయినకూలిన తమ్మునిచూచి । కన్నులజలములు
గార్చుతుబలికె । కఠినమయిన యీరాళ్ళనయిన । కడతేరితిరాతమ్ములుమీరు । పెక్కుపీనుగుల
పెంటలలోపల । పవళించనాయెన తమ్ములబ్రతుకు । ఈయాగము నాకెందుకువచ్చెను ।యింత
వచ్చుట యెరుగకపోతి । శత్రుఘ్నుడంటె జగతిచాలును । అనుకొనిబంపితి తమ్ముడనిన్ను
నీముఖముకళ కలిగున్నదిర । ముద్దులతమ్ముడ మాటాడవేమి । అశ్వమేధ యాగంబులు
గావు । మిమ్ములయాగము చేసితినేను । మిమ్ముజంపినా పగలుతీర్చుటకు । తనప్రాణం

బులు విడిచెదననుచు । అనిపరిపరివిధముల శోకింపుచు । సేనచూచి యిట్లనిబలికె । పోయెద
రణభూమికి నన్నంపరేబోరెద । యింద్రాదులు యెవరయిన జొచ్చెద । యమపురి
యంతదయినను । తెచ్చెదననుజులతో తురంగములు । పిలువమనిరి గరుడుని అపుడు ।
వాహనమునకు తా రానని బలికె । రెక్కలుకోతురా ముక్కుగోతురో । కంఠంబునమరిఖం
డింతురోయెమో । అతిసాహసులుబాలననగను । యాపలుకులవిని శ్రీరాఘవుడు । అంగదుని
పిలిచి యిటులనెను । కార్యంబులు చేకూరవుగనుక । గరుడుడుకూడారానని పలికె ।
హరివాహనముకు ఏమికావలెను । గజవాహనము గ్రక్కునతెచ్చి । అలంకారము
వేయుండనెను । భద్రగజమును దోడుకవచ్చి । నడుముకుపట్టి వేయించికుంభస్థలమున ।
కుంకుమబొట్టు పట్టెవర్ధనంబులు పొంకముతోను । బొడ్డునగంటలు పొలుపమరగను ।
యరుదుగంటలు అందముతోడు । గంగజలములా కడిగితుడిచిరీ । గరుడ పెక్కములు
తీరుగవేసె । మూపురమునకుముత్యాలగూర్చిరి । పాదంబులకు ఘమిడిగజ్జలుకట్టిరి । మెడకు
చంద్రహారములు వేసిరిగా । పిక్కలును పిడికటలుగట్టిరీ । వక్కవైపు పట్టుపరుపులును ,
నవరత్నఖచితపు అంబారీ । నడుమధ్యంబున సవరించిరిగా । జరీపట్టుశాల్వాలేవేసిరి ,
అలంకరించిన ఆవాహనము । అంబారియెక్కిరీ రాఘవులు । రణములుగజములు తుర
గంబులను । మావటీలు ముందరనడవగను । సేనలురాణువచేరికొలవగ । వచ్చెనురఘు
రాముడు వాదముకు । వచ్చిరివనంబుకు విచ్చలవిడిగను । మచ్చికకడు హెచ్చరిక
గాను । యెదురుకయ్యముకు యేతెంచిరిగ । మగుడియుద్ధంబుకు మళ్ళిరివారు । పంచశరం
బులు దేవదత్తములు ఘమ్మనిమ్రోయా । అసురుల గుండెలు అవిశేటటుల । శశిముఖు
లు కయ్యంబుకుజనిరి । కొంచక అప్పుడుఘోరకయ్యము । చింతించక యెదరకాళ్ళపడి ।
లవకుమారు లావణ్యముచేయ । చేకొనిలవుడు చాపముబట్టె । జానకిపుత్రులు జయవీరు
లుగ । దిక్కులేకవారు ప్రార్థించె । యుదయభాస్కరా సకలగుణాకర । సహస్రనమస్కా
రంబులనితాబలికె । మెచ్చిపరీక్షాకరుడిచ్చిన వెనుకా । అచ్యుతునిపుత్రులు అందరివేసె ।
తనయులురఘుపతి చేసెడికయ్యము । చూడగామానరు యింద్రులు చంద్రులు । దివినుండి
చూతురు వేడుకలా । సురవరకిన్నర గరుడోరగులు । విమానంబులతో వచ్చిరివారు
అల్లంతట శ్రీరామునిచూచి । అన్నకుతమ్ముడు యిటులనిపలికే । అన్నరో యావచ్చేవారె
వరని । యాదిమూర్తిరాతమ్ముడఅనెను । తల్లిదండ్రులుయాదైవస్వరూపులు । తప్పనాడుటా
ధర్మంకాదు । అరణ్యంబులో అమ్మనినాడు । జంపిరమ్మనిన వాడేకాడా । అలవిగాని
బ్రహ్మాండమువంటి । అగ్నిలో త్రొక్కించలేదా । నేడు చక్రధరునికి మ్రొక్కగవద్దు । హత
మార్చిమరి విడువగవలెను । అనియీవిధమున ఆలోచించిరిగా । అక్కడకొచ్చిరి శ్రీరాఘ
వులు । పెక్కుపీనుగల పెంటలోపల । చక్కని నందనులను పొడగనెను । చక్కనిపాపల

తప్పకచూచి । దుఃఖించెను తనచిత్తమునందు । పౌలుపుగ రాముడు పుత్రమోహము । అతి మోహంబున జూచెనుతాను । అయోధ్యరాఘవులును చూచితివా । యితడేరా తమ్ముడ యనిపలికే । చెట్టుచాటుననుండి వాలిని జంపినవాడు । సేనలచే వారధిగట్టినవాడు । యితడేరా శ్రీరాఘవులనగా । యితడేనా శ్రీరాములు అనెను । ఆయువుతెలుసుకు జంపినవాడు । ఆలిని అడవులకంపినవాడు । శివునివిల్లు విఱిచి పెండ్లాడినాడు । సీతనుచెరలో యుంచినవాడు । తమ్మునిచే ఆలిని చంపబంపినాడు । ఇతడేరా శ్రీరాఘవులనెను । ఆ పలుకులువిని శ్రీరాఘవుడు । అతి యాశ్చర్యమున అద్భుతపడెను । పూసినబూరుగ చందంబునను । యేపాఱగపుత్రులగనిపలికే । వోరీచూడమీరు వనరుగపిల్లలు । బాలులార యింతపగయెందుకుర । ఈబుద్ధులు ఈముద్దుమాటలు । ఎవ్వరునేర్పిరి యీ కానలలో । ఈముద్దులు ఈముద్దుమాటలు । ముందర బెట్టిన ఉగ్గుల్మాకు । ఈశౌర్యపు బ్రతుకులు యెవ్వరునేర్పిరి । యెక్కడనేర్చితి రివ్వనిఅనెను । మమ్ముబోలెటి వారము మేము । యెన్నగయెవరని అడగనేలా । వన్నెలుభాషలు చక్కదనంబుల్ । ఎక్కడ వచ్చెరబాలలుమీకు । వన్నెలుభాషలు చక్కదనంబులు । మావంశంబున కలవనిబలికె । యేవంశంబుర బాలుడమీది । యేమిటి జాతముజెప్పరయనెను । కులగోత్రంబులు రూఢిగ నామము । వివరించితె వియ్యమందేవా । కయ్యముజెయ్యగవచ్చినాడవు । ఎందుకుమాకుల గోత్రంబులునీకు । అయినాజెప్పెద వినుమీరాజా । అర్కవంశము మాదనిపలికె । ఆదిలక్ష్మి పుత్రులముమేము । అయోధ్యకులజుల మనిపలికే । అస్త్రశస్త్రబహు విద్యల్మీకు । యెవ్వరునేర్పిరి ఈ అడవులలో । కులగురువు వసిష్టుడనగ । యెవ్వరు జెప్పెను కారణమేమి । వసిష్టాదులు మీకెరిగించితె । వాల్మీకులూ మాకెరిగించినారు । పువ్వులబంతుల బోలెటిమేను । వెరితండ్రి వివరించెదవినుమా । అనుకూలపు శతుర్త్వమెందుకు । మీ పైయస్త్రం వెయ్యగనాకు । దోచదుచిత్తము కరుగదుజిహ్వా । పన్నుగమీరటు పారిపోతె । మిమ్ముతరిమి పట్టక నేనిలుతు । పారిపోవుటకు బలవంతమా । చేకొనికార్యము చెయ్యగవలెను । వినునీమాటలు చాలుపొమ్మన । అయిదింటను చక్రధనువునుదాల్చె । యెవ్వడు అశ్వం బట్టినవాడు । యెంతవాడురా హయమునుబట్ట । హయమునుబట్ట నీకుబలమున్నదా । విడువరహయమువేగము అనెను । యెవడుర హయము విప్పేవాడు । యెంతవాడు కావలె విప్పుటకు । ప్రొద్దుపోయి మేమిచ్చుటనుంటె । అంగలార్చును అడవినిఅమ్మా । వూరికె యశ్వంవిడుతుమానీకు । విడువము యుద్దము గాకుండా । శివుడుజెప్పిన విడువముమేము । జెప్పుకోర నీయబ్బతోపోయి । జపములుతపములు చేయుటగాదు । క్షత్రియధర్మము యిది సుమ్మనెను । జాముకొకస్నానం చేయుటకాదు । దర్భాసనములు వేయుటగాదు । జారీ చెంబులు పట్టుటగాదు । పలుమారు భుజించుటకాదు । పప్పునేతులు ఆరగించేటి । బ్రాహ్మణ

బాలలు యేమెరుగుదురు । తాపసశిరోమణి తనయులుమీరు । భూమిజనాథుని పుత్రులమేము ।
జపములుతపములు గురుమంత్రంబులు । క్షత్రియధర్మంబులు ఘనమంత్రింబులు । చెట్టుచాటు
నుంచి వాలిని జంపుటగాదు । సేనలతోవారధి గట్టించుటగాదు । ఆయువుతెలుసుకుజంపుట
గాదు । ఆలినిఅడవులకంపుటగాదు । శివునివిల్లువిఱిచి పెండ్లాడుటకాదు । సీతనుచెరలోపుంచుట
కాదు । ఆలినగ్నిలో దింపుటకాదు । తమ్ముడిచే జంపించుటకాదు । చెయ్యవలె మాతోజగడ
మునీవు । జెప్పెదవెందుకు పరిభాషలను । ఒకటంటేఒకటాడెదవేర । నోరాడక కడతేరము
చూడు । ఓరంటే ఓరనియెదవేమి । నీపేరేమిజెప్పుమిరాజ । మాచరిత్రలు అన్నియు దెలిసి ।
మానామములు తెలియవమీకు । నాపేరు శ్రీరాఘవులనెను । శ్రీరాఘవులంటే నీపేరా ।
రఘుపతియనగ యెవ్వరు అనెను । సహస్రనామంబులు కలవానీకు । రఘుపతిననగా
నేనేననెను । సహస్రనామంబు గలిగిననీకు । చాలును రాజా చాలును । శతనామంబులు
యెందుంచరాజా । చక్కనినామము వొక్కటిగలదు । ఆలిని తమ్ముని చేతచంపినా ।
అతడిపేరు నాపేరనరాద । అయ్యోధ్యరాఘవుల కొలుస్తు । రాజ్యమేలు తుంటివినీవు ।
ఆపలుకులువిని శ్రీరాఘవులు । నతివుగ్రుండై ఇట్లనిబలికే । ఆదివిష్ణు అవతామూర్తిని ।
అనంత పద్మనాభుడనేను । దశావతార స్వామిభూపాలుడు । దశరథరాజు కుమారుడనెను ।
ఆదివిష్ణునీవైతేను । ఆదిలక్ష్మి వక్షస్థలమునయేది । లక్ష్మిగనుక నీవు చూపించితివ ।
అశ్వంబునూరకే విడిచెదను । ఆపలుకులువిని శ్రీరాఘవులు । తలవంచుక తాపూరుకొనెను ।
ఆదివిష్ణునీవైతేను । శేషశాయి స్వరూపులంమేము । శేషశాయి స్వరూపులెట్లయిరో । అఖి
లాండం బ్రహ్మాండంయేలగ । ఆదివిష్ణువు నాపేరాననెను । విష్ణునాభి కమలమందునా ।
యుద్భవించిన వారముగనుకా । శేషశాయి స్వరూపులంమేము । బాలులారావినుడీ
మీరిపుడు । పరిపరిసంభాషణ మీకేలా । అటుకాక మావంశావళి । తండ్రినాడుమా
తాతలనాడు । అశ్వమేధ యాగముజేసి । అశ్వం విడుచుటకలదు యెన్నడును । రాజు
గారు వినుడిప్పుడును । తాతలనాడు ముత్తాలనాడు । ఏమియెరుగని యజ్ఞముచేసితే । పట్టుట
యశ్వం భాగ్యంగలదు । బహువిధమైన మాటలెందుకు । ఒక్కమనవి జెప్పమనిరీ । అటు
కాక మావంశావళిని । తండ్రివినుడు మాతాతలనాడు । యేమియెరుగని యజ్ఞములకు ।
గట్టిన అశ్వం విడుచుటలేదు । ఏమియెరుగని యజ్ఞముయనగా । తెలియలేదురా బాలుడ
యనెను । యెరిగిందెట్లో యెరుగందెట్లో । దేటతెల్లముగ తెలుపరతనకు । తెలియకున్నవా
హరినీకిప్పుడు । తెలిసేటట్టుగ చేసెదనేను । తెలిసితేమి తెలియకుంటేమి । తేటబరచితె
బాలురతోను । యెన్నివిధంబుల జెప్పిరిగాని । వినసేరని వివేకహీనులుగ । సరిలేని
యజ్ఞంబులుమీరు । దానంబు యేలజేసితిరే । మహామునులంతా హర్షించిరా । కనకపుసీతతో
గావించుమనిరి । మండలాధిపతివి నీవుగనుకా । మహామునులంతా హర్షింతురుగ ।

ఏశాస్త్రమునకు వొప్పదుసుమ్మి । చేసినపనులకు చాలునుయనిరీ । పరమపతివ్రిత సీత
నాడనా । ఫలమేజాలును రాఘవానీకు । పదివేలా యజ్ఞంబుఫలమో । గర్భిణీస్త్రీని జంపిన
ఫలమో । శతక్రతువులు చేసినఫలమో । జెప్పగనేల శ్రీరాఘవనీకు । క్షత్రియ వంశమున
బుట్టగలేదా । అన్నవస్త్రాయుధంబులు లేవానీకు । అర్కవంశము గాదానీది । అభిమా
నంబులు లేవానికూ । తమ్మునిచే జంపించడమేమి । సతినినేరము చాలచేసితే । పతితా
చంపగవలెనేగాని । పతికడజచ్చుట సతులకుధర్మము । సతులనుజంపుట పతులకుధర్మము।
మరుదులుజంపుట ధర్మంగలదా । మానాభిమానం లేవానీకు । అర్ధరాత్రమున కేళీగృహ
మున । పతితో సంభాషించిన మాట । యనుజుడికీ యెరిగింతురు యెవరైనా । అనుగ్ర
హము యేలాఆగింది । అయోధ్యంతా రాజ్యముండగ । అడవిలోనికి పంపించడమేమి ।
తమ్మునిచే జంపించడమేమి । నీవేజంపగ రాదాయనిరి । భూపతిగనుక నీకుజెల్లును ।
మావంటివాళ్ళకు జెల్లదుసుమ్మి । ఆనాడు పదునాలుగేండ్లు । అడువులకు పంపించెనుకైకా ।
యాడది అడవుల కంపుటలా । అటువంటి ధర్మంబులుమీవీ । పతులను జంపే సతులు
గాకుంటే । సుతులనుజంపే ధర్మంమీది । అనవిని కర్ణకఠోరపు పలుకులు । వినవీనులపై
విల్లయిదోచె । యేమిబాలుడ యెందుకీమాటలు । విడవరాహయం వేగమెయనెను । హయ
ముివిడిచి మాసాకేతపురమునకు । యేతెంచండి మాయాగము జూచి । పోరాడిగెలిచిన
మీదటను । పోదాముమన మయోధ్యపురము । నీకువెఱచి హయమును విడుచుటకు ।
గాజులు తొడగించుకోలేదు । గాజులు దొడిగించుటకు మూలదాగిన । దశరథరాజ
కుమారుడు గావాఅనవిని । కర్ణకఠోరపు బలుకులువిని । రాముడికతిచేదైతోచె । బాలులార
గాచుకొమ్మనుచు । కోదండదీక్షదిగురులు । సప్తవారిధినడుమజొచ్చినా । వృధాపోదుర
నాశరమునేను । ఈబాణంబునవాలినేసితి । వరబలాధికుడు వాలనగాను । యీబాణముమ్మ
మనసముద్రునేసితి । నీవనగ మరియెంతటివాడవు । తొడగినబాణం విడువనుమళ్ళి । ఘన
ముగవేడికొండీ యిష్టదైవాల । తలుచుకొండిరా తల్లిదండ్రులను । తండ్రినైనను మ్రొక్కు
టకును । తగినటువంటి తండ్రులుగారు । సతిచావునకైనా వొప్పుకుని । సుతులను యడ
వులకు పంపించె । మాతృదేవతలు లేరామాకు । వోహోహో సురదేవతలార । వొప్పున
నిలువుడి పతిమా యెదుట । ఎక్కుబట్టి బాణంబులు దొడగి । శ్రీరాఘవులు తనకుమారు
లను । చక్రధరుని తనయులపై వేసె । రాకేమాపయి రామబాణమా । జోడుతుమ్మెదలై
మోగుచుయనిరీ । అదిచూచి రాముడహంకారమున । నిలువరబాలుడ నిలువరఅనెను ।
నారాయణాస్త్రము తీసిగ్రక్కున । నడిమికిసంధించిరి రాఘవులు । కుశుడు వేసినబ్రహ్మాస్త్ర
మును । రాములహస్తమ్ముదాకె । వేసినప్పుడే వెరువకదుందుభి । భేరీరవములు మ్రోగెను
దివిని । నారాయణాస్త్రము యప్పుడునడిమికి । నాలుగుతునుకలు ఆయేచూచి । రాముడ

హంకారమున । ఆగ్నేయాస్త్రంబును విడిచె । దారుణమైన వారుణాస్త్రమ్ము । దరిగావిడిచెను
లవుండప్పుడు । అదిచూచె రాముడహంకారమున । బ్రహ్మాస్త్రమును విడిచెను యప్పుడు ।
రాకేమీదకు రామబాణము । మూకమూక సంహారమైపొమ్మి । మూకమూకను సంహరిం
చెను । రాముడిరాణువ గూలెనుఅపుడు । చేతులోను చెయివేసుకుబాలలు । చలముమీదగ
నవ్విరిసురులు । బాలలు నవ్వగ రాముడుజూచి । అహంకారమ్మున యిట్లనిబలికె । బట్టర
బాలుడ బాణంతొడిగితి । తలచుకోరనీ దైవములను । తలచిన పనియేమి తత్తుల్యములు ।
తల్లినైనను తలచిమ్రొక్కుటకు । తగినటువంటి తల్లులెకారు । అడవులకంపిన అమ్మలు
లేరు । పితృదేవతలు లేరుమాకు । మిమ్ముకన్న తలిదండ్రులు యెవరు । నిజముగజెప్పర
బాలుడయనెను । మాతలిదండ్రుల మాటలనీతో । జెప్పుటకు శక్యముగాదని । యెన్నితపం
బుల జేసికుంటిరో । యెన్నగమీవంటి తనయులుకల్గ । తపములజపముల చెయ్యగలేదు ।
బుత్రికామేష్టులుజెయ్యగలేదు । భూమిలోపల పురుషజన్మము । బుడితిమి వనవాసంబుల
కొరకయి । వనవాసంబులు యెందుకుమీకు । రాజ్యమిచ్చెదను రమ్మనిపలికె । తమ్ముల
మాదిరి జూచుచుందును । హయంబిడచి మాఅయోధ్యకురండి । పూరికెరాజ్యంయిస్తువు
రాజా । పోరాడిగెలిచితే వచ్చెదమేము । తమ్ములైన తనకెవ్వరులేరు । శూరత్వముగల
సుతులనుమిమ్ము । జంపలేకచూచుచుంటినిర । చిన్నతనయులని చూడగవలదు । శూర
త్వములు మానగవలదు । అజరుద్రాదులు అడ్డంవచ్చిన । తప్పించుకోలేరనిబలికె ।
చూడరబాలుడ బాణముశక్తి । చూచుకొమ్మని యస్త్రంబట్టె । ఆకాశంబున మంటలు
మండుతు । అతియుగ్రంబునవచ్చెనుశరము । యదిచూచి యదురుతు బెదురుతు । మ్రొక్కి
రిబాలలు బాణంబునకు । మేమేరవికులమునబుట్టితిమా । మాదశరథులతి సుకృతులయినా ।
కౌసల్యావ్రతములు నిజమేఅయిన । మాజానకి కడుపతివ్రతయినా । ఆదిమూర్తిమాతండ్ర
యితేను । అతనికిసుతులం మేమయితేను । రాకేమాపైకి రామబాణమా । రక్షించి కృప
జూడుమిఅనిరి । తనుజులమీదవేసినపిమ్మట । మళ్లేనుశరముమహిమలకొలది । తనశరము
తనకు తిరిగినను । ధరణినొరగిరి శ్రీరాఘవులు । చదురుమధ్యమున రాముడుగూలెను ।
గూలెనువిల్లా జగములుగూలె । సేనలుఅంతా చెదరిపోయెను । జగములు అల్లాడతల్లడి
బొడిచె । మండలాధిపతి మరణముజూచి । సూర్యుడుగ్రుంకెను చుక్కలుపొడిచె । ఆది
విష్ణులేని అయ్యోధ్యా । అంధకారమాయెను అపుడు । అక్కడతల్లులు హడలుతువుండ్రి ।
ఆయోధ్యంతా హడలుతుయుండ్రి । కనకభేరీమ్రోయగాను । గోవిందాగోవిందా అనిరి ।
గోవిందుడుతాకూలెను యనుచు । గోవిందాగోవిందా అనిరీ । గోవింద గంతులు వేయు
చువారు । జూచియప్పుడేవిస్మయమందె । కడుపులోచెయిబట్టికదలినట్లుగా । యతిభారంబ
యిదోచెను మనస్సు । చూతమురమ్మని యిద్దరువచ్చిరి । రాముడిదరికి వచ్చిజూచిరి ।

యన్నకుతమ్ముడు యిట్లనిబలికె । శౌర్య వంతులు కారువీరు । శాస్త్ర విద్యలు లేవురవీరికి ।
అర్క వంశము గాదురవీరిది । విప్రవంశము వలె వున్నదిగ । వీరినికనియెడి అప్పుడుతల్లి ।
నిద్రబోతు కన్నదిగావలె । పిరికిబంట్లకు బుట్టిరికాబోలు । పట్నపురాజుకు బుట్టగలేదు ।
వన్నె చిన్నెలుగాబోలు । బాలీసులు లెక్కగబరిపించి । బవళించాబెట్రి రాములను ।
వన్నె శాలువ ముసుగు గట్టి । యిరుగడల సేనలనిలిపి । వీవెనలతో విసరగజేసి । అన్నరో
చూస్తివ రాముతేజము । ఆహాఅని బలికిరివారు । మణికెంపులతో మురుగులజోళ్ళు ।
రత్నాలహారములు రమ్యముజూడు । మకర కుండలములు మౌక్తికములును । కెంపులు
పతకములు సొంపులుజూడు । రత్నకిరీటము రాముని ముఖము । రతీనాధునిమించి
వుందనిరీ । వజ్రాలమణికట్లు వన్నెలుమించ । అంగుళ్యములు యన్నరోచూడు । పీతాంబ
రము శోభిల్లంగ । మండలాధిపతి దురిభీతుండు । యనుచుబలుకుతు యతివేగంబున ।
రథము దిగివచ్చిరి రాణువనణచా । యన్నరోగెలిచితి యయోధ్యనుచు । యానందంబున
బలుకుచు నిలచే । సరసపాన్పులపై యన్నదమ్ములు । వారితేజములు చూడగలేము ।
శౌర్యంబులు ధైర్యంబులుచెదరి । యేవిధమున వున్నారోజూడు । చుట్టుతిరిగిజూచిన
సేనంత । యిందర్నిచంపుట యశ్శంకనిరి । యదిజూచి హనుమంతుడప్పుడు । హడలుచు
వాదిగుండెను నొకచోట । మళ్ళివచ్చెరా యీకోతనుచు । వనరునమూపున పెట్టుకు
చనెను । వానరులంటె యమ్మకుప్రేమ । బట్టుకపోదము యున్నరో యనెను । అమ్మ
కంటె నీకెక్కువప్రేమ । యాకోతిజూచితే వదలవుగ । బాలులందరు భయమందెదరు ।
యెందుకు యీకోతులుమనకు । అమ్మతోటి మనమాడుకొందము । వీర్నిగూడ బట్టుకు
పోదాము । జాంబవంతుని చేతబట్టుకు । హనుమంతుని మూపునబెట్టుకొని । అతిసంభ్రమముతో
యన్నదమ్ములు । యల్లంతట తమతల్లినిజూచి । అమ్మజూడవే చోద్యపురూపులు । యరసి
జూడుమని ముందరబెట్టె । అయోధ్య మహారాజుకె తగిన । యందమైనబంట్లై వీరనెను ।
యుద్ధరంగమున రాజునివిడిచి । వారిగొండిరె నొకచోటనువీరు । ఆ పలుకులువిని జానక
ప్పుడు । చిరునవ్వుతో బాలల కిట్లనెను । హనుమంతు డనగను । జగతిచాలినబంట్లై వీరు ।
బాలలంచు మిముగాచిరిగాని । బలహీనముచేతగాదనెను । ఆపలుకులువినిబాలలునవ్వుతు ।
యప్పుడు తల్లికియిట్లని పలికె । యణచివేసితిమే హనుమంతుణ్ని । యదిగోజూడవే
యమ్మరోయనిరి । రాముడుండగ మారుతిగూలను । యెక్కడి మాటలు యనితా బలికె ।
దశరథరాముని ధరపైగూల్చి । వేసివస్తిమే వేగంబునను । ఆ పలుకులువిని జానకప్పుడు ।
మూర్చబోయి తెలిసి యిట్లనెను । తనయులుయెదిగి తండ్రిమీదికి । వనరుగ యన్నది
నిజమాయె । ఇట్లచేయతగునాయినవంశోత్తము । గట్టిగనెక్కడి ఘాతలుమీరు । యెవ్వరు
యెరుగనియీకానలలోన । పొదిగుండక రవ్వసేయుదుర । పాముకూనలకు పాలుబోసితె ।

విషమురాతప్పున వినరటమీరు । విత్తొకటయితె చెట్టొకటి మొలచున । సతినిజంపుచున్న తండ్రికి తనయులుగారా । కట్టిగమిమ్ముల కనిపెంచితినా । కారణమీ లాగున శాయుదురా । వెడ వెడ పలుకుచు మది చింతించుచు । చనినడచెను వాల్మీకులకడకు । యేమిశాయతగు బాలలనిప్పుడు । రామునికూల్చిరి రణమునయనెను । యాపలుకులువిని వాల్మీకుండు । నవ్వుచు జానకి కిట్లాని బలికె । జానకివినుమి తనయులుయనగ । జగతికిచాలిన జానలువీరు । తేజోవంతులు రాజపుత్రులు । శూరత్వములు మానవుసుమ్మి । జగధీశ్వరునికి చావులెక్కడ । జగములు నిలుచునా జానకివినుమా । ఆపలుకులువిని సీతాంగనప్పుడు । ఆదిమూర్తికి నమస్కారముజేసి । పరమ పతివ్రతను తానేయైతే । పతిప్రాణములు సంజీవలెను । వెలసిరి యక్కడ తేజముతోను । కురిసెనుమందార కుసుమములపుడు । లేచిజూచిరి శ్రీరాఘవులు । బౌరాగతియని యాలోచించ । ఘోటక బ్రహ్మచారి మార్గమున । నొంటిగ నిలుచుండెను శ్రీరాముండు । వెలవెలబోతు మతితోచకను । బ్రహ్మశివుని ప్రార్థనచేసిరిగా । కైలాసంబున గౌరీశ్వరులు । సాటిగపాళీ యాడుతువుండె । దుగపగడతొమ్మిది పదియనుచు । దచ్చిబారాదుగ దచ్చియనుచు । ఆడుతువుండెడి సమయమందున । యప్పుడుపార్వతి కిట్లని బలికె । వింటివపార్వతి యిదియొకవింత । వింతజెప్పెదను వినుమనిపలికె । యయ్యోధ్య దశరథరాఘవులు । యశ్వమేధయాగం చేశారు । పంతముతోడుత జానకితనయులు । హయమును గట్టుకుచనిరి । బాలలతో గెలువలేక యిప్పుడు । నన్ను సహాయం రమ్మన్నారు । విష్ణుమూర్తులుమీరు యేకమై । బాలలవధియించా తలచారు । విష్ణుసహాయం మీరయితేను । లక్ష్మికిసహాయం మేమయ్యేము । విఘ్నేశ్వరుడు వీరభద్రుడు । కుమారస్వామి సాయములయ్యేను । సత్యలోకమున సరస్వతి బ్రహ్మ । చదరంగంబులు యాడుతువుంటె । యాటలాడెడి సమయమందునా । అప్పుడు సరస్వతి కిట్లనిబలికె । వింటివసరస్వతి యిదియొకవింత । వింతజెప్పెదను వినుమనిపలికె । అయ్యోధ్యదశరథ రాఘవులు । అశ్వమేధ యాగముచేశారు । పంతముతోడుత సీతసుతులు । హయమునుబట్టి గట్టుకచనిరీ । బాలలగెలువలేక యిప్పుడు । మమ్మసహాయము రమ్మనినారు । విష్ణుమూర్తిమీరు యేకమైబాలల । వధియించ తలచారా । విష్ణుసహాయం మీరైతేను । లక్ష్మికిసహాయం మేమయ్యేము । నారదుతుంబురు శారదులంతా । లక్ష్మితనయులకూసాయమనెను । యమరావతిని అమరనాధుడు । యచ్చరల కొలువయియుండె । శచీదేవి మొదలై చేడెలగూడి । దశావతారి ఆడుతువుండె । ఆటలాడెడి సమయమందున । యతివేగములేచెను యింద్రుడు । చెయిబట్టరాగా శచియప్పుడు । యావలకార్యం బేమనియడిగె । వింటివశచీదేవి యిదివకవింత । వింతజెప్పెదను వినుమనిపలికె । అయ్యోధ్యదశరథ రాఘవులు । అశ్వమేధయాగం జేసినారు । పంతముతోడుత జానకితనయులు । బట్టుక

యశ్వం కట్టుకచనిరి । బాలలతో గెల్వలేక నిప్పుడు । మమ్మసహాయం రమ్మన్నారు ।
విష్ణుమూర్తులు మీరుయేకమై । బాలులవధియించ తలచారా । విష్ణుకు సహాయం
మీరయితేను । లక్ష్మికిసహాయం మేమయ్యేము । యటువలెబలుకుట ధర్మముగాదు ।
యాదిమూర్తికి యెవ్వరులేరు । తమ్ములుగూలిరి సేనలుగూలిరీ । శౌరి యొక్కడై
నిలుచున్నాడు । యతియుగ్రంబున సీతాసుతులు । ఆదిమూర్తిని బాధింపుతువుండె ।
హరిబ్రహ్మాదులు కదలిరియదుగో । అతి శీఘ్రిమున రమ్మనిబలికే । బృహస్పతి
మొదలుగ పురజనులంతా । బాలలసాయము వెళ్లెదమనిరి । మూడుకోట్ల మునులు ఆరు
కోట్ల ఋషులు । యారుకోట్ల దేవతలంత । విష్ణుసహాయమ్ము వెళ్లెదమనిరి । విఘ్నే
శ్వరుడు వీరభద్రుడు । వైకుంతపాళి యాడుతువుంచె । అక్కడికొచ్చెను పార్వతితాను ।
తనయులజూచి యిట్లనిపలికె । నీవురాక కార్యములు చేకూరవు । నాతండ్రి లెమ్మనె
గణపతిని । మూషికవాహనం ముందేయెక్కి । యందముతో విఘ్నేశ్వరుడును కదిలే ।
బ్రహ్మాండంబున ప్రభలుకట్టుకు । భద్రకాళీదేవితో గూడుకొని । హావీర హాశరభా యనుచు ।
వీరభద్రుడు తానేకదలే । నెమలివాహనం నేర్పుతోయెక్కి । తనసతినితొడపైయుంచుకొని ।
కుమారస్వామి వెడలగను । తల్లితండ్రుల సరసను నడువగ । గంటలనందిని గ్రక్కున
తెచ్చి । యెక్కిరి పార్వతీశ్వరులపుడు । ముగ్గురు తనయులు ముందరనడవా । నందివాహా
నా రూఢుండాయె । రాజహంసను రమ్మనిపిలిచి । చదరంబులును తీరుగవేయించి ।
యావాహనముబ్రహ్మయెక్కెను । సరస్వతితోకూడకదలెనుయపుడు । అయిరావతముదేవేంద్రు
డెక్కెను । శచీదేవి కూడ కదిలెను యపుడు । వారివారికితగినవాహనము లెక్కుచు ।
వచ్చిరి వనముకు వేగముగాను । యల్లంతట యజరుద్రాదులజూచి । సమస్కరించిరి
నారాయణులు । వ్యాఘ్రచర్మములు వేగం తెచ్చి । వేయించిరీ సాంభశివులకును । నవరత్న
ఖచితపు సింహాసనము । వేయించిరీ బ్రహ్మాదేవులకు । మణిరత్నములా సింహాసనములు ।
వేయించెను దేవేంద్రులకప్పుడు । చదరంబులు తీరుగ వేయించి । సర్వసములుగా
కూర్చుండిరిగా । చదురుమధ్యమున శ్రీ రాములులేచి । బ్రహ్మాశివులకు సమస్కరించి ।
జెప్పెనుజరిగినవృత్తాంతములు । చిన్నబోయి నిలిచె శ్రీ రాములు । వచ్చిరివనముల
కుశలవులపుడు । చూచిరివారిని కన్నులనిండ । సభచుట్టు ముమ్మారు ప్రదక్షిణములుచేసి ।
మ్రొక్కినమస్కారములు చేసిరియపుడు । సభవారందరు సంభ్రమతోను । ఆశీర్వాదములు
చేసిరి యపుడు । యడ్డాలట్టెను పార్వతితాను । పాలిచ్చెను తాబాలలకప్పుడు । లక్ష్మిపాలు
తనపాలు తాగితే । మరణంబులు లేవెన్నటి కనుచు । ఆయాసముచేదాహాములనుచు ।
పాలిచ్చెను పార్వతితానపుడు । పాలుతాగేటి సమయమందున । శ్రీరాముడు ఇదేసమయ
మనగను । అదిచూచిపార్వతి కోపమునా । నాలుక జాపెను నలినాక్షపుడు । ధరణి

యాకాశము మూసెనుయపుడు । గూర్చుమేడలు కోటబురుజులు । చుట్టు కొటారములు
గావించి నపుడు । మహిషాసురుని చంపిననాటి । మంటలుమండే రీతిగాయుండె । యది
చూచి శ్రీ రాముడప్పుడు । బాణంబులను ధరపయికురిపించె । యదిచూచి పార్వతి యతి
కోపంబున । బాలలదింపి రాముతోపలికే । లక్ష్మికి సహాయం పార్వతి సహాయం । సరస్వతి
సహాయం కలుగుచున్నదిగా । వలదువలదు బాలలతో వాదము । వలదని బలికెను పార్వతి
దాను । యచ్చట తమ్ములు గూలినారు । ఇందు కేమి యుపాయమనిరి । తమ్ములచంపిన
కాంక్షలు దీరక । వూరికెవిడుతునాబాలలనిపుడు । ఆ పలుకులువిని పార్వతప్పుడు । ఆలాగే
చూతము కానిమ్ము । బాలులపిలిచి పార్వతితాను । బెదరక భూమిని ప్రార్థించమనెను ।
అనవినిబాలలుఅతివేగమున । భూదేవిని ప్రార్థనచేసిరపుడు । ఆడవారిఅభిమానం ఆడు
వారికందురు । అమ్మను కన్నట్టియమ్మవునీవు । యీ సమయంబున గావకుంటివా । కార్యము
చెడును నిందబడును । యారువేల సేనల జతగూర్చి । తయినాతిగ పంపించెచు వారిని ।
ఘణఘణ మ్రోగేటి కంచురథములు । ఝణఝణ మ్రోగేటి భేరీలును । భేరీ మృదంగాలు
ఘోరునా కొలువా । నగార నవుబత్తు మ్రోయగా । సాయము వచ్చెను భూదేవి యప్పుడు ।
పన్నెండు యక్షోణుల బలములతోనూ । ధరణి సహాయము తానేవెడలె । యదిచూచి
శ్రీరాముడప్పుడు । యజ రుద్రాదుల రమ్మని పిలిచె । హరిబ్రహ్మాదులు విల్లులబట్టి । యాది
మూర్తిసరసను నిలుచుండ్రి । వజ్రాయుధము చేతబట్టుకొని । వరుసను నిలుచుండెను
యింద్రుడు । హరిహరబ్రహ్మాలు వొక సమయమునందు । విల్లు బట్టగా చూడగా లేదు ।
హరిహరబ్రహ్మాలువిండ్లుబట్టుట । ముల్లోకములుగడగడవణకే । యదిచూచిపార్వతియపుడు ।
హరశంకరుల హస్తముబట్టె । అంతలోనె సరస్వతి అప్పుడు । చాటుగబ్రహ్మహస్తము
బట్టె । అదిజూచి శచీదేవి వేగమున । సరగునయింద్రుడి హస్తముబట్టి । తగదుతగదు
మీరందరుగూడి । బాలులచంపుట ధర్మముగాదు । తనయులనుచు యెరిగించితె రాముడు ।
తలలుంచకా మానడు యేమో । బాలలను యెఱిగింపక యుంటే । పగచేచంపక మానడు
యేమో । యందరుకూడి ఆలోచించి । రాజీచేయుట న్యాయంబనిరి । బాలుల పంతము
చెల్లగవలెను । చెల్లకుంటె ప్రాణములువిడుతు । పట్టుపట్టగా పార్వతితాను । పరమేశ్వరు
చెయివిడువను అనెను । దేవతాసురుల యుద్ధములోను । యిటువలెవింతలు జూడగ లేదు ।
హరబ్రహ్మాదులు ఆలోచించి । బెదురుతు రఘుపతి కిట్లనిబలికె । ధరణిసహాయం బాలుల
కుంది । శక్తిసహాయం బాలులకుంది । గెలువగలేరు బాలులమీరు । వలదని వాదించిరి
వారంతా । ఆపలుకులువిని శ్రీరాఘవులు । అందరితో తానిట్లనిబలికె । అచ్చట తమ్ములు
కూలినారు । అనేక రాణువచంపించా । రథములు గజములు తురంగబులు । మావటీల
మమ్ములపడవేసె । ఏమిదోచకున్నది వుపాయము । ఆలోచించిరి అందరుకూడి ।

యీసమయంబున సరస్వతితాను । బాలులచే పలికించె నొకటి । ముందర మీభూపతి మ్రొక్కి-
నను । తరువాతను మేమేమ్రొక్కెదము । తమ పాత్రిణముకయి మ్రొక్కగనేల । తమ్ము
లంత రాణువపోగాను । అదిసరికాదు రాక్షసివినుమీ । మ్రొక్కుమనుచు పలికిరివారంతా ।
సౌమిత్రి భరత శత్రుఘ్నులు । బ్రతుకుమనుచు పలికెశ్రీరాము । అంతలోను వాల్మీకమహా
ముని । కమండలయుదకం గ్రక్కునదెచ్చె । దండముతో కమండలయుదకము । మంత్రించి
దానిప్రోక్షించెనుగా । జీవౌషధమని సంతోషించి । సంజీవనిసభ లేచిరి అపుడు ।
అంగద హనుమంత నీలుడు సుగ్రీవుడు । జాంబవంత సుషేణాదులు లేచే । శౌర్యశాలి
శత్రుఘ్నుడు లేచే । గోవిందా గోవిందాయనిరీ । బహుపరాక్రముడు భరతుడు లేచే ।
గోవిందా గోవిందాయనిరి । గోవిందుని తమ్ముడులేచెను । గోవిందా గోవిందాయనిరి ।
అంగదుడు అడపం బట్టగను । చేరి గుబ్బగొడుగు భరతుడు బట్ట । దనుర్బాణములు
సౌమిత్రిబట్టగ । చామరము శత్రుఘ్నుడుబట్ట । సూర్యచంద్రులు వింజామరలు
విసరగా । సూర్యపటము సుగ్రీవుంబట్ట । యేకాంత స్థలంబున విభీషణుడుండగ ।
హనుమంతుడు అడుగు లొత్తగను । జాంబవంతుడు జేరికొలువగ । పరమమునీం
ద్రులు సేవలుజెయ్యా । బ్రహ్మరుద్రాదులు యిరువంకలను । యింద్రాదులు యెదురుగ
గూర్చుండి । బహుపరాక్కనీ భటులుపొగడగ । కొలువై కూర్చుండిరి రాఘవులు । తండ్రి
కొలువు తమ కన్నులచూచి । అన్నకితమ్ముడు యిట్లనిపలికె । అన్నరోచూడుమి రాముని
మొగము । కళాపూర్ణమై యున్నదిసుమ్మీ । లక్ష్మిగూడ వక్షంబునయుంటె । జూచుటకు
శక్యము కాదనిరపుడు । కౌసల్యయెన్ని నోములునోచెనో । దశరథులెన్ని తపములుచేసె ।
దశావతారుడు తనయుండౌటకు । పుణ్యంబుజేసిరి బహువిధముల । యిన్నిచిన్నెలుగల
పతినెడబాసి । యెట్లుజీవితము నిలిపెనుసీత । పతినెడబాసి బ్రతుకుటకంటె । సతులకు
ప్రాణం విడుచుటమేలు । యీ సమయంబున స్వామినిజూడని । జన్మములు యెత్తిఫల
మేమి । అశ్వంబట్టి కట్టినందుకు । పరమాత్మనిసభ జూచితిమనిరీ । శేషశాయిశ్రీగరుడ
వాహన । సీతాపతి పాదములుబట్టి । అని ఈ విధమున స్తోత్రించేయుచు । ఆశ్చర్యంబున
జూచుచునుండె । లక్ష్మణుని చూచారాఘవులు । జెప్పిరిజరిగిన వృత్తాంతంబులు । మ్రొక్కితే
అశ్వంవిడిచేమనిరీ । మనమ్రొక్కుట ధర్మంగాదు । ఆపలుకులువిని శ్రీలక్ష్మణుడు ।
అన్నకుమ్రొక్కుతు యిట్లనిబలికె । చేకొనికార్యంపుట్టిన చోటకు । పితృమాత్రవ్యులు
వెన్నులను । కులగురువులను మనసులోపల । తలచిమ్రొక్కుట తగునేలఅనెను । ము
మ్మారు వలగొని మ్రొక్కను । మానమ్మకమని కుశలవులనిరీ । వారు మ్రొక్కుటా
ధర్మంగాదు । అడుగుమనిరి సూర్య నప్పుడును । అని అందరు బలికిన పలుకులు । నవ్వు
చుకుశలవు లిటులనిబలికే । సూర్యవంశపు రాజేకాడా । వంశాభిమానం యుండకమానదు ।

సూర్యుడుజెప్పుట నమ్మికలేదు । అడుగుమనిరీ చంద్రుణ్నపుడు । రాహుకేతువులు అడ్డు
వచ్చిలే । విష్ణుసహాయం చంద్రుడికుంది । చంద్రుడుజెప్పుట నమ్మికలేదు । అమర అసు
రులు అబ్ధితరువగ । అమృతమంత యింద్రునికిచ్చె । విష్ణుసహాయం యింద్రునికుంది ।
యింద్రుడు జెప్పుట నమ్మికలేదు । అడుగుమనిరీ వశిష్టాదులను । కులగురువు
వశిష్టునిచూడ । వశిష్టు జెప్పుట నమ్మికలేదు । అడుగుమనిరి వాల్మీకులనప్పుడు ।
అఖిలాండకోటి బ్రహ్మాండములేలగ । విష్ణుపొగడెను వాల్మీకి । వాల్మీకి జెప్పుట
లేదు । అడుగుమనిరి ఋష్యశృంగుని । యేడుసముద్రముల నడుమధ్యంబున । తపమాచ
రించుచు యుండగను । ఋష్యశృంగుణ్ణి దోడుకవచ్చి । మెచ్చిశాంతను యిచ్చినవారు ।
పక్షంబులు పలుకకమానడు । ఋష్యశృంగుడు జెప్పుట నమ్మికలేదు । అడుగుమనిరీ
బ్రహ్మదేవుణ్ణి । విష్ణునాభి కమలమందున । యుద్భవించిన వాడేకాదా । బ్రహ్మజెప్పుటా
నమ్మికలేమ । అడుగుమనిరీ సాంబశివునప్పుడు । బ్రహ్మవిష్ణు మహేశ్వరులనగ ।
త్రిమూర్తులు వారేకార । చేకొనిమిమ్ముల చంపంగవచ్చిరి । శివుడుజెప్పుట నమ్మికలేదు ।
అడుగుమనిరీ సౌమిత్రినియపుడు । వీరలకుతమ్ముడు యితడేకాడ । యనుమతిగాను
నడిచేవాడు । అన్నశెలవుగొని వదినను చంపలేదు । సౌమిత్రిచెప్పుట నమ్మికలేదు ।
యిందరినడుగ వలసినదేమి । మ్రొక్కకహయము విడువముమేము । వేడుకగాహయము
బట్టినారము । చంపగవలెకడు మ్రొక్కగవలెను । యెన్నివిధముల జెప్పినగాని । విననేరని
వివేకహీనులుగ । ఆపలుకులువిని శ్రీరాఘవులూ । అజరుద్రాదుల కిట్లనిబలికె । యిందరు
సేనలు తమ్ములుండగ । యింకమహేంద్రులు మీరుండగను । పోరాడిగెలిచి పోయెదము ।
బాలులను బ్రతిమాలగనేల । ఆమాటలవిని పార్వతితాను । హుంకారంబున యిటులనిపలికె ।
బాలులపైని విల్లుబట్టితే । బ్రహ్మాండంబులు నిల్వంగలవా । మ్రొక్కుటమీకు మొవాసు
లైతే । అశ్వమేధ యాగముమాని । అడవుల వాసంబుల మీరుండి । యయోధ్య బాలుల
కివ్వండి । ఆపలుకులువిని శ్రీలక్ష్మణుడు । అన్నకుమ్రొక్కుతు యిటులనిబలికె । తిరిగి
మనము కయ్యంబుజేసిన । బాలల గెలువము రూఢిగయిపుడు । పంతగించెను పార్వతి
కూడ । సరస్వతిసాయం కలిగియున్నది । లక్ష్మిసాయం గలిగియున్నది । యంతయు
బాలలకుంది । మంత్రబలము బాలలకుంది । మునులసహాయం బాలలకుంది । మంత్రబలిమి
చాలకలిగినది । శక్తిసహాయము బాలలకుంది । సేనలులేకా వాదముచేసిరి । యెవ్వరి
బాలలు మీరనియడిగె । మిమ్ములకన్న తల్లితండ్రులూ । యెన్నితపములు చేసిరో
యనెను । యెన్నినోములు నోచెనోతల్లి । యెన్నితపములు చేసెనోతండ్రి । యన్నమీవంటి
తనయులు కలుగగా । బహుజన్మంబుల చేసినఫలము । నోములు వ్రతములు నోచగలేదు ।
తపములు జపములు చెయ్యగలేదు । అరణ్యవాసము హడలుతు అమ్మా । మమ్ములకనెను

యీకానలలో । మంచితపముచే మహామునులంత । మమ్ముపెంచిరీ యడవులలోను । పూజ్యమయిన పుణ్యకులమునబుట్టి । అడలుతుయున్నది అరణ్యములోను । ఆపలుకువిని శ్రీరాఘవులు । అప్పుడుబాలల కిట్లనిబలికె । మీరువచ్చి మాయయోధ్యలోయుంటే । రాజ్యమింత మీకిచ్చెదమనెను । వారిచూపుల వైభవముజూచి । చిరునవ్వు నవ్వుతు లక్ష్మణుండు । పలుమారు పరిహాసలేమిటికి । పరమాత్మునికి దయవచ్చింది । బాలులార మీరు భయపడవలదు । జడియగవలసిన పనిలేదిపుడు । అనేకవిధముల యడుగుతు యుంటె । యీపగా నిలుచుండెదరేమి । విప్రబాలులార తనయులార । వివరముగా మాకెరింగించండి । యీపలుకులువిని బాలకులప్పుడు । వారికిమ్రొక్కుతు యిట్లనిబలికిరి । సర్వముతెలిసిన సర్వజ్ఞులరు । స్వామిమీకు విన్నవించగనేల । వినుమీ దశరథమహిపతితనయా । మునికులరాజుల నేలెటిరాజా । మావృత్తాంతము మనవిచేయుదుము । నభవారు పంతముగ వినుడి ।

## అవతారములు.

మత్స్యావతారుడు మాతండ్రి రామ । మహలక్ష్మి సీతమ్మ మాతల్లి । కూర్మావతారుడు మాతండ్రి రామ । చక్రవర్తిపుత్రి మాతల్లి । వరహావతారుడు మాతండ్రి రామ । వరలక్ష్మిసీత మాతల్లి । నరసింహావతారుడు మాతండ్రి రామ । శ్రీలక్ష్మిసీత మాతల్లి । వామనావతారుడు మాతండ్రిరామా । జగలక్ష్మి సీతమాతల్లి । భార్గవాకారుడు మాతండ్రి రామా । భాగ్యలక్ష్మి సీతమాతల్లి । యికనేమి శంఖునాదములు చెలగుచున్నదదుగో । భూనభోంతరాళములునిండె । దైవబలము చాలగలిగుంది । జాలి నొందెదరు బాలలుజూచి । బట్టరుయెవరు బాణంబులను । బాలలపైని వేయగలేరు । మంత్రిబలముచే బ్రతికితిమిగాని । మన బలంబు కావనిబలికే । బాలలపంతమే చెల్లించండి । బ్రతికించండి మమ్మందరిని । పార్వతితో పంతమువద్దండి । బ్రహ్మాండంబుల నిలుపండనెను । వడివడిలక్ష్మణ వేగమే వచ్చి । వారిగెను శ్రీహరి పాదములపైన । అదిజూచి భరత శత్రుఘ్నులు । పరమాత్మని పాదములబడిరి । అడుగుపైయున్న తమ్ములనెత్తి । యాలింగనంబు జేసెశ్రీరాముడు । బాలలచంపగ వలదనిచాల । బ్రతిమాలెను లక్ష్మణుడపుడు । వల్లభునిజూచి మ్రొక్కుటధర్మంగలదా అనెను । కనివల్లభులు వందనములుచాయ । తగుననిపలికిరి వారందరును । పయినున్న శాలువతీసుకొని । నడుముకుజుట్టిరి నారాయణులు । శరణుశరణుమాతండ్రి దశరథరాజు । పాదంబులకు కులగురువు వశిష్టులకు । శరణుశరణుమా కౌసల్య చరణారవిందము । శరణని చక్రధరుడేపలికె । శరణుశరణని శ్రీరాఘవుపలుకగా । చిత్రంబులైతోచెన్ను । యీపలుకులవిని బాలలప్పుడు । నయనబాష్పముల సౌమిత్రిజూచె । అదిజూచి

సౌమిత్రినపుడు । నయనపుసంజ్ఞల రమ్మనిపిలిచె । హయమును విడిచి హరిపాదములకు ।
మ్రొక్కుమనుచు సంజ్ఞలుచేసె । హయముదోడుకు హరిసన్నిధికి । సరగునవచ్చిరి బాలలు
తమరు । వాకకాలితో నిలుచుండప్పుడు । చేతులుముడుచుక స్తోత్రముచేసె । శరణుశరణు
చక్రధరుడ । సకలజీవి రక్షకశరణు । అఖిలాండకోటి బ్రహ్మాండనాయక । ఆదివిష్ణుమీ
పదములకు శరణుశరణు । శరణనిబలుకుతు జేరవచ్చి నిలుచుండినారు । తప్పకచూచి
బాలలవంక । పుత్రమోహమున యిటులనిపలికె । యేదేశమువారో మీతల్లిదండ్రులు ।
రామావతారులుమాతండ్రి । రామ రాజ్యలక్ష్మిసీతామాతల్లి । బుద్ధావతారులు మాతండ్రిరామ
భూపుత్రిక సీత మాజనని । కలికావతారులు మాతండ్రిరామ । కమలగంధి సీత మాజనని ।
వేరుచేసి మీరడుగనేల । వేయివిధముల జెప్పగనేల । మరిసీతా యతి క్లేశంబులుపడుతు ।
మమ్ముల సీతకనె కానలలోను । మరితాయతికష్టంబులుపడుతు । మసలకసీత మమ్ముల
పెంచె । అక్షరవిద్యలు గుణమంత్రములు । వనములో వాల్మీకులుజెప్పె । ఆకులలుములు
భక్షింపుతును । అడవులనుంటిమి యమ్మకుతోడై । పులులుసింహములు కారడవులలో ।
పెంచిరి వాల్మీకుమమ్ములను । అచ్యుతు పుత్రులు యాడినమాటలకు । హరబ్రహ్మాదులు
ఆశ్చర్య మొంది । జానకితనయులు జేసినకయ్యము । జూచిసురులు చోద్యమందిరిగా ।
యాపలుకులవిని శ్రీరాములకు । యతిదుఃఖమై తోచెనుమనసు । మమ్మగన్న మాతండ్రు
లార । రమ్మనమని హస్తాలుచాపె । హంసలువాలిన చందంబులను । హరితొడలపై
వాలిరినారు । కూరిమితొడలపై గూర్చుండబెట్టుకు । మాడబట్టి ఆఘ్రాణించుకొని । మరి
మరిదుఃఖించెను శ్రీరాముండు । రామునికళ్ళజలములతోను । బాలలకు అభిషేకములాయె ।
బాలలకళ్ళ జలములతోను । రాములకు పాదంబుతడిసె । కొంతసేపు చింతించిన వెనుక ।
కౌగిటజేర్చెను ప్రేమలుదీర । మమ్ముకన్న తండ్రులార । వనములో దాగియున్నార ।
మమ్ముకన్న మాతండ్రులార । మిముజూడకనులు లేవామాకు । మముగన్న మాతండ్రు
లార । అడవులపాలుగ జేసితిమిమ్ము । యింతసేపు యెరిగించకమీరు । యెంతకష్టము
పొందితి రనెను । పూలశయ్యలా పవళించేటిమేను । పూలపాన్పుపైన పవళించితిర ।
రాజాన్నంబులు పిండివంటలు । పంచభక్ష్య పరమాన్నంబులు । యతిరసములు ఆరగించెడి
మీరు । ఆకులుఫలములు భక్షించితిర । ఆపలుకులువిని సౌమిత్రపుడు । అతివినయంబున
యిట్లనిబలికె । పుట్టుభోగికయి పుత్రుడుపయి । బూలపాన్పుపై పవళించగలేదా ।
యయోధ్యరాజ్యం విడనాడి । అడవిలో సంచరించగలేదా । అక్రేసంబులు బడవలసినా ।
ధారణమీలాగున యుండగను । మదితప్పించుట యజునిశక్యమా । స్వామీమీరు చింతిం
పగనేల । యవును లక్ష్మణా యవునుయనుచు । సంతోషించిరి శ్రీరాఘవులు । వనములో
మాజానకినుంచి । జెప్పవైతివి తమ్ముడానాతో । ఎందుకుయుద్ధం బంటివిగాని । యెరిగించ

వైతివి లక్ష్మణానాతో । యిదికర్తువుగాదు మనకిపుడు । యెపుడుమంగళ ప్రదమౌగాక ।
ఏమండివాల్మీకమహాముని । లక్ష్మియున్నదా మీపురమందు । మాతపోఫలమంటిరిఏమీ ।
నాభాగ్యఫలమనియనుకోరాద । రాజ్యలక్ష్మిని దోడుకరమ్మంటె । వచ్చెనువాల్మీకులు
వేగమున । యంతఃపురములోకెళ్ళి । మన్నించినలక్ష్మినిపిలిచి । రావే గోకులరాణివే
మన్మధరాణివే । రావేపల్లవపాణిరావే । రావేపువ్వుబోణి రమ్మనెను । శ్రీరాముశిరోమణి
మాణిక్యమా । సుందరమణి రమ్మనితాపిలిచె । చనుదెంచెనుజానకి సంభ్రమమున ।
యందెలుగదల నందముమించ । దశరధరాములు రాముతనయులు । ఏవిధంబున
యున్నారనెను । జలజాక్షి నీజపములునిండె । ధవళాక్షి నీతపములుబండె । పద్మగంధి
నీపంతము జెల్లెను । పరుగున నీపతికడకేతెంచు । కోమలాంగి నీకోరిక కొనసాగెను ।
గొబ్బున నీపతి కడకేతెంచు । జానకితపమున జగములుబండెను । జానకి తపమున
యుగములునిండె । నలినాక్షి నీకోరికతీరెను । పుత్రులంటే పుత్రులుకారు । పుండరీకాక్షులను
నిన్నుకలిపిరె । ఏమనిజెప్పుదును జానకినీతో । యెంతకయ్యంబుచేసిరేవీరు । మ్రొక్కుతే
యశ్వంవిడిచేమనుచు । బట్టుపట్టిరె బాలలుయపుడు । మీరుపిన్నలు వారుపెద్దలు ।
మ్రొక్కుడధర్మం కాదనిరంతా । బాలలమాటే ధర్మంయనుచు । పట్టుపట్టె పార్వతి
కూడ । తల్లిలేని తనయులు కాబట్టి । తల్లిపార్వతి దరిజేర్చెనుగ । శ్రీరామయనుచు
పలికితా హడలె । సీతహడలగ సమయంకాదు । యిప్పుడు నిన్ను దోడుకు
రమ్మనెరాము । యరుంధతినిపిలిచి వాల్మీకులు । జానకికి శిరసంటుడు యనెను ।
సంపెంగతైలమున శిరసంటి । పచ్చనిపసుపుతో నలుగుపెట్టి । శ్రీగంధమున
యటకళ్లగాచిరి । సీతకు జలకం బార్చెడువారు । మెత్తనిబట్టతో మేనులొత్తిరి ।
కనకపీతాంబరము కట్టిరి । కుందనపురవికా దొడిగించిరి । పసుపు కుంకుమా అలంక
రించిరి । పరిమళంబుల యలదినారు । సర్వశృంగారం జేసిరియపుడు । పన్నీరుచీరలు
పట్టురవికెలు । పద్మగంధి వడినుంచిరివారు । కొందరుసీతకు మ్రొక్కెటివారు । కొందరు
కౌగిట చేర్చెటివారు । కొందరుసీతను జూచెటివారు । కనులజలములు తెచ్చెటివారు ।
పరుగుపరుగున వచ్చెటివారు । యడ్డగించి నిలుచుండెటివారు । పన్నెండేండ్లనుంచై తే
యప్పజెల్లెకన్నయెక్కువగ । ఆదరంబున యుంటిమిమేము । యింతలోపల సీతపైనము ।
యెరుగమైతిమె యమ్మరోమనము । యనియీవిధముననతివలందరు । వేగమురమ్మనుచు
వాల్మీకి । ముత్యాలముత్యాల తోరణాలేదూరి । రత్నాలవాకిళ్లేగడచి । పగడపు గడపలెదాటి ।
నడిమిపందిటిలోపలికొచ్చె । సెలవనిముని కాంతలకుజెప్ప । శీఘ్రముకదలెనుగాను । జానకి
దేవి యంతలోను । యన్నకు తమ్ముడు యిట్లనుకొనిరి । అబలజానకి మనయమ్మ
యెరుగదు । తాతవెంట జనుదెంచుటయేమో । చివ్వన శ్రీహరి తొడలపయిదిగియె ।

వాయువేగంబున యతివేగమునా । గ్రక్కున ఋషిపల్లెకేచనుదెంచి । యల్లంతటతమ తల్లినిచూచి । నాసికములపై హస్తముంచుకు । అతియాశ్చర్యంబున అద్భుతపడుచు । యెంతవెఱ్ఱిదానవేయమ్మ । యేమన వచ్చును యమ్మరోనిన్ను । మునుపటిరాముడు గాడాయమ్మ । గర్భిణిస్త్రీవని కరుణలేకను । వధియించ వనములకంపెనా । యలవిగాని బహ్మాండంవంటి । యగ్నిలో త్రొక్కించడయానాడు । తల్లిదండ్రులు ధర్మస్వ రూపులు । తప్పనాడుట ధర్మంకాదే । నీవుపోయి బతిమాలిన వెనుకా । ఘనతయుండదె యమ్మరోనీకు । రాముడు దశరథరాజ కుమారుడైతె । గొల్లవారిబిడ్డవ మాయమ్మ । రాముడుదొచ్చి బ్రతిమాలినదాక । నేరమున్నదని బలికేదాకా । శరణని రాముడు పిలిచినదాకా । మాటాడకే మాయమ్మరోనీవు । నాయడవుల దిక్కెవ్వరులేకా । గొంపోయిరి దానవులానాడు । దానికిరాముని నేరములేదు । విధివశంబులు యాలాగుండే । నేడయోధ్యలో సకలంగలిగుండా । చంపబంపుటకు కారణమేమీ । పంతగించిరాముడు పోడేమీ । భయమేటికే యమ్మరోనీకు । దిగ్గజములము యిద్దరుకొమాళ్ళవుండగ । యేమిటికొదువే జానకినీకు । అయోధ్యారాజ్యముండగను । యేమిటికొదువే యమ్మరోనీకు । పద్మగంధి హస్తంబులుబట్టుకు । యంతఃపురము లోపలికొచ్చె । మునికాంతలకు అమ్మ నప్పగించి । గ్రక్కున వాల్మీకుల కడకేతెంచి । తాతగారు మీరయితేఇప్పుడు । బహు కాలంబులు గడచినవారు । అబలజానకిమాయమ్మ యేమెరుగదు । సర్వం తెలిసిన సర్వజ్ఞు లుమీరు । యాడబడుచు యత్తవారిండ్లకంపితె । యనుకూల దాంపత్యముజూచి । దాటగలిగి యయినను బోనీ । సతిపతులసఖ్యం బులుచూచి । పంపుమని ధర్మంబులుగలవు । యనిబాలురు పలికినమాటలు । నవ్వుచు వాల్మీకుండిట్లనెను । కరియావుల ఘృతముగాని । తానారగించడు । రత్నములే పమిధలుగావలెను । రాముడిచ్చటికి రాడనిపలికె । వూరికె వచ్చున రాముడిచ్చటికి । లక్ష్మినిగావలసిన రాముడువచ్చు । లక్ష్మియశ్వం కొరకై వచ్చు । రాకుంటేనూపోనిమ్మనిరి । యిన్నిదినములుండి మమ్ములపెంచి । యిప్పుడు పెంచగలేరా మీరు । యయోధ్య రాజ్యము గెలిచితిమా । యగ్రహారములను యిత్తుమీకు । వర్షములు గడిచినపిమ్మట । యమ్మనిదోడుక పోదుము మేము । ఆపలుకులువిని వాల్మీకులకును । అతియానంధమైతోచెను మనసు । గోరు మిఠాయిలు మేము తేగలమనిరి । కరియావు ఘృతము మేము గావింతు మనిరీ । రాముని దోడుకు రమ్మనుచును । ఆయత్నంబులు చేసిరివారు । ముప్పయికోట్ల దేవతలూ । అరవైకోట్లమునులు । దేవ దేవేంద్రదేవతాదులను । కడునొప్ప కౌసల్యానందనాదుల । రూఢిగభరతశత్రుఘ్నులను । అందరితోడుక రమ్మనిరపుడు । ఆమాటలువిని వాల్మీకుండు । ఆలాగేగావింతమయనెను । కూర్చుండేటందుకు కుర్చీలు । విసరేటందుకు వీవనలు । నిమ్మలుపిడిచిన నీరుమజ్జిగలు ।

దాహంబులు బట్టియ్యమనిరీ । యింద్రదివ్ర భాషాదుల్ పొగడ । యక్షకిన్నర గంధర్వుల్ పొగడ । ఋషులువేశ్యలు మొదలగునప్పుడు । అత్రి మహాముని యంబరీషులు । కపిల గార్గేయమార్కండేయ । మహామునినారద సనకసనందనాదులను । వాసికౌసికవాల్మీకులు । ఋష్యశృంగుడు రుక్మాంగదులు । గౌండివ్య శాండిల్య శరభంగులను । గౌతమ మహామునికి కబురంపిరిగా । దూర్వాసజాదాలి జమదగ్ని । వామదేవులు వచ్చిరిఅప్పుడు । వసిష్టుడు మొదలైన విప్రులంత । భరద్వాజులు జనుదెంచిరిగా । ఋగ్వేదంబులు సామవేదంబులు । అధర్వవేదంబులు మొదలుగాను । యజుర్వేదంబులు తర్కించిరిగా । మంత్రబులూ మహిమలేచదువా । వ్యాకరణము వాల్మీకులుజెప్పా । స్వాధ్యాయము చదువుకొనుచు । ఋష్యశృంగుడు ముందరనడిచె । కట్టుచుబిళ్ళగోచులు చెన్నుమీరి । చిన్నంగోష్ట్రంబులువీరు కావిదోవతులనుగట్టిరి । దర్భాసనములు చంకను బెట్టిరి । విభూతిరాసిరి వారంత । శాస్త్రంబులవాదములాడుచును । నడుమధ్యంబునలవకుశులు రామాయణములు చంకనుబెట్టుక । రామలక్ష్మణుల చందమునుండ్రి । అల్లంతమహామును లనుజూచి । ఆశ్చర్యముపొందుతు రాఘవుడు । అప్పుడుతమ్ముల కిట్లనిబలికె । ఏమిర లక్ష్మణఏమోగాని । మునులమధ్యబాలలచూచితివా । మునివేషంబులులేవురవీరికి । రాజకళలు కనుపించుతుయుంటె । విభూదిమెడనిండ బూసినా । విప్రవేషములు లేవురవీరికి । యాపలుకులువిని సౌమిత్రప్పుడు । అన్నకితమ్ముడు యిట్లనిబలికె । యాదిమూర్తిమీతనయులయి యుండి । మునివేషములేలాగునవచ్చు । మబ్బునసూర్యుడు మాసియుండునా । చెడునా కళలు యెన్నటికయినా । మాణిక్యము మసిపాతనుగట్టిన । కాంతి రాఘవవినుమి । యాపలుకుల విని శ్రీరాఘవుడు । తనయుబాధకై దుఃఖించెజానకి । అడవులకంపిననాడు తల్లిదండ్రులు మునులంత । జానకిని తోడుకరమ్మంటె । దండుతర్లి వచ్చిరిమునులంత । దండుగాదు వినమన్న రాఘవా । వాల్మీకుడు రఘుపతి సన్నిధికేగి । వారికిమ్రొక్కి తానిట్లనిపలికె । మకర కుండలధర మణిహారా । మామహాలక్ష్మి సీతనేల । మత్స్యావతార గోవిందరామా । కోమలాంగిసీతనేలర । వరహావతారవరదుడ । మావరలక్ష్మిసీతనేలర । సింహావతారుడ నరసింహరాయ । శ్రీలక్ష్మిసీతనేలర । వామనావతారుడ వసుదేవ । మా వరలక్ష్మిసీతనేలర । మాధవావతారుడరఘురామ । మారాజ లక్ష్మిసీతనేలర । బుద్ధావతారుడ పురుషోత్తమరామ । భూపుత్రిసీత నేలర । కలికావతారుడ కమలాక్షరామ । కమలగంధిసీతనేలర । జానకిగనుక భరింపుచుండెను । రాజ్యములన్ని పన్నెండేండ్లు నుంచయితేను । పద్మగంధిమా ఇంటను యుండి । నిద్రాహారములు యెరుగదుతల్లి । యేవేళమిమ్ము తలపోయుచును । అయోధ్య వారందర్నితలచుకు । హాడలుతుయున్నది జానకివినుమి । మునిపల్లెకుమీ రేతెంచి । నప్పుడుమమ్ముకృతార్థులనుగాంచి । లక్ష్మితనయులతోడుకమీరు । యయోధ్యకు వేంచేతురు

గాని । ఆపలుకులవిని శ్రీరాఘవుడు । అప్పుడువాల్మీకుల కిట్లనెను । యెరుగనివారు మహా మునులంత । యాగం సంపూర్ణంగాలేదు । అగ్నిహోత్రములు అక్కడయుండగ । ఋషి పల్లెయేలవేంచేతు । పరభూములకుయేతెంచకూడదు । ఋషిపల్లెకురాజాలననిపలికె । అగ్ని హోత్రుణ్ణి మేముగావించగలము । రమ్మనిపిలిచిరిమహామునులంత । యెన్ని విధంబులనయి నగాని । యాగముగాకరాననిపలికె , యాపలుకులవినిబాలకులూ । శ్రీరాములతో యిటుల నిబలికె । యాగము పరిపూర్ణంగాకుండ । యేలాగున వచ్చితివి సతిలేక । సంధపూర్ణము యౌనాయజ్ఞం యేలచేసితివనిరి । పరభూమికేలాగునవచ్చితివి । అగ్నిహోత్రములఅక్కడ విడిచి । ఆపలుకులవిని శ్రీరాఘవుడు'తలవంచుకుతానిటులనిపలికె । యశ్వముకొరకై వచ్చితి నిచటకు । రాకతీరక వచ్చితిననెను । యాగపుహయము యక్కడనుండగ । సంపూర్ణం బేలాగునయౌను । యాపలుకులవిని బాలలప్పుడు । హయమునువిప్పి తోడుకుచనిరి । యశ్వముగనుక గావలసియుండిన । అక్కడకే వచ్చెదరనిపలికె । హరబ్రహ్మాదులు జెప్పినగాని । విడవము అశ్వము విడువముయనిరి । సూర్యునియెదుట చుక్కలుపొడిచిన । సప్తసముద్రములు యేకమైనా । విడువముహయమును విడువముసుమ్మి । చెప్పుకోర నీయబ్బతోపోయి । అనిరిబాలలూ పలికినపలుకులు । పంచదార పలుకులవలెయుండె । వింటివలక్ష్మణ వేడుకలన్ని । వేగమేపోయి తోడుకరమ్మనెను । ఆపలుకులవిని శ్రీలక్ష్మణుడు । అన్నకి తమ్ముడు యిటులనిబలికె । మీకుమనవి మేముజెప్పగలమా । బాలలకు మనవిజెప్పుటకు । కొట్టుయింటికి తాళంవేసి । దానధర్మములు చేయునట్లు । అన్నదానపరుడని చూపించి । యుచితముగా పూడుకొన్నట్టి । సత్యవంతుడని చాటింపించి । అసత్యముండునాయటుల , ఆచందంబుయైదోచెనుగా । తంత్రంబుగాదనితాబలికె । పోవోయి భరతుడ నీవుపోయి । సౌధాంకంబులను బాలలకుమనవి జెప్పియపుడు । యశ్వంబును తోడుకరమ్మనెను । యాపలుకులవిని భరతుడప్పుడు । అన్నకుమ్రొక్కుతు యిట్లనిబలికే । ఋషిపల్లెకుతా విజయంచేసి । లక్ష్మికైన నమస్కారంచేసి । సుఖయజ్ఞోపవీతములుదీసుకు , కావివస్త్రంబులు కట్టకనేను । దండకమండలం జేతబట్టుకొని । ఉత్తరాభిముఖ మయ్యితిగాని । బాలలపై బారుగచనుదెంచ । యామాటవిని శ్రీరాఘవుడు । నవ్వుతు వాల్మీకుల కిటులనెను । యేమండీ వాల్మీకమహాముని । ధనుర్విద్య దిట్టము చేసితిర । మాకుబాలలూ కనబడకుండను । వనభూములనుంచ తలచితిరి । ఆమాటలువిని వాల్మీకినవ్వుచు । శ్రీరాముల కిటులనెను । దిట్టముగమేము చెయ్యడమేమి । వంశావళినే యున్నదియనెను । ఆటపాల్యమున దాటకినిజంపిన । ఆదిమూర్తి తనయుల్గార చిరిచిరినవ్వులు రాముశిరసువంచుకొని । యిట్లనిబలికే । యేమండీ వశిష్టమహాముని , పూడుకొనుట యుచితంబగునా । కులగురువుబుమీరై యుండునపుడు । బాలలను యదలిం

పగలేర । బాలలవలన నేరంబులులేవా । మాదేనేరము యంటిరిమీరు । మహామునులూ మీరందరుయుండి । చక్కనితీరుపుజేసితిరనెను । తలిదండ్రులకునతిక్రమించుట । తగదు బలుకను మీరెవరైనా । పెంచినా బాలులగనుకా । పెంచినప్రేమలుయుండకమానవు । అనినవ్వుతు శ్రీరాఘవులూ । శత్రుఘ్నునితో యిట్లనిబలికే । పోవోయిశత్రుఘ్నుడ నీవు । నీవుపోయి సాధాంకంబులను । బాలలకుమనవిజెప్పి । హయమును తోడుకరమ్మనెను । ఆపలుకులువిని శత్రుఘ్నుండు । అన్నకుతమ్ముడు యిటులనిబలికే । హాయముదెచ్చుట యదియెంతటిది । యతివేగంబున తేగలగాని । బాలలను బ్రతిమాలిన విడువరు । మాలీ చోడుకురమ్మనెను । బాలలనే బ్రతిమాలగలేను । మిమ్ముప్రార్థించెద వినుమనిబలికే । యెన్నడుఋషిపల్లెయెరుగముగనుకా । ఋషిపల్లెవేంచేతామనెను । ఋషిపల్లెల్లాచిత్రములూ । కలవనిజెప్పుదురు మహామునులంతా । చూచివత్తము చోద్యంబులను । అనుచుబలికె శత్రుఘ్నుండపుడు । ఆపలుకులువిని శ్రీరాఘవులూ । నమ్మితేనసౌమిత్రిసమ్మతమని । సౌమిత్రి టుబలికె । అన్నదమ్ములు యాలోచించుకు । పిలవమనిరి బాలలనప్పుడును । పిరికిబొబ్బ సుగ్రీవుడు పట్టగా । రమ్మనమని సౌమిత్రిటుబిలిచె । అదిచూచిరప్పుడు తిరిగివచ్చెనుశీఘ్రంబునను । హరిపాదంబులకు మ్రొక్కండనుచు । కనుసంజ్ఞలుజేసెనులక్ష్మణుడు । జాడతెలిసి ఆబాలలకప్పుడు । యనేకవిధముల స్తోత్రింజేసె । కపికోట్లనుచాలగూర్చుకొని । ఘనముగ వారధికట్టినరామా । దశదిశలనుమీకీర్తి వెలుగగా । దశకంఠుని చంపినరామ । దశావతారములెత్తినరామ । దశరథరాజుకుమారుడ రామా । వొకబాణముచే వాలినిజంపి । వానరవీరులను నేలినరామ । పితృవాక్య పరిపాలనకొరకు । అతివతోవనములకేగిన రామ । మత్స్యావతారంబెత్తి । మహామునుల రక్షించుటకొరకు । సోమకాసురుని సూటికజంపి । బ్రహ్మకువేదములిచ్చిన రామ । కూర్మావతారంబును యెత్తి । కొండవీపున మోసినరామ । వరహావతారమునుయెత్తి । హిరణ్యాక్షుని చెక్కలుజేసి । భూసురులందరు మెచ్చగనప్పుడు । వసుధనిలిసినా వల్లభరామా । వుక్కుస్తంభమున యుగ్రావతార । పదునాల్గుభువనంబులూ వణకగను । బాలునిగాచిన పరమాత్ముడవు । పాపాత్మునిగోళ్లనుచీరినరామ । వామనుడవై వైకుంఠంవెడలి । శతఃక్రితువులు జేసినవాని । బలిని మూడడుగులు భిక్ష । అడిగి పాతాళంబునకు త్రొక్కినరామా । పరశురాముడవై ధరపైబుట్టి । తండ్రినిచంపిన తామస మునకు । కార్తవీర్యుని కరంబులుఖండించి । వేయిబాహువుల వేటుకిత్రుంచి । జమదగ్ని పగలుతీర్చుటకు । జగంబులో రాజులచంపినరామా । దశరథునితపములమెచ్చె కౌసల్య గర్భమునబుట్టి । శంఖచక్రి చతుర్భుజంబులతోను । శేషశాయితో జన్మించినరామా । సృష్టిలో శ్రీకృష్ణుడవైబుట్టి । స్త్రీలతోటిపలు భోగంబులను । సరసములా సౌఖ్యంబులతోను । శిశుపాలుర చంపినరామా । గోవులనుగాచు గోపాలుడవై । గోవర్ధనగిరియెత్తిన

రామా । కాళింగమర్దన కంససంహార । గజేంద్రమోక్షణ గాపుమురామా । నందనందన నవనీతచోరా । నగధరముకుంధ మాధవరామ । భూమిభారము దీర్చుటకొరకై । బుద్ధావ తారముయెత్తి । స్త్రీలవ్రతంబులు జెరపినయట్టి । ద్రోహులబట్టి ద్రుంచినరామ । కలియుగం బునా కలికాకృతివై । ఘనమగుతురగము పయినియెక్కి । పాంశుఖడ్గమూ చేతబట్టుతు । ఖలులనుచంపిన కలికివిరామ । వెయ్యిజిహ్వాలు వాసుకిఅయిన । శేషుడయినను జెప్పలేడు । మిముకీర్తింపగమాతరమౌనా । దేవకీదేవుడవు తెలిసితెనుమ్మా । శాఖలుఆకులూచెప్పగవచ్చు । చుక్కలులెక్క పెట్టగవచ్చు । సూర్యుని కన్నులచూడగవచ్చు । మిముగొనియాడుటశక్య మౌనా । మీనామముయెన్నగలేము । అనియీహృదయమున స్తోత్రిం । చెయ్యగా ఆశ్చ ర్యంపొందిరి రాఘవులు । సప్తమహాఋషులుసంతోషించిరి । అష్టదిక్పతులు చోద్యంబంది రిగా । నాశికములపై హస్తముఉంచుకు । నవబ్రహ్మలు చూచుతుయుండ్రి । ఆనందమా యెను రాముని మనసు । లక్ష్మణుడు చిరునవ్వులునవ్వే । తండ్రులుమీరుతనయులం మేము । తప్పులున్న క్షమించగవలెను । పరిపరివిధముల బుజ్జించుచును । పాదములపై నొంగిరివారు । యలసితిరని యడుగుల బడినుతించి । యెత్తితొడలనుంచెను । శ్రీరాము తప్పకుండ దశావతారములు । యెరిగించినవారెవ్వరు మీచే వనములో । వాల్మీకిమహా మునిజెప్పిన అవతారంబులుమాకు । యతివేగంబున హరియు రేదే । అజరుద్రాదులు రమ్మనిపిలిచె । మునిపల్లెకు మనమేతెంచి నప్పుడు । సీతనుతోడుకు రావలెఅనెను । మూషకవాహనం ముందరయెక్కి । అందముతో విఘ్నేశ్వరుడు కదలె । బ్రహ్మాండమున ప్రభనుకట్టుకు । భద్రకాళిదేవితోగూడి । వీరభద్రుడు తానేకదలే । గంటలనందిని గ్రక్కున యెక్కి । కదలిపార్వతీశ్వరులవుడు । హంసవాహనం బ్రహ్మయెక్కెను । ఐరావతము దేవేంద్రుడుయెక్కెను । భరతుడవుడు పగడపురథమెక్కెనుగా । శతృఘ్నుండు ముత్యపు రథమెక్కి । సుతులతోటిసౌమిత్రుడు వేడుక । సొంపారగ హేమంపురథమెక్కి । అంతట గరుడుడు వేగమెవచ్చి । హరిపాదములకు నమస్కరించి । యాదిలక్ష్మిని తనయులతో గూడపొందుచు । రెక్కలపైయుంచుకొని । యయోధ్యకు వేంచేతురుగాని । యెక్కు మనుచు గరుడుండేతెంచి । కార్యములు చేకూరెనుగనుకా । గరుడుడుగూడావచ్చెను యనిరి । గరుడవాహనము శ్రీరాములుయెక్కి । కదలికన్నుల పండువుగాను । జానకిసిరి దేవై బుట్టినది । సురలుమునులు కైవారంసేయా । వరసగబ్రాహ్మణులు స్వస్తిజెప్పగా । వాల్మీకులు వెనుకనడువగను । యెదుట సేనలు చల్లగానూ । యెదురుయెదురు మంగళ హారతులియ్యా । వాల్మీకముని యాశ్రమములకువచ్చిరి । రాములు వేడుకగాను నవరత్నఖచిత సింహాసనమూ । నడుమధ్యమున రామునకేసిరి । సింహాసనమున తాగూర్చుండి । సిరిదొడలపై బాలలనుంచె । వ్యాఘ్రచర్మం వేగముతెచ్చి । వేయించి

సాంభశివులకును । యిద్దరిమద్యను యిచ్చిరిచర్మమున । గూర్చుండెను బ్రహ్మదేవుండు ।
ధర్భాసనములుదళమునవేసి । గూర్చుండెనువసిష్టుడపుడు । వేదములు చదువుచు మహ
మునులంత । వేడుకమీరగగూర్చుండిరిగా । దేవేంద్రాదులు సభవేర్చిరీ । మునికాంతలు
రామునిజూచుటకు । కలసివచ్చిరి కడువేగముగాను । చూడలేనిరాముని సుతులందరు ।
తగుమనసీతకు శ్రీరాములకు । విల్లువిరచిన జానకిని పెండ్లాడెను । వీరుడుసుమ్మీ
రాఘవులంటే । చూడగలిగె యీవేడుకలుమనకు । దేవేంద్రాదులు సభదీర్చిరిగ । యంత
లోనువాల్మీకి మహాముని । యరుంధతినిజూచి ఇటులనిబలికె । యిక యాలస్యముచేయగ
రాదు । రాములకు నభ్యంగనంచెయ్యి । యీపలుకులువిని మునికాంతలందరు ।
ఆయత్నంబులు జేసిరివారూ । ముత్యాలపందిళ్లలోపలా । భమిడిపీటలు అరుందతిపెట్టి ।
దశరధరాముని దోడుకవచ్చి । దీవించి శిరసంటిరివారూ । పచ్చాకు కచ్చూరాలు వేసిరిగా ।
వొంటికి పిండి నలుగులు బెట్టిరిగా । మున్నూటరవై కాగుళ్లనీళ్లా । నయముగజేసి
యుంచిరివారు । శ్రీగంధంబున ఆటకాళ్ళు కాచిరి । శ్రీరాములకు జలకంబార్చిరీ ।
మెత్తనిపట్టుతో మేనతళ్ళొత్తిరి । కనకపీతాంబ్రము కట్టించిరి । కురులుచక్కగా ఆర్చిరి
వారూ । సాంబ్రాణిదీపంబులనువేసిరి । నెరికురులు యార్చిరివారంతా । నేర్పుతో శిగవేసి
రామునికి । దుప్పికొమ్ముమరి మరివారంతా । వజ్రకిరీటం వెన్నెలుమించ । అగరుగందము
పూసిరివారు । కస్తూరితిలకము ఘనముగదిద్దిరి । పసిడి గొలుసులూ పలకల మురుగులు ।
భుజకీర్తులును మెరయ కట్టుకానుకతో । కట్టిన విలువకాసులపేర్లు । ధరియించిరివారు
నవరత్నముల । అంగుళ్ళ్యంబులు బిళ్ళమొలత్రాడు । ధరియించె సింహాసనంపై ।
గూర్చొనియుండగా చాటుగాజూచెదను । జానకిదేవి యంతలోను । వాల్మీకిమహాముని
అరుంధతిని । పిలిచిఇట్లనిబలికె । ఇకఆలస్యంచేయగబోకు । జువ్విపమిధలుసూత్రపమిధలు ।
మోదుగపమిధలు మొదలుగ । అశ్వత్థ పమిధలు యావునేతులు । నల్లనక్షంతలు చేసిరి
వారు । యెఱ్ఱనక్షంతలు పచ్చనక్షంతలు । వెండిజారీలలో వుదకంవుంచిరి । భమిడిజారీల
లోనునేతులు । నైవేధ్యంబులు యుంచిరివారు । మహామునులు ఋషులువారంత ।
అశ్వత్థా వృక్షమును తరచిరి । అగ్నిహోత్రుని రావించిరపుడు । యవుపాసనము చేయగా
వచ్చె । యవుపాసనములు జేసెడి సమయమునా । అరుంధతినిబిలిచి యిటులనిబలికె ।
యిక ఆలస్యము చేయగబోకు । జానకినిదోడుకురమ్మనెను । ఆమాటలువిని యరుంధతి
అప్పుడు । సీతనురమ్మనెను శీఘ్రముగాను । అదిజూచి బాలలప్పుడు । అరుంధతినిబిలిచి
ఇట్లనిబలికె । పసిడిసీతయయ్యోధ్యలోయున్నది । యేలవచ్చునురాఘవయనుమీ । ముందర
యజ్ఞం జానకితోనూ । జేస్తివినీవు మంత్రంబులను । యిప్పుడు యీజానకిరాదు యనుచు ।
జెప్పి యరుంధతిని పొమ్మనిరి । యీపలుకులువిని వాల్మీకుండు । బెదురుతు రాముల

కిటులనిబలికె । సీతకుజలకంబార్చగలేదు । శీఘ్రమున కావించండనెను । పూర్ణేందువద
నాగృహమందున్నది । యక్కరలేదని బలికిరిమునులు , యవుపాసనములు యమరగ
జేసి । లేచివచ్చిరి శ్రీరాఘవులు । యింతలో వాల్మీకిమహామౌని । యరుంధతిని పిలిచి
నిటులనిబలికె । యిక యాలస్యముచేయనాకు । ఫలహారములు కావించుమనెనూ ।
యరుంధతిదేవి యంతటా । నందిధేనువను ప్రార్థించగా । కల్పవృక్షమా కామధేనువా ।
గావించు ముందువేగమేయనిరి । పాలుచెక్కెర జున్నుమీగడా । ఫలహారములు బిండి
పోకలును । మణుగుపువ్వులు యడకజ్జములు । పూతరేకులు యతిరసములను । బొబ్బట్లు
గారెలు మొదలుగానూ , పందిళ్ళబంతులు సాగించిరి । తనయులు చుట్టునుబట్టుచురామా ।
ఫలహారములు చెయ్యగవచ్చె । ఫలహారములు జేసెటి సమయము । నాయరుంధతిని జూచి
యిట్లనిబలికె । యికనేల యాలస్యం మగుదురో చేయగబోకు । జానకిని తోడుకురమ్మ
నెను । బాలలకు భయమందుచును । నవ్వుతు శ్రీరాముల కిటులనెను । చిన్నదిగనుక సీత
యప్పుడు । శ్రీరామా మీపొత్తుకు వచ్చుటకు । తనయుగన్నట్టి తల్లిసీతా । సిగ్గుకాదనిరి
దేవియనెను । పొత్తుబెట్టుకోదగు నాగేంద్రశయనా । చిన్నవాడవా రాఘవనీవు । లవుని
పొత్తునా పెట్టుకొని । యారగించు శ్రీరామాయనెను । కుశరాజును నీపొత్తున బెట్టుక ।
యారగించు శ్రీలక్ష్మణుడట్లు । యారగించిలేచి చేతులుకడుక్కొని । చదురులోచనెను
శ్రీరామా యంతలోను । వాల్మీకీయనసూయనుపిలచి । స్వర్గలోకము సత్యలోకము ।
కైలాసగిరి లోకమువారు । మూడులోకములవారు వచ్చేటట్టుగ । విందులు వేగమున
చెయ్యండనెను , పూర్వజన్మఫల పుణ్యంచేతా । వేంచేసిరి మనగృహంబులకువారు । సర్వ
జనములువచ్చెనువేగ । ముత్యాలపందిళ్ళలోపల । పంచవన్నెలా ముగ్గులుపెట్టిరి । కనకపు
పీటలు యరుంధతిపెట్టి , నెంచిమరీ వుదకంబులువుంచిరి । వెండిభమిడి విస్తళ్ళువేసిరి ।
పాత్రాధికారం పణతులుజేసిరి । పప్పుపూరగాయ వొప్పుగవడ్డించిరి । ప్రథముననే వడ్డించిరి
పాయసాన్నంబులు । కందచామ పెండలము వడ్డించినారు । బంతిచిక్కుడుకాయ
చిరిపొట్లకాయా । కాకరకాయలు యప్పడాలును । పెక్కు పిండి వంటలును ।
వెన్నమరగిననెయ్యి లడ్డుమీగడలు యరటికాయలు । మంచి పరువయినకూరలు ।
పనసయుమొదలైన పాకంబు కూరలు । తాలింపు కూరలును తరుచుగాతెచ్చి । చాలా
వడ్డించెను సర్వేశ్వరు బంతి । సగ్గుబియ్యం పాయసము సామపాయసము ।
సజ్జపాయసాన్నంబులు సఖియలొడ్డించిరి । రాజపుయన్నము రమణిశేఖరులు । సెగపప్పు
వడియపెరుగువాసనవల్లా । వలపుపప్పులు నెయ్యిపప్పుగావడ్డించిరి । కమ్మకాచిన కర్రి
యావునెయ్యి । కర్పూరపు గిన్నెలతో కాంతలొడ్డించ్రీ । తనయులచుట్టును బట్టుకురాము ।
కుశరాజునిబొత్తునపెట్టుకొని । ఆరగించిరిరాఘువులు । లవునిపొత్తునపెట్టుకొని । ఆరగించెను

ఆలక్ష్మణుడు । ఆరగించి హస్తములుగడుగుకొని । కర్పూర తాంబూలములువేసి । చిత్రవిచిత్రములు చూచిరాముడు । లక్ష్మీకటాక్షమని మనసునదలచె । యేచిన వచనములు యెల్లదిక్కుల । పూవినతంగేడు ప్రకారమువికసించె । మన్మధురాణి వసంతమందున । వరలక్ష్మీశృంగారమెబోలు । నీలాలురవికెలు నీటుతోజూచి । వజ్రాలరవికెలు వరుసతో జూచి । కెంపురవికెలు సొంపుతోజూచి । రత్నంపురవికెలు రాయింపరె । యెందులకే జానకి జాడలేకున్న । తలచెనుతనమదిలోపలనప్పుడు । యెక్కడ జానకి యెక్కడి బుద్ధులు । నమ్మరాదుయీమునులందరిని । యీనాడు అడవులలోను । వధియించివచ్చెను లక్ష్మణుడు । జానకిని వధియించినవెనుక । బాలలపెంచిరి కాబోలువీరు । యెన్నడుబుషి పల్లెరుగనుక । ఈవిధమునాతోడితెచ్చేరు । ఆశబెట్టినను మోసబుచ్చిరి । యెంతకానీ జానకి లేదనెను । జానకిబ్రతికున్నట్టియితేను । పలకద భాషించదనాతోను । యనితలపోయుచు శ్రీరాఘవులా । బాలలనుపిలిచి యిటులనెను । యేదిరజానకి యెక్కడయున్నది । మిమ్ము కన్నమీయమ్మేదనెను । యేదిర భూలోకమాతయేదిర । యేదిరభూపుత్రిక సీతేదిర । గొప్పకన్నుల పద్మనేత్రేదిర । కమలములోజన్మించిన కాంతేదిర । యీపలుకులవిని బాలకులప్పుడు । మాయమ్మమేమెరుగమనిరి । యిక్కడమిమ్ము యీకానలలో । కనిపెంచిన వారెవ్వరుయనెను । ఆవాల్మీకులూ మమ్ములపెంచిరి । అక్షరవిద్యలు జెప్పిరి మాకు । కోటిసూర్యులా కాంతినిమించిన । మలాంగినీ యెరుగరుమీదు । గుండె ఝల్లుమని యేమియుతోచక । యరుంధతినిబిలిచి యిటులనిబలికె । అక్షయముగనీకులంచంపెట్టెదా । జానకిని జూపించుమనెను । యనగ నవ్వుతు యరుంధతప్పుడు । యీలాగే జూపించెదన నెను । పన్నెండేళ్ళనుంచి రాఘవ । పద్మగంధి మిమ్ముయెడబాసి । నిద్రాహారములు నీరు నొల్లాక । నిలచియున్నది మిమ్ముదలచుచు । ప్రాణములతో యున్నదిగద । చదురులోచ నెను శ్రీరాముడంత । వాల్మీకిమహామునియరుంధతినిబిలిచి । యిటులనిపలికె ఏమి రహస్యం । తనకెరిగించుటకు త్వరగరాయనెను । రాజ్యలక్ష్మీ యేదనితానడిగె । చూపించు మనెను శ్రీరాఘవులు । యనగ నవ్వుతు బాలులబిలిచి । యికనయినా జూపింతురయనెను । యీపలుకులవిని బాలులప్పుడు । తమచిత్తమె మాకనుమతులనిరి । సంతోషించుతు వాల్మీ కుండు । అరుంధతినిబిలిచి యిటులనిబలికె । యికయాలస్యంచేయగబోకు । జానకిశిర పంటితివా యనెను । ముత్యాలపందిళ్ళలోపల । పంచవన్నెల ముగ్గులుపెట్టి । భమిడిపీటను ఆరుంధతీవేసె । గూర్చుండపెట్టెను జానకినైతే । సంపంగితైలమున శిరసంటి । పచ్చ కస్తూరి నలుగులుపెట్టిరి । శ్రీగంధమున అరికాళ్లకాచిరి । సీతకు జలకంబార్చిరి అప్పుడు । మున్నూటరవై కాగులనీళ్ళు । మజ్జనమాడించిరి జానకికి । మెత్తనిబట్టతో మేనితల్లొత్తిరి । కనకపుపట్టుచీర కట్టించిరపుడు । కుందనపు రవికతొడిగించిరి । కుంకుమరేఖదీర్చిరివారు ।

బరిమెళంబులు అలదిరివారు । పాదములకుమ పసుపుల రాసిరి । నవరత్మ ఖచితమైన రాగిడిబిళ్ళా । కుందనంజెక్కిన సవరపుకుప్పె । యిరుగడలా సూర్యచంద్రులు । ఛాపిడ బింద్రీలు ధరియించిరి । జేతుల జాకట్లుమెరయగను । చామంతిపువ్వుకడియములు పెట్టిరి । యానాడు మిథిలాపురమందు । ఆడిజాడ వచ్చినమీద నాలసించితిని । జెమటలుతుడుచుచు జనకుడిచ్చిన । ముత్యపుహారము జానకిమెడవేసిరి । యానాడుఅడవులలోపలను । అసురులను జంపివచ్చెడునాడు । దేవలోకమున దేవేంద్రుడు । యిచ్చిననక్షత్రపుపతకం । ఆభరణముల కన్నా అందమైనది । ఆ హారముజానకిమెడవేసిరి । పాతాళమున ఫణీంద్రుడు । బాల ప్రాయమున జానకిని । మాపాలిటికి మహాలక్ష్మియనుచు । మణిరత్నముల హారమునిచ్చె । ఆ హారముజానకి మెడవేసిరి । రావణ కుంభకర్ణులద్రుంచి । జానకిచెరలు విడిపించి । అగ్నిప్రవేశము జేయించిననాడు । యమరాసురులు జూచుచుయుండ । అగ్నిహోత్రుడు మెచ్చియిచ్చెను । ఆణిముత్యములహారంబొకటి । అన్నిటికన్న అందమయినదే । ఆహారము జానకిమెడవేసిరి । సూర్యుడుమెచ్చి యిచ్చినదనుచు । చంద్రహారము జానకిమెడను వేసిరి । యింద్రుడుమెచ్చి యిచ్చినదనుచు । యింద్రనీలహారము వేసిరి । విల్లువిరచిన వరహావతారులు । సీతాకల్యాణ దినమునాడు । సంతోషింపుచు సభవారంతా । మెచ్చి యిచ్చిన పచ్చలపతకము । అన్నిటికైనా అందమైనది । ఆ హారముజానకిమెడవేసిరి । కమలనాభూలా కాళ్ళుకడిగియా । కన్యాదానములు జేసిననాడు । వజ్రములకట్టు జనకుడి చ్చెను । సీతమొలను శృంగారించిరిగ । నవరత్నంబుల వడ్డాణమిచ్చిరి । మొహరీలపేర్లు ధరించిరివారు । పచ్చలభటువులు పందిళ్ళకును । కనకపుగాజులు పందిటదండలు । గుత్తపుజాకెట్లు జారయమ్ములను । కంకణనూడిగంబులు సొంపుగనుంచిరి । అందెలు గొలుసులు కడియంబులు కనకపుగజ్జల కాళ్ళకుయుంచిరి । మట్టెలుపిల్లేళ్లు మొదలుగను । చిటికెనబొద్దులు శీలమట్టెలను । మేలయినవంకీల వడ్డాణము । వరహాలపేర్లుతధ్యంబుగ వేసిరి । తళుక్కుమనియటి కమ్మలు । బంగరు జడవేసిరిజానకికి । మొగలరేకుల మల్లె మొగ్గల । చామంతిదండల శిఖపైచుట్రి । సర్వాభరణా లలంకరించిరి । సర్వశృంగారము చేసిరివారు । అంతలోను భూమిజకడజనుదెంచిరీ । ఆమునికాంతల కిట్లనిబలికె । చిన్నది గనుక సీతయప్పుడు । తనయులకన్నట్టి తల్లిసీత । జడవేయుటకు తగదుజానకికి । కొప్పు అమరక వుంచండి । ఆపలుకులువిని అరుంధతియప్పుడు । భూదేవికి తా నిట్లనిపలికె । పట్టపుదేవి జానకిగనుక । జడవేయుటయది ధర్మంబనెను । పణతులకూడి కడువేడుకగ । కప్పుపట్టుశాలువ వేసినారు । అంతలోను భూమిజచనుదెంచి । యదిచూచి భూదేవిట్లనెను । యీగవిసెనదిష్టిగవిసె ననుచును । నల్లపట్టుశాలువ వేయించె । అంతలోనువాల్మీకి మహా ముని । అరుంధతిని పిలిచి యిట్లనిబలికె । యింతఆలస్యం చేయవద్దు । పైడిమేడలు

బాగుగచేసి । ఫలజాతులను దెప్పించండి । పానుపు వేయించుడు రాముని కనెను । అపలు కులువిని యరుంధతియప్పుడు । భమిడిమేడల బాగులు చేయించె । యేడుకొలపులాకసకపు మేడలోపలకు । పగడంపుతరికోళ్ల పట్టుమంచములు । పట్టెమంచంవాల్చెపరుసమరబరచి । యిరుదిశల తలగడలు యింతులు వుంచిరి । నేత్రాన పట్టుబన్నీద మెప్పుబఱచి । పరిమళా దులు పాన్పుపై నిండాపోసిరి । విష్ణుకు ప్రీతైన విరజాజువులు । ఆమంచిపాన్పున అవి చాలబఱచిరి । స్వామికిప్రీతైన సన్నజాజులు । ఆమంచిపాన్పున అవిచాలబఱచి । యెన్నో తెచ్చారుపారుజాతాలు । మోపులాది తెచ్చారు మొగలిపువ్వులు । కావిళ్లతెచ్చారు కలవ పువ్వులు । ప్రొద్దున్నెపూసిన బొండుమల్లెలు । జానకిపెంచినవి జాజిపుష్పములు । మధ్యా నంపూచినవి మంకెన్నపువ్వులు । సొంపుగ పూసినవి సంపెంగపూలు । అవిపోయి పూసినవి మందారపువ్వులు । అవిపోయిపూసిన నీలాంబరములు । పందిళ్లబూసినవి పారు జాతములు । తొడిమెలుతీయించి అవిచాలబరచి । ఘనముగపూచినవి కనకాంబరాలు । వానలకు బూసినవి వాడంబరాలు । వేళకుపూసినవి పేరుమల్లెలు । అచ్చమైనపచ్చచామంతి పూలు । తెల్లచామంతులు చెంగల్వపువ్వులు । మరువమాకెరువమా మంచిదవనము । బంగారు పళ్లెముల యింపుతో యుంచిరీ । ముత్యాల తోరణములు గట్టిరి । పావాలుతెచ్చియు అచ్చోటయుంచిరీ । కనకపుగిన్నెలతోగంధములుంచిరీ । మాణిక్యస్తంభాల దీపాలుంచిరీ । నిలువుటద్దములు వన్నెలుమించ । మాణిక్య దీపాలుమఱివెలుగుతుండె । హేమకలశముల జలములుతెచ్చి । యెడమ భాగమున వుంచిరివారు । కూర్చుండెటందుకుకుర్చీలు । కుడిభాగ మున వుంచిరివారు । దబ్బపండ్లుమంచి దానిమ్మపండ్లు । నిమ్మపండ్లు మంచినేరేడిపండ్లు । అరటిపండ్లుమంచి మామిడిపండ్లు । జామపండ్లు మంచిజంబీరపండ్లు । పనసపండ్లు పంపర పనాశపండ్లు । కమలాఫలములు ద్రాక్షఫలములు । సీతాఫలములు గంగ రేగులు । ఫలపండ్లుమంచి యారువెలగపండ్లు । చేతనుఖర్జూర ఫలములు । పానుపు సరసమ వుంచిరివారు । గరిమల్లెదండలు గప్పిరీ పానుపుపయిని । పచ్చిపోకలు పండుటాకులు । పరిమళాదులు వుంచిరీవారు । అత్తరు అగరు పన్నీరులును । మగువసీతారాముల పానుపుగన । యెవరికి కలిగున్నది యనిబలుకుదురు । లక్ష్మి కటాక్షము రామునిగృహము । చూడగలిగె మనకందరికనిరీ । అదిచూచి బాలలప్పుడు । గ్రక్కున జానకికడకేతెంచి । అల్లంతటతమ తల్లినిచూచి । అతియాశ్చర్యంబున అద్భుత పడిరీ । యిన్నిదినములనుంచి అమ్మనుచూచితే । యింతవింత కనుపించగాలేదు । ఆదిమూర్తి నెడబాసియుచ్చట । అంధకారము వలెవున్నదియమ్మా । ఆదివిష్ణు చనుదెంచిన వెనుక । ఆదిలక్ష్మిముఖ పద్మంచూడు । పదియారు పూర్ణకళలతో । పద్మగంధి నిండున్న దనిరీ । యిన్నికళలుగల మనజానకిముఖము । అజుడెట్లు వ్రాసెను అడవులతిరుగ ।

ఆపలుకులవిని కుశుడప్పుడును । తమ్మునితో తానిట్లనిబలికె । యడవులతిరిగితె
అమ్మకులోపమ । యజరుద్రాదులు మెచ్చగలేదా । ఆరావణుని జంపుటకొఱకు ।
ఆదివిష్ణువు అవతారంమెత్తి । జగముపొగడగ సురులుమెచ్చగా । జానకిచెలి
యుండగవలసె । కాంతిగలిగిన ముఖముగనుకనే । కమలాక్షునికి సతియైబుట్టె
సిరిముఖమునగల సీతగనుకనే । చక్రవర్తి గర్భంబునబుట్టె । ఆజగములనేలేటి జనకుడ
నగను । జెప్పశక్యంబగునామనకు । రాజ్యములేలెటి రాముడనగను । తలచుటనున తర
మౌనయనెను । తల్లినితప్పక జూడగరాదు । ముత్యాల హారంబులు సవరింతును । తల్లి
వంకాచేరిన బాలలు । కలకలనవ్వుచు పాలింపుచును । పాలుత్రాగేటి సమయమందున ।
తల్లిముఖముజూచియిట్లనిరీ । పరమపతివ్రతను నేనేయనుచు । పాదంబులకు మ్రొక్కిమి
యమ్మ । కఠినహృదయమే కమలాక్షుడికి । ఖడ్గంబున ఖండించునేమో । గర్భిణీస్త్రీయని
కనికరించకా । వధియించ వనములకంపేడా । యలనిగాని బ్రహ్మాండమువంటి ।
యగ్నిలో తొక్కించెను యానాడు । నాటిరాముడు కాడానేడు । పతియనినమ్మకు
అమ్మరోనీవు । ఆపలుకువిని జానకప్పుడు । తనయులతో తానిటులనిబలికె । పతిబ్రతి
మాలుట ధర్మంగాదు । పతివ్రతగుణములుగావనిబలికె । ఆరాముడిపై యమ్మరోనీకు ।
యెక్కువ ప్రేమలుకలిగుంటేను । యప్పుడెజెప్పగ రాదాయమ్మ । తాతవెంటబంపింతు
మనిన్ను । నిష్టూరములు మాకుయేటికె । నీకుజెప్పు మేమెంతటివారము । రాముడిచ్చటికి
రాడేమిటికే । యంతపంతము మాకేమిటికే । మమువిడనాడే నట్లయితేను । మాటాడవే
రాములతోను । మాపయిచాల దయగలిగుంటే । జెప్పినట్లుగా జెయ్యవెఅమ్మ । రాముడొచ్చి
బ్రతిమాలేదాకా । నేనంతవచ్చి బలికేదాకా । శరణనిరాములు పిలిచేదాకా । మాటాడక
యుండవె యమ్మా । సీతారాములకు కనబడకుంట । యుపాయం బున్నది యనిరీ ।
చిలకలచంద్రిక యప్పుడెతెచ్చి । సీతకు తెఱవేయించిరివారు । యెరుగనివానివలెనేయుండు ।
తండ్రిసన్నిధికి తమరేతెంచిరీ । తల్లికేమోరాశిక బన్నొచ్చిరి । మొలకనవ్వులా
ముద్దయితోచె । అంతలోన వాల్మీకిమహాముని । వారిసన్నిధికి తమరేతెంచి ।
చాలప్రొద్దు మించిపోయినది । స్వామివారి అంతఃపురములకు । ఆదిలక్ష్మి
పలుకోపములుంచగ । యరుగుమనుచుబల్కె వాల్మీకి । ఆపలుకులవిని యతివేగ
మున । నేనలకుసెలవిచ్చెను రాముడు । నేనలకు సెలవులిచ్చినపిమ్మట । తమ్ములకు
సెలవిచ్చెను రాము । తనయులచేతులబట్టుకు యప్పుడు । యంతఃపురము లోపలికొచ్చె ।
యల్లదిగో జూడని తండ్రికిజూపి । తిరిగివచ్చెను శీఘ్రంబునను । బహుజాగ్రతయనితల్లికి
జెప్పి । జాలకర్రలా వెంటనిలుచుండ్రి । మణిపాదంబులు ముందరయుంచి । కూర్మావ
తారులు గృహమేజొచ్చె । బాసినట్టుగ పరమాత్ముండు । పాన్పుపయినికూర్చుండెనురాము ।

వాకగడియ వాకయుగమాయెను । లేచివేగమున శ్రీరాఘవులు । యేమితోచక అటునిటు
జూచుచు । పాన్పుపైని కూర్చుండెనువేగా । యేదిజానకి జాడలులేవు । సీతగాదుయది
చిలుకలచంద్రిక । కళ్లచీకటులు కమ్మెనురాముడికి । తెఱచాటున జానకినేచూచి । పన్నెం
డేళ్లాయెపడతి నిన్నెడబాసి । పరస్త్రీలనెరుగను పంకజముఖుడను । యదినీవునమ్మకుంటెను
వినవేజానకి । నీవుతప్పస్త్రీల్లైనుతల్లి కౌసల్యాదేవికిసమము । యదినీవునమ్మకుంటేను । నీవు
తప్పస్త్రీలెల్లామాతల్లికైకమ్మదేవిసమము । అదినీవునమ్మకుంటేను । నీవుతప్పస్త్రీలెల్ల । మాతల్లి
సుమిత్రాదేవిసమము । యదినీవునమ్మకుంటేనునీవుతప్పస్త్రీలెల్ల । మాయక్క శాంతమ్మసమము ।
పద్మగంధినీవేతెంచకుండినా । ప్రాణములునిలువవుగనుక । నేనుపిలిచినపలుకవుమాటాడవు ।
నేరమునావలన కలదనిబలికె । వెనుకటిమాటలు తలచకేసీతా । విరహముతీర్చవె జానకి
యనెను । తనసాటివాడె యింద్రుడు । ఘుజముదించడు తనసతినైన । తనసాటివాడె
చంద్రుడు । జడలదించడు తనసతినయిన । తనసాటివాడె బ్రహ్మదేవుడు । జోడెడబాసి
యుండడుయెపుడు । సాటివారలో చవకజేతువ । శరణేజానకి రమ్మనిపిలిచె । శ్రీలక్ష్మినీ
వేతెంచకుంటివ । శిఖయజ్ఞోపవీతములు తీసుకొని । కావివస్త్రములు కట్టుకునేను ।
యీమాటలువిని జానకిదేవి । తనయులువినగా దానిట్లనెను । పతిబ్రతిమాలిన తరువాత
యినా । సతులకు యోచింపకయుంటేను । బాపములే ప్రాప్తించునుయనెను । ఆమాటలు
విని బాలలప్పుడు । తల్లడిల్లి జననికిట్లనిరీ । యికమీదయిన మాట్లాడకయుంటె । ఆది
లక్ష్మియేతెంచకయుంటె । పాపంబులు ప్రాప్తించునుయనిరీ । ఆపలుకులువిని జానకి
దేవి । గ్రక్కునరాముల కడకేతెంచి । గజ్జలపాదం ధరణిమోాయగా । అందెలుగమకించి
విడువగను । అందెలుగదల హృదయానందం బారగా । తెగువగుబాపిట చేరులువాల ।
కుచమ్ముల సందులనడుమా । నక్షత్రపుహారముల్ మెఱయ । వజ్రాలగుత్తులు యింపుతో
మెఱయ । ముత్యాలహారమణికట్లడమిలంగా । జాలరుముత్యాల మేలుబ్బిళ్ళు । గంధపువాస
నలందంమీర । నామకరణమున రామచిలుకలు । రామరామాయని నాధంజేయ । వల్లెవాటు
కొంగొప్పు లమరగా । వయ్యారముతో వచ్చెనుసీత । శ్రీలక్ష్మితో మనము సరిరాలేమని ।
వేసంబులు తలలువంచుకొనే । మహాలక్ష్మితోమనము సరిరాలేమని । మాణిక్యంబులు
దీప్తితగ్గించె । వయ్యారమ్మకు సరిరాలేమని । మత్తగజములు లజ్జించెనుగా । సీతనడకకు
సరిరాలేమని । రాజహంసలు లజ్జించెనుగా । సీతముఖముతో సరిరాలేమని । పూర్ణచంద్రుడు
లజ్జించెనుగా । సీతనాసికముతో సరిరాలేమని । తిలపుష్పములు లజ్జించెనుగా । సీతపెది
మలకు సరిరాలేమని । పగడపుతీగెలు లజ్జించెనుగా । సీతకన్నులకు సరిరాలేమని । కలువ
రేకులు లజ్జించెనుగా । సీతకనుబొమలకు సరిరాలేమని । సింగినివిళు లజ్జించెనుగా । సీత
పలుకులతో సరిరాలేమని । మల్లెమొగ్గలు లజ్జించెనుగా । సీతదంతములకు సరిరాలేమని ।

దానిమ్మగింజలు లజ్జించెనుగా । సీతలలాటమునకు సరిరాలేమని । బాలచంద్రులు లజ్జించెనుగా । సీతచెక్కిళ్ళకు సరిరాలేమని । జెక్కుటద్దములు లజ్జించెనుగా । సీతకురులతో సరిరాలేమని । గండుతుమ్మెదలు లజ్జించెనుగా । సీతకర్ణములకు సరిరాలేమని । శ్రీకారంబులు లజ్జించెనుగా । సీతనేత్రంబులకు సరిరాలేమని । నేరేడిపళ్లు లజ్జించెనుగా । సీతకడుపుతో సరిరాలేమని । కదళివస్త్రములు లజ్జించెనుగా । సీతవీపుతో సరిరాలేమని । సుడిగుండము లజ్జించెనుగా । సీతతొడలతో సరిరాలేమని । అరటిబోదెలు లజ్జించెనుగా । జనకజచేతులకు సరిరాలేమని । చెరుకుకోలలు లజ్జించెనుగా । జానకిదండలకు సరిరాలేమని । కయదూటలు లజ్జించెనుగా । సీతయఅచేతులకు సరిరాలేమని । చిగురుటాకులు లజ్జించెనుగ । జానకివేళ్ళకు సరిరాలేకను । పెసరకాలు వెనుదీసె । జానకివేళ్ళకు సరిపోలేకను । జీలుగుముక్కలూ వెనుదీసె । జానకిశిరోకంఠంబుతో సరిపోలకను । పొన్నకాయలు వెనుదీసె । జానకికంఠంబు సరిపోలకను । శివునిశంఖంబూ వెనుదీసె । జానకి స్వరముతో సరిపోలక । గండుకోవెలలు వెనుదీసె । జానకివలువలాకు సరిపోలక । రామచిలుకలూ వెనుదీసె । జానకిచక్కదనంబుకు సరిపోలక । స్త్రీలందరు వెనుదీసిరి । లత్తుగుజాకట్టుజారగను । జనుదెంచెనుజానకి సంభ్రమమునా । అల్లంతటనే జానకిజూచి । కన్లజీకటిగమ్మె రామునికి । ఎదురుగజనుదెంచెను శ్రీరాములు । పతిపాదపద్మముల పైబడెను । పాదముల పయిబడియున్న । ప్రాణసతినెత్తి బరువుపైతీసెను । శ్రీరాములు యిక్కడుండుటకు । యిరవుగాదనుచు గ్రక్కునబాలలూ ఆవలకేళ్ళిరీ । పయినున్న అంగవస్త్రంబులుదీసి । బంచపుగుల్లాలయి బరుచుకునీ । పంచకావ్యంబులుబరనచేయుచు । పవ్వళించిరీ బాలలూతమరు । జానకినిరాములను గలిపితిమనుచు । చింతలేకను నిద్రించిరివారు । బిగియకౌగిటను జేర్చెనురాము । ఆకులమడుపులు యందించుచును । సఖమునఖము గోటికియందించె । వెయ్యివేల దీపములువెల్గగా । వెలదితో భోగించెను శ్రీరాము । లక్షవేలదీపములు వెలగగా । లక్ష్మితోభోగించె శ్రీరాము । కోటివేలదీపములు వెల్గగా । గోవిందుడు తనప్రాణసతితోకూడె । లేచివేగంబున వేగంబునను । పాదపదంబులు కడిగెను । శ్రీరాముపాద ప్రక్షాళణంబు । పాన్పుపయిని కూర్చుండెనుతాను । పద్మగంధి హస్తములుబట్టుకు । మితిలేని వేడుకలనుబొందె । వొరుగు తరుగువా గిరిమల్లెలను । చామంతులు సన్నజాజులును । యీవెనలతో బుచ్చుకు । అప్పుడువరలక్ష్మి విసరుచు నిలుచుండె । యిలసురిటీవి మనకువద్దనుచు । యందుకొనెను శ్రీరాఘవులప్పుడు । పాదసేవలూ చేయుచుతాను । అయోధ్యందూకుశలమయనెను । అత్తలముగ్గురనడిగెసీత । యితరమైనా బంధువులనడిగె । యరయగ ఋష్యశృంగుని కాంతశాంతనడిగెను । జానకిదేవి నిన్ను మఱిచి సుఖమునవున్నారు । చెల్లెలనుయడిగెనుసీత । మిథిలాపట్నంబులో యున్నవారిని ।

తల్లితండ్రిని యడిగెనుసీత । అందరినియడిగిన పిమ్మట యప్పుడు । యజ్ఞంబుచేసితిరి మీరనెను । రాఘవసోమయాజులూ అయితిరి । కనకసీతా సామిదేవాయెను । ముత్యాల మొగసాలలోపల । జాజీలుమడిచింది తనకయితె । ప్రాప్తి లేదాయెను । యనుచుపలికె దాబడలెను । యపుడుకన్నుల జలంబులుగ్రమ్మి । గురియగా కౌగిలించుకొని శ్రీరాఘవులు । చిలుకల జంద్రికలప్పుడుతీసి । సీతకన్నుల వరషంతుడిచె । ఆదరంబున జానకినందుకు । మెల్లనారాఘవుడు యిట్లనిబలికె । యజ్ఞముగాదే జానకి తనకు । యమపురమువలెనున్నది సీత । యయోధ్యగాదు కోమలినీకు । అహంకారమువలె నున్నదిసుమ్మి । సీతనీవులేని పట్నము । చీకటికమ్మి యున్నదిసుమ్మి । జానకినీవులేని యయోధ్య । జనహీనంబయి యున్నదితనకు । చిలుకలేని పంజరము వలెను । చిన్నమనసంతాను । యాగపుయశ్వం బట్టుకుకట్టి । యెన్నిచిక్కుల బెట్టిరేనన్ను । తనయులనే అశ్వంబును కట్టించి । యెరుగ నట్లుయడిగెదవా । నీవెన్నితపంబులచేసి కంటివే । యెన్నటికి యిటువంటి పుత్రులకలుగా । యుద్ధరంగంబున బాలలూనన్ను । ఆడినమాటలు యేమనిజెప్పుదు । శూరత్వమైనపలుకులు పలికితె । పంచదార ములకలవలెయుండె । యెన్నిమాటలుమమ్మ అదలించియడిగిన । మొలకచిన్ని ముద్దులుగులికెనే । ముద్దులు గులికేటి తనయులు అయితె । మిమ్మబోలి యుందురు శ్రీరామా । అనాడడవులకు మీరేతెంచె । ప్రాణంబు విడిచెను దశరధులూ తనయులులేకా తపములుచేసితె । కలిగిన పుత్రులు కనుకనుమీకు । ప్రేమగలతండ్రులు మీరయితేను । యయోధ్యకు బలికాయమనగలర । గర్భిణీస్త్రీయని కనికరించకా । వధియించెనా వనములకంపిరీ । అలవిగాని బ్రహ్మాండమువంటి । యగ్నిలోత్రొక్కించర ఆనాడు । గానవిధి పూర్వమైనా । గోరికలడవుల పాలవుబెరుగ । యీవిధమునా అడవులలోపలను । తనయుల చూచుచు దానిలుచుండె । బాలునిబాణమునబడవేసి । అయోధ్యకు బలిసేయమనినారు । ప్రేమగలతండ్రులు మీరనిపలికె । ఆపలుకులవిని శ్రీరాఘవుడు । తలచుకుజానకి కిట్లనెను । పూర్వజన్మమున చేసినఫలము । యనుభవించక తీరదుసుమ్మి । యయోధ్య మహారాజుకి తనయుడవయ్యు । యడవులలో సంచ రించగాలేదా । తలిదండ్రుల రాజ్యమువిడిచి । వొంటిగా వనవాసములేమి । తనయులను మేమెరుగకుండినా । తగనిప్రేమలు కలిగెనుమాకు । మనసున కోపముయీర్ష్యముంచుకు । కనబడకుండిన జానకితనకు । ఆపలుకులవినిజానకప్పుడు । పాదములపయి వాలిగెనుసీత । పాదముల పయినున్న ప్రాణసతినెత్తి । పాన్పుపైకి తీసెనురాము । అప్పుడు జానకి అతివినయంబున । వొప్పుతోరాజు కిటులనిబలికె । వాల్మీకుడునన్ను తోడుకొనిరాగ । వద్దనివాదించి మీసుతులూ । బాలలుచేసినదంతజెప్పి । దయయుంచుమనె తనయులమీదా । ఆపలుకులువిని శ్రీరాఘవుడు । నవ్వుతుజానకి కిట్లనిబలికె । అక్కడికొచ్చి అయోధ్య

లోపల । చేసినచిత్రము లేమనిజెప్పుదు । ముందుగాను మమ్మందర్నిజంపిరీ । ఆవెనుక లగ్గలకెక్కిరిగా । భమిడిమేడలను పాడుచేసి । బురుజులగూలవేసిరీ । వీర రాజులేనిదా యీరాజ్యంబు । రాజుయుంటె యుద్ధానికిరాడా । మూలనేల దాగున్నాడనిరీ । ముందర యుద్ధానికి రమ్మనిరీ । దాగియుండుట శౌర్యముగాదు । దాతలేనిదా యీపట్నంబు । ఆడిన మాటలకు యేమనిజెప్పుదును । అమృతపు గుటకలవలనేయుండె । అత్తరీ దాదిని చంపిరా । అయ్యయ్యోయని బలికెనుసీతా । కైకయత్తకుకోపమువచ్చి । యేమిసేతును యెరుగనిసుతులు । యైదేండ్లప్రాయము మొదలుకొని । యాడినమాటలకు యన్నిజెప్పి । అక్కడినుండి యమ్మరోసీవు । యిక్కడికొచ్చిన కారణమేమనిరి । అక్కడయేమి నేరముజేస్తివో । జెప్పకుంటెఖండితుమనిరి । బాలలుతనను యడిగినవిధము । పూస గ్రుచ్చినట్లుతాజెప్పి । ఆపలుకులవిని శ్రీరాఘవులు । చిరునవ్వునవ్వి యిటులనెను । నీవు చేసినతీరుపుగాదా । క్షితిసుతనీవరసుతులకుయనెను । తానుచేసినతీరుగాదు । తండ్రులపోలిక తనయులకు యనెను । యెవ్వరికీవిధమని యెరిగించకు । రవ్వశాయకే బాలలనీ । రవ్వలు లేక యుండిర రాఘవా । మూడు లోకములు మ్రోగెనుయుద్ధం । నేపిలిచితె యేతెంతురో రారో । నీవేబిలవవే జానకియనెను । ఆపలుకులవిని జానకీదేవి । నవ్వుతుబాలల యిట్లని పిలిచె । నిర్ధయులైనట్టిమీతండ్రికి దయవచ్చె । నాతండ్రులార రారోయి । కరుణాకటాక్షులు మీతండ్రికిదయవచ్చె । నాతండ్రులార రారోయి । రాజరాజేంద్రులు మీతండ్రికిదయవచ్చె । నాతండ్రులారరారోయి । మాతండ్రిజనకచక్రవర్తి రాజారావోయి । మామామదశరధులు రావోయి । అడవులలో మనముంటిమి అనుచు । ఆదిమూర్తికిదయవచ్చె । వనవాసంబులు విడిపించుటకు । వనజాక్షుడు తానిటకేతెంచే । సకలభోగములు కలిగెనుమీకు । అతిశీఘ్ర ముగా రమ్మనిపిలిచే । ఆపలుకులవిని లవుండప్పుడు । యులికిబడుతు దిగ్గునలేచె । కనులనెత్తురు నిప్పులురాలగా । లేలెమ్మని అన్నను తాలేపె । అన్నామనయమ్మ పిలుచుతు యున్నది । అతివేగము రమ్మనిపిలిచె । యాధివిష్ణు చేశాడో అన్నరోలెమ్మని । లవుడా దంతపుతలుపులు తటుకునతన్నిరి । పగడపు ఘడియలు ఘల్లుమని వీడెను । చను దెంచిరి బాలలు । వేగమురాజుాచి సంతోషించిరివారు । సీతారాములు గూడున్నారు । జింతలేమిలేవని పలుకుదురు । అమ్మవేగముగా రమ్మనట్లు । స్వప్నమాయెన తమ్ముడనీకు । సతీపతులు గూడు కొన్నగృహములో । సరసరములాడెడి సమయమును । తనయులైన దరినుండగరాదు । జనుదెంచుటయది దోషము సుమ్మి । ఆపలుకులువిని లవుండప్పుడు । అమ్మ పిలుచుట నిజమేయనెను । అమ్మా మమ్ముల పిలిచితివెందుకు । చేతులుముడుచుకు నిలుచుండిరిగా । అనిచూచి శ్రీరాము లప్పుడు । నవ్వుతుసీతతో యిటులనిబలికె । ఎంతపుణ్యమే జానకినీది । వినయవిధేయత

కలిగినసుతులు , మాపైక్రోధము మళ్ళగలేదు । మనవిజెప్పవె జానకీయనెను । బాలల
నిద్దరిని దోడుకవచ్చి । పాదములపై వేసెనుసీతా । అడుగులపైనున్న తనయులనెత్తి ।
యెత్తికౌగలించెను శ్రీరాము । తొడమధ్యమున బాలలనుంచుకు । చుంచుదువ్వి ముద్దులు
పెట్టుకొనే । పళ్లుఫలములు పళ్ళెరాలందుకు । అందిచ్చె బాలలకపుడు । అందుకుబాలలా
ఆనందమునా । ఆరగించిరి అతివేడుకతోను । యిరుగడల బాలలనుంచుకొని । కర్పూరపు
తాంబూలమువేసె । వొకవైపున యాలవకుశరాజు । వొకవైపున యాజానకీదేవి । వీనెనల
చేబుచ్చుకు వినుచుతు । సౌఖ్యంచేసిరి వారికిప్పుడు । చాలప్రొద్దుమించుకపోయింది । చాలు
చాలుయిక మా సేవలుయనెను । కుడిభాగమున కుశలవులను । యెడమభాగమున జానకీ
దేవి । పవళించినాపరమాత్ముడు । తలబోసెను తమత్తమలోను । తల్లులమాటలు వినక
జెడితివి । తమ్ములమనవులు విననైతినిగా । శాంతమాటలకు మారుబలికితి । యెందరు
జెప్పిన విననైతినిగా । బాలలకు యిడుములు పెట్టితిని । భారంబుబాధల పెట్టితిననెను ।
నిందలేని నేరముకలిపించి । సతినిజంపుమని బంపితినినేను । పరమపతివ్రతే జానకిగనుక ।
పగసాధించి బలికెనునాతో । కనకసీతతో యజ్ఞంచేసి । కానినిందలు పొందితినేను । బాలుల
పైని పగసాధించితి । పాపముల కొడిగట్టితినేను । పార్వతిబలమున బ్రతికిరిగానీ ।
బంతగించినే చంపుదునంటి । బాలల నప్పుడుబట్టిచంపితె । ప్రాణములతో నుండను
నేనిపుడు । అనిచింతింపుచు శ్రీరాములు । కన్నులవర్షం గురిపించెను । సీతమేలుకొని
చివ్వునలేచి , రామకన్నులా జలములుతుడిచె । సంతోషింప సమయమురాఘవా । చింతిం
చుటకు కారణంబేమి । శాంతపయిని స్వప్నములాయెనా । తలచితిర తల్లులమదిలోను ।
తల్లుల తలచుట లేదుజానకి । తనయులయిడుములు తలచుచుంటి । దైవవశములు తప్పవ
స్వామి । చింతించుటకిక పనిలేదనెను । యిక్కడుండెననియిడుములులేవు ! యెన్నిభాషల
చేసెనువాల్మీకులు । పరిపరివిధములఫలభక్ష్యములు । బాలలకిచ్చి పెంచెనుయతడు । అక్షర
విద్యలు ఘనమంత్రములు । యనేకవిద్యలు యన్నినేర్పిరీ । జనకునిమారుగ వాల్మీకుడు
బాలల్నుతనుపోషించె । అచ్చటనుండుటచేతజానకి । ఇంతప్రవీణతకలిగెనుసుమ్మి । ఆనంద
మాయెను రామునిమనసు । సతి సుతులతో సంతోషమున । పవళించె నాపరమాత్ముండు ।
నిద్రించెను నీలవర్ణుండు । యంతలోను వాల్మీకమహాముని । యతివేగమునాలేచెను ।
దేవేంద్రాదిదేవతులు ముప్పయికోట్ల మునులెల్ల । యిరువైకోట్ల సురులు తమరు । పార్వతీ
శ్వరులు మేలుకొలిపే । శ్రీ రామచంద్రులచేత పూజలుగొన్న । మధుర సుందరనాథా
మేలుకో । జంబునేరేళ్ళా క్రిందను వెలసిన । జంబుకేశ్వర లింగా మేలుకో । మరిచూచిరీ
తాబలిలోవెలసిన । మాత్రుభూతేశ్వరుడా మేలుకో । తీరుగాకావేరి తీరమందువున్న । కుంభ
మల్లీశ్వరుడా మేలుకో । మరిమరికోరికా లిచ్చుచున్నట్టి । కరివరదరాజస్వామి మేలుకో ।

తీసుగా కాళహస్తి తీరమందుయున్న । వాయులింగేశ్వరా మేలుకో । జగములకెల్లను తేజరిల్లు । శ్రీ తేజలింగేశ్వరా మేలుకో । ముప్పయిమూడుకోట్లమునులు । మీదరిశనముగోరి నిరీక్షించి యున్నారు మేలుకో । తీరుగాశివకాశీ పురమందువెలసిన । కాశీవిశ్వేశ్వరుడా మేలుకో । అరవై యారుకోట్ల అమరేంద్రాదులు । నిలిచియుండిరిస్వామి మేలుకో । తెల్లవారవచ్చె తొలికోడి గూసింది । తపములకు వేళాయె మేలుకో । తల్లి శ్రీ త్రిపురాంబ జగదాంబ । భ్రమరాంబా మేలుకో । మహిషాసురుబట్టి మర్ధించితివమ్మ । మాణిక్యాంబ తల్లి మేలుకో । రాజ రాజేశ్వరిమణి శ్రీవిశ్వేశ్వరీ । అన్నపూర్ణతల్లి మేలుకో । సోమశేఖరరాణి త్రిపురసుందరవల్లి । భూతనాధునితోడ మేలుకో । బ్రహ్మసరస్వతిమిము ప్రార్థించుచున్నారు । పార్వతీయమ్మా మేలుకో । పార్వతీశ్వరులు పరుగునలేచిరి । సభవారంతలేచిరి సంభ్రముగను । అందరిని చూచి అందరప్పుడు । సీతా రాములను మేలుకొలిపిరి ।

## మే లు కొ లు పు.

వైకుంఠవాసుడా పరలక్ష్మివల్లభుడా । సీతాసమేతుడా మేలుకో । వాల్మీకమునులంత నీ దరిశనముగోరి । నిరీక్షించి యున్నారు మేలుకో । తెల్లవేనుగవచ్చి వాకిటయున్నదీ । నల్లనినాస్వామి మేలుకో । కల్లగాదురజగమెల్లయేలెడు । రఘువల్లభానికనిద్ర మేలుకో । పరమభక్తులునిన్ను ప్రార్థించుచున్నారు । పన్నగాధివత్సలా మేలుకో । తూరుపు దిశఅంతా తెలుపెక్కియున్నది । భానుడుదయించెనే మేలుకో । రాజ్యాభిరాముడ రాజీవదళనేత్ర । రఘురామ చంద్రుడ మేలుకో । అత్రివసిష్టాదిమునులు మీకృపగోరి । పాత్రులైయున్నారు మేలుకో । దేవేంద్రాదులు దేవతులందరు । తెలివొందిరో స్వామి మేలుకో । పుత్రులానతితోను పుండరీకాక్షుడా । పురుహూతమిత్రుడ మేలుకో । పార్వతీశ్వర బ్రహ్మసరస్వతులు లేచిరి । పాలసముద్రశయన మేలుకో । మేలుకోశ్రీరామ మేలుకోజయరామ । సీతతోగూడుకు సంహాసనమెక్కి । ప్రజలు పార్థించగ మేలుకో । కొక్కురోకోయని కోళ్ళుకుయ్యగను । కిలకిల కిలకిల చిలుకలుబలుక । కలకల కలకల రాజహంసలు । గోరువంబులు కొమ్మలమీద । చక్రవాకములు జెముడుకాకులు । పావురములు పక్షులు బలుకను । ఆటలాడెడి సందడి వినుచు । లవకుశరాజులు లేచిరియపుడు । సీతారాముల మేలుకొలిపిరి । అంతఃపురములకేపోయి అమ్మా । తనయుల చేతుల బట్టుకుతామ । చమురులోకిచనెను శ్రీరాము । ముఖమజ్జనములు గావించిరప్పుడు । స్నానమునకు వేంచేతామనిరి । అరవైకోట్ల అమరేంద్రాదులు । ముప్పైకోట్ల మునులందరును । అజరుద్రాదులు తనయులుతమరు । అజాహ్నవీ తీరమ్ముకు జనిరి । స్నానాదులను వేగముగావించి । వాల్మీకుగృహముకు జనుదెంచిరి । సేనలతోను తమ్ములతోను । తనయులతో భుజియించెనురాము । ఆరగించి

హస్తములు కడుక్కొని । కర్పూరపుతాంబూలమువేసె । సింహాసనముపై గూర్చుని యుపుడు । వాల్మీకులబిలచినిట్లనిబలికె । యేమండి వాల్మీకమహాముని । దోడుకపోదును సీతసుతుల । మీకోరికలు జెల్లెనుగనుకా । మాకోరికలు చెల్లించండి । భూమండలములో మీప్రఖ్యాతి । పొగడతరమా మాకందరికి । బాలలమమ్మా బ్రతికించితిరి । బంపించం డయోధ్యకుమమ్మ । జానకితనయుల రక్షించుటకు జగములకు యెరిగించెదస్వామి , బాలలమీరు పెంచినకీర్తి । ప్రపంచములు వినగజేతు । తగినయుపకారముజెయ్యగలేము , దండంబులు దయయుంచుడనెను । ద్రవ్యాపేక్షలులేవుమీకు । దండబులుసమర్పించెదనేను । ఆశీర్వాదంబులు మాకిచ్చి । నారీరత్నమును దోడితెమ్మనెను । ఆపలుకులవిని వాల్మీకుండు , యానందముతో స్తోత్రముచేసె । మీరుమ్రొక్కమేమెంతవారము । మీరుమ్రొక్కుట ధర్మంగాదు । ఆదివిష్ణువ యౌతారమూర్తివి । అన్నిలోకములు బ్రోచెడిస్వామి । చచ్చి బుట్టుచు జీవరాసులు । జన్మజన్మముల మిమ్ము గానగాలేరు । యెల్లలోకములు యేలిన స్వామి । నీదరిశనమిడితివి చాలుమాకు । మీపుణ్యంబున మాగృహములకు । లక్ష్మి కొరకువేంచేస్తిరిమీరు । బాలులపెంచిన ఫలముగనుకనే । మాధవ మీపాదములుగంటి । మత్స్యావతారంబు యెత్తిన । మాధవ మూర్తినీవెగావ । కూర్మావతారముయెత్తిన , గోవిందస్వామివి నీవెగావ । వరహావతారమెత్తిన వసుమతి లక్ష్మణనీవెగావ । నృసింహావతార మెత్తిన । నారాయణుడవు నీవెగావ । వామనావతార మెత్తిన । వరలక్ష్మి వల్లభుడనీవె । భార్గవతారమెత్తిన । పరమాత్ముడవు నీవేగావా । శ్రీరామావతారము యెత్తిన । శ్రీధర కేశవమూర్తివినీవెగావా । శ్రీకృష్ణుడవై గోకులగాచిన । గోపాలుండవు నీవెకావా । బుద్ధావతారముయెత్తిన భూనాథుడవు నీవేగావా । కలికావతారముయెత్తిన కమలనాభుడవు నీవేగావా । దశావతారములు । యెత్తిన దశరథరాజు మాగురుడవుగావా । అనియివ్విధమున స్తోత్రంచేసి । మన్నించివరలక్ష్మిని పిలిచె । రావేయిందువదన రావేచంద్రవదన । రావెరావెజానికి రమ్మనిపిలిచె । వాల్మీకులు రఘుపతిని పొడగాంచి , నిలిచియిట్లు విచారింపతగునా । చంపుమని మీరు బంపిన పిదప । చంపగలక్ష్మణుడుండ గను । సకలంబులు చేకూరెను యిప్పుడు । అంతాజెప్పిరి రామునితోను । సీతసుతులను తోడుకవచ్చి । సమర్పించెను శ్రీరాములకు । భరతశత్రుఘ్నులు బాగుగనప్పుడు । బాలుల చూచిరి వేడుకగాను । బాలురకు ఆభరణములుంచిరీ । పదినకు నమస్కరించిరివారు । యడుగులపయివున్న మరదులనెత్తి । దీవించి యిట్లనితాబలికె । బాలులవంటి అజ్ఞానులు లేరు । యెరుగనికూనలు యేమనుటకును । యెన్నివిధంబుల జెప్పినవినక । యాగపుహయ ముగట్టిరిమీరు । నొప్పించిమిమ్ము మాటలాడిన । మనసులగ్రోధంబుంచవద్దు । అనిజానకి బలికిన పలుకులకప్పుడు । లక్ష్మణుడిటులనిబలికె । వావికివాదినవు వరసకుతల్లివి । బాలలు

మేము వక్కాణెసుమ్మీ । మానేరములు మదితలచకుమి । మన్నింపుమా యమ్మరో యనుచు । అంతలోను వాల్మీకమహాముని । పయనంబులు వేగమేగమ్మనెను । వసంత ఋతువు వైశాఖమాసము । భానువారముపంచమీనేడు । పదిగడియలపై ప్రొద్దయినది గనుకా । బాలలనుదోడుకు వెళ్ళండనెను । యామాటలువిని బాలలప్పుడు । వాల్మీకులతో యిటులనిబలికె । తల్లిగర్భమున మేముండగను । చంపించగ పంపగలేదా । యిప్పుడు మమ్ముల రమ్మనుటేల । యెప్పటికయిన వస్తుమువనిరి । యెన్నివిధముల జెప్పినగాని । ఎవ్వరుజెప్పిన వినమనిబలికె । వశిష్టుమొదలయిన మహామునులంత । అనేకవిధముల జెప్పిరివారు । శచీదేవి సరస్వతిశార్వాణి । యనేకవిధంబుల జెప్పిరివారు । యేడు సముద్రములు యింకినగాని । యిప్పుడు యయ్యోధ్యకు బోవమనిరి । బాలలధిభల్లాకపుపట్టు । వినజాలరెందరుజెప్పినను । మునికాంతలుసురకాంతలు । దేవాంగనలునుడువనీవుజెప్పుయనిరి । యామాటలువినిజానకీదేవి । బాలలపిలచియిట్లనిబలికె । దానురాముతోజనుదేరకపోతె । తగదండురుమీకెవ్వరుగలరు । దారుణపంతముతండ్రితోమీకేల । తనయులార రమ్మనిచెయిబట్టె । అమ్మామిమ్మలవిడచియుండుట । హరిశింతురఈలోకమువారు । సుతులనువిడిచినశోకంబొందినా । పతితోటిడుమలుసతులకుధర్మం । పగసాధించేటిపతియైనాను । ప్రాణముయెక్కడవిడువవలెను । పతినెడబాసినసతులనుజూచితె । పతివ్రతగాదందురుజనులు । ఆమాటలువినిజానకప్పుడు । రామునన్నిధికిదానేతెంచెను । సీతనుజూచిచోద్యమందుచు । లక్ష్మణబాలలకడకేతెంచె । బాలల హస్తములుబట్టుకొని । పరిపరివిధముల భాషింపదొడగె । అయ్యోధ్య దశరథ మహారాజు । అరవై వేల సంవత్సరములు । తనయులులేకా వనములుజేరి । పుత్రకామేష్టులు చేయించెనురాజు । పుట్టితిమినలుగురుతనయులము । యతిగారాబంబున పెంచెనుమమ్మ । రాముడంటెను రాజకుప్రేమా । మితిలేని వేడుకలనుబొందె । అటువంటి రాముని అరణ్యములకు । బంపిన ప్రాణములు విడువగలేదా । సతికివరములు యివ్వగలేదా । కయికవరములు కాదనిజెప్పి । కౌసల్యసుతునికి బట్టముగట్టి । రాజ్యపరిపాలన రాముడుచేయగ । కన్నులారమము జూడగరాద । దైవవంశబులు తప్పించుటకు । తరముగాదు యెవరికయినాను । మీరయ్యోధ్యకు చనుదెంచకపోతే । మేమేవిధంబున బోగలమనెను । అమ్మమమ్ముల విడువగలేదు । ఆలాగేసుమ్మాలేగండి । ఆమాటలవిని శ్రీరాఘవులు । తమ్ములతో తానిట్లనిపలికె । అందరిని యయ్యోధ్యకుబంపి । అరణ్యంబులో మనముందాము । బాలలను కానలలో విడిచి । పట్నములు మన కెందుకు యనెను । ప్రాణత్యాగము జేసినగాని । బాలలనువిడిచి పోననిబలికె । తమతండ్రిదశరథ మహారాజు । తనయులబాసి పాణ్రిములవిడిచె । వంశాచారం కలిగియున్నది । తప్పక ప్రాణములు విడుతును । ఆపలుకులవిని శ్రీలక్ష్మణుడు । బెదురుతు బాలల కడకేతెంచి । చేరదీసితన

తొడలనుంచుకు । చిరునవ్వు నవ్వుతు యిట్లనెను । మిమ్ములగూల వేసినవెనుక । యెందుకు
రాజ్యంబలికితిరీ । పూర్వజన్మపుణ్యఫలముచేత । బ్రతికితిమి మిమ్ముచూచుటకు ।
ఆదిమూర్తియౌతారమువిడిచే । అందరముప్రాణం విడిచెదము । విడనాడిమములయందరిని ।
వొంటిగయుండుట కోరికగలదా । అనిలక్ష్మణుడు బలుకగనప్పుడు । మారాడకవెరచి
కుశలవులు । మాజీవంబులు నిలిపినవారు । పాణప్రతిష్టలు జేసినవారు । మీమాటకు
మారాడవెరతుము । వచ్చెదముఅయోధ్యకుననిరీ । తనయులచేతనుబట్టుకుతాను । తమ్ములతో
రథమెక్కండనెను । అజరుద్రాదులు అమరేంద్రాదులు । అందరుసంతోషించిరిచూచి ।
సురులుగురువులు జెప్పినకంటె । సౌమిత్రిని ఘనతచేశారు । సెలవొసగు శ్రీరామా
యనుచు । వేడుకొనిరి వచ్చినవారంత । తనయులతోను తమరయోధ్యకు । వెళ్ళగదీవెన
లివ్వండనెను । మీరందరు వేంచేయుటచేతనే । సీతాసుతులను జూడగగలిగె । తీరుగ
నయోధ్యకుతానరుదెంచి । సకలసుఖములు పొందగగలిగె । అనియివ్విధంబున నమస్క
రించి । అందరివీడ్కొలిపెను రాముడు । వృషభవాహనం శంకరులెక్కిరి । హంస
వాహనంబెక్కెను బ్రహ్మ । అయిరావతము దేవేంద్రుడెక్కెను । తమనివాసములకు
వెడలిరివారు । చీనిచీనాంబ్రాలచీరెల । దెచ్చిజానకికి సారెలుబెట్టిరి । అందుకొనియాజాన
కప్పుడు । హంసనడకలతో అతివవేంచేసె । మునికాంతలువారు జానకికౌగిట । చేర్చుక
యపుడు । కన్నులజలముల దీర్చిరివారు । కాదనిసంతోషించెటివారు । యప్పుడువచ్చెను
జానకిపయనం । యెరుగమైతిమి అమ్మరోమేము । యెన్నినోముల నోచిగంటివే । యెన్నక
ఇటువంటి పుత్రులనీవు । మాధవ నీ మనసుత్రిప్పుటకు । మాతరమౌనా జానకియనిరి ।
యెన్నివిధంబుల ప్రార్థించిననీవు । యేతెంచెనో మారాముడిచటికి । పళ్లుఫలంబులు పసుపు
కుంకుమ । జానకివడిలో యుంచిరివారు । జిలుకలచీరెలు చిన్నెలరవికెలు । జానకికిగట్టిరి
వారు । చక్కటియద్దంబులు లక్కభరిణెలు । చీరెలురవికెలు సారెలుబెట్టి । వాల్మీకులచే
సెలవులందుకొని । వచ్చెనుజానకి వాకిటకప్పుడు । బాలుణ్నితొడపైయుంచుకొని ।
భరతుడుపగడపు రథమెక్కెనుగ । కుశరాజును తొడపైయుంచుకొని । శత్రుఘ్నుడు
హేమరథమెక్కెను । జానకితోటి రాఘవుడుతేరెక్కెను । లక్ష్మణు తేరునడుపగను ।
సారథ్యంబులు ఋష్యశృంగులూ । స్వాధ్యాయంబులు చదువుతుకదిలె । వారివారికిదగిన
వాహనము । లెక్కుచు కదలిరియయోధ్యకపుడు । యిట్లు భవుడు భాషాదులు బొగడ ।
కూరిమితో భట్రాజులుపొగడ । యక్షఃకిన్నర గంధర్వులును । సిద్ధసాధ్యులు విద్యాధరులు ।
మద్దెలతాళంబులు మ్రోయించగను । మూకలుగూడుచు రాణువకదలా । నారదుండు
వీణమీటగను । తుంబురులు గానంచేయగను । రంభపూర్వసులు నాట్యమాడగ । మేన
కాదులు మేళంచేయా । భాణాసంచులు భామలువేయగ । నేలబిడుగులు కోలాటంబులు ।

పగటివత్తులు చంద్రిజాతులు । అవాయిజువ్వలు బువ్వత్తులూ । బింకమయినవి లంకా
పురులు । గాకరకాయల తారాజువ్వలు । మత్తాబులు టొట్టంబులు మొదలుగను । చిచ్చు
బుడ్లు కాల్చిరివారపుడు । నలుపు యెరుపు తెలుపుమొదలుగను । పచ్చమత్తాబులనువేసిరి ।
హారలుబూరలు టమటంబులను । పంచవాయిద్యంబులు పదిదినంబులు మ్రోయగ ।
భేరీధ్వనులూ భోరునమ్రోయా । నగారపునౌబత్తులతోను । యయోధ్యకు పయనంబు
లయిరి । ముందర ముత్యపు గొడుగులవారు । బెత్తులు కటారులు బట్టుక నడచిరి ।
అతివయి భవంబునను నెమలి గుంచెడుతో । నేర్పుతో విసరగ నాలుగు వీధులు ।
అడుగడుగులకు మేళం వేయించుతు । అయోధ్య బట్నానికొచ్చిరి । పురజనులంత
కర్పూరహారతులు । బాలలందుకొని అందరికిచ్చె । వజ్రపు గొడుగులు వాల్చిబట్టగా ।
సింహద్వారంబున దిరిగి । యజ్ఞశాలలు వేదికజూడు । హోమంగుండములు వొప్పుతో
జూడు । పణతితెచ్చిన పంచపాత్రిలు । తామ్రపాత్రిలా పణతిరొజూడు । యూపస్థంభముల
యువిదరొచూడు । నాపకుడికినమస్కారంచెయ్యి । యిదిక్రతుపుగాదుమనకిప్పుడుయిదియె ।
మంగళ ప్రదమౌ గాకాయనుచు । బలుకుచులక్ష్మణు బిలిచిట్లనెను । బట్టదురాణువ పట్టము
లోను । వీధులలోవిందులు జేయించువేగ । అని శ్రీరాములు ఆనతియ్యగను । లవుడు
గ్రక్కున యేతెంచె । పేకబెత్తంబులు జేయినబుచ్చుకు । బారురేడు తిరుగును యంజని
సుతుండు । అదిచూచి లక్ష్మణుడప్పుడు । వద్దువద్దనుచు వాదించెనుగా । మమ్ముజూడ
మహోత్సవములు । చూడవచ్చిరి వేడుకచేతా । హింసజేయుట ధర్మముగాదు । హితవుచే
బంపుడువారినందరికి । గుప్పెళ్ళతో వరహాలు బట్టుకు । చల్లిరిరాణువ పయినపుడు ।
ముందుగానుహనుమంతుని బిలిచి । జెప్పు శాంతదేవితోయనిరి । యడుగులుతడబడ అంజలి
జేయుచు । అంతఃపురముల లోపలికొచ్చె । సీతాసుతులను వెంటబెట్టుకు । రాజద్వారము
కడకొచ్చిరి । యార్చిజెప్పెను హనుమంతుడు । యదివిని శాంత అందరికి యెరిగించెను
తాను । యంతలోను ఋష్యశృంగుడు । వచ్చిచెల్లెళ్ళకు యెరిగించెనుతాను । శాంతకడకు
గ్రక్కున చనుదెంచి । చిరునవ్వునవ్వుతు యిటులనెను । జానకిసుఖమున యున్నదియంటే ।
నమ్మనయితివి నీవెన్నన్నా । జూచిసంతోషించిన వెనుకా । యేమయిస్తువు తనకనిబలికె ।
వెన్నరసలు అప్పడములుచేసి । యారగించబెడుదును మీకనెను । కౌసల్య కయికా
సుమిత్రలు । శాంతజానకి చెల్లెలంత । కర్పూర హారతులుబట్టుకు । యెదురుగవచ్చిరి
వారపుడు । పచ్చకూళ్ళు యర్రకూళ్ళుబట్టుకు । యేతెంచెను కౌసల్యప్పుడు । యర్రనక్షంతలు
పచ్చనక్షంతలు । బట్టుకువచ్చెను సుమిత్రయప్పుడు । వసంతంబుల గుప్పెలుబట్టుక ।
వచ్చెనుకయికా సంతోషముతోను । యర్రకూళ్ళు యెగర వేయించిరి । పచ్చకూళ్ళు తీసివే
యించిరి । వసంతములు దిగతుడిచిరిగా । కుశరాజుని చంకబెట్టుకుని । కౌసల్యనగరుకు

యేతెంచె । లవకుమారుని చంకబెట్టుకు । సుమిత్రనగరుకు జనుదెంచె । జానకిదేవిచెట్ట బట్టుకు । శాంతచెల్లెలు వెనుకకురాగాను । యందర్నిజూచిబాలలప్పుడు । తల్లితోటితమరిట్లని పలికిరి । అమ్మా యీస్త్రీ లందరిలోను । యడవులకంపిన యవ్వేదనిరి । నాడుబంపుట నమ్మికలేదు । నేడుబంపితే జూతుముమేము । ధరణిజను లెవరైనాను । యంతేనుతల తుంతుముమేము । నాడుసీతకు దిక్కెవ్వరులేరు । నవ్వుతుబంపిరి వనములలోకి । ధరణిజ తన వరసుతులనుజూచి । కన్నెఱ్రజేసెను కోపమునా । అదిజూచి శాంతయప్పుడు । తగదు జానకి తనయులువారు । తనయులుజేసిన తప్పులెరుగరు । తగనేతగదుర కర్మంజూచి , కైకజేసినదేమున్నది । కారణమీలాగున యుండగను । గరుడకిన్నర కింపురుషోత్తమ । సుందరులు తెయ్యనీకూటా । కోటానకోటిదీపములు వెలుగగా । కుమాళ్ళతో గృహప్రవేశం బయిరి । సీతాలక్ష్మి యిల్లుచేరగానే । ఘంటలదీపము గలగలనవ్వె । అయోధ్యలోపల ఆడవారలు । జానకికూడగను సంభ్రమమునా । వొకరిని వొకరు రమ్మనిపిలుచుచు । కాంతలందరు వేడుకతోను । మృతినొందినసీత మళ్ళివచ్చినది । సీతను చూతము వేగము రారే , అందమయిన ఆభరణములను । పొందుగా శృంగారించుట వారు । వడివడిగా నడవగ ఒగర్చుకొనుచు । పరుగునవచ్చిరి పణతులుతమరు । వచ్చినవారందరినిచూచి , జానకిప్రేమతో జేర్చెనుయపుడు । ఘనమగుతివాసుల బరిపించి । కాంతలను గూర్చోమ్మని బలికె । జానకి తనయులు ఎచటనుండిరో । కనబరచవే మాకందరికిని , యాపలుకులువినిశాంతమ్మప్పుడు । యతిగారాబంబునరమ్మనిపిలిచె । హంసలువ్రాలినచందం బునను । యత్తతొడలపై కూర్చుండిరివారు । యపునేసీతా తనయులునీకు । తేజవంతులే చక్కని వారు । కళాపూర్ణమై నిండియుండిరా । కాంతులుముఖమున చంద్రునిబోలు , విరులుసముఖములు నక్షత్రములు । ముక్కులు తిలపుష్పములబోలు । చారడేసికన్నులు కనుబొమ్మలు । పువ్వుశరములబోలునుసుమ్మి । కంఠము శంఖము గళము కోయల , గండుతుమ్మెదలే కురులనగాను । పాదములు పద్మములముందు । మరిపళ్ల పెదవులకె తగును । చక్కనిబాలలవొక్కరీతిగ । యెన్నితపములు జేసినగలిగె । ఆమాటలవిని శాంత యప్పుడు । పదమనిబాలల యావలికంపె । జానకితనయులకీవేళా । చారెడువరహాలు దిగతుడిచి । శాంతనీవు బాలలతో । మాకందరికి యియ్యవేయనిరి । యాపలుకులవిని జానకప్పుడు । అందరితో తానిట్లనిబలికె । అడవుల తిరిగేటి నాతనయులకు । అంగ రక్షలు యెందుకుయనెను । శాంతతమ్ములకు చారడేసివరహాలూ । దిగదుడిచి మీకం దరికిచ్చు । యాపలుకులవిని శాంతనవ్వుతు । యంగరక్ష మాతమ్ములకేనా । యక్కచెల్లెళ్ల జక్కనివారు । చక్రవర్తికుమార్తెలుమీరు । యన్నకు కూర్తురుఅతిసరసములు । యంగ రక్ష కావించెదమీకు । శాంతజానకి సరసంలాడగా । సంతోషంబున జూచిరివారు । యడ

వులకు నిన్నుబంపినది మొదలు । నిద్రహారములు యెఘగమేతల్లి । తనయులకని నీవున్నా
వనుచు । తరువాతను వింటినోమాయమ్మ । మొగవారయితె జెప్పినగాని । నమ్మలేదెయో
యమ్మరోమేము । నిన్నుకన్నుల జూచేదాక । నిజమనియనుకో లోదేమేము । పుత్రిరత్న
ముల జూచికొంటివా । మరచితివా మమ్ముల నందరిని । ఆ పలుకులువిని జానకప్పుడు ।
అతివినయంబున యిటులనిపలికె । అడవులకు తన్నంపిన విధము । యడవులనుంచి
వచ్చిన విధము । అతికష్టంబుల పొందితిననుచు । యంతాజెప్పెను వారలతోను । శాంత
మ్మయితె మరచెనుగాని । మిమ్ముమరచి నేనుండలేదు । తెల్లవారగా దినదినంబునా ।
తలచుచుయుంటిని మిమ్ముమనేను । వినిపడతులు విచారింపగను । యప్పుడు శాంతట్లని
బలికె । తనయులజూచుకు నేను మరిస్తినిగాని । తానేవిధమున మరువంగలను । యాపలు
కులువిని నవ్వుతుసీతా । తమ్ముల చూచుతుమఱచితివనెను । కనకపుసీతను కన్నులచూచి ।
మఱిమరిమిమ్ముల నందరినీ । యజ్ఞశాలలు యెక్కడయుండెనో । యెరుగ జానకి యెన్నడు
షేము । కనకపుసీతను కన్నులతోను । జూచితెసుందరి నేడునేను । శాంతజానకి
భాషించగను । చక్రధరుడు వేగము జనుదెంచె । వచ్చినరాముని కన్నులజూచి । సెల
వియ్యవేజానకియనిరి । పచ్చలురత్నమును పట్టుచీరలుయిచ్చి । పంపవేజానకిచే
నడవులయందుకొని । నవ్వుతు తమగృహములకేచనిరి । జానకిసుతుల సౌందర్యములు ।
చెప్పుకొనుచును చనుదెంచిరివారు । యంతలోను కౌసల్యవేగమే । శాకపాకములు
గొబ్బునజేసె । పాలమీగడజున్ను చక్కెరామృత । ఘననూపములను తాజన్నములు ।
పిండివంటలు యందరికి వడ్డించెను కౌసల్య । జన్నియావుల మంచీఘృతము । అందముతో
వడ్డించెను సుమిత్రా । యన్నదమ్ములు సేనలుబంతి । యానందముతో కూర్చుండిరివారు ।
యక్కచెల్లెళ్ల శాంతబంతిని । యందముతో గూర్చుండిరివారు । గౌసల్యకయికా సుమిత్రలు
జూడగ । కాన్కలుచాలవుయనిరి । తల్లులుతమకోసంతోషింపగ । యారగించిరిశ్రీరాఘవులు ।
తనయులతోను తమ్ములతోను । యారగంచి హస్తములు కడిగే । కర్పూరపు తాంబూ
లంబులు । యందరికి యిప్పించె । శ్రీరాముతనయులను తొడలపైయుంచుకొని ।
సేనలకు సెలవిచ్చెనురాజు । సేనలకు సెలవిచ్చిన పిమ్మట । తమ్ములకు
సెలవిచ్చెను । రారాలక్ష్మణ దగ్గరకనుచు । తమ్మునిహస్తము బట్టుకొని ।
చంపిరమ్మని సీతను బంపితినినేను । చంపకను సకలంబులు సమకూడెనుయిపుడు ।
వేడుకసుఖములు పొందితియనెను । ఆనాడు పదునాలుగేండ్లు । ఆహారనిద్రలు లేకుండయడ
వుల । యిడుమల బడితివిమాతో । మేముసుఖంబున యుంటిమిగాన । నీవుండగసతితెచ్చు
కొని । అనేకవైభవములు బొందితినాడు । జానకి నెడబాసినమొదలు । నాసేవలుజేస్తివి
సతినెడబాసి । యికనయినానీవు సతితోగూడి । యిష్టభోగముల వుండుముతండ్రి । ఆపలు

కులువిని శ్రీలక్ష్మణుడు । యన్నకువదినకు మొ్రిక్కుతు వెడలె । కేకేగృహమునకు
చనుదెంచెనుయపుడు । వూర్మిళవచ్చె లక్ష్మణసన్నిధికి । వచ్చినసతిని చూచియప్పుడు ।
కౌగలించె కడుప్రేమలుతీరా । తొడలపయినుంచుకు ముద్దుబెట్టుకు । సరసములాడుతు
సంతోషంబున । కలకలనవ్వుతు యిట్లనిపలికె । అక్కనుజూస్తివ యతివరోనీవు ।
తనయులజూస్తివ తరుణిరోయనెను । జూస్తిమిమీకృప చాలగలిగుండగ । కలిసితిమి
మేమందరమనెను । అడలగరాదు మీవెంట నెప్పుడు । చంపనున్నది దిక్కెవ్వరుమాకు ।
దిక్కుఔక్కడగలదని దలిచెదవా । యన్నదమ్ములూ మేముండగను । నమ్మరాదు మీ
యన్నదమ్ముల । నవ్వుతునుచంపించె రాఘవులు । యని యూర్మిళబలికిన బలుకులకు
చిరునవ్వునవ్వెను లక్ష్మణుడు । సీతారాములు గూడియుండిరి । భరతుడుయుండెను మాళవి
తోను । శతృఘ్నుడు శృతకీర్తి వేడుక । సరసములాడుతు యుండిరివారు । సతులుసుతులు
సంతోషమున । సుతులతోటిసుఖమున యుండిరిగా । వరుసగయిది వాల్మీకిరామాయణము ।
తరపునవ్రాసెను ఈకవితాను । యిదిచదివి వ్రాసినవారలకు । ఆయురారోగ్యభాగ్యములు
గలుగు । పాపములించుక చేరవుసుమ్మి । భక్తితో యీపాటను పాడినవిన్నా । రామ
రాఘవా మీకుమ్రొక్కెదా । వ్రాసిరి యీధర రమ్యముగాను । నేర్చినదంతను జెప్పితిగాని ।
గూర్చి యిచ్చిన వాడవునీవు । కోరికలు కొనసాగించుసుమ్మి । గోవిందాకృప జూడుము
మమ్ము చరణములకు చేరి మ్రొక్కెదా । శంకరనుత రక్షించుమినన్ను । ఘనవైకుంఠా
పురమందునా । కదలక నిలిచిన కమలాక్షుడవు । రమ్యముగా మీనామస్మరణ । రాత్రి
పగలునే కోరుచునుంటి । భక్తుల గూడి బాడగ నాకు । శక్తిలేదు శ్రీరామచంద్ర ।
తల్లితండ్రివై తప్పులునెంచక । నొప్పులుగా భావించుముస్వామి ॥

# లంకా సారధి

(కిటతకిట,.........,.........,.........)

శ్రీహరిదేవతలకోరకునై యిలలోనదశరధుని పుత్రుడగుచు
శ్రీరమణికౌసల్యగర్భాన జన్మించి జనులపాలిటదైవమై
రామలక్ష్మణభరత శత్రుఘ్నులను మంచిరాజీవనేత్రులగుచు
ఆమహామహులు శీఘ్రంబుగా పెరిగిగిరియవని భారముమాన్పను
వేవేగచదువులు విద్యలన్నియునేర్చి విభవముతో శ్రీరాముడు
సావధానముగాను శౌర్యసంపదలచే భూవిభుడువుండెనంతా
ఆసమయమందునా గాధేయుదేవచ్చె నతనియాగముగావనూ
ఆసార్వభౌములను ఆరామలక్ష్మణులను అంపమనెదశరధునితో
మీరలై తేఘనులు వీరై తేబాలులు నేవత్తుయాగమునకూ
శ్రీరామునంపుమని మీరలనుమాటకు యేమనగజాలనయ్యా
అనినదశరధునితో నావసిష్టుడుబల్కె నతడాదివిష్ణుగాడా
పోరాటములుయేల పొమ్మనియంపించు ఆరామునకేమిభయమూ
అనినంతఅంపెను యాసార్వభౌములను అపుడుగాధేయువెంటా
అటతోడుకొనిపోవ అడ్డమైవచ్చెను ఆడదొకతె తాటకి
దీనరక్షకనీవుదీని సంహరించు దేవాదిదేవయిపుడు
ఏరీతినైనను దీని మదమణగింతు యిదిరాచపాటిగాదు
భూలోకమునఋషులు దేవతలకునుమేలు పొలియింపు పుణ్యమౌను
అనినంతరాముడు విల్లుచేనందుకొని ఆయుతాపది నిలిచెనూ
రాజశేఖరుడపుడు రయమొప్పసంధించి రౌద్రుడై వేసెదునియ
తాటకినిత్రోవలో కీటణంగించియు మేటియాగముగావనూ
తాటోటుజేయుమారీచ సుబాహులను దర్పంబులణచివేసెన్
మేటివీరుండగుచు యాగంబుగాచియు మెరసెశ్రీరాఘురాముడు
వాటముగనొకరాయి బోటిగాజేసెను వరదుడై యపుడుచాలా
ధాటిగాహరువిల్లువిరచి జనకునిపుత్రి బోటిసీతనుపెండ్లియై
ఆటోపములను ప్రఖ్యాతికీర్తులతోడ నయోధ్యకై రాగనూ

మేటివీరుడు పరశురాముడడ్డంబైన మెల్లనెబలముదీసెన్
పట్నంబుచేరిరి బహువేడుకలతోడ పట్టాభిరాముడపుడు
అట్టెదశరథుడు రఘుపతికిపట్టముగట్టుడనె నంతలోకైకేయి
తంటమాటలువిని మదినిక్రూరముదలచి దశరథునితోననియెను
పట్టంబుభరతునికికట్టి శ్రీరాముని పరగనడవులకను పుమీ
ఎట్లాడితివికైకయిటువంటిమాటలు యేరీతిమనసువచ్చెన్
ఎట్లిచ్చితివివరము నాడెల్లదేవతలుయెరుగ నిపుడేలచింత
అనినంతకైకకు అడ్డమాడగలేక నతిశోకమునదశరథుండు
దుఃఖముననుండజూచి యిదిసమయమని గ్రక్కుననుకైకయపుడూ
విఘ్నంబుచేసి తావెళ్ళిపొమ్మనె రామవిభునిసీతనులక్ష్మణుం
శీఘ్రమునదశరథ కౌసల్యకుమ్రొక్కి వేగమేపోదుమనిరీ
అతిదుఃఖమున వారలంగలార్చుచు పట్నమందున్న జనులెల్లనూ
అందరికితల్లితండ్రైన శ్రీరామునిపదములకు పడిమ్రొక్కిరి
ఎందుకుపొయ్యేరు యిందున్నప్రజలెల్ల వెంటనెవత్తుమయ్యా
అందందువారలను నోదార్చికదలిరి అఖిలజనములుజూడగా
అప్పుడాసమయమున దేవతలుఋషులును ఆశీర్వాదములు సేయా
శ్రీరామచంద్రుడా శ్రితరక్షకుండనుచు సురులుగొనియాడిరపుడూ
ఆక్షణంబున పట్నమావలికిదాటిరి అతివేగమునపైనమై
అంతసుమంత్రుని యంపించినడిచిరి అతివేగమెతామునూ
గంగదాటిగుహుని కనిమాటలాడియు కదలిరియావలికినీ
మునురైనకాననంబులుజొచ్చి యటుబోయిచిత్రకూటాద్రిజేరి
శ్రీరాముతొడలపై శ్రీదేవినిదురింప జేరె కాకాసురుండు
అదిదెలసిరఘురాముడపుడు బ్రహ్మాస్త్రంబు వానిమీదికిబనిచెనూ
కలగుదర్పంబునా ఘనపరాక్రమమునా కాపుండె చిత్రాద్రిపై
శ్రీరాముడపుడడవులకు బోయినవార్త విని దశరథుడు తాళలేక
హారామహారామయని పలవరింపుచు దశరథుడు మృతిబొందెనూ
భరతుతోడ్కొనివేగ పట్నమునకురమ్మని అతివేగమునవచ్చిరి
భరతుండుతావచ్చి తండ్రినిచూచియు వలవలనిదుఃఖించెను
రావమ్మయోతల్లియిది యేమికార్యములు చేసిందియిపుడునీవు
నీవంటితల్లులను భూలోకమునగాన నిజమునాకన్నులానా

అనుచుశత్రుఘ్నుడు వేగఖడ్గముబూన విడిపించె భరతుడపుడూ
నీగర్భమునబుట్టి నీతిశాస్త్రజ్ఞుల నిందలకులోనైతిమీ
అనుచుతల్లినిదూరి కౌసల్యనోదార్చె బంధుజనములుతామునూ
తండ్రినిదహనించి బంధువులతోగూడ శ్రీరామువద్దకపుడూ
భరతుడునుతావచ్చి తండ్రిబోయినవార్త పలుకంగ దుఃఖించిరీ
కర్మములుదీర్చిమరి భరతునిబొమ్మనె కాకుత్థ్సశ్రీరాముడు
నేనెట్లుపోదునుమిమ్మునెడబాసిదా నిమిషంబు తాళలేను
మీవలెనెనారచీరలు దాల్చినేవత్తుమీ పాదసేవకుడనై
మేముపితురాజ్ఞ మిదిదీర్చివచ్చెదము భరతుడాపాదుకలుగొమ్మీ
అనిభరతునంపించి అచ్చోటుకదలిరి అతివేగమడవులకునూ
అరణ్యములనున్న యాఋషులుదేవతలు ఆయుధమంత్రములనూ
బహువేడుకలనిచ్చి పాలింపుమమ్మనిరి పరమసంయములప్పుడూ
తడవుసేయకను తామచ్చోటనుండియు దండకాటవిజేరి
క్రమమొప్పశృంగారకాంతి పర్ణశాలగావించె కమలపతియు
కందమూలఫలముగైకొని లక్ష్మణుడు క్రమముతోదెచ్చియియ్యా
ఒకనాడులక్ష్మణుడు నురుదీప్తిఖడ్గంబునొడిసి తానందెనపుడూ
వేడుకతోసౌమిత్రి వేణుజొంపంబును వేవేగఖండించెనూ
మునిదైత్యుడొక్కరుడు మలితుడౌటకసుగొని మునుకొన్నశోకముననూ
రాగానెఋషులెల్ల రాముకనుగొని చుప్పనాతికొడుకనిదెల్పిరి
అందముగనుండిరీ యాపర్ణశాలలో ఆదిలక్ష్మీరాముడూ
సుతునికాహారంబుగొనితేర యచ్చోట మృతియైనసుతునిజూచి
అతిశోకమునుబొందె యాఋషులదండింప నదిపర్ణశాలయనిరి
ముందుగాసౌమిత్రిచేత శూర్పణఖను ముక్కుచెవిచెక్కించెనూ
అందముగబోయి ఖరదూషణాదులజూచి ముందరనునిలిచిచెప్పెన్
ఎందునుగానవోయన్న నన్నిట్టులహీనంబుచేసినదియూ
ముందరికివంచుకొని కాలుద్రొక్కిపట్టి ముక్కుచెవిచెక్కించెనూ
యిందువచ్చితిని మీరెదిక్కనినమ్మి యింకమీమనసు యనెను
పోనమింతయులేని రాక్షసకులముననను యెవరుశిక్షించినారూ
అన్నపక్షంబుంచ మీరుపైనంబైతె అదిచాలిపుడెచూపెద
అనితచ్చనలుబెంచి లేనిబుద్ధులుజెప్పి ఆక్షణంబునదెచ్చెను

సందడిగవచ్చెడి రాక్షసులవీరులను స్వామిమరియట్టైచూచెన్
లక్ష్మణునివెంబడిగ రమణీనిబంపించి రాఘవుడుతానిలచెను
శీఘ్రముగరాముడు ధనువులో బాణములుచేకొని సంధించెను
రాముబాణములేయ కొందరువ్రాలిరి రాక్షసులుభూమిపైనీ
పందెమేవినరీతి శ్రీరామచంద్రుడు పగతులనుతెగటార్చెగా
పధ్నాలుగువేల కంచురథములవారు బడిరయ్యా నిముషంబులో
ఖరుడుత్రిశిరుడు దూషణాదులెదిరించిరి కరిరాజువరదుపైనా
ఘనశస్త్రబాణముల రాఘవుని నొప్పింపఘనభీకరుండగుచును
కరములను శిరములను యురములనుఖండించె కరిరాజవరదుడపుడూ
గిరులచందంబున ధరణిపైగూలిరి ఖరదూషణా త్రిశిరులు
కాలువలు వాగులు కడురక్తములఉప్పబ్బి యేరులై పారగానూ
దేవాదిదేవతలు పుష్పవర్షంబులు దివినుండి గురియించిరీ
యిలగూలినట్టి ఖరదూషణాదులచావు నెలత శూర్పణఖ జూచి
కడుభీతి మదినొంది కళవళింపుచు నాతికదలెను లంకకపుడూ
అన్నరో వోయన్న నాముక్కుచెవులును అంటబెట్టిగోసిరీ
వలచితే ఎందైనయిటువంటి అన్యాయములుగదె నినునమ్మితి
మీవంటివారితో బుట్టిన నాకిట్టి విధివ్రాసెనా బ్రహ్మతలనూ
పోనిమ్ము నాకేదికీర్తి యపకీర్తులు పొందెదునీకుఘనము
కందర్పసమముగా కడురూపముననొక్క పొందైన సతియున్నది
ఆయందచందంబు లెందెందులేదన్న యాసీతసరిబోల్పను
ముందుగానీవుబోయి చూచితె తెలుసును ముచ్చటయ్యేనునీకు
దేవతాస్త్రీలునూ దిక్పతులస్త్రీలునూ దీటుగాదోయన్నరో
మత్తుడై రావణుడు దానిమాటలువిని మారీచనీవుబొమ్మీ
ముందుతానతనిచే వడుబాటుచెప్పగా మూర్ఖుడై చంపవచ్చె
వీనిచేబడనేల యతనిచెమరణంబు వేడుకతొ పరమబ్బును
అనిచెప్పి మాయామృగంబు గాబోయినిల్వ యాసీతపట్టుమనెనూ
పట్టితెమ్మనిసీత బాధించియడిగెను పట్టాభిరాముడపుడూ
సీతహెచ్చరికయనిజెప్పి విల్లందుకొని తేబోయె మృగమునపుడు
నరనాథచెంద్వని నయమొప్పగొనిపోయి నాల్గుయోజనము దనకా
అంత తరిమి మాయామృగమును బడవేసె హాలక్ష్మణా అనిబడియెను

రామచంద్రుడుబోయె నామృగమువెంబడి లక్ష్మణానీవుబోమ్మీ
అప్పుడు లక్ష్మణుడు సీతతో రామునికి అదరుబెదరాడ దనెను
ఏలమ్మ ఓతల్లి వెఱ్ఱిమాయామృగము యిదెతెచ్చు శ్రీరాముడూ
చెప్పెదను లోకమున బ్రహ్మరుద్రాదులు చాల వెరతురుయతనికి
చింతింపపనిలేదు శ్రీరామచంద్రుండు క్షణములో కదలివచ్చూ
అనుచులక్ష్మణుడును విల్లుచే నందుకొని ఆయత్తబడి నిలిచెనూ
అటులుండసౌమిత్రి మోముదప్పకజూచి యాసీతబలికెనపుడూ
ఓయన్నలక్ష్మన్న మీయన్నయెలుగించె పోయివేగంబెజూడూ
మాయన్న పలుకులకు సీతమోముజూచి మరికొన్నివచియించెనూ
మాయన్నకెదురుగా బాణంబెచేపట్టి మరివేయు ఘనుడులేడు
ఆయనకు బరువైన కార్యములురాదుగా ఆతెరంగెల్లవినుమూ
చుక్కలురాలినను సూర్యచంద్రాదులు సారిదిగతి తప్పిచన్న
నిప్పునకు యీగలు ముసురునా నాతల్లి నీవూరకుండు మనియెను
అన్నలసొమ్ములు తమ్ములకౌనని ఆశించిపలికెవీవు
ఆతండుబోయె నానోముఫలమిటులుండె యీతరినేనేమిసేతూ
ఇటువంటి కర్మములు వింటిమని కరములుయెత్తి కర్ణములుమూసి
చింతించి మనసందు తల్లిగాభావన చేసుకొని యున్ననన్ను
మర్మమెరుగక యిటుల ఆడినావిధి దైవమాయగా కేమిగాదూ
అన్నబోయిన జాడనేనుబోయెద భూమిఆకాశములు సాక్షిగా
ధరమీదనేను యేడుగిరులు రాసున్నాను తల్లిరోయిదిచూడుమూ
ధర్మముగ యీగిరులు దాటకనెయుండుము తల్లినేపోయివచ్చెదర
అన్నపోయినత్రోవ తమ్ముండుపోగానె ఆరాముడెదురురాగా
తమ్మునిపెరాముజూచి చింతిపాయానుచు తల్లడించిట్లనియెనూ
పర్ణశాలాకాడ సీతను గాచుకొని పదిలముగవుండుమంటె
తరుణినొంటిగవిడిచి యిటకురానునీకు తగునటో లక్ష్మణుండా
మానవతిసీతమిమ్ము మాయామృగము వెంటబంపి
కానిమాటలనగవస్తి ఘనుడారాఘవా
అయ్యోధ్యవెడలిరాగ హరికట్టెపాలగరుడ
అయనశఖున మియ్యదాయ సపుడులక్ష్మణా
తొల్లిమనము ఎవ్వరికిద్రోహములు చేసినామొ

అల్లబ్రహ్మద్రావాలు దప్పదన్న రాఘవా
కైకమాటతోయలేక కన్నతండ్రియడవికంపె
చెయ్యిదప్పిసీతబాయ ఘనుడులక్ష్మణా
పోకుపోకురాఘవేంద్ర పోకుమృగముననుచు
నీకుచాలచెప్పలేదె నిజమురాఘవా
అట్టెవచ్చెకనక మృగముయిట్టు వచ్చినిలువగాను
పట్టితెచ్చెనంటిపోతి భ్రమసి లక్ష్మణా
రక్కసులుపెక్కుగలరు గ్రక్కునను పోవవలెను
అక్కడిపనులుయేమొ అన్నరాఘవా
ఒరులచేతపట్టుబడి పరువుపారకున్నేమి
తరుణితెగువశాయదాయె తమ్ముడలక్ష్మణా
భూమిమీదనపకీర్తి బొందనాయెనేడునాకు
విధినిగెల్వరాదు బ్రహ్మకైనలక్ష్మణా
పాటిదప్పెనయ్యనేడు బ్రహ్మదేవుడింతజేసె
సాటివారిలోననెంత చౌకలక్ష్మణా
పంతమునహరుడుతొల్లి ఎంతనిందబొందెనయ్య
అంతకన్నదొడ్డదన్న విధియురాఘవా
వెదికిసీతదోడితేను వెంటనెవ్వరునులేరు
కంటికింతనిదురరాదు ఘనుడలక్ష్మణా
అన్నమనముపర్ణశాల తిన్నగానువెదకిచని
వన్నెమీర సీతగనవలెను రాఘవా
ఆపదయెన్నదెరుగదోయి అన్నజనకపుత్రిసీత
తాపముననుబొందెనేమొ తమ్ముడలక్ష్మణా
కారణమునకానకేగి ఖలులదునుమలేకయింతి
కానమనుచువెదుకనాయె ఘనుడరాఘవా
తపసివేషమునమనము దండకాటడవిలోను
తపమునీదేరదాయె తమ్ముడలక్ష్మణా
తగవుగాదువగవమనకు దండకావనములోన
నగవుగాదు నామాటనమ్ము రాఘవా
నీదుమాటనిజమాయె నిర్మలుండవినుములలన

గానినదుష్టుగూలవేతు ఘనుడలక్ష్మణా
దుష్టరాక్షసులనెల్లద్రుంప నవతరించినావు
అష్టవేదబ్రహ్మవోయి అన్నరాఘవా
వన్నెగానుసీతదెత్తు వానిపురముగూల్చివత్తు
యెమ్మెగాను అయ్యోధ్యఏలుదు లక్ష్మణా
అమరవల్లభుండవీవు ఆదిష్ణుడవోయియన్న
కౌసల్యసుతుడవినుము ఘనుడరాఘవా
నిన్నువనితవద్దనునిచి వన్నెమృగము దెచ్చెదనుచు
పిన్నతనముతలచి మోసపోతిలక్ష్మణా
ఎగ్గులెంచబోకుసుమ్మి ఎవ్వరంచువున్నావు
అగ్నివంటిసీతసుమ్మి అన్నరాఘవా
జనకునింటనుండమనుచు పలికినంతవినకతరుణి
కానలకునువచ్చిదప్పె ఘనతలక్ష్మణా
డభై రెండు వెల్లువలు దేవఋషులు మిమ్ముగొల్వ
నిబ్బరంపు కలగంటి నిజమురాఘవా
ఘోరదనుజ కుమతులిచటగూడి తిరుగుచుందురన్న
దారీతెలిసి వేగబోదము ధన్యలక్ష్మణా
అందముగ వారిమిట్ల అయ్యోధ్యరామచంద్ర
ఇందుముఖి బాయనేమొనిందు రాఘవా
ఈరీతి రాఘవుడు లక్ష్మణుని మృగముచే కొనిరాగనూ
సీతాపహరణంబుసేయ రావణుడపుడు సన్యాసివేషముననూ
రాగానుగనుగొని దేవతలువెరగంది దివినుండి పలికిరపుడూ
మారీచరావణుడు మాయవేషముదాల్చి దూరమెంచకవచ్చెనూ
వచ్చెవాడెరుగక చాలపాపములకు చొచ్చెక్రూరుండగుచునూ
చిచ్చువంటిసీత కాలసర్పముదండ గుచ్చిమెడవేసుకొనెను
ఈచోటువిడచి దాబోవునో వచ్చునో రాముడిపుడూ
పక్షీవృక్షములెల్ల భామకూతోడుండ చొచ్చివీడెట్లంటునూ
అంటెనారావణుడు అపుడెమండుసు నిప్పువంటిది పతివ్రతనుచు
దేవాదిదేవతలు దివినుండియాసీతాదేవిని కొనియాడిరీ
వడిగరావణుడపుడు వసుధకేతెంచి యావనజాక్షి జూచిపలికె

కాంతాశిరోమణి పర్ణశాలలనుండ కడనిల్చి భిక్షమడిగె

అతిథులనియెంచి యాయాదిలక్ష్మి ఫలములంది వేయపోగనూ

అమరులందరుబెదర అపుడు శూలము నాటి అభూమిపెల్లిగించె

గడ్డతోనెత్తుకొని గగనంబుకెగసియు ఘనరథముమీదనునిచి

అతిమోదమందుచు రావణుడుగగనమున నతివేగమున పోవగా

అధికశోకముతోడ అంగలార్చుచుసీత హాయనియేడ్వదొడగె

దేవమునులారఓదిక్పాలులార యిటదిక్కుమీరెవ్వరయ్యా

వనదేవతలారననుగావరె పక్షివనపాలకులుమీరునూ

దేవాదిదేవుడా శ్రీరామచంద్రునకు దెలుపుడీమీరనియెనూ

కైకమదిచల్లనాయెకాకుత్థ్సరాడాయె కటకటాఏమిసేతూ

ఘనమైనదుఃఖమున రాక్షసులపాలైతి కాచువారెవ్వరికనూ

ఎపుడొచ్చునోరాము ఏమిసేయుదునేను ఏలంటిసౌమిత్రినీ

ఇపుడెశ్రీఘ్రమువచ్చిననుగావు శ్రీరామ యిక్ష్వాకుకులతిలకుడా

ఈరీతిమొరబెట్ట వినిజటాయువువచ్చి యిక్ష్వాకుదేవికనెనూ

వెరువకుము ఓతల్లివెరువకుము ఓయమ్మవిడిపింతు వానిజంపి

ఓరోరిరావణా యిటువంటి అన్యాయమోర్వదుర నిన్నుభువియూ

వినరోరిప్రాణములువిడిపింతు నాయెదురవెన్నిమ్ముపారిపోకా

వేగమునతన్నెనువాడి రథమంతయుపీడి పొడియైరాలెను

రావణునితన్నెను సారథిని జంపెను రారయుద్ధముకనియెనూ

రయమొప్ప గుఱ్ఱాలజంపిమరి దశకంఠరారనెనినుగూల్చెదా

అనియిట్లు జగడంబుయిద్దరును సేయుగా పక్షితోనిలువలేకా

అధికయుద్ధముసేయకపటుడై రావణుడు ఆయములు దెలుపుమనెనూ

తప్పుచెప్పకురోరి తగురెక్కలాయంబు తగునాయమేదినీకూ

తనకాయమంగుష్టమనినంత పాదలముదన్ని చీల్చెనుపక్షియూ

తన్నినంతనెపక్షిరెండు రెక్కలువిరుగ తావేసెశూలమునను

పోలేకరాలేకఎగరలేకనుపక్షి పక్షిపడియుండెభూమిపైన

ఇదియెసమయంబని ఎత్తుకొనిపోయెను యినకులాధీశుసతినీ

కడువేగమున బోవగని ఋష్యమూకమున సొమ్ములటబడవేయగా

అపుడుసుగ్రీవుండు ఆశ్చర్యమందుచు ఆసొమ్ములెత్తిదాచె

అతివేగలంకకూ ఆసీతగొనిపోయి అశోకవనమందునునిచె

రాక్షసస్త్రీలను పెక్కు కావలి పెట్టి గ్రక్కున లంకకరిగెనే
ఇదియేమి సోద్యమని యింతులుత మలోన చింతతోడను బల్కిరి
మారీచు రావణుడు మాయవేషముదాల్చి పుత్తమాంగన దెచ్చెనూ
సత్యంబు జ్యోతియగు సకలలోకైకమాతను దెచ్చి తోటను వుంచెనూ
వచ్చేరు రాక్షసులు చాల పగతో రాముడొచ్చి రావణు చంపునూ
ఇచ్చోటు విడచి మన మెచ్చోట పోదాము మత్స్యావతారుడొచ్చెనే
ఎచ్చోటనైనాను యిటువంటి పాపములు ఎవ్వరైనను సయింతురా
మనకేల సుద్దులు మగువ చూతామనుచు బనిచినా పని సేతమూ
అంతలో రావణుడు అతివను పిలిపించి యింతితో డుకరమ్మనె
ముదితలు గూడుకొని ముచ్చటలు ఆడుచుకువచ్చిరీ సీతకడకూ
హస్తములు ముకుళించి అపుడు మండోదరి ఆసీతతో బల్కెనూ
మనవి చెప్పినాడు మా వెంట రావమ్మ వచ్చని పల్లకెక్కి
రాలేను పోవమ్మ రమణులార స్వామి రానున్నవాడెయమ్మ
సర్వదా రావణుని జంపుదును నేనని శపథంబులాడినాడూ
ఎల్లలోకములెల్ల ఎరుగంగ తాహరువిల్లు పుల్లగాద్రుంచెనమ్మా
చక్కగా అయోధ్యస్వామి రఘురాముడు యెక్కువగనన్నేలెనూ
ఇంతి పల్కినవిని చింతించుకొని స్త్రీలు అంతఃపురమె జేరిరీ
ఆరాత్రి నిద్రించి మరునాడు రావణుతో ఆమండోదరియు బలికె
ఏమయ్యనాథుడా సీతవార్తలు వినుము యింత నిద్రేలనీకూ
వచ్చేంత కలగని మేలుకొంటిని స్వామి సవిస్తరముగ వినుమీ
ఉత్తకలయనుగాదు చిత్తాన వుంచుమీ ముత్తికలు మనలంకకూ
కొండంతకాలాన బ్రతికి లేదనాడు కొంతైన సకలమెరుగనూ
ఏమి కలగంటివే మండోదరీ నాకు ఎరుగంగ వినిపింపవే
చేతిగాజులు చిట్లె చెవులపోగులు విరిగె చంద్రాయుధ పెటెత్తెను
అత్తి ముత్యము తెగె ఆరువేలకంటె అధికమైతునకలాయెనే
ముక్కుముంగెర విరిగి మూడుతునకలగాను ముంజేతనుండగంటి
కట్టుకొన్నట్టి పట్టుచీరకొంగులు కాలి యట్టుమండగ గంటినీ
ముంగిటను నిలుచున్న గాజుకంభము విరిగి భూమిపై వ్రాలగంటి
ఏడేడ జూచినా అపశకునములుగాన ఆవుకీడు కలలుగంటి
పదిబారలాతోక పట్టైతిరుమణివాడు సీతకుంగరమియ్యగా

పదిశిరమ్ములు రాముబాణాగ్నిచే గూలి పడిపోవకలఁగంటినీ
కలలువిని రావణుకు కలమనకుకాదని కలఎవరికొ గనియేను
మండోదరీకల మనప్రతివాదులకు మరికల్లగాదు వినుమూ
ఇల్లాలి కలఫ నీవు హితవుగావినకుంటె ఏలాగనేనెంతునూ
అనుమండ శ్రీరాముడనుజుతో గూడుకొని యాపర్ణశాలజూచి
పర్ణశాలాకాడ పదిలమైయున్నట్టి పణతిలేదురలక్ష్మణా
చిలుకలును కోకిలలుచిన్నబోయున్నవీ సీతలేదురతమ్ముడా
హంసలు చకోరములు అదిరెండుకదుపులై ఆలించివిను లక్ష్మణా
కంభానవెలిగెడు దీపకళికలకాంతి కాంతలేదురతమ్ముడా
మృగముదెస్తినిరావె ముద్దుసీతరొనీవు మొగమైన జూపరమ్మా
పలుమారుబిలచినా వకసారిబలుకదూ యిదియేమి ఓతమ్ముడా
చీకటికోనలో యాడదాగున్నదో వెదకి చూతములక్ష్మణా
ఆడదానిమాటలవి గణనజేసుకొని నీవువత్తువెతమ్ముడా
పంతంబుగానిన్ను పర్ణశాలాకాడ పదిలమంటినె తమ్ముడా
విన్నుతమ్ముండని నమ్మితినియిట్లౌట నేనెరుంగనులక్ష్మణా
ధరణిమీదనుకాళ్ళు నిలువవేలాగునను తాళకోందనులక్ష్మణా
చెలరేగి కోకిలలు రంతులుచేసేను జానకినిగాననోయి
పలుమారు హంసలు పారాడుటయెగాని పణతిలేదురలక్ష్మణా
ఇలలోనయిటువంటి సతినిపోగొట్టుకొని ఎట్లోర్తురాలక్ష్మణా
తాటాకుమంటలై దగులుకొని నామనసు దరికొల్పుచున్నదిపుడూ
నాసరివాడవు నాచిన్నితమ్ముడవు నాకూర్మిబంధుండవు
సురులు గుంపులుగూడి సోద్యమందుచునున్న సొంపుతరిగెనులక్ష్మణా
పాయగాదానవుడు పొంచియెత్తుగసీత మాయమైయ్యెనులక్ష్మణా
నీవుతమ్ముడవని నిను నమ్మిబోతి నెట్లోర్తురాలక్ష్మణా
రావోయిలక్ష్మణా నాచిన్నితమ్ముడా రమణి వెదుకనుపోదమూ
పదవయ్య నాస్వామి శ్రీరామచంద్రా మీపాదములుకొలచివత్తూ
ఆలాగెపోదాము విల్లునాచేతికి అందియ్యవేలక్ష్మణా
ఘనపుణ్యశాలి ఓ శ్రీరామచంద్రుడా విల్లుగైకొనివచ్చెదా
అడవులు కొండలు అడవిమృగములుపెక్కు అదిగాకవినులక్ష్మణా
ఏకసందులేదోయి యీయడవిలోపల ఎట్లుపోదము తమ్ముడా

తిన్నగా యీశాల త్రోవనేపోదాము పుణ్యుడా వినులక్ష్మణా
అన్నయును తమ్ముడు అతిశీఘ్రమునగూడి తిన్నగానడువగాను
పన్నుగామృగములు పక్షులును వచ్చెను పణతి వార్తలుదెలుపనూ
శ్రీరామచంద్రి మీసీతబోయినజాడ చెప్పెదము వినురాఘవా
హేరామ హేరామ యనిపలువరింపుచు యటుదణము బోయెనూ
పోగానుకనుగొని పోనీకనీబంటు పోరాడెకొంతసేపు
మాయల రావణుడు గెలువగలేక తనమదిలోన తలపోసుకా
ఆయములు దెలుపుకొని పోట్లాడవలయును అనిపల్కె విను రాఘవా
పక్షినాధుడు యిట్టికుచ్ఛితము లెరుగకా బయటపెట్టెను ఆయముల్
పక్షినాధునితోను ముచ్చువిద్యలదొంగ పలికెను అంగుష్టము
కావుకావునగూసి కోపముచు పెల్లార్చి కోటియోజనము లెగసెగా
డాకచేసివచ్చెదన్నె అంగుష్టమును రావణుడ చావుమనుచూ
తన్నిపోవగజూచి దానవుడుకోపించి తనచేతి శూలముననూ
ఉన్నతంబైనట్టి రెండు రెక్కల నడమ పన్నుగా విరుగవేయా
పడ్డాడుభూమందు దొడ్డకొండావలె పక్షినాధుడు రాఘవా
కారుణ్యమూర్తివి అతని ప్రాణమువచ్చి కాచిరక్షింపవయ్యా
వనపక్షులార యోనెమలి కోకిలలార మీవల్లనే వింటిమిపుడూ
అనుమానమేటికి అతని ప్రాణములిచ్చి యావలికినేబోయెదా
పడియున్నపక్షినిజూచి శ్రీరాముడు పంతము బలికిచ్చెనూ
లేవోయిపక్షీంద్ర నాసహోదరుడవు యింతనిద్రేలనీకు
దిగ్గునలేచియు కరములెత్తిమొగిచి దగ్గరనునిలిచెనపుడూ
ఇక్కడిలోకములు యింతెచాలూననుచు అక్కడిలోకమడిగెగా
ఇట్టిపై కుంతంబు యిద్దరూచూడగా పక్షివల్లభునికయా
హెచ్చుగా యిహపరములెల్ల కాలమునీవు యేలుకొనివుండుమనియెగా
కదలిపోయెను రామచంద్రుడు అవలికి ఘనమైన అడవిలోనగా
అదురుబెదురునులేక నడచిరి వారపుడు అందందు వెదకుకొనుచు
శబరియాశ్రమమునకు వచ్చినంతనె శబరిచాల స్వామికిమ్రొక్కెనూ
ఎందుండి వచ్చితిరి ఎవరుమీరనియడుగ యిక్ష్వాకుకులచంద్రులూ
తండ్రి యనుమతివచ్చి దండకాటడవిలో తరుణినీ పోగొట్టుకా
వచ్చితిమి వెతుకుతూ రాగానె నినుగని యిచ్చోట నిలిచినాము

అనినంత శబరియు ఫండ్లుఫలములు యిచ్చి అంపించె నతివేగమె
పంపానదీతీర ప్రాంతమున రాజాచి బలుడైన సుగ్రీవుడూ
గొదగొని సుగ్రీవు రామచంద్రునిజూచి మదిలోన చాలబెదరీ
వాలిపంపున వచ్చియున్నారో వనములో వారెవ్వరనుమంతుడా
బలవంతులోకాని తెలిసినామదిలోన భయమెల్ల దెలుపవయ్యా
వడివడిగ యావాయు పుత్రుడంతనెవచ్చి వారికిని మ్రొక్కినిలచెన్
సర్వరక్షకమీరు యెందుండి వచ్చితిరి స్వామి మీరెవ్వరయ్యా
అతడు శ్రీరాముడు నేను లక్ష్మణుడను అదిగాదు నీవెవ్వరూ
మతిమంతుడైనట్టి సుగ్రీవుబంటును మహరాజ చంద్రవినుమూ
వచ్చితిరి యిద్దరు వనభూములాయందు వచ్చినా పనియేమయా
వస్తిమీ మేమిపుడు సీతబోయినజాడ వనభూములందు వెదుకా
వనజనాథకులుడ మీచేతకాదయ్యా వనభూములందు వెదుకా
ఈరీతిగామీరు యిద్దరుపోయి పగయేరీతి సాధింతురూ
తరుణిసాధించను మీచేతకాదయా తపసులారా పోరయా
దశరధున కుదయించి తపసులము మాకిపుడు దశములెక్కడ వున్నవీ
అన్నతమ్ముని రాజ్యమంతయు తీసుకొని అటుతరుమ భయముతోడా
వచ్చియున్నాడయ్యా మాల్యవంతంబునా వగచుచు భయముతోడా
పగతీర్చి సుగ్రీవు బంటుగానేలుగొని పట్టిగెలిపించుదేవా
బహుసేనగూర్చుకొని వచ్చిమీపదముకడ బంటుగా నుండగలడూ
నమ్మించి చేబట్టి వాలినీవటు జంపి రాజ్యంబు యిప్పించితే
పొమ్మ మీవాడను నమ్మికలు మాకిచ్చి పొమ్మని కృపసేయుమీ
రావోయి హనుమంత రాముని వాక్యములు సత్యమని నమ్మవోయి
పోవోయి వేగమున సుగ్రీవుతోదెమ్మ పోరాటములు మాన్పెదా
పోయెదిదెనని వాయుపుత్రుడు వేగపోయి యచ్చట బలికెను
రావోయి సుగ్రీవ మీపగలు దీర్పగా రాముడొక్కడు వచ్చెనూ
గ్రక్కున రావయ్యా మనవగలు దీర్పగా కాంతసొమ్ములు కొంచుక
అతివసొమ్ములు గొంచు హనుమంతు సుగ్రీవుడతి రయంబున వచ్చిరి
సీతాపతెరామ శ్రీరామచంద్ర మీశరణు జొచ్చినవాడనూ
మహాపుత్రియాసీత చెరబోవతన సొమ్ముమహిమీద బడవేసెనూ
అదియెత్తిదాచితిమి యావనిత సొమ్ములు అంగీకరించుమనెనూ

సౌమ్ములజూచెను శ్రీరామచంద్రుడు జుమ్మనుచు మూర్ఛిల్లెనూ
క్రమ్మరంతటదెలసి సౌమ్ములంతట దన కన్నులను వత్తుకొనెనూ
ఇదియుసమయముగాదు యేలశోకింపను యికమీద సౌకార్యమూ
నీపగయుసాధింప నాచేతనౌనోయి నీవుబోయివానిబిలువు
కపటమించుకలేక కదిలెను సుగ్రీవు ఘనుడైన వాలిజంపా
ఓరోరి వాలిరో మూలనెయున్నావు తారతోలోలుండవై
కాలమింతెనీకు చాలునీ భోగంబు కదలరా యాడకైనా
కొండలును త్రెళ్ళంగ మండలము భేదిల్ల కోపించి వచ్చెవాలీ
తనముష్టినను బొడిచె దయయింతయునులేక ధరను మూర్ఛిల్లజేసెః
అంతలోతెలివొంది అన్నతమ్ములుపోర రక్తశిక్తాంగులగుచు
కీలుబడి సుగ్రీవు వాలికి వోడియు కిచకిచలు ఆడసాగెః
తనలావుతనబలిమి తనశూరత్వము విడిచి తాబారదలచెనపుడూ
ఇద్దరినిజూచితె యొక్కరూపున నుండ యిరువురు వూరకుండెః
తడబడుచు సుగ్రీవు తనవాల మీడ్చుకొని తారాముకడుకు వచ్చెః
నమ్మితిని ఓరామ నన్నిపుడు కాతువని న్యాయముల దప్పినావూ
యెమ్మెలమాటలు ఆడితివి యాసీత సొమ్ములెల్లా దీసుకా
హీనవృత్తిపనికిజొచ్చి నినుమ్రొక్కితి ననునీవుగాతువనుచూ
నీచేతనై తేను యాసీతబోవునా నీకేడ బంటుతనమూ
నీరూపువానిరూపేకమై యుండగా వూరకనె యుంటినేను
ఈపుష్పమాలిక గళముననుధరియించి యేగియుద్ధము సేయుమూ
నిన్నునమ్మగలేను యినవంశతిలకుడా నీపైనఘనుడువాలి
వన్నెగానుయేడుతాళ్ళు కౌగిటబట్టి వంచియాకులుగోసునూ
దుందుభి కళేబరము యొక్కయోజనపొడవు దూరముగ బడదన్నెనూ
ఘనపరాక్రముడైన వాలితోయుద్ధంబు గావింపవెరతుదేవా
అంతకన్నానీవు హెచ్చుగాజిమ్మితె అతనికన్నను ఘనుడవూ
అట్టైకానిమ్మని శ్రీరామచంద్రుండు అట్టెవిల్లెక్కుబెట్టి
వన్నెగా యేడుతాళ్ళును గాడిబారగా వడిబాణమునవేసెనూ
ఆయేడు తాళ్ళను గాడియటుగిరి దూసి అలశేషుగని వచ్చెనూ
దుందుభి కళేబరము దశయోజనంబుల దూరంబు పడజిమ్మెనూ
నీమాయతెలియక నిన్నుబోనాడితిని నేరమెంచంగవలదూ

రామావతార నేనీకు తగుబంటునని రాముపదముల కెరగెనూ
ఆపుడుసంతోషమున శ్రీరామచంద్రుడు ఆపుష్పమాలదెచ్చి
సుగ్రీవుమెడ వేసి పోయియుద్ధమునేయు సృక్కడంచెద వాలినీ
అనిసంపగదరెను అధికసంతోషమున అవలీలగూల్తుననుచూ
కుప్పించియెగసియు కొండచేబట్టుకొని కూసెనూ సుగ్రీవుడూ
అతిఘోరమైనట్టి కోపంబుతెచ్చుకొని ఆగ్రహుండై వెడలెనూ
వాలిరాగాజూచి తారయడ్డమువచ్చి పోవలదు మీరతనిపై
నామాట వినునాథ నగుబాటు సేయకా నాప్రాణవల్లభుడవు
నిన్న అంగదునిచే నిక్కముగవింటిని నేనొక్కమాట వినుమూ
దశరథుని పుత్రులు యిరువురడవికివచ్చి దేవిసి గోల్పడియునూ
ఇనసుతుని చేబట్టి యిలమీద నినుగూల్చి యీపురి యిత్తుననుచూ
అనిచెప్పి బాసలిడి కయ్యమునకొచ్చినాడతనితో పోరాడకూ
కరకుమాటలుయేల కడకుపోవేతార ఖండింతు సుగ్రీవునీ
రణశూరుడని తన్ను యెరుగకుంటివెతార రణభూమి జంపివత్తున్
యుద్ధసన్నిద్ధుడై యుండెడి సుగ్రీవు నొప్పుగాజూచి వాలి
తమ్ముని మోమును తప్పకనె చూచియు తరిమితె పారిపోయీ
ఇపుడేలవచ్చితివి యింపుపెంపెరుగక యెగ్గుసిగ్గును లేకనూ
వచ్చినవానిని మగుడిబోనిచ్చుటలు మర్యాద వినికెలా
యెచ్చివీడింతేసి చేసినందుకుచాల యిప్పుడే జంపివేతూ
అన్నాను తమ్ముడును కొండలను దీసుకొని అతిఘోరమున పోరిరీ
కొండలటు బడవేసి మెడబట్టుకొనిచాల దండియుద్ధము చేసిరీ
సుగ్రీవు కిందబడ వాలిమీదెక్కుకుని చూచెనా రఘురాముడూ
మానిచాటుననుండి మహాపెల్లగిల్లగా మనుజాధినాథుడపుడూ
విలుగుణధ్వనిచేసి శరము సంధించెను విశ్వంబు బెదరగానూ
వాలిన గురిజేసి వక్షంబుపగులగా వసుధపై బడనేసెనూ
శరముగాడివాలి ధరణిపైగూలెను శరమురాదెలక్ష్మణ
శరణుజొచ్చినవాడు మీపాదములకును శరమురానీడు స్వామీ
గర్వించి మనశరము రానీకబట్టెనా ఘనునిజాతము లక్ష్మణా
అటకుపోతేను వాలిచాలాదూరు అటపోకతగదుస్వామీ
దూరితేనేమాయె దుష్టులగువారలను దృంపతగవాలక్ష్మణా

అన్నయునుతమ్ముడు అవాలిదగ్గరికి తిన్నగావచ్చినిలచీ
హెచ్చరికగాబట్టి శరముతియ్యగబోతె యిట్లనుచుబలికెవాలీ
మానాభిమానములు పొగొట్టుకునిమీరు మమ్ముచంపగవస్తిరీ
పొంచుండివేసితివి బోయవింతెకాని భూమిపతివానీవును
కోతిమాంసముగోరి పొంచుండిచంపితివి నీతిమార్గమెనీకునూ
ఒకమాటనాతోను చెప్పితె సీతను ఒప్పింతు నిటకుదెచ్చి
వానిచేపట్టినను వంచనగజంపితివి వచ్చెపాపంబునీకు
అన్నదమ్ములుమేము అలిగియుండగనీవు అన్యాయములునేతురా
తాపసివినీకును తగునయాయీపనులు తగుభరతుదండింపగా
ధర్మములుతప్పితివి దయహీనుడైతివి దశరథరామచంద్రా
ఈరీతి దూరుచు యిలమీదగూలెను యింతితోదెలిపిరపుడూ
వాలిగూలినవార్త తారతోచెప్పితే వగపుచేసాగితారా
బాలుడా రావోయి అంగదుడ మీతండ్రి బలిమిగూలిపోయెనూ
తల్లియును తనయుడును తడయకారణమందు తరలివేగమెవచ్చిరీ
మెల్లనెకూర్చుండి మెడికిందచేయిచ్చి మెల్లనే తడవిజూచి
చీకాకుబడియున్న కురులుభూషణములు చక్కగాసవరించియు
ప్రాణేశనినుబాసి యేరీతితాళుదును ప్రాణములు నిలువదికనూ
కట్టడైయుండెనో రాముచేతనుగూల కటకటాయేమినేతూ
చెంతనున్నట్టి శ్రీరామచంద్రునిజూచి చింతతోబలికెతారా
పన్నుగామిముదోలి రాజ్యంబుగైకొన్న భరతుడాయీవాలియూ
ఈతపము యీజడలు యీనారచీరలు యీవేషములు దాల్చియూ
ఇంతినెత్తుకపోయినట్టి రావణుడట్టెయిట్లు చంపగవాలినీ
వేగమెమొగతనముగలవాడ వయ్యుండి వివరించిచంపవలదా
అన్యాయములుచేసి చంపితివివాలిని అందేమియయ్యెనీకూ
గురుపుత్రుజంపిన దశరథమహరాజు కొడుకుగావానీవునూ
తరతరము బ్రహ్మహత్య తగజేయువారికి పరులహత్యలుచోద్యమా
తగవు ధర్మముగల ధర్మపుణ్యుడవయ్యు జగదీశనీవెరుగవా
అనిపలికియాతార అతిదుఃఖమున నుండ యావాలి మూర్ఛదెలసె
సుగ్రీవునీజూచి శుభమొప్పబలికెను సుఖముగానుండు మనుచూ
కపికులుని గళమున కనకమాలికవేసి కడుసంతసిల్లజేసె

అంగదుడు బాలకుడువాని రక్షింపుము అనిబలికె వాలియపుడూ
తాళలేనునేను తప్పించు శరమును తప్పించుమీదపాదమూ
కడుహెచ్చరికతోడ శరము దీసుకస్వామి కడనిలిచి యుండెనపుడు
ఆవాలికంగదుడు అగ్నిసంస్కారములు అంత్యక్రియలును దీర్చెనూ
సుగ్రీవునికిపట్ట మమరంగగట్టుమని సోదరుని బనిచెనపుడూ
దయతోడ లక్ష్మణుడు పట్టమమరగగట్టె తారకునుపతిజేసెను
తారాదికామినులు తనుగొలువ సుగ్రీవు తారామ కడకువచ్చె
శరణుశరణు రామశరణయ్య శ్రీరామ శరణయ్య సీతాపతీ
మిమ్ముశరణన్నవారికి చలనములులేదు మీబిరుదులటువంటివయ్యా
రాజీవనేత్రుడా రాజ్యమంతయునీది రావయ్య పట్నమునకూ
పట్నములకును రానుపనిలేదు సుగ్రీవ పనిని వడిగజూడుమీ
వానకాలమువచ్చెపోరాదు సుగ్రీవ వైరివర్గము మీదికీ
వర్షయోగంబెల్ల గడచివైరులమీద వాలాయముగబోదమూ
వినయముతొ సుగ్రీవు డంగదుడు మొదలుగావిని సమ్మతించుకొనిరీ
అన్నయును తమ్ముడును యామాల్యవంతమున యమరికతోనుండిరీ
అంగదుడు సుగ్రీవు హనుమంత మొదలుగా అరిగిరి కిష్కింధకూ
తారాసమేతుడై యేవేళబాయక తానుండె సుగ్రీవుడూ
ఎండకాలమువచ్చె యిందాకరారైరి యిదియేమి ఓలక్ష్మణా
మత్తులైమరచిరో యేమిబొయ్యేమని మందమున నున్నవారో
వనచరులు వారలకు బుద్ధిదాలేదన్న వడిగబోవలెలక్ష్మణా
అనినంత లక్ష్మణుడు వానరులపురికిని అంపించుకొని పోయెనూ
తెల్లమిగ లక్ష్మణుడు హజారముననిలచి ధీరుడైయిట్లనియెనూ
ఓరోరి సుగ్రీవ రాము కార్యము మరచియున్నావు తారగూడీ
సత్యశౌచంబులు చాలదప్పినయట్టి చెనటి మర్కటు లెరుగరు
కావరించంచి యోరి వానరుడ మమ్మును కని గొల్వరావైతివీ
ఈవేళరాకున్న రాఘవుడు కోపించి యీలక్షణమెనిను దృంచునూ
వాలినేసినశరము వడిదియ్యకున్నది వానరుడనేడు వినరా
వాలాయముగమిమ్ము యిద్దరినిజంపి పోవస్త్రినానేను యిపుడూ
పరువునావిని తారనగరు వెడలివచ్చి పాదముల వ్రాలెనపుడూ
పురుషభిక్షము నాకు పెట్టవలె లక్ష్మణా భూదేవి సాక్షిగానూ

నరనాధచంద్రుడా నామొరాలించియు నన్నురక్షించుదేవా
మరచియున్నాడు గాదయ్యవానరుడు మనుజేశ చంద్రవినుమూ
మళయాళ నేపాళ మధ్యభూపతులకు మరి కమ్మలంపినాడూ
అంగవంగ కళింగ భూముల వానరులు అందరును యిదెవత్తురూ
పొందైన కాంభోజ కర్ణాట వానరులు భూరిగా యిదెవత్తురూ
రంగుగా కొంకణ ద్రవిడదేశ విదర్భరాజ కపులిదెవత్తురూ
సప్తద్వీపములందు గలిగినా కపులెల్ల సాగివత్తురు వేగమే
అనిపలుకునంతలో సుగ్రీవుతాజేరి యతనిపూజించె నంతా
భంగంబుగాకుండ వాలిసుగ్రీవుల బలమెల్ల వచ్చెనపుడూ
అంగదుని బలములు ముందుగా కదలెను ఆరాఘవులజూడనూ
పరువునా సుగ్రీవు లక్ష్మణుని వెంటజని పాదములపై వ్రాలెనూ
కాకుత్థ్సకులనాధ కరుణాపయోనిధి కాచిరక్షించుదేవా
నానేరములుగాచి నన్నురక్షింపుమీ నరనాధచంద్రయిపుడూ
చిరునవ్వునవ్వుచు శుభమొప్ప సుగ్రీవు శీఘ్రముగ లెమ్మనియెనూ
అంగనామణి వెదుక అంపుమీ సుగ్రీన అన్నిదిక్కులకనియెనూ
పొంగుచును శతబలియు శరభుండు గవయుండు బోయిరంతట తూర్పునా
ఘనుడైన మైధుండు గంధమాదనుడును గనలిపత్తరానా
దుర్ముఖుడు గోముఖుని జోతిర్ముఖునినేన తోడుకొని పడమటరిగెన్
అంగదుడు జాంబవంతుడు హనుమంతును అరిగిరి దక్షిణానా
తూర్పునా ఉదయాద్రి కరిగినా కపులొచ్చి తొయ్యలిని గానమనిరీ
నెరయ వుత్తరమున కరిగిన కపులొచ్చి నెలతుకనుగానమనిరీ
పంతమాడుచువేగ హస్తాద్రికరిగి యాపణతిని గానమనిరీ
మగుడివచ్చిరి కపులు రామచంద్రునికడకు మగువను గానమనుచూ
ఈవానరులుబోయి యరసియందరువచ్చి రిదియేమిసుగ్రీవుడా
అవుగాకశ్రీరామ ఆలోచనలుయేల అంగదుడుదెచ్చువార్త
అనువుగానెందును సీతపొడగానక హనుమంతుడిటపురాడూ
అనుచుండయచ్చోట అంగదుడు జాంబవంతుడు అడాడవెదకియలసీ
అందరిలో పెద్దగా నన్నుమన్ననజేసి అందించెయీముద్రికా
నాతినికానక యేరీతిపోదును నరనాధుమోముజూడా
యడబడి అంగదుడును వాయుసుతుడునుగూడి యాబిలములోజొచ్చిరీ

అందున్న సంపాతి యాహారమబ్బెనని యందరిని జూచిపలికె
రారోయికపులార యెవరుమిముబంపిరి రామరామనిపల్కెరు
ఏలాగువస్త్తిరి యీకోనలోపలికి యెరిగింపుమనుచుపలికె
శ్రీరాముబంట్లము సీతకై వస్తిమి చిక్కితిమి యీకోనలో
కానలేమైతిమి లంకకుమత్రోవయు కటకటా యేమందుమూ
అనినంత వినరయ్య మిముగంటిమినేడు అన్నితపములుబండెనూ
ఘనులార లంకకు త్రోవయిదుగోనయ్య కదలిపోవుడుమీరలూ
ఆడనుండివచ్చి యారాముసేనలు యాకోనదాటి బోయీ
హెచ్చైన సముద్రమును జూచియంతట తమరు యేలాగుదాటుదామూ
అంగదుడుబలికెను ఆవలికినేబోదు అందుండి రాలేననే
సంగతిగ జాంబవుడు తాపెద్దనైతి సత్తువయుచాలదనెనూ
ఇంతేసిపనులును మనచాతకాదు హనుమంతునిచాతనౌను
అనుమానమునులేక అంగదుడుతాబోయి హనుమంతుతోబల్కెనూ
ముద్రకర్తవుమాకు కాగానెరాముకు ముద్రికను చేతికిచ్చె
పెద్దలకు పెద్దవు పెంపైనవాడవు ప్రియమైన బంటువయ్యా
పొద్దునా నీవులేచి వారధి దాటియు పొలతి చూచీరావయా
ఎంతేసిపెద్దలు యిందరువుండగా యింతభూషించనేలా
పంతములుకాదు మీబంటునుఅని చాలపలికెనూ హనుమంతుడూ
పెళపెళ పెళ్లని యార్చి యొకపెద్దకొండటుయెక్కి భీకరముగాబలికెనూ
బలవంతుడైనట్టి రఘురామునిదలచి పంతముతోదాటగాను
హనుమంతుగనుగొని యామకరిఖండించి ఆవలను లంకకెగసె
శంకయింతయులేక లంకచొరచుకుబోతె లంఖిణియడ్డమాయె
పొంకముతోలంకకు కావలైనేనుండ పోనియ్యరానిన్నునూ
అనినంతలంఖిణిని యరచేతనొకపెట్టు వ్రేయగనె మృతిబొందెనూ
లంఖిణిని జంపియాలంకలోనికి పోయి పొంకముగవెదకసాగె
కోటకోటకువెదకి కోటలోమేలైన పేటలన్నివెదకెనూ
గుర్రాలశాలలును కుంభునినగరరసి కోమలిని గానడాయె
కావలికూటములు నీరాడురేవులు గలచోటులెల్లవెదకి
తోపులును తోటలును దొడ్డవనములయందు తోయజాక్షినివెదకెను
భూమిజనుగానక బుద్ధిలోహనుమంతు డేమనుచు నున్నవాడు

యాడవెదుకుదునని మదిలోనగుందుచు యాడాడనిలుచుండెను
ఆరావణునిచేత బాధలను బడలేక రమణితెగువజేసెనూ
రాగానె జలనిధిలోబడియెనో మరిలేకయేమాయెనోజానకీ
సూర్యచంద్రాదులను చూపుమని దండించి చూర్ణంబుగా నేతునో
అసీతచూపుమని అమరుల దండించి అగ్నిదాదగిలింతునో
అష్టదిక్పాలకుల దండించి యడుగుదునొ ఆకాశమెయరతునో
ఏమిసేయుదునేను ఏమందు సుగ్రీవు కేమందు సీతాపతికి
తానందరినిబట్టి దండింతు రావణుని ధరమీదబడగొట్టుదు
నేనెట్లుపోదును గాకున్నజత్తును నేనెట్లువిడిచిపోదూ
అంగనామణినిపుడు వీడెందుదాచెనో యారావణునిజంపెదా
చేరిబ్రహ్మాదులను బాధించగాకనె జానకినిగానలేనూ
మేలైనశృంగార వనములోనొకచోట చింతలోనిలుచుండగా
అనుకూలవాయువులు విసరెను హనుమంతు దమ్మవారినిచూచెను
కంటినీ జానకిని కంటినీ సీతను కంటినీ రామునతినీ
కంటినామదిలోని చింతలన్నియుదీరె కలుషమణగెను యిప్పుడూ
పన్నుగా జానకిని వున్నమానునుయెక్కి పక్కగాదాగియుండి
మాట్లాడుదామని మదితలచియుండగా మరియునారావణుండు
వింతలైనస్త్రీలు యెంతేసి భూషణము లెంతెంతవారు గొలువా
అంతలో రావణుడు సీతనుమదిదలచి అధికసంభ్రమముతోడనూ
సంతోషమునలేచి రత్నభూషణము సవరింపసాగెతాను
తేటమీరగ పదిశిరములయందును దివ్యతేజము మెరయగా
దశశిరస్సులయందు దివ్యకిరీటములు దశకంతు ధరియించెనూ
పొందుగామైనింద శ్రీగంధమలదియు అద్దంబు జూచుకొనుచు
అందముగచలువలు దెప్పించి తనమొలను అమరంగగట్టితాను
వేడుకతోగంధర్వస్త్రీలు యిరువంకల వింజామరలువీవగా
సొగసైనస్త్రీలునుచేరి దగ్గరనిలిచే సురలుగొడుగులుబట్టగా
రంభపూర్వసిమేనకాదులును మొదలుగా నాడగావేడుకలర
పనిబూనివేడుకతో మందోదరియురాగ పంతముతొమెరసిచాల
హెచ్చైనసొంపునను వచ్చెనారావణుడు చొచ్చెశృంగారవనము
ఇటుచూడుమోసీత యీవనధిబంధించి నను గెలిచిపోవలేడు

మనుజేశుమరినాతో సరిగాడువినుమింక మదిలోనతెలుసుకొమ్మీ
అడవులనుతిరుగుచు తపసులవుండెడి అతనిపొందేలనీకు
నీవుపసిబాలవు నామాటవినుమింక నీకేలయీపంతమూ
హంసతూలికమెత్త పరుపులునువుండగా అడవులూనీకేటికీ
అమరవల్లభుడైన గెలువలేడునన్ను అదినీవుయెరిగుండుమీ
తమకమగ్గలమాయె తాళలేను విరహతాపంబులోచిక్కితి
కమలాక్షియీస్త్రీలు నినుగొలువనేతును కన్నులనుచూచితేనూ
పణతిఒకతృణము తాధ్యంచిచేపట్టుక పలికెనురావణునితో
గణుతింపశిరములు రాముబాణముననె ఖండించివేయునిపుడూ
నాడుచూచెదుకాక రామునీసాహసము నేడుఅడుగగనేటికి
ఆడుకోనేటికి యింతేసిమాటలు అల్లనాటికిచూచెదా
కాలోగ్రుడైమండి ఖడ్గంబుతీసుకొని ఖండించబూనెనపుడూ
మండోదరివచ్చి మన్నింపుమనిబల్కి మర్యాదకాదునీకు
కావలసినాపనులు క్రమమునననుఅవుగాక కరుణించుమన్నంతను
నేడురేపటిలోన నెలతలోబడకుంటె నిజము చంపించుటనియె
నెలవిచ్చితిని వినరె మీమాటవినకుంటె జానకిని చంపుమనెనూ
అనిచెప్పె రావణుడు మదిలోనగుందుచు అపుడు నగరికిచేరెనూ
నాలుగు దిక్కులను యెవరులేకాచూచి నాతివగవగసాగెనూ
తెల్లమిగ యీకైకదేవి మాటలువిని వెళ్ళితిమి వనభూమికి .
ఇదిరావణుని మాయలని తెలియలేకనేయేల తెమ్మంటిమృగమూ
చయ్యనను శ్రీరామ విభుడుదేబోయెను సౌమిత్రివద్దనునిచి
కాలుచుట్టుకొన్న కర్మవశమోయని తెలిసెనో రాఘవులకూ
హాలక్ష్మణాయన్న ఆమాట తెలియకనె అంతలో మోసబోతి
పలుతెరంగుల మరిది నాతోడ దెలుపగా భావనవిననైతినీ
సన్యాసి వేషమున పాతకుండిటువచ్చి సతులగొని పోవుటెరుగా
నాడు భవతిభిక్షాందేహియని యడిగిన నెలతకపటంబెరుగక
ఫలమూలములుదెచ్చి భిక్షపెట్టితినంత ఆపలముచేకూరెనాకు
చెల్లబో నగ్నిదేవరసాక్షిగ నతని చెట్టబట్టితి నక్కటా
మామామ దశరథుని రథమువిరిగిన నాడె మరియడవిపాలైతినీ
ముందొక్క జన్మమున కొరనోమునోచితినో మునితపము చెరచినానో

ఆరడినోములనేనెన్ని నోచితినో అంగళ్లపాలై తినీ
నామఱదిలక్ష్మణుని నొవ్వనాడిననాడె నలువంకపాలై తినీ
కటకటాయిటువంటి కారణికవె కాననికానంతలేనై తినీ
ఏమనుచు శోకింతు శ్రీరామచంద్ర నీయింతి శరదాయననుడి
అమరులునుఋషులు నాచెయిరేఖచూచి యిదిఅతిభాగ్యవతియందురూ
శ్రీరామచంద్రుని యెడబాసిపోదునని చెప్పరాబ్రహ్మఋషులు
వీనిలోకమునాకు యెవరుసరియనియుంటి విధివశముయిటులాయెను
గిరులారమునులార కిన్నెరేశులార గరుడగంధర్వులారా
నరులార నాసహోదరులార రామలక్ష్మణులకును నెరిగింపుడీ
ధరణియాకాశమాధర్మదేవతులార తద్యమగుపక్షులార
మీరైనప్రేమతో అరణ్యముననున్న శ్రీరాములకుదెలుపరే
తున్నబాసినమొదలు దయలేకదానవుని దండనలుతరముగాదూ
ఈలంకలోపల యీఘోరదనుజులలో యేలాగువేగింతునూ
మదనమైనట్టి నామనసులో మీపాదవనజములు మరువగలనా
అప్పుడూహనుమంతుడన్ని వార్తలువిని అమ్మవారితోబలికెనూ
కొమ్మమీదనుయుండి అమ్మచేతికియియ్యకూడదని దిగిమ్రొక్కియు
రావణుండాడిన మాటలువినినేను రమణిరోవుండనమ్మా
రామునియుత్తరువు లేనందుచేతనే రమణిరోయూరకుంటీ
వానివక్షమురెండు వ్రక్కలుగవ్రేతును వనితరోసెలవులేదు
ప్రాణమునకై వెరచియున్నవాడనుగాను పణతిరోరాముడెరుగున్
అనినంతసీతయు యిదిదానవులమాయలని చాలవెరగందియూ
కలలోనవానరముకన్న కీడందురుగాన యిదియేమిమాయో
బలుదుఃఖములచేత పలువరింపగనేల పతిగూర్చుబంటునేను
విన్నపమువిని శోకములుమాను నీప్రాణవిభునిదెచ్చెదవేగమె
వెరవకుండుమని నిన్నారడించను వేరొకరులేరుసుమ్మీ
నీతోడబుట్టితిని యినవంశతిలకుని నిటకువేతోడితెమ్మీ
అవుగాకచెప్పెద అన్నిరహస్యంబులు అమ్మనీవగ పణుగుమీ
ఏవిధంబులనైనదెత్తు రఘునాయకుల యేలచింతింపమీకు
సంగతిగవానరులు సుగ్రీవుచూడగా సర్వేశ్వరుండు యిచ్చినాడూ
అమ్మవుంగరమిదిగో ఒప్పిస్తిమీబంటు అంగీకరించుకొమ్మీ

మంగళగుణవంతుడైన శ్రీరాముని మనసు సంతోషింపనూ
అంగనా నీచేత ఆనవాలున్నది అడిగి రమ్మనిబంపెను
మనుజేశుడిచ్చినా మాణిక్యమిది జూడు మాశిరసులోనున్నది
కపికులోత్తమ నీదురూపుచూచియుగాక నేరత్నమీనూ
అప్పుడు హనుమంతు డాకాశమెముట్టి అతిరూపమెత్తినాడూ
ఆకాశముననున్న నక్షత్రములు వానికన్ని మొలపూసలాయె
అన్నవెరతునునేను యనిజెప్పి సంభ్రమమున నందిచ్చెతారత్నమూ
కొనియాడి హనుమంతు కొమరొప్పదీవించె కోమలీసీతవానూ
అమ్మరోనేవచ్చి తడవాయెనే తల్లి ఆకలికి ఫలములిమ్మూ
కొమ్మకొమ్మకు కోటి రాక్షసులు వున్నారు యేమనుచు సెలవిత్తునూ
యాడనైనానీవు కడకుకనుగొనినీవు మెత్తుకొని భుజియించుమూ
ఆనతినివడసియు యశోకవనమెల్ల యందందు పెరకివేసె
కావలైయున్నట్టి ఘనదానవులనెల్ల ఖండించె హనుమంతుడూ
సెలవిచ్చెనని చెప్పి చెలగి హనుమంతు చెట్లెల్ల బెరికివేసె
బలమైన రాక్షసుల బలమెల్ల అరిగట్టి బట్టిచెండాడసాగె
పట్టితెండివాని కొట్టింపవలెనని బలమైన దళముబంపె
పట్టభద్రునిబట్టు పదికోట్లరాక్షసుల కొట్టికుప్పలువేసెనూ
నెట్టుకొనిపోరాడ నింద్రజిత్తుచేత పట్టుబడె హనుమంతుడూ
బ్రహ్మాస్త్రమనియేటి బలువైనబాణమున బట్టుపడె హనుమంతుడూ
కొంపోయి రావణుని గుంపులోబెట్టగా తెంపుతోడనె బలికెనూ
ఏడేడు సముద్రములు యేకమైపారగా యేలాగు వస్తివోరీ
నీకేడుసముద్రములలో నాకేడుకాలువలు నిజమనుచువస్తిరోరీ
ఏడుసముద్రములలో మకరినిను మ్రింగక యేలాగురానిచ్చెరా
ఏడుసముద్రములలో మకరులునీవు నావేలు వంచగలేరురా
దక్షణపుయీలంక దానవులకేగాని తరమటర యితరులకునూ
నిన్నును నీలంక నిముషమాత్రములోన నిర్మూలముగజేతురా
ఎదిరించినాతోను యింతమాటలుబలుక యేరాజుబంటురోరీ
కృతత్రేత ద్వాపర కలియుగములేలెటి గురురాము బంటురోరీ
నీరాజుకొలువులో నీపాటిబంట్లు యేపాటికద్దుచెప్పరా
నావంటిబంట్లును నీవంటితృణములు కోటానుకోటిరోరీ

హరిహరబ్రహ్మాది సకలదేవతలు నాకానతులై కొలుతురోరీ
అలనాడు వాలినిను వాలమునగట్టుకొని అంబుధంబుల ముంచెరోరీ
చంపింతు నోనిన్ను యెదురుమాటాడేవు సమమైనవాడవటరా
చించుదును నీపొట్ట చీకాకు చేతును శ్రీరాముబంటునేనూ
నాకన్నపొడవున వున్నావునీవిపుడు నాకన్నఘనుడవటరా
నీకుదిక్కెవ్వరూ నిన్నిపుడుజంపించి కాకులకువేపింతునూ
పట్టింతునూనిన్ను పంకల్లనిప్పుడు పారిపొయ్యేదవాలేదో
రావణుడ నినుజంపి లంకభూతములకు రణవిందుచేయింతునూ
పట్టభద్రునిబంటు బంటనుచుపలుమారు పంతంబులేలరోరీ
నిత్యవైకుంఠంబులేలేటి రాఘవునినే తోడితెత్తురోరీ
బలిమిచెడిలంకలో పడిపోనువస్తివి పంతంబులేలరోరీ
బలమైయీలంక భస్మంబుచేసి నినుపట్టుకునిపోదురోరీ
అంజనీతనయుండ హనుమంతునాపేరు అఖిలలోకములెరుగురా
చెలరేగినినుజంప శ్రీరామచంద్రుడు సెలవిచ్చిఅంపడాయె
కోతిరూపమువాడ కోటలోతగిలితివి కోపములునీకేలరా
ముచ్చురూపమువాడ ముత్తికలోతగిలితివి ముచ్చటలునీకేలరా
లంకకోటలుగదల లంకాధిపులుబెదర రావణుడుతాబలికెను
ఈవనచరునిటట్టి యీక్షణమెగొట్టుమని యిచ్చెదానవులచేతా
ప్రహస్తుడు విభీషణుడు చంపరాదనుచును బలికిరీరావణునితో
అందరునుదూతలను అట్లుసేయగరాదు అనిపలుకుచుండిరపుడూ
కోతులకుగురుతులు వాలమనిచెప్పియూ గురుతణపవలెననుచునూ
పట్టణమునగరిలోగల వస్త్రములుదెచ్చి బాగుగాజుట్టిరపుడూ
హనుమంతుతనతోక అధికముగబెంచెను అదిరావణుడుజూచెనూ
వడిగరాక్షసులార వనచరుని వాలముకు వనజాక్షిచీరతెండూ
ఆమాట హనుమంతువిని తోకముణిచెను అగ్నిసంధించుమనెనూ
కొనతోకముట్టించి విడవగానె వానికొలువుకూటముగాల్చెనూ
పొందుగా రావణకుంభకర్ణాదుల పూరిగృహములుగాల్చెనూ
రథతురగశాలలూ హనుమంతుడునుకాల్చె రావణుడుచూడగానూ
మేడమేడలుదాటి మేలైనశృంగార వాడలన్నియుకాల్చెనూ
పాటించిగంధర్వ స్త్రీలవాడలుకాల్చి పారదోలెను చరులనూ

కోలాహలంబుగా ఘోషింపపురజనులు కుంజరాశ్వములుబార
హనుమంతుగనుగొని అసురులు భయమంద యావనధి దాటివచ్చె
అంగదాదులు మొదలు హనుమంతుగనుగొని యానందమందిరపుడూ
అందరునుగూడుకొని మధువనములో జొచ్చి యాకలియుదీర్చుకొనిరీ
చెలరేగి హనుమంతు సీతయానవాలు శ్రీరామునకిందిచ్చెనూ
వినవయ్యాఓదేవ మేమువెదకినచోట్లు విన్నవించెదమీకును
కొత్తకూటముగంటి కొల్వుచావడిగంటి గుర్రములశాలగంటి
దానవులు వుండేటి మణిమంటపంబులు తగగనుంగొంటినేను
అట్టిశృతరుచైన అసురేశుపురమందు అగడ్తలను కనుగొంటినీ
హరులచె సురులచె నరులచె యాలంకపురము శంకించరాదు
నీయొక్కశరముచే లంకాపురంబెల్ల నీరై తెనేమొదేవా
అంబుజోదరవినుము అలవియెవనగిరులు అగోచరములై యున్నది
అట్టియాలంకలో అన్నిదిక్కులువెదకి అగడితెలు నేవెదికితీ
కోటకొమ్మలువెదకి కొత్తళంబులువెదకి గొప్పమేడలనువెదకీ
పొంకముతొ శృంగారపూతోటలెల్లను కొంకకనె విహరించితి
ఆకులాకులవెదకి మాకులను శాఖలను చీకటివనమెల్లనూ
మూకలోపొడగాన కధికశోకంబుచే వ్యాకులత బడుచుదేవా
అంగంబుబడలి నేనలసియుండగ నొక్కశృంగారవనమునందూ
బంగారువీణెలు చంగావిపలువలు అంగనామణులుదేవా
రంగుమించినయట్టి శృంగారముగ చెలులు సంగీతము బాడగా
పొంగారు వేడుకతొ భూవరాధీశ్వరా భూపుత్రి పొడగంటినీ
ఆడరాక్షసస్త్రీలు కోటానకోటులు గూడిచుట్టుకయుండగా
ఆక్షణంబుననేను వృక్షంబుకడను ప్రదక్షణము లొప్పజేసి
మత్స్యావతార యాలక్ష్మిదేవికి దండమక్షణమె గావించితీ
శిరమెత్తిననుజూచి ప్రియముతోనను పేర శీఘ్రంబెబిలిచెదేవా
నీరాకయెవరంపివచ్చి నాడవు అన్నినిజముగా దెలుపుమనియె
అరాముబంటును అంజనీ తనయుండనని విన్నవించితినిదేవా
పరమాత్మసౌమిత్రి పరమపురుషులువారు పరిణిమమె యనియెదేవా
అతనితమ్ముని నేను ఆడినమాటలకు గతులు సిద్ధించెననెదేవా
తనదువేషముజూచి తరణివంశజులతో తగవిన్నవించుమనెదేవా

తనకతనయాలంక కదసి వృక్షంబులను విరిచిధ్వా్రమము చేస్తిదేవా
అభయరక్షక వినుము అసురవర్గంబెల్ల అదర వనములు బెరికిదేవా
గుభగుభగుభమనుచు ఘోరశబ్దముచేత గుంపులుగ బారగాదేవా
శూలమునబొడిచిరి వాలముననెత్తి యాకాలుపురి కనిచితినిదేవా
అందరందరువారు యసురేశునందనుడు యింద్రుచే వరమందిదేవా
ఇంద్రునిగెలచితా గర్వమున బొలుపొందు యింద్రజిత్తనువాడుదేవా
వంచించివాడపుడు బ్రహ్మాస్త్రమే తొడిగి పంతమున బకవేసెదేవా
పొందుగాచేకొని పోగనె యాలంకపురము శృంగారంబుదేవా
కలయమాణిక్యాలకాంతి శేషాధిపతి కదిసి తెలియగరాదుదేవా
చిత్రాల చవికెలు రత్నాలమేడలు బిత్తరివెరగందిదేవా
చలువ చప్పరములు కొలువుకూటంబులు వెలయు శృంగారములుదేవా
ఉత్తమ రథాశ్వములు మత్తగజములుపెక్కు మనుజులాహారములుదేవా
తొక్కినానుగిరులెల్ల తుత్తమురులైపోవు మత్తాలి వీరులెదేవా
చిత్తజాసను పవనుడత్తుకొని దేవతలు నిత్యపంపులుసేయదేవా
కైలాసమందున్న ఘనగిరిగోపురము కలదుదైత్యపురమందుదేవా
ఘనముఖ్యులుకొల్వగా కొల్వుపైకూర్చున్న ఘనుడుముందరనిడిరిదేవా
ఘనవాలమునుజుట్టి గద్దెగాగూర్చుండి ఘనశౌర్యముననుంటిదేవా
వనచరా నీవునాఘనమైన వనమెల్ల విరిచితివియనియెనుదేవా
ముచ్చువలెనీవు మాయినకులేశ్వరుదేవి దెచ్చిన పాపిష్టిదేవా
నావీటికినివచ్చి నాపుత్రులనుజంపి నీవేరాజుబంటువనెదేవా
హరి రాముబంటును అంజనీతనయుడనునని విన్నవించితినిదేవా
ఇటువంటి బంట్లింక యెందరున్నారు నిన్నేలురాజుకనియెదేవా
నావంటిదొరలను నీవంటిచెత్తలు లెక్కలేదనియంటిదేవా
శిరములుపది కోపకరములిరువదిలోను చేకొనియెఖడ్గములుదేవా
శ్రీరామచంద్ర మీసెలవులేదనినేను శరణుగాచితినిమరిదేవా
తనమంత్రులను మరియు తనభటులతాజూచి దండింపుమనిపలికెదేవా
దండించివనచరుని దావానలముచేత మండింపుమనిపలికెదేవా
చేరంగవలువలు చాలంగదెచ్చియుభారముగ జుట్టుమనెదేవా
భారముగబట్టినావాలమున జుట్టిరె చాలకుండగ జూచిదేవా
ఆసీతవలువలును దెమ్మన్నవిని వాలమట్టెనిండించితినిదేవా

పంధించిదావాగ్ని సందడై కడుమించి అందరునుయెడనిలిచిదేవా
అందున్నదుష్టుల యందంబులుడిగియు సందులేచొచ్చిరీదేవా
ఎందుచూచినగాని దుందుమాకారంబు యేమిసేయగవచ్చుదేవా
ఇంద్రలోకముబెదిరె చంద్రుడు గతిదప్పెయింద్రాది సురులెల్లదేవా
కనుదెరచిబుషులెల్ల జ్ఞానంబులుడిగి యాకానగా వెరగందిదేవా
ఎనసిచుక్కలురాలె వినిసీతకళదేరె దనుజులంకయు గూలెదేవా
మిముజూచిమన్నించి జలరాశికడకేగి మెల్లనెచర్లార్చిదేవా
తరిమియసురులదునిమి తరుణికూడుటకునై దొరమీకు తెలిపితినిదేవా
శ్రీయహోబలగిరిపురి నారసింహ మనకోరికలుయీడెరెదేవా
అనినంత రత్నమునుజూచి శ్రీరాముడు అతిశోకమునుబొందెనూ
బాలప్రాయమునాడు బలుతాటకినిద్రుంచి పంతానమీరితినెజానకీ
కాలకౌశికుడైన గురునియజ్ఞమునేను గావించివస్తినేజానకీ
వాలాయముగవిల్లు యెక్కుబెట్టినేను వనితరోవిరచితిజానకీ
మైలెనజనకుడు మెచ్చినన్ను నిన్నుమెరసి పెండ్లిచేసెనెజానకీ
తారలుబూరుగతమ్మటములు పెద్దబూరుగులు మ్రోయగాజానకీ
సరగునఅచ్చోటు కదలిమనమయ్యోధ్య పురికిరాగానపుడుజానకీ
రమణిరోనేరాగ పరశురాముడనెరాజు యెక్కడుకలడుజానకీ
గమకించియెచటికి బోయెదవనిచాల గద్దించియడిగెనుజానకీ
క్రమముతోడుతవాని గెలిచియాచోటు గదలివస్తినెనేనుజానకీ
మరియుచుదశరధ కౌసల్యకైకకు ముదమొప్పమ్రొక్కితిజానకీ
నీరూపునీరేఖ నీచక్కదనముకు వారలు మెచ్చిరె జానకీ
కరుణయించుకలేక కైకనామీదనె కపటంబుబూనెనే జానకీ
తరుణిమాటలు వినిదయలేక దశరధుడు తానిట్లుపంపెనెజానకీ
పుడమి జనులుచూడ సరగున అయ్యోధ్య వెడలికానకువస్తి జానకీ
అమరగమనమెక్క పర్ణశాలగట్టి యచ్చోట నుంటిమె జానకీ
మారీచు మాయలు మనసు తెలియక మరులుగొని పోతినె జానకీ
పొద్దుపోగాపోయి కనకమృగము వెంట బుద్ధిమోసబోతినె జానకీ
దుర్మార్గుడగువాడు పాపపుదనుజుడు దొంగయైవచ్చెనే జానకీ
పర్ణశాలలోన యొంటి నుండగజూచి పట్టుకపోయెనె జానకీ
చుట్టును సముద్రము నట్టనడుమనులంక యెట్లునే వత్తునె జానకీ

దట్టించి వారాశికావలికిపుడుదాట లెవ్వరు గలరె జానకీ
గట్టిగా రాక్షసుని పట్టితేచ్చేపాటి ఘనులు దాలేరె జానకీ
పొట్టకొవ్వుననిన్ను ముట్టిన రావణుని పొంకమెన్నడునణతు జానకీ
ఇటుచూడు నాపంత మేరీతినైనాను కుటిలాత్ముద్రుంతునే జానకీ
వానరాధిపులతో వారధినిబంధించి వాలాయమటువత్తు జానకీ
చుట్టాలు బంధువులు చూడగానినుదెచ్చి సొంపుతోనేలుదునె జానకీ
గట్టిగామనమిపుడు ఘనుమైన అయ్యోధ్య పట్నమెయేలుదుము జానకీ
హరిహరి శ్రీరామ చంద్రుండు వనధిజూడగవచ్చియు మానరే
పంతములు మహిదురితకొల్లెల్ల మహిపాలుజేసుగానీ
జలజాక్ష శ్రీరామచంద్రుండు వారధిని చయ్యను గట్టుమనుచు
వటపత్రశయనుడా వాలితమ్ముని బిలచి వాటములు చూడుమనెనూ
కట్టవశములుగాదు పగవారితోగూడి ఘనసముద్రుడు పుబ్బెనూ
కట్టుదామెటువలె శ్రీరామచంద్ర మనకార్యములురెండాయెనూ
అంపశరములచేత తెంపుదునులక్ష్మణా అంబుధిని తెలుపజేసి
పంపుదును పాతాళ లోకములలోపలికి పంకజనాభుడనెనూ
కుప్పించి యెగసినా యదలించియుతన కుడిపాదమున నునినెచెనూ
లంఘించి వంచించి దాటించితనచేతిలకొరులను చక్కదిద్ది
అంగదుడరమ్మని చెంగళించి బిలిచి అచ్చోటబుద్ధిజెప్పి
నింగికినిపొడవుగా సముద్రుడును తానేల పొంగినాడడిగిరమ్మీ
జంగలోపలబోయి చక్కచక్కగారమ్మని జలజాప్తకులుడనియెను
అంగదుడు వకపరుగు యిక్కడికి అక్కడికి అతిశీఘ్రముగబోయెను
ఓరోరివరుణుడా నోరేల క్రొవ్వెరా పారేవుగిరులుమ్రోవా
దూరుబడికావురా రాముబాణానికి బారి గొర్రెవై తిపీ
వారికడబోయినను వారునుమీరును యేరీతి సేయగలరూ
నీరధినీతోటి శత్రువులనందరి పెరార్చి వచ్చినాడూ
నాపాలిదైవమా నాపాలియంగదుడ యేపాపమెరుగనేనూ
అతని శ్రీపాదములు ఆడియడనుగనుగొని అతివేడ్కతోపొంగితీ
అతని కోపముదీర్ప అడ్డమెవ్వరులేరు అంగదుడయేమిసేతూ
నీచాటుననుగొనిపోయి యాశ్రీరామునికి విన్నవింపుమయ్యా
అటుగాననేబోయి యారామచంద్రునకు యాకొకచల్లసేతూ

తడబడకతనవెంట తరలిరమ్మనియును తానడచెనంగదుండూ
వటపత్రశయనుడా ఓవనజనాభుడా వాడుమనవాడుదేవా
జలధిలోమత్స్యములు నీరుపాపలుమొదలు చాలజీవులుగలవయా
కటకటాయిటువలెను స్వామితోనెవ్వరొకండు చెబలికినాడు
మకరివాహనుడైన యాశరధినాధుండు మరిరాముకడకువచ్చె
ఎంతెంతలోకములు యెంతేసిప్రళయములు యెంతయని వరుణుడనగా
అంతబోయి ముత్యమంతయై రాఘవులు అంబుమొనలనెనిలచెనూ
వరుణుండువజ్రాంగిదెచ్చి రాఘవులపాదవనజములుపైనునిచెనూ
కరములుముకుళించి కపులచాటునబోయి గ్రక్కునసుతానిలచియూ
శరణుశరణోరామ శరణయ్యశ్రీరామ శరణయ్యసీతాపతీ
మిమ్మశరణనువారికిని మరణములులేవు మీచిరునటువంటిదీ
వరుణమాటకుమెచ్చి నీలవర్ణుడుబిలచి వలచేతనభయమిచ్చె
వలనొప్పనీచోట వారధి కట్టవలె వాటములుచూపుమనగా
యుగయుగంబులవారు పగగెల్వపోగాను తగగట్టిదాటినారూ
చనునయ్య శ్రీరామచంద్రమనకిచ్చోట చాలదినములుబట్టదు
వెల్లిపొద్దునలేచి తెల్లవారకతలికె వెల్వాలూమీకుసెలవూ
బల్లిదులైనట్టి కపినాయకుల మీరుబంధింపబంపరయ్యా
సేనసేనాకోట్ల పర్వతములుతెమ్మని సెలవిచ్చిపంపెనపుడూ
రఘువీరువాక్యములు బుట్టునంతటిలోనె రంతులుమిన్నందెనూ
పెళపెళనియార్చుచు పేరములుబెట్టుచు పెనుగుంపుతరలిబోయీ
వెడవెడనియురుములు వురిమినచందానవేగనగములుపెకల్చి
రోమానిరోమానవెయివేలు రెండువేలున్నవెలయా
రెండుభుజముల రెండు వెయివేలుబెట్టుకొని రెండుచేతులు నిండగా
సూర్యుడు చంద్రుడు తొలగిత్రోవలుదప్ప సురలుభీతిల్లగానూ
చుక్కలునురాలగా దిక్కులును బెదరగా నింగిపాటునవ్రేసెనూ
తడబడకయాలంకలోనున్న వస్తువులు తొలికాళ్ళమీకుసెలవూ
ఘనమైన గట్లెల్ల వాలాన బంధించి హనుమయ్య పెరికితేగా
అతడొచ్చెడి సొంపు వడివేగములుజూచి యారాఘవుండుబలికె
శ్రీరామచంద్రుండు నీలునిపిలిపించియు శీఘ్రమె కట్టుమనియె
ఘనమైన నగములను నరచేతనందుకొని కడువేగబంధించెనూ

వాయుసుతు మొదలైన వానరాధిపులెల్ల వాయువేగమునతేగా
రాయధిపులైనట్టి రణభేరులేమ్రోయ రాజుతావేంచేసెనూ
లెస్సాయె సుగ్రీవ లెస్సాయె మనపనులు లెస్సలెస్సాయెనేడూ
చాటముగకోటి శతకోటి రాక్షసులను వడిజంపతెరగాయెనూ
నీలుడారమ్మని నీలవర్ణుడు బలికె నిడివిమనకింతెచాలూ
వెల్లిపొద్దునలేచి సేనలకు చాటుమని వేయించె రణభేరియూ
మూకమూకకుచాటి యేకముగ పిలిపింపు వేగమెవెడలింపుము
సుముహూర్తమొచ్చెమరి అవలికి బోవలె సొంపుతోవెడలుమనెనూ
కోటికపినాయకుల కొల్వులో పిలిపించి కోటిరవితేజుడనియె
మేటికపినాయకులు వొక్కరొక్కరెమీరు దాటరో ఆవలికినీ
అనగానె అందరు యంతంతపుప్పొంగి యార్పులు పెడబొబ్బలూ
ఉత్సాహములతోను జొచ్చిలంకాపురిని డెచ్చెము దానవులతో
మాటవిన్నది మొదలు దళవాయియంగదుడు మరిరాఘవునకు మ్రొక్కి
తావేగమునబోయి తనసేనలనుబిలచి తరలిదండెత్తమనెనూ
అర్పులు పెడబొబ్బలగ్గలంబాయెనని యాలంక వారుబెదరి
యేర్పడివాకరాకరు దాటుచున్నారని యాదశాస్యుకుజెప్పిరి
పాలుబడిశతకోటిదురిత వీరులబిలచి పగదండువిరుగబొడువా
ఆదళముమీదెక్కి యీవలకిరాకుండ ఆవలకిదోలుమనెనూ
అరిగెలుబల్లెలు ఆటోపములతోను విరుగసీకూరులెల్లా
కనకంపుపట్టయ్యు కాశలుజల్లులు కరితురగరథములమరా
నరపతిరాఘవుని నడవనియ్యమని శూరులైనమూకుమెదురా
అడుగెడుదూరమును రాఘవునిబోనీక యచ్చటనెనుంతుమనుచు
ధరనున్నవారిని దాటనియ్యమనుచు దానవులు దాబలుకుచూ
ఆడుకొనిజగడములు నందుకొనికయ్యముల కదలించిచూచినారూ
వదిలితెబొడిచేరు రాళ్ళరప్పలతోడ వనచరులతో బాధలు
చదరవశములుగాను చావనెట్లికనని చయ్యనను విరిగిరాడా
పారిపోయియాయసురులందరును గూడుకొనిపలికిరి తబ్బిబ్బుగా
దేవఅసురేశయిక సాధింపరాదయా దేవాదిదేవవినుమూ
ఆదేవుడెగాక మరియతనిగెలువను హరునివశమునుగాదయా
సీతాపతీహరి శ్రీదేవిరమణుండు సృష్టికర్తయుయాతడూ

దేవతలదుఃఖములు మాన్పగావచ్చినా దేవుడె శ్రీరాముడూ
రామలక్ష్మణులను యెదిరింపవలదిక రాజ నాబుద్ధివినుమూ
వారిసీతాదేవి వారికిని వొప్పించి శ్రీరాముశరణు చొరుమూ
లేకున్నమనలను లేకుండచేసును లోకరక్షణ రాముడూ
ఘోరదానవులను యేలేటిరాజువని కొనియాడు జగములందూ
మేటిబలవంతుడా బ్రహ్మకుమనమడా సరిలేదు జగములందూ
నాతోడసరిగానువుండి తమ్ముడనీవు నాకుదెలుపగవస్తివా
కోపంబువచ్చినీకొల్వులో కొరగావు యేపునకు యెదురాడకూ
కడువింతగానిపుడు గద్దించిపలికేవు కానినాపగవాడవూ
కదశి యసురులుగొల్వ ఘనవిభీషణుబిలచి కదలమనెయ్యేదైననూ
కట్టుదును గొట్టుదును చెవెలగట్టుదును కానివాడవునీవుదా
ఎదురాడితెనింక నామనసుతాళదు యిప్పుడూనామాటవినరా
వద్దురావోయన్న వద్దికతోపోతెను బుద్ధిరామనకెల్లనూ
శ్రీరామచంద్రుని శ్రీదేవినొప్పించి చెలగుచును వుండుమన్నా
వెర్రిబుద్ధులుదలచి శ్రీరామచంద్రుని వెలదేలదెస్తివన్నా
అదిగొవచ్చెరాముసేనల రవధూళి ఆకాశమునగప్పెనూ
చేటులేని లంకకిపుడు నీవల్లను చేటులదెస్తివన్నా
కోటలేడుచుట్టి కెంధూళిగప్పెను కొలువుచావిడినిండెనూ
మాటిమాటికి యెన్నిజెప్పిన విభీషణ మమ్ముదిగుడున జూచెదూ
పగవానిజోడు చేసుకునీవు వానిపైపక్ష మెన్నడుమానవూ
అన్నరో రావణ మొన్నమనలంకకు అతనిబంటొకడువచ్చి
బలురాక్షసులజంపి యశోకవనమెల్ల భస్మంబుగాజేసెనూ
పచాంచి బిరుదులు పల్కుకొంటును నీకు ప్రతిగద్దె పెట్టుకొనియూ
అదరు బెదరు మాటలాడుకొని మనలంక అపుడె భస్మముజేసెనూ
వాయుసుతుడేగి యాశ్రీరాముసేనల వడితోడితెచ్చెనన్నా
వనచరులచేతను వారధి బంధించిన వర్తమానం బెరుగవా
ఘనమైన కోపమున గద్దించియటులేచి గద్దెపైబడదన్నెనూ
అన్నచేతన్నుబడి అతిదుఃఖమునతాను యారావణుతో బల్కెనూ
ఆరాఘవుల గొలుతు ఆయములు చెప్పుదు అన్ననామాటవినరా
నీగద్దెకూర్చుందు నిలిచి రాజ్యసేతు నిక్కంబునమ్ముమన్నా

కరములు శిరములు రాముబాణములచే ఖండించి దోయింతునూ
అనియిట్లు నవ్వుచును అందరును జూడగా అతడేగె తల్లికడకూ
పోయెను విభీషణుడు పైనమైతానపుడు పంతములు మెరయగానూ
తల్లిసముఖానకుపోయి దుఃఖముతో దండంబుబెట్టినిలిచె
అన్ననీకు దుఃఖమేల వచ్చినది ఆయుష్మంతుడీవు
సరిగావునీబుద్ధి యోర్పులకు భూదేవి చక్కని విభీషణుండా
ఇకనెట్టి బ్రతుకులమ్మా హీనమాయెను యీదినము కొలువులోనా
వైరివానినైతి శ్రీరాముకడకును వేగమేబంపుతల్లీ
కొలువులోనె తన్నినాడు ఘోరాకార కోపుడై రావణుండూ
నీకుగలసగపాలు తీయింతునన్నరో నీవందు పోవవలదూ
ఓయమ్మ అతనితోటి పాలుపంపువల్లనె లేశమైనా
పాలునాకేవద్దు తానుచేపట్టుకొని పదికోటలాగట్టనీ
అడుగడుగుదండాలు బెట్టుచువిభీషణుడు హస్తములుముకుళించియు
అందముగరఘురాము పాదములకడకును అతివేగమెపోయెనూ
అనవునవిభీషణుడు యాకాశమార్గమున యారాముకడకువచ్చె
చెన్నుమీరగరెండు చేతులునుముకుళించి శరణుశరణని పలికెనూ
కాకుత్థ్సకులనాధ కరుణాపయోనిధి కాచిరక్షించుదేవా
ననుగావవెస్వామి పగవానితమ్ముడను అన్యాయములుయెరుగనూ
యెందెందుచూచినా యందందుగలవని యావిభీషణుడు పలుకా
మన్నించివిభీషణుని మహిమీదవెలయగా మాటవానికిగలిగెనూ
వనచరులరాఘవుల వచ్చేటిసేనలను వైనముగచూడదలచీ
కోపించిరావణుడు కోటిరాక్షసులతో కోటమీదికివచ్చెనూ
దళమైనభేరులుమ్రోయగా వనచరుల దశకంఠుడుజూచెనూ
ఏకముగవనచరులు మూకలై కదలగా యెవ్వరనియడగదలచె
పదిశిరస్సులనన్ను పట్టిబంధించిన బలిమైనవాలిసుతుడూ
తారాకుమారుండు దళవాయియంగదుడు యేరుపడెతానొక్కడూ
పేరైనసాగరము యావలికిదాటగా శూరులందరుచూచిరీ
అక్షయంబైనయాకోటికపి బలములు యిచ్చకొచ్చినతావయా
రక్షకుడు శ్రీరాము దొడ్డవాడనియపుడు రణభేరివేయించెనూ
వసంతకాలము నాటికిగొజ్జంగి పూవులవనములూ బూచినటులా

సుగ్రీవునీదండు అగ్గలంబాయెనని సురవైరితాజూడగా
కలహమునకై యపుడు కాలుద్రవ్వెవారు కడలేదు కపిసేనలూ
దగ్గరనువచ్చియా లంఖిణిమొగసాల దగ్గర గుడారెత్తిరీ
తెల్లని వర్ణములు నల్లనిచాయలు వల్లభుని సేనలోనూ
వేవేల వల్వాలతో జాంబవంతుడుదాటగా యెవ్వరని యడుగదలచే
కల్ల గాదువినుము తెల్లముగ జెప్పెదము కలతెరంగెల్ల మీకూ
కదసిసేనలతోడ గంధమానుడిటకు కదియగానెవ్వడనెనూ
పేరుగల అసురపతి మిమ్ముసాధింపను పెనుగొన్న కపులువారూ
ఈరీతిగంధమాదనుడు మీమీదికి యేతెంచుచున్నవాడూ
ఆర్పులతో నొకరొకరు యీరీతినున్నారు అసురపతి మిమ్ముజంపా
వనములోదిరిగెడి కపివరులు రక్కసుల వచ్చిసాధించుటెట్లూ
ఆ సురులు వానరులు యెవరైననాపురము అందిచూడంగగలరే
ఆహరుడున్న కైలాసమె కదిలించియెత్త నాయధికబలమెరుగలేరా
పేరుగలిగినయట్టి నాభటులు యాకపులపెంపు దూలింతురనియే
అసురసంహారుడు దశరథేశ్వరతనయు డసురపతిమిమ్ముగెల్వా
శతకోటికపివీరఘనులు కొల్వగనందు చనుదెంచినాడు చూడూ
విస్తీర్ణమున్నారు యోజనంబుల పొడవు వినుపింపరాదుదేవా
రసికులను పిలిపించి రణభేరివేయించి రాముడుగుడారెత్తెనూ
వద్దనె నదె కోట్లవనచరులు గొల్వగా వచ్చెనాలక్ష్మణుండూ
వారిసుద్దులు దెలిపి వారి బుద్ధులుదెలుప శూరునకు కోపమొదవే
విరాధుని జంబుమాలినిజంపి శూర్పణఖవేగమె ముక్కుచెక్కి
కద్దులేదనకుండ ఖరదూషణాదులను పెద్దలకుచేరబంపీ
కడలేనిమూకలు యెక్కడెక్కడజూడ పుడమిదిగ్రమింగునటులా
ఏడుపదులు రెండువేలులాదండు దాయేకముగకారుగప్పే
నవకోటిదండు కపినాయకుల పిలిపింప నడివీదులేరుపరుపా
తిరువీధులొకవంక శ్రీఘ్రముగ నేయుమని దిట్టపరచిరిచారులా
వాగులువంకలు వక్కటిగదిద్దుకొని శూరులందరు నడువగా
తారలూబూరుగలు తమ్మటంబులమ్రోత తడబడకఘోరుకలగా
అతివేడుకలు గలిగి యేవంకచూచినా యారాముసేనలోనా
నాడువిభీషణుండాడిన మాటలు నేడుకానగవచ్చెనూ

కట్టడిగరావణుడు గోపురముదిగివచ్చి కదసియాకొలువులోనా
వీరులను శూరులను ఘనదానవులబిలచి యారావణుడు బలికెనూ
శూలములు చక్రములు బిడివాలములతో ఘోరదానవులెల్లనూ
చుట్టుకోటమీద ఆయత్తపడుకొని ఘట్టిగా నుండుమనియేన్
వాడవాడలవారినందరిని బిలిపించి వరుసతో నేరుపరచీ
సంధ్యవేళలలేచి వానరుల నావలకి సాగింపుడని బలికెనూ
దక్కుదురాదక్కరో వనచరులు యిప్పుడు దర్వాజతెరవగాను
దొంగదిట్లాబోయి కోరి వారితోరణరంగములు పెరుగుమనెనూ
అంగదుని పిలిపించి యచ్చోట విడమిచ్చి యారమావిభుడు బలికెన్
చెంగళించినీవు పోట్లాటలకుబోవ సెలవునీకిది యనియెనూ
అప్పణులు బుచ్చుకొని నీవక్కరుని బోనిక అవనిలోనణగించిరీ
నెపములేకనె కల్లజేసిన పాతకుల నెట్టుకొని చంపినారు
అసురపతిరావణుడు యామీదకదలెను దశరథాత్మజునిజూడా
వాటముగ వుత్తరపు గోపురముమీదికి మేటివీరులుదానునూ
కోటిగొడుగులనీడ కోలాహలంబుగా కొలువులోకూర్చుండెనూ
వచ్చేటిదినకరుని రాకగానకయున్న అచ్యుతుడువెరగందెనూ
విభీషణునిబిలచి యిదియేమిమాయయని విన్నపము సేయుమనెనూ
రాజాధిరాజ శ్రీరఘువీరవినరయ్య రావణుడుమిమ్ముజూడా
కోటిగొడుగులనీడ కొలువులోనున్నాడు మేటిదినకరుడు చూసెన్
తుచ్ఛంబుగాదీని ద్రుంచివేయగవలయు లక్ష్మణావిల్లుతెమ్మీ
ఇచ్చెనొకబాణంబు వలచేతనందుకొని అచ్యుతుడు దునియనేసెన్
కడిదియాయసురపతి కొలువులోపట్టినా ఘనగొడుగులనుద్రుంచెనూ
వింటినాసామంతు విలువిద్యగురుడితడు కట్టులేనివాడయా
వింటిసామంతుడు నీదుపదిశిరములు వెంటనెదునియవ్రేసెన్
అతనిచెజచ్చిన మనకుపుణ్యముగలదు అమరువై కుంభపురము
నడిచావడికివచ్చి నయముతోగుర్చుండి నాయకులపేరబిలచీ
అతికాయుని బిలచి అప్పుడెవిడమిచ్చి ఆయత్తపడుమనియెనూ
అనేకదినములనుండి యాహారములులేక అణగియున్నవి శరములూ
శరములకు నాహారములు గలిగెనేటికని సాహసముతొబలికెనూ
అంబులకురక్తములు ఆసగలిగెననుచు ఆనందమునుబొందెనూ

అందముగ రణభేరి తెప్పించివేయించె నతిభీకరముతోడనూ
రంగైన పిరంగి రాయముద్గరతోమరంబులును చక్రములునూ
గజశూలమంకుశంబులు గండ్రగొడ్డలి ఘనబిండి వాలలునూ
అందముగ సర్వాయుధాపూర్ణుడగుచు ఆయత్తపడె నప్పుడూ
రథములే నూరుకోట్ల రథమువెంబడి చాల రౌతులును బిరుదుపడిగెల్
ఆయత్తముగ రాగనతివేగనడిపించె అసహాయశూరుడపుడూ
అతివేగములతోడ మూడు రాత్రులు పగలు అతికాయెసేన వెడలెన్
నడిచేటి యేనుగులును కోటియశ్వములు యడబడక సేనమీదన్
అతికాయు నడవగా పెంధూళి మిక్కిలై ఆకాశమున గప్పెనూ
వీరకపులను జూచి ధీరులై నిలువగా ధీరుడై యంగదుండూ
నోరు మరచి మనము వూరకుండితె మనల నొప్పింతురయ్యా నేడూ
బంటుకొక పరత్వము చేతనె బట్టుకొని బారులై నిలచిరపుడూ
కదిసిరి కయ్యములు కనకరథములవారు కడుమొత్తివిరుగపొడువా
పోరు కొమ్ములు బట్టి పుడమిపైరక్తములు యేరులై పారగానూ
పేరు కలిగిన పెద్ద కపినాయకులజంపి తనపేరు చెప్పనిలిచెన్
వెనకపరుగులతోను వేవేగమే పోయి వినిపించిరారాముకు
కులపాల చంద్రుడా రావణుని సుతుడట కూల్చెనందరి కపులనూ
కనక రథములవారు కడలేరు రాక్షసు ఖడ్గముల ఖండింపగా
క్రింగిరీ వనచరులు కోటాన కోటుల భగ్నముగ విరిగిరయ్యా
ఘనమైన సేనలకు పతియైన జాంబవుని కరిరాజవరదుడంపెన్
యాకపులు యార్చుచును యెంతేసివేడుకలయసురులను విరుగపొడువా
తగమెరసి యచ్చోట జాంబవుండనువాడు తెగటార్చుచునురాగనూ
దండిగా జాంబవుని ఢాకకోర్వగలేక దానవులు బెగడిరపుడూ
అగచరులతో గూడి యటుజాంబవుడురాగ అతికాయుడట్టెచూచెన్
పొగబాణములుగాల్చి రణరంగమునవేయ బొందె జాంబవుడు మూర్ఛన్
కాలువలు వాగులు కడురక్తములునిండి కడువడిని పారసాగెన్
రణమగ్గలంబాయెనని కపినాయకులు రామునకు వినుపించిరీ
బలములెల్లను బంపి అతికాయుతనకడకు బట్టితెమ్మని యనియెనూ
రఘువీరు వాక్యములు బలుకునంతటిలోన రంతులె మిన్నందెనూ
రథము తిరుగవేసి కపినాయకులమీద రాక్షసాధముడు నడచెన్

మార్కొని రఘురాము మరుగు జొచ్చిందాక తరిమి కపులను జంపగా
రాఘవుల కనుగొని అతికాయుడిట్లనె రణశూరుడవుగావయా
పాలుమాలినకోతి పంజులను గూడుకొని పరభూములకు వస్త్రివీ
వినికిజెప్పినిన్ను బుద్ధిమోసబుచ్చి విధితోడి తెచ్చెగానీ
కానిభూముల చావ కారణంబుండెనో కరిరాజవరదనీకూ
అనిన లక్ష్మణుడడిగె యిదియేమి రాఘవా ఆవార్తలను వింటివీ
పక్షివాహనుడని పాటింపరాదని మెచ్చితానూర కుండెనా
రక్షించినన్నంపు రాక్షసాకోట్లను రథమును ఖండింతునూ
యిచ్చవచ్చినయట్లు చూచుకొమ్మనుచును యచ్యుతుడుతా బలికెనూ
ధనువు గవిసినదీసి ధనుగుణధ్వనిజేసి దేవదుందు భూలుమ్రోయా
అనువెరిగి అంబెరిగి యాక్కడనమెరిగి యతివేగమందు కొనెనూ
అన్నవద్దకివచ్చి హస్తములు ముకుళించి యానతిమ్మని బలికెనూ
మ్రొక్కబోవగ వానిగెలిచిరమ్మనుచు తానొక్కవాక్యము బలికెనూ
గ్రక్కనను అతికాయుగనుగొని లక్ష్మణుడు కయ్యమునకె రమ్మనెనా
ఓరిలక్ష్మణ నాడు శరముల ధాకకు ఓర్వంగలేవుగదరా
పారిపోదువుగాని ప్రజలచాటుకునీవు వ్రాలుదువు యీభూమిలో
అచ్యుతుడు మాయన్న ఆనతిచ్చినమాట లెచ్చరిక నేనెరుగనా
తుచ్ఛమాడకురోరి అతికాయుడానీదు వక్షమె దునియింతునూ
అమ్ములమ్ములమొనలు తుమురులై రాలుచు యిమ్మలేదిద్దరికినీ
ఇమ్మైన బాణములు యేరుపరుచుకొని యిరువురునుపోరగానూ
వక్షమెంచక అతికాయువక్షస్థలము తుచ్ఛముగ దృంచదలచెనా
వేసితిని బాణములు వేలాను సంఖ్యలు గాసితోచదువానికీ
చింతించి లక్ష్మణుడు శ్రీరామునీదలచి చిన్నబోయీనిలచెనూ
ఆక్షణమునందె జాంబవుండేతెంచి లక్ష్మణుకు చెప్పిచనెనూ
అపుడు సంతోషమున నగ్నిబాణము దొడిగి యావజ్రకవచమేసెనా
అట్టిసమయంబున అతికాయుడుగ్రుడై ఆలక్ష్మణుని నొచ్చెనూ
కరలాఘవముతోను శరములతొబోరిరి హరికరుల చందముననూ
వరమడుగుకొన్నట్టి బ్రహ్మాస్త్రమేతొడిగె బలురాక్షసుని పిదికీ
తనముష్టిఘట్టనల తనువుండనతికాయు తలదృంచెనతివేగమె
గిరగిరన దిరుగుచు రక్తములుగ్రక్కుచు ధరణిపై గూలెనపుడూ

ఉరుములును మెరుములును భీకరంబైనట్లు అరుగుటకుతెరువులేకా
మడుగులై రక్తములు మరి మొండెములు దెలపడి రాక్షసులుపారిరపుడూ
అన్నవద్దకువచ్చి యభిమంత్రి తీర్థములు యాకపులకును బంపిరీ
పడియున్నకపులకు పాణములువచ్చెను పరిపరిచందములనూ
ఆర్పులుపెడబొబ్బలగ్గలం బాయెను ఆరాము సేనలోనూ
దేవాదిదేవతలు దివినుండి గొనియాడె దేవదుందుభులుమ్రోసెన్
పారిపోయిన అసురులందరును గూడుకొని పలికిరి తబ్బిబ్బుగా
ఓదేవయసురేశ ఏదు సుతుడైనట్టి అతికాయుమృతిబొందెనూ
దశకంఠుశోకించి యింద్రజిత్తునిబిలచి కీశులను చంపుమనెనూ
ఇంద్రునిగెలిచియు దేవతలసాధించి ఇంద్రజిత్తనుపేరయా
అందరినియెడబాసి యసురబలములతోడ అప్పుడె వెడలివచ్చెన్
చంద్రధరుడిచ్చినా సత్వంబుగలదని శంక మొక్కింతలేకా
ఇంద్రజిత్తునువాడు కపులపై దాకెను యినకులచంద్రవినుమూ
కొండతోడను ప్రతికొండదాకినయట్లు పిండిపిండిగజంపగా
దండిగావనచరుల ఢాకోర్వలేక దానవులుబెగడిరపుడూ
తలచెటి రణమందు తనవార్నితనబలము తానుగాచంపుకొనియె
తనయీడు తనజోడు దురితవీరులబాసి తానుమేఖముజొచ్చెనూ
వలనొప్పభోగాస్త్ర వానరులసేనపై వర్షములు గాగురిసెనూ
నాగపాశమువెడలి నరనాధ చంద్రుని బాగుగాబంధించెనూ
చింతించి శ్రీరామచంద్రుడు తనమదిలో చిన్నబోయినిలిచెనూ
కరములనుముకుళించి జాంబవుండనువాడు గరుడుని దలచమనెనో
మదనకుని కీచకుని మర్దించి రణమందు మడియ దాటించలేదా
చింతింప పనిలేదు శీఘ్రముగరప్పింపు శ్రీరామచంద్రనీవూ
కృపతోడ రఘురాము కోరియంతనెదలచ గొబ్బునా గరుడు డొచ్చే
ఖండించి తుండించి కరమొప్పగాచీల్చి కడువేగమునదన్నెనూ
యంతలోపాతాళ లోకంబుకడకును యవిచొచ్చిపారి పోయెన్
బంటుకొక పర్వతము దెచ్చియు క్రిందనే ప్రతికోరి పెట్టుదామూ
దంట కపులామీరు వెంటనే బోయి యాకంటకుని సమయింపుడూ
మంటలై మండుచుమరినిప్పులేరాల మహిదిశలు వెరగందెనూ
గండట్టు జుంటితేనెతేట యీగలన కపుల ఖండించెనంతా

ఆయములజెప్పియు అసురబలములనెల్లమాయమైపోవజేయన్
బ్రహ్మనీ వొసటను వ్రాసెనా విభీషణ బడుమనుచునాచేతనూ
వేయవలసినశక్తి యేపణుచుకొనుచును యింద్రజిత్తుడు అప్పుడు
వానిమాయలుదెలిసి విభీషణుడు లక్ష్మణుని వడి మరుగుదీసుకొనియెన్
వడితోడయాశక్తి వచ్చియాలక్ష్మణుని వక్షమునగాడగాను
అంతనె వెరగొని కపినాయకులు జూడ యాలక్ష్మణుడు వ్రాలెనూ
తడబడుచు రఘురాము దిగులుపడి లక్ష్మణుని తొడలమీదికితీసుకా
పలపలని దుఃఖించి శ్రీరామచంద్రుండు పలవరింపగసాగెనూ
కటకటాలక్ష్మణ కారణీకములాయె ఘనమాయె మృగముజూచి
పర్ణశాలకాడ పణతిమాటలువిని పడుచుపనులకు బోతినీ
అయోధ్య వెడలియు అరణ్యములరాగ అచట తండ్రియుబాయనూ
తనువెన్నడందని దయగల తమ్ముడా దయతోడ బలుకవేలా
ఎక్కడా నీరూపునీరేఖ లక్షణము యెవ్వరినికనుగొందునూ
చక్కనిసహితుడా లక్ష్మణానీతపసు సమసెనాయెదుటనేడూ
యెదురుగానిలిచియు యెదురుమాటాడవు యేమిరానాతమ్ముడా
ఇదియేమి కోపములు యెన్నివార్తలకును యెమనుచుబలుకవిపుడూ
అలయకకు నోర్చియు యడవిలోఫలములు ఆకలెరిగియుదెత్తువూ
అన్నయనిపిలచి ఫలమందిచ్చుటకును ఆధరవుగాననేనూ
సకలాదిశేషుడవు సౌమిత్రి లక్ష్మణ సహితుడా పలుకవేరా
గురుపుత్రునేసిన బాణములులక్ష్మణా గురుతులై దాకెనేడు
సురులుదిక్పాలకులు దిగులుపడి యందరుజూచి యిదివ్రాతయనిరీ
ఆదికాలమునాటి జాంబవుడుతావచ్చి ఆయ్యోయ్యోయేమిరామ
యేనొక్కయోచనయుచేసెదను యిదియిపుడు యేమనుచుయంటివేని
సంజీవిదెచ్చినా సౌమిత్రిబ్రతుకునూ సకలసేనలతోడనూ
అంజనీనందనుడు అవసరపుసహితుడు హనుమంతుచేతనౌనూ
పిన్నవాడకతన ప్రియముతోపిలువయ్య పెంపుగలహనుమంతునీ
అంజనీతనయుడా అజానుబాహుడా హనుమయ్యరావోయన్నా
అవసరపుతమ్ముడు నాదులక్ష్మణునకు నపకాలమాయెనేడూ
అవుననివినిబోయి యావాయునందనుడు అతనిపదములకెరగియు
వనచరులతోగూడియొదిగి యుండితినిపుడు వడివేగమునబంపుమీ

వ్రాసినాబ్రహ్మను వానిబట్టీదెచ్చి గాసి బెట్టుదునిచ్చటా
అసురాదిపతిదెత్తు అసురులనుమర్దింతు ఆనతిమ్మనిబలికెనూ
ఇంతపనులుసేయ యిపుడుమనకేమిటికి యిదియుసమయంబుగాదూ
భానుండుతూర్పున వుదయించకటుమున్నె పరగసంజీవిదెమ్మూ
అతిబల పరాక్రమము గలయట్టి మాయావి కచ్చోటబుద్ధిజెప్పీ
సంజీవి పర్వతము జతనమున మునతెమ్మని సాగనంపెనురాముడూ
హేమమునులు మీరునుగాబోయి యాత్రోవగట్టుమనెనూ
ఆత్రోవలోపను యెవ్వరొచ్చినగాని ఆవలికి బోనీకుడూ
ఆలస్యమడిగియు హనుమయ్యతాకదిలె అఖిలాదిలోకములకూ
ద్రోణగిరి హేమగిరి హిమవంత పర్వతము దొడ్డగిరులెల్ల వెదకె
వెదకి కానగలేక హేమమునులనుగని వేడ్కతోనాడ నిలచె
నాకుదాహముదోచె తాపసోత్తములార నాదాహమును దీర్చుడీ
వేగకమండలతీర్థమా వానరేంద్రునకు విషముతోగూర్చియియ్యా
నాకుదాహముదీర నోపదోమునులార నడబావులే దీర్పుడీ
మకరియున్నకొలను యెదురుగాజూపిరి మరివాయునందనునకూ
అతివేగమునబోయి నీళ్ళత్రావగజూచి యామకరిదిగ మ్రింగెనూ
అంతమకరి కడుపుచించి హనుమంతుడు అతివేగమున వెడలెనూ
అతివేగ గంధర్వసతి శాపమునుదీరి యాకాశమున నిలిచెనూ
అంజనీ తనయునికి హస్తములు ముకుళించి అనియు చెప్పిచనెనూ
ధరనూరు యిన్నూరు తలచేతులునుగల దానవుడు బెదరించగా
అపుడు శ్రీరాముని యాత్మలోపలదలచి యాయసురు తలలు ద్రుంచె
సంజీవి కొండకు సరగునను బోయెను సకలదేవతలుజూడా
భానుకులు తమ్మునికి బహుభారమాయెను భానుకులు బంటనెనూ
బంటుతోగంధర్వకోటి యుద్ధముసేయ బహుబలమువంపిచనియె
కపటమనియవిదలచి కాపున్నశేషుడు పవనజునిజారనీడు
కోపించివానరుడు శ్రీరామునిదలచి తనతోకసాగవిడిచె
చెలరేగిహనుమంతు చంద్రగిరిబెరకగా శేషుండుమ్రగ్గెనపుడూ
వేగమెకనకగిరి కైలాసగిరి కదలెవెరగంది రాఘవుండూ
పూర్వదిక్కునబుట్టు భానుండుతానేల పుట్టెనుత్తరదిక్కునా
దానవులగూడెనో దేవ మొక్కటియని ధనువందెశ్రీరాముడూ

చాపమెత్తకుడయా భానుండుగాదది సంజీవివెలుగులనియూ
స్వామిమనహనుమంతు డందరినిగెలచియు సంజీవిదెచ్చెనిపుడూ
తెచ్చెనయ్యాయిదిగో అఖిలతిరువడియైన హనుమంతుడదెదెచ్చెనూ
సంజీవిదెచ్చిచట చక్కగానుంచెను సౌమిత్రిలేచినిలిచెన్
అఖిలలోకంబులు అపుడుతెల్లనాయె యగచరుల బలములేచెన్
ద్రోణగిరిపర్వతము తోడనెగొంపోయి తొలుచోటనిలిపివచ్చెన్
అపుడుసంతోషమున నానందమొందిరి యావాయునందనునిచె
ఆర్పులుపెడబొబ్బ లగ్గలంబాయెను యారాఘవుల సేనలో
తొలినిద్రబోతిని యేమియెరుగకనేను తొడలమీదికిచేరితి
మీకుభారముమోపి యపరాధినైతివి మిహిరకులనాధనేడూ
వెరవకుములక్ష్మణా వెరపెల్లదీర్చెను వేగమెవాయుసుతుడూ
హనుమంతునిదిక్కు అప్పుడెచూచియు అతిహితుడవౌదువనియె
హస్తములుముకుళించి దక్షణపుతట్టుకు హనుమంతుకదలిపోయెన్
యసురకులునిబిలిచి యడిగెనురఘుపతి యివియన్నిదెలుపుమనుచూ
ఇంద్రుడనుకొన్న దేవేంద్రునిసాధించి యింద్రజిత్తనుపేరయా
సకలదేవతలచే చాలవరములుగొన్న సాహసికుండువాడూ
అటువంటి దానవుని హతమణచ భువిలోన అలవిగాదయ్యామనకూ
అదిగొపద్నాలుగేండ్లు నిద్రాహారములులేని యతనిచేతను చచ్చునూ
శేషాది చంద్రుండు వేసారి తనవునను వేసెనుభూమిపైనా
అంతటి వారలు మనకెవ్వరున్నారు యేగుదము అయోధ్యకూ
పరుగుపాటునబోయి లక్ష్మణుడు శ్రీరాముపాదములపై వ్రాలెనూ
ఔనయ్యరఘుపతీ నాచేతనవునయ్య యీ యింద్రజిత్తు జంపా
ఒనరపద్నాల్గేండ్లు నిద్రాహారములేక వుంటీవీనాతమ్ముడా
కాయపండ్లూదెచ్చి మీకుపదములకిచ్చి కావలిగనుంటినయ్యా
పరుగుపాటుననేను పర్ణశాలకువచ్చి ఫలములా సీతకియ్యా
ఎత్తుకుని మీరిద్దరారగింతురుకాని యిందయని నాకియ్యరూ
తమ్ముడు హనుమంతు సహోదరుడులక్ష్మణుడు తగువారు వీరుగాక
తమ్ములెందరుగాని యున్నానునేమాయె దయలేని వారువారూ
దూషకులనందరిని ఖండించబుట్టినా దొడ్డవాడవునీవయా
అనదక్షణపుతట్టు దానవులు వచ్చిరని హనుమంతుకదలిపోయె

రఘుపతీ వినవయ్య యింద్రజిత్తనువాడు రయమునను కదలివచ్చీ
మాయసీతనుదెచ్చి యింతలోపలనిచట మడియించినాడువడిగా
కవినేనువెరగంది కపులనక్కడనిలిపి కడువేగమునవచ్చితీ
అనగా విభీషణుడు అదియసురమాయలని అనియె రఘురాముతోడా
హోమగుండములోని రధమెక్కి వెలువడిన ఒక్కరును గెలువలేరూ
పరమ పురుష విరోధియైన పాపాత్మునిబట్టి ఖండించు మనియెనే
అనినంత లక్ష్మణుడు హనుమంతు గూడుకొని యాగంబు జెరచిరపుడూ
వడిగనింద్రజిత్తు డాకాశముననుండి వర్షముగనేసె శరమూ
సూటికెక్కిన హనుమంతుడు లక్ష్మణుని సూటిగా నెత్తుకొనెనూ
నింగిమ్రోయగ పెరిగి నిజరూపు దాల్చెను నీచుని సంహరింప
బహుమునుల దేవతల భంగపరచినయట్టి పాతకుని గానవచ్చెనే
కులగిరులు పర్వతము నేల మిన్నదిరెను క్రూరుడదలించగానూ
కడువేగ దేవతలు గుంపులుగ గూడుకొని కళవళంబంది రపుడూ
అగ్నిబాణము తొడిగి భగ్నముగ వేసెను హనుమంతుపై దాకనూ
లక్ష్మణుండది యెరిగి జలధి బాణముదొడిగి రయమున చల్లార్చెనూ
అంబులంబుల మొనలు తుమురులైరాలుచు యిమ్మలేదిద్దరికినీ
లక్ష్మణుండింద్రజిత్తురువురును బోరగా లోకములు భయమందెనూ
ఇమ్మైన బాణములు యేర్పరుచుకొని వారలిరువురును పోరాడగా
కరములును యురములును శరములనుగప్పెను క్రమముతోలక్ష్మణుండు
అయిదు బాణంబులు యాక్షణంబున దొడిగి యాయసురు విలుద్రుంచెనూ
ఖడ్గంబు తీసుకొని కాలుదై మండుచు లక్ష్మణుని నొప్పించెను
అపుడు లక్ష్మణును ధరణి కంపింపగా అసురసుతు ద్రుంపదలచెనే
వరమడుగు కొన్నట్టి బ్రహ్మాస్త్రమే దొడిగె బలురాక్షసుని మీదికి
శరము గిరగిరదిరిగి ధరణిపైబడగానె దానవులు బెగడిరపుడూ
హనుమంతువాహనము లక్ష్మణుడుతాదిగి యారాముకడకువచ్చెనే
ఆలింగనముజేసి యభిమంత్రతీర్థము అపుడెకృపజేసెనూ
పడియున్నకపులకు ప్రాణములువచ్చెను పరిపరిచందములనూ
దేవాదిదేవతలు పుష్పవర్షముగురిసి దివినుండిగొనియాడిరీ
పారిపోయి యసురులందరునుగూడుకొని పలికిరీ తబ్బిబ్బుగా
ఓదేవయసురేశ సాధింపరాదయా ఆదిదేవునిరామునీ

ఇంద్రజిత్తతికాయు మొదలైనవారలు యేమిగామడసినారూ
అధికసత్వముతోను కుంభకర్ణునిజేరి అసురులందరులేపుడీ
మ్రోసేదిభేరులు కూసేదిమదకరులు తోసేదిబహుబండ్లయా
పోసిరీకాగేటినూనె కర్ణములందు పోతులనుపైదోలిరీ
గాసిబెట్టితిమనక గ్రక్కునను లేవయ్యా కరిరాజువచ్చిదిగెనూ
కదిలికుంభకర్ణ మెల్లనెతాలేచి గజిబిజిలుయాడదనెనూ
దశరధనందనుడు శ్రీరామచంద్రులు దండెత్తివచ్చిదిగెనూ
మాటవినితాలేచి మరిసంధ్యజపములు సూటిగాదీర్చుకొనెనూ
కోటివేలసురులు సేయుభోజనముతాకొని యారగించితేపె
వేయిబుట్లఆకులు వేయికోట్లపోకలు వేగమెతానమలెనూ
గసగసనమలుకొని కడదవడనిడుచుకొని దశకంఠుకొలువుకొచ్చె
ఆవిభీషణుడు మేమిద్దరముగూడుకొని నాడువలదనిచెప్పమా
వారలనుయెరుగవా ఓరావణేశ్వరా కార్యములుకడుమించెనూ
వదరేటిదానవులు వారెందుబోయిరి యదిరిపడిరిగనాటికి
మనకులము మనబలము మనుజేశుచేతను మ్రగ్గనేటికి రావణా
కుంభకర్ణుడు రావణుండును యిరుపురు కోటమీదికివచ్చిరీ
మాటలాడగచూచి శ్రీరామచంద్రుడు మరియొకడెవ్వడనెనూ
యేపుగామాటాడు ఆరునెలలునిద్ర యెల్లవారెరుగగానూ
వెళ్ళీవస్తేకపువెంటలాడుకపోవు మేటికుంభకర్ణుడూ
అతనియాకృతిచూచి శ్రీరామచంద్రుండు యాశ్చర్యమందెనపుడూ
నిద్రభంగములాయె జయబలములేదని విభీషణుడుతాపలుకగా
జయబలముచాలదని దశకంఠునిజూచి విజయశాలికిజెప్పెనూ
ప్రియముచేసినన్ను పిలిచినది యేటికన యినకులునిజంపమనెనూ
గట్టినొడ్డాణంబు బిగువుగాచల్లడముపెట్టి నొకచేతగదయూ
పుట్టగానాతోనుపుట్టిన నిద్రను నీవన్నకావుమనుచూ
దిట్టమాటలుపలికె లంకదాటి రామలక్ష్మణుల రమ్మనుచునూ
మనుజేశవినవయ్య మదకుంభకర్ణుండు మరిలంకవెడలివచ్చె
ఇరుదెసలమనసేన లిందరునుబోయినను యేమియునుచెడ్డగాదూ
ఎంతేసిపర్వతము లెన్నివృక్షములతో యెంతగొట్టినకదలడూ
తనబంటుసుగ్రీవు తనకడకు పిలిపించి తాననియె శ్రీరాముడూ

చవివావివిందాక గట్టిగాబట్టుకుని చయ్యనను రమ్మనెనూ
పొంపుగావివిబోయి హనుమంతునీజూచి సుగ్రీవుతాబలికెనూ
గట్టిగాకుంభకర్ణునిబట్టి తెమ్మనుచు బెట్టబో సెలవుమనకూ
పదివేలకోటుల బలమైనవనచరులు మెదల నియ్యకబట్టిరీ
పట్టినను విదళించి పారిపోనియ్యక మెట్టిచంపెను సేనలా
మేటిసేనలతో గంధమాదనుడును కదలితాకెను వానినీ
బలములుగల కపినాయకులుబోయి మెదలకుండాబట్టిరీ
బెదరినిద్రయుదెలసి కుంభకర్ణుడువార్ని విదళించివేసెనపుడూ
ఘనమైనసేనలతొ గంధమాదనుడును కదలితాకెను వానినీ
బెదరిచూచి గంధమాదనుండని తెలసి నలసి రొమ్మునబూనెనూ
నుగ్గునుగ్గుగబట్టి బంతిగట్టినరీతి తొక్కియావలికిద్రోసెనూ
మ్రగ్గిరీ వనచరులు కోటాను కోటులు భగ్నముగ విరిగిరాగా
అచ్యుతుండిచ్చోట సుగ్రీవునీజూచి అతిశూరుడై బలికెనూ
బంటువై తేనీవు పోట్లాడ రమ్మనుచు పలికె కుంభకర్ణుడూ
అపుడు సుగ్రీవుడు అచలేంద్ర మెత్తుకొనియా కుంభకర్ణునేసెన్
తనచేతిశూలమున సుగ్రీవునీ గ్రుమ్మి ధరణిమూర్ఛిల్లజేసె
కోపమున హనుమంతు కొండచేకొని వానిగుండె పగులంగవ్రేసెన్
వానిచేకడునొచ్చి వానరుడుబలుడని వడినిగదచేతవ్రేసెన్
అర్కనందనులేచి యాకాశమునకెగసి యాకుంభకర్ణుదన్నెన్
తన్నిపోగాజూచి దానవుడు కోపించి ధరణిధరమున వ్రేసెన్
అదితగిలి సుగ్రీవుడల్లనను మూర్ఛిల్ల యసురుండు పట్టుకొనియెన్
చంకనిరికీకొనుచు లంకలోనికిపోవ పొంకముతొమూర్ఛదెలిసీ
కదిసినోటను ముక్కు చేతచెవి తెంచుకొని గగనమున కెగసినాడూ
పొయ్యేటి వనచరుని బట్టుకొని గిరగిరని పోనీకద్రిప్పివేసెన్
ఘనపరాక్రమమున ధరణిపై బడిలేచి గ్రక్కననుయేతెంచెనూ
ఆముక్కుచెవులను స్వామి ముందరనుంచి హస్తములు ముకుళించెనూ
అపుడోయిసుగ్రీవ యధికసాహసుడవని యాలింగనముజేసెనూ
ఆలంకవీధిలో కుంభకర్ణుడుబోయి అద్దంబులో చూచెనూ
ముక్కుచెవులును రెండు చెక్కబడిబోయెనని గ్రక్కనను తిరిగివచ్చెన్
పంచంబులాయెనని దానవులునవ్వగా వచ్చెవానికిరోషమూ

నిశ్చయించుకవచ్చి రాముసేనలబట్టి అచ్చటచ్చటమ్రింగెనూ
మ్రింగినావనచరులు కర్ణమూలములను మీదికివెడలిరపుడూ
అట్టహాసముచేసి పట్టిదిగమ్రింగెదను యారామలక్ష్మణులనూ
అనిదానవుడురాగ కనివిభీషణుడరిగి యన్నతోడుత బలికెనూ
కనికుంభకర్ణుడు కన్నీరునించుకొని కడజేరిబ్రతుకుమనెనూ
ముల్లోకభీకరుండని యెరుగవానన్ను ముమ్మూర్తులైనయెదురా
ఈవేళ నాకోపమున కెవ్వరెదురైన యేనాహుతిగగొందునూ
అనికుంభకర్ణుండు గదచేతనెత్తుకుని యారామునేయదలచెా
శ్రీరామచంద్రుండు శరమొకటి సంధించి చేతులనుఖండించెనూ
వడిచేత వృక్షంబు వడిగాను పెకలించి వనజనాభునివ్రేయగా
పరమపావనుడపుడు మరియొక్కచెయి ద్రుంచె బలమైనబాణములను
కన్నులతో కనులురుమ కడురక్తములుగార కాలుడైమండివచ్చెా
రెండుబాణములెత్తి తొడలమీదికితొడిగి మొండెములుగాగవ్రేసెా
ధీరుడై దానవుడు ధరమీదబొరలుచును దిగమ్రింగదలచిరాగా
నరనాధచంద్రుండు నరసింహబాణమున నాలుగెనెత్తుకొనుచు
కాలాంతకంబైనఘన బాణములుదొడిగి ఖండించెవానిశిరమూ
వడిగానుశిరమెగసి వరుణుండుబెదరగా వనధిలోబడెనప్పుడూ
అన్నవద్దకువచ్చి అభిమంత్రతీర్థములు ఆకపులకెల్లనొసగెా
పడియున్నకపులకు ప్రాణములువచ్చెను పరిపరిచందములనూ
పొందుగాదేవతలు సిద్ధగంధర్వులు పుష్పవర్షముగురిసిరీ
పారిపోయిన యసురులందరునుగూడుకొని పలికిరీతబ్బిబ్బుగా
గుణనిధీవినవయ్య రాముబాణాగ్నిచె కుంభకర్ణుడుగూలెను
రణశూరుడట గూలెననువార్త వినగానె రావణుడుమూర్ఛిల్లెనూ
అంతలోతెలివొంది అతిశీఘ్రమునబోయి అతనిగురువుకు మ్రొక్కెనూ
వినరోరిరావణా రామలక్ష్మణులను యికనీవుగెలువలేవు
పాతాళముననీవు యాగంబుచేసితె పగతులనుతెగటార్తువు
అవుననుచువినిబోయి సీతాపహారుడు యాబిలములోజొచ్చెా
యాగంబు సేయగా లంకలోపొగలెగయ యదివిభీషణుడుజూచి
రాజాధిరాజ శ్రీరఘువీరవినవయ్య రావణుడుమిమ్ము గెలువా
పాతాళ హోమంబుగావింపుచున్నాడు పదిలముగనుండవలయూ

హోమగుండములోని రధమెక్కి వెడలితె ఒక్కరము గెలువలేమూ
అనినంతరాఘవుడు సుగ్రీవునీబిలచి అతివేగమునబంపుమీ
హనుమంతునితోగూడి అంగదాదులుపోయి యాగంబుచెరచిరపుడూ
విఘ్నంబుచేసేటి వివరమంతయుదెలసి యుగ్రుడై మండి తరిమె≡
అంతఃపురమునకు అతివేగమునబోయి అతిదుఃఖమును బొందుచూ
కటకటాయిటు వంటి కారణీకంబులు గలుగునని యెరుగనైతి
చింతించి రావణుడు పంతంబుమీరగా అంతఃపురంబు వెడలె≡
కోపములురెట్టింప కోరిదానవులతో కొలువులో కూర్చొండెనూ
కనుగొనుచు తనదైన పదిశిరస్సులయందు ఘనకిరీటములు దాల్చె≡
కనకమయమై కోటిరవితేజముననున్న ఘనరధము తెమ్మనియెనూ
ఘనముగా మును బ్రహ్మవరముననుయిచ్చిన ఘనశక్తి ధరియించెనూ
ఖడ్గముద్గర బిండివాల తోమర శూలగదప్రాస చక్రములనూ
అన్నిఆయత పరచి రధముపైకూర్చుండె నధికకోపోగ్రుడగుచూ
ఖడ్గవృశ్చిక సర్పరోమాగ్ని వర్ణులతో యాలంకతావెడలెనూ
రణకేళికేతెంచి రామునికి నెదురుగా రధమునడిపించుమనెనూ
హనుమంతు సుగ్రీవ అంగదాదులుబోయి యచలంబులెత్తుకొనిరీ
రాక్షసులు వనచరులు ఘోరయుద్ధముసేయ రక్కసులుబారి రపుడూ
దండియగు వనచరుల డాకకోర్వగలేక దానవులు బెదరిరపుడూ
యాసమయంబున రావణుడుకోపించి యటవిల్లు నెక్కుబెట్టె≡
శరములను సంధించి శరవర్షములుగురిసి చేరెరఘురాముకడకూ
రణభీకరుండైన రామభద్రుడుచూచి రౌద్రుడై కోపించెనూ
వరుణుండుయిచ్చినా వజ్రాంగిజోడపుడు దొడిగి యతివేగముననూ
దివ్యబాణంబులు సంధించెరాఘవుడు దివ్యకోదండమందూ
చుక్కలటురాలగా దిక్కులెల్లనుబెదర సురులు భీతిల్లగానూ
వింటదొడిగిన శరము వివరముతొవేసెను వీరాధివీరుడపుడూ
రాముబాణములేయ రాక్షసులు కొందరు రాలిరీభూమిపైనా
రావణుడుకోపించి రౌద్రుడై తానపుడు రధముచేరగవచ్చెనూ
అమ్ములమ్ముల మొనలు కొండలైరాలగా యిమ్ములేదిద్దరికినీ
ఇమ్మైన బాణములు యేరుపరుచుకొని యిద్దరునుబోరగానూ
భీకరంబై రామ రావణులుబోరగా భీతిల్లిరపుడుసురులూ

దేవేంద్రుడదిచూచి శ్రీరామచంద్రునకు దివ్యరథమంపెనపుడూ
రథముపై కూర్చుండె శ్రీరామచంద్రుండు రావణుడు చూడగానూ
రావణుండెరిగపుడు రాక్షసాస్త్రంబేసె రాఘవునిపై దాకనూ
వైష్ణవాస్త్రంబెత్తి వడిగాను సంధించి వసుధపైగూల్చెనపుడూ
అంతలో రావణుడు యగ్నిబాణముదొడిగి భగ్నముగజేసెనపుడూ
శ్రీరామచంద్రుడు జలధిబాణమెతొడిగి శీఘ్రమెచల్లార్చెనూ
అంతటను రావణుడు అధికవేగంబుతో నాగబాణమువేసెనూ
రాఘవుండదియెరిగి గరుడాస్త్రమె తొడిగి రయమునను ఖడించెనూ
అతియుగ్రకోపమున అంధకారాస్త్రంబు అతివేగమునవేసెనూ
రాగానె కనుగొని రవిబాణమెతొడిగి రాఘవుడు గూలవేసెౝ
భుజబలముయుప్పొంగి భూతాస్త్రమేతొడిగి భూమికంపింపవేసెౝ
నరనాథచంద్రుండు నరసింహబాణమున నాభూతములను దోలెనూ
రథముసారథితోను రాఘవునిగూల్తునని రౌద్రుడై కోపించెనూ
ఘనముగామరి బ్రహ్మవరముచేకొన్నట్టి ఘనశక్తియెత్తివేసెౝ
దశబాణములచేత ధరణిపైగూల్చెను దశరథరాముడపుడూ
శిరములనుకరములను శరముచేద్రుంచెను కరిరాజవరదుడపుడూ
శరలాఘవముతోను శరములనుఖండించె ఖలుడైనరాక్షసుండూ
కడువేగకోపించి ఘనమైనబాణముల ఖండించెకోదండమూ
దేవేంద్రుడంపినాదివ్య కోదండముధీరుడై తానందెనూ
అయిదుబాణంబులు యాక్షణంబునదొడిగి యాయసురునొప్పించెనూ
ఒక్కబాణముదొడిగి వానివిల్లునుద్రుంచి స్రుక్కణించెనురాముడూ
తరమియొకబాణమున దశకిరీటంబులు ధరణిపైగూలనేసెౝ
నిర్వీర్యుడై తాను నిలిచెనురావణుడు నీలవర్ణునిజూచెనూ
ఓరోరిరావణా నీవురాకున్నావు వీరాధివీరుడౌరా
ఏడహోరాత్రులు యెడలిడకబోరితివి యేడబోయినవిడువనూ
దశకంఠుకోపమున ధనువొక్కటందుకొని దశరథునిసూనుదాకెౝ
ప్రళయకాలాభీల పావకజ్వాలలగు బాణములుతొడిగెనపుడూ
అర్ధచంద్రాస్త్రంబు నతివేగమునదొడిగి నన్నియును ద్రుంచెనపుడూ
దంతిముఖబాణంబు దాశరథిబడునటుల దానవుడుతొడిగెనపుడూ
గండభేరుండంబు గ్రక్కునను సంధించి గజమునను ఖండించెనూ
అంతయుఇంద్రాస్త్రంబు నతివేగసంధిచి రావణుని తలలు ద్రుంచెౝ

కోపములురెట్టింప కొత్త శిరములువచ్చె కొదువ యొక్కింతలేకా
యోగిమతమనియెడి ఓంకార ప్రళయాగ్నిబాగైన బాణమదిగో
రఘువంశతిలకుడు రామచంద్రుండేసె రావణుని తలలుగూలా
కలకలని నవ్వుచూ కడువేగమున మొలిచె ఖలుడైన రాక్షసునికీ
నారాయణాస్త్రంబు సంధించి యతివేగ నయముగా తలలుద్రుంచెన్
దండిగా రావణుని తలలు దునిసిరాల ధరణిపై పొరలసాగె
నిండువేడుకతోడ తిరుగ శిరములువచ్చి నిలిచె రాక్షసవీరుడూ
ఘనశరంబులచేత యాశిరంబులుద్రుంచె కాకుత్థ్సకులచంద్రుడూ
కొండలవలెనపుడు కొత్త శిరసులువచ్చె కొదువయొక్కింతలేకా
మండలాధిపుడైన రామచంద్రునిమీద మంటలేగురియ ద్రేసె
చింతించి శ్రీరామచంద్రుండు తనమదిలో చిన్నబోయి నిలిచె
చెంతనున్నట్టి యావిభీషణుని తాబిలచి వింతగాదలచి పలికె
రావణుని రణమున వ్రాలిన మొండెములు వచ్చునా ప్రాణములునూ
వేసితిని బాణములు వేలానుసంఖ్యలు గూల్చితినివాని తలలూ
వెర్రివాడై బ్రహ్మవెలయనిచ్చిన వరము వేదాంత నీవెరుగవా
ఉదరనాభియందు వున్నట్టి యమృతంబు యొప్పుగా తెలియుదేవా
తావెరిగి శ్రీరామ దశకంఠు శిరములు తడయకను సమయించుమీ
ఆయములు చెప్పితానటు తొలగ రావణుడు ఆగ్రహుండై మండెనూ
ఏరావిభీషణ ననుజంపిరాజ్యమున కింకపట్టము గట్టుకా
పరభూమిలోనుండు పగవారలకులొంగి పలికితివి ఆయములనూ
ఇదెచూడు నాశక్తి నినుజంపిరాఘవుని యీక్షణంబున గూల్తునూ
వేగమున తనశక్తి చేతనె యెత్తుకొని వేసెను విభీషణునిపై
దశబాణములుదొడిగి ధరణిపైగూల్చెను దానవసంహారుడూ
యానాభియందున్న యట్టి యాయమృతంబు యాహుతిగొనగయస్త్రము
అతివేగమునవేయ అమృతపానముజేసి అమరులందరుజూడగా
వేవేశిరసులుగూల వేవేగబాణములు వేవేలుసంధించెనూ
తొడిగి శిరసులు ద్రుంచి తోడనె రావణుని తొంభైతొమ్మిదిమారులూ
కరములు రెంటితో శిరము వక్కటినిలిచె ఖలుడైన రాక్షసునికీ
వరమడుగుకొన్నట్టి బ్రహ్మాస్త్రమే తొడిగెవడి రాక్షసునిమీదికీ
చుక్కలెల్లనురాల దిక్కులన్నియుబెదర సురులుభీతిల్లగానూ
ప్రళయ కాలాంతకంబై యొకింతవచ్చి రావణుని శిరముద్రుంచె

మడియగను వడిచని పరువుపాటునచని యామండోదరికిచెప్పిరీ
రాక్షసస్త్రీలతో రణభూమికేతెంచి రావణునిపైబొరలుచూ
ప్రాణేశనినుబాసి యేరీతి తాళదు ప్రాణములునిలువవనెనూ
వద్దికతోనేను నీవద్దనే నిలుచుండి బుద్ధిగాచెప్పలేదా
వద్దుగాపలికితివి వద్దనుచుతమ్ముని గద్దైపెదన్నలేదా
కటకటాయిటువంటి కారణీకములౌట యెరుగలేనైతినిపుడూ
నీపరాక్రమములు నీదుభుజబలములు నేడెందుబోయెననియెౕ
కట్టడైయుండెనో రాముచేతనుగూల కటకటాయేమిసేతూ
గోడుగోడునయేడ్వ ఘోషములుమెండాయె ఘోరరణమెల్లనిండెౕ
రఘురాముడప్పుడు రథముగొబ్బున డిగ్గి విభీషణునిచూచిపలికెౕ
రాక్షసులదుఃఖములు చల్లార్చినీవిపుడు రావణునిదహనించుమూ
దురితకృతాచారు దుష్టుండనాచారు దహనించవెరతుదేవా
అనిపలికివినయముతొ మదిలోనగుందుచు యతిభక్తితోడనిలిచెౕ
వినవోవిభీషణ నాతోడనెదిరించి వీడుభూమినిపడియెనూ
ధన్యుడాయెనునేడు దహనించుమనిపలికె దానవాంతకుడునపుడూ
హస్తములుముకుళించి యన్నవద్దకువచ్చి యపుడు తాదహనించెనూ
కర్మములుదీర్చియు కడుశీఘ్రమునదాను కదలెశ్రీరాముకడకూ
లంకకువిభీషణుని పట్టంబుగట్టుమని లక్ష్మణునితోబలికెను
అపుడుసంతోషమున హనుమంతు సుగ్రీవుడంగద వనచరులతో
గంగాదిజలములు గ్రక్కునారప్పించి గట్టిరీపట్టమమర
అనువుగావిభీషణుడు అధికసొమ్ములుగొంచు యారాముకడకువచ్చెౕ
పట్టాభిషేకుడైచనుదెంచి శ్రీరాముపాదములపైవ్రాలెనూ
జయమాయెవిభీషణ జానకినితెమ్మని స్వామితాబలికెనపుడూ
శీఘ్రమెవిభీషణుడు సీతదోడ్దెచ్చెను శ్రీరామచంద్రుకడకూ
ఆరాఘవుడలిగి యతివిస్మయంబంది నమ్మలేననిపలికెనూ
అతిదుఃఖమునసీత యగ్నిప్రవేశమై యతిభక్తితోడనిలిచెౕ
సురులుదిక్పాలకులుచూచి సోద్యంబంది సీతాసమేతుడగుచూ
అయోధ్యప్రయాణ మతివేగచాటుమని యావిభీషణునికనియెౕ
వెల్లిప్రొద్రునలేచి తెల్లవారకమునుపె వెల్వలకు చాటించిరీ
దేదీప్యమానమై వెలుగొందు పుష్పకము దెచ్చెను విభీషణుండు
పుష్పకారూఢుడై పురివెడలి అయోధ్య పురము చేరగవచ్చిరీ

క్షేమములు దెలుపుకొని చెంతభరతుడు గొల్వచేరి రయోధ్యకపుడూ
నగరిలోపలబోవ నంతఃపురస్త్రీలు నందరును నెదురుకొనిరీ
గ్రక్కునను కౌసల్యకైక సుమిత్రలకు కరమొప్పదండ మనిరీ
పరమపుణ్యుడరామ పట్టంబు గట్టుకుని పాలించు రాజ్యమనిరీ
ఆక్షణంబున భరతు డతని పట్టముగట్టె నధికసంతోషముననూ
బ్రహ్మాదిదేవతలు బ్రాహ్మణఋషులందరూ ప్రియము నేతెంచిరీ
క్షీరశుద్ధోదక గంగాది జలములు శ్రీఘ్రముగ రప్పించిరీ
సీతాసమేతుడై శ్రీరామచంద్రుండు సింహాసనమున నుండెనూ
అత్రి వసిష్టాదులాది గాగలమునులు అందరును లగ్నముననూ
అభిషేకమొనరించి రభిమంత్ర దీవెనలనపుడు పట్టముగట్టిరీ
భరతుండు శతృఘ్ను సౌమిత్రి తనుజేరి పరగ చామరములుపీవా
సీతాసమేతుడై సకల ప్రజలునుగొలువ సింహాసనమున నొప్పెనూ
సురదుందుభులుమ్రోయ పుష్పవర్షముగురిసె సురలుకొని యాడిరపుడూ
సుగ్రీవుడానీవు కిష్కింధకునుబోయి సుఖమందుమని బంపెనూ
లంకాపురంబునకు రావణానుజుపంపె రమ్మనుచు తాబిలిచియు
రావోవిభీషణ లంకాపురద్వీప రాజ్యంబు పాలించుకా
ధర్మములు దప్పకా కర్మములుసేయకా ధరణి యేలుచునుండుమూ
నీదుపదకమలములు యెడబాసి నిముషంబు నేతాళజాలననియెూ
అనిపలుకవిని రాముడంతరంగమునందు చిరినవ్వునవ్వుకొనుచూ
ఇక్ష్వాకు తపమునకు మెచ్చికమలజుడొసగె హెచ్చైన రంగపతినీ
తరతరంబులపూజ తప్పకనుగైకొన్న తారకబ్రహ్మమితడూ
ఇచ్చెదను కొమ్మనుచు శ్రీరామచంద్రుండు మెచ్చితానొసగెనపుడూ
గైకొని విభీషణుడు కడుభక్తినతని పదకమలముల కెరగగానూ
హెచ్చిలంకాపురి యెల్లకాలమునీవు యేలుచునువుండుమనెనూ
కదలెను విభీషణుడు ఘనమైనలంకకును కరిరాజవరదుడనుపా
దశరథాత్మజుడపుడు ధర్మములు తప్పకా ధరణిపాలించుచుండెూ
పరగహనుమంతుడు తాబోయిరాఘవుల పాదములపైవ్రాలెనూ
శ్రీరామచరితంబు చెలగి దలచిన వినిన చేరుసౌభాగ్యములునూ
పొందుగాపుత్రపౌత్రాభి వృద్ధియుగలుగు పుణ్యములు సిద్ధించునూ
అందముగపురిమిట్ట అయోధ్యరాముడు ఆపదలుయెడబాపునూ ॥